# మన పవిత్ర వారసత్వము

రచన : శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి, బి.ఎ.,

ప్రథమ ముద్రణ : 1993

ప్రతులు : 5000






వెల రూ 200-00

---

ముద్రణ : చారి అండ్ కంపెనీ, 9-4-9, ఛార్లెస్ స్ట్రీట్, సికింద్రాబాద్ - 500 025.

# శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం,
# దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠం, శృంగేరి (కర్నాటక)

సికింద్రాబాద్‌నందున్న శ్రీ సూర్యమిత్ర ధార్మికనిధి 'మన పవిత్ర వారసత్వము' అను గ్రంథమును ప్రకటించుచున్నదని తెలిసికొని శ్రీ జగద్గురు చరణులు మిగుల సంతసించినారు.

విశ్వమునందలి సంస్కృతులన్నింటిలో భారతీయ సంస్కృతి మహోజ్జ్వలమైనది. భగవంతుని భక్తితో ఆరాధించుట మన సంస్కృతి యందలి ముఖ్య తత్త్వము. అందుకు గాను మన పూర్వజులు ఎన్నియో గ్రంథములను రచించినారు. భగవంతుని సాన్నిధ్యముతో అలరారు యెన్నియో క్షేత్రములు మన దేశము నందున్నవి. భగవంతుని కృపను పరిపూర్ణముగా పొందిన యెందరో మహాత్ములు మన దేశము నందుదయించినారు. ఈ విషయములన్నింటిని నేటి తరము వారు అవశ్యము తెలిసికొనవలసి యున్నది.

ప్రస్తుత గ్రంథము ఇట్టి విశిష్ట విషయములను జనులకు చక్కగ తెలుపుచు అందరికినీ మిగుల ఉపాదేయముగనున్నది.

ఈ గ్రంథ ప్రకాశకులు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల పరిపూర్ణ కృపకు పాత్రులగుదురుగాక యనియు, ఈ గ్రంథము ఆస్తిక జనతకు విశేషముగా ఉపకరించు గాక యనియు శ్రీచరణులు నారాయణ స్మరణ పూర్వకముగా ఆశీర్వదించినారు.

టి. దక్షిణామూర్తి
శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం

శ్రీ సూర్యమిత్ర ధార్మికనిధి ప్రచురించిన

# మన పవిత్ర వారసత్వగ్రంథ

సహృదయ పాఠక మహాశయులకు

పెద్ద జియ్యంగారి మఠం

తిరుపతి (చిత్తూరు జిల్లా)

వారి

నారాయణస్మరణ పూర్వక

శుభాశీస్సులు

శ్రీ సూర్యమిత్ర ధార్మికనిధి ప్రచురించిన

మన పవిత్ర వారసత్వగ్రంథ

సహృదయ పాఠక మహాశయులకు

చిన్న జియ్యంగారి మఠం

తిరుపతి ( చిత్తూరు జిల్లా)

వారి

నారాయణస్మరణ పూర్వక

శుభాశీస్సులు



# ఆంధ్రప్రదేశ్
# రాష్ట్ర ముఖ్యమంత్రిగారి
# సందేశం




శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి రచించిన 'మన పవిత్ర వారసత్వము' గ్రంథం ప్రతివారు చదవదగింది.

మన రాష్ట్రంలోని అనేక దేవాలయాల స్థల పురాణము, చరిత్ర గురించే కాక ఎన్నో పూజా విధానాలు, వాటి మహాత్మ్యము గురించి రచయిత చక్కగా వివరించారు.

ఎంతో వ్యయ ప్రయాసలకు లోనై, శ్రమతో రచించిన ఈ గ్రంథంలో కొన్ని జిల్లాలలోని ముఖ్య దేవాలయాల విషయం ప్రస్తావించ లేదు. ఈ లోపాన్ని తరువాత ప్రచురణలోనైనా పూరించాలి.

ఎంతో విలువైన ఈ గ్రంథాన్ని ప్రచురించిన శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధికి, రచయిత శ్రీ కృష్ణమూర్తికి నా అభినందనలు

(కె. విజయ భాస్కర రెడ్డి)

# వి జ్ఞ ప్తి

భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో విశ్వమానవాళి శాంతి, సామరస్యములతో మనుగడ సాధించవచ్చునని ఎన్నో శతాబ్దములుగ ఎందరో మహాఋషులు, ఎందరో యతీంద్రులు, ఎందరో పరివ్రాజకులు, ఎందరో మహాభక్తులు, ప్రయత్నిస్తూ సఫలీకృతులగుచున్నారు. అట్టి వారి ప్రయత్నములు, నిరంతరము సాగుచునే యున్నవి.

భక్తి, జ్ఞాన, వైరాగ్యములలవరచుకొనుటకు, దేవాలయ సందర్శన ఒకానొక ప్రాథమికావసరముగ నిర్దేశించి యున్నారు. భక్తులీ మార్గమును తర తరములుగా అవలంభించి పునీతులగు చున్నారు. ఎంతో దూరదృష్టితో మన పూర్వులు దేవాలయములను నిర్మించి, మానవాళి శాంతి సమరస్యములతో మనుగడ సాధించుటకు, పవిత్ర వారసత్వ సంపదగా మనకందించియున్నారు. ఇట్టి కృషి నిరంతరము సాగుటకు వీలు కల్పించినారు.

శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి సభ్యులు ఇందుకు ఎంతో కృషి చేయుచున్నారు. మిత్రులు శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి రచయితగా, కార్యదర్శిగా ఎంతో శ్రమించి, ఎన్నో దేవాలయములను స్వయముగా సందర్శించి, ఎంతో విషయ సేకరణ చేసి ఈ గ్రంథ రచన చేసి యున్నారు. శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి ఈ పవిత్ర గ్రంథాన్ని ప్రచురించి భక్తుల ముందుంచుచున్నది. ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖ ఎంతో సహాయపడినది. వారికి మా కృతజ్ఞతాభివందనములు.

ఇతర భాషలలోనికి ఈ పవిత్ర గ్రంథాన్ని అనువదించి ప్రచురించాలని ఆకాంక్ష. రచయిత, కార్యదర్శి ఆ ప్రయత్నము చేయుచున్నారు. పాఠకులు ఈ పవిత్ర గ్రంథమును పరిశీలించి, పఠించి, ఈ గ్రంథ ప్రాశస్త్యమును గ్రహించి తృప్తిచెందగలరని నమ్ముచున్నాను. వారి ఇతోధిక సహాయ, సహకారములను అర్థిస్తున్నాను. ఇంకను ఇట్టి గ్రంథ ప్రచురణకు ప్రయత్నించెదమని మనవి చేయుచున్నాను.

సర్వేజనా సుఖినోభవంతు

తేది : 19.8.1992
న్యూఢిల్లీ

పి.వి.ఆర్.కె. ప్రసాద్, ఐఏఎస్
ఛైర్మన్, శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి



# మున్నుడి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో దేవాదాయ శాఖ వారి ఆధ్వర్యంలో సుమారు ముప్పైవేల పైగా దేవాలయాలున్నాయి. ఇందు, నూటికి పైగా దేవాలయాలు ప్రాచీన కట్టడాలుగా గుర్తింపబడి, ప్రకటింపబడడమే కాక మరి కొన్ని దేవాలయాలు కూడా ప్రాచీనమైనవిగా నిర్ణయించబడినవి.

ఎన్నో దేవాలయాలు పౌరాణిక, చారిత్రికాధారాలతో పరమ పవిత్రమైనవిగా గుర్తింపబడి, నిరంతర భక్తజన సందోహముతో నిత్య నూతనముగా, వైభవోపేతముగా వెలుగొందుచూ, నియమిత పూజా కార్యక్రమాలతో నిర్వహింపబడుచున్నవి. అందుకు కారణము వాటి ప్రాచీనత, మహిమలే కాక, వాటి స్థల మహాత్మ్యములుగా పెద్దలు పేర్కొనుచున్నారు. భక్తులు ఆదరించుచున్నారు. మన దేవాలయములు, మన ప్రాచీన సంస్కృతీ వైభవము, మన శిల్పచాతుర్యములను, వాస్తు విశేష ప్రకటనా స్థలములే కాక, మన పూర్వుల బుద్ధి విశేషములు, జ్ఞాన వైరాగ్యములు, దూరదృష్టి సంకేతములుగా నిలిచి యున్నవి. సమస్త పురుషార్థ సాధనకు జాతి సమైక్యతకు, ఏకోన్ముక సాధనకు ఎంతో దోహదము చేయుచున్నవి. ముముక్షువుల భక్తి మార్గ సాధనకు ఎంతో సహాయపడుచున్నవి. అందువలననే ఈ పవిత్ర క్షేత్ర సందర్శన మాత్రముననే భక్త జనులు సంతృప్తులగుచున్నారు.

మన పూర్వులెంతో దూరదృష్టితో, అకుంఠిత సేవా దృక్పథంతో, దీక్షా దక్షతలతో నిర్మించి, నిర్వహించి, దేవాలయాలను పవిత్ర వారసత్వ సంపదగా మనకందించినారు. ఈ పరమ పవిత్ర వారసత్వ సంపదను పదిలముగా కాపాడుకొనవలసిన అవసరమెంతేని కలదనునది అందరూ అంగీకరించెడి విషయమే.

శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి సభ్యులు, కార్యదర్శి, మిత్రులు శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి కఠోర దీక్షతో భక్తి తత్పరతతో ఎంతో శ్రమించి ఎన్నోదేవాలయాలను సందర్శించి, విపులంగా విషయసేకరణ చేసి, ఈ మహద్గ్రంధాన్ని రచించి ప్రచురించినారు. మన ప్రాచీన హైందవ సంస్కృతి వికాసమునకు ఎనలేని సేవ చేసి ధన్యులైనారు. ఈ బృహత్తర గ్రంథ రచన ప్రచురణ ప్రతి భక్తునకు, పుణ్య క్షేత్ర సందర్శకునకు ఎంతో ఉపకరిస్తుందనడంలో ఎట్టి సందేహమునకు తావు లేదు. ప్రతి పౌరుడు ఈ పరమ పవిత్ర గ్రంథాన్ని సేకరించి, భద్ర పరచి రానున్న తరముల వారి కంగిస్తారని నమ్ముచున్నాను.

రచయిత ఇంకను మరియొక అపూర్వ గ్రంథము, విపులముగా, సచిత్రముగా మన ప్రాచీన ఋషులు, దేవతలు, మహామహుల విశేషములతో అనేక పరిశోధనలు చేయుచు వ్రాయుచున్నారని తెలిసి వారిని అభినందిస్తున్నాను. వీరు చేయుచున్న కృషి ఫలించాలని, ఇంకనూ వీరిచే ఎన్నో మహత్తర గ్రంథ రచనలు జరిపించాలని ఆ దేవ దేవుని ప్రార్థించుచున్నాను.

ఈ బృహత్తర గ్రంథము పలు భాషలలోనికి అనువదింపబడి, మన ఆంధ్రదేశమునగల దేవాలయ పవిత్రతను, మహిమలను ఇతర రాష్ట్రవాసులే కాక ఇతర దేశముల వారు తెలిసి కొని, భక్తి ప్రపత్తులను, మానసికోల్లాసాన్ని ఇతోధికముగా పొందెదరని నమ్ముచున్నాను. అంతేకాక మన తెలుగువారి, ధైర్య సాహసములే కాక, విశ్వజనావళికి శాంతి సౌభాగ్యముల నొసగు భక్తి, జ్ఞాన వైరాగ్యములందించు మార్గ దర్శకులుగా కూడ ప్రసిద్ధి చెందినారని ఇతర రాష్ట్రవాసులు, దేశవాసులు గ్రహించుటకు వీలు కలుగగలదని ఆశించుచున్నాను.

రేఖా చిత్రాలు బహుసుందరముగ చిత్రించి, తయారు చేసి అందించిన వర్ధమాన చిత్రకారుడు చి. వెంకట రామయ్యను అభినందిస్తున్నాను.

శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి సభ్యులను ఈ గ్రంధ ప్రచురణ కృషిలో పాలు పంచుకొన్న వారందరిని అభినందిస్తున్నాను.

తేది : 15.7.1992
హైదరాబాద్

కె. సత్యరాజు, ఐఎఎస్
కమీషనర్, దేవాదాయ శాఖ
హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్



పండిత రాజు, ఉపన్యాసకళానిధి ఆచార్య ప్రభాకర శ్రీకృష్ణ భగవాన్

# శుభకామన

మన భారతీయులం. మన దేశం భారతదేశం. మనది భారతీయ ధర్మం.

ఏతద్దేశ ప్రసూతస్య సకాసా దగ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృధివ్యాం సర్వమానవాః

ప్రపంచమంతా అజ్ఞానాంధకారంలో నిండి నిబిడీకృతమైన విపరీత విపత్కర క్లిష్ట దారుణ పరిస్థితులలో, జ్ఞాన విజ్ఞానదీధితులను ప్రపంచం నలుదిశలా వ్యాపింపచేసిన యోగులు, తాపసులు, తపోధనులు, అతీంద్రియ జ్ఞాన సంపన్నులు, మహామహులైన మహర్షుల వారసులం మనం.

మనది వేదభూమి. మనది ధర్మభూమి. మనది పుణ్యభూమి, మనది జ్ఞానభూమి. మనది తపోభూమి, మనది త్యాగభూమి. సమ్యక్ కృతియే సంస్కృతి. తర తరాలనుంచి అవిచ్ఛిన్నముగా తైల ధారవలె ఒక దేశములోని ఉత్తమ గుణ సంపన్నులైన ప్రజలు ఆచరించు ప్రవర్తనే సంస్కృతి. వారి ఆశయములు, ఆదర్శములు, లక్ష్యములు, జీవనవిధాన సౌందర్య స్వరూపములే సంస్కృతి. మనిషి మనీషిగా రూపొందిచడమే సంస్కృతి. పాశవిక దశనుండి ఎదిగి అత్యుత్తమ సద్గుణ సంపత్తిని పెంపొందించుకొని వ్యక్తిత్వాన్ని ఆదర్శప్రాయంగా మలచుకోవడమే సంస్కృతి. భారతీయ సంస్కృతి అమరము. అజేయము. 'మహాజనో యేన గతః సంపధాః' అనునది మన సంస్కృతి. అనాది కాలము నుండి భారతదేశంలో ఆధ్యాత్మిక భావం, పారమార్థిక విజ్ఞానం వెల్లివిరిసింది.

ఆదికవి వాల్మీకి మహర్షి తన రామాయణంలో లక్ష్మణునిచేత పలికించిన ఈ పలుకులు భారతీయ సంస్కృతికి విజయ శంఖారావంలా సంభావించవచ్చు.

'నాహం జానామి కేయూరే
నాహం జనామి కుండలే
నూపురేత్యభిజానామి
నిత్యం పాదాభివందనాత్'

శ్రీరామచంద్రుడు లక్ష్మణుని ముందు సీతాదేవి నగల నుంచి 'సోదరా! ఈ నగలు మీ వదినగారివి అని గుర్తించగలవా?' అన్నప్పుడు లక్ష్మణుడు పలికిన పలుకులు 'అన్నా! ఈ సందికడియములను నేనెరుగను. ఈ కమ్మలను నేను ఎరుగను. కానీ అనుదినము వదినగారి పాదములను నమస్కరించుటవలన ఆమె అందెయలను మాత్రము గుర్తించగలను'. లోకోత్తరమగుభావము. భారతీయ జీవన విధానమును చెప్పుచున్న కవిత్వము. మరది వదిన పట్ల ఎట్లు మెలగవలయునో తెలుపు ఉత్తమ కవిత.

మన మాతృభూమి ధర్మానికి, తత్వజ్ఞానానికి ప్రఖ్యాతిగాంచిన పవిత్రభూమి. మహోన్నతులైన ఆధ్యాత్మక వేత్తలను కన్న భూమి. సర్వసంగపరిత్యాగులైన మహర్షులకు, తాపసులకు, దివ్యతేజ సంపన్నులకు పుట్టినిల్లు. ఆనాది కాలమునుంచి ఆధునిక కాలంవరకు మానవుడు ఆచరించవలసిన, అనుసరించవలసిన నిత్యసత్యాలను అందచేసిన ఏకైక భూమి ఇదే. భారతదేశపు మనుగడకు మూలం మతము, దైవభక్తి. మతం అంటే ఆదర్శప్రాయమైన జీవన విధానము. సక్రమమైన ఆలోచనా సరళి. ధార్మికభావనాకృతి. మానవుని మాధవునిగా మార్చేదే మతం. నరుని నారాయణుడిగా తీర్చిదిద్దేదే మతం. జీవుని శివునిగా రూపొందించేదే మతం - దైవభక్తికి మూల మంత్రం మతం. మత బోధలు దైవస్వరూపాన్ని దర్శింపజేసి, దైవసాక్షాత్కారాన్ని అనుగ్రహించి, మానవునికి సుఖ సంతోషాలను, శాశ్వత శాంతిని అనుగ్రహిస్తాయి.

ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధించడమే జీవితలక్ష్యంగా భావించాలి. అందుకే మనయత్నాలు, ప్రయత్నాలు ఆరంభం కావాలి. అందుకే మన శక్తిని ఉపయోగించాలి. అందుకై మనం ఆసక్తినిచూపాలి. ఆ సాధనకై మన జవం జీవం ఆరాటపడాలి.

'జంతూనాం నరజన్మ దుర్లభం' ప్రపంచంలో ఏ జీవిగానైనా పుట్టవచ్చు, పెరగవచ్చు, గిట్టవచ్చు. కానీ సర్వోత్కృష్టమైన మానవ జన్మ లభించడం కష్టసాధ్యం. ఆహారం, నిద్ర, భయం సంసార సుఖం, ఇవన్నీ పశువులకూ మానవులకు కూడా సమానమే. అయితే మానవ జన్మలోని విశిష్టత ఏమిటి? అని ప్రశ్నించుకుంటే జ్ఞాన సముపార్జనమే మానవుని ప్రత్యేకత. మానవ జీవిత పరమార్థం జ్ఞానాన్ని సంపాదించుకోవడమే అని భావించవచ్చు.

'ఆహార నిద్రా భయ మైధునాని సామన్య మేతత్పశుభిర్నరాణాం.
జ్ఞానం హితేషామధికో విశేషో జ్ఞానేన హీనా! పశుభిస్సమానా!

పశు పక్ష్యాదులకు లేని జ్ఞానమును ప్రత్యేక లక్షణముగా కలిగినవాడు లోకంలో ఒక్క మానవుడు మాత్రమే. తను సత్పురుషుని లాగ ప్రవర్తిస్తున్నానా? లేక పశువులాగ ప్రవర్తిస్తున్నానా? అని మానవుడు తనకు తాను నిరంతరం సమీక్షించుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

'ప్రత్యహం ప్రత్యవేక్షేత నరశ్చరిత మాత్మనః
కింనుమేపశుభిస్తుల్యం కింను సత్పురుషైరివ'

మనస్సు, వాక్కు, క్రియలయందు సమాన ధర్మము కలవాడు సత్పురుషుడు. త్రికరణశుద్ధి కలిగి ఉండాలని అవగతమగుచున్నవి. భారత శబ్దము కూడా ఇదే భావమును బోధించుచున్నది.

భా – భావము = ఇది మనోగతము.

ర – రాగము = ఇది వాగ్రూపము

త – తాళము = ఇది శరీరగతము.

ఈ విధముగా మనోవాక్కాయములయందు సామ్యస్థితి కలవాడు భారతీయుడు. సత్పురుషులకు త్రికరణశుద్ధి ఉండునని బోధపడుచున్నది.

'యథాచిత్తం తథా వాక్ప యథా వాక్యతథా క్రియాః
చిత్తే వాచిక్రియాయాంచ సాధునా మేకరూపతా

భారతీయసంస్కృతి ఆర్షవిజ్ఞానంలో నిండి నిబిడీకృతమైంది. ఆర్షమంటే ఋషులకు సంబంధించినది. మహర్షులు పరమేశ్వరుని నిశ్వాసరూపాలైన వేదాలను దర్శించి లోకానికి సత్యావిష్కరణ గావించారు. వేదాలకు శృతి, అనుశ్రవం, త్రయి, అమ్నాయం, సమామ్నాయం, ఛందం, స్వాధ్యాయం, ఆగమం, నిగమం మున్నగు పేర్లు ఉన్నవి. వేదమంటే జ్ఞానోపదేశమైన గ్రంథం అని చెప్ప వచ్చును. వేదాన్ని అధ్యయనంచేసి, అర్థజ్ఞానంకూడా సంపాదించాలి. శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, చందస్సు, జ్యోతిషంఅనే ఆరు వేదాంగాల ద్వారా వేదాన్ని అర్థంచేసుకొనడానికి ప్రయత్నించాలి. వేద శిఖలైన ఉపనిషత్తులు, సర్వోపనిషత్సార భూతమైన భగవద్గీతా, పురాణములు, రామాయణ, భారత, భాగవతాది మహాకావ్యేతిహాసములు భారతీయ ఆత్మదర్శనానికి ఎంతగానో తోడ్పడును.

విదేశీయుల దురాక్రమణలు, స్వదేశీయుల అంతఃకలహాలు పాశ్చాత్య సంస్కృతీ వ్యామోహం ఇవన్నీ కాక ఇంకా అనేకానేక కారణాలవల్ల మన ధార్మిక జీవనమార్గం కంటకావృతమైంది. భావకాలుష్యం ఈనాడు భారతీయుల్ని బందీ చేసింది. మన ఆచార వ్యవహారాలు, మన సంప్రదాయాలు, మన పూజా విధానం, మన తాత్విక చింతన, స్వరూప స్వభావాలను విస్మరించే దుస్థితి ఏర్పడింది. ఈ దుర్దశ ఇంకా ఇట్లానే కొనసాగితే భావితరాల వారికి 'భారతీయత' అనేది ఒక సుందర స్వప్నంగానే మిగులుతుంది. మన పవిత్ర వారసత్వాన్ని పదికాలాల పాటు పదిలంగా పరిరక్షించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. భావి భారత పౌరులను భారతీయ సంస్కృతీ సంపన్నులను గావించాలి. అందుకై ప్రయత్నించాలి. ఆ ప్రయత్న ఫలితమే 'మన పవిత్ర వారసత్వం'.

ఆంధ్ర సాహిత్య ప్రపంచానికి శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి వారు అందించిన అపూర్వ ఆభరణం 'మన పవిత్ర వారసత్వము' అనే అమూల్య గ్రంథ రత్నం. ఈ గ్రంథాన్ని ఎంతో ఆసక్తితో అమూలాగ్రం చదివాను. ఆస్తికలోకం పది కాలాల పాటు పదిలంగా భద్రపరచు కోవాల్సిన ఈ గ్రంథం ఆర్షవిజ్ఞాన సర్వస్వంగా భావించవచ్చు. గణేశారాధనతో ప్రారంభమైన గ్రంథం శ్రీ విద్యారణ్యస్వామి వారి చరిత్రలో ముగుస్తుది. ఆ తరువాత ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లాలలో సుప్రసిద్ధములైన దేవాలయాల చరిత్ర వాటి ప్రాశస్త్యము, ఇంకా అనేక వివరములు అందివ్వబడినవి ఒక యాత్రిక దర్శినిగా గ్రంథంలోని ఈ ఉత్తరభాగం రూపొందింపబడినది.

రచయిత శ్రీ పొణుగుపాటి కృష్ణమూర్తి మితభాషి, హిత భాషి, స్మితభాషి, నిగర్వి, నిరాడంబరుడు, భారతీయ ధర్మం పై ఎంతో మక్కువ గలవారు. దైవభక్తి వేద భక్తి గలవారు. మన పవిత్ర వారసత్వాన్ని మనకందివ్వడానికి సలిపిన కృషి, శ్రమ, అభినందనీయం. వారి దీక్షా, దక్షత శ్లాఘనీయం.

ఎన్నో ఆధ్యాత్మిక విలువలను, ధార్మిక భావనా పరంపరలను, సంప్రదాయ రహస్యాలను, ఆచారాలలోని గాఢ, గూఢ, నిగూఢ, మర్మాలను, సంప్రదాయ సిద్ధాంతాలను, స్థల మహాత్మ్యాలను శాస్త్రీయ దృక్పథాలను సరళమైన భాషలో సర్వజన సామాన్యానికి గూడా అవగాహనమయ్యే రీతిలో సాగిన శ్రీ కృష్ణమూర్తిగారి రచనా శిల్పం బహుధా ప్రశంసనీయం. భారతీయ ధర్మామృతాన్ని నలుగురికి అందించాలనే ఆయన తపన శ్లాఘనీయం.

రుద్రాక్ష మహాత్యము, అగ్నిదేవాలయాలు, నమకము, చమకము – కుంకుమ పూజా మహాత్మ్యము, దర్భలు – విశిష్టత, గ్రహణములు, దేవాలయ విధులు, జపమాల, జప విధానము – అక్షతలతో పూజా – ఒక పరిశీలనము, సాలగ్రామపూజ ఒక పరిశీలన, కృష్ణాజిన మహాత్మ్యము, స్వాహా అనగా? మున్నగు శీర్షికలు ఈ గ్రంథానికే మణిపూసలు. మన ఆచారాలన్నీ పరమార్థ సమన్వితాలు. ధార్మిక భావనా విలసితాలు. ఆరోగ్య భోగ భాగ్య ప్రదాలు. వాటిలోని మూల భావాన్ని, పరమార్థాన్ని, శాస్త్రీయ భావాన్ని మనం విస్మరించాం. శతాబ్దాల తరబడి సలిపిన భానిసత్వంలో మనల్ని మనం విస్మరించాం. సంప్రదాయాలలోని మూల స్వరూపాన్ని మరచిపోయాం. పలు సందేహాలకు విమర్శలకు గురి అయ్యాము. అర్థం చెప్పలేని అయోమయస్థితిలో కాలం గడుపుతున్నాం. ఈ స్థితిలో 'పన పవిత్ర వారసత్వం' ఒక కామధేనువులాగ, ఒక కల్పవృక్షంలాగ, ఒక చింతామణిలాగ దర్శనమిచ్చింది.

శ్రీ కృష్ణమూర్తి బహు గ్రంథ పఠనం గావించి, విజ్ఞులవలన శాస్త్రీయ సంపదను గ్రహించి, ధార్మిక చైతన్యంతో వజ్ర సంకల్పంతో ఈ గ్రంథాన్ని సర్వాంగసుందరంగా రూపొందించడం ఆంధ్రుల అదృష్ట విశేషం.

తెలుగుపదాల సౌందర్యం, అర్థగాంభీర్యం, అడుగడుగునా ప్రత్యక్షమయ్యే ఈ రచన దేశ విదేశాలలోని తెలుగు వారి కరకమలాలలో కమనీయంగా శోభిల్లాలని, శ్రీకృష్ణమూర్తిగారిఅమృత లేఖిని నుంచి ఇటువంటి ధార్మిక రచనలు పుంఖానుపుంఖాలుగా వెలువడాలని ఆశిస్తూ ఆస్తికలోకం ఈ గ్రంథాన్ని తమ ఆస్తిగా భావించి భద్రంగా భద్రపరచుకోవాలని ఆశిస్తున్నాను. అస్తు.

ఇట్లు

ప్రభాకర శ్రీకృష్ణభగవాన్



# విన్నపము

భగవానుని లీలలు అనంతములు. దురవగ్రాహ్యములు. అత్యంత ఆశ్చర్య జనకములు. ఆ ఆశ్రిత పరిపాలకుడు ఏ కార్యక్రమం ఎవరికి అప్పగించి జరిపించి ఆనందిస్తుంటాడో తెలిసికోవడం అత్యంత దుర్లభం. ఈ నిజం నా పట్ల రుజువైనది. ఆయన చేసే ప్రతి పనిలో ఏదో పరమార్థముంటుందని కూడా రుజువైనది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం (రహదారుల భవనముల శాఖ)లో చిన్న ఉద్యోగం చేసి పదవీ విరమణ (30-6-1989) చేసిన నా చేత ఈ (అత్యద్భుత) పరమ పవిత్ర గ్రంథ రచనా కార్యక్రమం మరియు ఈ గ్రంథ ప్రచురణ జరిపించడం నమ్మలేని విషయం. కాని ఇది జరిగినది కదా!

నాలో సాహిత్యాభిలాష, లలిత కళల పట్ల విపరీతమైన అభిమానం, కొంత అవగాహన ఉన్న మాట యదార్థమే శారదా నవరాత్రి ఉత్సవాలు, శ్రీరామనవమి ఉత్సవాలు. శ్రీగణపతి నవరాత్రి ఉత్సవాలు, చిత్రకళా ప్రదర్శనలు, నాటకాలు, సంగీత సభలు నృత్యకార్యక్రమాలు, ఆధ్యాత్మిక సమావేశాలు, పుణ్య తీర్థ యాత్రలు ఒకటేమిటి ఎవరూ, ఏమీ చేయలేని సమయములలో గత నలభై సంవత్సరములుగా నా చే ఈ కార్యక్రమాలు జరిపించి, నడిపించి నాలో అవగాహన, కార్యదీక్ష, సత్సంకల్పసిద్ధి కలుగుజేసి నన్ను శ్రీ కనకదుర్గ దేవాలయ నిర్మాణము, ఈ గ్రంథ రచన, మరియు ప్రచురణ, శ్రీ సూర్యదేవాలయ (పింగళి) నిర్మాణ ఆరంభమునకు నిమిత్తమాత్రునిగా చేసినది ఆదివ్యమంగళ విగ్రహుడే కదా!

హైదరాబాద్, ఎఱ్ఱమంజిల్ ఆవరణలో 1984 దసరా ఉత్సవాలలో శ్రీ చండీ యాగ శుభ సందర్భంలో గురుదేవులు కీ. శే. శ్రీదివాకర్ల వేంకటావధాని గారిని దర్శించడం జరిగినది. ఆయన మహా వ్యక్తిత్వం నన్ను ఆకర్షించినది. వారి పాదసేవ చేసికొనుటకు నిశ్చయించి, వారిని గురు పీఠమునందుంచి నన్ను తమ శిష్యునిగా స్వీకరించండి అని ప్రార్థించాను. అందుకు ఆ మహామహుడు ప్రసన్నవదనులైనను చిరునవ్వుతో మౌనముగా ఉండిపోయారు. ఆనాడే తొలి పాఠముగా ఆశాంతమూర్తి నాకు చెప్పినది వినయ విధేయతల గురించి, ఎంత ఎక్కువగా పాండిత్యపటిమ సాధిస్తే అంతకు పదింతలు వినయ విధేయతలు పెంచుకోవాలని చెప్పారు. ఆ మహనీయుని పాదరజోలవలేశమయిననూ కాక పోతినే అన్న బాధ మిగిలినదీ నాటికి నాకు. ఆయన మరణ వార్త నన్ను కృంగదీసినది. భగవానుని (విధి) లీలలు దురవగ్రాహ్యములు కదా!

ఆశ్రిత జన వరప్రదాయిని శ్రీ కనక దుర్గ మహాదేవి ఎఱ్ఱంమంజిల్ ఆవరణలో స్వయం వ్యక్తమై దేవాలయ నిర్మాణము, ప్రతిష్ఠ నాచే జరిపించినపుడు శ్రీ అవధాని గారు ఆ కార్యక్రమాల్లో పాల్గొని నన్ను ఆశీర్వదించిన పుణ్య పురుషుడు. ఆ మహనీయుని ఋణం తీర్చుకోలేనిదయినది. అదియు ఆ జగన్నాటక సూత్రధారి లీలా విశేషమే.

1989 మే నెలలో శ్రీ సూర్యదేవాలయ నిర్మాణమునకు (పింగళి, హైదరాబాద్) అనువగు స్థలసేకరణకు శ్రీ రాఘవన్, శ్రీవరంధామ రెడ్డి, శ్రీ రాఘవాచారి, శ్రీ సత్యనారాయణ గార్లతో కలిసి, కార్యదర్శిగా అప్పటి దేవాదాయ శాఖాధిపతి శ్రీ. ఆర్ పార్థసారధి గారిని సంప్రదించడం జరిగినది. సందర్భవశమున ఈ గ్రంథ రచన, ప్రచురణల గురించి కూడా, వారికి చెప్పగా ఆయన ఎంతో ఆసక్తి కనపరచి, అప్పటి వరకు నాచే సేకరించబడిన, ఈ గ్రంథ వస్తు విశేషములను గమనించి, ఈ గ్రంథము ఇంకనూ విస్తృత పరచి, ప్రచురించండని ప్రోత్సహించారు. దేవాదాయశాఖ పూర్తి సహాయ సహకారాల ప్రాతిపదికపై శ్రీ సూర్య మిత్ర ధార్మికనిధి కార్యదర్శిగా నేనే ఈ గ్రంథ ప్రచురణ కార్యక్రమానికి కూడా పూనుకోవడం జరిగినది.

శ్రీ సూర్య నారాయణుని పవిత్ర దేవాలయ (పింగళి) నిర్మాణ సహాయార్థము విరాళాల సేకరణకు ఈ గ్రంథం ఎంతో సహాయపడుతుందని నమ్మకంతో ప్రచురణ, కార్యక్రమం ప్రారంభించాము.

"శ్రేయాని బహు విఘ్నాని" అనినట్లు ఈ గ్రంథ ప్రచురణ కార్యక్రమం ఆర్థిక పరమైన ఇబ్బందులవలన అనుకున్నట్లుగా ముందుకు సాగలేదు. శ్రీ కె. సత్యరాజుగారు దేవాదాయశాఖాధిపతిగా వచ్చిన పిదప ఆయనతో ఈ గ్రంథ ప్రచురణ గూర్చి విపులముగా చర్చించిన పిదప వారు దయతో అంగీకరించి ఈ బృహత్తర గ్రంథ విస్తృత రచనకు, ప్రచురణకు ఇతోధికంగా సహాయ సహకారముల నందజేసారు. ఆ వదాన్యునకు నాతరపున ఈ ధార్మికనిధి సభ్యుల తరపున కృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలులు సమర్పించు చున్నాను.

కవిని కాకపోయినను, పాండిత్యము లేకపోయినను, సద్గురువుల శుశ్రూషాభాగ్యము లభింపక పోయినను, భగవానుని పై భక్తి విశేషము వలన నాకీ రచనా భాగ్యము కలిగినది. పరమేశ్వర కృపా విశేషముచే మనదేశమున నున్న, ముఖ్యముగా మన ఆంధ్రదేశము మునన్న అనేక పవిత్ర క్షేత్రముల సందర్శనా మహాభాగ్యము కలిగినది. ఎన్నో విశేషములు గ్రహించగలిగితిని. ఈ అవసరమున ఎందరో భక్తులను, పుణ్యాత్ములను, మహాత్ములను, వదాన్యులను దర్శించుటయే కాక, వారి పరిచయ భాగ్యమూ కలిగినది.

ఈ గ్రంథ రచన పూర్తి అయిన పిదప ప్రచురణకు కొంత కాలయాపన జరిగినది. అయినను ప్రచురణ కార్యక్రమము పూర్తి అయినది. నా పూర్వ జన్మాంతర సుకృతముగా ఈ గ్రంథ రచన ప్రచురణ కొనసాగినది కడు ధన్యుడనయితిని.

ఈ గ్రంథ రచనకు, ప్రచురణకు సహాయపడిన వారెందరో ఉన్నారు. వారినందరినీ ఇక్కడ ప్రస్తావించడం సాధ్యపడదు కదా. ముఖ్యంగా నాకు అత్యంత ఆప్తులు, స్నేహశీలి శ్రీ కె. సత్యనారాయణ దంపతులు నాకిచ్చిన ప్రోత్సాహం మరువలేనిది. శ్రీ వి. రాఘవన్. బి.యి, ఇంజనీర్ ఇన్ చీఫ్ (రహదారులు మరియు భవనములు శాఖ, పరిపాలన) రిటైర్డు, మరియు మాజీ ఎగువ సభ సభ్యులు "శ్రీనృసింహప్రియ" సంపాదకులు శ్రీ రాఘవాచారి గారు ఇలా ఎందరో ఈ పవిత్ర గ్రంథ రచన, ప్రచురణ కార్యక్రమాలలో పాలు పంచుకున్నారు. ఈ గ్రంథ రచన ప్రచురణలకు ఏమయినా దూషణ, భూషణ తిరస్కారములు ఎదురైతే, దూషణ, తిరస్కారములు నాకు, భూషణలు వారికే చెందాలని మనవి చేయుచున్నాను. పూజ్యులు శ్రీ రామమూర్తి రేణుగారు ఈ గ్రంథ రచనలో చేసిన సహాయం మరువలేనిది.

ఎందరో దేవాలయాధికారులు ఈ గ్రంథ ప్రచురణలో సహాయ, సహకారాలందించారు. గ్రంథ వస్తు విషయ సేకరణలో ఎన్నో సలహాలిచ్చారు. వారందరికీ కృతజ్ఞతావందనములు చేస్తున్నాను. ఈ గ్రంథరచనలో ఎన్నో గ్రంథాల, వ్యాసాల సహకారం గ్రహించడం అవసరమైనది. ఆయా గ్రంథ రచయితలకు, వ్యాసకర్తలకు, ప్రచురణ కర్తలకు కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాను.

అందమైన రేఖా చిత్రాలు గీసి తయారు చేసి సమయమునకు అందించి ఈ గ్రంథ ప్రచురణ అందంగా, సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడానికి సహకరించిన వర్ధమాన చిత్రకారుడు చి|| పి. రామయ్యను అభినందిస్తున్నాను. ఈ గ్రంథ రచన ప్రచురణలలో నాకు సహకారాన్నందించిన నా సతీమణిని ఆశీర్వదిస్తున్నాను.

ఇంకను ఎన్నో మన పవిత్ర క్షేత్రముల స్థల పురాణములు సేకరించవలసియున్నది. తదుపరి ముద్రణల సందర్భమున ఈ కార్యక్రమం జరిపి ఈ గ్రంథమును మరింత విస్తృత పరచుటకు ప్రయత్నిస్తానని మనవి చేయుచున్నాను.

పాఠకులు సులభంగా చదివి అర్థం చేసుకోవడానికి వీలుగా ఈ గ్రంథ (రచన) శైలి కొంత (సుగమముగా) సడలించడం జరిగినది. పాఠకులు గ్రహించ ప్రార్థన.

పండిత ప్రకాండులకు, కవి పుంగవులకు, ప్రియమైన పాఠకులకు సవినయముగా మనవి చేయుచున్నదేమంటే ఈ గ్రంథరచన, ప్రచురణలపై తమ తమ అమూల్య అభిప్రాయములను తెలియచేస్తే, ఈ పరమపవిత్ర గ్రంథాన్ని ఇంకనూ గొప్పగా, తదుపరి ముద్రణలలో తీర్చిదిద్ది, అందించి, ఈనాటి సమాజానికే కాక, రానున్న తరములవారికి కూడా ఎంతో సేవచేయవచ్చునని అనుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని ప్రతి ఇంటా ఉంచాలని కోరుతున్నాను. ప్రతి శుభకార్యసందర్భములలో ఆయా వ్యక్తులకు, చిరంజీవులకు, ఈ పరమపవిత్ర గ్రంథాన్ని బహూకరించి సాటిలేని మన సంస్కృతీ వికాసమునకు తోడ్పడవలసినదిగా పాఠకులను ప్రార్థిస్తున్నాను.

ఈ గ్రంథ ప్రచురణకు దయతో అంగీకరించిన శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి గౌ. చైర్మెన్ శ్రీ పి.వి. ఆర్. కె. ప్రసాద్ ఐ.ఎ.ఎస్ గార్కి, గౌ. అధ్యక్షులు శ్రీ వి.రాఘవన్ గార్కి ఉపాధ్యక్షులు శ్రీ రామకృష్ణ రాజుగారికి, శ్రీ పరంధామరెడ్డిగారికి, తదితర సభ్యులకు కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

ఎన్నో కష్ట, నిష్ఠూరాలకు ఓర్చి ఈ పరమ పవిత్ర గ్రంథాన్ని అందముగా ముద్రించి ఇచ్చిన ప్రఖ్యాత ముద్రణాలయము "చారి అండ్ కో., సికింద్రాబాద్-3" వారికి నా కృతజ్ఞతాభివందనములు.

ధనములేనివానిని అల్పుడని మన సమాజములో కొందరనుచున్నారు. కులము తక్కువానిని అల్పుడని మరి కొందరు ఈసడించుచున్నారు. అల్పత్వమనునది ధన, జాతి, మత, కుల, ఉద్యోగ విశేషములపై ఆధారపడియుండదు. భగవద్భక్తి లేనివాడు, భగవన్నామస్మరణ చేయనివాడు అల్పుడని, సమస్త వేదములను, పురాణములను సాంగోపాంగముగ తెలిసికొనిన శ్రీ వ్యాసభగవానుల వారు సెలవిచ్చియున్నారు. కావున భక్తి, జ్ఞానముల నలవరచుకొని పాఠకులు ధన్యులయ్యెదరు గాక.

ఈ గ్రంథ ప్రాశస్త్యముపై, ఎందరో పీఠాధిపతులు, మఠాధిపతులు, మరెందరో మహనీయులు తమ తమ అమూల్యాభిప్రాయముల నిచ్చి మమ్ములను ఆశీర్వదించారు. వారందరికీ పాదాభివందనములు చేయుచున్నాను.

ఆత్మ సాక్షాత్కార మహోత్కృష్ట వైభవ విశేషమును పొందిన మహాదృష్టవంతుడనైన నేను భగవదాదేశాన్ననుసరించి, వ్రాసి ముద్రించి, అందజేసిన ఈ పరమ పవిత్ర గ్రంథము ఎచ్చట ఉంటుందో అచ్చట సుఖ శాంతులు తప్పక భగవానుడు ప్రసాదిస్తాడని ప్రగాఢ విశ్వాసంతో సెలవు తీసుకుంటున్నాను.

ఫోన్ : 847888
86, వాసవి కాలనీ
కార్ఖానా, సికింద్రాబాద్-3.

సదాబుధజన విధేయుడు,
పోణుగుపాటి కృష్ణమూర్తి
రచయిత.

# శ్రీ జగన్మోహినీ కేశవస్వామి, ర్యాలి (తూర్పు గోదావరి జిల్లా)



శ్రీ జగన్మోహినీ కేశవస్వామి రూపంలో వెలసిన శ్రీ మహావిష్ణు దేవాలయము రాజమండ్రికి 25 కి. మీ. దూరములోగల ర్యాలి గ్రామమందు పవిత్ర గోదావరి నదీ శాఖలైన గౌతమి, వశిష్ట పాయల మధ్య నెలకొని యున్నది. దీనికి పూర్వము రత్న గిరి అను నామముండెడిది. ఈ క్షేత్ర మహాత్మ్యాన్ని తెలిపే గాథలు పురాణేతిహాసాం తర్గతమై ఉన్నది.

శ్రీ జగన్మోహిని కేశవస్వామివారి దివ్యమూర్తి అయిదు అడుగుల ఎత్తును, మూడు అడుగుల వెడల్పును కలిగిన సాలగ్రామ శిలయందు స్వయం వ్యక్తము. ఎదుట పురుషరూపము (కేశవస్వామి), వెనుక స్త్రీరూపము (జగన్మోహిని) ప్రకాశించుచున్నవి. చతుర్బాహువులయందు శంఖము, చక్రము, గద, పద్మములు, మెడలో కౌస్తుభ మణిహారము, వనమాల, రత్నహారములు గలవు. శిరస్సున నవరత్న ఖచిత కిరీటము చెవులయందు మకర కుండలములు, మెడలో యజ్ఞోపవీతము, నాభి స్థానము, ధోవతి కట్టు, ఉత్తరీయము ధరించుట, బాహువుల యందు అంగద, కేయూర, కంకణ, రత్నాంగుళీయకములు, నిగనిగలాడు నఖకాంతి, పట్టు పుట్టములపైన చిరుగంటల మొలత్రాడు ప్రకాశించుచుండును.

ఇరువైపుల ఉభయ కేశవమూర్తులు ఆలయ గోపురములలో ప్రవేశించు చుండును. చెరొక ప్రక్క శ్రీదేవి, భూదేవి, రుక్మిణి, సత్యభామ సేవించుచున్న ట్లును, కల్పవృక్షము, కృష్ణుడు గోవర్ధనోద్ధరణ, పై భాగమున మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బౌద్ధ, కల్కిమూర్తుల దశావతారములు ప్రకాశించుచుండును. ఇరువైపుల రంభ, ఊర్వశి నాట్య భంగిమలు, తుంబుర నారద వీణాగానము, కిన్నెర, కింపురుషులుస్వామివారికి పుష్పమాలికలు వేయుచున్నట్లును, ఆది శేషువు పడగవిప్పి స్వామిని సేవించుచున్నట్లును, శ్రీవారి పాదసన్నిధిని గంగావిగ్రహమునుండి నిరంతర గంగాప్రవాహము ప్రకాశించు చుండును. విష్ణువాహనమైన గరుత్మంతుడు, ప్రహ్లాదాది పరమభక్తులు పాద సేవచేయుచుండగా స్వామి ప్రసన్నుడై ఉండును. స్వామి వెనుక భాగాన జగన్మోహిని రూపముతో స్త్రీమూర్తి సహజమైన చీరకట్టు, వల్లెవాటు, శిరమున సిగచుట్టు, పారిజాతపుష్పధారణ, చేతు లకు రవిక, దండకడియ ములు ఒప్పుచుండును. బాజిబందులు, కుడితొడపైన పుట్టుమచ్చ (పద్మినీజాతి స్త్రీ లక్షణము) పాదము లకు, అందెలు, పావడలు, గజ్జెలు ప్రకాశించుచు ముందు వెనుకలపురుష, స్త్రీరూపములతో భక్తులను అనుగ్రహిస్తూ వేంచేసియున్న శ్రీ జగన్మోహనీ కేశవస్వామి ఏకశిలా విగ్రహము భారతదేశంలో కెల్లా ఏకైక అపురూప ముగ్ధమనోహర సుందర రూపము.

అమృతం కోసం దేవతలు, రాక్షసులు, సర్పరాజు వాసుకిని త్రాటిగా చేసి మందర పర్వతాన్ని కవ్వంగా చేసి కూర్మనాథుని సాయంతో క్షీరసాగర మధనం కావిస్తారు. ఆ మదనంలో అమృతభాండాన్ని చేతబూని ధన్వంతరి ఆవిర్భవిస్తాడు. ఆ అమృతాన్ని శ్రీమహావిష్ణువు జగన్మోహినీ రూపంలో దేవ, రాక్షసులకు పంచ చూపి, రాక్షసులు ఆమె సౌందర్యాన్ని చూసి మురిసిపోతుండగా, అదను చూసి అమృతాన్నంతా దేవతలకు పంచియిస్తాడు.

అంతకుముందు ఉద్భవించిన గరళాన్ని కంఠంలో నిలుపుకున్న పరమేశ్వరుడు, విష్ణుమూర్తి జగన్మోహిని వేషధారియైనట్లు విని స్వయంగా ఆ సౌందర్యరూపాన్ని చూడనెంచి ఆమెను చాలాదూరం వెంబడిస్తాడు. అలా పోతూపోతూ రత్నపురికి చేరేసరికి శివుడు ఉత్సుకతతో జగన్మోహినిని కౌగలించుకోబోయాడు. వెంటనే ఆమె శివునికి అభిముఖంగా వెనుదిరిగేసరికి ఆయనకు శ్రీమహా విష్ణు రూపం దర్శనమయింది. ఆ విసురులో జగన్మోహిని కొప్పునుండి ఒక పుష్పం రాలి పడింది. శివుడు అక్కడే ఆగి పోయాడు. అప్పటినుంచి రత్నపురి 'ర్యాలి'గా వ్యవహరింపబడుతూ, భారతదేశంలో మరెక్కడా లేని వింతగా విష్ణ్వాలయానికి ఎదురుగా శివాలయంతో ఈ క్షేత్రం ఎంతో పుణ్యప్రసిద్ధమైన శివ, వైష్ణవ క్షేత్రంగా విరాజిల్లుతోంది. ఈ క్షేత్ర ప్రాశస్త్యాన్ని తెలిపే గాథలింకా అనేకం ప్రచారంలో గలవు.

# కృతజ్ఞతాంజలి

ఈ పవిత్ర గ్రంథప్రచురణలో సహకరించిన ఈ కింది శ్రేయోభిలాషులకు

మా కృతజ్ఞాతాంజలి

శ్రీ ఆర్. పార్థసారధి, ఐ.ఎ.ఎస్. గారికి

కె. సత్యరాజు, ఐ.ఎ.ఎస్., దేవాదాయ కమీషనర్ గారికి

శ్రీ జి. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్., గారికి

శ్రీ పి.సి.హెచ్. రాజేశ్వర రావు, ముఖ్యమంత్రి సమాచార సలహాదారుగారికి

శ్రీ టి.ఎస్.ఎస్.ఎన్. రాజు, అదనపు కమీషనర్, దేవాదాయ శాఖ

ముఖచిత్ర ముద్రణకు సహకరించిన ర్యాలి శ్రీ జగన్మోహినీ కేశవస్వామి దేవాలయ పాలక వర్గానికి

ఈ గ్రంథ సమీక్షకులు, ప్రఖ్యాత సంస్కృత పండితులు, ఉపన్యాస కళానిధి శ్రీ ప్రభాకర కృష్ణ భగవాన్ గారికి

వివిధ దేవాలయములు కార్య నిర్వహణాధికారులకు

దేవాదాయశాఖ అధీక్షకుడు శ్రీ ఎం. సత్యనారాయణగారికి

ఆర్థికంగా విరాళాలిచ్చి సహాయపడిన, ట్రస్టు గౌరవసభ్యులకు

దేవాదాయ శాఖ సలహాదార్లు శ్రీరామమూర్తి రేణుగారికి మరియు శ్రీబిజుమళ్ళ సూర్యనారాయణ శర్మగారికి

మిత్రులు, శ్రీ అనిపెద్ది వెంకట రమణారావుగారికి,

భాగవతమందిరము రాజమండ్రి, శ్రీ పురాణ పండరాధాకృష్ణ మూర్తిగారికి, చిత్రకారుడు చి I పి.వి. రామయ్యకు

ముద్రాపకులు చారి అండ్ కంపెనీ, సికింద్రాబాదు వారికి మరియు మాకు అన్ని విధముల సహకరించిన అసంఖ్యాక మిత్రబృందానికి మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

**పి.వి.ఆర్.కె.ప్రసాద్**, ఐ.ఎ.ఎస్., చైర్మన్
**వి. రాఘవన్** బి.ఇ., అధ్యక్షులు

**పి. రామకృష్ణరాజు**, బి.ఇ., (ఆనర్స్)
**సి. వరంధామరెడ్డి**, బి.ఇ., ఉపాధ్యక్షులు

**పాలుగుపాటి కృష్ణమూర్తి**, కార్యదర్శి
**కె. సత్యనారాయణ**, కోశాధికారి
సభ్యులు : **వి.పి. రాఘవాచారి, బి. గోపాలరెడ్డి, స్థపతి ఎస్.పి. పెరుమాళ్ళాచారి**
మరియు జిల్లాలలోని గౌరవసభ్యులు

శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి

# మన పవిత్ర వారసత్వము

## విషయ సూచిక



# శ్రీ గణేశారాధన

వేదకాలము నుండి శ్రీ గణేశారాధన అతి పురాతనమైన పూజా పద్ధతిగా వ్యాప్తిలో నున్నది. విఘ్నకారకుడుగా విఘ్న నివారకుడుగా శ్రీ గణేశుని ప్రసిద్ధి మనమందర మెరిగినదే. మొదట శ్రీ గణేశుని స్తుతించిన పిదప మిగితా పూజా కార్యక్రమాలు నిర్వర్తించడం జరుగుతున్నందున ఈయన ప్రసిద్ధి అతి ప్రాచీనకాలంనుంచి వున్నదని తెలియుచున్నది. ప్రతి మానవుడు ఆయురారోగ్యైశ్వర్యములను కోరుచుండును. అవి మనము కోరినంతనే ప్రాప్తించెడివి కావు. గత జన్మ సుకృతమునుబట్టియే ప్రాప్తించుచుండును. ఆ సుకృతము పుణ్యకర్మలచే ప్రాప్తమగును. అందులకనేక అంతరాయములు కలుగుచుండును. అట్టి అంతరాయములు కలుగకుండ మనము ప్రతికార్యారంభమును "అదౌ పూజ్య గణాధిపః" అనుచు గజాననుని పూజించుచుందుము. ఇది లోకవిదితమే.

వినాయకునిగూర్చి వ్యాస మహర్షి ఒక ఉప పురాణము రచించియున్నాడు. ఈ గ్రంథము చాలా ప్రాచీనము, మంత్ర శాస్త్రములో గణపతులు ముప్పయి రెండు రూపములుగా చెప్పబడినది. సిద్ధ గణపతి, వర గణపతి, మహాగణపతి, లక్ష్మీగణపతి, చింతామణి గణపతి. ఇట్లు అనేక రూపములతో అనేక కార్య సిద్ధుల కొరకు దేవతలు ఋషులు ఆరాధించి పూజించిరి.

శ్రవణము వల్లను, జప, పూజాధికములవల్లను సకల సంకష్టములు నశించి ఆయురారోగ్యములు చేకూరునని మన నమ్మిక.

వేద వ్యాసమహర్షి పదునెనిమిది పురాణములు రచించి ఆ తర్వాత వాటిలో విశదపడని అనేక నిగూఢ రహస్యములను వివరించుటకై మరి పదునెనిమిది ఉప పురాణములను కూడా రచించినాడు. ఇందు గణేశ పురాణము అతి ముఖ్యమైనది.

దేవ గణములకు ఆదిపురుషుడై, అధిపుడై ఉద్భవించడంవల్లనే ఈయనకు 'గణనాధు'డని 'గణేశు'డని 'గణపతి' అని పేరు వచ్చినది.

గణపతిని ఓంకార స్వరూపుడుగ కూడ "గణపత్య థర్వ శీర్షము'లో స్పష్టంగా వర్ణించబడింది. వాక్కునకు ఈయన అధిష్టాన దేవతగా వేదములు స్తుతించినవి.

"గణానాం త్వా గణపతిం హవామహే కవిం, కవీనాం ఉపమశ్ర వస్తువం... జ్యేష్ఠరాజం బ్రహ్మణాం, బ్రహ్మణ స్పత అనఃశృణ్వన్నూతిభిః సీదసాదనం' సృష్ట్యాదిలో 'ఓం'కారంవలె ఉద్భవించిననాడు గణపతి గనక సర్వదేవత లలో ప్రథమంగా ఆయన పూజ్యుడు.

గణపతి విష్ణుస్వరూపుడు. ప్రార్థనలో 'శుక్లాం భరధరం, విష్ణుం' అని విష్ణుమూర్తిగా గణపతిని గూర్చి చెప్ప బడినందువల్ల స్పష్టంగా ఆయనయొక్క

విష్ణత్వము రూఢి యగుచున్నది. యోగశాస్త్రంలో దీని నిదర్శనంకూడ కలదు.

మన భరతఖండమందేకాక, నేపాల్, చైనా, టర్కీ, టిబెట్, ఇండోనేషియా, జావా, సుమత్రా, బోర్నియో మరియు జపాను మొదలగు దేశాలలో గణేశారాధనకలదు.

విఘ్నాధిపతిగా, గణాధిపతిగా బౌద్ధాయన ధర్మ సూత్రములలో శ్రీగణేశుని ప్రసక్తి కలదు.

యాజ్ఞవల్క్యస్మృతిననుసరించి బ్రహ్మ, రుద్రులు శ్రీ గణేశుని, గణాధిపతిగ నియమించినట్లు తెలియు చున్నది.

## ఆంధ్రదేశంలో గణేశుడు

శాతవాహనమహారాజుకాలంలో హాలునిగాథా సప్తసతి ననుసరించి శ్రీ గణేశునిపూజ దక్కనులో వ్యాపించినట్లు తెలియుచున్నది.

అమరావతి శిల్పాకృతి ననుసరించి రెండు చేతులు ఏనుగు శిరముగల గణేశుడు పూలహారమును **చేతనుం**చు కొన్నట్లు కనుగొనబడింది. ప్రఖ్యాత **చారిత్రక** పరిశోధకుడు శ్రీ కుమారస్వామి శ్రీ గణేశుని పూజ అతి ప్రాచీనమైనదని క్రీస్తు పూర్వమే ప్రఖ్యాతిగాంచినదని తదుపరి ఈ ప్రాచీన గణేశమూర్తి అనేక రూపములతో వ్యాప్తిచెందినదని అభిప్రాయ పడినారు.

బిర్లా పురాశిల్పవస్తు శాస్త్రజ్ఞులు కర్నూలుజిల్లా లోని కృష్ణాభవనాశి నదుల సంగమ స్థలములో జరిపిన త్రవ్వకాలలో బయలుపడిన జేగురుమట్టి (టెర్ర కోటా) శ్రీ గణేశుని విగ్రహం వలన క్రీస్తు పూర్వం రెండు మూడు శతాబ్దముల ముందు నుంచి శ్రీ గణేశమూర్తిని పూజించడం కలదని అందుచే కృష్ణ తుంగభద్ర నదీ పరీవాహక ప్రదేశములో గణేశుడు పూజలందుకున్నట్లు తెలియుచున్నది.

ఈ కనుగొన్న విగ్రహం లలితాశనము రెండు చేతులు బానకడుపు, ఏనుగుతల, కుడివైపు పొడవైన తొండము ఆభరణములతో కిరీటముగల ఈ గణేశ మూర్తి ఆంధ్రదేశములో అతిప్రాచీనమైనదిగా గుర్తింప బడినది.

కీసరగుట్టలో బయలుపడిన జేగురుమట్టి గణేశ విగ్రహము విష్ణుకుండినుల కాలమునాటిదని తెలియు చున్నది.

వేల్పూరు శిలాశాసనము ననుసరించి విష్ణు కుండినుల కాలమందు శ్రీ గణేశపూజ బహుళ ప్రచారములో నుండెడిదని తెలియుచున్నది. అనేక త్రవ్వకాలలో బయలుపడిన గణేశమూర్తి ఆంధ్ర దేశములో అతి ప్రాచీన కాలం నుంచి వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది. ఈ త్రవ్వకాల ననుస రించి ఆంధ్రదేశములో శ్రీ గణేశపూజ క్రీస్తుపూర్వము నుంచి వ్యాప్తిలో కలదని, చాళుక్యులు, రాష్ట్రకూటులు, కాకతీయులు, విజయనగర కాలములో బహుళవ్యాప్తి నందినదని తెలియుచున్నది.

ఏ కవి కలంపట్టినా ముందుగా ఇష్టదేవతను స్తుతించి గణేశుని స్మరింపకమానడు. తొలి వేలుపు ఎవరైనా తొలిపూజ అందుకునే వేలుపు వినాయకుడే ప్రతికర్మకు విఘ్నములు లేక పరిసమాప్తి కోరుచు శ్రీ విఘ్నేశ్వర పూజ అవసరమని పద్మపురాణం చెప్పుచున్నది.

శ్లో : నార్చితో హి గణాధ్యక్షో యజ్ఞాదేయ త్సు రోత్తమాః। తస్మాద్విఘ్నం సముత్పన్నం తత్క్రియాదజ విదంఖిలు । ఇంకను వివరముగా గణేశుని గూర్చి గణేశపురాణం లీలాఖండం పరిశీలించిన వారికి తెలియగలదు.

గణేశుడు ముందు కూర్చుని వ్రాయగా వ్యాసమహర్షి ఆశువుగా మహాభారతము చెప్పియున్నా డని ప్రతీతి. ధారాపాతంగా రచనసాగాలని ఎక్కడా కుంటుపడకుండా భాష ప్రవహించవలెనని అట్టి అనుగ్రహము ఇచ్చుటవల్లనే గణపతి 'నిర్విఘ్న కార్యసిద్ధికి' అనుగ్రహప్రదాతయై అనాదిగా, ఈనాటికి పూజింపబడుచున్నాడు

# అన్నదానమహిమ

ఆకలిగావున్నవానికి అన్నము పెట్టుట మన సంప్రదాయము. అతిధిని, అభ్యాగతిని దైవముగా భావించి, సంభావించడం, అన్నంపెట్టి ఆదరించడం మన ధర్మంగా పెద్దలు నిర్దేశించారు. అనాదిగా ఈ ధర్మం మన పెద్దలచే ఆచరించబడి ఎందరికో ఆధ్యాత్మికోన్న తికి మార్గదర్శకత్వం వహిస్తున్నది.

అన్నం పరబ్రహ్మస్వరూపమని పెద్దలు చెప్పు చున్నారు. అన్నము దేవతా స్వరూపమని తైత్తరీయ బ్రాహ్మణమునందు ఈ క్రింది శ్లోకమువలన తెలియు చున్నది.

శ్లో॥ అహమస్మి ప్రధమ జాఋుతస్య । పూర్వదేవేభ్యోయ అమృతస్యనాభిః

యోమా దదాతి స ఇదేవమహః । అహమన్నమన్న మదంతమద్మి (తై. బ్రా. 2-8-8).

అన్నదేవత ఈ విధముగ చెప్పుచున్నది. నేను యజ్ఞమునకు ముందుగ ఉత్పాదన చేసెడుదానను. అనగా దేవతను ఉద్దేశించి హవిస్సును త్యజించుటయే (ఇచ్చుటయే) యాగము కావున అన్నరూపము నా స్వరూపమే కావున నేను యజ్ఞమునకు అవసరమైన దానను. మరియు పూర్వము నేనే దేవతలకు అన్న విశేషరూపమగు అమృతమునకు బంధకమైన దానను (సంపాదించెడిదానను) ఇట్టి అన్నరూపమగు నన్ను ఏ పురుషుడు దానము చేయునో ఆ పురుషుడే కాలాంతర మందు నన్ను పొందును.

అనగా లోకములోదాత, అదాత అని మానవులు రెండు విధములు. ఒకడు ఇతరులకు పెట్టి (అన్న దానముచేసి) తాను తినును. అట్టి పురుషుడే కాలాంత రమున నన్ను పొందును. అన్నదాతకే కాలాంతరము నందు అన్నము పుష్కలముగా లభించునని యర్ధము. ఇక రెండవ పురుషుడు ఇతరులకు పెట్టకుండ తానే స్వయముగ భుజించును. అట్టి అదాత్తభిమానిని అగ్ని దేవుడనగు నేను నశింపజేయుచున్నాను. అదాతకు కాలాంతరమున అన్నముండదని భావము.

"అదాతా విషమస్నుతే" అనగా ఇతరులకు పెట్ట కుండ తాను తినువాడు విషమును భుజించును అని స్మృతులు ఘోషించుచున్నవి. మరియు దాత, అదాత ఉభయులు అన్న సంపాదనకు ప్రయత్నము చేయు చుందురు. అనగా దాత ఇతరులకు దానము చేయుటకు ప్రయత్నముచేయును. అదాత తాను భుజించుటకు అన్న సంపాదనకు ప్రయత్నముచేయును. వారిరు వురిలో దానము కొరకు అన్న ప్రయత్నము చేయు వారు ఉత్కృష్టులు. అట్టివారికి కాలాంతమున అన్నము సమృద్ధిగ లభించును. అదాతలు మూఢులని శ్రుతి పేర్కొనుచున్నది.

సర్వవ్యవహార కారణము అన్నమే. అట్టి అన్నము యొక్క మహత్త్వము నిర్వివాదమైనది.

శ్లో॥ అన్నం ప్రాణ మన్నమపాన మాహుః । అన్నం మృత్యుంతము జీవాతు మాహుః

అన్నం బ్రహ్మణో జర సంవదంతి । అన్న మాహుః ప్రజననం ప్రజానాం । (తై. బ్రా. 2-8-8).

ఊర్ధ్వవర్తియగు ప్రాణవాయువు, అధోవర్తి యగు ఆపానవాయువు రెండును అన్నజన్యమైన బలము వలననే సంచరించుచున్నవి. గాన ఇవి అన్న రూపములు. అన్నము మృత్యురూపమైనది. ఎట్లన రసవైషమ్యముచే వ్యాధి ద్వారామారకము. అందుచేత అన్నము ముసలితనమును కలిగించును. కొన్ని ఆహారములచే అతిస్వల్పకాలములోనే అనగా తక్కువ వయస్సులో తలపండిపోవునని ఆయుర్వేద ప్రసిద్ధి. అన్నమే సంతానము యొక్క ఉత్పత్తికి కారణము.

అట్టి మహిమాన్వితమైన అన్నము ఇతరులకు పెట్టకుండ భుజించువాడు వ్యర్ధమైన అన్నమునే

పొందును. కేవలము వ్యర్ధమేకాదు. వధవలె బాధాకరము కూడ, ఈ విషయమును కూడ శ్రుతి నిర్ధారించు చున్నది.

అగ్నియందు దేవతలకు అన్నము, అనగా హవిర్దానము చేయక, దేవతలను పోషించబడు దానము చేయకపోవుట వలన అతిధిరూపమగు మనుష్యుని పోషింపదు. ఇహపరలోకమునకుపయోగపడదు కనుక అదాత యొక్క అన్నము వ్యర్ధము.

అగ్నియందు హోమము చేయబడిన అన్నము మేఘరూపమున పరిణితిచెందుచున్నది. అనగా అన్నమే మేఘుడు. నారాయణమను ఉపనిషత్తులో అన్నదాన విషయముకూడ కలదు.

ఆదిత్యుడు తన రశ్మిచే భూమిగత జలమును స్వీకరించి ఔషధులను, వనస్పతులను భోజ్యమగు అన్నమును ఉత్పన్నము చేయుచున్నాడు. ఆ అన్నముచే ప్రాణములు పోషింపబడుచున్నవి. పుష్టి చెందిన ప్రాణములచే శరీరము బలము సంపాదించు చున్నది. ఆ బలముచే తపస్సు సంపన్నమగుచున్నది. ఆ తపస్సు పరిశుద్ధమైన చిత్తముగలవానికి తత్త్వ విషయమగు శ్రద్ధను పుట్టించుచున్నది. శ్రద్ధచే ఏకాగ్ర చిత్తునకు గురువుచే ఉపదేశింపబడిన గ్రంథముల యొక్కయు తదర్ధముల యొక్కయు ధారణ సామర్ధ్య రూపమగు మేధ జనించుచున్నది. ఆ మేధచే బుద్ధి పుట్టుచున్నది. ఆ బుద్ధిచే నిరంతరము తత్త్వవిషయక మగు మననము పుట్టుచున్నది. ఆ మననముచే శాంతి ఉత్పన్నమగుచున్నది. ఆ శాంతిచే విక్షేపరహితునకు తత్త్వవిషయ ప్రమాణజనిత జ్ఞానము జనించును, ఆ జ్ఞానముచే నిరంతర స్మరణను పొందును, ఆ స్మరణచే విజ్ఞానము పొందును. ఆ విజ్ఞానముచే పరమాత్మ స్వరూపమును ఎల్లప్పుడును అనుభవించును. ఈ విధముగ అన్నము, ప్రాణబలాది పరంపరచే పరమాత్మానుభవమునకు కారణము. కావున ఇట్టి అన్నదానము చేయు వారు ప్రాణబలాది ఆత్మానుభ వాంతములగు సర్వవస్తువులను దానము చేసిన వారగును.

'అన్నాత్ప్రాణాభవంతి' అనిశ్రుతి చెప్పుచున్నది.

పై చెప్పిన వివరణలవలన అన్నము యొక్క వ్యవహారము పారలౌకికము, ఐహికము అని రెండు విధములు. అన్నదాత దేవలోకమునందుగాని, పితృ లోకమునందుగాని ఈ యన్నము తనకు అగుగాక యను అభిప్రాయముతో అన్నదానము చేయును. అందువలన దత్తమైన అన్నము దూరవర్తియగు లోకమందు సంగ్రహించబడును. ఆ దూరలోకమందు సంగ్రహించబడిన అన్నము దాత కొరకు రక్షింపబడును. అగ్నియందు దానముచేసిన అన్నము మానవుల కొరకు దత్తమైన అన్నమును సేవించి దేవతలు, పితృ దేవతలు వర్తింతురు. ఈ విధముగ పారలౌకిక వ్యవహారము చెప్పబడినది.

అగ్నియందు, అన్నగ్రహీతల యందు దత్తమైన అన్నము మంత్రపూరితమగుచు సహస్రప్రకారములుగ ఫలించును. 'నాత్యశ్నతస్తు యోగోస్తిన చైకాంత మనశ్నతః'. దానపురస్సరముగ యుక్తప్రమాణముగ భుజించెడి వారిని లోకద్వయ మందును అన్నదేవత పాలించును.

అన్నదాన మహిమ గురించి చెప్పునపుడు వాజశ్రవసుని (ఉద్దాలకుడు) పౌత్రుడగు నచికేతుని వృత్తాంతము తెలిసికొనవలెను.

ఉద్దాలకుని తండ్రియగు వాజశ్రవసు గొప్ప అన్నదాత యగుటచే అతనికి నచికేతుడను లోక ప్రఖ్యాత యశశ్శాలి యగు పౌత్రుడు (మనవడు) జనించెను.

ఒకప్పుడు ఉద్దాలకుడు విశ్వజిద్యాగము చేయ నారంభించెను. తనకుగల ధనమంతయు దక్షిణగ నిచ్చెడి క్రతువునకు విశ్వజిద్యాగమందురు. ఆ క్రతువు నందు ఐదవదినమున తనకున్న ధనమంతయు దక్షిణగ ఇచ్చివేసెను.

ఉద్దాలకుని కుమారుడు నచికేతుడు ఉపనయన యోగ్యమైన వయసు కలవాడై బుద్ధిమంతుడై

యుండెను. తన తండ్రి దక్షిణలు యధావిధిగ నివ్వనిచో క్రతువైకల్యము సంభవించునని యెరిగి తనలో నాతండ్రి తనకు గల యావత్తు ధనమును దక్షిణగ నిచ్చెదనని క్రతు సంకల్పము చేసెను అతనికి పుత్రుడనగు నేను పుత్రధనమునుగాన ధనభూతుడనగు నన్నుగూడ దక్షిణగ నొక ఋత్విక్కునకివ్వనిచో క్రతు సాఫల్యము కాదని యోచించి "తండ్రీ! నన్ను ఏ ఋత్విక్కునకు ఇచ్చెదవు" అని అడిగెను.

తండ్రి ఉపేక్షచేసెను. ఇతను బాలుడని, మూఢుడని తలచెను. అయితే నచికేతుడు తండ్రిని శ్రద్ధతో రెండవ మారును, మూడవమారును అటులే అడిగెను.

ఇట్లు కుమారుడు రెండు మూడు సార్లు ప్రశ్నించిన ఉద్దాలకుడు కుపితుడయ్యెను.

'తగ్ం హపరీత ఉవాచ । మృత్యువేత్వాదదా మీతి' యని నుడివెను. అనగా వీడు బాలుడు కాడు. ధూర్తుడు అని యెంచి కోపావేశముతో నిన్ను మృత్యువునకు (యమునకు) ఇచ్చెదనని చెప్పెను.

అపుడు ఆకాశవాణి (దైవీవాక్కు) చెప్పెను. "ఓ నచికేతుడా! నీవు మృత్యువు యొక్క గృహమునకు వెళ్ళు" మని ఆకాశవాణి నచికేతునకు బుద్ధి ప్రధానము చేసెను. "యముడు ప్రవాసమునకు వెళ్ళిన తరువాత అనగా యింటలేని సమయమున, యముని వద్దకు వెళ్లుము. నీవు యముని యింట అతని భార్యబిడ్డలు అన్నము తినుమని నిన్ను ప్రార్థించినను నీవు భోజనము చేయక మూడురాత్రులు యముని యింట నివసింపుము". యముడడుగనున్న మూడు ప్రశ్నలకు జవాబులు కూడ చెప్పి అంతర్ధానమయ్యెను.

అశరీరవాణి చెప్పిన చొప్పున నచికేతుడు యముడులేని సమయమున, అతని గృహమునకు వెడలెను. భోజనము చేయకుండ మూడు రాత్రులు నివసించెను. యముడు వచ్చిన పిమ్మట నచికేతుని ప్రశ్నించెను. ఈక్రింది సంభాషణ ఇరువురికి జరిగెను.

యముడు : వత్సా నీవు యెన్ని దినములు మా యింట నుంటివి ?

నచికేతుడు : మూడు రాత్రులుంటిని.

యమ : మొదటి దినమున ఏమి తింటివి ?

నచి : నీ సంతానమును భుజించితిని.

యమ : రెండవ రాత్రి యేమి భుజించితివి ?

నచి : నీ పశువులను భుజించితిని.

యమ : మూడవ రాత్రి యేమి తింటివి ?

నచి : నీ పుణ్య కర్మను భుజించితిని.

ఈ విధముగ చెప్పిన నచికేతుని బాలునిగ తలపక యీతడు చంపదగినవాడు కాడని నిశ్చయించి సత్కరించెను.

నచికేతుని అభిజ్ఞతను తెలిసికొని మూడు రాత్రు లతడు తన యింట ఉపవాసము చేయుటచే కలిగిన అపరాధము పరిహరించుటకు మూడు వరముల నిచ్చెను. ఆ మూడు వరములేవన తాను చంపబడకుండ జీవించి తండ్రిని చేరవలెను. రెండు శ్రౌత, స్మార్త కర్మఫలములయొక్క అక్షయమును, సాధనము ఉపదేశింపుమనెను. మూడవ వరము - వర్తమాన దేహపాతాననంతరము అనగా మృత్యువు సిద్ధించిన పిదప తిరిగి జన్మలేకుండ ముక్తి సిద్ధించు మార్గము చెప్పుమనెను. యముడా మూడు వరముల నిచ్చెను.

అన్నదాన మహిమ లోకోత్తరముగ చేయుటకు నచికేతుడు జన్మించెను. ఆతడు కడు ధన్యుడాయెను. ముక్తిపొందెను. ఇంకను వివరముగా తెలిసికొనగోరు వారు కృష్ణ యజుర్వేదమునకు సంబంధించిన (కఠశాఖకు సంబంధించిన) ప్రపంచమున ప్రసిద్ధి గాంచిన, కఠోపనిషత్ నుంచి గ్రహించగలరు.

# అష్టాదశమహాపురాణములు

సంస్కృత వాఙ్మయము అపారమైనది. ఎంతో విస్తృతమైనది. శాఖోపశాఖలుగా విస్తృతమైన సంస్కృత వాఙ్మయం అతిప్రాచీనమైనది వేదాలతో సమాన మైన ప్రతిపత్తిగలది పురాణశాఖ.

పురాణమనగా "ప్రాచీనమైనది" అని అర్థము. వాయుపురాణం, పద్మపురాణం, పురాణ నిర్వచనం చెప్పినవి. ఋక్కులు మొదలైనవాటితో పురాణాలు కూడా పరమాత్మనుండి పుట్టినవి అని అధర్వణ వేదంలో చెప్పబడినది. ధర్మశాస్త్రకారులైన మహ ఋషులు, శంకరాచార్యులు కూడా పురాణాల పారాయ ణాన్ని అంగీకరిస్తూ వాటి అధ్యయనం ఎంతో పుణ్య ప్రదమని నొక్కివక్కాణించియున్నారు. పురాణాలకు, ఇతిహాసాలకు మధ్య అంత బేధం పాటించడం లేదు మన పెద్దలు, పండితులును.

పురాణాల ఆవిర్భావాన్నిగూర్చి స్కంద, మత్స్య, పద్మపురాణాలలో చెప్పబడినది. చతుర్ముఖ ప్రోక్తమైన పురాణం ఎంతో విస్తారంగా ఉండెడిదట. కొందరి సౌకర్యంకొరకు ఆబ్రహ్మయే దానిని కుదించి పదునెనిమిది పురాణాలుగ చేసెడని అంటున్నారు.

అతి ప్రాచీనమైన పురాణాన్ని విభజించి, గ్రంథస్తంచేసి వ్యాసమహర్షి పురాణ సంహితను రచించి నాడు. వ్యాసుని నుండి లోమహర్షునునకు అనగా సూత మహర్షికి సంక్రమించిన పిదప సూతమహర్షి వ్యాసవిరచితమైన పురాణ సంహిత ఆధారంగా పురాణ సంహిత నొకదానిని నిర్మించి తన శిష్యులకు బోధించి నాడు.

వ్యాస మహర్షి వేదాలను, పురాణాలను విభజించిన ఇరవైఏడవ వ్యాసుడని విష్ణుపురాణ, దేవీ భాగవతాదులలో చెప్పబడినది.

అజ్ఞాతంగా ఉన్న ఎన్నో శ్లోకాలు పురాణాల లోను వేదాలలోను ఉదహరింపబడుతూ ఉంటాయి. వీటిని "గాధలు" అని అంటారు. వ్యాసుడు పురాణ రచనలో వీటి సహాయంకూడా తీసుకున్నాడని పెద్దలు చెపుతారు. ఆయా కల్పాలలో జరిగిన ప్రసిద్ధ విషయాల వర్ణన ప్రతి ద్వాపరయుగంలోను ఒక్కొక్క వ్యాసుడు వస్తూ ఉంటాడని ఇలాంటి వ్యాసులు 27 గురు ఉండేవారని విష్ణుపురాణం, దేవీభాగవతాదులలో చెప్ప బడినది.

అష్టాదశ మహాపురాణాలు పదునెనిమిది. వాటి పేర్ల ప్రారంభంలో ఉన్న అక్షరాలను నిర్దేశిస్తూ దేవీ భాగవతంలో ఒక శ్లోకం ఉన్నది.

"మద్వయం, భద్వయం చైవ బ్రత్రయం,
వ చతుష్టయమ్
అనాప్ల పలికూస్కాని పురాణాని పృధక్, పృథకొ

మకారాది పురాణాలు రెండు మత్స్య, మార్కం డేయ పురాణాలు బకారాదులు రెండు, భాగవత, భవిష్య పురాణాలు, బ్ర ఉన్నవి మూడు బ్రహ్మ, బ్రహ్మవైవర్త, బ్రహ్మాండపురాణాలు, వాదులు నాలుగు విష్ణు, వాయు, వామన, వరాహ పురాణాలు. అనాపలింగకూస్కాలు : అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద పురాణాలు.

ఈ పద్దెనిమిది పురాణాలను వివిధరూపాలలో విభజించినారు. "పురాణం పంచలక్షణమ్" అని లక్ష ణాన్ని అనుసరించి ఐదు లక్షణాలున్నవి అతి ప్రాచీ నములని, మిగిలినవి వాటి తరువాతవి అని కొందరు పండితులు చెబుతారు. దీని ప్రకారం వాయు, బ్రహ్మాండ, మత్స్య, విష్ణు పురాణాలు అతి ప్రాచీన మైనవి.

అంతేకాకుండా ఆయా పురాణాలలో ప్రధా నంగా ప్రతిపాదింపబడిన దేవతలనుబట్టి వేరొక విభజన

జరిగినది. మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కంద, అగ్ని పురాణాలు (శివపారమ్యం) తామసములు, బ్రహ్మాండ బ్రహ్మవైవర్త, మార్కేండేయ, భవిష్య, వామన, బ్రహ్మ పురాణాలు (బ్రహ్మకు, అగ్నికి పారమ్యం) రాజసములు, విష్ణు, నారద, భాగవత, గరుడ, పద్మ, వరాహపురాణాలు సాత్త్విక పురాణాలు.

ఇక పురాణ లక్షణం తెలుసుకుందాం. పురాణంలో సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అనే ఐదు విషయాలు వర్ణింపబడవలెనని చెప్పబడింది. పురాణాలకు పది లక్షణాలు ఉండాలని భాగవతంలో చెప్పబడ్డది. అయితే పురాణం పంచలక్షణమనేదే ఎక్కువ ప్రచారంలో ఉన్నది. బాషా విషయాదుల ననుసరించి ఈ పురాణాలన్ని వేరువేరుకాలలో వేరువేరు దేశాలలో వ్యాసులచే రచింపబడి ఉండాలని పెద్దలు అభిప్రాయ పడుచున్నారు.

1. బ్రహ్మపురాణం : ఇందు దాదాపు 14,000 శ్లోకాలు, 245 అధ్యాయాలు ఉన్నవి. దీనికి పురాణ లక్షణాలన్నీ ఉన్నవి. అనేక క్షేత్ర మహిమలిందు వర్ణింపబడినవి. సాంఖ్య సిద్ధాంతం విపులంగా ప్రతిపాదించబడినది. మరణానంతరం కలిగే అవస్థల వర్ణన ఇందున్నది.

2. పద్మపురాణం : ఈ పురాణంలో 50,000 శ్లోకాలున్నవి. ఇందు సృష్టిఖండము, భూమిఖండము, పాతాళ ఖండము, ఉత్తరఖండము అనుభాగములు కలవు. ఈ పురాణం విష్ణుభక్తి ప్రధాన గ్రంథమైనా ఇతర దేవతల విషయంలో కూడా బాగా చెప్పబడ్డది.

3. విష్ణుపురాణం : ఈ పురాణం వైష్ణవధర్మానికి ముఖ్యమైనది. ఇందు 40,000 శ్లోకాలు వుండాలి, అయితే ఇప్పుడు 6,000 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి.

4. వాయుపురాణం : ఇది కూడా ప్రాచీనమైనది. ఇందు 11,000 శ్లోకాలు ఉన్నాయి. వీనిలోని ఖండాలకు పాదాలని పేరు. సంగీతశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు చెప్పబడినవి. ఈ పురాణంలో శివతత్త్వాన్ని విస్తరించి చెప్పినా, విష్ణువ తారాలు కూడా వర్ణింపబడినవి. ఇందు పాశుపత యోగము-పశుపతి పూజకు సంబంధించినది వర్ణింపబడినది. ఇది ఇతర పురాణాలలో లేని అపూర్వ విషయము దీనిని బట్టి ప్రాచీనయోగ శాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు తెలుస్తున్నవి.

5. శ్రీమద్భాగవతము : పురాణాలలో అతిప్రసిద్ధి గాంచినది శ్రీమద్భాగవతము. ఇది భక్తి సర్వస్వము. వల్లభ, చైతన్య సంప్రదాయముల వారికి అనగా వివిధ వైష్ణవ సంప్రదాయములకు చెందిన వారికి ప్రామాణ్య గ్రంథము. అద్వైతతత్త్వానికి సరిగా సమన్వయం అయే ఘట్టాలు అనేకం ఉన్నాయి. పరబ్రహ్మ తత్త్వాన్ని కనుగొనడానికి ఉత్తమసాధనంగా భక్తిని ఉపదేశించడం భాగవతం యొక్క వైశిష్ట్యము. ఇందు 18,000 శ్లోకాలు, ఏడు స్కందాలుగా విభజించబడ్డాయి. పురాణాలకు ఉండవలసిన ఐదు లక్షణాలేకాక భాగవతంలోనే చెప్పిన పది లక్షణాలుకూడా దీనికి సమన్వయిస్తాయి.

6. నారద పురాణం : ఈ పురాణంలో రెండు భాగాలున్నవి. మొత్తం శ్లోకాల సంఖ్య 25,000. వైష్ణవాగమాలు పాంచరాత్రవిధాన వర్ణన, ఏకాదశ వ్రత వర్ణన అతి విస్తృతముగా ఉన్నది. పరమ వైష్ణవ భక్తాగ్రేసరుడైన రుక్మాంగదుని కథ ఈ పురాణంలో ఉన్నది. అగ్ని, గరుడ పురాణాలలో ఉన్నట్లుగా ఈ పురాణంలో కూడా వ్యాకరణ, నిరుక్త, జ్యోతిష్య చందః శాస్త్రాలకు సంబంధించిన అనేక విషయాలు చెప్పబడ్డవి. విష్ణు, రామ, కాళీ, మహేశా దుల మంత్రాలు సవివరంగా ఉన్నవి. దర్శనాలకు సంబంధించిన విషయాలు కూడా ఉన్నవి.

7. మార్కండేయ పురాణం : ఇందు 9,000 శ్లోకాలున్నవి. మదాలస అనే బ్రహ్మవాదిని చరిత్ర ఇందు కలదు. ప్రసిద్ధ దుర్గా సప్తసతి ఈ పురాణంలోనిదే మహా

కాళి, మహాలక్ష్మి, మహాసరస్వతీ స్వరూపురాలైన దేవి యొక్క మహాత్మ్యాన్ని ఈ పురాణం ప్రతిపాదించినది. మన్వంతరవర్ణన విపులంగా చేయబడ్డది. కొన్ని వైదిక కర్మలద్వారా కోరిన కోర్కెలను ఎలా పొందవచ్చునో విశదీకరింపబడినది.

8. అగ్నిపురాణం : ఈ పురాణం ప్రాచీన భారతీయుల విద్యలకు సంబంధించిన సమస్త విషయాలను కలిగి యున్నది. రామాయణ భారతకధలే కాక, దేవాలయ నిర్మాణము, మూర్తి ప్రతిష్ఠ, పూజా విధానము విపులంగా చెప్పబడింది. జ్యోతిశాస్త్ర, ధర్మశాస్త్ర, వ్రత, రాజనీతి, ఆయుర్వేద, చందశాస్త్ర, వ్యాకరణ అలంకార శాస్త్రాదులకు సంబంధించిన అనేక విషయాలు అతి విపులంగా ఇందు చర్చింపబడినవి. యోగశాస్త్రానికి సంబంధించిన అష్టాంగముల నిరూపణ ఇందు చేయబడినది. ప్రధానమైన విద్యలను ఈ పురాణం అందజేసినది. అగ్నిపురాణం అనేక తాంత్రికానుష్ఠానములను ప్రతిపాదించినది.

9. భవిష్య పురాణము : ఇది ప్రాచీన పురాణము. ఇగ్రేజ అనే పేరుతో ఆంగ్లేయులు భారతదేశానికి రావడం కూడా పేర్కొనబడినది. ఇందు బ్రహ్మవిద్య, విష్ణు పర్వ, శివపర్వ, సూర్యపర్వ అనే నాలుగు పర్వాలు 14,000 శ్లోకాలలో వున్నవి. అనేక కాలాలలో అనేక మంది పండితులు, రాబోయే చరిత్రలు దీనిలో కలిపాయి.

10. బ్రహ్మవైవర్త పురాణం : ఈ పురాణంలో – బ్రహ్మ ఖండము ప్రకృతి ఖండము, గణేశఖండము, కృష్ణజన్మ ఖండము అనే నాల్గు ఖండాలలో దాదాపు 25,000 శ్లోకాలున్నవి. కృష్ణజన్మఖండమిందు పెద్దది. రాధా కృష్ణుల చరిత్రకు ఇందు అధిక ప్రాధాన్యమివ్వబడినది. ఆయుర్వేదానికి సంబంధించిన విషయాలున్నవి. శ్రీకృష్ణుడు బ్రహ్మనుగూర్చి వివరించడంచేత దీనికి బ్రహ్మవైవర్తమని పేరువచ్చినదని పెద్దలు చెబుతారు.

11. లింగపురాణం : ఇందు 163 అధ్యాయాలు, 11,000 శ్లోకాలు ఉన్నవి. సృష్టి శివుని ద్వారా జరిగినది. శివుని లింగరూపంలో పూజించడం వర్ణింపబడినది. శివుడు 28 అవతారాలు ఎత్తినట్లుగా చెప్పబడినది. శైవమతానికి చెందిన తీర్థాలు, వ్రతాలు, విస్తృతంగా ఇందు వర్ణింపబడినవి. పాశుపత సిద్ధాంతానికి సంబంధించిన అనేక విషయాలు ఇందు ప్రతిపాదింపబడ్డాయి. శివుడు అష్టమూర్తిగా ఇందు చెప్పబడినది.

12. వరాహపురాణం : విష్ణుమూర్తి యొక్క వరాహావతార కథ ప్రధానంగా ఇందు వర్ణింపబడినది. అందుచేత దీనికిపేరు వచ్చినది. వరాహపురాణంలో 11,000 శ్లోకాలు మాత్రమే ఇపుడున్నవి. ఇందు విష్ణువుకు సంబంధించిన అనేక వ్రతాలను గూర్చి చెప్పబడినది. వివిధ లోహాలతో భగవత్ ప్రతిమా నిర్మాణము, వాటి ప్రతిష్ఠ, పాంచరాత్ర ఆగమ ప్రమాణ్యము ఇందున్నవి. శ్రీ సింహాచల దేవస్థానము వారీ పురాణాన్ని ప్రచురించడం మెచ్చుకోదగ్గది.

13. స్కంద పురాణం : కుమారస్వామి (స్కందుడు) దైవతత్త్వాలను ఉపదేశించడం చేత ఈ పేరు వచ్చినది. ఇందు 81,000 శ్లోకాలు ఉన్నవి. పురాణాలన్నిటిలోకి ఇది పెద్దది. ఇందు మహేశ్వరఖండం వైష్ణవఖండం, బ్రహ్మఖండం, కాశీఖండం, రేవాఖండం ( శ్రీ సత్యనారాయణ వ్రతకల్పమున్నదిందులో) తాపీఖండం, ప్రభాసఖండం అనే ఏడు ఖండాలుగా ఈ పురాణం విభజింపబడినది.

ఇందు ఆరుసంహితలున్నవి. సనత్కుమార సంహిత, సూతసంహిత, శంకరసంహిత, వైష్ణవసంహిత, బ్రహ్మసంహిత, సౌరసంహిత అనునవి. సూత సంహిత శివోపాసన విషయంలో సాటిలేనిది. దీనిలో వివిధ క్షేత్రాల మహాత్మ్యాలు అత్యధిక సంఖ్యలో ఉండడంచేత వీటి గురించి తెలుసుకోవలసిన అవసరం ఎంతో ఉన్నది.

14. వామన పురాణం : వామనావతార వర్ణన ఇందు

ప్రధానంగా ఉన్నది. 10,000 శ్లోకాలు ఉండవలసి ఉన్నా, 6,000 శ్లోకాలు మాత్రమే ఇందున్నా యిప్పుడు. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారీ పురాణాన్ని రెండు భాగాలుగా ప్రచురించి ధన్యులైనారు.

15. కూర్మపురాణం : ఇందు మొత్తము శ్లోకాలు 18,000 అయితే ఇప్పుడు 6,000 శ్లోకాలుగల బ్రహ్మ సంహిత మాత్రమే లభ్యమగుచున్నది. ఇందు శివుడే ముఖ్య దేవత. శక్తిపూజకు కూడా ప్రాధానమివ్వ బడినది.

16. మత్స్యపురాణం : ఇందు 15,000 శ్లోకాలున్నవి. మత్స్యావతార కథే ఇందు ప్రధానంగా ఉన్నందువలన దీనికీ పేరు వచ్చినది. కాశీ ప్రయాగ క్షేత్రాలు, నర్మదా నది ప్రాంతములలోనున్న క్షేత్రాలు ఇందు వర్ణింప బడినవి. రాజధర్మ ప్రతిపాదనము. వివిధ దేవతా మూర్తుల ప్రతిమా నిర్మాణాదులు విస్తృతంగా చెప్ప బడినవి. ప్రళయకాలంలో అన్ని నదులు నశించినా నర్మదానది నశించదని చెప్పబడినది.

17. గరుడపురాణం : ఇందు 18,000 శ్లోకాలున్నవి. రాజనీతివర్ణన, ఆయుర్వేదానికి సంబంధించిన ఎన్నో విషయాలు ఇందు విపులంగా చెప్పబడినవి. పూర్వ ఖండం సకల విద్యాసంగ్రహము, ద్వితీయఖండం ప్రేత ఖండమవి చెప్పబడినది. మరణానంతరము మనుష్యుడే విధంగా లోకాంతరాలకు వెళతాడు మొదలైన విషయాలేకాక గర్భావస్థ, నరకము, యమలోక మార్గము, ప్రేతగుణ నివాసస్థానము. ప్రేతలక్షణాలు ప్రేతత్వవిముక్తి, యమలోకము మొదలైన విషయాలు ఎంతో విస్తృతంగా ఇందున్నవి.

18. బ్రహ్మాండ పురాణం : ఇందు సమస్త బ్రహ్మాం డము వర్ణింపబడినది. పరశురామ చరిత్ర ఇందు విపులముగా చెప్పబడినది. దీనిలో మొదట 12,000 శ్లోకాలు ఉండేవి.

ఈ అష్టాదశ మహాపురాణాలను అనుకరిస్తూ కొన్నిచోట్ల వాటిలో ఉన్నకథ క్లుప్తంగాచెప్తూ, కొన్ని చోట్ల మార్పులు చేస్తూ ఉపపురాణాలు వ్రాయ బడినాయి. ఇవికూడా పదునెనిమిది ఉన్నాయి ఇవి కూడా ప్రామాణ్యం కలవని అంగీకరింపబడినవి. ఉప పురాణాలు ఇవి 1. ఆది పురాణం 2. నరశింహ పురాణం 3. స్కాందపురాణం 4. శివపురాణం 5. దూర్వాస పురాణం 6. నారద పురాణం 7. కపిల పురాణం 8. వామన పురాణం 9. ఔశనస పురాణం 10. బ్రహ్మాండ పురాణం 11. వరుణ పురాణం 12. కౌశిక పురాణం 13. మహేశ్వర పురాణం 14. శాంబపురాణం 15. సౌర పురాణం 16. పరాశర పురాణం 17. మారీచ పురాణం 18. భాస్కర పురాణం.

ఇవేకాక అష్టాదశ ఔప పురాణాలు కూడా ఉన్నాయి.

1. సనత్కుమార 2. బృహన్నారదీయ 3. ఆదిత్య, 4. సూర్య 5. నందికేశ్వర 6. కౌర్మ 7. భాగవత, 8. వాశిష్ఠ 9. భార్గవ 10. ముద్గల 11. కల్కి 12. దేవి 13. మహాభాగవత 14. బృహద్ధర్మ 15. పరానంద 16. వహ్ని 17. పశుపతి 18. హరివంశ పురాణాలు.

శ్రీజ్ఞానానంద సరస్వతి తమ 'ధర్మకల్ప ద్రుమం' అనే గ్రంథంలో ఇంకా పురాణాలున్నాయని ప్రతిపాదించి ఉన్నారు. ఈయన చెప్పినట్లుగా పురాణాలు ఐదు విధాలు 1. మహా పురాణాలు 2. ఉప పురాణాలు 3. ఔప పురాణాలు 4. ఉపోప పురాణాలు 5. ఉపాప పురాణాలు. ఉపోప, ఉపాప పురాణాలు కూడా పదునెనిమిది ఉన్నాయి.

ఇందువలన పురాణ వాఙ్మయం ఎంత విస్తృత మైనదో మాత్రమే తెలుసుకొనగలము. అతి విస్తృ తమూ, అనితర బాషా సాధారణము అయిన ఈ పురాణ వాఙ్మయము ప్రాచీన భారతదేశానికి సంబంధిం చిన అనేక విషయాలు చూపగలిగిన అత్యద్భుత విద్యా స్థానము. భారతీయ సంస్కృతిని చెక్కు చెదర కుండా కాపాడిన వజ్రకవచము పురాణ వాఙ్మయము.

పురాణాలలో శివ, విష్ణు, శక్తి, గణపతి, కుమార, సూర్యాది దేవతలగురించి వారిలో కొందరి అవతారాల గురించి వివరించబడినది. ఈ దేవతా ముఖ్యుల మహాత్మ్యాలే కాకుండా అనేక లౌకిక విషయాలుకూడా ఎన్నో పురాణాలలో చెప్పబడ్డాయి. పురాణాలలో సృష్టివర్ణన సాంఖ్యులంగీకరించిన సిద్ధాంతానికి సరిపోతున్నది. ఇందు ప్రాకృత సృష్టి, వైకృత సృష్టి అనే రెండు విధాల సృష్టి చెప్పబడ్డది. బ్రహ్మసృష్టి, భూత సృష్టి ఇంద్రియ సృష్టి, ప్రాకృత సృష్టికి చెందుతాయి. వైకృత సృష్టి, తిర్యక్‌సృష్టి, దేవ సృష్టి, మానుష సృష్టి, అనుగ్రహ సృష్టి.. బ్రహ్మసృష్టి, రౌద్రీ సృష్టి పురాణములందు ప్రళయమును గూర్చిన అనేక అద్భుత విషయాలు చెప్పబడ్డాయి. అంతేకాక మన్వంతరాలు ఇంకా ఎన్నో విషయాలు అనగా ముఖ్యమైన పితృదేవతాపూజ ఎంతో విపులంగా చెప్పబడ్డది.

పుణ్యతీర్థయాత్ర ప్రతి భారతీయునికి అత్యంతావశ్యకమని చెప్పబడ్డది. పురాణాలలో కన్యాకుమారి మొదలు కాశ్మీరం వరకు ఉన్న వేలాది పుణ్యక్షేత్ర వర్ణన అతివిపులంగా చేయబడినది. కాశి, గయ, ప్రయాగాది క్షేత్రాల మహాత్మ్యాలు, ఎన్నో పుణ్యవ్రతాలు (వందలకొలది) పురాణాలలో ముఖ్యంగా స్కాందపురాణాదులలో వర్ణింపబడ్డాయి. ప్రతి మానవుని మనస్సు ఏదో విధంగా పరమాత్మను ఏదోరూపంలో స్మరిస్తూ ఉండేటట్లు చేయడమే వ్రతాల ప్రధాన లక్ష్యంగా చేయబడినది. కేవలం పరలోకానికి మాత్రమే సంబంధించిన విషయాలకు పరిమితం కాకుండా సామాజిక విషయాలను కూడా అత్యధికంగా ప్రతిపాదించాయి ఆయా కాలాలలో ఉన్న సాంఘిక, రాజకీయ, మత సంబంధిత పరిస్థితులు పురాణాలలో విపులంగా చెప్పబడ్డాయి.

పురాణాలలో అనేక విద్యలు వర్ణింపబడ్డాయి. అగ్ని, గరుడ నారదపురాణాదులు విజ్ఞాన నిధులు. ఆనాడు ప్రచారంలో ఉన్న వివిధ కళలు, శిల్పాలకు సంబంధించిన విషయాలు కూడా వున్నవి. అశ్వ శాస్త్రము, గజశాస్త్రము, ఆయుర్వేదము, రత్న పరీక్ష, వాస్తు విద్య, జ్యోతిష్యము, సాముద్రిక శాస్త్రము, ధనుర్విద్య, అనలేపన విద్య, స్వేచ్ఛారూపధారణ విద్య, అస్త్రగామ హృదయవిద్య, సర్వభూతరుత విద్య, పద్మినీ విద్య, రక్షోఘ్నవిద్య, జాలంధరీ విద్య, విద్యాగోపాలమంత్రము ఇలా ఎన్నో చెప్పబడినవి.

పురాణాలలో మన భరతఖండమందలి అనేకానేక తీర్థ మహాత్మ్యాలు చెప్పడంవలన, అచ్చట ఎన్నో దేవాలయాలు వెలయడంవలన, పురాణ శ్రవణం, పుణ్యక్షేత్ర దర్శనం ప్రతి భారతీయునికి పవిత్ర కర్తవ్యమై యున్నది.

అంతేకాదు. పురాణాలలో భూగోళ వర్ణనము చేయబడినది. భూగోళ పరిశీలనమే ఒక గొప్ప కార్యక్రమము. ఇందు సకల భూగోళ వర్ణనమేకాకుండా భారత వర్ణనకూడా ఉన్నది. వీటి గురించి విపులంగా తెలుసుకోలేకపోతే మన భారతీయ సంస్కృతీ జ్ఞాన పరిచయమే పూర్తికాదు.

పురాణాలలోని అనేక ఐతిహాసిక విషయాల సహాయంతో శిశునాగ, నంద, శుంగ, కణ్వ, ఆంధ్ర భృత్యనాగ వంశాదులకు చెందిన రాజుల చరిత్ర పునర్నిర్మింపగలిగినారు. ఇంకా ఎన్నో విషయాల వివరణ లిందుండడంచేత పురాణ వాఙ్మయ పరిచయము ప్రతి భారతీయునకత్యంతావశ్యకమై యున్నదనడంలో అతిశయోక్తి లేదు.

గమనిక :- శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతీ ట్రస్టు 140/1, గురుకృప, అశోక్‌నగర్, హైదరాబాద్ వారు ఎంతో శ్రమకోర్చి పురాణాలను చాలవరకు, మూల శ్లోకాలతో, తాత్పర్యంతో ప్రచురిస్తున్నారు. వారికృషి బహు ప్రశంసనీయము.

# ఓంకార మహిమ





అధర్వణ వేదాంతర్గత ప్రశ్నోపనిషత్ లోనిదీ మహత్తర విషయ నిరూపణము.

"ఏత ద్వై మహోపనిషదం దేవానాం గుహ్యం సర్వ వేదాయత్పద మామ సంతి" అను కఠీవల్లి శ్రుత్యనుసారము అనేకములగు ఉపనిషత్తులచే ప్రతిపాద్యమును, నిర్గుణతత్త్వ ప్రతిపాదకమునునగునీ ప్రణవరూపము ఇంద్రాది దేవతలకు గోప్యమైనది. అనగా ఇంద్రాది దేవతలు శమదమాద్యధికార సంపత్తి రహితునకు ప్రణవము నుపదేశించరు.

ఓంకారమే పరబ్రహ్మము. అనాదియై అవినాశనమయిన బ్రహ్మసృష్టి యొక్క కణ కణము నందు వ్యాప్తమై యుండును. అతడే చరాచర జగత్ సృష్టి నిర్మాణ, వినాశనములయందు సమాన రూపేణ వ్యాపించియున్నాడు. అతనినే అజరుడని అమరుడని, పరమ పురుషుడని కూడా అందురు. ఈ 'ఓం' కారమే అతనికి యేక మాత్రమైన ప్రతీక. ఆ పరమ తత్త్వోత్పన్నమైన ప్రాణతత్త్వము కూడ ఓంకారమే.

ఓ మితిబ్రహ్మ । ఓమితి దగ్ం - సర్వమ్.
(తైత్తరీయోపనిషత్)

'ఓం' అత్యద్భుత, మహామహిమాన్వితమైన అక్షర సముదాయము. అకార, ఉకార, మకారాత్మకమైన ఓంకారమును త్రిమాత్రా సమన్వితమైనదిగా, సాధన యందు భక్తి శ్రద్ధలతో ఉండు సాధకుడు శాంతమై, అజరమై, అమరమై, నిర్భయమై, నిరాపదమైన పరమ తత్త్వ పరిచయము కలిగి మెలగును. అట్టివాడే సాధన ద్వారా అమరత్వమును పొందును. ఈ ప్రపంచము నందు 'ఓం'కారము నతిక్రమించిన మరొక ఉత్తమ జ్ఞానముకాని, విద్యకాని లేదు అని పిప్పలాద మహర్షి సత్యకామున కెరింగించెను.

'అ'కార 'ఉ' కార 'మ' కారాత్మకమయిన 'ఓం' కారమును తెలిసికొను జిజ్ఞాస భక్తి భావానుకూలమైనది. ఓం కారమే నిశ్చల రూపేణా పరబ్రహ్మయని పిప్పలాద మహర్షి సత్యకామునకు తెలియజెప్పెను.

ఈ మాత్రాత్రయము యొక్క పూర్ణ స్వరూపమును ధ్యానించువారు బ్రహ్మయొక్క సర్వవ్యాపక స్వరూపానుభవము నందెదరు. పరమ తేజోమయమయిన సూర్యలోకమును పొందెదరు. ఆ లోకమును చేరిన సాధకులు, పాము కుబుసమును విడిచినట్లు తమ తమ వాసనలను పరిత్యజించెదరు. తద్వారా వారు సూర్యలోకము నుండి క్రమముగ బ్రహ్మలోకమున ప్రవేశించెదరు. వారి యీ బ్రహ్మ లోక ప్రాప్తి ఓంకార సంయుతమైన సామవేద మంత్రముల పవిత్రోచ్చారణ వలన కలుగును.

ఈ మాత్రాత్రయము బ్రహ్మవిష్ణు మహేశ్వరులను సూచించుచున్నది. అంతేకాక జీవాత్మ, జగత్తు మరియు పరమాత్మల ఉనికినికూడ 'ఓంకారము' వ్యక్త పరచుచున్నదని వేదవిదులు వక్కాణించుచున్నారు.

ఓంకారము మహాశక్తిసంపన్నమైనదని మాతృ దేవతారాధకులు చెప్పెదరు.

ఈ నాద శబ్దము సంక్షిప్తమై మఱ్ఱిచెట్టు విత్తనము వలె బహు సూక్ష్మమైనదైనను ఈ చరాచర జగత్తు నంతయు నింపుకొనియున్నది. వేదములు ఉపనిషత్తుల పరిశీలనము ఈ నాద సూక్ష్మరూపమువాటి మూలాధారమైయున్నదని తెలియుచున్నది. అన్ని వేద మంత్రములు (ఋక్కులు) సూక్తములు ఓంకారముతోనే ప్రారంభమవుచున్నవి. ఈ ఓంకారము వలననే వీటి ఉనికి, అర్ధసమన్వయము తెలియుచున్నదని వేదవిదులు వక్కాణించుచున్నారు.

ఉపాసకుడు భూలోకైశ్వర్యము నాశించి ఓంకారమునుపాసించినచో, వాడు మరణానంతరము ఆ యుపాసనాబలము చేత ప్రేరితుడై వెంటనే భూలోకమందే జన్మించును. ఋగ్వేద మంత్ర ప్రభావితమై ఋక్కులు అట్టివానిని మనుష్య శరీరమందే అవతరించునట్లు చేయును. పూర్వజన్మ సంచిత జ్ఞానపిపాస సంజనిత సంస్కారము వలన బ్రహ్మచర్యధారణతో శ్రద్ధాభక్తులతో బ్రహ్మ యొక్క అపార మహిమను సర్వత్రా అనుభవించెదరు.

అట్లే ఉపాసకుడు స్వర్గలోకము వరకును గల యైశ్వర్యము ననుభవింపగోరి, ఓంకారోపాసన చేసినచో యజుర్వేద మంత్రము అతనిని స్వర్గమును చేర్చును. అచటి యశాశ్వతములగు సుఖభోగముల ననుభవించి, ఉపాసనాపుణ్యమంతరించిన పిదప అతడు మరల భూలోకమునకే వచ్చును. ఈ మాత్రా ద్వయమును ధ్యానించు విద్వాంసులు చంద్రలోకమున దివ్యసుఖముల ననుభవించి, మరల మానవలోకము జేరి మరల సాధనానిరతులై పూర్వ బ్రహ్మచర్య పాలన ద్వారా శ్రద్ధాసక్తుల వలన బ్రహ్మమహిమానుభూతిని పొందెదరు.

ఓంకార నాదరూప బ్రహ్మస్వరూపము మొదట ఆకాశరూపమై తదుపరి శబ్దరూపమును పొంది ఆ పిమ్మట విశ్వవ్యాప్తమై, విశ్వరూపమై, బ్రహ్మపదార్థమునకు మూలాధారముగ నాదబ్రహ్మగ నొప్పుచున్నది.

సంగీతరత్నాకరమిట్లు చెప్పుచున్నది. ఏమన 'చైతన్యం సర్వ భూతానాం వివృతింజగదాత్మనా నాద బ్రహ్మ, తదానంద మద్వితీయము పాస్మహే'.

నాదబ్రహ్మ స్వరూపుడైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు 'ఓంకార స్వరూపమును ఆరాధించినవారే!

ఓంకారము, కారణ, కార్య స్వరూపము. నాదోపాసకుడైన శ్రీత్యాగరాజస్వామి దైవసాక్షాత్కారము పొందినది నాదోపాసన వలననే కదా. అందుకనే ఆయన ఇలా అన్నారు.

'నాదోపాసనచే శంకర

నారాయణ విధులు వెలసిరి ఓ మనసా' అని శరీరం చేతనత్వమందాలంటే నాదోద్దీపన శరీరంలో జరగాల్సిందే. అందువలన మహా మహిమాన్వితమైన 'ఓం' కారాన్ని భక్తులందరు అహర్నిశము ఉపాసించి తరించాలని ఆకాంక్ష.

దేవాలయములందు పూజలు జరిపించు భక్తులకు 'ఓం' కారము (సంస్కృత అక్షరముగ) చిహ్నములనుకూడా ఇచ్చిన బాగుండును. ప్రతి ఒకరు అట్టి ఓంకార చిహ్నములను తప్పక ధరించి తత్త్వభావమును స్వయముగా అనుభవములోనికి తెచ్చుకొనవలెనని ఆకాంక్ష.

# రుద్రాక్ష మహత్త్వము

మన పూర్వులు రుద్రాక్షమాలను ధరించెడు ఆచారమునేటి వరకు బహుళముగ కొనసాగుచున్నది. ఆచారములు శ్రుతి, స్మృతి మూలకములు గావున ప్రమాణములని పూర్వమీమాంసా శాస్త్రములో సిద్ధాంతీకరించిరి. ఈ సదాచారమునకు మూలము ఉపనిషత్తునందు కలదు.

పూర్వము పరమశివుడు త్రిపురవధార్థము వేయి సంవత్సరములు (దేవమానము) నేత్రములను మూసికొని, తెరచెను. అపుడు శివుని కన్నుల చివరలనుండి జల బిందువులు భూమియందుపడెను. ఆ అశ్రుబిందువులు భక్తులను అనుగ్రహించుటకు స్థావరరూపమునుదాల్చి మహారుద్రాక్షవృక్షములుగ పుట్టెను. రుద్రుని నేత్రముల నుండి ఉత్పన్నము లగుటచే రుద్రాక్షలు అనుపేరు వచ్చెను.

"రుద్రస్య నయనాదుత్పన్నా రుద్రాక్షాః" అని నిర్వచనము. కాలరుద్రుడు భుసుండుడను మహర్షికి (జాబాలుడు) రుద్రాక్ష ఉత్పత్తిని గూర్చి పైవిధముగా జెప్పెను.

సదాశివుడు సంహారకాలమునందు సర్వమును సంహరించి సంహారనేత్రమును ముకిళింపజేసెను. అపుడు ఆ నేత్రము నుండి అశ్రుబిందువుల ద్వారా రుద్రాక్షలు ఉత్పన్నమైనవి. కాలాగ్ని రుద్రుడు సనత్కుమారునికి ఈ విషయము చెప్పెనని మరియొక గాథ. ఆ సమయమునందు నిధాఘుడు,జడభరతుడు, దత్తాత్రేయుడు మున్నగు వారు కాలాగ్నిరుద్రుని యొద్దకేతెంచి వారడిగిన పిదప పై విధముగా తెలియ జెప్పెను.

ఉసిరిపండు ప్రమాణముగల రుద్రాక్ష చాల ప్రశస్తము. రేగిపండు ప్రమాణముగలది మధ్యమము, శనగ గింజ ప్రమాణముగలది అధమము.

రుద్రాక్ష మహిమచాల గొప్పది. వాక్కుచే రుద్రాక్ష అను శబ్దమును ఉచ్చరించిన మాత్రమున పది గోవులను దానముచేసినపుడు లభించిన ఫలము ప్రాప్తమగును. రుద్రాక్షలను హస్తముచే స్పృశించి, ధారణమాత్రమున రెండు వేల గోదానఫలము సంభవించును. రుద్రాక్షలను కర్ణములందు ధరించుట వలన పదకొండు వేల గోదాన ఫలము లభించును. రుద్రాక్షలను శిరమున ధరించినచో కోటి గోదానఫలము సంప్రాప్తమగును. ఈ స్థానము లన్నిటి యందును కర్ణస్థానమున ధారణఫలము చెప్పనలవి కానిది. ఈ విధముగ రుద్రాక్షదర్శన, ధారణ జపములకు ఉత్తరోత్తరాభివృద్ధిగ అపరిమిత ఫలములను శ్రుతి చెప్పుచున్నది.

పరాశరుడు కాశ్మీరదేశపాలకుడు చంద్రసేన మహా రాజునకు రుద్రాక్ష మహత్యము తెలియజెప్పెను.

ఉపనిషత్తులందును, స్కాందపురాణాదుల యందును రుద్రాక్షమహిమ ప్రతిపాదించబడినది అందుచే మన పూర్వులు రుద్రాక్షలను నియమముగ ధరించుట వాటితోజపముచేయుటమున్నగునవి శిష్టాచారప్రాప్తముగ నేటివరకు వచ్చుచున్నవని తేటతెల్ల మగుచున్నది.

మరియు మహావ్యాధులకు కారణమగు పూర్వ జన్మ కృతములగు పాపములను పారద్రోలి, తద్వారా మహావ్యాధి నివారకములని కూడా సుబోధమగు చున్నది.

# చిత్రగుప్తుని దేవాలయము

శ్రీ చిత్రగుప్తుడు మనందరకు పరిచితుడు. అయితే ఈయనకు ప్రత్యేకించి దేవాలయం కట్టడం గొప్ప విశేషమే! ఈయనే యమధర్మరాజు దగ్గర వుంటూ దేవ, మానవుల శుభాశుభకర్మలను గ్రంథస్థంచేసేపని యీయనది. ఇట్టి మహనీయుని దేవాలయం కాంచీపురంలో వున్నది.

ఒకప్పుడు పరమశివునకొక ఆలోచన వచ్చింది. మానవులకు దేవతలకు వారి వారి మంచి చెడు ఖర్మలను గ్రంథస్థంచేసే అవసరం వుందని, అందుకొక మహామహుడి అవసరం వుందని తలపోసి, వెంటనే ఒక బంగారు పళ్లెంలో ఓ మానవాకారంతో చిత్రంగీసి పార్వతీదేవి అభ్యర్థనతో ఆ ఆకారానికి జీవం ప్రసాదించాడు. అలా వుద్భవించిన మహనీయుడే చిత్రగుప్తుడు. పరమశివుడాయనకు దేవ, మానవుల, మానసిక, శారీరక శుభాశుభ కర్మలను గ్రంథస్థం చేసేపని అప్పగించాడు.

ఇంద్రుడు బిడ్డలకోసం శివునిగూర్చి తపస్సు చేస్తే ఇంద్రుని కోరికననుసరించి చిత్రగుప్తుని ఇంద్రుని కుమారునిగా జన్మించమని ఆదేశించాడు పరమశివుడు. చిత్రగుప్తుడు ఇంద్రాణికి పిల్లలు కలిగే అవకాశం లేదని చెప్పాడు. అపుడు పరమశివుడు కామధేనువును ఇంద్రునకిచ్చి ఆ కామధేనువుకు జన్మించమని చిత్ర గుప్తుని ఆదేశించాడు. శివుని ఆజ్ఞ మేరకు కామధేనువు చైత్ర మాసాన ఆదివారంనాడు బిడ్డను కన్నది. ఇంద్రుడా బిడ్డను ఎంతో గారాబంగా పెంచాడు. అతడే చిత్రగుప్తుడు.

(అయితే చిత్రగుప్తుడు సూర్యునకు నీలాదేవికి జన్మించినట్లు చెబుతారు.) పిదప చిత్రగుప్తుడు శివుని దర్శించ, శివుని ఆదేశంమేరకు యమధర్మరాజు వద్ద దేవ మానవపాపపుణ్యలేఖకునిగా నియమించబడ్డాడు. ఈనాటికి ఆయన ఆ కార్యక్రమం నిర్విఘ్నంగా జరుపుతున్నట్లు హిందువుల నమ్మకం.

కాంచీపురంలోని శ్రీచిత్రగుప్తుని దేవాలయం వైష్ణవులు, శైవులు కూడ దర్శిస్తారు.

చిత్రగుప్తుడు కేతుగ్రహానికి దేవునిగా నమ్ముతారు. మరణానంతరం జీవుడు మొదట యమధర్మరాజు వద్దకు తీసుకొని వెళ్లబడతాడు. అచట పదిమందితోకూడిన ధర్మాసనం సూచన మేరకు చిత్రగుప్తుడు దేవమానవ పాప పుణ్యములను ఎట్టి మినహాయింపులు లేకుండా, వున్నది వున్నట్లు విశదీకరిస్తాడు.

కాంచీపురంలోని గుడిలో చిత్రగుప్తుని విగ్రహం వున్నది. ఎడంచేత్తో తాళపత్రాలు పట్టుకుని కుడిచేత్తో గంటంతో వ్రాస్తున్నట్లువున్నది. కర్ణాంబిక చిత్రగుప్తుని ఇల్లాలు.

చైత్ర పూర్ణమి చిత్రగుప్తునికి ప్రీతి అయిన రోజు.

## భగవంతుని రూపములు

పరస్వరూపము, వ్యూహస్వరూపము, విభవస్వరూపము, అంతర్యామిస్వరూపము, అర్చాస్వరూపము.

# దేవాలయ సందర్శన : ఆవశ్యకత

ఈ ప్రపంచమును సృష్టించి, పెంచి, పోషించి నాశనము చేయువారెవ్వరు? ఆయన ఎక్కడ ఉన్నాడు? ఎట్లున్నాడు? అనగా సృష్టి, స్థితి, లయము లకు కారణమైన వారెవ్వరో తెలిసికొనవలయుననెడి జిజ్ఞాస, పరమార్థలక్ష్య ప్రధానులైన మన ఆర్షఋషులకు అతి ప్రాచీన కాలము నుండి కలుగుచున్నది. ఇది ఎవరికిని అంతు తెలియని నిగూఢరహస్యముగ నున్నది. ఎవరునూ వివరించి చెప్పలేని విషయమై యున్నది. అయినను అట్టి మహాశక్తి సంపన్నుడైన మూల కారణుని తెలిసికొనవలయుననే మహా సంకల్పముతో, అకుం ఠిత దీక్షాదక్షతలతో నిరంతర కృషి, పరిశోధనలతో ఎందరో మహానుభావులు విశ్వసౌందర్యములోని పరమ రహస్యాలను అవగాహన చేసికొని, ఒక మహత్తర శక్తి కలదని ఆ మహాశక్తియే సృష్టి, స్థితి, లయములకు మూలకారణమని. దానిని భగవంతుడని, పరమేశ్వరుడని జగన్మాతయని, నొక్కి వక్కాణించి యున్నారు. జగత్కారణుడొకడుండి తీరవలయుననెడి సిద్ధాంతము రూఢిగ తెలియజేసినారు. ఈ సిద్ధాంతమును అందరూ అంగీకరించినారు.

అట్టి శక్తిసంపన్నుడైన వాడే భగవంతుడనియు, ఆయన తత్త్వాలే భగవత్తత్త్వములనియు మన మహర్షులు అనితరసాధ్యమైన అంతర్దృష్టి విశేషముతో తెలిసికొనిన జ్ఞాన వివరములను స్మృతి, శ్రుతులననుస రించి లోక కళ్యాణార్థం గ్రంథస్థము చేసి మానవాళికి మహోపకారము చేసినారు. మహర్షులు నిరంతర కృషి దీక్షలతో, కఠోర తపో నియమనిష్ఠలతో పరిశోధించి తమ ఆత్మానుభూతితో రూపొందించబడిన అక్షర భారతిని, పరమ పవిత్ర వేదరాశిగా మనకందించినారు. నాదమయమై, ఈశావాస్యమయిన, పరమేశ్వర ప్రతి పాదనమే ఈ దార్శినికుల ప్రధాన లక్ష్యమై యున్నది. వేదములకు ఇదియే ప్రధాన లక్ష్యమై యున్నది. సర్వమూ పరమేశ్వరునిచేత అధిష్ఠితమని నిరూపించి నారు మొట్టమొదటి వేద మంత్రంలోనే ప్రపంచం పరమేశ్వర లీలా విలాసమనే పరమసత్యాన్ని సరళ భాషలో చెప్పి యున్నారు.

'అనంతావైవేదాః' అని వేదవిదులు చెప్పి యున్నారు. వేద సారస్వతం అంతం లేనిది. సాంతంగా, సంగ్రహంగా, సమర్థంగా దర్శించిన తపస్సంపన్నులు చేసిన కృషిఫలితంగా వేదాంతం రూపుదిద్దుకొన్నది. వేదాంతమనేది వేదవాఙ్మయంలో ఒక ప్రత్యేక విభాగం. ఉపనిషత్వాఙ్మయమంతా వేదాంతానికి సంబంధిం చినదే.

వేదాలు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదం అథర్వణవేదం. బాహ్య సృష్టిలోని అంద చందాలు, గృహసూత్రాలు పాడుకొని ఆనందించేవి, ఐహికాముష్మిక రహస్య సంపుటిగా, వేదశాఖలుగ విస్తరిల్లినవి. అలావిస్తరిల్లిన వేద వాఙ్మయం తిరిగి నాలుగు శాఖలుగ ఏర్పడినది – మంత్రభాగం, బ్రాహ్మణ భాగం, అరణ్యకం, ఉపనిషద్భాగం. మంత్ర భాగాన్ని సంహిత బాగమని కూడా అంటారు. మంత్రాలకు వినియోగం, ప్రయోజనం, ప్రక్రియ నిరూపణ చేసేది బ్రాహ్మణ భాగం. బ్రహ్మ శబ్దానికి మంత్రమనే అర్థం కూడా ఉన్నది. మంత్ర తంత్రాన్ని నిర్వచించి వ్యాఖ్యా నించేది బ్రాహ్మణం. ఇందెక్కువ ప్రవృత్తిమార్గ సూత్రాలున్నాయి. అరణ్యకంలోని వృత్తి మార్గానికి చెందిన వైరాగ్య సూత్రాలు వేదరహస్యాలుం టాయి. ఈ రెంటి సమన్వయం ఉపనిషత్తులలో చూడగలం. ఉప నిషత్తుల సంఖ్య సరిగా లెఖ్ఖకట్టి చెప్పడం సాధ్యం కాదంటారు పెద్దలు. ఇవి 108 అని ముక్తికోపనిషత్తు చెప్పుచున్నది.

ఇవికాక షడ్దర్శనాలకు, ఆగమాలకు, తంత్ర శాస్త్రానికి సంబంధించిన ఉపనిషత్తులు అనేకం ఉన్నాయి. శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీ రాధాకృష్ణ

పండితుడు పది ఉపనిషత్తులకు భాష్యాలు వ్రాసారు. ఇవి బహుళ ప్రచారంలో ఉన్నవి.

వీటి అధ్యయనము వలన భారతీయ తత్త్వము సులభ గ్రాహ్యమవుతుంది. మన మహర్షులు మన కందించిన మహత్తర ఆధ్యాత్మిక వారసత్వ సంపద మనం తెలిసికోవడానికి వీలవుతుంది.

భగవద్గీతలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు కూడ మన భారతీయ తత్త్వచింతనకు అతి ముఖ్య మైనవి. వీటిని ప్రస్థానత్రయమని అంటారు. ఉప నిషత్తులలోని విషయాలు కొంతవరకైనా తెలిస్తే బ్రహ్మ సూత్రాలలోని బ్రహ్మవిద్య, భగవద్గీతలోని యోగవిద్య సులభంగా తెలుసుకోవచ్చునని పెద్దలు చెపుతారు.

భాగవత పురాణం ఎంతోవిశాలమైన భక్తిక్షేత్రం. కాలానుగుణంగా మన ఋషీశ్వరులనేకులు ఎన్నో ధర్మ ప్రభోదాలుగావిస్తూ వచ్చారు. శుకయోగీంద్రుడు, పరీక్షిన్మహారాజునకుచేసిన పురాణప్రవచనమే ఈ భాగ వతమహాపురాణము. ఈయుగంలో కూడా జీవిస్తున్న మనబోటివాళ్ళ కోసం భాగవతాన్ని అనుగ్రహించాడు, శుక యోగీంద్రుడు. భాగవతం మన తప్పులను మనం తెలిసికొని, మన తప్పులు మనం తొలగించుకొని లోపాలు సవరించుకోడానికి ఎంతగానో ఉపకరిస్తుం దనడంలో సందేహం లేదు.

సృష్టి, స్థితి, లయాలకు మూలమైన ఒక మహ త్తర శక్తి ఉన్నదని సర్వమతములు అంగీక రిస్తున్నాయి.

ఈ సృష్టికి మూలకారణమును తెలిసికొనుటకు నిరంతర కఠోర శ్రద్ధాశక్తులతో, నియమ నిబంధనలతో కూడిన ఘోరతపఃప్రభావముతో, సర్వమానవ కళ్యాణా నికి విశేషముగా అంకితమై మానవతా దృక్పథానికి మహితాశ్రయమై భారతీయులకు వర ప్రసాదములుగా వెలుగొందుచున్న నిత్య, సత్య, శబ్దరాశి వేదములను కనుగొని వాటినే భగవంతుని నిశ్వాస రూపంగా ప్రతిష్టించి మానవాళికి మహోపకారం గావించారు మంత్రద్రష్టలైన మనమహర్షులు. మనకంటె ఎన్నో తరాల ముందుండెడివారు. వారు దివ్యజ్ఞాన సంపన్నులై, దీర్ఘదృష్టి విలసితులై మానవాళికి రానున్న బలహీనత లను ముందుగా గ్రహించి సంయమనంతో, సమ్యక్ జ్ఞానంతో వాటి నెదుర్కొవ డానికి శక్తిని, యుక్తిని ఎంతో నైపుణ్యంతో శులభశైలితో వివరంగా ఉపదేశించారు. ఆచరణయోగ్యంగా అనేక మార్గాలను విశదీకరించి మాన వాళి నిస్వార్థంగా, నియమబద్ధంగా నిర్భీతితో మనుగడ సాగించడానికి ఎన్నో విధానాలను ప్రవేశపెట్టి, తామా చరించి చూపి, మనకు మార్గదర్శకులైనారు. వారి ధార్మికదృక్పథం, తాత్త్వికచింతన, సాంస్కృతిక చైతన్యం వినా, మరి యేయితర సాధనల ద్వారా మానవాళి శాంతియుతంగా మనుగడ సాగించలేదని సోదాహరణంగా వివరించారు. భారతీయ సంస్కృతిని, చైతన్యాన్ని, తాత్త్విక చింతనను మన జీవన సరళితో మేళవించి ఒక ప్రత్యేక జీవన సరళిని మానవాళి కందించి మహోపకారం చేసినారు.

పరబ్రహ్మ స్వరూపము ఒకరిచేత కల్పింపబడేది కాదు. తనకు తానై ఉద్భవిస్తుంది. కొంతకాలం ఉండి ఆపైన నశించేది కాదు. ఎక్కడో ఒకచోట మాత్రమే వ్యక్తమయేది కాదు. సర్వవ్యాపకత్వం కలది. పిపీలిక మొదలు బ్రహ్మపర్యంతము అంతటా నిండి ఉంటుంది. కాని నిగూఢంగా ఉంటుంది. మరియొక శక్తిమీద ఆధార పడదు. తన మహిమమీద మాత్రమే ఆధారపడి ఉంటుంది. భూనభోంతరాళను, సూర్య చంద్రులను అన్నిటిని నిర్దేశించి వాటి ధర్మాలనవి సక్రమంగా పాలించుకునేటట్లు చూస్తూ ఉంటుంది. అది దాని విశిష్టతయని చాటిచెప్పి మనకు మార్గదర్శకులైనారు మన ఋషులు.

పరమపావనమైన ఈ శక్తినే పరమేశ్వరు డన్నారు. ఈ రూపము రజస్తమో సంపర్కము లేని శుద్ధ సత్త్వరూపమని వ్యాస మహర్షి పదే పదే వక్కాణించి యున్నారు. భగవంతుని స్వరూపము స్వచ్ఛమైనది, జ్ఞాన తేజములతో విలసిల్లునది పరిపూర్ణానందమయ మయినది. ఆ కారణముగనే ఈ మహామధుర మూర్తి

గాథలువిని మనస్సులో నిల్పుకొని, ధన్యజీవులు ఆనందించుటకు సదా ఉవ్విళ్లూరుచున్నారు.

మంత్ర సంప్రదాయ ప్రవర్తకులు, ధారణాశక్తి యుక్తులు, బహు బుద్ధిమంతులు నగు మహర్షులు, బహుప్రయాసతో, తమ సుసాధ్య తపశ్శక్తితో వేద వాక్కులను వెదకుటకు నిశ్చయించుకొని తమ కఠోర తపోనిష్ఠవలన వేదనాదములు గోచరింప, ఆ శ్రుతి లాభమున వ్యాస భగవానుడు, జైమిని మున్నగు మహర్షులు, శంకర భగవత్పాదుల వంటి మహామహులు వేదములను భావితరముల వారికందజేసిరి. శ్రీ విద్యా రణ్య యతీంద్రులవారు వేద భాష్య, వ్యాఖ్యానములను మనకందజేసి మనకు మహోపకారంచేసి చిరస్మర ణీయులైనారు.

సమస్త పురుషార్థ సాధన కవసరమైన ఆత్మ జ్ఞానాన్ని మహర్షులు వారు దర్శించిన వేదాలలో, ఉపనిషత్తులలో మనకందించి, మానవాళికి మార్గదర్శ కులై తరించినారు. తాము తరించుటయేగాక రానున్న తరములవారిని తరింపజేస్తున్న ధన్యాత్ములువారు.

వారు దర్శించిన వేదముల ద్వారా ధర్మాది పురుషార్థములు తెలియబడి పొందబడుచున్నవని దేవ మిత్రుడు వేద పదాన్ని నిర్వచించాడు. అధ్యయన విధితోపాటు అర్థజ్ఞానాన్నికూడా నిత్యకర్మగా విధిస్తు న్నది వేదమని సాయనుడు చెప్పియున్నాడు. అందు వలన వేదవేత్తలందరు వేదాధ్యయనంతోపాటు అర్థ జ్ఞానాన్నిసంపాదించి దాని ప్రయోజనాన్ని తాముపొంది లోక కళ్యాణాన్ని కలిగించడానికి కృషిచేస్తున్నారు.

ప్రపంచమున ఏ దేశము వారైనను, ఏ ప్రాంతము వారైనను, ఏవిధముగా భావించినను సర్వప్రపంచ వ్యవహారములను నడుపుటకు మూలకారణమైన వాడే భగవంతుడు. అతనిని బ్రహ్మయనియు, విష్ణువనియు, శివుడనియు, శక్తియనియు, సూర్యుడనియు, అగ్ని అనియు చెప్పుచున్నారు. మరికొందరు సర్వ జగత్తు నకు విష్ణువే మూలాధారమని చెప్పుచున్నారు.

పరమ భక్తాగ్రేసరుడు పోతనామాత్యుడు తాను తెనిగించిన శ్రీమద్భాగవతములో పరమేశ్వరుని గురించి చెప్పిన విషయాలు గొప్ప విజ్ఞాన దాయకాలు. భగవంతుడు తనంతట తానే పుట్టినాడని, సర్వ జగత్తు ఆయనవలననే జన్మించి, ఆయనయందుండి ఆయన చేతనే లయమగుచున్నదని అంతేకాక లోకములు, లోకేశులు, లోకస్థులు తెగిన తుదిని ఆవరించే పెను చీకటి కావల ఏకరూపముతో వెలుగొందునని భగవంతుని గూర్చి అద్భుతభావన మనలో కలిగించి నాడు. ఆయన పట్ల భగవానుడనే మాట సార్థకమైనది ఎందువలనంటే ఏ ప్రాణిపట్లనూ అనవసరమైన అనురాగమూలేదు. ఆయన రూపము ముల్లోకముల యందు ఉత్తమోత్తమమైన వానికంటే ఉత్తమమైనది. అత్యంత మోహజనకమైనవానికన్న మోహజనకమైనది. అద్భుత తేజఃపుంజము కన్న తేజముకలది. మధురాతి మధుర పదార్థముల కంటె మధురమైనది. సుందరతమ వస్తు సముదాయముకన్న సుందరమైనది. ఆశ్చర్యకర మైన అన్నిటికన్న ఆశ్చర్యకరమైనది. అని అనేక మంది మహాభక్తులు భగవంతుని కొనియాడినారు. ఎంతటి శక్తిమంతుడైనా పరమేశ్వరశక్తిని అణుమాత్రమైనా అధిగ మించలేడు. పవిత్ర ప్రకృతి ధర్మాలను తమ మూర్ఖ త్వంతో మార్చాలని, అధిగమించాలని లేక మలినపరచా లని ప్రయత్నించి తాత్కాలిక విజేతలై విఱ్ఱవీగినా అట్టి డాంబికం బహు స్వల్ప కాలపరిమితమైనదని తెలుసు కున్నారు. తన అద్భుత లీలల వలన అపరిమిత దయా స్వరూపుడైన పరమేశ్వరుడు అట్టిమూర్ఖులను, అజ్ఞాను లనుకూడా సంస్కరించ ప్రయత్నించడం ఆయన ప్రత్యేకత.

నామరూపాలులేని ఆత్మను గూర్చి మన ఉపని షత్తులలో చెప్పబడినది. అంతేగాక నిర్గుణ బ్రహ్మో పాసన ప్రతిపాదించబడినది కేవలం యజ్ఞ యాగాది కర్మలు చేసేవారే ఋషులని, నిర్గుణబ్రహ్మోపాసన చేసిన వారు సైతం ఋషులే యని రూఢి చేయబడినది.

కర్థమునికి దేవహూతి యందు జన్మించిన కపిల మహర్షి ఆవిర్భావంతో మనదేశంలో ధర్మయుగం ఆరంభ మయినదని వేదవిదులు చెప్పుచున్నారు.

మహర్షులు, జిజ్ఞాసువులు, విద్వాంసులు మిథిలా నగరం వెళుతుండెడివారు. ధర్మయుగంలో మిథిలా నగరం బ్రహ్మవిద్యకు కేంద్రంగా ఉండేది. ఈ విషయం, బృహదారకోపనిషత్తులో వివరించబడినది. మనదేశంలో ప్రచారంలోనున్న సాంఖ్యాన్ని గురించి, ఆత్మతత్త్వ విచార ధర్మాన్ని గురించి మహాయోగులకు దుర్లభమైన 'బ్రహ్మవిద్యను గూర్చి కపిల మహర్షి అతని శిష్యుడు అసురి, అతని శిష్యుడు పంచశిఖాచార్యుడు కపిల మహర్షి ఉపదేశాలననుసరించి, ప్రాచీన సాంఖ్య దర్శనాన్ని ప్రచార మొనర్చి బ్రహ్మజ్ఞానాన్ని ఎంతో సుగమంచేసి, భారతీయ సంస్కృతిని సుసంపన్నమొనర్చినారు. ఈ సాంఖ్య దర్శనాన్ననుసరించి ముముక్షువులలో సాంఖ్యము, యోగము అనే రెండు సాంప్రదాయాలు నెలకొల్పబడ్డాయి. సాంఖ్యము మోక్షధర్మాన్ని తెలిపే **తత్త్వశా**స్త్రము అని. యోగమనేది సాధనకాండ – **అనుభవం** ద్వారా సత్యాన్ని గుర్తింపజేసే శాస్త్రం అని పెద్దలు చెపుతారు. ఈ యోగ సూత్రకారుడైన పతంజలి మహర్షి యోగ దర్శనకారులందరి కంటె ప్రాచీనుడు. ఈ యోగ సూత్రాలు షడ్దర్శనాలన్నింటిలో ప్రాచీనమైన వని ప్రతీతి. చిత్త నిరోధాన్ని, అనగా మనోవ్యాపారాలను నిరోధించడం సంయమనం – ధారణ, ధ్యానం, సమాధి అనే మూడింటి సమిష్టిరూపం యోగం. ఈ నిగూఢ యోగశాస్త్ర విషయాలను ఎంతో నైపుణ్యంతో వివ రించి, ముముక్షువులకు మోక్షమార్గాన్ని సుగమం చేసారు.

వేద ప్రతిపాద్యమైన అర్థము భౌతిక విజ్ఞాన శాస్త్రములకు అందదని వేదవిదులు నొక్కి వక్కాణించు చున్నారు. తదనుగుణంగా ఎన్నో ఉదాహరణలను పేర్కొనుచున్నారు.

విద్యారణ్యులు ఉధృతంగ పొంగిపొరలి ముంచు కొని వస్తున్న ఇతర మత ప్రాబల్యమును తుడిచి వేయుటకు తమ శిష్య ప్రశిష్యులను దేశము నల్గడలకు పంపి, ప్రజలలో వేద ధర్మ రక్షా దీక్ష కలిగించు మహా కార్యము నిర్వహించి, మనకు మహోపకారము చేసి నారు. దానికై శారదాంబా సంస్థానమునందు అద్వైతమత సింహాసనాధిష్ఠితులై మన మత తత్త్వమును సకల వర్ణాశ్రమముల వారికి సుగమముగ బోధించుచు, భార తీయ సంఘమును నిష్కళంకము గావించిన పురు షోత్తముడు విద్యారణ్యస్వామి.

మాధవ, శాయణలు ఇతర మతోపద్రవముల నుండి మనదేశమును రక్షింప ప్రతిఘటించి, నిలిచిన ధీమంతులు. ఆఖరి ఊపిరి ఆడునంత వరకు వేదరక్షణ దీక్ష విడువని భగవదాంశ సంభూతులువారు. ఇంకను ప్రోలయ, కాపయ నాయకులు ఆనాడులేనిచో కోన సీమయేకాదు ఆంధ్రదేశమందలి అన్ని సీమలు ఏమయి యుండెడివో కదా!

'జీవనం నరజన్మదుర్లభం' అనగా ప్రాణికోటికి మనుష్యజన్మ అనేక జన్మార్జిత పుణ్యావశమునగాని లభింపదు నరజన్మ లభించుట దుర్లభమని శ్రీ శంకర భగవత్పాదులు చెప్పియున్నారు. అన్ని ప్రాణులకు ఇతర జన్మలలో ఆహార నిద్రా విహారాదులు తప్ప పురుషార్థములు సంపాదించుటకు అవకాశము లేదు. మనుష్య జన్మములో మాత్రమే ధర్మ, అర్థ, కామ, మోక్షములు అనగా నాలుగు పురుషార్థములు సంపా దించుట కవకాశముండుటచే మానవజన్మ మహో త్కృష్టమైనది. అందుచేతనది అతి దుర్లభమైనది. అట్టి పురుషార్థములను, స్వతంత్రముగ తెలియజేయునది. సర్వ ప్రమాణమూర్ధన్యము, స్వతః ప్రమాణమునగు వేదము తదనుచారులగు స్మృతులు, శిష్టాచారము, ఇతిహాస పురాణాదికములు ప్రమాణములు ఈ విషయము కృష్ణయజుర్వేదములో 'అరుణము' అను ప్రశ్నలో శ్రుతి స్పష్టముగా చెప్పుచున్నది. మన భరత ఖండమునందేకాక అనేక దేశములలో వేదములందెంతో ఆదరణ, భక్తి చూపబడుచున్నది.

మన భరతఖండము కర్మభూమి, ధర్మభూమి

కూడా. కనుక వేదోక్తమైన యజ్ఞయాగాది కర్మలతో పాటు ధర్మాన్ని కూడా ఆచరించాలి. అనగా ధర్మంతో కూడిన కర్మలు ఆచరించాలి. చతుర్విధ పురుషార్థముల సాధనకు ఇవి అవసరము. అందువలననే ఇహలోక సుఖసాధన యందే కాక పరలోక సుఖసాధనకు కూడా మన భారతీయులు అధిక ప్రాధాన్యత ఇచ్చుచున్నారు. జీవితం చరితార్థమయ్యేందుకు సాధనంగా భక్తిమార్గాన్ని అన్నిటికన్నా శ్రేష్ఠమని కపిల మహర్షి బోధించినాడు.

ధర్మం రెండు విధాలుగాయున్నదని బోధించి నాడు. ఇవి ప్రవృత్తిధర్మం, నివృత్తి ధర్మం. ఇహలోక సుఖాలు లభింపజేసేది ప్రవృత్తి ధర్మం. మోక్షం లేక కైవల్యం అనే పరమశాంతిని ప్రసాదించే ధర్మం నివృత్తి ధర్మం.

అర్చన, పూజ భగవంతుని రూపాన్ని లేదా అవతారాన్ని మహాపురుషులను పూజించడం, ప్రవృత్తి ధర్మంలోని భాగమే. అంతేకాక ధూప, దీప, నైవేద్యా దులతో సేవలు, పరిచర్యలుచేయడం అనగా భక్తి మార్గం. దానాలు, వ్రతాలు, ధర్మకార్యాలు, పుణ్య కార్యాలు చేయడం ఇవి కర్మమార్గం. ఈ రెండు విధాలైన ప్రవృత్తి మార్గాలు. అన్ని జాతులలోను, వివిధ రూపాలలో జరుగుచునే ఉన్నవి. నివృత్తి ధర్మం. ఇది కూడా రెండు మార్గాలలో ఉన్నది. అర్షము, అనార్షము అని. సాంఖ్య వేదాంతాదులు ఆర్ష సాంప్ర దాయమునకు చెందినవి. నివృత్తి ధర్మానికి మూల సిద్ధాంతం ఉన్నది. అదేమిటంటే, మనం సత్కర్మలు చేసి పుణ్యం సంపాదిస్తాం, సర్గలోకాదులలో సుఖాన్ని పొందుతాం. కాని స్వర్గాది లోకాలలో ఆ సుఖ భోగాల కాలం పూర్తి కాగానే తిరిగి మన పురాకృత కర్మానుసారం జన్మ ఎత్తక తప్పదు. మళ్ళీ పుణ్యాపాపాలు, సుఖ దుఃఖాలు జనన మరణాలు తప్పవు. ఈ ప్రక్రియకు అంతం ఉండదు. కావున మన భారతీయుల లక్ష్యం జనన – మరణాలు లేని మోక్షం లేదా కైవల్యం అయినది. ఈ కైవల్య కేవలం జ్ఞానంవలననే లభిస్తుంది. అనగా అవిద్య పూర్తిగా నశిం చాలి. అందుకు సమ్యక్ దర్శనం అవసరం. చిత్తస్థైర్య రూపంలో సమాధివలన వైరాగ్యం కలుగుతుంది. సమ్యక్ దర్శనంవలన అవిద్య నశించి, సంసారనివృత్తి జరుగుతుంది. అదే మోక్షం లేక కైవల్యం.

కాని ఈ జ్ఞానమంతా ప్రాణమున్నప్పుడే గ్రహించాలి. సద్గురువులను ఆశ్రయించాలి. ఈ శరీరం సమస్త జ్ఞానానికి ఆధారం. ఆధారం నశించిన పిదప సాధించగలిగినది ఏది ఉండదు. అందువలన ప్రాణి కోటిలో ప్రసరించి, ప్రేరేపిస్తున్న పరమాత్మ స్వరూ పాన్ని సాక్షాత్కరించుకొనేందుకు శరీరధారులందరూ సర్వకాల, సర్వావస్థలయందు, ఎంతో జాగరూకులై ప్రయత్నించాలి.

సకలచరాచార సృష్టిలో ఉన్న ప్రాణికోటిని స్పందింపజేస్తూ, నాశనమయ్యే శరీరంలోనే నాశనంలేని, అభిన్నంగా, అవిశ్చన్నంగా ఉన్న పరమ చైతన్యమే బ్రహ్మ – అనికేనోపనిష్యత్తు సోదాహరణంగా వివరిస్తు న్నది. సాత్వికునకే దాన్ని తెలుసుకునే అవకాశం అమితంగా ఉన్నది.

కాలప్రభావము వలన మానవులకు ధారణ ధ్యానాదులు అలవరచుకొనుటకు వ్యవధి, అవకాశము దొరకుట దుర్లభమవుతుందని, మన జీవనవిధానము లోనే మత సూత్రాలను పొందుపరచి హైందవమత మన్నది. మన జీవనవిధానలోనే వున్నదని, వేరుగా లేదని చెప్పేవారు ఆచరించిచూపి, మనకు మార్గదర్శకులై నారు. వైతాళికులెందరో మన జీవితాలను నిర్ణీతగమ్యం చేరుకునేటట్టు మనలనుత్తేజితులను చేసినారు.

మాతాపితరులను పూజించుట, నియమనిష్ఠ లతో జీవితాలనుగడపుట, ఆకలిగొన్నవారికి అన్నము పెట్టుట, ఏ ప్రాణికి హాని చేయకుండుట. చంపదగిన శత్రువు చేతికి చిక్కినా, వానికెట్టి హాని చేయక పైగా, మేలుచేసి పంపుట, శరణన్న శత్రువునైనా విడచిపెట్టుట. తనకున్నంతంలో లేనివారికి సహాయపడుట. తప్పు చేసిన వానిని క్షమించి, సంస్కరించి, వానిని మరల మన జీవన స్రవంతిలో కలియుటకు తగు ప్రోత్సాహమిడుట మున్నగు నిర్మల జీవన విధానాలతో, మానవతా దృక్పథంతో జీవితాన్ని గడపవలసినదని మన పెద్దలు

మనకు వారసత్వంగా, వారాచరించిచూపి, మనకు మార్గ దర్శకులైనారు.

ఇట్టి నిష్కల్మష జీవిత విధానంతోపాటు భగవద్భక్తిని కూడా ప్రవేశపెట్టారు, భగవంతుని యందలి ప్రేమయే. భక్తియని నారదభక్తి సూత్రాలలో తెలియ జేశారు. భగవంతుని చేరుకొనుటకు అనగా నాల్గవ పురుషార్థమైన మోక్షసాధనకు కఠోర తపస్సులు, యజ్ఞ యాగాదులు చేసి పలువురు ధన్యులైనారు. అట్టి శక్తి, సామర్థ్యములులేని మానవాళికి సహితము భక్తి యోగము వలన ముక్తి నొసంగుటకు భగవంతుని అర్చా స్వరూపమే మిక్కిలి సులభమై యుండుట చే,యోగులు, భోగులు, పండితులు, పామరులు, పురుషులు, స్త్రీలు అను బేధము లేకుండా సర్వులూ సేవించి, పూజించి, స్తుతించి, నమస్కరించి తరించుట కందుబాటులో నుండే భగవత్స్వరూపాన్ని అర్చా స్వరూపముగ మనకు చూపించియున్నారు. ఈ కార్యక్రమము కూడా భగవం తుని తోడ్పాటువలననే సాధ్యపడినదని అర్చారూపము లకు, అర్చనాదివిధులు ఏపద్ధతిలో ఏవిధముగా జరుప వలెనో చూపించవలసిన కర్తవ్యముకూడా భగవంతుని యందు ఉండెను. అందువలన ఆగమములు భగ వంతుని నుండే యుద్భవించినవి. వాటి సహాయంతో ఆధ్యాత్మిక జీవన విధానాన్ని సర్వమానవ సమా నత్వాన్ని ఎట్టి క్లిష్ట పరిస్థితులలో కూడా తప్పని జీవిత విధానాలతో మహాత్ములు గృహస్థులుగాజీవించి, మనకు ఆదర్శప్రాయంగా నిలిచారు.

మన సనాతన ధర్మసూత్రాలననుసరించి రెండు విధానాలుగ దైవారాధన చేయవచ్చును. సగుణారాధన నిర్గుణారాధన. మన మతంలోని విశిష్ట లక్షణమేమంటే మనం దైవాన్ని నిర్గుణునిగాను, సగుణునిగాను కూడా ఆరాధించవచ్చును.

నిర్గుణారాధనలో అర్చన, అభిషేకం, కీర్తనల వంటి సేవలకు అవకాశం లేదు. కాని సగుణారాధనలో అభిషేకం, అర్చన, భజన, కీర్తనలవంటి ఉపచారాలకు భగవదవతార లీలా వైభవాలను గానంచేయడానికి ఎంతో అవకాశం ఉన్నది.

పరమాత్మ కేవలము సర్వవ్యాపకుడు మాత్రమే కాదు, ఆయన సృష్టి, స్థితి, లయకారకుడు. ఆయన నామరూపాలు ధరించి సగుణుడుగా మనచే ఆరాధించ బడుచున్నాడు. గణేశుడు, కార్తికేయుడు, దుర్గ, పార్వతి, శివుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు వంటి శ్రీమహా విష్ణువుయొక్క దశావతారాలు (లేదా ఇరవైయొక్క అవతారములు) ఇలా పరమాత్మను ఎన్నో రూపాలుగా ఆరాధిస్తున్నాం. ఏదో ఒక ప్రయోజనార్థం పరమాత్మ ఒక్కొక్క రూపాన్ని ధరిస్తాడు. ధర్మసంస్థాపన చేస్తాడు. ఆయనచేసే ప్రతీపనిలో ఏదో పరమార్థాన్ని మనం చూస్తాం. శ్రీరామునిగా, శ్రీకృష్ణునిగా అవతరించి, మానవునిగా, మానవుల మధ్య మనలనుద్ధరించడం కోసం జీవించాడు. ఆయన మహాపురుషుల రూపాలలో కూడా దర్శనమిస్తాడు. తన కరుణాకటాక్షాన్ని మనమీద ప్రసరింపజేసి మనలనాశీర్వదించడానికి పరమాత్మ అవతరిస్తాడు.

మనమతంలో విగ్రహారాధన ఈకారణాల వలననే అనాదిగా వస్తున్నది. ఎన్నో దేవాలయాలు వెలసినవి.

భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు ఏదో ఒక క్లేశాన్ననుభవించేవారు, డబ్బుకావాలని కోరు కునేవారు, లేదా తమ తమ కోరికలు నెరవేరాలని కోరు కునేవారు, దైవాన్ని గురించి తెలుసుకోవాలని వాంఛించే వారు, పరమాత్మ స్వరూపజ్ఞానం కలవారు వీరందరు వారి వారి కోరికల ననుసరించి, వారి అభిరుచులకు తగిన రూపాన్ని ఎంచుకొని ఆరాధిస్తారు. ప్రతి భక్తుడు ఏదో ఒక భగవద్రూపానికి కట్టుబడి ఉండాలి ఆ రూపం ద్వారానే పరమాత్మను చేరుకోగలుగుతాడు.

ఎందరో భక్తులు, భగవంతుని సగుణోపాసనతో సేవించి, అనేక పుణ్యతీర్థాలను, దేవాలయాలను సందర్శించి, మనదేశంలో భక్తిమార్గానికి ఆచరణ యోగ్యమైన విధానాన్ని తమ జీవితాలతో మేళవించు కొని, ధన్యజీవులైవారు తరించి, మనకు మార్గదర్శ

కులైనారు. మానవులు తరించుటకు భక్తి శ్రద్ధలతో దేవాలయ, పుణ్యతీర్థ సందర్శనం, మనకొకానొక ఐహిక ఆముష్మిక జీవనవిధానంగా పవిత్ర వారసత్వంగా అందించారు.

భగవంతుడు సర్వ వ్యాపి. అంతటా వ్యాపించి వుంటాడు. ఇందున్నాడు, అందులేడు, అనడానికి అవకాశమే లేదు. ఎందెందు వెదికి చూసిన అందందు ఉంటాడు.

మరి, ఆయనకు ఇన్ని దేవాలయములు నిర్మిం చడం ఎందుకు అనే ప్రశ్నరావచ్చును. భగవంతుడు సర్వవ్యాపి అని మనలో చాలామందికి తెలుసును. ఆ పరమసత్యం మన మనసులలో పూర్తిగా నాటుకొని యుండుటలేదు. మనంచేసే పనులలో కనిపించడం లేదు అడుగడుగునా భగవంతుని గుర్తుచేయ వలసిన అవసరంకలుగుతున్నది. ఎవరికి నచ్చిన రూపాన్నివారు స్వేచ్ఛగాసేవించుకొనుటకు అవకాశము ఉన్నది.

అంతటా నిండియుండే పరమాత్మ మనకు ఎలా సాయపడగలడు? ఆయన అనుగ్రహం కోసము మనము తపిస్తుంటాం. ఆయనను ఆరాధించి, అను గ్రహంపొందాలి. ఆందుకు ఏమిచేయాలో, ఎలా చేయాలో ఆగమ సూత్రాలు తెలియజేస్తున్నాయి.

సర్వవ్యాప్తియైన పరమాత్మ అనుగ్రహం పొందా లంటే ఆలయాలు నిర్మించి, దైవశక్తిని ఒక విగ్రహ రూపంలో నిక్షిప్తంచేయాలి. అతి సులభంగా దైవాను గ్రహం పొందడానికి మన మహర్షులు నిరంతర కృషి వలన ఇది సాధ్యపడినది. అందువలన మనదేశంలో అనేక దేవాలయాలు నిర్మించడం జరుగుచున్నది. ఇవి కేవలం ఆరాధనాలయాలుకావు. విశాలమైన ప్రార్థనా మంది రాలు కూడా కావు. ప్రార్థనామందిరాలలో భక్త బృందాలు సమావేశమై, ప్రార్థనలుచేసి, ధ్యానముచేసి మనః శ్శాంతిని పొంది విడిపోతారు. కాని, దేవాలయాలలో విగ్రహాలను ప్రతిష్ఠించి, విగ్రహాలకు దైవత్వాన్ని ఆపాదిస్తారు. అంధువలన ఆ విగ్రహాలకు ఎంతో పవిత్రత చేకూరుతుంది. మొదట రాయిగా ఉండి, అనుభ వజ్ఞుడైన శిల్పిచేతిలో మనోజ్ఞమూర్తిగా మలచబడి, నిర్ణీత సమయమాసన్నమయిన తదుపరి శిల్పం దైవత్వాన్ని సంతరించుకుంటుంది. ఆ దేవతా మూర్తికి అభిషేకం, అర్చన, దీపహారతి వంటి అనేక ఆరాధనలు చేయ నారంభిస్తాం. మన మనసులలో అది రాయిగాకాక, ఆ మూర్తి దివ్యశక్తిని, చైతన్యాన్నిపొందిన పరమపవిత్ర దేవతామూర్తిగా భావించి, ఆమూర్తిలో దైవత్వాన్ని దర్శిస్తాం.

మన దేవాలయాలలో పూజాసమయంలో గంట వాయిస్తాము. ఇలా చేయడంవలన ఆలయ ఆవరణనుండి దుష్టశక్తులు పటాపంచలవుతాయి. ఇతర దుష్టశబ్దాలు మన చెవినిపడకుండా ఉంటాయి. మన ఇంట్లో చేసే పూజ మన కుటుంబ క్షేమం కొరకు మాత్రమే కనుక ఈ పూజ మన వీలునుబట్టి, మనకు నచ్చిన, వచ్చిన రీతిలో జరుపుతాము. కాని దేవాలయ ములలో నిర్వహించే పూజాకార్యక్రమాలు సమస్త ప్రజా సంక్షేమం కొరకు జరుపబడతాయి, అందువలన సంగీతము, నాట్యం, గానంవంటి ఎన్నో సందడు లుంటాయి. పండుగదినాలలో ఉత్సవమూర్తిని పురవీధు లలో ఊరేగించి, ఎన్నో వేడుకలుచేసి, కారణాంతరాల వలన దేవాలయానికిరాలేని స్త్రీలకు, వృద్ధులకు దైవ సాన్నిధ్య అనుభూతిని కలిగించడానికి ప్రయత్నం జరుపుతాము.

దైవాన్ని రాజధిరాజుగా తలపోసి, అందుకు అనుగుణంగా ఛత్రం, ఛామరం, వాహనంవంటి రాజోప చారాలు, పూజోపచారాలు సమర్పిస్తాం. మనం ఆరాధించినపుడు ఆ విగ్రహంలో ఆపాదించబడిన దైవ శక్తి మన దారిద్ర్యాన్ని నిర్మూలిస్తుంది. దుష్టశక్తులను, అట్టి ఆలోచనలను, దరికి రాకుండా పారద్రోలుతుంది. ఇలా దైవత్వం మూర్తీభవించిన దివ్యసుందర, మంగళ విగ్రహమైన ధ్యానమూర్తిని మన దేవాలయాలలో దర్శిస్తాం.

హిందూ ధర్మంలో మాత్రమే సాధ్యపడే ఇట్టి దైవారాధనలు మనకు ఎంతో ప్రాముఖ్యమైనవి. మనం విగ్రహానికి సాష్టాంగనమస్కారం చేసి, ఆ దేవతామూర్తిని ప్రార్థనచేస్తున్నపుడు అది కేవలం ఒక రాయి అని

ఎన్నడూ తలపోయం. ఆ విగ్రహంలోని దేవతామూర్తిని మన సంరక్షకునిగా, సృష్టి, స్థితి, లయకారకునిగా భావిస్తూ అర్చిస్తాము. దేవాలయానికి వెళ్ళి దైవాన్ని అర్చించగానే మనశ్శాంతిని పొందుతాము.

సగుణారాధనలో మనశ్శాంతినీయగల శక్తి ఉన్నదని మన అనుభవములో తెలిసికొన్నాము. దేవాలయాలు మనదేశ పవిత్ర వారసత్వసంపదగా మన పెద్దలు మనకందించినారు. అందువలన దేవాలయాలలో నిత్యపూజా కార్యక్రమాలు జరిగేటట్లు, ఆలయ మర్యాదలు, కర్మకాండ, ఆచారాలు, సంప్రదాయాలు శ్రద్ధతో జరిగేటట్లుచూసి, దేవాలయాల పవిత్రతను, దివ్యత్వాన్ని పెంచి, పోషించి కాపాడవలసిన బాధ్యత మనందరిది. దేవాలయాల పరిసరాలు పరిశుభ్రంగా ఉండేటట్లు, నిత్యం దీపారాధన విధిగా జరిగేటట్లు చూడాలి.

దేవాలయం దివ్యత్వం నెలకొన్న స్థలం అగుట వలన మనం దేవాలయాల పరిసరాలలో ఉన్నపుడు కొన్ని నియమాలను తప్పనిసరిగా పాటించి తీరవలసిన అవసరం ఉన్నది. దైవానికి ఉద్దేశించిన ఏ వస్తువులను మనం స్వప్రయోజనాలకు ఉపయోగించరాదు.

దేవాలయానికి వాహ్యాళికి వెళ్ళినట్లుగా వెళ్ళరాదు. దేవాలయ పరిసరాలలో మలమూత్ర విసర్జన చేయరాదు. ఉమ్మివేయరాదు, తుమ్మరాదు, చీదరాదు, తాంబూలం సేవించరాదు. పండ్లులేక ఇతర ఆహార పదార్థాలు తినరాదు. కాళ్ళు జాపుకొని కూర్చోవడం నిద్రపోవడం చేయరాదు. తల దువ్వుకోవడం, ముడి పెట్టుకోవడం, తలపాగా ధరించడం, నైర్మాల్యం మీద నడవటం, విగ్రహాలు, ధ్వజస్థంభ నీడలో నడవడం, విగ్రహాలను తాకడం వంటివి చేయరాదు. విగ్రహాల పూజలను చేసే వ్యక్తులను తాకరాదు. ఆలయ ప్రదక్షణలు చేసేటపుడు ఒకటి రెండు ప్రదక్షణలతో ముగించరాదు. కనీసం మూడుసార్లు ప్రదక్షిణం చేయాలి. అభిషేకం నైవేద్య సమర్పణ జరుగుతున్నపుడు దైవ దర్శనం చేయరాదు. దైవము నిటారుగా లేని సమయాలలో, దేవాలయములో ప్రవేశించి ఆరాధన చేయకూడదు. ప్రధాన ద్వారం నుంచి కాకుండా ఇతర దారుల ద్వారా ఆలయప్రవేశం నిషిద్ధం.

కర్పూరహారతిని దర్శించడానికి రిక్తహస్తాలతో పోరాదు. కానుకలు సమర్పించి దైవదర్శనం చేసికొని దైవానికి వెనుకభాగం చూపకండా తిరిగి రావాలి.

నమస్కారంచేస్తూ, స్తోత్రాలుపఠిస్తూ సాధ్యమైనంతవరకు బేసిసంఖ్యలో ప్రదక్షిణలు చేయాలి. ఈశ్వరునికి మూడు నుంచి ఇరవైఒక్క సార్లు బేసిసంఖ్యలోను, అమ్మవారికి నాలుగుసార్లు నమస్కారం చేస్తూ ప్రదక్షిణచేసి తిరిగి వెళ్ళాలి.

ఆలయాలలో పశువులనుంచరాదు. అందువలన వాటి యజమానికి, ఆవూరి పెద్దకు ఎంతో మనః క్లేశము దాపురిస్తుంది. ఆలయప్రాంగణంలో ధాన్యం, లేక ఇతర ధాన్యాలు ఎండబోయడం, గడ్డి ఉంచటం చేయరాదు.

ఈ నియమాలు భక్తుల సంక్షేమం కొరకు ఆలయాల పవిత్రతను, సంప్రదాయమును కాపాడేందుకు విధించిబడినవి. ఈ నియమాలను పాటించుచూ, సదా దేవాలయాలను సందర్శిస్తూ, మన పవిత్ర వారసత్వ సంపదలైన మన దేవాలయాల పవిత్రతను రక్షించి కాపాడవలసిన గురుతర బాధ్యత మనందరిపైన ఉన్నది.

**ఎల్లప్పుడు దేవుని స్మరింపుము**

# అగ్నిదేవాలయాలు

పార్శీలు, లేక పారశీకులు (జొరాష్ట్రియనులు) అగ్నిదేవుని ఆరాధిస్తారు.

ఎంతో వేడుకగాను, జాగ్రత్తగాను, శ్రమతోను కూడిన పూజాపద్ధతిలో అగ్నిదేవాలయాలను ప్రతిష్ఠ, సంస్కారము లేక నివేదనము 'అటార్ లేక 'అటాష్' (అనగా అగ్నిదేవుని పవిత్రముచేయుట) జరిపించెదరు.

మూడు (విధములైన) తరగతుల దేవాలయములు కలవు. అగ్ని సేకరణ, పవిత్రముచేయుట మరియు ప్రతిష్ఠ లేక నివేదనము చేయుట. అంతేకాక అగ్నులసంఖ్య ననుసరించి కూడ తరగతి నిర్ణయము ఆధారపడి వుంటుంది. 'అటాష్‌బెహ్రామ్' అనగా జయాగ్ని ఆపేరుగల దేవాలయములో ప్రతిష్ఠించినది. 'అటాష్ అడరన్ లేక 'దారేమెహర్ కరుణాద్వారము మరియు 'అటాష్‌దాడ్గా' పార్శీల ఇండ్లలో మూడురకములుగా వుంటుంది. అగ్నిదేవుని నివేదన. అయితే ఇండ్లలోని అగ్నికి ప్రత్యేక సంస్కారములేక నివేదన అవసరములేదు. సాధారణంగా వంట యింటిలోని నిప్పును సేకరించి పూజా నంతరము తిరిగి వంటగదికి చేర్చెదరు.

అయితే 'అటాష్‌బెహ్రామ్' నందు నిప్పు పదహారు వేర్వేరు అగ్నుల సముదాయమును పవిత్రముచేసి, నివేదించి ప్రతిష్ఠచేస్తారు. మొదట నిప్పు మండుతున్న ప్రేతము నుంచి సేకరిస్తారు. ఈ నిప్పును తొంభై యొక్క మార్లు పవిత్రం చేస్తారు. మిగతా పదిహేను నిప్పుకణములు పార్శీల కుమ్మరి, కమ్మరి, ఉప్పర, కంసాలి, సైనికుడు, బాటసారి, పశులకాపరి వద్దనుంచేకాక పట్టణ లేక పల్లె యందలి ముఖ్యుని నుంచి తదుపరి (మెరుపు) పిడిగు నుంచి, పూజారి మరియు సాధారణ పార్శీ పౌరుని నుంచి సేకరిస్తారు. అయితే మెరుపు పిడుగు నుంచి నిప్పు సేకరించడం కష్టమవుతుంది. ఏ చెట్టుమీదో ఇంటి మీదో పడిన పిడుగునుంచి నిప్పు సేకరించాలంటే ఎన్నో సంవత్సరాలు పడుతుంది. అప్పుడే అగ్నిదేవాలయ ప్రతిష్ఠ జరుగుతుంది.

ముందుగా నిర్ణయించిన స్థలములో తొంభై యొక్క చిన్న గోతులు తవ్వుతారు. ఇవి ఒక్కొక్క డుగు ఎడంలో తవ్వుతారు. మొదట ప్రేతాగ్నిని తీసి మొదటి గోతిలో వేస్తారు. నిర్ణీత మంత్రములతో పూజలు చేస్తారు. గంధము, ధూపము వేస్తారు. గాలివలన అగ్ని ప్రజ్వరిల్లి రెండవగోతిలో గంధము ధూపము ప్రజ్వరిల్లుతుంది. తర్వాత మొదటి గోతిలోని నిప్పును చల్లారి పోనిస్తారు. ఆ మాదిరిగా నిర్ణీత మంత్రోచ్చారణతో పవిత్రమైన తొంభై ఒకటవ గోతిలో నిప్పు పరమపవిత్రమవుతుంది. ఈ కర్మ కాండ ప్రేతాగ్నిని పవిత్రం చేయడమే.

తర్వాత కావలసినవి పదిహేను నిప్పు కణికలను పవిత్రం చేస్తారు. అయితే నిప్పు తెచ్చిన చోటును ప్రాతి పదికగా ఎన్నిసార్లు నిప్పును మంత్రోచ్చారణతో పవిత్రం చెయ్యాలో నిర్ణయిస్తారు.

ఇప్పటి పద్ధతి ననుసరించి నిప్పును పవిత్రం చేయుటకు అగ్ని దేవాలయాల్లో ప్రత్యేకంగా గదిని కేటాయిస్తారు. పవిత్రం చేయవలసిన నిప్పుకణికలను కొన్ని "అఫర్గన్"లు కుండ వంటి దానిలో నిలువచేస్తారు. అయితే పవిత్రం చేయ వలసిన నిర్ణీతమైన పద్ధతిమాత్రం మార్పులు చేయరు.

పదహారు నిప్పు కణికలను ప్రతిదానిని పవిత్రం

చేసి, నివేదన లేక ప్రతిష్ఠచేసి అదేరోజు అన్ని అగ్ని కణములను ఒకటిగా కలుపుతారు. మొదటగా 'అహునావైతి' మంత్రము చదివి 'ముక్తాద్' చనిపోయిన మహనీయుల గౌరవార్థము చదువుతారు.

పెద్ద 'అఫార్గన్ (కుండలేక మూకుడువంటి) సిద్ధముచేసి పవిత్రముచేసిన ప్రేతాగ్నిని పెద్ద గరిట వంటి సాధనముతో అందు వేస్తారు. ఆ తరువాత మిగతా పదిహేను పవిత్రమైన నిప్పు కణికలను మొదటిదానిలో చేర్చుతారు. ఇద్దరు పూజారులు ఈ కార్యక్రమాన్ని నిర్వ హిస్తారు. ఇలా పవిత్రంచేసిన అగ్నిని పవిత్రీకరించిన స్థలమునకు అనగా అగ్ని దేవాలయమునకు తీసుకొని వెళ్తారు.

ఇప్పుడొక కొత్త అగ్నిదేవాలయము ప్రతిష్ఠ జరిగింది. మూడురోజులు పూజలు జరుపుతారు. గౌరవ పురస్సరముగా, ఆనాటి దినమునకు సంబం ధించి దైవప్రీతికి పూజలు జరుపుతారు. అగ్ని దేవాలయ ప్రతిష్ఠ జరిగినదని చెబుతారు.

అలా పవిత్రము చేసిన నిప్పు మంత్రో చ్చారణతో పైకితీసి, అగ్నిదేవాలయములో ప్రత్యే కించిన గదిలోకి వూరేగింపుగా తీసుకొనివస్తారు. గదిమధ్యలోనున్న 'అఫార్గన్ లో యీ నిప్పును వేస్తారు. 'టక్తా'రాతితో కట్టిన పీఠము లేక సింహాసనము మీద పెడ్తారు. తదుపరి గంధపు చెక్కలు, ధూపమువేసి, అటాష్న్యయేష్' మంత్రములను అగ్నిదేవుని గౌరవార్థము చదువుతారు.

ఆ తర్వాత 'జషాన్ పండుగ చేస్తారు. ఇది అగ్ని దేవాలయమునకు ముందు గదిలో చేస్తారు. 'తక్తనాశిని' ప్రతిష్ఠ పూర్తి అవుతుంది.

అలాగున పవిత్రము చేసిన అగ్నిని ఆరనివ్వరు. ఆ పవిత్రాగ్ని ఎదురుగ రోజుకు ఐదు సార్లు (24 గంటలు 'గాహస్' గా విభజిస్తారు) ప్రత్యేక పూజలు చేసి ఆ అగ్నికి గంధపు చెక్కలు, ధూపము వేస్తారు. ప్రత్యేక గంట వాయిస్తారు. ఈ గంట వలన దుష్ట గ్రహపిశాచములు పారిపోతాయని నమ్మకము దీనిని 'బూయి' పూజ అంటారు.

జొరాష్ట్రియన్ అగ్నిదేవాలయమునకు వెళ్ళి నపుడు ముందు ముఖము కడుక్కుని (నూతి నీళ్ళతో ప్రత్యేకమైన పాత్రలో వుంచినవాటిని) తూర్పు దిక్కుగా 'కుష్టి' అనే మంత్రం చదువుతారు. ప్రార్థన చేసేటప్పుడు తలను పూర్తిగా గుడ్డతో కప్పు కుంటారు.

తరువాత ప్రత్యేక గదిలో గల పవిత్రాగ్నికి తల వంచి 'అషిమ్‌వాహు' అనే మంత్రాన్ని చదువుతారు. తరువాత మోకాళ్లపై నిలచి పూజారి యిచ్చిన పవిత్ర భస్మాన్ని కొంత నోటిలో వేసుకుని మరి కొంత కనుబొమల మధ్య పెట్టుకుంటారు. తాను తెచ్చిన గంధపు చెక్క పూజారికిస్తారు.

ప్రతి యింటిలో చిన్న 'అఫర్గన్ వుంటుంది. పవిత్రాగ్నిని రగల్చి ప్రతిగదికి పూజానంతరం తీసికొని వెళ్తారు అందుచేత పారశీకునికి పవిత్రాగ్నికి ఎడతెగని సంబంధం వుంది. కుటుంబానికి పూజారి అవసరం వుంది.



*(సేకరణ : ది పార్శీస్ పేజి 36 - 40 నేషనల్ బుక్ ట్రస్టు, న్యూఢిల్లీ ప్రచురణ నుంచి గ్రహించబడినది.)*



శ్రీ వరాహలక్ష్మీ నరసింహస్వామి దేవాలయము
సింహాచలం – విశాఖ జిల్లా



# శ్రీ దుర్గా మల్లేశ్వరస్వామివార్ల దేవస్థానం
## ఇంద్రకీలాద్రి
## విజయవాడ–520 001

పరమ పవిత్ర కృష్ణవేణీ నదీతీరమున, ఇంద్రకీలాద్రి పర్వత గర్భమున సర్వదేవతా స్వరూపిణియై వెలసిన పరాశక్తియే శ్రీకనకదుర్గ మహాదేవి. లోకకంటకుడైన మహిషాసురుని, రోషభీషణ రూపముతో మర్దించి, మహా భక్తుడైన ఇంద్రకీలుని అనుగ్రహింప స్వయం వ్యక్తముగా ఆవిర్భవించినదీ జగన్మాత శ్రీకనకదుర్గ.

. అగస్త్యాది మహర్షులు, పరుశురామ, శ్రీరామ, శ్రీ కృష్ణాది అవతారపురుషులు పంచపాండవులేకాక, శ్రీ కృష్ణ దేవరాయలాది మహారాజులు అర్చించి అభీష్ట సిద్ధులు పొంది ధన్యతనందిరి.

కలియుగమున ఇంద్రకీలాద్రికి వేంచేసిన శ్రీ జగద్గురు ఆదిశంకరులు అమ్మవారి రౌద్రరూపమును శాంతింపజేయుటకు శ్రీచక్రప్రతిష్ఠగావించినప్పటి నుంచి సమయాచార పద్ధతిని, వైదిక మార్గమున పూజాపునస్కార ములన్నియు శ్రీ చక్రమునకే జరుపబడుచున్నవి.

శ్రీ మాధవవర్మయను మహారాజు ధర్మనిరతికి మెచ్చి కనకవర్షము కురిపించుటవలన శ్రీ కనకదుర్గ అయినట్లును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే కాక ఇంద్రాది దేవతలు, ఎందరో మహాభక్తులు త్రికరణ శుద్ధిగా పూజ గావించువారికి బంగారుకాంతులు చిమ్ము రూపముతో కనిపించుట వలన శ్రీ దుర్గాదేవి కనకదుర్గయైనట్లు ప్రతీతి. ఈమె భక్తులపాలిటి కల్పవల్లి. సకల ఆపదల నుండి రక్షించు కరుణామూర్తి శ్రీ కనకదుర్గమహాదేవి. ప్రతి నిత్యము విశేషసంఖ్యలో భక్తులువచ్చి శ్రీ కనకదుర్గ మహాదేవిని సేవించుచున్నారు. ప్రత్యేక అనుబంధ దేవాలయము శ్రీ మల్లేశ్వరస్వామివారిది. తొలుత యీ శివలింగమూర్తి చతుర్ముఖ బ్రహ్మదేవునిచే ప్రతిష్ఠింపబడి, మల్లెపూవులతో పూజింపబడెను. విధాతపూజకు పరమ శివుడు మెచ్చి చతుర్ముఖునకు బ్రహ్మపదవినిచ్చెను. మల్లె పూవులతో పూజింపబడుటవలన ఈ స్వామికి మల్లేశ్వరు డను పేరు వచ్చెను.

ద్వాపర యుగమున పాండవ మధ్యముడైన అర్జునుడు ఈస్వామి కటాక్షమువలన పాశుపతాస్త్రమును పొందినట్లు పురాణ ప్రసిద్ధి కలదు. ఆదిశంకరులు ఇంద్ర కీలాద్రికి వేంచేసినపుడు, పూజాపునస్కారములు లేక భూ స్థాపితమైన యీ శివలింగము వెలికి తీయించి పునః ప్రతిష్ఠ గావించెను.

ఆనాటి నుండి కళ్యాణమహోత్సవములు, నిత్య దీప, ధూప, నైవేద్యములు, వసంత నవరాత్రి మహోత్సవ ములు వైభవోపేతముగ జరుపబడుచున్నవి.

ఎందరో మహారాజులేకాక తానీషా మొదలగు ప్రభువులు, వారి మంత్రులు అక్కన్న మాదన్నలు బ్రహ్మోత్సవములు జరిపించి అమ్మవారిని సేవించినట్లు శాసనములు కలవు. తిరుమల నాయకుని దర్శించి,

తదుపరి శ్రీ కనకదుర్గమ్మను సేవించినగాని యాత్ర పూర్తి కాదని భక్తుల నమ్మిక. ఈమె శ్రీ వేంకటేశ్వరుని సోదరిగా ప్రతీతి. అట్టి శ్రీ కనకదుర్గ మల్లేశ్వరస్వామివార్లను దర్శించి, అర్చించి ఆయురారోగ్యములు పొందుదురుగాక.

## శాశ్వత పూజా వివరములు

శాశ్వతముగ సంవత్సరములో ఒక రోజు లక్ష కుంకుమార్చన చేయుటకు. రు. 3500.00

శాశ్వతముగ సంవత్సరములో ఒకరోజు శాంతి కళ్యాణము చేయుటకు. రు. 3500.00

శాశ్వతముగ ఒక రోజు పల్లకిసేవ ............................................... రు. 1000.00

| సంవత్సరములోవచ్చు | 52 శుక్రవారములు | 52 సోమవారములు |
|---|---|---|
| అమ్మవారికి శాశ్వతసహస్రనామ పూజలు .... | రు. 4500.00 | ..... |
| అమ్మవారికి శాశ్వత అష్టోత్తర పూజలు .... | రు. 3500.00 | ..... |
| అమ్మవారికి ఒక సంవత్సరంలో సహస్రనామ పూజలు ... | రు. 416.00 | ..... |
| అమ్మవారికి ఒక సంవత్సరంలో అష్టోత్తర పూజలు .... | రు. 312.00 | ..... |
| శాశ్వతముగ శ్రీ మల్లేశ్వరస్వామికి అభిషేకము ..... | .......... | రు. 3500.00 |
| అభిషేకము మల్లేశ్వరస్వామికి ఒక సంవత్సరంలో ..... | .......... | రు. 312.00 |

సంవత్సరంలో ఒక శుక్రవారముగాని మరియే యితర రోజైనా శాశ్వత సహస్రనామార్చన చేయించుకొనుటకు ...... } రు. 116.00

సంవత్సరములో కోరిన ఒక శుక్రవారముగాని మరియే యితర రోజునైనను అష్టోత్తరనామార్చన శాశ్వతముగ చేయించుకొనుటకు } రు. 60.00

గమనిక : పై తెలిపిన పూజలు చేయించుకొను భక్తులు, వారు పంపు పైకమును కార్యనిర్వహణాధికారి, శ్రీ దుర్గా మల్లేశ్వర దేవస్థానము, విజయవాడ-1 వారి పేరున పోష్టుద్వారాగాని ఎం.వో ద్వారాగాని డి.డి.ల ద్వారాగాని పంపినవారికి పూజలు జరిపించి శ్రీ అమ్మవారి కుంకుమ ప్రసాదమునువారి వారి చిరునామాకు పోష్టు ద్వారా పంపబడును.

ఫోన్లు : ఆఫీసు : 73600
ఇ.వో : 62823

చిర్లంచెర్ల రామయ్య బి.ఎ.
కార్యనిర్వహణాధికారి

శ్రీ దుర్గా మల్లేశ్వరస్వామి వార్ల దేవస్థానం
ఇంద్రకీలాద్రి, విజయవాడ : 520001.



శ్రీ శనీశ్వర దేవాలయము : మందపల్లి



శ్రీ మహానందీశ్వర దేవాలయము : మహానంది



శ్రీ సూర్యనారాయణమూర్తి దేవాలయము
అరసవల్లి - శ్రీకాకుళం జిల్లా



# శ్రీ వరాహ లక్ష్మీ నృసింహస్వామి దేవస్థానం

**సింహాచలం . 530028**

**విశాఖపట్నం జిల్లా**

**(ఆంధ్రప్రదేశ్)**



శ్రీ నారసింహుని దివ్య క్షేత్రములలో 'సింహాచలము' అతి ముఖ్యమైనది. శ్రీ నృసింహుడు ప్రహ్లాదుని రక్షించుటకై సింహాద్రియందు ఆవిర్భవించెను.

పదకొండవ శతాబ్దమునుండియు సింహాచల దేవస్థానము ప్రాచుర్యము వహించుచున్నట్లు చారిత్రకాధారములున్నను, శ్రీ వేదవ్యాస భట్టారక విరచిత జైమిని మహర్షి ముఖతః ప్రాచుర్యము వహించిన స్కాందపురాణ వివరణననుసరించి యీ సింహాచల క్షేత్రమతి ప్రాచీనమైనదని తెలియుచున్నది.

శ్రీహరి నాల్గవ అవతారమై శ్రీ నరసింహుడు వెలసిన కొండయిది. సింహరూపమువలె యున్నందున కొండ సింహాచల నామమున ప్రసిద్ధమైనది.

ఆంధ్రదేశమునగల అతి ప్రాచీన వైష్ణవాలయ మీ సింహాచలము. హిరణ్యకశిపుడు తన తనయుడైన ప్రహ్లాదుని సముద్రమున త్రోయుడని భటుల కాజ్ఞాపించిన వారట్లుచేయగ, 'త్రాహి' 'రక్షింపుము' అని ప్రహ్లాదుని ఆర్తనాదము విని భక్తుని రక్షించుటకు శ్రీహరి నృసింహుడై, గిరిపైకురికి సముద్ర గర్భముననున్న ప్రహ్లాదుని ఒడ్డున చేర్చి అభయ మొసగి హిరణ్యకశిపు నివాసస్థలమునకు పంపి వైచెను. భక్త ప్రహ్లాదుని ప్రార్ధన నంగీకరించి హిరణ్యాక్షుని సంహరించిన వరాహరూపముతోను, తండ్రిని చంపిన నారసింహుని రూపముతోను కూడిన వరాహ నారశింహుని రూపమున సాక్షాత్కరించి వెలసిన దివ్య ప్రదేశ మిది. భగవదాజ్ఞచే నేటికిని ఇచట గంగ, యమున, సరస్వతి మొదలగు నదులు ధారారూపముగా ప్రవహించు చున్నవి.

భక్తాగ్రణియగు ప్రహ్లాదునిచే ఆరాధింపబడుచున్న నారసింహరూపియగు శ్రీహరి నిలయమగు నీ సింహశైలము, ప్రహ్లాదుని అనంతరము శిథిలమైన కొంత కాలమునకు షట్చక్రవర్తులలో ప్రసిద్ధిగాంచిన పురూరవ చక్రవర్తి పుట్టలోనున్న స్వామిని దర్శించి పూజించెను. ఆ దినమే వైశాఖశుద్ధ తృతీయ (అక్షతృతీయ) కావున నేటికి, భగవదాజ్ఞనుసారమూ పుట్టకు బదులుగా వేయబడుచున్న చందనము ఒలిచి భక్తులు నారసింహుని నిజరూపమును దర్శించే మహద్భాగ్యమునొందుచున్నారు.

14-15వ శతాబ్దములో (1428) కళింగదేశ దిగ్విజయ యాత్ర ముగించి సింహాద్రినాథుని దర్శించి అనేక అమూల్య కానుకలందజేసిన శ్రీకృష్ణదేవరాయల 'విజయ ధ్వజము', వారి శిలా శాసనముకలదు. కుళోత్తుంగ చోళుడు కట్టించిన మంటపాలు, స్థూపాలు ఇచ్చట కలవు.

సంవత్సరాంతమున మంత్రపవిత్రమై విసర్జింపబడి భద్రపరచిన 'నిర్మాల్యచందనము'. అశేష భక్తజన సందోహమునకు మహాప్రసాదమగుచున్నది.

ఆంధ్రదేశములో దక్షిణ కాశీక్షేత్రముగ ప్రసిద్ధి చెందుచు, భక్తుల పాలిట కల్పవృక్షమైన శ్రీ వరహాలక్ష్మి

నృసింహస్వామి వారిని దర్శించి, సింహాచలదేవాలయ అపురూప శిల్పకళా వైభవమును తిలకించి కోరికలీడేర్చు కొని స్వామివారి కరుణాకటాక్షములకు పాత్రులు కాగలరని ఆకాంక్ష. మరియు సంతాన గోపాల యంత్రప్రతిష్టితమైన, భక్తులపాలిట కల్పతరువు "కప్పస్థంభము" ఎంతో పేరు ప్రతిష్ఠల నార్జించినది. దేవస్థానంవారు సింహాచల క్షేత్రములో నిత్యము 'నాల్గువేదముల పారాయణము చేయంచుట ప్రత్యేకత కల్గియున్నది. శ్రీ నృసింహస్వామి దర్శనం శత్రునాశనం, పోరాట విజయం, జబ్బులు నయంకావడం, శుభం జరగడం మహిమలుగా ప్రసిద్ధి చెందినది.

ఉదయం 7 గంll నుండి సా 4 గంll వరకు సర్వదర్శనం.

సాయంత్రం 4 గంl నుండి 6 గంl వరకు ధర్మదర్శనం.

సాయంత్రం 6 గంl నుండి 7 గంl వరకు సర్వదర్శనం.

రాత్రి 8 గంl నుండి 9 గంl వరకు సర్వదర్శనం.

యాత్రికుల సౌకర్యార్థము, కొండపైని, కొండ దిగువను సత్రములు, గదులు, భోజన ఫలహారశాలలు కలవు. కొండపైన విరాళ కుటీరములు కూడ కలవు.

దేవస్థానము వారిచే కొండ దిగువ నుండి స్వామి కొండపైకి ఉ॥ 6 గంl నుండి రాత్రి 9 గంl వరకు మరియు ఉత్సవాదుల యందు నిరంతరము బస్సులు నడపబడు చున్నవి.

సింహాచల దేవస్థానమునకు దత్తతగా యున్న విజయనగర శ్రీ పైడితల్లి అమ్మవారి దేవస్థానము, శ్రీ రామతీర్థ దేవస్థానము, అనంత పద్మనాభస్వామి దేవస్థానములు దర్శించుటకు సింహాచలము నుండి బస్సు సౌకర్యము కలదు.

## ముఖ్య ఉత్సవములు :

చైత్ర శుద్ధ ఏకాదశి : శ్రీ స్వామివారి కళ్యాణ మహోత్సవములు. వైశాఖ శుద్ధ తదియ : (అక్షతృతీయ) చందనోత్సవము. స్వామివారి నిజరూపదర్శనము. ఇంకను నృశింహ జయంతి, వైకుంఠ ఏకాదశి, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ పూర్ణిమలు. (చందన సమర్పణోత్సవములు) భోగి (గోదా కళ్యాణము) కనుమ (మకరివేట) విజయదశమి (జమ్మివేట) పుష్యబహుళ అమావాస్య (తెప్పోత్సవం) అతి ముఖ్యమైనవి.

**స్వామిని దర్శించుటకు సుదూర ప్రాంతముల నుండి విచ్చేయు యాత్రికుల సౌకర్యార్థము, ప్రతినిత్యము, వదాన్యుల సహకారముతో, ఉచిత మధ్యాహ్న భోజన పథకము నడుపబడుచున్నది.**

ప్రత్యేక పూజలు జరిపించుకోరువారు ముందుగ తెలియపరచవలెను.

శ్రీ స్వామిని దర్శించి, సేవించి తరించండి.

**డా॥ పి. వి. జి. రాజు**
అనువంశిక ధర్మకర్త

**జి. వి. నరసింహమూర్తి**
బి.ఎస్.సి., బి.ఎల్.
కార్యనిర్వహణాధికారి

ఫోన్లు : కార్యాలయము : 58298 విశాఖపట్నం
దేవాలయం : 9563 సింహాచలం
ఇల్లు : 9562



శ్రీ నరసింహస్వామి దేవాలయము
అహోబిలం



శ్రీ భీమేశ్వర, మాణిక్యాంబ దేవాలయము
ద్రాక్షారామం

# దేవాలయాలు : వాస్తుశాస్త్రము

మత్స్య పురాణంలో పద్దెనిమిదిమంది వాస్తుశాస్త్ర నిపుణులను పేర్కొనడం జరిగినది. వారిలో భృగు, అత్రి, వశిష్ట, విశ్వకర్మ, మయ, నారద మొదలగువారు ముఖ్యులు. ఉత్తర భారతాన 'విశ్వకర్మ' దక్షిణభారతాన 'మయుడు' దైవవాస్తుశాస్త్రజ్ఞులుగ తరచుగా పేర్కొనడం జరుగుతున్నది.

వైదిక కర్మకాండలో విగ్రహారాదనగాని, దేవాలయ నిర్మాణంగాని చెప్పబడలేదు. కాని వేద సంబంధము లేని నాగులు, యక్షులు మొదలగు దేవతల యొక్క విగ్రహములను దేవాలయాలలో పెట్టి పూజలు చేయడం జరిగినది. దరిమిలా వేదవాఙ్మయములో దేవతా విగ్రహాలు చోటు చేసికొన్నవి.

గుప్తులకాలంలో విగ్రహారాధన, దేవాలయాలు అభివృద్ధి చెందినవి.

శిల్పవాస్తు శాస్త్రముల గురించి విపులముగా తెలియజెప్పే తంత్ర సముచ్ఛయము, మానసార, శైవ వైష్ణవ ఆగమములు దైవ స్వరూప నిర్ణయమేకాక విగ్రహ నిర్మాణము ప్రతిష్ఠ, దేవాలయమునందు పూజా విధానము తెలియజేయుచున్నవి. భోజుని 'సమరాంగణ సూత్రధారలో పలువిధములైన దేవాలయములను గూర్చి చర్చించడము జరిగినది. మేరు, మంధర, కైలాశ, నందన, సర్వతోభద్ర మొదలుగా గల ఇరవై వరకు పేర్కొనడం జరిగినది. 'విశ్వకర్మ ప్రకాశ' అనే వాస్తుశాస్త్రగ్రంధంలో కూడ వీటిని పేర్కొనడం జరిగినది. తిరునవుక్కరుసు అనే తమిళ వాఙ్మయ కర్తకూడ అనేక దేవాలయాలను పేర్కొన్నాడు.

దేవాలయము, దేవతాయనము, మందిరము, ప్రాసాదము, దేవగృహము మొదలగు పేర్లు దేవాలయమునకు గలవు.

దేవాలయములు లేక దేవగృహములు బహుళ రాజ మందిరములను దృష్టియందుంచుకొని రూపొందించినట్లు కనబడుచున్నది. ఎన్నో అంతస్థులతో దేవాలయ నిర్మాణము రాజ ప్రాసాద నిర్మాణమును అనుకరించినట్లు కనబడుచున్నది. సమరాంగణ సూత్రధారలో పన్నెండు అంతస్థుల నిర్మాణం వాటి ప్రమాణము (కొలతలు) నిర్దేశింపబడినది. 'శిల్పరత్న' లో ఏడు అంతస్థుల ద్వార గోపుర నిర్మాణము నిర్దేశింపబడినది. కాశ్యపశిల్ప శాస్త్రంలో పదహారు అంతస్థులతో ద్వార గోపుర నిర్మాణము విపులీకరింపబడినది.

బ్రహ్మసంహిత దేవాలయాలు అడవి చివరల యందుకాని, పర్వత సానువుల యందుకాని, నదుల గట్టుల పైన, పట్టణాలలో పూలతోటల నడుమ నిర్మించవచ్చునని పేర్కొన్నది.

వాస్తుశాస్త్ర వివరణ ననుసరించి దేవాలయాలు సర్వజగత్తును స్ఫురింప జేయుచున్నవి. వాస్తుశాస్త్రాంతర్గత అగ్నిపురాణము ప్రకృతికి దేవాలయానికి సామ్యము కలదని చెప్పుచున్నది. దేవాలయములోని మూల విరాట్, మూలశక్తితో పరమపురుషునిగా పేర్కొన్నది. దేవాలయం అట్టి పరమపురుష రూపమని భావించబడినది. అగ్నిపురాణ వివరణ ననుసరించి దేవాలయ శిఖరము ఆపరమ పురుషుని శిరమని, ద్వారము నోరని, కలశము శిరోజములని, గ్రీవము గొంతని, శుఖానాశ ముక్కని భద్రులు చేతులని, వేది భుజములని స్తంబాలు చరణములని ప్రసాదములేక దేవ పీఠము, శివశక్తుల సమ్మేళనమని తాత్త్విక ప్రమాణములు పృధివి నించి, శక్తివరకు వ్యాపించుచున్నవని నిరూపిస్తున్నది.

దేవాలయ నిర్మాణమునకు ముందు భూపరిమాణము ననుసరించి సమతల పటము తయారు చేయవలసి వుంటుంది. దీనిని వాస్తు మండలము అని అంటారు. అయితే మిగతా క్షేత్రగణిత ప్రమాణములకంటె సమచతురస్రము మన దేశ వాస్తుశాస్త్ర పద్ధతి ననుసరించి ప్రాముఖ్యము వహిస్తున్నది. ఈ సమచతురస్ర ప్రామాణ్యము సరిగా తీసికొనక పోయిన ఆ దేవాలయము నిర్మించెడివారికి అపాయము కలుగునని సూచన వున్నది.

మధ్యసమచతురస్రానికి బ్రహ్మస్థానమందురు. ఆయా దేవతల, శిల్పాలు ఆయా నిర్దేశిత చతురస్రములలో స్థాపించెదరు. ఇటుల స్థాపించిన దేవతలు వాస్తుపురుషుని ఉనికి వల్ల జరుగు కష్ట నష్టములను నివారించెదరని నమ్మిక గ్రామమునకు శివాలయము వాయువ్యమునను వైష్ణవాలయము పడమట దిక్కునను నిలకొల్పెదరు.

ఈశానశివగురుదేవ పద్ధతి ననుసరించి మూడు విధములైన దేవాలయ నిర్మాణము జరుపవచ్చును. రాళ్లు లేక ఇటుక (సంచిత) ఇటుకలు లేక కొయ్య (అసంచిత) మరియు ఇటుకలు కొయ్య కలిసి (ఉపసంచిత) ఈ మూడు పద్ధతులు విరివిగా జరుపుచున్నారు. అయితే పురాతన కొయ్య దేవాలయములు కాలక్రమేణ పాడైపోవుచున్నవి. మహేంద్ర పల్లవుని కాలమున రాతికట్టడములు ప్రాముఖ్యత వహించినవి. ఏడవశతాబ్దమున కొయ్య, లోహము మరియు సున్నము ఉపయోగించి దేవాలయములు కట్టినట్లు శాసనముల వలన తెలియు చున్నది.

ఉత్తర భారతమున "విశ్వకర్మ ప్రకాశము" ననుసరించి 'ఆమలక' పద్ధతి, దక్షిణభారతమున 'శిల్పరత్న' ననుసరించి గోపుర పద్ధతి ప్రచారము నందుకొన్నది. అయినను ఈ రెండు పద్ధతులకు ఎంతో సామ్యమున్నది.

హయశీర్ష, పంచరాత్ర, కామికాగమ, అగ్ని పురాణము, మానసార, మొదలగు వాస్తు మూల గ్రంథముల యందు, నాగర, వేశర, మరియు ద్రవిడ పద్ధతులలో దేవాలయ నిర్మాణము వివరింపబడినది. సమచతురస్రము వృత్తము, అష్ట కోణాకృతి లేక అష్టాస్రము (ఎనిమిది కోణములతో) గర్భగుడి నిర్మాణము సాగుచున్నది. తదుపరి కాశ్యప శిల్పశాస్త్రమునందు దీర్ఘవృత్తాకారము మరియు అండాకారము లేక హెచ్చుతగ్గుల కొలతలతో దేవాలయ నిర్మాణము జరిగినది. భౌగోళిక పరిస్థితుల ననుసరించి ఈ పద్ధతి గమనించనవసరములేదు.

వక్రరేఖావృతమైన "శిఖరము ఆ మలకము పైనుండి" ప్రాసాద భాగము నంతను మధ్యదూలము సహాయమున పూర్తిగా అమర్చబడియుండును. ఉంగరమువలె రాతిని చెక్కెదరు. 'అమృతకలశ' విశ్వకర్మ పద్ధతిని ఇతర దేవతాస్థానముల ననుసరించి నిర్మాణము సాగించెదరని ప్రతీతి.

బంగారు కలశము గర్భగుడిపైన నిధి కలశము విగ్రహము దిగువున ఎంతో ఆధ్యాత్మిక భావము కలిగియున్నవి. గర్భగుడిపైన బంగారు కలశము అమరత్వ సిద్ధికి అద్భుత శక్తి కలిగి యున్నది. నిధి కలశము ప్రాపంచిక సుఖ సంధానము దనమూలము ననేయని చెప్పుచున్నది. గర్భగృహములో నున్న భక్తునకు నిధికలశము నుండి అమృతకలశమునకు దారి యని ఆ పదవ కేవలము దైవిక శక్తి మాత్రమే కలదని సూచించుచున్నది. "మృత్యోర్మా అమృతం గమయ" అనే ఉపనిషత్ వాక్యమును స్మరణకు తెచ్చుచున్నది.

'విమానము' అనుభాగము దేవాలయము నందలి దేవముండు స్థలమునకు పైన కట్టెదరు. దీన్ని

గర్భగుడి యందురు. స్థంబము, గోడ, తలుపు, శిఖరము (కలశము) (లేక బురుజు) వీటి పరిమాణము ననుసరించి శిల్పశాస్త్ర నిబంధనల ననుసరించి రూపొందించెదరు. గర్భగుడిలోని అనగా (విగ్రహ) మధ్యభాగము కొలత ననుసరించి విమానము రూపొందించెదరు. బృహత్సంహితలో విమాన బయటి గోడ వెడల్పు గర్భ గృహానికి రెండింతలుండాలని సూచించబడినది.

దేవాలయాలకు సాధారణంగా నాలుగు ద్వారాలుంటాయి. ఇవి ముఖ్యమైన దిక్కులయందు అమర్చెదరు. 'ఈశాన శివగురు దేవ పద్ధతి' ననుసరించి తూర్పు, దక్షిణ ఉత్తర ద్వారములను, కళాతత్వ రూపములైన, శాంతి ద్వారము, విద్యాద్వారము, నివృత్తి ద్వారము మరియు ప్రతిష్ట ద్వారము అని చెప్పెదరు.

స్తంభములు బహు ముఖములు కలిగి యుండును ప్రత్యేకముగ "రుచక" నాలుగు ముఖములు, "వజ్ర" ఎనిమిది ముఖములు, 'ద్విగుణ వజ్ర' పదహారు ముఖములు', ప్రతినక ముప్పైరెండు ముఖములు, వృత్తము వలె ముఖములు, కలిగిన స్థంబములను బ్రహ్మకాంత, విష్ణుకాంత, సౌమ్యకాంత, మరియు రుద్రకాంత అని పిలిచెదరు.

గర్భగృహము, ముఖ్యదేవాకృతిని కలిగియుండి లోపల చీకటిగా నుండి దీపము వెలుతురుతో నిండి యుండును. ఋగ్వేదములో చెప్పినట్లు మొదట చీకటియే యున్నది. అనువాక్యము జ్ఞప్తికి వచ్చును.

గర్భగృహము, అర్ధమండపము, మహామండపము, గోపురము మొదలగునవి అన్ని భాగములతో కలిసి ప్రాణులన్ని వున్న ప్రపంచమును పోలి యుండునని పెద్దలు చెప్పెదరు.

గంధర్వులు, యక్షులు, విగ్రహములు, మరియు పక్షులు మృగములు, లతలు మొదలగు వానితో అద్భుత సృష్టి క్రమ చిత్రమునుచూపు నట్లుండును.

దేవాలయ ప్రవేశమునకు ముందు భక్తుడు ఐదు ప్రాకారములను అనగా బాహ్యహార, మధ్యహార అంతహార,గర్భగృహములోనికి ప్రవేశము జరుపునట్లుగ జీవాత్మ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు దాటి ఆనందమయ కోశమును చేరుకొనునట్లు జీవితపరమావధిని చేరుకొనునట్లు ఊహించి, సామ్యమును చూపినారు.

ఎంతో అర్ధ, పరమార్ధములతో దేవాలయములను నిర్మించుటకు వాస్తుశాస్త్ర అవశ్యకతను నిరూపించినారు.

## దేవాలయ భాగములు

గర్భాలయము, అంతరాలయము, ముఖమండపము, ఆలయ విమానము, విమానకలశము, ధ్వజస్థంభము, ఆలయ ప్రాకారము, గాలిగోపురము, కళ్యాణమండపము, ఉత్సవ సమయములందు స్వామివారిని ఊరేగించెడి వాహనములుంచుటకు వాహనశాల, యజ్ఞశాల, ఆలయము లోపల బావి, ఇవి చాలాముఖ్యము.



# శైవాగమములు

శైవాగమములు సంస్కృత భాషలో, బహు పురాతన మైన శైవ మతమునందు ఎన్నో శతాబ్ద ములకు ముందు అనగా క్రీస్తుపూర్వమే, వ్రాయబడి నవి. శైవాగమములు వైదిక వాఙ్మయమువలె ప్రత్యేక తను సంతరించుకొన్నవి. ప్రాచీన ఋషులు, భగవంతుని దివ్యానుభూతులనందుకొని మౌలిక వేద వాఙ్మయ సరళిని దృష్టియందుంచుకొని యీ ఆగమ ములను ప్రత్యేక రీతిలో రూపొందించిరి. వేదములు బ్రహ్మదేవుని చతుర్ముఖముల యందుద్భవించి నటులే శైవాగమములు పరమ శివుని పంచ ముఖముల యందుద్భవించినవి. శ్రుతి ప్రమాణముగ ఎందరో ఋషిపుంగవులు వీటిని గ్రంథస్థమొనరించిరి.

ఉపనిషత్తుల ద్వారా తమ ఆలోచనలే కాక జీవితములు కూడ ధన్యత జెందినవని భావించిరి. అయితే శైవమత ధర్మముల ననుసరించి, శైవ మతాగమకర్తలు కూడ మన భారతదేశము నంతను పునీతమొనర్చిరి.

దక్షిణ ప్రాంతీయ ఆధ్యాత్మిక ఆలోచనలు వాటి వివరణలు, మరియు తపోనియమములు, గృహ ములలో మరియు దేవాలయములలో విగ్రహారాధన, సాంకేతిక చిహ్నములు, ధ్యాన యోగాదులు, అన్నియు శైవాగమముల యందు పరంపరాగతమై అంతర్లీన మైనవి.

ఉపనిషత్తులు వేద వాఙ్మయము నందు అంతర్లీనమై మత, సాంస్కృతిక సాంప్రదాయముల యందుప్రాధాన్యత పొందినట్లే, శైవాగమములు కూడ శైవాగమ శాస్త్రవేత్తల నెంతో ప్రభావితులును చేసి కాల క్రమేణ ప్రాధాన్యత సంతరించుకొన్నవి. శైవోపని షత్తులు భద్జాబాల మొదలగువానివలె ఆగమముల తరువాత ఉద్భవించినవి.

'ఆగమ' పదమునకనేక శబ్దార్థ వివరణలు లభించుచున్నవి. భగవంతుని ద్వారా వెలువడినవి గాన ఆగమములని ప్రసిద్ధి చెందినవి. ఆ-గ-మ అను మూడక్షరములు ఆత్మ సంభావనము, పరమాత్మ సంబంధములను తెలుపుచున్నవి. ఆగమములు పరమ శివుని పంచముఖముల నుండి ఉద్భవించి, పరాశక్తి వలన వ్యాప్తి చెందినవి. అయితే కొందరు శైవ మతగురువులు శైవాగమములకు ప్రత్యేక వివరణలతో అర్థము చెప్పిరి.

'ఆ' అనగా ఎరుక, 'గ' అనగా విమోచనము 'మ' అనగా బంధ విముక్తి యని నిర్వచించిరి. ఆగమ ములను గూర్చి ఆలోచన, అనుసరణ, బంధముల నుండి విముక్తి కలిగించి శాశ్వతానందము కలిగించు చున్నవి గాన ఆగమములని నిర్వచించబడినవి. శైవము లోని ఆగమములను వైష్ణవములోని సంహితలు, శాక్తేయములోని తంత్రములను

ఆగమములను చున్నారు.

ఆగమములు వేదప్రమాణములని ప్రసిద్ధి. ఆగమములు ఈశ్వర వాదమునందు ఉపనిషత్తులతో తులతూగును. ఇవి వేదమూలములని చెప్పుటకు అనేక ప్రమాణములు కలవు.

ఆగమములు, వేదములలోని మూల సూత్ర ములకు అనుగుణముగ రూపొందించబడినవి. ఆగమ సూత్రములు బ్రాహ్మణముల నుంచి, ఉపని షత్తుల తరువాత ఉపనిషత్తుల వలె రూపొందించ బడినవి.

వేదవాఙ్మయము, ఆగమ సిద్ధాంతములు మౌలికముగా పోలిక కలిగి యున్నను, ప్రాచీన కాలము నుండియు సమాన ప్రతిపత్తితో, ఎట్టి బేధములు లేక పరిణితి చెందినవి. వేదాంత ప్రమాణములు కలిగి పంచమ వేదములని ప్రసిద్ధి పొందినవి. సంస్కృతా ర్థము ననుసరించి వేదములకు, నిగమములని, తంత్ర ములని ఆగమములని, ఇవి రెండును శ్రుతులే యని న్ణియము జరిగినది.

స్కాందపురాణము ననుసరించి ఆగమములు శివుని నాలుక యని చెప్పుదురు.

బౌద్ధమునకు ముందుగానే ప్రాచుర్యము చెంది ఆగమములు బౌద్ధమత వ్యాప్తిని సన్నగిల్లచేసి హిందూ ధర్మములు శ్రుతి ద్వారా ప్రాచుర్యము చెంది తదుపరి గ్రంధస్తమైనవి. రెండును భగవత్ప్రసాదితములే. కనుక నిత్యములు, అపౌరుషేయములే యని పురాణము లన్నియు ఈ విషయమును నిర్ద్వందముగ చెప్పుచున్నవి. ఆగమములు శబ్దప్రమాణములై హిందూ ధర్మమున అత్యున్నత స్థానమును పొందినవి. స్వామి వివేకానందులు ప్రవచించినటుల ఆగమములు హిందూ ధర్మమందు కన్యాకుమారి నుంచి కాశ్మీరము వరకు ఆచరణలో నున్నవి.

శైవ సిద్ధాంతుల భాషణల ననుసరించి వేదములు సర్వజన సమ్మతములైనప్పటికి శైవాగమ ములు ప్రత్యేకతను కలిగి లింగబేధము లేక సర్వమానవ సౌభాగ్యదాయకములుగ మనుచున్నవి. శైవ మహా పండితోత్తములైన శ్రీకాంత, హరిదత్త, శివాగ్ర యోగి, అప్పయ్యదీక్షితులు, శివజ్ఞానస్వామి మొదలయిన వారు శైవాగమవ్యాప్తికి విశేషకృషి సలిపిన మహామహులు. చిరస్మరణీయులు.

ఆగమములోని జ్ఞానపాదములేక విద్యాపాదము శైవ సిద్ధాంత పరముగ మూడు ప్రత్యేక తత్త్వ భాగములుగ విభజింపవచ్చును. పదార్థము, జీవాత్మ, పరమాత్మ పాశ, పశు, పతి లేక దైవము అని, అన్యము లేకుండ ఈ విశ్వసృష్టికి మూల భూతముదైవమని నిర్వచించుచున్నది. శక్తి, విడదీయరాని రూపమున పరమాత్మ యందు లీనమై, విశ్వనిర్మాణమునకు కారణభూతమైనట్లే మాయ విశ్వనిర్మాణమునకు మౌలిక కారణమగుచున్నది.

జీవాత్మ సంసార బంధములో చిక్కుకొన్న ప్రత్యేక తత్త్వముగ పరిగణింపబడుచున్నది, జ్ఞాన పాదము అవిద్య, కర్మ మాయ అనుత్రివిధ పాశములచే జీవాత్మను బంధించి పరమాత్మను గూర్చి వాస్తవము ఎరుకలేకుండ చేయుచున్నవి. పరమేశ్వరుని కరుణా కటాక్షముల వలన మాత్రమే వాస్తవము అవగతమగును. జీవాత్మ పరమేశ్వరుని కరుణా కటాక్షములను పొందవలెనన్న పరిశుద్ధ ప్రవర్తన, నిషిద్ధ కర్మలు ఆచరించకుండ యుండుట త్యాగ నిరతితో కూడిన, పరిపూర్ణ శరణాగతిని సాధించుటకు సహాయ పడుచున్నవి.

ఆగమములలో క్రియా పాదము రెండవ భాగము. ఇందనేక విధములైన దీక్షలను విశదపరచడము జరిగినది. పరమేశ్వరారాధనకు వివిధ మార్గములను బోధించుచున్నది. అంతే కాక శివాలయ నిర్మాణము,

రాతితో, లోహముతో శివలింగము చేయు విధానము, శిల్ప నిర్మాణము, పూజా విధానములే కాక శివాలయ నిర్మాణమునకు స్థల నిర్ణయము మొదలు ఆరాధన నియమముల వరకు గల అనేక ప్రక్రియలను నియమములను నిర్దేశించుచున్నది. పాప పరిహార్థము చేయదగ్గ ప్రాయశ్చిత్త కర్మలు, దోష రహితునిగా చేయు మార్గ నిర్దేశనము, పునఃబల పడునట్లు చేయు మార్గములను తెలియజేయు చున్నది.

ఆగమములో యోగభాగము మూడవది. యోగ సాధనకు అష్టమార్గ సూచన ఇందు ముఖ్యమైనది. యమ, నియమ, ఆశన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన మరియు సమాధి అను అష్టాంగ యోగమార్గము నిర్దేశించు భాగము యోగ భాగము. యోగమనగా కలియుట, విలీనము అని అర్థము. పరమాత్మ యందు బుద్ధి నిలిపి జీవాత్మ పరమాత్మలో లీనమగుటను యోగమందురు. శైవ సిద్ధాంతముననుసరించి షోడశాంగములతో యోగ మార్గము ఇందు చెప్పబడలేదు.

నాల్గవ భాగము చర్యా పాదము. ప్రవర్తన, పూజా సామగ్రి సేకరణ, పూజా విధానము తెలియ జేయు చున్నది. విగ్రహావిష్కరణ, సంస్కారము, నివేదనము, పూజావిధానము. ఆదిగా గల విషయము లిందు కలవు. వేలకొలది దేవాలయములు, ఆగమ శాస్త్ర అధ్యయనము వలన పవిత్రములై నేటికి, సజీవముగ, నిత్య, దీప, ధూప, నైవేద్యములతో విరాజిల్లుచున్న దేవాలయములే ఆగమ శాస్త్ర వైశిష్ట్యమునకు సాక్షీభూతములుగ నిలచి యున్నవి.

ఆగమములకు ఆలంబనముగా సుమారు రెండు వందలకు పైగా ఉప ఆగమములు కూడ కలవు. వీటిలో మృగేంద్ర, పౌష్కర ఉపాగమములు, విస్తార ప్రచారములో నున్నవి.

ఆగమముల నాలుగు విభాగముల యందు విద్యాపాదము ఆధ్యాత్మికాతిశయముగాను క్రియా పాదము ఆచార కర్మ నియమములతోను బహుళముగా నుండి మిగతా రెండు భాగములు సూక్ష్మముగ నున్నవి. ఇందు కామిక ఆగమములోని క్రియా పాదము బహుళ ప్రచారములో నున్నది. చిదంబరం నటరాజ దేవాలయము మొదలయిన దేవాలయములలో మకుటాగమము వాడుకలో నున్నది. ఈ ఆగమము మరియు ఉపాగమములలోని శ్లోకములు లక్షల సంఖ్యలో నున్నవి.

ఆగమ సూత్ర నిబంధనల ననుసరించి దేవాలయ నిర్మాణము పూజా విధానము, నడుపబడు చున్నవి. ఆగమముల ననుసరించి పూజా విధానము రెండు విధములు. ఆత్మార్థము అనగా వ్యక్తిగత శ్రేయము మరియు పరార్థము అనగా సమాజ శ్రేయము. అందువలన దేవాలయములు ఆస్తిక సమాజమునకు ఎంతైనా అవసరమై దినదిన ప్రవర్ధ మాన మగుచున్నవి. ఎందరో శైవ మతాచార్యుల కృషి ఫలితముగ దేవాలయములు మన సాంఘిక వ్యవస్థలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించినవి.

చోళ ప్రభువులు పది, పదమూడవ శతాబ్దముల మధ్యకాలములో తమ అమూల్య సంపదలను వినియోగించి అనేక అద్భుత దేవాలయములను నిర్మించి ఆనాటి సమాజమునందు, సమత్వమును సాధించి చరితార్థులైరి.

అందరి ఆమోదము పొందేటట్లుగా శిల్పకళను దేవాలయముల యందు ఉపయోగించి, వాటిని భక్తికి ముక్తికి నిలయములుగ రూపు దిద్దుకొనునట్లు చేసి, ఆగమములు తమ ప్రామాణికతను నిరూపించు కొన్నవి.

ఆగమములు ప్రతి ఒక్కటి విషయ ప్రాధాన్యత లో ప్రత్యేకతను కలిగి యున్నవి.

దేవాలయ నిర్మాణ పద్ధతి, స్థానిక కట్టుబాట్లు, స్థల చరిత్ర, పురాణ ప్రసిద్ధి దృష్టియందుంచుకొని, విగ్రహములు వాటి ప్రమాణములు, కట్టడములు, ప్రాకారములు, నియమ బద్ధమైన ప్రతిష్ట, దైవిక పూజా విధానము, పక్ష, మాస, వత్సరముల యందు జరుపవలసిన పూజా విధానములు, వ్యక్తిగత, సామాజిక అభ్యున్నతి కోరి జరిపించే పూజలు, పూజారుల నియమ నిబంధనలు. ఇవి అన్నియు ఆగమముల వలన క్రమబద్ధతను పాటించి నడుపబడుచున్నవి. ఆగమముల క్రియ, చర్య పాదముల యందలి నిబంధనలు, సూత్రములు ఇందులకెంతో ఉపకరిస్తున్నవి. భక్తజన సామాన్యమునకు ఆచరణయోగ్యమైన పద్ధతులు కలిగి యుండుటవలన ప్రసిద్ధములైనవి.

ఇవి అనితర సాధ్యమైన మతపరమైన పవిత్ర వారసత్వ సంపద కలిగి యుండి దక్షిణ దేశమందే కాని ఉత్తర దేశమందు ప్రచారములో లేక యున్నవి.

నేటి నాట్య భంగిమలు, భరత నాట్యము ఆగమ సిద్ధాంతముల ననుసరించి అభివృద్ధి సాధిస్తున్నవి. శాస్త్రీయ నృత్య విధాన మందలి మౌలిక సూత్రముల ప్రామాణికత ఆగమ సిద్ధాంత జన్యమే. ఉపనిషత్తులను వేదాంతమని కూడ అనుచున్నటులే ఆగమములను ఆగమాంతములు లేక సిద్ధాంతములని చెప్పబడుచున్నవి.

చాల ఆగమ సూత్రములు నాగర లిపిలో నున్నను పాశ్చాత్య పండితులు ఎన్నో పరిశోధనలు చేసి అనేక శాక్తేయ గ్రంథములు రచించి ప్రసిద్ధులైనారు. నాగర లిపిలో నున్నందువలన శైవాగమములు పాశ్చాత్య పండితులను విశేషముగ ఆకర్షింపలేక పోయినవి. మన దేశమందు కూడ యీ అపార ఆగమ సంపదను అధ్యయనము చేయుట విస్తృతముగ జరుగలేదు. ఎన్నో తాటాకు గ్రంథములు కాల గర్భమున కలిసి పోతున్నవి.

శైవాగమ సిద్ధాంతముల నింకను పరిశోధించి వాటి ఆధ్యాత్మిక ప్రాధాన్యతకు గుర్తింపు లభించు లాగున చూడవలసిన బాధ్యత నేటి పండిత ప్రకాండుల బాధ్యతయై యున్నదని చెప్పుటలో దోషము లేదు.

## నారద భక్తి సూత్రములు

నరులకు నారాయణుని చూపించువాడు నారదుడై సర్వమానవులకు ఉపదేశకుడవి. స్పష్టముగా తెలియుట వలన నారదభక్తి సూత్రములు సర్వులకు ప్రాముఖ్యము వహిస్తున్నవి. ఈ సూత్రములు మొత్తము *84* అందు *24* సూత్రములు భక్తిని వివరించును, *9* సూత్రములు జ్ఞాన, యోగములకంటె భక్తిమార్గమెట్లు ఉత్తమమో వివరించును. *17* సూత్రములు భక్తి సాధన బోధించును *16* సూత్రములు మహా భక్తుని ప్రత్యక్ష లక్షణములను చూపించును. *18* సూత్రములు మహాభక్తులను స్తుతించును.



# నమకము : చమకము

సర్వాంతర్యామియైన రుద్రుని రూపము లనంతములు. అందు అఘోరములు, ఘోరములు, ఘోరతరములుగా సత్త్వరజస్తమోగుణ విధానములై విరాజిల్లుచున్నవి.

దీనినే యజుర్వేదము నాల్గవ కాణ్ణము ఐదవ పాఠమునందు రుద్రాధ్యాయము (నమకమున) పద కొండవ అనువాకమునందు శ్రీ రుద్రులు, నంది, వినాయక ప్రమధ గణములేకాక, వేల జాతులలో, వేన వేల రూపములతో స్వర్గ, మర్త్య, పాతాళలోకము లందంతటను వ్యాపించి, పాపులను, అన్నవాయ్వర్ష లచే హింసించుచుందురనీ, భక్తులు సేవచేయు అభిషేక జపస్తోత్ర పూజాదులచే ప్రసన్నులై వారి పాపములను పరిహరించి వారికిహపర సుఖముల బ్రసాదించుచుందు రనియు చెప్పినది.

రుద్రుని రౌద్రము శాంతింపజేసి, ప్రసన్నుని చేసికొనుటకై ప్రప్రథమమున నాతని క్రోధమునకు, నాతని విల్లమ్ములకు, బాహుయుగ్మమునకును నమ స్కారములతో ప్రారంభించి, పంచభూతాత్మకుడైన పరమేశ్వరుని వివిధ రూపముల బేర్కొనుచు పేరు పేరునా నామహదేవునకు నమస్సులందించుటచే రుద్రా ధ్యాయమునకు 'నమకము'ను పేరు ప్రఖ్యాత మైనది.

అభీష్ట ఫలములు సిద్ధింపవలెనన్నను, పరం పరగ కలిగెడు యరిష్టములు తొలగిపోవలెనన్నను, నిఖిల దుఃఖములు నశింపవలెనన్నను, మోక్షసుఖము కలుగ వలె నన్నను శివారాధనము, శైవషడక్షర జపము (ఓం నమశివాయ) కన్నమించిన ఇతర సాధనములు లోకములోను, వేదములలోను లేవు. అందుకు అభిషేక రూపమగు రుద్రారాధన ముత్తమము. అది జీవితశాంతి, పుత్ర ఆయురారోగ్యైశ్వర్య మోక్షాది సర్వ ఫలదాయి - కనుకనే "అభిషేకప్రియః శివ" అనెడి ప్రశస్తి లోకమున పండిత పామరజన ప్రసిద్ధమై యున్నది.

చేతనాచేతన రూపమునుండి యచ్చెరువును గొలుపు నదియును, ఇంతకు పూర్వమే ఉత్పన్న మయి నదియు, ఇపుడుత్పన్నమగుచున్నదియును అగు ఈ ప్రపంచమంతయు రుద్రరూపమగుచున్నది. కనుక రుద్రుడు సర్వాత్మకుడు. సర్వవ్యాపకుడు. పరిమితి యనునది లేని విధముగా రుద్రమూర్తులు నమకమందు ప్రతిపాదింపబడుచున్నవి. కావున దీనికి నామము కలిగెను. నమకమను నామధేయము లోక వ్యవహారము రూఢమైనది.

దీనియందు పదకొండనువాకములు కలవు. ఇందు మొదటి యనువాకముచే శివుని ప్రళయకాలిక రౌద్రరూపమును, అతని ఆయుధములను, నమస్కార ముతో శాంతింపజేయుట జరిగినది. శివునకు రెండు విధములైన రూపములు కలవు. సృష్టిని ఉపసంహ రించు సమయమున దాల్చునది. ఘోరరూపము

మొదటిది. రెండవది యఘోరరూపము. ఇది భక్తులను అను గ్రహించు సమయమున దాల్చునది.

రెండవ యనువాకము మొదలు, తొమ్మిదవ యనువాకము వరకుగల మంత్రములలో శివుడే సర్వ ప్రపంచమును వ్యాపించియున్నట్లు భావించుచు స్తుతించి, నమస్కరించుట జరిగినది. ఇట్లు శివుని ప్రసన్నునిగా జేసికొని పదియవ, పదకొండవ యను వాకములచే అభయము (అనుగ్రహము) అర్థించుట జరిగినది. ఇదియే సంగ్రహముగ నమక సారాంశము. దీనినే రుద్రోపనిషత్‌యని కూడ అందురు.

క్రియా రూపమగు అభిషేకారాధనకు ఈశ్వరుని అవాఙ్మనసగోచరములగు మహిమలు సార్వాత్మ్యము, సర్వాధిపత్యము, సర్వశ్రేష్ఠ్యమున్నగు నసాధారణ గుణ గుణములు బాగుగా వివరించెడి నమకరూప మంత్రములు ముఖ్యాతి ముఖ్యములు. వీనితో వాచిక, మానసికారాధనలుకూడ సర్వోత్తములై పూజనమునకు త్రికరణశుద్ధి యేర్పడి సద్యః ఫలము లభించుటలో సందియము లేదు.

"నమస్తే రుద్రమన్యవే" అను వాక్యముతో ప్రారంభమగు రుద్రాధ్యాయమును అనగా నమకమును 'నమస్తే' అని అందురు. అట్లే, "అగ్నా విష్ణూ సజోషసే" అను వాక్యముతో ప్రారంభమగు మంత్రభాగమును "అగ్నా విష్ణుః" అను పదముచే వ్యవహరించుట ప్రసిద్ధము. దీనినే చమకమని యందురు. నమః అను పదము పునః పునరావృత్త మగుటచే నమకమయినది. చమే' అనుపదమునకు మరియు నాకు (ఇది కావలెను) అని యర్థము. ఇహ లోక జీవయాత్రకై వలయు వస్తు సామగ్రి కావలెనని శివుని ప్రార్థించుట యిందుకలదు.

చమకము కృష్ణయజుర్వేదమునందలి చతుర్థ కాండమున సప్తమ ప్రపాఠకమున నున్నది. చమకము నందు పదకొండనువాకములు కలవు. నమకమును పూర్తిగా (అనగా నూరు శ్లోకములు 11 అను వాకములు) జపించిన పిమ్మట చమకము యొక్క ఒక అనువాకమును జపించుచు ఇట్లు ఏకాదశ నువాకములు (చమకమునగల పదకొండనువాకములు) పూర్తియగు నంతవరకు జపించుచు అభిషేకము చేయుటను ఏకాదశరుద్రాభిషేకమందురు.

## నమక మహిమ :

నమకము యొక్క మహత్త్వము శ్రుతి, స్మృతి, పురాణములందు వివరముగ చెప్పబడినది. జాబాలో పనిషత్తులో దీని మహత్త్వము చెప్పబడినది. యాజ్ఞ వల్క్య మహర్షి శిష్యులకు తెలిపిన యీ నమక మహత్వము ఎల్లరు తెలుసుకొనుట అవసరము. నమకము (శతరుద్రీయము) చే మోక్షములభించును. మరియు, నమకములోని నామములు మరణ రహితు డగు పరమేశ్వరుని నామములు. ఆ నామ పారాయణచే మానవుడు అమృతుడగును.

కైవల్యోపనిషత్తులో నమకమును అధ్యయ నము చేయు మానవుడు గృమదహనాది పాపము నుండి విముక్తుడగును. మరియు సువర్ణాపహార దోషము, సురా పానము, బ్రహ్మహత్య, అభిచారము (ప్రయోగము) మున్నగు సమస్తపాపములనుండి విముక్తుడగునని చెప్ప బడినది.

శంఖ స్మృతి ననుసరించి నమకము పద కొండు సార్లైనను ఆవృత్తిచేసినచో మహాపాపకారి యైనను పాపములనుండి విముక్తుడగును. వాయు పురాణము ననుసరించి, ఏ మానవుడు మహేశ్వరుని ధ్యానము చేయుచు నిత్యము నమకపారాయణము చేయునో ఆ పురుషుడు ఆ రూపముతోనే రుద్రు డగును. దేహ పాతానంతరము శివపురమును పొందును. రహస్యముగా చేయు పాతకములకు కూడ నమకము ప్రాయశ్చిత్త మని శంఖుడు చెప్పెను.

జాబాల కైవల్యోపనిషత్తులు, యాజ్ఞవల్క్యుడు, శంఖుడు, అత్రి మహాముని, అంగీరసుడు, ఆప స్తంబుడు (వాయుపురాణము) మున్నగువారల బోధన ముల వలనను నమక మహత్త్వము వర్ణనాతీతమని తెలియనగును. సమస్త దోషములను, సమస్త పీడలను తొలగించి, సమస్త భూదానాది మహిమల ప్రాప్తిని, ఐహిక సమస్త భోగములనిచ్చి, ముక్తిని ప్రసాదించునని తెలియుచున్నది.

దేవతార్చనలేనివారు ప్రతిదినము నమక పారాయణము, ఆలయములలో ఈశ్వరలింగమునకు అభిషేకముచేయుట, చేయించుట ప్రతిశైవాలయము లోను అత్యవసరము.



# శ్రీ చక్రము

శ్రీ చక్రము లలితామహాదేవి నివాసమని పెద్దలు చెప్పెదరు. 'శ్రీ' అను అక్షరము శ్రీ చక్ర పవిత్రతను సూచించుచున్నది. అన్ని చక్రముల మహిమలను శక్తిని శ్రీచక్రమధిగమించును. అందరి దేవుళ్ళ దేవతల మూల స్వరూపస్థితి శ్రీచక్ర మందున్నది. నిర్ణీతరేఖల సముదాయముతో క్రమ బద్ధతను కలిగియున్నది.

మరియే యితర చక్రములయందు ఇట్టి పరిపూర్ణమైన, మహిమాన్విత రేఖా సంపుటిని కానలేము. మంత్రవేత్తలు యీ చక్రమును శ్రీచక్రమని అనుచున్నారు. శ్రీలలితాచక్రము లేక త్రిపురసుందరి చక్రమనుట-లేదు.

శ్రీ చక్రములోని వృత్తము బిందువు సమాన దూరము తెలుపుతూ, ఆది మధ్యాంతములులేని దైవ స్వరూప నియమస్వరూపములను తెలుపు పవిత్ర సాంకేతికముగా వర్ధిల్లుచున్నది.

"శ్రీచక్రం శివయోర్వపుః" శ్రీచక్రము కామేశ్వరీ కామేశ్వరుల శరీరము. ఉపాసకులు శ్రీచక్రమునందలి శ్రీమాత నర్చింపవలెను. ఆత్మ భావనచే శ్రీచక్రము నర్చింపనగును. సచ్చిదా నందాత్మకమగు శక్తిమంత్ర రూపిణియయి, సృష్టి క్రమమున యంత్రరూపిణియగుచున్నది. కాన యంత్రారాధన పూజావిధానమందు సర్వోన్నత మగుచున్నది.

మహాబిందువు పరబ్రహ్మస్వరూపము. శ్రీ చక్రము సోమ, సూర్య, అగ్నిఖండములుగ విభజింపబడినది. ఇది తేజస్త్రయాత్మకము. బిందు, త్రికోణ, అష్టదళములు ఆగ్నేయఖండము, దశార ద్వయము, చతురస్రము, సౌర ఖండము, చతుర్ద శారము, షోడశ దళములు, చంద్ర ఖండము, త్రికోణము సత్త్వ, రజస్తమస్సులను త్రిగుణాత్మక ముగా ఇచ్ఛా జ్ఞానక్రియా శక్త్యాత్మకముగ భావింప వలెను.

త్రికోణము పిదప చతురస్రము కలదు. దీని నాల్గు కోణములు మాయ, శుద్ధ విద్య, ఈశ్వర, సదాశివ తత్వములు.

శ్రీచక్రములోని త్రికోణాకారము ఆది మధ్యాంతములు లేని సృష్టి రహస్యమునకు సంకేతముగా వర్ధిల్లుచున్నది. త్రివిధములైన అవస్థలను అనగా సృష్టి, స్థితి, లయబద్ధమైన సంగ్రహరూపమును తెలుపుచున్నది. ఈ త్రికోణాకారములు రెండేసి ఒకదానికొకటి ఎదు రెదురుగా ఉండుట, ఆదిశక్తిగా పవిత్రమాతృమూర్తిని స్ఫురింప జేస్తున్నది. అంతేకాక

యీ అనంతసృష్టికి మూలము ఆదిశక్తియేయను అంతరార్థమును స్ఫురింపజేయుచున్నది. సూర్యోదయ, అస్తమయములందు వికసించి, కృశించు తామరపూవు వలె మానవునిలోని ఆధ్యాత్మికారంభ, ఆధిక్యత(క్రమముగా వికసించుననే సూచన(ప్రాయముగ తెలియజేయు చున్నది.

శ్రీచక్రము గూఢార్థ రత్నాకరము. నవచక్ర రూపము. అనగా సర్వానందమయ, సర్వసిద్ధిప్రద, సర్వ రోగహర, సర్వరక్షాకర, సర్వార్థసాధక, సర్వ సౌభాగ్య దాయక, సర్వసంక్షోభ నివారక, సర్వ శాప హర, త్రైలోక్య మోహనము శ్రీచక్రము. దీనినే ప్రకట, గుప్త, గుప్తతర, పర్వా కాల, నిగర్భ, అతరహస్య, పరాపర రహస్యములను చున్నారు. భావనోపనిషత్తు నందు శ్రీచక్ర రహస్యము చక్కగ నిరూ పించబడినది.

సర్వ సంక్షోభణచక్రము, అష్టదళము, షోడశ దళము, సర్వాశాపరిపూరకచక్రము త్రైలోక్యమోహనము శ్రీచక్ర మని వేదవిదులు వక్కాణించిరి.

చతురాశ్రమ, వర్ణప్రవృత్తులకును, తత్తదాశ్రమ, వర్ణ, ధర్మా చారములయందు కలిగిన లోపములకు శ్రీచక్రార్చన నిశ్చితమైన పరిహారము. అందువలన శ్రీ చక్రస్థితమైన శ్రీ విద్యాదేవిని బిల్వ, తులసీ దళముల తోడను, పద్మములతోడను పూజించ వలెను.

## పంచలోహములు – ఒక పరిశీలన

ప్రాచీన భారతదేశములోని, మహర్షులు, మంత్రవేత్తలు పంచలోహముల సంపుటి దేవతా విగ్రహములు తయారుచేయుటయందత్యవసరమని నిర్ణయించినారు.

బంగారము, వెండి, రాగి, ఇత్తడి, కంచు ఈ ఐదు లోహములను నిర్ణీత పరిమాణములో , కలిపి విగ్రహములను తయారుచేయుదురు.

నవీనయుగశాస్త్ర, సాంకేతిక నిపుణులు గావించిన ప్రయోగముల ననుసరించి 'అతీంద్రియ శక్తి' యీ పంచలోహ సంపుటికి కలదని నిరూపించుచున్నారు. పంచలోహ సముదాయమునకు నీరు తగులుట వలన (అనగా అభిషేకము, తీర్థము) మహత్తర శక్తి ఉత్పత్తి చేయబడునని విశ్వసించుచున్నారు. రాబోవు కాలమునందు జరుపు మరికొన్ని ప్రయోగముల వలన మన దేవాలయముల శాస్త్రీయాధిక్యతను తెలుపునని నమ్ముచున్నారు.

దేవాలయములు కేవలము విగ్రహములతో విలసిల్లు (సాంకేతిక) దైవ ప్రాంగణములు గానే కాక, ఆధ్యాత్మిక, ఆది భౌతిక శక్తుల సముదాయముగ మానవుని, శారీరక మానసిక శక్తుల క్రమ విజృంభణకు మూల స్థానములని నమ్ము కాలమాసన్నమగుచున్నదని నమ్ముచున్నారు.

నియమిత పరిమాణ సూత్రముల ననుసరించి నిర్మింపబడిన పంచలోహదేవతా విగ్రహములు అమిత శక్తి సంపన్నములని, దైవత్వనిరూపణకు అత్యవసరములని భావించుచున్నారు.



# పంచభూత లింగములు

భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము - ఇవి అయిదు పంచభూతాలు.

బ్రహ్మపీఠం, విష్ణుపీఠం, శివపీఠం ఈ మూడింటి సంపుటే శివలింగ మవుతుంది. మనదేశ దక్షిణ ప్రాంతంలో పంచభూతలింగములున్నవి.

**1. పృథివి లేక భూమి :** ఈ లింగాకారం కంచిలో వున్నది. మద్రాస్‌నుండి సుమారు తొంభై కిలోమీటర్ల దూరంలో ఈ క్షేత్రం వున్నది. కంచి పుణ్య క్షేత్రంలో సుమారు వెయ్యిగుడులున్నాయని చెప్తుంటారు.

కాశి, కంచి రెండు పుణ్యక్షేత్రాలు పరమశివునికి రెండు నేత్రాల వంటివి.

అయోధ్య, మధుర, హరిద్వార్, కాశీ, కంచి, ఉజ్జయినీ, ద్వారకా, ఇవి సప్తమహాక్షేత్రాలు. గొప్ప పుణ్యక్షేత్రాలుగా ప్రసిద్ధిగాంచినవి.

కంచిలో శివ, విష్ణు దేవాలయములున్నవి.

ఒకప్పుడు పార్వతీదేవి, పరమశివునిగూర్చి తపస్సు చేసింది. శ్రీ మహా విష్ణువు సమక్షంలో తనమీద కోపగించి వెళ్లిపోయిన శంకరుణ్ణి ప్రసన్నుని చేసికోవడానికి ఒక మామిడిచెట్టు కిందకూర్చుని ప్రార్థించింది. శంకరుడు ప్రసన్నుడైనాడు. పార్వతి ప్రార్థించిన చెట్టు దగ్గర ఏకాంబర నాథుడుగా వెలిశాడు. దీనినే పృథ్విలింగమంటారు. ఏకాంబ రేశ్వర దేవాలయం దక్షణాదిలోకెల్ల ఎత్తైన గోపురం 557మీ. ఎత్తుగలది, పదంతస్తులు. చూడదగ్గది.

గుడిలోవున్న మామిడిచెట్టు చుట్టు 108 లింగాలున్నవి. శ్రీకృష్ణదేవరాయము భక్తితో చుట్టూ ఆలయ నిర్మాణం చేయించాడు. మహాశివరాత్రికి విశేషంగా పూజలు జరుగుతాయి.

**2. నీటి లింగాలు :** ఈ లింగంచుట్టూ నీరు వుంటుంది. నీరు తోడినా మరల, మరల నీరుచుట్టూ చేరుతుం టుంది. జంబూవృక్షం కింద ఈ శివలింగం వెలిసింది. అందుకే జంబుకేశ్వరుడంటారు.

ఒక మహర్షి యిక్కడ అడవిలో శివలింగం ప్రతిష్ఠ చేసి పూజలు చేసేవాడు. ఈ లింగం పైకప్పులేక ఎండకు ఎండి, వానలో తడుస్తుంటే ఒక సాలెపురుగు భక్తితో గూడు కట్టేది. ఆకులు, దుమ్ము, ధూళి లింగంపై పడకుండా వుండాలని సాలెపురుగు గొడుగుకూడా కడ్తే ఒక ఏనుగు భక్తితో తొండంతో నీళ్ళు తెచ్చి లింగమునకు అభిషేకం చేసేది. ఈ విధంగా రోజూ తను కట్టిన గూడును ఏనుగు పాడుచేస్తోందని సాలెపురుగు కోపించి ఏనుగు తొండంలో దూరి లోపల కరిచింది. ఏనుగు మరణించింది. సాలె పురుగుకూడా మరణించింది. రెండూ శివసాన్నిధ్యం చేరుకున్నాయి.

ఈచోట చోళరాజు శ్రీజంబువేశ్వరగుడి కట్టించాడు. అఖిలాండేశ్వరి, పార్వతికి కూడ ఆలయ నిర్మాణం జరిగింది. అప్పర్, మాణిక్యవాసగర్, సుందర మూర్తి మొదలగు మహాభక్తులు జంబుకేశ్వరుణ్ణి

పూజించారు. ఈ ఆలయంలో మధ్యాహ్నం ఆడవేషం వేసుకున్న పుజారి పూజలుచేయడం సాంప్రదాయంగా వున్నది.

చోళరాజు తన రాణితో కలిసి రోజూ జంబుకేశ్వరుణ్ణి పూజించేవాడు. తన భార్య మెడలో వున్న బంగారు గొలుసు శివునిపై వేస్తే బాగుంటుందని అనుకున్నాడు. నదిలో స్నానం చేసి వస్తుండగా గొలుసు దారిలో ఎక్కడో పడిపోయిందని తెలిసి యిద్దరూ చాలా బాధపడ్డారు. కావేరీ నుంచి తెచ్చిన నీటితో అభిషేకం చేస్తుండగా పోయిందనుకున్న బంగారు గొలుసు శివలింగంపై పడింది. దపంతులు ఆనందించారు. ఈ క్షేత్రం తమిళనాడులో వుంది.

ఈ ఆలయంలో అనేక చోళ, పాండ్య, హొయసల మధురనాయకర్ల శాసనాలున్నాయి. ఇవి 154 అని అంటారు.

**3. తేజోలింగం :** అరుణాచలంలో వున్నది. దీనిని తిరువణ్ణామలై అంటారు. మద్రాస్ నుంచి సుమారు 60 కి.మీ దూరంలో వుంటుంది. స్కందపురాణంలో ఈ క్షేత్రాన్ని గురించి వివరంగా వ్రాయబడ్డది.

ఒకప్పుడు బ్రహ్మ విష్ణువులు తమలో ఎవరు గొప్ప అనిమాట పట్టింపు, పోట్లాటలు వచ్చాయి. పరమశివుడు అగ్నిగోళంలా నిప్పురూపంలో వాళ్లమధ్యకు వచ్చాడు. ఆ నిప్పును తప్పించుకోవడానికి ప్రయత్నించారు. ఆ నిప్పు తుది మొదలు తెలుసుకోలేక పరమశివుని ప్రార్థించారు. గోళరూపం వదలి శివుడు స్థావర (లింగ) ఆకారంలో అరుణాచల పర్వతంగా వెలిసాడు.

కార్తీకమాసంలో తిరువణ్ణామలైలో గొప్ప దీపాల పండుగ జరుగుతుంది. కొండమీద కార్తీక పౌర్ణమినాడు పెద్ద జ్యోతిని వెలిగిస్తారు. శ్రీ రమణ మహర్షి యిక్కడే సిద్ధి పొందారు.

**4. వాయులింగం :** మన శ్రీ కాళహస్తిలో వున్నది వాయు లింగం. తిరుపతియాత్ర చేసేవారు తప్పక శ్రీకాళహస్తి క్షేత్రాన్ని దర్శిస్తారు. గర్భగుడిలో చిన్న కన్నంగాని, గాలి దూరే అవకాశంగాని లేకపోయినా కాంతి వుంటుంది. అందుకే దీనిని వాయులింగం అంటారు. ఈ లింగమునకు సాలెపురుగు, పాము, ఏనుగు, భక్తి ప్రపత్తులతో కొలిచి తరించినవి. అందుచేత యీ క్షేత్రానికి శ్రీ కాళహస్తి అనే పేరు వచ్చిందని పెద్దలు చెప్పుతుంటారు. శ్రీ అనగా సాలెపురుగు, కాళం అనగా పాము హస్తి అనగా ఏనుగు. భక్త కన్నప్ప యిక్కడే పరమశివుని సేవించి తరించాడు.

కాశీవిశ్వనాథుని ఆలయం పోలికలతో శ్రీ కాళహస్తి వుంటుంది. మహాశివరాత్రికి ఉత్సవాలు జరుగుతుంటాయి.

**5. ఆకాశలింగం :** మద్రాసుకు సుమారు 240 కి.మీ. దూరంలో చిదంబరం వుంది. దక్షిణాన అతి ప్రాచీన దేవాలయం యిది. ఇక్కడ వున్న ఆకాశలింగంలో నుంచి నటరాజు ప్రత్యక్షమై నాట్యం చేసాడని చెబుతారు. వ్యాఘ్ర పాద, పతంజలి అనే యిద్దరు భక్తుల సమక్షంలో పరమశివుడు నాట్యంచేసినట్లు చెబుతారు. శివలింగం వెనుక చక్రంగుర్తు దీనిని సూచిస్తున్నది.

సృష్టి, స్థితి, సంహార, భ్రమ, అనుగ్రహాలకు నాట్య భంగిమలో విన్యాసంచేసిన పరమశివుని నాట్యం గురించి యిలా చెబుతారు.

శ్రీ నటరాజు చోళరాజుల కులదైవం. దాశ సత్రపుత్ర; సాహ, సన్మార్గ అను భాగవతోత్తములను సమయాచార్లుని పిలుస్తారు. వారు ఇక్కడ పరమశివుని పూజించి కైవల్యం పొందారు. అప్పర్, సంబంధర్, మాణిక్, వాసికర్, సుందరార్ మొదలగు మహాభక్తులు యిక్కడనే శివైక్యం పొందారు. తిరు నీలకంఠ అనే భక్తుడు పరమశివ భక్తుడై జ్ఞానిగా తరించాడు.



# జ్యోతిర్లింగాలు

శైవ దేవాలయాలలో ముఖ్యంగా శివలింగం ఉంటుంది. శివలింగం పవిత్రమైనది. శివపురాణంలో మనస్సు కేంద్రీకరించడానికేదో రూపం ఉండాలి కనుక లింగాకారం వాడుతారని చెప్పబడింది.

చల లింగాలు, అచల లింగాలు అని రెండు విధములు.

చల లింగాలు మట్టి, లోహం, కర్ర రాయి దేనితో నైనా చేయవచ్చు. పూజావసరాలకు ఉపయోగించుకొని వెంటనే దానిని విరవడం, లేక నీళ్ళలో పడవేయడం చేసి, జీర్ణించుకుపోయేలా చేయడం అవసరం.

అచల లింగాలలో స్థావరము, స్వయంభువ అని రెండు రకాలుంటాయి. స్వయంభువ ఉత్తమోత్తమ మయినది. ముక్క విరిగినా, పగిలినా, దెబ్బతగిలినా అచల లింగాలను వుపయోగించరు. చల లింగాలు వాడుకోవచ్చును. నదీప్రవాహం, మతశత్రువులు, మృగాలు, పిచ్చివాళ్ళు, దెయ్యాలు, భూతాలు అచల లింగాలను పాడు చేసినా దెబ్బ తీసినా, ప్రార్థించి, మంత్రాలతో పునీతం చేసి పూజకుపయోగించ వచ్చును.

స్వయంభులింగం దెబ్బ తింటే రెండు భాగాలను కలిపికట్టవచ్చును. స్వయంభువను తీసి వేయడం అనేక దుష్పరిణామాలకు దారి తీస్తుందని పెద్దల నమ్మకం. మన దేశంలో చాలా స్వయంభూ లింగాలను, ఎందరో మహర్షులు, భక్త శిఖామణులు ప్రతిష్ఠించి, పూజించినారు.

సౌరాష్ట్రే సోమనాధంచ, శ్రీశైలేమల్లికార్జునమ్।
ఉజ్జయిన్యాం మహాకాల మోంకార మమలేశ్వరమ్।
పరాల్యాం వైద్యనాధంచ, ఢాకిన్యాం భీమశంకరం।
సేతుబన్ధేతు రామేశం నాగేశం దారుకావనే।
వారణస్యాంతు విశ్వేశం, త్ర్యంబకం గౌతమీతటే
హిమాలయేతు కేదాం ఘుశ్మేశంచ శివాలయే।

సౌరాష్ట్రంలో సోమనాథ్, ఆంధ్రప్రదేశ్‌లో శ్రీశైల మల్లికార్జున స్వామి, ఓంకారేశ్వర్, (అమరేశ్వర్, అమలేశ్వర్) నర్మదా నదీ తీరంలో వున్నది (మధ్యప్రదేశ్). మహాకాల్ ఉజ్జయిని కేదారనాథ్ హిమాలయాల్లో ఉత్తరప్రదేశ్, భీమశంకర్ పూనా మహారాష్ట్రలో, విశ్వనాధ్ కాశీ ఉత్తరప్రదేశ్, త్రయంబకేశ్వర్ నాసిక్, మధ్యప్రదేశ్ వైద్యనాథ్ దేవొగార్ బెంగాల్, నాగేశ్వర్, ద్వారకా సౌరాష్ట్ర, రామేశ్వరం తమిళనాడు, గుష్మేశ్వర్ ఎల్లోరా గుహలు ఇవి శివపురాణ వివరణ ననుసరించి స్వయంభూ లింగాలని ప్రసిద్ధి గాంచినవి.

**శ్రీ సోమనాథ్ :** సౌరాష్ట్రంలో వున్నది. దేవపట్నం అని కూడ అంటారు. ప్రసిద్ధి కెక్కిన దేవాలయం తురుష్కదండయాత్రవల్ల ఎన్నోసార్లు

దెబ్బతిన్నా నిలబడి వున్నదీదేవాలయం 1951లో పునఃప్రతిష్ఠించారు. రోగులు, తీరని కష్టాలున్నవారు సోమనాధుని దర్శించి ప్రార్థిస్తే కోరికలు తీరి రోగాల బారినుండి రక్షణ కలుగుతుందని నమ్మకము.

**శ్రీశైల మల్లికార్జునస్వామి :** ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీశైలం (కర్నూలు జిల్లా) ప్రసిద్ధిచెందిన శైవ క్షేత్రం. చంద్రావతి అనే రాణి ఈ దేవుణ్ణి మల్లెపువ్వులతో పూజించినందు వల్ల మల్లికార్జునుడుగా ప్రసిద్ధికెక్కిన శివలింగమిది.

**శ్రీ ఓంకారేశ్వర్ :** నర్మదానదీతీరంలో మాంధాత పర్వతం మీద వెలసినది. మధ్యప్రదేశ్‌లో మాళ్వాప్రాంతంలో ఉజ్జయినికి సుమారు 140 కి. మీ. దూరంలో వుంటుంది ఓంకారేశ్వర్. నర్మదానది ఆవలి ఒడ్డున అమలేశ్వర్ దేవాలయం కూడా వున్నది.

**శ్రీ మహాకాళేశ్వర్ :** ఇది ఉజ్జయినిలో వున్నది. స్వర్గంలో తారకలింగం, పాతాళంలో హటకేశ్వరలింగం, మర్త్యలోకంలో మహాకాళేశ్వరలింగం ఈ మూడు లింగాలను పూజిస్తే జన్మతరిస్తుందంటారు. ఇది షిప్రానది ఒడ్డునవున్నది. అగ్నిపురాణంలో శ్రీ మహా కాళేశ్వరుని తీర్థం, తీర్థాలలోకెల్ల గొప్పతీర్థమని పేర్కొనబడినది.

**శ్రీ కేదారినాథ్ :** నరుడు నారాయణుడు విష్ణ్వాంశ సంభూతులు. హిమాలయాలలో తపస్సు చేసారు. వారి తపస్సుకు మెచ్చి శంకరుడిచ్చట జ్యోతిర్లింగంగా వెలిసాడు. ప్రపంచం నలుమూలల నుండి భక్తులు ఇక్కడకు వస్తారు. ఉత్తరప్రదేశ్‌లో వున్నది.

**శ్రీ భీమశంకర్ :** సహ్యాద్రి పైన వున్నది పూనాకు (మహారాష్ట్ర) 50 కి. మీ. దూరంలో ఖేడ్ ప్రాంతంలో బోవాగిరిపైన వున్నది. ఇచ్చటనే భీమానది ప్రారంభమవుతుంది. కృష్ణనదికిది ఉపనది. ఈ లింగం నించి నీరుకారుతుంటుంది చూడదగ్గది.

**శ్రీ విశ్వనాథ్ :**

అన్యక్షేత్ర కృతంపాపం పుణ్య క్షేత్రేవినశ్యతి ।
పుణ్యక్షేత్రకృతంపాపం వారణాస్యాం వినశ్యతి ।

తన శాశ్వత నివాసంగా శంకరుడు కాశీని ఎంచుకున్నట్లు పెద్దలు చెబుతారు. చాలా పురాతనమైన దేవాలయం ఇది. ఎన్నో దాడులకు తట్టుకుని నిలబడ్డదీ దేవాలయం. హిందువులకు గొప్ప పుణ్య క్షేత్రంగా పురాణ ప్రసిద్ధి చెందినదీ క్షేత్రం. ఇచ్చటి శివుడు విశ్వనాధుడుగా ప్రసిద్ధి చెందాడు అన్నపూర్ణ మహాదేవి ఇచ్చట వెలసినది.

**శ్రీ త్రయంబకేశ్వర్ :** నాసిక్ నుంచి సుమారు 30 కి. మీ. దూరంలో వున్నది. స్వయంభు లింగం. నీటి మధ్యలో వున్నది. పద్మపురాణంలో ఈ క్షేత్రం గురించి వ్రాయబడ్డది.

**శ్రీ వైద్యనాథ్ :** దేవోగర్ అన్నచోట రావణాసురుడి ఈ లింగాన్ని ప్రతిష్ఠించాడు. దేవోగర్ రైల్వేస్టేషన్ పశ్చిమ బెంగాల్ సంతాల్ పరగణాలో వున్నది. శివపురాణంలో దీని చరిత్ర వున్నది.

**శ్రీ నాగేశ్వర్ :** ద్వారక నించి బెట్ ద్వారకకు పోయే దారిలో వున్నది. శివుడు ప్రత్యక్షమై సుప్రియ అనే భక్తుని కాపాడేడు ఇక్కడ వెలసిన జ్యోతిర్లింగం శ్రీ నాగేశ్వర్. శివపురాణాన్ననుసరించి ఈ దేవస్థానం గొప్పదని తెలుస్తున్నది.

**శ్రీ రామేశ్వర్ :** ఈ జ్యోతిర్లింగాన్ని స్వయంగా శ్రీ రామచంద్రుడు రావణ వధ పాతక విమోచనం కోసం యిక్కడ ప్రతిష్ఠించినట్లు శాస్త్ర ప్రమాణము కలదు. హనుమంతుడు శివుని ప్రార్థించి కైలాశం నుంచి జ్యోతిర్లింగం తేవడం ఆలస్యమయితే సీతాదేవి ఇసుకతో శివలింగం చేయడం శ్రీ రామచంద్రుడు ప్రతిష్ఠించడం జరిగినందుకు హనుమంతుడు ఖిన్నుడయినందున శ్రీ రామచంద్రుడు హనుమంతుడు తెచ్చిన విగ్రహాన్ని కూడ ప్రతిష్ఠించి ముందుగా ఈ లింగాన్నే ప్రార్థించి పూజించాలని ఆదేశించినట్లు పెద్దలు చెబుతారు. ఈ లింగం అతి పురాతనమైనది. భక్తులు గంగాజలంతో అభిషేకం చేస్తారిక్కడ.

**శ్రీ గుషమేశ్వర్ :** ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఎల్లోరా గుహల వద్ద వున్నది. శివుడు సుదేహ అనే భక్తురాలికి ప్రత్యక్షమై జ్యోతిర్లింగంగా వెలిసాడు.

# శారీరకోపనిషత్తు

శారీరకోపనిషత్తు యజుర్వేదాంతర్గతమైనది. పృథివి, అప్పు (జలము) తేజస్సు, వాయువు, ఆకాశము అనెడి పంచభూతముల సంయోగమే శరీరము. ఆ శరీరమునందు కఠినమైనది పృథివి ద్రవమైనది అప్పు, ఉష్ణమైనది అగ్ని, సంచరించు స్వభావము కలది వాయువు. ద్వారము కలది ఆకాశము, శ్రోత్రాదులు జ్ఞానేంద్రియములు శ్రోత్రము ఆకాశాంశము. త్వక్కు వాయువంశము చక్షువు అగ్ని అంశము. జిహ్వ జలాంశము ఘ్రాణము భూమి అంశము. ఇవ్విధములైన యింద్రియములకు వరుసగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు విషయములు ఇవి వరుసగా భూమి మొదలగు వాని నుండి కల్గినవి.

నోరు, చేయి, కాలు, గుదము, ఉపస్థము అనునీయైదును కర్మేంద్రియములు. 'కర్మేంద్రియ ముల యొక్క విషయములు క్రమముగా మాటలా డుట, ఇచ్చుట, నడచుట, జల, మల, విసర్జన చేయుట, ఆనందించుట అనునవి. ఇవి పృధివి అప్పు (జలము) తేజస్సు (అగ్ని) వాయువు, ఆకాశము అనునీ పంచభూతములనుండి కల్గినవి.

మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అనునవి నాలుగును అంతఃకరణ చతుష్టయమన బడును. సంకల్పవికల్పాత్మకమైనది మనస్సు నిశ్చ యాత్మకమైనది బుద్ధి. స్వాభిమానమైనది. అహం కారము, అవధారణాత్మకమైనది చిత్తము. ఈ నాలు గును అతఃకరణ చతుష్టయము యొక్క కార్యములు మనస్సు యొక్క వాసస్థానము కంఠము, బుద్ధి యొక్క వాసస్థానము వాక్కు అహంకారము యొక్క వాస స్థానము హృదయము, చిత్తము యొక్క వాసస్థానము నాభి.

ఎముకలు, తోలు, నరములు వెంట్రుకలు, మాంసము ఇవి పృధివి యొక్క అంశములు. మూత్రము, కఫము, నెత్తురు, శుక్లము, ఇవి జలము యొక్క అంశములు. ఆకలి, దప్పి, సోమరితనము, మోహము, మైధునము ఇవి అగ్నియొక్క అంశములు. నడచుట, గీరుట కనులు మూయుట, తెఱచుట మొదలగునవి వాయువు యొక్క అంశములు, కామము క్రోధము, లోభము, మోహము, భయము ఇవి ఆకాశము యొక్క అంశములు.

శబ్దము, స్పర్శము, రూపము, రసము, ఈ నాలుగును జలము యొక్క గుణములు. శబ్దము స్పర్శము, రూపము ఇః మూడును అగ్ని యొక్క గుణములు. శబ్దము, స్పర్శము ఇః రెండును వాయువు యొక్క గుణములు. శబ్దము ఒకటే ఆకాశము యొక్క గుణము.

సాత్త్వికము, రాజసము, తామసము అనునివి మూడును గుణములు.

హింసింపకుండుట, అబద్దము చెప్పకుండుట చౌర్యమొనరింపకుండుట, వ్యభిచరింపకుండుట ఇతరుల ద్రవ్యమునందభిలాష లేకుండుట, కోపము లేకుండుట, గురుశుశ్రూష, శౌచము (దేహశుద్ధియు మనశ్శుద్ధియు) సంతోషము, ఋజుమార్గము, తన్ను పొగడుకొనకుండుట, అస్తిక్యము (దైవమునందును, వేదశాస్త్రములయందు నమ్మిక) పరులకు కీడు చేయకుండుట, ఇవి యన్నియు సాత్త్విక పకృతి గలవాని యొక్క గుణములని తెలియ దగినవి.

నేను కర్తను, నేను భోక్తను, నేను వాచాల

కుడను, నేను అభిమానము కలవాడను, అనునవి రాజన ప్రకృతి గలవాని యొక్క గుణములని బ్రహ్మవేత్తలచే జెప్పబడుచున్నవి.

నిద్ర, సోమరితనము, మోహము, ఆశ, మైధునము దొంగతనము, ఇవి తామస ప్రకృతి గలవాని యొక్క గుణములని బ్రహ్మవాదులే చెప్పబడు చున్నవి.

సత్త్వ గుణము కలవాడు ఊర్ధ్వ (స్వర్గాది) లోకముల యందును, రాజసగుణము కలవాడు మధ్య (భూ) లోకమునందును, తామస గుణము కలవాడు అధో (నరక) లోకమునందును పుట్టుచున్నాడు.

సమ్యక్ (బ్రహ్మ) జ్ఞానము సాత్త్వికము, కర్మ జ్ఞానము రాసము, అజ్ఞానమనెడి చీకటి తామసము.

జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయము అని అవస్థలు నాలుగు విధములు.

జ్ఞానేంద్రియములైదు. కర్మేంద్రియములైదు. అంతఃకరణములు నాలుగు, ఈ పదునాలుగు ఇంద్రియములతో గూడినవి, జాగ్రము అంతఃకరణ ములు నాలుగుతో గూడినది. స్వప్నము ఒక్క చిత్తముతో గూడినది. సుషుప్తి జీవునితో మాత్రము గూడినది. తురీయము కనులు తెఱుచుకొని యుండు వాడు కనులు మూసుకొని యుండువాడు. కనులు మూయకను, తెరువకయుండువాడు. జీవాత్మ పరమాత్మ అలో జీవాత్మక్షేత్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు.

జ్ఞానేంద్రియములైదు. కర్మేంద్రియములైదు, ప్రాణములైదు, మనస్సు బుద్ధి అనునీ పదునేడింటితో గూడినది సూక్ష్మదేహము ఇదే లింగదేహమని చెప్పబడు చున్నది.

మనస్సు, బుద్ధి, అహంకారము, ఆకాశము, వాయుదు, అగ్ని, జలము, భూమి ఇవి ఎనిమిది ప్రకృతులు. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు, గుదము, ఉపస్థ, చేతులు, కాళ్ళు, వాక్కు, శబ్దము, స్పర్శము రూపము, రసము, గంథము, అనుననవి పదునైదును తత్త్వములు (తత్త్వములు పదునారని చెప్ప బడియున్నది. ముందు చెప్పిన ప్రకృతులు ఎనిమిదియు ఈ తత్త్వములు పదునైదు చేరి ఇరువది మూడు తత్త్వములు. ఇరువదినాల్గవ తత్త్వము అవ్యక్త మనెడి ప్రధానము. ఈ ప్రధానముకంటే వేరైనవాడే (శ్రేష్ఠుడే) పురుషుడు).

ఈ లక్షణములు ప్రతి మానవుడు తెలిసి కొనవలసిన అవసరమెంతేని కలదు.

## షట్చక్రములు

మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాచక్రము అనునవి షట్చక్రములు. వీనికి పైని సహస్రారకమలమునందు శ్రీ లలితా మహాదేవి యుండును.



# వైష్ణవాగమములు



శాశ్వతానంద సంధాయమగు మార్గము కొఱకై మహర్షులు, విజ్ఞులు, ఆయాదేశకాల పాత్రానుగుణముగ అనేక ప్రయత్నములు చేయుచున్నారు. ప్రసిద్ధి వహించిన పదియవతారములలో శ్రీమన్నారాయణుని దివ్యాను గ్రహమును పరిపూర్ణముగ చూరగొన్న మహర్షులు ప్రపంచ శాంతి లక్ష్యమందుంచుకొని నియమబద్ధముగ నిస్స్వార్థ జీవనులైన ప్రాచీనుల మహత్తర ప్రయత్న ఫలితములైన త్యాగ, తపస్సుల ప్రభావము వలన దేశ, విదేశములయందు వేనోళ్ల అభినందింపబడుచున్నది మన భారతీయ సంస్కృతి.

జీవకారుణ్య తత్పరులై, త్యాగధనులైవారు తమ తపశ్శక్తిచే సంపాదించిన పవిత్ర తపస్సంపదకు మనలను వారసులనుగా జేయుట మన భాగ్య విశేషమన వచ్చును. తపశ్శక్తితో సాధించిన మహనీయ నిధులలో గొప్పది పాంచరాత్ర శాస్త్రము.

పరంపరగా వస్తున్న దేవాలయ వ్యవస్థలకు మూలభూతమగు నీపాంచరాత్ర ప్రాశస్త్యము అపూర్వము.

విష్ణ్వాలయ నిర్మాణోత్సవాదులను ప్రపత్తి స్వరూపములను, పురుషార్థ సాధనమును సృష్ట్యాది నుండి మన కుపదేశించుచున్నది శ్రీ పాంచరాత్ర శాస్త్రము.

శ్రీమన్నారాయణుడు మొదట ఐదురాత్రులలో శ్రీదేవికి, బ్రహ్మదేవునకు, ఆదిశేషునకు, గరుత్మంతునకు సర్వసైన్యాధ్యక్షుడైన విష్వక్సేనునకును ఏకాయనమను పేరనుపదేశించెను. ఐదు రాత్రులందుపదేశించుటచే 'ఏకాయన' వేదము పాంచరాత్రమను పేర ప్రఖ్యాతమైనది. ఈ ఏకాయన శ్రుతి శ్రీ మన్నారాయణునిచేతను, ఈ ఐదుగురి ద్వారా ఇతరులకు గూడ ఉపదేశింపబడి పరంపరగా వ్యాపించుచు వచ్చినది.

శాండిల్య, ఔపగాయన, మౌంజ్యాయన, కౌశిక భరద్వాజ మహర్షులకు నిర్విరామంగా రాత్రిం బవళ్ళు, సర్వేశ్వరుడు, ఈ శాస్త్రమును ఐదు దినములు ఉపదేశించుటచే పాంచరాత్రమని, ఈశ్వర సంహిత చెప్పుచున్నది.

ఐదు రాత్రులలో ఈ శాస్త్రముపదేశించుట వలన దీనికి పాంచరాత్రమను నామమేర్పడినదని మార్కండేయ సంహితయందు చెప్పబడినది.

ఈ పంచరాత్రమునకు ఏకాయనము, ప్రకృతి వేదము మూలవేదము, సాత్వతము, ఆగమము, తంత్రము, భగవచ్ఛాస్త్రము, మహోపనిషత్తు, భాగవత మతము, దివ్యశాస్త్రము మొదలగు నామాంతర ములు కలవు.

మోక్షమందుటకు దీనికంటే వేరే మార్గము లేనందున దీనిని మహర్షులు ఏకాయనమని వ్యవహరించిరి.

వైష్ణవాగమములు రెండు విధములు. వైఖానసము, పాంచరాత్రము. మహాభారత శాంతిపర్వము ననుసరించి శ్రీమన్నారాయణుడు, బ్రహ్మ దేవునకు ఈ ప్రత్యేక విధానము నెరింగించెను. వైఖానసము ప్రాచీనమైనది. పాంచరాత్రము స్వయముగా నారాయణునిచే బ్రహ్మాది గాగల వారికి ఉపదేశింపబడినది. వైఖానసము ఋషి ప్రోక్తము మరియు పాంచరాత్రము వాసుదేవ ప్రోక్తముగా ద్వి విధము లైనది. రెండింటికి మౌలిక భేదములేదని పెద్దలు చెప్పుచున్నారు.

అన్ని శాస్త్రములకు ఆగమములు ఉత్పత్తి స్థానము. ఋగాది మంత్రములన్నియు దీనిలో కీర్తింపబడెను. అందువలన దీనిని ఋషులు ప్రకృతివేదమనిరి.

వేదవృక్షమునకు మూలమైనది, జగత్తునకు మూల భూతుడగు వాసుదేవుని ప్రతిపాదించుటవలన, (వేదమువలె ప్రతిపాదించుటవలన) మూల వేదమను వ్యవహార నామము సిద్ధించినది.

వాసుదేవుడగు పరబ్రహ్మనే 'సత్' అందురు. అది ఆరాధ్యముగా గలవారు సత్వంతులు. వాసుదేవారాధకులు. వారి శాస్త్రము సాత్వతశాస్త్రము.

ఆఙ్+గమ్+అచ్. ఆగమః. సృష్టి, ప్రళయము దేవతార్చనము, సుఖసాధనము, మంత్రపునశ్చరణము, వశ్య, ఆకర్షణ, విద్వేషణ, మారణ, మోహన, ఉచ్చాటన అను షట్కర్మసాధనము, చతుర్విధ ధ్యానయోగము నకు యీ ఏడు లక్షణములతోనుండు శాస్త్రము ఆగమమని చెప్పబడినది. మరియు మోక్షప్రాప్తి ఉపాయములనుపదేశించుచు ఆచారములను చెప్పుట వలన శ్రీ మహావిష్ణు కథనము వలనను ఇది ఆగమమని పిలువబడినదని పురుషోత్తమ సంహిత తెలుపుచున్నది.

ఏకాయన వేదమంత్రము తత్త్వమంత్రములు భక్త సంరక్షణ మొనర్చుచున్నవిగాన దీనికి తంత్ర మందురు.

శాస్త్రములెన్నియోగలవు. భగవంతునిగూర్చి చెప్పిన శాస్త్రములెన్నియోగలవు. కాని భగవంతునిచే మోక్షోపాయముగ చెప్పబడినదగుటచే పాంచరాత్రము నకు భగవచ్ఛాస్త్రమను పేరుతగియున్నదని పురుషోత్తమ సంహితలో వసిష్ఠ మహర్షి నుడివెను.

రహస్యార్థమగు మోక్షోపాయమిందు విపులముగ ప్రతిపాదింపబడినది గాన దీనికి మహోపనిషత్తని వ్యాస మహర్షి ప్రశంసించినాడు.

భాగవతులన పరమ నిర్మల నియమ నిష్ఠులు, తత్త్వజ్ఞులు. శ్రీమన్నారాయణుని భక్తులను గూర్చి తెలుపునది, అనగా వారి శాస్త్రం లేక మతం భాగవతమత మయినది.

భగవంతునిచే స్వయముగ ఉపదేశింపబడినదీ శాస్త్రము. మహిమకలది, వైదికము, దివ్యము. అందువలన దివ్యశాస్త్రమైనది.

పాంచరాత్రము జ్ఞాన, యోగ, క్రియ, చర్యపాదములుగ విభజింపబడినది.

సృష్టి – జీవుడు, సంసారము, ముక్తి, భువనకోశ స్వరూపము, వ్యూహవర్ణనము, తన్మహిమ అను విషయములను గూర్చి వివరముగ విచారింపబడునది జ్ఞాన పాదము.

యోగ విభాగము – యోగాంగ వివరణము యోగము ద్వారా పరమాత్మోపాసనముగూర్చి వర్ణించు భాగము యోగపాదము.

భూపరీక్ష, గ్రామనిర్మాణము, ఆలయనిర్మాణము, విగ్రహ నిర్మాణము, ప్రతిష్ఠ అను విషయములు నిరూపింపబడుటవలన ఈభాగము క్రియాపాదమైనది.

చర్యాపాదమున ప్రతిష్ఠితమూర్తులకు నిత్య నైమిత్తి కోత్సవాదులగూర్చి నిరూపింపబడినది. ఈ ప్రకారము పంచరాత్రము నాల్గు విధములుగా నున్నది. ఉపదేశపరంపర ననుసరించి దివ్య, ముని భాషిత, మానుషశాస్త్రములుగ దీనిని మూడు విధములుగ విభజించిరి.

సర్వవేదసారమైన పురుషసూక్తములో ఏకా యన ప్రశంసచేయబడినది. 'నాన్యఃపన్థా అయనాయ విద్యతే' అని. శతపథ బ్రాహ్మణము నందును పాంచరాత్ర ప్రశంస కనబడుచున్నది.

చాందోగ్యోపనిషత్తునందలి భూమవిద్యలో ఈ శాస్త్ర ప్రశంసకలదని నారదుని వచనములవలన తెలియు చున్నది. మహాభారతమున వ్యాసమహర్షిచే ఈ శాస్త్ర ప్రశంస చేయబడినది. శ్రీమద్భాగవత పురా ణమునకూడ దీని ప్రశంస కలదు. పాంచరాత్ర సంహిత లోకూడ పాంచరాత్ర ప్రాశస్త్యము నిరూపింప బడినది.

ఇది మోక్ష ప్రాపక శాస్త్రము. ధర్మార్థకామ ప్రదము. భారతీయ సంస్కృతిని మేటి సంస్కృతిగా తీర్చి దిద్దిన దేవాలయ వ్యవస్థకు నాంధీవాక్యము పలికినదీ శాస్త్రము. గ్రామ నిర్మాణమునకు పూర్వమే దేవాలయమును నిర్మించి దానికి చుట్టును వీధులను విడిచి గ్రామ నిర్మాణము చేయవలెనని ఈ శాస్త్రము నుడువుచున్నది. దండకము, స్వస్తికము, ప్రస్తరము, ప్రకీర్ణవము, అన్నా వర్తము, పతాకము, పద్మము, శ్రీప్రతిష్ఠితము అను ఎనిమిది విధముల గ్రామములు, వాటి నిర్మాణక్రమము ఇందు పేర్కొనబడినది.

ఈ శాస్త్రమందనేక లౌకికాలౌకిక విషయచర్చ జరిగినది. వాస్తు, జ్యోతిష, ఆయుర్వేద, గాంధర్వ, సంగీత, నృత్య, శిల్ప, పాక, యంత్ర, మంత్ర, యోగ సాంఖ్యాదిశాస్త్ర విషయములెన్నో ఇందు కన్పించును. అంతేకాక శరణాగతి అని నామాంతరమున గల ప్రపత్తి ధర్మమిందు విపులముగ నిరూపింపబడినది.

ఈ శాస్త్రములో నిష్ణాతులైన మహనీయులు ఎచ్చటైనను, స్వమంత్రబలముచే భక్తులకు, భగవ సాన్నిధ్యము నిప్పింప సమర్థులెరి. రాజ, రాష్ట్ర, గ్రామ, యాజమాన, ఆచార్య, అర్చక, పాచక, పరిచారికాదు లందరకు ఇష్టకామ్యములు సిద్ధించి పరమపదప్రాప్తి యగుగాకయని ప్రతినిత్యము లోకకళ్యాణ సంకల్పము తో త్రికాలములయందు దేవాలయములయందు నిర్వహింప దగిన ఆర్చాకైంకర్యములను నిరూపించు చున్నది. నిత్యోత్సవ, పక్షోత్సవ, దీపోత్సవ, కళ్యాణో త్సవ, మహోత్స వాదులను దేవాలయములందు విధించి తద్వారా వివిధ పద్ధతులలో చేతనోద్ధారణము చేయుచున్నది.

లోకములోని ఉత్తమసంప్రదాయములు తద్వా ఙ్మయమును దీనియందు కలవు. కాలమహిమవలన ఇది నిరాదరింపబడుచున్నది. అందువలన ధర్మహాని కలుగుచున్నది కదా. ముముక్షువులు గ్రహింప ప్రార్థన.

## అర్చాస్వరూపములు

(1) పుణ్యక్షేత్రములలో భగవానుడు స్వయముగా వెలయుట

(2) మహేశ్వరుడు, బ్రహ్మ, మహేంద్రుడు మున్నగు దేవతలచే ప్రతిష్ఠితమైనవి

(3) మంత్రసిద్ధులగు మహర్షాదులచే ప్రతిష్ఠింపబడినవి.

(4) హరి భక్తులు, జనులు, భక్తితో ప్రతిష్ఠ జరిపింపబడినవి.



# మానవ సేవలో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానం
## తిరుమల, తిరుపతి.

శ్రీ వేంకటాద్రిని పరమాత్మ నిలయమని, కృత యుగమున అంజనాద్రియనియు, త్రేతా యుగమున నారాయణాద్రి యనియు, ద్వాపరమున సింహాద్రి యనియు కలియుగమున వేంకటాద్రి యనియు వ్యవహరించెదరు.

శ్రీ వేంకటాద్రి శ్రీ మహావిష్ణువు స్వయం వ్యక్తమైన దివ్యస్థలము. దీనియందు శ్రీ మహావిష్ణువు నకు ప్రీతి యధికము. ఇచ్చట అన్ని కోర్కెలు సిద్ధించును. ఇచ్చట శ్రీ విష్ణుమూర్తి యొక్క చరిత్ర అత్యద్భుతము. ఇది నయనానందకరము. అందుచేత గొప్ప వైష్ణవ క్షేత్రమైనది.

'వేం'కారము అమృతబీజము 'కట'మన నైశ్వర్యము, అమృతైశ్వర్యముల సంఘమగుటచే నీగిరి వేంకటాద్రి యనబడుచున్నది. శ్రీనివాసుడు దీనినధి ష్ఠించి యుండుటచే 'శ్రీనివాసగిరి' యనికూడ పిలువబడుచున్నది.

శ్రీ వేంకటాద్రి యందు వేంచేసియున్న వేంకటేశ్వరస్వామిని దర్శించుటకు ప్రతిరోజు సుమారు ముప్పైవేల మంది భక్తులు వస్తున్నారంటే ఈ క్షేత్రమహిమ చెప్పనలవి కానిది. దక్షిణ భారతమున గల గొప్ప వైష్ణవాలయమిది. ప్రపంచములో ఇంతటి మహిమ గలిగిన క్షేత్రము లేదని చెప్పవచ్చును.

ఏడుకొండలు ఆదిశేషుని ఏడు తలలంటారు. స్వయంభు దేవాలయమిది. 'తొలప్పియమ్' 'శిలప్పధికరం' అనే ప్రాచీన తమిళ గ్రంథములో శ్రీ వేంకటేశ్వరుని గూర్చి చెప్పబడ్డది. శ్రీ వేంకటేశ్వర స్వామి ఇక్కడకు వచ్చి ఆదిశేషుని వద్దకు వస్తే ఆదిశేషుడు స్వామిని తన రక్షణలో వుంచినట్లు పెద్దలు చెబుతారు. అందుకే శేషాద్రిగిరి నివాస అంటారు. ఇక్కడ వెలసి, పద్మావతీదేవిని వివాహమాడి స్థిరంగా వుండిపోయాడు శ్రీనివాసుడు. పద్మావతీ వివాహ సమయంలో ఖర్చులకోసం కుబేరుని వద్ద అప్పు తెచ్చుకొన్నాడు శ్రీనివాసుడు. ఆ అప్పు తీర్చడం కోసం నేటి భక్తులు, శ్రీ వేంకటేశ్వరస్వామికి విశేషంగా సమర్పిస్తున్న కానుకలు, ధనం వస్తు, వాహనాలు అని ప్రతీతి. కలియుగాంతం వరకు అప్పు తీర్చాలట స్వామి! ఇది వడ్డీ మాత్రమే.

ఈ స్వామి మూర్తికి నాలుగు చేతులున్నవి. ఒక చేతిలో శంఖు, ఒక చేతిలో చక్రం. ఒక చెయ్యి అభయ హస్తం, ఒక చేయి పక్కన పెట్టుకొని వుంటాడు స్వామి రెండు ముంజేతుల మీద భుజంగ వలయం (శివ చిహ్నాలు) వుంటుంది. అద్భుత రూపం. దర్శన మాత్రముననె భక్తులు తృప్తులవు తారు. ప్రయాణ శ్రమ మరిచిపోతారు. శ్రీ వేంకటాద్రి కలియుగ వైకుంఠం.

ద్రవిడ వాస్తు నిర్మాణ శైలికి ఈ దేవాలయం ప్రతీక ఆనంద విమానము గర్భగుడిపైన చూడ చక్కని శిల్పవిన్నాణంతో బంగారు పూత పూసిన పనితనం అద్భుతంగా భక్తుల మనసులలో నిలిచిపోయే ట్టుంటుంది. విమాన వేంకటేశ్వర స్వామిని దర్శిస్తారు భక్త జనులు.

శ్రీ గోవింద రాజులుస్వామి కొండ దిగువన వేంచేసి యున్నారు. అద్భుతమైన దేవాలయమిది.

'శ్రీ వేంకటేశ్వర ఇతిహాసమాల' ననుసరించి స్వామికి పూజలు జరుపుతారు. వైఖానస సాంప్రదాయ పద్ధతిలో స్వామికి పూజలు జరుపుచున్నారు. సుప్రభాతంతో స్వామిని మేలుకొలిపి, తోమాలసేవ, సహస్రనామార్చన కాక అనేక పూజాపునస్కారములు ప్రతిరోజు జరిపి కలియుగ వైకుంఠంగా ఈ క్షేత్రాన్ని అభివృద్ధి పరచినారు భక్తుల సహకారంతో దేవస్థానము వారు. ఏకాంత సేవతో దినచర్య ముగిస్తారిక్కడ.

'శ్రీ వేంకటాచల ఇతిహాసమాల' పవిత్ర గ్రంథం ఐదుభాగములు కలది. అందు మూడు భాగములు వైష్ణవ సిద్ధాంతములతోను, మిగతా భాగములు శ్రీ రామానుజునిచే విధింపబడిన పూజా పద్ధతులతో నిండి వుంటుంది. వైఖానస సాంప్రదాయములో స్వామిని అర్చిస్తారు అర్చకులు. శ్రీ రామానుజులు ఈ ఆలయాన్ని పునరుద్ధరించినట్లు చెబుతారు.

తలనీలాలు స్వామికి మొక్కుబడిగ సమ ర్పించడం ఈ క్షేత్ర ప్రత్యేకత.

భక్తజన సందోహం మిక్కుటముగా వున్నం దున దేవాలయ పాలనాధికారులు ఎన్నో వసతులు కల్పిస్తున్నారు.

దేవాదాయాన్ని మానవసేవకు వినియోగిస్తు న్నారు. యాత్రికులకు ఎన్నో సౌకర్యాలు కల్పిస్తు న్నారు.

## యాత్రికుల సౌకర్యముల వివరములు :

### వసతి :

శ్రీ తిరుపతి దేవస్థానము వారు దినదినము అధికమగుచున్న యాత్రికులకు విరివిగ వసతి సౌకర్యము కల్పించుచున్నారు. ఎన్నో సత్రములు కట్టించినారు, కట్టించుచున్నారు. 718 గదులున్నట్లు తెలియుచున్నది. ఇక్కడ వసతి ఉచితము. సుమారు 2700 అద్దె గదులున్నట్లు తెలియుచున్నది. ఇవికాక కుటుంబములతో నుండుటకు కాటేజీలు కలవు. ఉచిత వసతి విరివిగా కల్పించుటకు దేవస్థానం వారు అమిత శ్రద్ధతో ప్రయత్నములు చేయుచున్నారు.

### భోజన సదుపాయం, నిత్య అన్నదాన పథకం :

యాత్రికులకు సంతుష్టికరముగా భోజన సదుపాయము చేయుటకు దేవస్థానమువారు ఏర్పాట్లు చేయు చున్నారు. తిరుమలలో ఫలహారశాలలు నిర్వహించుచున్నారు. కళ్యాణ కట్ట వద్ద, శ్రీ వేంకటేశ్వర అతిథి గృహం వద్ద, తిరుపతి రెండవ సత్రము వద్ద, ఫలహారశాలలు సమర్థవంతముగా నడుపుచున్నారు.

నిత్యాన్నదాన పథకం ఇచ్చట విజయవంతంగా నడపబడుచున్నది. గర్భగుడిలో యాత్రీకులకు భోజన చీటిలు పంచుచున్నారు. ఎందరో యాత్రికులు యీ ఉచిత భోజన సదుపాయాన్ని ఎంతో భక్తితో స్వీకరిస్తున్నారు. వేలాది మంది ఒకే పంక్తిలో కూర్చుని భోజనం చేయడం ఆనందదాయక మైనది. ఈ పథకము సంతృప్తికరముగా నడపబడు చున్నదని యాత్రికుల నుంచి తెలియుచున్నది. ఇప్పటి వరకు 44 లక్షలకు పైగా విరాళములు ఈ పథకమునకు లభించినవని తెలియుచున్నది.

### కళ్యాణకట్ట :

తమ శిరోజములను యాత్రికులు భగవ దర్పణకై సమర్పించుట యీ క్షేత్ర ప్రత్యేకత. అనాది నుంచి యీ కార్యక్రమము నిర్విఘ్నముగ కొనసాగు చున్నది. పూర్వము కొంత నియమిత పైకము దేవ స్థానమువారు తీసికొనేవారు. కాని యిప్పుడెట్టి రుసుము ఇక్కడ చెల్లించనవసరములేదు. 19.4.1986 తేది నుంచి యీ ఏర్పాటు జరిగినది. తిరుమలలో ఉచిత బస్సు సౌకర్యము కల్పించబడినది.

### మతోద్ధరణ పథకాలు: ధర్మప్రచార పరిషత్:

ధర్మప్రచార పరిషత్, 1987 దేవాదాయ చట్టాన్ననుసరించి స్థాపింపబడినది. సనాతన ధర్మ ప్రచారము ఈ పరిషత్ యొక్క ముఖ్య కార్యక్రముగా నిర్ణయించబడినది. ఈ ధర్మప్రచారము, భజనలు ఉపన్యాసములు, పిల్లలలో స్తోత్రములు మొదలగువాని పఠనమునందాసక్తి కలిగించుట, పిల్లల పుస్తక ప్రచురణ, భజనలు మొదలగు వానికి ఉపయోగపడునటుల భజన సంగీత సామగ్రి ఆయా సమాజములకు ఉచితముగా యిచ్చుట మొదలగు కార్యక్రమములు చేపట్టి నిర్వ హిస్తున్నది. ప్రతియేట వేసవి పాఠశాలల్లు నిర్వహిస్తూ సనాతన ధర్మబోధనకు ఉపాధ్యాయులకు శిక్షణ, పునశ్చరణ తరగతులు నిర్వహిస్తున్నది. ప్రతి సంవత్స రము రూ.50 లక్షలు వ్యయము చేయు చున్నది.

### వేదపారాయణ ప్రణాళిక :

తిరుమల తిరుపతి దేవస్థానము వేదపారాయణ ప్రణాళికను చేపట్టి అమలు చేయుచున్నది. వేదము లను భద్రపరచుచు వాటి ప్రచారమునకు విశేష కృషి చేయుచున్నది. ప్రతి దేవాలయమునందును వేద పారాయణ జరిపించుటకు కృషి చేయుచున్నది. వేద పండితులకు వృద్ధాప్యపు పించనులను ఏర్పాటుచే సినది. సుమారు 300 మంది ఘనాపాటీలు, క్రమపాటీలు, మరియు పండితులకు ఈ వృద్ధాప్యపు పించను ప్రణాళిక అమలు చేయుచున్నది. వారు నిర్దేశించిన దేవాలయములలో వేదపారాయణ చేయుచు అవకాశము లేని వృద్ధ వేద పండితులు ఇంటి వద్దే వేదపారాయణ చేయుటకు వీలు కల్పించినారు. వేద ప్రచారమునకు, వాటి నభ్యసించుటకు, అర్థం గ్రహించుటకు అవసరమగుచర్యలు తీసికొనుచున్నది. వేదాధ్యయన పీఠమును, ధర్మగిరి, తిరుమల యందు ఏర్పాటు చేయుటకు కృషి జరుపు చున్నది.

### అన్నమాచార్య :

దేవస్థానంవారు ప్రముఖ వాగ్గేయ కారుడు అన్నమాచార్య కృతులను ప్రచారము చేయుట కుద్దేశించి ప్రణాళికను అమలు జరుపుచున్నది. సంగీత సభలను, ఉత్సవాలను నిర్వహిస్తూ అన్నమాచార్య జయంతి,వర్ధంతులను ప్రతి సంవత్సరము వైభవముగా జరుపుచున్నది. ఈ ఉత్సవములకు ప్రసిద్ధి చెందిన సంగీత విద్వాంసులు, కళాకారులను ఆహ్వానిస్తున్నారు ఎంతో ప్రసిద్ధి పొందుచున్నదీ కార్యక్రమము.

### ప్రచురణలు :

దేవస్థానము వారు ఎంతో ఉత్సాహంగా, విజయ వంతంగా హిందూధర్మ ప్రచారమునకు అవసరమైన ప్రాచీన, నవీన గ్రంథాలను ముద్రిస్తున్నారు. దీని వలన ఎందరో గొప్ప వేదపండితులకు ఇంకెందరో గొప్ప రచయితలకు ప్రోత్సాహము లభించుచున్నది. 'వాఙ్మయ మహార్ణవ' శ్రీ వడ్లమూడి గోపాల క్రిష్ణయ్య గారి పర్యవేక్షణలో, వారి సహకారంతో, ఋగ్వేదము ఐదు సంపుటములుగా ముద్రించడం జరిగినది. అత్య ద్భుతమైన పుస్తకములివి. మన భారతీయ సంస్కృతి కివి ఎంతో అవసరమైనవి. ప్రతి యింటను ఉండవలసి నవి. శ్రీమద్భాగవతమును కూడ శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి పర్యవేక్షణలో ప్రచురణ జరుగు చున్నది. బాలభారతి ప్రచురణల విభాగములో ఎన్నో మంచిపుస్తకముల ముద్రణ జరిగినది. గుణాఢ్యుని కథా సరిత్సాగరము సంపుటముల ముద్రణ జరిగి బహుళ ప్రజాదరణ పొందినది. ఇందుకు దేవస్థానంవారెంతో అభినందనీయులు.

## విద్యాబోధన :

దేవస్థానమునకు వచ్చు ఆదాయములో చాలా భాగము విద్యాబోధనకు ఖర్చు అవుచున్నది. కాలేజీలు స్కూళ్లు నడపబడుచున్నవి. అంతేకాక ఏడు కాలేజీలు ప్రత్యేకముగ అన్ని తరగతుల బోధనకు, మరియు ఐదు కాలేజీలు సంస్కృత విద్యా మరియు వేదా ధ్యయనమునకు ప్రత్యేకముగ నడపబడుచున్నవి. సంగీత, నృత్య కళాశాలలేకాక శిల్ప అధ్యయనమునకు కూడ కళాశాల నడపబడుచున్నది. సాంకేతిక విద్యకై కళాశాల నడపబడుచున్నది. దీనివలన ఎందరికో విద్యగరవులయేకాక మన సంస్కృతి పరిరక్షణకు దోహదము కలగుచున్నది. ఇందులకు దేవస్థాన పరిపాలకులను అభినందించవలెను.

## కళ్యాణమండప నిర్మాణము :

సాంఘిక మత విషయక ఉద్ధరణ ప్రణాళిక అమలుపరచుటకు కళ్యాణ మండప నిర్మాణము చేపట్టబడినది పట్నవాసులకే కాక పల్లెజనులు కూడ లబ్ధిపొందుటకు అవసర చర్యలు తీసికొనబడుచున్నవి. తదనుగుణముగ మండల, జిల్లా ముఖ్య పట్టణములలో కళ్యాణ మండప నిర్మాణం జరుగుచున్నది. ఇప్పటికి 52 కళ్యాణ మండపాలు నిర్మించిబడ్డవి. ఇంకను సుమారు 90 కళ్యాణ మండపాలు వివిధ నిర్మాణ దశలలో వున్నవి. రెండు ఎకరముల భూమి, జిల్లా ముఖ్య పట్టణమందు ఒక ఎకరం స్థలం రూ. 30,000 లేక రూ. 75,000 విరాళములతో దాతలు సహక రించిన చోట ఇట్టి కళ్యాణ మండపాల నిర్మాణము దేవస్థానం వారు జరిపించెదరని తెలియుచున్నది.

## వికలాంగులకు సదుపాయములు :

అవసరమైన బీద, వికలాంగుల కొరకై శ్రీ బాలాజీ వికలాంగుల సంక్షేమ గృహ సముదాయమను పేర నిర్వహిస్తున్నది. వీలునుబట్టి, వారి ఇబ్బందులు తొలగించుటకు సేవాభావముతో ఈ కార్యక్రమము దేవస్థానము నిర్వహిస్తున్నది. అవకాశమున్న వారికి ఎన్నో చేతి వృత్తులయందు తర్ఫీదు యిస్తూ వారిని మన సంఘములో భాగస్వాములుగ చేయుటకు ప్రయత్నము చేయుచున్నది. మూగ, చెవిటి వారికి ప్రత్యేక సదుపాయములు కలిగిస్తున్నది.

## ఉచిత కంటి ఆస్పత్రి :

ఉచిత కంటి ఆస్పత్రి నిర్వహిస్తున్నది. ప్రసిద్ధి పొందిన కంటి వైద్య నిపుణులను రావించి వారి సేవలు వినియోగించుకొనుచున్నది. ఉచిత నేత్ర చికిత్స శిబిరము నిర్వహిస్తున్నది. ఇప్పటికి సుమారు 29 వరకు ఇట్టి ఉచిత నేత్ర చికిత్సా శిబిరములు నడప బడి నవి. దీనితో ఎందరో లబ్ధిపొందిరి. ఫిబ్రవరి '90లో ఇట్టి వైద్య శిబిరము ఏర్పాటు చేసినది దేవస్థానం. రోగులకు ఉచిత వసతి సౌకర్యము కూడ ఏర్పాటు చేసినది.

## ఓషధుల వినియోగం :

డా. బాల్‌రాజ మహర్షి అనే ప్రముఖ మూలికా వైద్య నిపుణుని సహకారంతో (మూలిక) ఓషధులను పంపిణీ కార్యక్రమమును జయప్రదముగ నిర్వహిస్తు న్నది. ఇంతేకాక బీద విద్యార్థులకు ఉచిత విద్యా సౌకర్యము కలిగిస్తున్నది.

### ముక్తి నాలుగు విధములు

1. భగవంతుడుండులోకములో భక్తుడుండుట.
2. భగవంతుని అంతరంగ భృత్యులలో చేరి భగవంతుని సమీపమున నుండుట.
3. ఒక విధముగా భగవాదాకారము కలిగి వుండుట.
4. భగవత్స్వరూపముతో బాటు భగవదానందము నొందుచు భగవంతునిలో లీనమగుట.



# శ్రీశైల మహా క్షేత్రము
# శ్రీ భ్రమరాంబా
# మల్లికార్జున స్వామి వారల
# దేవస్థానము
# శ్రీశైలం. (కర్నూలు జిల్లా.)



**శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే.**

మన దేశ ప్రాచీన, పవిత్ర యాత్రా స్థలము లుగా ప్రసిద్ధి చెందిన శైవ క్షేత్రములలో శ్రీశైలము అతి ముఖ్యమైనది. ప్రకృతి రామణీయకతతో నల్లమల అడవుల మధ్య పవిత్ర కృష్ణవేణి నదీమతల్లి సమీపమున సముద్ర మట్టమునకు సుమారు 1500 అడుగుల ఎత్తున ఈ క్షేత్రరాజము విరాజిల్లుచున్నది. తూర్పున ప్రకాశం జిల్లాలో త్రిపురాంతకం, దక్షిణాన కడప జిల్లాలో సిద్ధవటం, పశ్చిమాన తుంగభద్రా తీరాన గల అలంపురం, ఉత్తరాన మహబూబ్‌నగర్ జిల్లాలోని ఉమామహేశ్వరము - ఈ పవిత్ర క్షేత్రాల మధ్య కర్నూలు జిల్లాకు మకుటాయమానముగా నిత్యము భక్త జన సందోహంతో కన్నుల పండుగగా అలరారుచున్నది. ఈ క్షేత్ర మహాత్మ్యమును తెల్పు స్కాంద మహాపురాణాంతర్గత శ్రీశైలఖండము దీనిని బహు ప్రసిద్ధి పొందిన అనాదిక్షేత్రముగా తెలుపు చున్నది.

ఈ దివ్య క్షేత్ర మహిమ వర్ణించుటకు వీలు కానిది. స్పర్శ వేదులు, మహౌషధులు మొదలగు వాని వలన, దివ్య మహిమలకు, దివ్యౌషధులకు శ్రీశైల మాట పట్టు. మన భరత ఖండమునందు ఈ మహా క్షేత్రమున కొక విశిష్ట స్థానము కలదు. పదమూడవ శతాబ్దిలో సిద్ధనాగార్జునుడు ఈ కొండనే బంగారుగా నొనర్చుటకు ప్రబలయత్నము కొనసాగించి కృతార్థు డైనాడు. ఇంతేగాక, 'రసరత్నాకము' అను ప్రసిద్ధ వైద్య గ్రంథము ప్రత్యేకము "పర్వతాధ్యాయ" మను పేర ఈ శ్రీశైల ప్రశస్తిని వివరించినది.

శ్రీరామచంద్రుడు బ్రహ్మహత్యా పాతక విముక్తికై శ్రీశైల ప్రదక్షిణ మొనర్చెనని స్కాంద పురాణ శ్రీశైల ఖండమునందు కలదు.

ఈ క్షేత్ర రాజమతి ప్రాచీనమనుటకు కృత యుగమున హిరణ్యకశిపుడు, త్రేతాయుగమున శ్రీ రామచంద్రుడు, ద్వాపర యుగమున పాండవులు, కలియుగమున ఆచార్య నాగార్జునుడు, ఆది శంకరులు, అక్కమహాదేవి, హేమారెడ్డి మల్లమ్మ, స్వయముగా శ్రీ భ్రమరాంబాదేవిని శ్రీశైలమల్లికార్జునుని సేవించి తరించిరని పురాణ ప్రసిద్ధి కలదు.

శ్రీశైలఖండమనుపేర 12,500 శ్లోకములతో 64 భాగములుగా శ్రీశైల మహాత్మ్యము నుగ్గడించు చున్నది స్కాంద మహా పురాణము.

అంతేకాక మన దేశమునందలి ద్వాదశ జ్యోతి ర్లింగములలో శ్రీశైల మల్లికార్జున లింగము స్వయం భువుగా ప్రసిద్ధి పొందినది. మరియు పద్దెనిమిది మహా శక్తులలో భ్రామరీ శక్తి శ్రీభ్రమరాంబిక రూపములో శ్రీమల్లికార్జునునకు దీటుగా ఈ క్షేత్రమునందు

ఆవిర్భవించి పూజలందుకొనుట ప్రత్యేకతను కల్గి యున్నది.

సంధ్యావందన మంత్రములో శ్రీశైల ప్రసక్తి యుగ యుగములుగా తెలుపబడుచున్నది. యాత్రి కులందరు గర్భగుడిలోనికి వెళ్లి స్వామిస్పర్శానందము పొందవచ్చును. మరియే దేవాలయము నందు ఇట్టి ఏర్పాటులేదు.

ప్రాచీన వాఙ్మయమే కాక ఈ క్షేత్ర మహాత్మ్య మును శైవ పండితులందరు పేర్కొన్నారు. నన్నయ భట్టు, పాల్కురికి సోమనాథ కవి, కవిసార్వభౌముడు శ్రీనాథుడు, విన్నకోట పెద్దన్న మొదలయిన వారెందరో ఈ క్షేత్ర మహాత్మ్యమును వేనోళ్ల కొని యాడిరి. పండితారాధ్య చరిత్ర బసవ పురాణము, శివరాత్రి మహాత్మ్యము మొదలైన గ్రంథములు శ్రీశైల మహాత్మ్యమును ఉగ్గడించినవి.

శ్రీ భ్రమరాంబా దేవిని గూర్చి కూడ అనేక పురాణ గాథలు కలవు. పూర్వము లోకకంటకుడైన 'అరుణాసురుడు' అను రాక్షసుని సంహరించుటకు జగజ్జనని భ్రమర రూపమును దాల్చి, అరుణాసుర సంహారానంతరము సర్వతీర్థములకునూ, సర్వ దేవతా గణములకునూ నిలయమైన శ్రీశైల క్షేత్రమున విరాజిల్లు చుండెనని స్కాంద పురాణము చెప్పు చున్నది.

ప్రయోగే లక్ష భోజ్యం స్యాత్ సమం కాశ్యాంద్వి లక్షణమే ।
గంగాయా సప్త లక్షంచ గ్రాసమేకం తు శ్రీ గిరౌ ॥

అను స్కాంద పురాణ వచనమననుసరించి అన్నదాతల సౌకర్యార్థము దేవస్థానముచే శాశ్వత అన్న దాన పథకము ప్రవేశపెట్టబడి సాలీనా లక్ష మందికి పైగా అన్నదానము జరుపబడుచున్నది.

సదా సంనిహితశ్శము శ్రీశైలే మల్లికార్జునః ।
తస్మిన్ దృష్టేతటే విజ్ఞే జీవన్ముక్తైన సంశయః ॥

**ఉభయ దేవాలయములయందు మ॥ 1.15 నుండి 3.30 వరకు మరియు రాత్రి 9.00 లనుండి 10.00 ల వరకు ఉచిత దర్శనము కలదు.**

శైవ, శాక్తేయ, ఆధ్యాత్మిక, భక్తి భావములను పెంపొందించుటకు దేవస్థానముచే గత 27 సంవత్స రములుగా శ్రీశైలప్రభయను మాసపత్రిక నిర్వహించ బడుచున్నది.

శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులను సేవించి తరించండి.

ఉభయ దేవాలయములందు శాశ్వత పూజ లకు తదితర వివరములకు కార్యనిర్వహణాధికారి శ్రీశైల దేవస్థానము, శ్రీశైలం వారిని సంప్రదించండి.

ఫోను : ఇ.ఓ. ఆఫీసు : 59, ఇ.జి. ఇల్లు : 60
ఎన్‌క్వైరి : 3035, జనరల్ ఫోన్ : 3026

**డి. వేంకటేశ్వర్లు, బి.ఏ.ఎల్.ఎల్.బి.**
కార్యనిర్వహణాధికారి.





శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవి

(చూడుడు 76, 145, 146 పుటలు)



# శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానము ద్వారకా తిరుమల

## పశ్చిమ గోదావరి జిల్లా (ఆంధ్ర ప్రదేశ్)



శ్రీ మదఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు సృష్టిస్థితిలయములలో ప్రధానమైన 'స్థితికారకుడు' అగు శ్రీమహా విష్ణువు సర్వజీవ సంరక్షణార్థమై విశ్వమున వివిధ కాలములలో వివిధ రూపములతో ఆవిర్భవించుచుండును.

త్రేతాయుగమున బలిచక్రవర్తి మూడడుగుల దానమిచ్చి సర్వము కోల్పోయి దయనీయుడై పాతాళమున నుండెను. జగన్నాథుడు కరుణాతరంగి తాంతరంగుడై బలి చక్రవర్తి కోరికననుసరించి అతని దేవతాయతనమున నిలిచెను.

నిర్గుణ, నిరాకార పరతత్వము, యోగిజనైక్యమై సాధారణ భక్త కోటికి దురవగ్రాహ్యమై యుండెను. భూ లోక వాసులు పాప భారము మోయుచు భగవంతుని ఆర్తితో పిలుచుచుండిరి. పాదములు పట్టిన బలిని వీడలేక మానవుల ఆక్రందనలు సహింపలేక శ్రీ మహా విష్ణువు భక్తజన పాపారణ్య దహన సమర్థమగు "శ్రీ వేంకటేశ్వర" నామమున పాతాళము నుండి పెరిగి గోదావరీ మధ్యస్థ శేషాచలమున ఆవిర్భవించెను.

ఆ ఆర్చారూపమును దశరథమహారాజు, శ్రీరామచంద్రులు సేవించుచుండిరి. తన భక్తులను శ్రీ రామునకిచ్చి శ్రీ వేంకటేశ్వరుడు వల్మీకమున నుండెను. పరమేశ్వరుడు క్షేత్రపాలకత్వము, కుంకుళ్ళమ్మ క్షేత్ర సంరక్షణము చేయుచుండిరి.

కృతయుగమున "సప్తగిరి" శిఖరమున వెలసి సంకటమోచనుడై భక్తుల నాకర్షించుచుండిన శ్రీనివాసుని వ్యయప్రయాస సహిష్ణులగు భక్తవరులు సుదూర ప్రాంతముల నుండి కూడా వెళ్ళి దర్శించుచుండిరి.

వివిధ గోదావరి ప్రాంతము నుండి "ద్వారకుడ"ను భక్తుడు శ్రీ శ్రీనివాసుని దర్శనమున తరించుటకై ప్రతి సంవత్సరము సప్తగిరికేగుచుండెను. శక్తి యుడిగి వార్ధక్యమున ద్వారకుడొక పర్యాయము ఏడుకొండలదరి చేరుటయు వాని నారోహించుట కష్ట సాధ్యమని చింతించి దిక్కుతోచక శ్రీనివాసునిపై భారముంచి పయనమయ్యెను. అట్లాతడు కొంత దూరమేగి, అలసి మార్గమున సొమ్మసిల్లి పడిపోయెను. భక్త సులభుడైన శ్రీనివాసుడు ద్వారకునకు ప్రత్యక్షమై "భక్తా! వేంగిదేశస్థ శేషాచలమున నా ధ్రువమూర్తి కలదు. ఆ మూర్తిని సేవించి తరించుము. ఆ శేషాచలము నారోహించి అచటి మూర్తిని సేవించినను సప్తగిరి చేరి నన్ను సేవించిన ఫలము దక్కును. ఏడుకొండల నెక్కలేని నీ కొరకై ఆత్రేతాయుగమూర్తి యందు నా తేజమును ప్రవేశపెట్టుచున్నాను. నీ కారణమున నది మహా పవిత్ర స్థలమగుటచే నయ్యది నేటి నుండి "ద్వారకా తిరుమల" యను పేను ప్రసిద్ధమగును, అని సెలవిచ్చి అంతర్ధానమయ్యెను.

ద్వారకుడు శ్రీ స్వామి వారు చెప్పినట్లు శేషాచలము చేరి అట స్వామికై వెదకెను. స్వామి కని పించకున్నాడని తపమాచరించుచుండ నొకనాటి ప్రభాత సమయమున ద్వారక మహర్షి సుదర్శన పుష్కరణిలో స్నానమాచరించి వచ్చుచుండ, గరుడుడు చెట్టుపై నుండి "కృష్ణా" యని పలుకుచు ఈశాన్య దిశకు పోవుచూ వచ్చుచుండట గమనించి ఆ విష్ణువాహనము స్వామియునికిగూర్చి తెలియ చేయు చున్నదని గ్రహించి, అచటికి పోయి పెద్ద పుట్టనుంచి వెలుగు కనబడుట చూచి, వల్మీకమునుండి నాగ మొకటి జారి అంతర్ధానమగుటయు ఆవత్తిడికి పుట్ట శిధిలము కాగా శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్య మూర్తి ఆ మహర్షికి సాక్షాత్కరించెను.

ఇట్లావిర్భవించిన శ్రీస్వామి వారి యునికి "ద్వారక మహర్షి" వలన పరిసరములు దాటి కృష్ణా, గోదావరీ తీరములు దాటి నలుదిశలు వ్యాపించెను.

శ్రీ స్వామి వారిని దర్శింపవచ్చిన భక్త జనులు తమకు శ్రీ స్వామివారి పాద సేవాభాగ్యమబ్బలేదని మిగుల చింతింపదొడగిరి. ఆగమశాస్త్ర పారంగతులు చెప్పిన ప్రకారము, సశాస్త్రీయముగ, పరమ ధార్మికా గ్రగణ్యులు ఏడుకొండల వాని పూర్ణ మూర్తిని సప్తగిరి నుండి గొనివచ్చి ద్వారకాతిరుమలలో స్వయం వ్యక్త మూర్తికి వెనుకభాగమున ప్రతిష్టించిరి. అప్పటినుండి స్వయముద్భవ మూర్తికి వైశాఖమాసమున, ప్రతిష్ఠా మూర్తికి ఆశ్వీయుజ మాసముననుు కళ్యాణ మహో త్సవములు జరుపు సాంప్రదాయమేర్పడినది. కాల క్రమమున స్వామివారికి, ఆలయ ముఖ మండప ప్రాకార గోపురాదులు నిర్మాణము జరిగినది.

**శ్రీ ఎస్.వి. సుధాకరరావు**
వంశపారంపర్య ధర్మకర్త

శ్రీ సూరానేని వంశీయులు "మైలవరం జమిందారులు" పరమ భక్తులై, త్యాగధనులై ధర్మ కర్తృత్వము వహించి సాంప్రదాయ విచ్ఛిన్నము కాకుండ ప్రతి సంవత్సరము రెండు కళ్యాణములు జరిపించు చున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము దేవాదాయ ధర్మా దాయశాఖ ద్వారా ఆలయ పరిపాలనా బాధ్యత స్వీక రించి భక్త జనుల సౌకర్యార్థము, సత్రములు, నీటి సరఫరా, విద్యుశ్చక్తి మొదలగు సౌకర్యములు ఏర్పరచి ఆలయ పురోభివృద్ధికి కృషి చేయుచున్నారు.

ఇయ్యది సుప్రసిద్ధ పుణ్య క్షేత్రమైన "ద్వారకా తిరుమల", "చిన్న తిరుపతి" అని గూడ జనవాడుక గలదు. ఏలూరు నుండి 38 కిలో మీటర్లు, విజయ వాడ నుండి 105 కి. మీ. దూరములో నున్నది. విజయవాడ, పొన్నూరు, తిరువూరు, భద్రాచలం, నరసాపురం, తాడేపల్లిగూడెం, నూజివీడు, ఏలూరు, జంగారెడ్డి గూడెం డిపోల నుండి ఆర్.టి.సి. వారు అనేక బస్సులు నడుపుచున్నారు. కృష్ణాజిల్లా మైలవరం గ్రామములో వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వర స్వామి, శ్రీ మల్లేశ్వర స్వామి వార్ల దేవాలయములు ఈ ద్వారకా తిరుమల దేవాలయముచే దత్తత తీసుకొన బడి అనేక అభివృద్ధి కార్యక్రమములు చేపట్టబడినవి.

స్వామి వారి దర్శన వేళలు

ఉదయం గం. 6-00 నుండి మ. 12-00 వరకు
సాయంత్రం గం. 3-00 నుండి రాత్రి 8-30 వరకు

చిన్న తిరుపతి కలియుగ వైకుంఠముగ పేరొందిన శ్రీ ద్వారకా తిరుమలేశుని దర్శించి తరించండి.

ఇట్లు,
**దివాకరుని వేంకటేశ్వర్లు**
కార్యనిర్వహణాధికారి



శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయము,
దేవునికుంట, హైదరాబాద్ - 28



దేవుని కడప, కడప.



శ్రీ తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానము.... నెల్లూరు



# కుంకుమ పూజా మహాత్మ్యము

శ్రీజగన్మాత సర్వమంగళ స్వరూపిణి. ప్రపంచములో జన్మించిన ప్రతి వ్యక్తి సౌభాగ్యాభివృద్ధిని కోరుచుండుట సహజము. గృహమునకు ముఖ్యము గృహిణి. కనుకనే వివాహమైనది మొదలు స్త్రీ గౌరీ పూజను చేయుచుండును. స్త్రీకి సౌమంగళ్య సౌభాగ్యము సదా అవసరము. కనుక జగన్మాతకు "సౌభాగ్యవర్ధనం దేవి తుభ్యం సింధూర కాదికం దాస్యామి మే ప్రదేహిత్వ యావజ్జీవ సుఖాదికం" అని సౌభాగ్య ద్రవ్యమును అనగా పసుపు, కుంకుమలను సమర్పింపవలయును.

శ్రీ శంకర భగవత్పాదులు తాము రచించిన 'మానసిక పూజ'లో అమ్మవారికి సీమంతము (పాపట) నందు సింధూరమును సమర్పింప దాని అరుణ వర్ణము చూచు నా మనస్సు చాల సంతోషించు చున్నది. ఆ సింధూరము ఉదయ సూర్య బింబమువలె ఎఱ్ఱగ నున్నది. కనుక నా హృదయగుహలో చీకటిని యనగా అజ్ఞానమును పోగొట్టుచున్నది అని చెప్పి యున్నారు.

కుంకుమ పూజ చేయుట వలన, చేయించుట వలన గృహస్థులకు సుఖ, సౌభాగ్యము వృద్ధి యగును.

సుదీర్ఘ, సౌమాంగల్య, సౌభాగ్య సర్వసిద్ధి, సర్వ సంతృప్తిదము, కనుక భక్తులు శ్రీదేవికి కుంకుమార్చన మొనరించి యామె యనుగ్రహమునకు పాత్రులు కమ్మని పెద్దలు చెప్పుచున్నారు.

## అష్ట సిద్ధులు

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి ఎనిమిది సిద్ధులు. ఈ ఎనిమిదియును యోగ శాస్త్ర ప్రసిద్ధములగు సిద్ధులు.

# కుంభాభిషేకము



పరమ శివుడు అభిషేక ప్రియుడని ప్రసిద్ధి. శైవాగమ పద్ధతిలో శివుని అభిషేకించడం సాంప్రదాయం. దేవాలయంలోని పవిత్ర దేవతామూర్తిని వేదమంత్రాలతో పునీతం చేయబడిన జలములచే అభిషేకించి ప్రసన్నుని చేసికోవడాన్నే 'కుంభాభిషేకం' అంటారు.

గర్భగుడిలో ప్రతిష్ట చేయబడిన శివలింగము కాని మరి యే మూర్తియైనను రాతితో చెక్కబడినవే కదా. ప్రతిష్ఠ కేవలము మూర్తిని నిర్ణీత పద్ధతిలో వుంచడం కాదు.

యాగశాలలో, పవిత్ర జలముతో కుండలను నింపి దారముతో ఊర్ధ్వ ముఖముగా చుట్టి, మామిడి ఆకుల మధ్యలో నారికేళములనుంచి వేదమంత్రములతో, హోమములతో అనేక పర్యాయములు, ఆ దేవుని ఆహ్వానించవలెను. ఆలాగున నియమముతో చేయబడిన జప హోమాదుల వలన పవిత్రమైన జలమునకు ఎంతో మహిమయు శక్తియు కలుగును ఆ పవిత్ర జలమును, విగ్రహములపైనను, ప్రాకారములమీదను, కలశముపైనను, విమానము పైనను అభిషేకించెదరు. వేదమంత్రములతోను హోమములతోను పవిత్రమైన జలము, శక్తిని, మహిమను గ్రహించిన తదుపరి అభిషేకము జరిపించుటవలన కలశము, దేవతా విగ్రహములు శక్తీభూతములగును. పునఃప్రతిష్ఠాపనమగును.

అభిషేకానంతరము, విగ్రహములు, దేవాలయ ప్రాంగణము, విమానము కలశము, పరమ పవిత్రమైనవిగా, దైవాంశ కలిగి ప్రకాశించును. అప్పటి నుంచి పూజలు ప్రారంభించెదరు. అట్టి కుంభాభిషేకమునకు సమాయత్తమగుట, సంబారములు సమకూర్చుట బహు కష్టతరము.

ప్రతి పన్నెండు సంవత్సరముల కొకసారి జరుపవలెనని శాస్త్రప్రమాణమున్నను ఇట్టి కుంభాభిషేకము కొన్ని సందర్భములలో అరువది సంవత్సరములకొకసారి జరుపబడుచున్నది.

పవిత్ర కుంభాభిషేక కార్యక్రమములలో పాల్గొని తదనంతర, విగ్రహము, దేవాలయ దర్శనము భక్తుని పునీతుని చేయుననుటలో ఎట్టి సందేహము లేదు.



# గాయత్రీ మంత్ర మహోత్మ్యము

వైదిక పరిభాషలో మంత్రానికొక విలక్షణమైన స్వరూపం ఉంది. మంత్ర లక్షణాలేమిటి? అని విచారించి కొందరు విధింపబడ్డ అర్థాన్ని వివరించి చెప్పేది మంత్ర మన్నారు. అయితే కొన్ని విధి రూపమైన మంత్రాలకు ఈ లక్షణం సరిపోదు. యాస్కుడు నిరుక్తంలో 'మంత్రా మననాత్' అన్నాడు. మననం చేయడానికి హేతువయ్యేది మంత్రం. యజ్ఞయాగాది కర్మలాచరిస్తూ వాటి స్వరూపాన్ని స్మరించడం మొదలగు పనుల కోసం యాజ్ఞికులు ప్రత్యేకంగా ఉచ్చరించే శబ్దాలే మంత్రాలు. ఈ లక్షణం మంత్రాలన్నిటిలోను సరిపడుతుంది.

శుక్ల యజుస్సంహితా భాష్య ప్రారంభంలో ఉవటుడు మంత్రాలు, పదమూడు రకాలని విభజించి చెప్పాడు. గాయత్రీ మంత్రం స్తుతిరూపంలోను, అవధారణ ప్రక్రియలోను మహామంత్రంగా బహువ్యాప్తి నొందినది. ఎంతో మహిమాన్వితమైనదని వేదవిదులు వక్కాణించి యున్నారు. మంత్రోచ్చారణ అర్థజ్ఞానంతో కూడా చేస్తే విశేషఫలభరితమని అంతమాత్రం చేత మంత్రాలను పారాయణ చేసే వారిని మనం తక్కువ చేయనక్కరలేదని అర్థజ్ఞాన ముఖ్యం కాదని భ్రమ పడనక్కరలేదన్నారు.

చందోబద్ధమైన మంత్రాలలో ఇమిడి ఉన్న గంభీర భావాలను తెలుసుకొన్న జ్ఞానులు ప్రతి మంత్రానికి ఒక అధిష్ఠాన దేవత ఉన్నదని ఒకడొక మంత్రాన్ని జపిస్తున్నంతసేపు ఆ దేవతా రూపాన్ని మనస్సులో దర్శిస్తూ ఉండాలని మంత్రాధిదేవత అప్పుడు సాధకుని పిలుపు విని ప్రత్యక్షమవుతుందని నమ్మకంగా చెప్పున్నారు. స్త్రీ, పురుష దైవారాధన వేద సమ్మతమైనది.

ఒక మంత్రాన్ని కనీసం పదివేలసార్లు జపించినపుడే ఆ మంత్రానికి తగినంత ప్రభావం కలుగుతుందని ఒక నమ్మకం ఉన్నది. జపాన్ని ప్రారంభించిన వెంటనే ఆ మంత్రాధిదేవత మన మనోనేత్రాలకు గోచరమయ్యేటట్లు ధ్యానం ఉంచాలి. నిష్కపటంగా, విశ్వాసంతో మంత్ర జపం చేయటమే జపసాధనకు ముఖ్యాంగమని ప్రేమ విశ్వాసాలు నిండిన పవిత్ర హృదయంతో చేసే జపమే మహత్తరమైన సాధన అని కొందరి భావన.

మంత్రాలు తామస మంత్రాలు, రాజస మంత్రాలు మరియు సాత్విక మంత్రాలు అని మూడు విధాలు. ఈ మంత్రాలను మరల రెండు విధాలుగా చెప్ప వచ్చును. అర్థం తెలుసుకోనక్కర లేకుండా కేవలం మంత్రాన్ని జపించేవి, మరియు ఆయా దేవతలను ప్రత్యక్షం చేసుకునేవి. అప్పుడు సాధకునికి ఆ మంత్రంలో ఇమిడియున్న అర్థం తప్పక తెలియాలి. అలా తెలియకపోతే సాధకుని మనస్సు ఆ దేవతపై నిశ్చలంగా, ఏకాగ్రతతో నిలుపుట సాధ్యం కాకపో వచ్చును.

వేద మంత్రాలు గద్యరూపంలోను, పద్యరూపంలోను ఉన్నాయి చందోబద్ధంగా ఉన్నవాటిని "ఋక్కులు" అని, గద్యరూపంలో ఉన్న వాటిని "యజస్సు" లని అంటారు. అన్ని మంత్రాలలో అధిక

శక్తివంతమైనది, అతి ప్రధానమైనది ఏకాక్షరమంత్రం "ఓం". దీనిని ప్రణవ మంత్రం అంటారు.

వేదకాలం నుండి, ఇప్పటివరకు ఈ "ఓం" ఒక ప్రతీకగాను, ధ్యానానికి సహాయకారిగాను ఉండటం ఆధ్యాత్మిక సాధకులు గ్రహించారు. ఈ ప్రణవ మంత్రం మానవునికి దేవునికి మధ్య సంధానం చేసే మహిమాన్వితమైన "ధ్వని" అని, ఇది ఆ పరబ్రహ్మ స్వరూపమేనని గుర్తించారు. ఈ ఏకాక్షరం యొక్క చరిత్ర "స్ఫోట వాదం" (శబ్దతత్త్వం)గా పరిణమించింది. దృశ్యమానమైన ఈ అనంత విశ్వానికి వెనుక అనిర్వచనీయమై అనంతమైన "స్ఫోట"మనేది ఉన్నది. అదే శబ్దరూపంలో వ్యక్తమయి భావాలకు, నామాలకు ఆధారమైన అతి ముఖ్య పదార్థమైనది. ఈ శక్తి ద్వారానే భగవంతుడు విశ్వాన్ని సృష్టిస్తున్నాడు. ఈశ్వరుడు లేదా బ్రహ్మ మాయావశుడై ప్రప్రథమంగా తానీ స్ఫోటరూపంలో వ్యక్తం అవుతున్నాడు. వ్యక్తంచేయలేని ఆ శబ్దం నుండి అతడు వ్యక్తమై ఇంద్రియగోచర మవుతున్న ఈ స్థూల ప్రపంచంగా రూపొందుతున్నాడు.

వేదంలోని "ప్రజాపతి వై ఇదం అగ్రే అసీత్" - ప్రజాపతియే ఆదిని ఉండెను "తస్య వాక్ ద్వితీయసీత్" అతనికి రెండవదిగా వాక్కు వచ్చెను. "వాక్ వై పరమం బ్రహ్మ" - ఆ వాక్కే పరబ్రహ్మ. మన మతంలోని ఈ భావమే బైబిలులో కూడానున్నది"-"మొట్టమొదట శబ్దం ఆవిర్భవించెను. ఆ శబ్దం దేవునితో కూడా ఉండెను. ఆ శబ్దమే దేవుడు" అని.

మైత్రావరణ ఉపనిషత్తులో శబ్దమే "ఓం" అని చెప్పియున్నారు. ఈ 'ఓం' శబ్దాన్ని "ప్రణవం" అని కూడా అంటారు. ప్రణవం అనగా ప్రాణం ద్వారా ప్రసరించేది, అనిగాని ప్రాణిజీవాన్ని ఆవరించి ఉన్నదని గాని చెప్పవచ్చును.

మాండూకోపనిషత్తులో ఈ "ఓం" జాగృత్స్వప్నసుషుప్త్యవస్థలను వివరిస్తున్నదని మొదట చెప్పి ఆ తరువాత ఆ ఉపనిషత్తుల పరిధిని దాటి, శాస్త్రీయమైన అద్వైత వేదాంతం బోధిస్తున్న "తురీయ" మనే నాల్గవ అవస్థకు మనలను చేర్చుచున్నదని చెప్పినది.

తైత్తరీయోపనిషత్తు "ఓం" ను ఉద్దేశించి నీవే బ్రహ్మకోశము అనగా ఈ "ఓం" అబ్రహ్మ తత్త్వమును తనలో ఇముడ్చుకొన్నదన్న "ఓం" ను ప్రార్థించుట, ఆ బ్రహ్మతత్త్వమును ప్రార్థించుటే అని చెప్పుచున్నది.

ఓంకారంలో కూడా సంగీతంలో వలెనే మూడు భాగాలున్నవి. కేవలం శబ్దం అనగా నోటితో ఉచ్చరించు కేవలమంత్రం. ఆ అక్షరం యొక్క అర్థం, అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. ఆ ఓంకార నాదాన్ని మన జీవన స్రవంతి ద్వారా ప్రవహింపజేసి మనం చేసే ప్రతి పనిలోను దానిని ఇమిడ్చి, దానిని మన స్వరూప స్వభావంగా తీర్చిదిద్దుకోవడం.

ఓంకారంలో ఉన్న అ, ఉ, మ అనే మూడక్షరాలు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకు ప్రతినిధులుగాఉన్నాయి. తరువాత ఈ అక్షరాల్ని ఆవరించియున్న నిశ్శబ్దము నాలుగవదైన తురీయావస్థను సూచిస్తున్నది. అనగా 'ఓం'కారాన్ని (వరుసగా) ఉచ్చరించేటప్పుడు ఆ రెండూ ఉచ్చారణల మధ్య ఒక నిశ్శబ్దం తప్పనిసరిగా కలుగుతుంది. ఆ నిశ్శబ్దం నాలుగవదియైన తురీయావస్థను సూచిస్తుంది. ఇదే పరమానందస్థితి. ఇక్కడే జీవాత్మ పరమాత్మతో ఐక్యంపొంది ఆ త్మైక్యాన్ననుభవిస్తుంది.

ఏదైనా ఒక విషయం జ్ఞాపకం ఉండాలంటే ఆ జ్ఞాపకం చేసుకునేవాడు, దానిని అనుభవించినవాడు ఒకడే అయి ఉండాలి. అప్పుడే తన అనుభవాలను అతడు జ్ఞాపకం చేసుకోగలుగుతాడు. లేకపోతే జ్ఞప్తి అనేది అసంభవము కదా. అదే విధముగా - జాగ్రత్స్వప్న సుషుప్తవస్థలు మూడింటిలోను ఉండే అనుభవాలను జ్ఞాపకం చేసుకోగలుగుతున్నాము అంటే ఈ మూడు అనుభవిస్తూ అందుకు సాక్షిగా ఉన్నవాడు ఒకడు ఉండి తీరాలి గదా. ఆ ఉన్నవాడు (సాక్షి) ఈ మూడవస్థలలోను ఉండి, అందనుభవించి వాటిని తెలుసుకున్నవాడే అయినప్పటికి అతడి మూడవస్థలకు అతీతుడుగా ఉన్నాడు ఆ అతీతతత్త్వమే, తురీయము, అదే సత్చిత్ ఆనంద మయమయిన రూపము. అదియే నిత్యము, సత్యము.

దేశకాలాలు, ఉత్పత్తి నాశనాలు కలిగి ఉండే దృశ్యమైన ఈ జగత్తును, దేశకాలాతీతమైన, అనంతమైన జగత్తులో ఉండి కూడ జగదతీతమై ఉన్న ఆ అక్షర పరబ్రహ్మతత్త్వాన్ని కూడ "ఓం"కారం సూచిస్తున్నది. ఇలా ఆకార రూప జాగ్రదావస్థ, ఉకార రూప స్వప్నావస్థ, మకార రూప సుషుప్తావస్థ వీటి తరువాత నుండే నిశ్శబ్దం ఈ నాలుగవస్థలు కూడా ఉన్నదే "ఓం"కారంలో ఉండే బ్రహ్మతత్త్వం. అదే పరమాత్మతత్త్వం. "మ" శబ్దం పుట్టి, పెరిగి, వాగ్రూపమై, తుదకు దానివెనక వచ్చే నిశ్శబ్దంలో ఎలా లీనమై పోతుందో ఆలాగుననే ప్రతి ప్రాణిలో ఈ నాలుగవస్థలు తుదకు అతురీయంలో లీనమై పోతాయి. ఈవిధంగా సూక్ష్మమైన అంతరజగత్తులోగాని స్థూలమైన విరాడ్రూప విశ్వంలోగాని ఎటుచూచినా ఈ అవస్థలన్నీ ఒకే అనుభవంలోని వివిధ రూపాలవుతాయి. అనగా వాటి తత్త్వాలతో ఆ అవస్థలనన్నిటిని (కలిపి) మొత్తంగా గ్రహిస్తే ఈ అవస్థలన్ని ఒకే అనుభవం యొక్క వివిధ రూపాలని చెప్పుకోవచ్చును.

ఓంకారనాదానికి, దాని తరువాత వచ్చునిశ్శబ్దము ఎంత ఆవశ్యకమో "అ"కార "ఉ"కారాలు కూడా అంతే ముఖ్యమైనవి. ఆ నిశ్శబ్దంలో ఓంకార నాదం లేదని చెప్పలేము. ఎందువలననంటే ఆ నిశ్శబ్దంలో ఈనాదం మరింత శక్తివంతంగా నిలిచి ఉంటుంది. వాస్తవానికి ఈ నాదమే అస్థిరము, అనిత్యము. ఆ నిశ్శబ్దమే శాశ్వతం. లౌకికంగా గమనిస్తే ఈ నిశ్శబ్దం సృష్టి, స్థితి, లయాలకు అతీతమై ఓంకారనాదాన్ని కూడా దాటి ఉంటుంది.

ఎక్కడ నుండి ఈ విశ్వం ఉద్భవించిందో ఆ తత్త్వాన్ని సూచించటానికి ప్రత్యేకించి ఓంకారాన్నే ఎందుకు ఎన్నెకోవాలో వివేకానందస్వామి చాలా బాగా చెప్పియున్నారు.

ఓంకారాన్ని సరిగా ఉచ్చరిస్తే అది నాదోత్పత్తి యొక్క సంపూర్ణరూపాన్ని వ్యక్తపరుస్తుంది. అలా వ్యక్తపరచడమనేది. మరి ఏ ఇతర ధ్వనులవలన గాని అక్షరాల వలన గాని జరుగదు. వీలు కాదు. కావున ఈ ఓంకారము ఒక్కటే "స్ఫోట"కు సరిగా కుదిరిన ప్రతీకగా ఉంది. ఓంకారాన్ని "స్ఫోట"నుండి వేరు చేయలేము కనుక ఓంకారము, "స్ఫోట" రెండూ ఒక్కటే. స్థూలరూపంలో దృశ్యమైన ఈ విశ్వానికి ఈ స్ఫోటము సూక్ష్మరూపమై ఉంది. కావున భగవంతునికి సన్నిహితంగా ఉంది. ఇది ఆ దివ్యజ్ఞానానికి మొట్టమొదటి దృశ్య రూపము అందువలన ఓంకారము భగవంతుని సూచించే అతి సన్నిహిత ప్రతీక.

పై కారణాలవలన ఈ ఓంకారం వ్యక్తావ్యక్త ప్రపంచాన్నే కాక, దానికి అతీతమై ఉన్న అపరతత్త్వాన్ని చరాచర జగత్తుకు ఆధారభూతమై ఉన్న ఆ అక్షర బ్రహ్మతత్త్వాన్ని సూచించేదిగా ఉన్నది.

ఓంకారాన్ని చేర్చే ప్రతిమంత్రాన్ని మనం ఉచ్చరిస్తాం. ఓంకారం చేర్చకుండా ఉచ్చరించే ఏ మంత్రానికి శక్తి సామర్థ్యాలు చాలవు మనకు ప్రాణవాయువు ఎంత అవసరమో మంత్రాలకు ముందు ఓంకారం అంత అవసరం. మంత్రాలు ఓంకారం చేర్చకపోతే ప్రాణం లేనివి అవుతాయి.

ఓంకారాన్ని ధ్యానించి జపించడాన్నే ప్రణవోపాసన అంటారు ఈ నిశ్శబ్దమౌనం ద్వారా స్థూల, సూక్ష్మరూపమైన సమస్తవ్యక్తావ్యక్త ప్రపంచాన్ని ఈ ఓంకారం సూచిస్తున్నది. లోకం అంటే అనుభవక్షేత్రం అని అర్థం. జీవితంలో సంభవించే అన్ని అనుభవాలను పదునాలుగు లోకాలుగా మన మహర్షులు చెప్పారు. ఊర్ధ్వ లోకాలు ఏడు, అధోలోకాలు ఏడు.

ఈ జీవి నడిపే తన జనన మరణ రూపశీల భూలోకం, భువర్లోకం, సువర్లోకం.

భూలోకము : మన భూ ప్రపంచము.

భువర్లోకము : ఈ భూప్రపంచానికి కొంచెము పైనున్నది.

సువర్లోకము : స్వర్గలోకము.

ఈ మూడింటికి అవతల మరో నాలుగు లోకాలున్నవి. అవి ఏవన సువర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం ఉన్నత పరిమిత జీవనాన్ని గడపడానికి ఒక జీవి ఈ లోకానికి పోతున్నాడు.

మన సాహిత్యంలో ఇంద్ర, చంద్ర, సూర్య పితృ లోకాలు మొదలైన మరికొన్ని లోకాలున్నాయి. అవి ప్రత్యేకమైన అనుభవ క్షేత్రాలు. అవి అన్నీ సప్త ఊర్ధ్వ లోకాలలో అంతర్గతమై ఉన్నాయి.

ఈ సప్తలోకాలకు దిగువగా మరి ఏడు (అధో) లోకాలున్నాయి. అవి పాతాళం, మహాతలం, రసాతలం, తలాతలం, సుతలం, వితలం, అతలం అనేవి.

ఈ చతుర్దశ భువనకోశాలలో భూః, భువః, సువః అనే మూడు లోకాలను వ్యాహృతులంటారు. ఇది చాలా ముఖ్యమైనవిషయం. గాయత్రీమంత్రంలో ఈ మూడు వ్యాహృతులను జపించేటప్పుడు, సాధకుడు ఈమూడు లోకాలు ఓంకారం నుండి ఉద్భవించి అందులోనే ఉంటూ (స్థితి) అందులోనే లీనమవుతున్నట్లు తెలుసుకుంటాడు. అనగా వీటి సృష్టి, స్థితి, లయములు ఓంకారంలోనే అంతర్భూతమై ఉన్నట్లు తెలుసుకుంటాడు. బాహ్యమైన వీటిని, అంతరింగికంగాను అన్వయిస్తే వీటిని జాగృత్స్వప్న సుషుప్త్యవస్థలతో ఏకంచేసి ఈ మూడింటిని దాటి తురీయమే పరమాత్మ స్థితిగా సాధకుడు గ్రహిస్తాడు. ఈ నాలుగు అవస్థలను "ఓం" కారము సూచిస్తున్నది. ఇదే భావంతో గాయత్రీ మంత్రంలోని వ్యాహృతులు ఒకే సమయంలో మానవుని బాహ్య అంతర అనుభవ లోకాలను సూచిస్తున్నాయని తెలుస్తున్నది.

ఓంభూః – ఓంభువః – ఓగ్ంసువః। ఓం తత్స – వితుర్వరేణ్యం భర్గో– దేవస్య – దీమహి। ధియో – యోనః ప్రచోదయాత్.

పాశ్చాత్యులకు కూడా 'లభ్యమైన ప్రాచీన దివ్య మంత్రాలలో ఈ గాయత్రీ మంత్ర మొకటి' అని చెప్పడాన్నిబట్టి ఈ మంత్ర విశిష్ఠత దేశ దేశాలలో కూడా వ్యాప్తి చెందిందని తెలుస్తున్నది.

మన మత విశ్వాసాలలో అనేక విప్లవాత్మకమైన మార్పులు వచ్చినప్పటికి గాయత్రి మంత్రం స్థిరంగా ఉంది. కోటాను కోట్ల హిందువులను యుగయుగాలుగా ఆకర్షించి ఆకట్టుకొనేదిగా ఉంటూ వస్తున్నది. ఈ మంత్రంలోని సరియైన అర్థం, సరియైన భావం అవగాహన చేసికొని జపించడం వలన మానవ హృదయాలలోని దుష్టభావనలన్నీ చాలావరకు తొలగిపోతాయని. నమ్మడమే కాకుండా ఈ అనుభవాన్ని ప్రత్యక్షంగా తెలుసుకున్నారు కూడా.

లౌకికమైన, భౌతికమైన లాభాలు కలుగుతాయని ఆశించి ఈ మంత్రాన్ని ఎవ్వరూ జపించరాదు. మన హృదయాలను మరింత తేజోవంతం చేయాలనే ప్రార్థన ఈ మంత్రం చివరగా ఉన్నది. పరమాత్మను గూర్చి చేసే ప్రార్థన మాత్రమే ఇది.

గాయత్రీ మంత్రాన్ని సావిత్రి మంత్రమని కూడా అంటారు. ఈమంత్రానికి సావిత్రి అధిదైవతంగా ఉన్నది. కావున దీనికా పేరు వచ్చింది. గాయత్రీ ఛందస్సులో రచించిన మంత్రాలలో ఇది అతి ప్రధానమైనది కావున దీనిని గాయత్రీ మంత్రం అనటం సంప్రదాయమయింది.

ఈ గాయత్రీ మంత్రం ఎనిమిది అక్షరాలతో, మూడు పాదాలతో ఉంటుంది.

ఓం తత్స వితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్.

పై మంత్రంలో మొదటి పాదంలో ఏడక్షరాలు మాత్రమే ఉన్నాయి. 'ణ్యం – స్త్ర + ఉం' అను రెండక్షరాల కలయిక అనిగాని ఓం అక్షరాన్ని కూడా కలుపుకుని గాని రెండు విధములుగా దీనిని వివరిస్తున్నారు.

శ్రీ శంకరాచార్యులవారు తన బృహదారణ్యకోపనిషత్తు వ్యాఖ్యానంలో వివరించారు.

గాయత్రీ మంత్రం ఋగ్వేదానికి సంబంధించినది. ఈ మంత్రానికి రాజర్షి విశ్వామిత్ర ఋషి ఋగ్వేదంలోని తృతీయ మండలంలోని మంత్రాలన్నిటికి విశ్వామిత్రుడే ఋషి. ఈ గాయత్రి మంత్రము, శుక్ల యజుర్వేదములోను కూడా కనబడుతుంది. ఈ మంత్రానికి అధిదేవత సవితుడు అనగా సూర్యుడు ఈ అర్థం చాలా

మంది వ్యతిరేకిస్తున్నారు అయితే బహుజనామోదం పొందుతున్న అర్థమిదే. సూర్యుడు ప్రపంచానికి ప్రకాశ మిస్తున్నాడు ఆ ప్రకాశం కోసం చేసే ప్రార్థన లౌకిక ప్రపంచంలోని ప్రకాశాలన్నిటికి మూలమైన సూర్యుని ఉద్దేశించి ఉండాలి. భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ "సూర్య చంద్రాదులు, మిగిలిన అన్ని ప్రకాశాలు నా ప్రకాశమే" అని చెప్పాడు(భ.దీ. 15 అ. 12 శ్లో). కావున ఈ సవిత, గాయత్రీ మంత్రాధి దేవత, చైతన్య ప్రకాశము అయిన ఆ అనంతబ్రహ్మ తత్త్వం కంటే వేరైనది కాదు. ఈ మంత్రాన్ని ప్రణవంలోను, వ్యాహృతులతోను కలిపి ఉచ్చరిస్తారు. దేవీభాగవతం ద్వాదశ స్కంధంలో కూడ గాయత్రీమంత్రం గూర్చి విపులంగా చెప్పబడినది.

మనకు విధించిన సంధ్యావందన క్రియలో ఈ మంత్రాన్ని విధిగా జపిస్తారు. యజ్ఞోపవీతం లేనిదే గాయత్రీ మంత్రాన్ని జపించడానికి వీలులేదనే నమ్మకం ప్రబలంగా ఉంటున్నది. ప్రాతఃకాలం, తూర్పున తెల వారుతుండగా నాలుగు అయిదు గంటల మధ్య బ్రహ్మ ముహూర్త సమయంలో ఈ మంత్ర జపం చేస్తారు. సాయం సంధ్యలో కూడా జపం చేస్తారు. ఆగమాలు, సూత్రాలు వచ్చిన తరువాత ఈ మంత్ర పాశస్త్యం విపులంగా చెప్పబడినది.

ఈ గాయత్రిని నిత్యం ఎందుకు జపించాలి? సూర్యునకు అర్ఘ్యప్రధానం ఎందుకు? ఈ విషయాలను తైత్తరీయ అరణ్యకం, ఉపాసనాకాండలో కథారూపంగా విపులంగా వివరించబడింది. వేదాల తర్వాత కొన్ని వేల సంవత్సరాలకు ఉద్భవించిన ధర్మసూత్రాలలో నిత్య పూజాకార్యక్రమం అధికంగాచేర్చబడినది. ఈ సూత్రాల తరువాత ఆగమాలు వచ్చాయి ఆగమాలలో గాయత్రి శివుడని, విష్ణువని, పరదేవతయని తెలియజేయబడినది గాయత్రి వేదమాతగా కూడా ప్రాచుర్యం పొందింది.

గాయత్రి మంత్ర ప్రభావం తగినంత ఫల మిచ్చేదిగా నమ్మకాన్ని కలిగిస్తున్నది. గాయంతం - జపించు వానిని, త్రాయతే - రక్షించునది కావున - గాయత్రి అనగా ఈ మంత్రాన్ని జపించినవారిని ఇది రక్షిస్తుంది.

మనదేశంలో బాలురకు చిన్నతనంలోనే గాయత్రి మంత్రాన్ని ఉపదేశిస్తారు. ఈ కర్మకాండకు 'ఉపనయనం' అంటారు. వేదం ఉపనయన సంస్కారాన్ని అత్యుత్తమమైనదిగా పేర్కొన్నది. ఇది రెండవ జన్మవంటిది.

సంపూర్ణ గాయత్రీ మంత్రంలో నాలుగవ పాదం కూడా ఉంది. ఈ నాల్గవ పాదం బ్రహ్మ సూత్రాలలోను చాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులలోను ఉంది. ఈ నాల్గవ పాదం అతి పవిత్రమైనది. అది రహస్య మైనది. నిత్యము తనకు సేవలు చేస్తూ ఎప్పుడూ తనను అనుసరించి ఉండే శిష్యులకు, సర్వసంగ పరిత్యాగం చేసి, ఆత్మధ్యానం చేసే సన్యాసులకు ఈ నాల్గవ పాదంలోని మంత్రాన్ని ఉపదేశిస్తారు.

ప్రాచీనకాలంలో స్త్రీలు కూడా గాయత్రి మంత్రాన్ని జపించే వారు.

గాయత్రీ మంత్రంలో ప్రగాఢ వేదాంత తత్త్వం, దాని తాత్పర్యం స్పష్టంగా గోచరిస్తోంది. అంతరంగం లోని సూర్యుడైన ఈ ఆత్మ తన బుద్ధిని ప్రకాశింప జేయ వలసినదనికోరడం అనగా "నా బుద్ధి ఎటువంటి అలజడులు లేక ఎల్లప్పుడూ ఒకే విధంగా ప్రకాశిస్తు స్థిరంగా ఉండుగాక. కామక్రోధాది రూప మలినములు లేకుండా నిత్యశుద్ధంగా ఉండుగాక" అని ఈ మంత్రము ద్వారా సాధకుడు చేయు ప్రార్థనలోని సారాంశం ఇదే.

# దర్భలు : విశిష్టత

మన సంస్కృతియందు దర్భలకు అధిక ప్రాముఖ్యమున్నది. అంతేకాక ఇవి పరమ పవిత్ర మైనవిగా ఆరాధింపబడుచున్నవి. దర్భలు లేక ఏ సంస్కారములు జరుగవు. సంస్కారములయందే కాక ఆయా సన్నివేశములలో శిష్టులచే దర్భలు ఆదరింప బడుచున్నవి. దర్భలకు భారతీయ జీవన విధానము నకు విడదీయలేని సంబంధమున్నది.

దర్భ శబ్దమునకు 'నశింపజేయునది' అని అర్థము (దృవిదారిణే - దృగాతి విదాయతీతదర్భః) మాలిన్యమును, పాపమును నశింపజేయునది అని అర్థము.

ఇంద్రుని హస్తమున వజ్రము, మహాత్ముల కరమున దర్భ సమానరూపములు (యరేంద్రస్య కరే వజ్రః తథా విప్రకరేకుశః)

దర్భల మహిమ శ్రుతి వర్ణించుచున్నది. మానవుడు అసత్యదోష దూషితుడు. అపవిత్రుడు అట్టి వానిని పవిత్రునిగా జేయుశక్తి దర్భలకు కలదు దర్భలు స్వతః పవిత్రములు. అంతేకాక అవి అన్నిం టిని పవిత్రము చేయును. వాటిని పవిత్రముగా చేయనవి, చేయగలవి మరియేదియులేదు. కనుకనే దర్భలకు పవిత్రములను సార్థకనామము కలదు. (పూయతే అనే నేతి పవిత్రమ్)

భగవదనుగ్రహముతో భక్తుడు నిర్మాలాంతః కరణుడై క్రమముగ గుర్వనుగ్రహాదులతో ఆత్మ సాక్షాత్కారమును పొంది పవిత్రుడగుచున్నాడు అనగా భగవంతుడు, ఆత్మజ్ఞానము పవిత్రమైనట్టివి. ఆత్మ జ్ఞానము పవిత్రమైనపుడు, ఆత్మజ్ఞాన ప్రబోధకములైన ఉపనిషత్స్వరూపము, వేదవాణియు పవిత్రము. వేదా నుసారియగు నిఖిల ఆర్షవాఙ్మయమంతయు పవి త్రముగా భావింపబడుచున్నది. అట్లే వేదోపాసకులగు మహర్షులుకూడ పవిత్రులుగా పూజింపబడుచున్నారు. ఇట్లు పవిత్ర స్వరూపము తత్త్వపరముగ పరిశీలించి నపుడు క్రమముగ పరమేశ్వరుడు ఆత్మసాక్షాత్కారము, ఆత్మవిద్యాప్రబోధక ఉపనిషత్స్వరూప వేదవాణి, తదు పాసకుల మహాత్ములు పవిత్రరూపులని తెలియు చున్నది.

దర్భలు ఇట్టి పవిత్రరూపములగు ప్రతినిధి రూపములు కనుకనే అన్ని వస్తువులను పవిత్రీకరించు శక్తి కలిగియున్నవి. ప్రపంచమున పవిత్రమైనవి ఎన్నియున్నను అన్నిటిలోను పవిత్రమైనవి దర్భలగు చున్నవి కనుకనే శ్రుతి అడుగడుగున "పవిత్రం వైదర్భాః" అని దర్భల పవిత్రతను చాటుచున్నది. దర్భలు శ్రుతి ప్రతినిధిరూములను ఉపదేశించు చున్నది.

దర్భలు, అన్ని శుభాది సన్నివేశములయందు, ఉపయోగింపబడుచున్నవి. యజ్ఞకర్మల యందు ప్రయోగింపబడెడు దర్భలకు వేదమని పేరు. ఈ దర్భల ఉత్పత్తి తెలియజేయుటకొక ఇతిహాసము కలదు వృతుడను రాక్షసుడు పృథువులలో వ్యాపించి యుండెను. ఇంద్రుడు అతనిని చంపివేసెను. అపుడా రాక్షసుడు ఉదకములందు ప్రవేశించెను. వృత ప్రవేశ ముచే దూషితములైన ఉదకములనుండి, ఉదకముల యందు పవిత్రభాగము వెలువడి, దర్భరూపమును దాల్చెను. కనుక యజ్ఞాది నిఖిల కర్మలయందు ఉదకములు దర్భలచే పవిత్రీకరించబడతాయి. ఈ విషయము శతపథబ్రాహ్మణమునందు వివరింపబడినది.

దర్భలు దివ్యశక్తి రూపములు. కావున దైనందిన జీవితమునకూడ జలములను దర్భలచే శుద్ధి చేసు కొనుట అవసరము.

తైత్తరీయ బ్రాహ్మణము నందు దర్భల మహత్యము విశదీకరించబడినది. దర్భలు జల, తేజో రూపములు. దర్భలస్పర్శ, ప్రోక్షణాదులు, వస్తువులను శుద్ధిచేసి ఆ వస్తువులయందు అపూర్వశక్తి, తేజస్సు, వర్చస్సు అనుగ్రహించుచున్నవి. కనుక దర్భసేవ అత్యుత్తమము, క్షేమకరమని తెలియుచున్నది.

గ్రహణ దినములందు అది, ఇదియను భేదము లేకుండా అన్ని వస్తువులయందు దర్భలుంచబడుచున్నవి.

దర్భలిట్టివి కనుకనే మహాత్ములు దర్భలతో నిత్యసంబంధము కలిగియున్నారు. మహర్షుల ఆవాసమును పరిశీలించినప్పుడీ విషయం స్పష్టమగును.

మహర్షుల గృహములు దర్భలమయములు. గృహాచ్ఛాదకములు దర్భ విశేషములు, ఆశ్రమ ప్రాంతములు దర్భమయము, అచటి గాలి దర్భమయము. అచట పంచభూతములు దర్భ సంవృత్తములే, వారి శయ్యాసనాదులు దర్భమయములే. వారి సర్వస్వము దర్భలే.

కాళిదాసమహాకవి దర్భల దివ్యౌషదీత్వమును గుర్తింపజేసెను. వాల్మీకాశ్రమమున సీత ప్రసవించుచున్నప్పుడు కుశలతోను, లవములతోను మహర్షి సీత యొక్క గర్భక్లేశమునుపోగొట్టెను (కుశలనగా దర్భలు లవములనగా దర్భవిశేష సూక్ష్మతృణ రూపములు).

సాధారణంగా నైపుణ్యము కలవారిని కుశలురందరు. సంసార సాగరమునుండి, అవిద్యాబంధనము నుండి దొలగుటకు చేయుయత్న కౌశల్యము కుశలత్వము.

కుశలయొక్క శక్తి కుశాగ్రములందు విశేషముగ వెలయుచుండును. దర్భాగ్రములు దైవీశక్తి సంపన్నములు. దర్భల మొదళ్ళశక్తి వేరు, మధ్యశక్తివేరు, అగ్రములశక్తి వేరు దర్భలకు మొదట పితృ దేవతా సంబంధము, మధ్య భాగము మానవ సంబంధము, అగ్రభాగము దేవతాసంబంధము కనుకనే వాల్మీకి ప్రాచీనాగ్ర దర్భలయందుపవిష్టుడై రామాయణ రచనకు పూనుకొనెను.

సుబాహుమారీచులను సంహరించిన విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణులను ఆశీర్వదించి దర్భ పవిత్ర ప్రాణియై స్పృశించేనట! దర్భలయొక్క ఆశనముపై ఉపదేశము చేసి వేదమును అధ్యయనము చేసినచో వేదమును రసోపేతముగ చేయును. ఈవిధముగ శ్రుతి, కావ్యాదులందు గల దర్భల దివ్యశక్తి, స్వరూపము వర్ణింప నలవికానిది.

వైదిక సాంప్రదాయ మహాత్యమును దర్శించి, గౌరవించి దర్భల సేవించి పాఠకులు శుభపరంపరలో వర్థిల్లెదరు గాక. కుశలురై శోభిల్లెదరుగాక.

## రావి చెట్టుకు ప్రదక్షిణాలు

మానవుడు ప్రకృతి నుంచి అనేక లాభాలు పొందడం వలననే ప్రకృతిని దైవంగా భావించి పూజించడం ప్రారంభించాడు.

రావిచెట్టుకు ప్రదక్షిణం చేస్తే పుణ్యమని పెద్దలు చెప్తారు. ఇటీవల భౌతిక శాస్త్రజ్ఞులు రావిచెట్టు చుట్టూ తిరగడంవలన కొన్ని విద్యుత్‌తరంగాల వంటివి మానవ శరీరంలో ప్రవేశించి వేడిని కలిగిస్తాయని కనుగొన్నారు. ఇందువలన స్త్రీలలో గర్భవాత దోషం నశించి సంతానం పొందడానికి అవకాశం వుంది. తైత్తరీయ బ్రాహ్మణం(1-1-3), అగ్ని ఈ చెట్లలో ఒక సంవత్సరం నివసించాడని చెప్పినది. అందుచేత ఇది వేడి గుణం కలదని చెప్పడం సమంజసమే ననిపిస్తున్నది.

# గ్రహణములు : దేవాలయ విధులు

న్యాయవాదికి న్యాయశాస్త్ర గ్రంధములవలె, దేవాలయ విషయములను సమగ్రముగ తెలుపు శ్రీ పంచరాత్ర సంహితలు వైఖానస సంహితలు, శైవ సంహితలు ఆయా దేవస్థానములయందు తప్పక ఉంచ వలెను. అంతేకాక శాస్త్ర విహితవిధులను ఆచరించ వలెను.

ఈ సంహితలు, దేవాలయ విధులను తెలియ జేయును. మన భారతీయ సంస్కృతిలో సూర్య, చంద్ర గ్రహణములు అత్యంత పవిత్రసమయాలుగా విశిష్టమైన స్థానాన్ని సంతరించుకున్నవి ఆ పర్వదినాలలో చేసిన స్నాన, దాన, ధ్యానాదులు అనంతమైన ఫలితాన్ని స్తాయని పెద్దలు చెపుతారు.

మంత్రోపాసకులు, దైవారాధకులు ఉపదేశం చేసేవారికి, ఉపదేశం పొందేవారికి, ఇలాగ మరెందరికో సర్వసిద్ధిప్రదమైన దినము గ్రహణం సంభవించు **దినము**.

పాంచరాత్ర సంహితలు సూర్య చంద్రగ్రహణ ములయందు చేయవలసిన విధులు చెప్పుచున్నవి.

సూర్య, చంద్ర గ్రహణములు పట్టుటకు ముందు ఉపచారాదులచే, దేవయజము చేసి, నిత్య హెూమము, పంచామృత స్నానము, స్వామివారికి అర్చకస్వాములు సమర్పించవలెను. గ్రహణము సంపూర్ణముగ విడిచి సూర్యచంద్రులు అగుపడువరకు శ్రీ మదాష్టాక్షరీ మంత్రమునుగాని ద్వాదశాక్షరీ మంత్రమును గాని జపము చేయవలెను. ఇట్టి సమయములందు చేయు పూజ, హెూమ, జపాదులు విశేషఫలము నిచ్చును.

సూర్య, చంద్రాది గ్రహణసమయములందు శ్రీవారికి స్నానము చేయించవలెనని యున్నది. (ఈశ్వరసంహిత – ప్రాయశ్చిత విధి – చంద్ర సూర్య, పరాగేచ తత్కాలే స్నాపయేత్ప్రభుమ్) ఈశ్వర సంహిత ఈ కార్యక్రమమును సమర్థించుచున్నది. సాగరమందు గాని, సాగరజలములచే గాని, పుణ్యతీర్థములచే గాని ఈ స్వామికి స్నానము చేయించవలెనని శ్రీ పాంచరాత్ర మందు చెప్పబడినది.

సూర్య, చంద్ర గ్రహణ సమయముల యందును, అర్చనా విధులయందును విడువదగిన దేదియు లేదని తెలిసికొనవలెను. స్వయముగ సర్వము శుద్ధియగును. గ్రహణాదులు సంభవించినచో ఆచార్య, ఋత్విజాదులు సచేలస్నానము చేసి, బొట్టుపెట్టుకుని అన్యసంభాషణ వదలి, మౌనము, శుద్ధగ్రహణ మోక్ష కాలము వరకు మంత్రానుష్ఠానము చేయవలెను. తర్వాత మోక్ష స్నానముచేసి, హెూమ, కైంకర్యాదులు చేయవలెనని చెప్పబడియున్నది. మహెూత్సవ సమయములందు, గ్రహణములు సంభవించినేని ఉత్సవము చేయరాదని చెప్పబడినది. (అయితే మోహ వశాత్తు) ఉత్సవము చేసిరేని తద్దోష నివారణార్థము శ్రీవారికి ద్వాదశ కలశ స్నానము సమర్పించి మంత్ర జపము పదివేలు చేయవలెను. (ఓం హ్రః వీర్యాయాస్త్రాయ ఫట్ అను అస్త్రమంత్ర జపము)

## పురాణగాథ

పూర్వము ఒక్కప్పుడు దేవదానవులకు అమరత్వలబ్ధికై అమృతం సంపాదించాలని బుద్ధి పుట్టింది. అపుడు వారు పర్వతాన్ని కవ్వంగాను వాసుకిని (సర్పరాజును) తాడుగాచేసి క్షీరసాగర మధనం చేయగా అమృతం పుట్టినది. దానిని చూచి శ్రీమహా విష్ణువు మోహిని రూపంలో దేవతలనొకవైపు, దానవులనొక వైపు కూర్చుండబెట్టి ముందుగా దేవతలవైపు అమృతం పంచటం ప్రారంభించగానే ఒక దానవుడు దానిని కని పెట్టి దేవతలతో కలిసి కూర్చున్నాడు. మోహినిరూప శ్రీహరి ఆ రాక్షసునకు కూడా అమృతాన్ని పంచడాన్ని చూచి సూర్యచంద్రులు శ్రీహరికి సంజ్ఞ చేయగా, వెంటనే శ్రీహరి చక్రాయుధంతో వానిని సంహరించెను.

అయితే అమృతం తాగడంవల్ల ఆ రాక్షసుడు చావకుండా రెండు ముక్కలయ్యాడు. ఒక ముక్క రాహువుగాను, వేరొకముక్క కేతువుగాను మారాయి. సంజ్ఞ చేసిన కారణంగా సూర్యచంద్రులను ద్వేషించి రాహు, కేతువులు వారిని పట్టి పీడిస్తున్నాయి. రాహువు గ్రహించినపుడు రాహుగ్రస్త గ్రహణాలని, కేతువు గ్రహించినపుడు కేతుగ్రస్త గ్రహణాలని పండితులంటారు.

ఆధునికుల అభిప్రాయం ప్రకారం సూర్యుని చుట్టూ, భూమి, భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతుంటాడు. ఆ తిరగడంలో భూమి యొక్క ప్రచ్ఛాయ ఉపచ్ఛాయలలోనికి చంద్రుడు చంద్రుని యొక్క ప్రచ్ఛాయ ఉపచ్ఛాయలలోనికి భూమి రావడాన్ని గ్రహణం అంటారు. భూమికి సూర్యునికి మధ్యలో చంద్రుని ప్రచ్ఛాయపడటంవలన సూర్యగ్రహణం, భూమి యొక్క ప్రచ్ఛాయ చంద్రునిమీద పడటం వలన చంద్రగ్రహణం ఏర్పడతాయని చెబుతారు.

ప్రచ్ఛాయల వలన సూర్య చంద్ర గ్రహణాలేర్పడుచున్నవి. ఆ ప్రచ్ఛాయలే రాహుకేతువులను కంటే పూర్వులకు, ఆధునికలకు సమన్వయం కుదురుతుంది.

గ్రహణం మేఘావృతమై కనబడకపోయినా, శాస్త్రప్రమాణాన్ని అనుసరించి స్పర్శ, మోక్షకాలం (అనగా పట్టువిడుపులకాలం) తెలిసికొని స్నానాదులు చేయాలి. ఆదివారం సూర్యగ్రహణం, సోమవారం చంద్రగ్రహణంవస్తే చూడామణి నామక గ్రహణం అవుతుంది. ఇలాటప్పుడు స్నానాదులు చేస్తే విశేషఫలం వస్తుంది.

గ్రహణ స్పర్శకాలములో స్నానం, మధ్యకాలంలో హోమం, దేవపూజ, పితృదేవతలకు పూజలు, విడుపు ఆరంభంలో దానం, ముక్తికాలమందు స్నానం చేయవలెను.

స్నానమునకు వేడినేటికింటే చన్నీళ్ళు, పరులు తెచ్చిన నీళ్ళకంటే స్వయంగా తెచ్చుకున్న నీళ్ళు, నూతినీళ్ళకంటే చెరువునీళ్ళు పుణ్యప్రదాలు ప్రవాహోదకం మంచిది. దానికంటే సరస్సులోని నీరు, అంతకంటె సముద్రస్నానం మంచిదని కొందరి మతం. గ్రహణ ముక్త్యనంతరం అనగా గ్రహణం విడుపు అయిన తరువాత స్నానం చేయకుంటే గ్రహణ సూతకం నశించదు. కాబట్టి అందరు తప్పక స్నానం చేయాలి.

గ్రహణ కాలమందు అన్ని వర్ణాలవారికి సూతకముంటుంది. కావున గ్రహణ కాలమందున్న వస్త్రాలను తడిపి శుద్ధిచేసుకోవలెను.

## విజ్ఞప్తి

పుణ్య క్షేత్రముల పవిత్రతను కాపాడుట ప్రతి యాత్రికుని ప్రధాన కర్తవ్యము. అరటితొక్కలు, కొబ్బరి పెంకులు ఒక మూల లేక నిర్దేశించిన స్థలములలో వేసి దేవాలయ శుభ్రతను కాపాడవలెను.

పుణ్య క్షేత్రములందు, నశీపాన ఉమ్మివేయుట, పొగత్రాగుట, మద్యపానము సేవించుట, జూదం ఆడుట, పశువులను కట్టుట, చెత్త, చెదారములు వేయుట చేయవద్దని అందరికీ చెప్పండి!

ప్రతి ఒక్కరు ఇందుకు సహకరించండి.

# జపమాల జపవిధానము

భగవంతుని స్మరించడానికి, భగవన్నామం జపించడానికి ముఖ్యమైన సాధనంగా జపమాల అవసర మవుతున్నది. జపసంఖ్య వేళ్ళతోను, వేళ్ళయందలి కణుపులపైన లెక్కపెట్టడం కూడా అలవాటులో ఉన్నది.

జపమాల గురించి లింగపురాణంలో వివరంగా తెలుపబడింది. వైష్ణవమంత్రాలను జపించడానికి తులసి మాల చెప్పబడింది. గణేశమంత్రం జపించడానికి గజ దంతమాల చెప్పబడింది. త్రిపురసుందరీదేవి నుపాసిం చడానికి రక్తచందన రుద్రాక్షమాలలు చెప్పబడినాయి. తంత్రసారంలో ఈ విషయం విపులీకరించబడింది.

కాళీపురాణాన్ననుసరించి కుశగ్రంధి (దర్భ) మాలతో చేసే జపం సమస్త పాపాలను హరిస్తుంది. పుత్ర జీవమాలతో జపంచేయడంవల్ల పుత్ర సంతానం కలుగు తుంది. మణిమాల సర్వాభీష్టములు నెరవేరుస్తుంది. ప్రవాళమాల ధన, ధాన్యాదులను అనుగ్రహిస్తుంది.

ఒకటే దండలో తులసి, రుద్రాక్ష, పుత్రజీవ, పద్మాక్ష, భద్రాక్షదులను కలిపి కూర్చకూడదు. ఏదో ఒక వస్తువులమాలతోనే జపం చేయాలి.

సనత్కుమార సంహితలో మాలాసూత్రాలను విశేష ఫలితాలు చెప్పియున్నాడు. ప్రత్తితో వడకబడిన దారంతో గ్రుచ్చబడిన మాల చతుర్విధ పురుషార్థ దాయకమై యుంటుంది. కన్య వడికినమాల ఎంతో శ్రేష్ఠమైనది. తెల్లదారం శాంతికర్మలయందును, ఎఱ్ఱ దారం వశీకరణ కర్మలయందును. పసుపుపచ్చని దారం అభిసారిక కర్మలలోను, నలుపుదారం మోక్ష కర్మల లోను ఐశ్వర్యదాయక కర్మల్లోను ఉపయోగిస్తే విశేష ఫలితముటుందని చెప్పబడింది. ఓంకారం జపంచేస్తూ మాలను గ్రుచ్చవలెను, మాల గోపుచ్ఛంవలెగాని, సర్పా కారంగా కాని ఉండాలి.

సంధ్యోజాత మంత్రంచెప్పి, పంచగవ్యంతో మాలను సంస్కరించి, వామదేవమంత్రం చెప్పి, సుగంధ ధూపంచేసి, యోగినీ హృదయంలో చెప్పిన మాలా ప్రార్థన చేయవలెను.

మంత్రం జపించేటప్పుడు మాల క్రింద పడ కూడదు. తెగిపోవటం అశుభసూచకం. జపం పూర్తి అయిన తరువాత మాలా ప్రార్థన మంత్రం చెప్పి మాలను ఎఱ్ఱని పుష్పాలతో పూజించి గోముఖి అనే సంచిలో ఉంచవలెను. మాలకు అపవిత్ర వస్తువులు తగిలితే నీటితో కడిగి మాలలోని పూసలు తెగిపోయినా, జారిపోయినా మాలాప్రార్థన మంత్రాన్ని 108 సార్లు జపం చేయవలెను. ఈ విషయాలు వైశంపాయన సంహిత వలన తెలుస్తున్నవి.

లింగపురాణ, గౌతమీతంత్ర, తంత్రసారాదు లలో కోరికలననుసరించి మాలపై వ్రేళ్ళ ప్రయోగాన్ని విధించబడ్డది.

మంత్రజపంలో అంగుష్ఠం మోక్షదాయకం (బొటనవేలు) తర్జని (చూపుడువేలు) శత్రునాశనం. మధ్యమాంగుళి ధనదాయకం. అనామిక శాంతిప్రదం. జపకర్మలలో చిటికెనవ్రేలు ఉపయోగం నిషేధం. అనగా పనికిరాదు.

అంగుష్ఠం (బొటనవేలు) ఉపయోగించకుండా చేసే సత్కర్మలన్నీ సంపూర్ణత్వాన్ని పొందలేవు. కావున జపం చేసేటప్పుడు అంగుష్ఠ స్పర్శ అవసరం. లింగ పురాణంలో ఈ విధానం చెప్పబడ్డది.

జపమాలను మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు, బౌద్ధులు, మొదలగువారంతా ఉపయోగిస్తు న్నారు. మన భారతదేశం నుంచే మాలా సంప్రదాయం ఆదర్శంగా వీరు గ్రహించినట్లు తెలుస్తున్నది.

బౌద్ధులు ఉపయోగించే మాలలో 108 పూసలుంటాయి.

సాగదమనగారుడిమాల అనే మాల హిందువులు కొందరు ఉపయోగిస్తుంటారు. ఈ మాలను పాముల, ఎలుకల పూసలు గుచ్చియుంటారు. ఈ మాలను ధరించడంవల వ్యాధులు నయమవుతాయని కొందరి నమ్మకం. ఈ మాలతో గరుడమంత్రాన్ని జపించడం వల్ల పామువిషం దిగిపోతుంది. చాలామంది జపమాలను ధర్తిస్తారు.

## అష్టాదశ శక్తి పీఠాలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ శాంకరీదేవి | ............. | శ్రీలంక |
| 2. | శ్రీ కామాక్షీదేవి | ............. | కంచి |
| 3. | శ్రీ సింహళదేవి | ............. | ప్రద్యుమ్నం |
| 4. | శ్రీ చాముండీదేవి | ............. | కంస పట్టణం |
| 5. | శ్రీ జోగుళాంబాదేవి | ............. | అలంపురం |
| 6. | శ్రీ భ్రమరాంబాదేవి | ............. | శ్రీశైలం |
| 7. | శ్రీ మహాలక్ష్మీదేవి | ............. | కొల్లాపురం |
| 8. | శ్రీ ఏకవేణికాదేవి | ............. | మాహుర్యాం |
| 9. | శ్రీ మహాకాళీదేవి | ............. | ఉజ్జయినీ |
| 10. | శ్రీ పురుహూతికాదేవి | ............. | పిఠాపురం |
| 11. | శ్రీ గిరిజాదేవి | ............. | ఓఢ్యాణం |
| 12. | శ్రీ మాణిక్యాదేవి | ............. | చిత్రకూటం |
| 13. | శ్రీ కామరూపాదేవి | ............. | హరిక్షేత్రం |
| 14. | శ్రీ మాధవీశ్వరీదేవి | ............. | ప్రయాగ |
| 15. | శ్రీ వైష్ణవీదేవి | ............. | జ్వాలాక్షేత్రం |
| 16. | శ్రీ సర్వమంగళాదేవి | ............. | గయ |
| 17. | శ్రీ విశాలాక్షీదేవి | ............. | వారణాసి (కాశి) |
| 18. | శ్రీ సరస్వతీదేవి | ............. | కాశ్మీరం |

# తిలకధారణ

నుదుట విభూతి, తిరుమణి, గోపీచందనం, కుంకుమ (చాందు) ధారణ మన మతంలో ఒకానొక గొప్ప లక్షణమై, అతిప్రాచీనమై ఉన్నది.

నుదుట విభూతి, తిరుమణి వంటి తిలకధారణ మనధర్మం లోని అనేక సూక్ష్మరహస్యాలను మనకు జ్ఞాపకమొచ్చేలా చేస్తున్నది. గోపీచందనం బొట్టు, నామమును శ్రీ మహా విష్ణువును, మధ్వులు ధరించే నల్లని చిహ్నము కూడా శ్రీ మహావిష్ణువును, అలాగే నుదుట మూడుచారల విభూతి, పరమశివుని జ్ఞప్తికి తెస్తున్నది.

విభూతి ఎలా తయారుచేస్తారో ఆపద్ధతిని వివరిస్తాను. శ్రీ లక్ష్మీదేవికి నివాస (స్థానమైన) యోగ్యమైన వస్తువు నుండి దీనిని తయారుచేస్తారు. శ్రీ లక్ష్మీదేవికి నివాసయోగ్యమైన గోమాతయొక్క పుచ్ఛభాగము నుండి లభ్యమగుచున్న గోమయమునుండి (ఆవుపేడ) ఈ విభూతి తయారు చేస్తారు. గోమాత యొక్క పుచ్ఛ భాగంలో శ్రీ మహాలక్ష్మి, ఇతరభాగాలలో ఇతర దేవతలు నివసిస్తారు. అందువలన ఈ గోమయపు పిడకలను కాల్చి తయారు చేసిన విభూతి సంపదకు చిహ్నం.

శ్రీమహాలక్ష్మి ముఖ్యంగా ఐదుస్థలములలో ఉంటుంది. గోమాత యొక్క పుచ్ఛభాగము, వివాహిత స్త్రీయొక్క పాపిట, పద్మములు, బిల్వపత్రములు, ధైర్య, సాహసాలున్నచోట ఈ ఐదు స్థలాలలో నివసిస్తుంది. చాలా మంది స్త్రీలు ఎక్కువగా ఉత్తర భారత దేశంలో వారు, పాపిటలో సింధూరం ధరిస్తారు. అందువలన తిలకధారణ విశిష్ట ప్రాముఖ్యము కలిగినది.

మామూలుగా పత్రాలు, పుష్పాలు ఏ రోజు కోసినవి ఆరోజేపూజకు ఉపయోగించాలి కాని బిల్వ పత్రాలు, పద్మాలు పదిరోజులైనా వాటిలో శ్రీమహాలక్ష్మి దేవి నివసించడం వలన వాటికి నైర్మాల్య దోషం అంటదు.

శ్రీమహాలక్ష్మీదేవి ధైర్యసాహసాలు, సత్ప్రవర్తన, సత్యవర్తనము ఉన్నచోట కూడా ఉంటుంది. గోమయము పవిత్రముగా ఎంచబడుతుంది. దానితో తయారుచేయబడిన విభూతి సిరిసంపదలకు చిహ్నంగా పరిగణించబడుతుంది. ఈ విభూతి ధరించినంతకాలం దారిద్ర్యం ఉండదు. ఋణాల ప్రశ్నే ఉండదు.

మనదేశంలో విభూతి, తిరుమణి ధారణవంటి లలాట చిహ్నాలు విడనాడడం వలన నేడు మనదేశం ఋణగ్రస్త మైనదని కంచికామకోటి పీఠాధిపతులు, శ్రీ శంకరాచార్యులవారు అభిప్రాయపడుతున్నారు. మరల మనము నుదుట ఈ తిలకధారణ పునః ప్రారంభిస్తే మన ఋణాలనన్నిటిని తుడిచి పెట్టివేయగలమని వారు చెబుతున్నారు. ప్రజలు విభూతి, తిరుమణి ధారణ పునః ప్రారంభించిన తరువాత దేశం మరల సుభిక్షమైన సంఘటనలు చరిత్రలో అనేకం ఉన్నాయి. మధురలో తిరుజ్ఞాన సంబందర స్వామి వారు ప్రజలను విభూతి ధారణకు ప్రేరేపించి, ఆచరించినప్పుడు దారిద్ర్యము అదృశ్యమై దేశము సుసంపన్నమైనది. విభూతి నెలకొన్నచోట దారిద్ర్యము నిలువలేదని నిరూపణ అయినది.

విభూతి ధారణ దురదృష్టవశాత్తు రోజు రోజుకు తగ్గిపోవుచున్నది. కొందరు కొద్దిగానో, గొప్పగానో అనుష్ఠాన సమయంలో మాత్రమే విభూతి ధరించి ఆ కొద్దిసేపు ధరించిన విభూతిని చెరిపేసుకుని వారి వారి పనులపై వెళుతున్నారు. పర్యవసానముగా అంత మాత్రపు సంతోషమే లభిస్తున్నది. విభూతి ధారణ అత్యంత ఆవశ్యకము. పరమశివుని లలాటం మీద మూడు విభూతి రేఖలుంటాయి అందువలన విభూతి ధారణ మనకు ఆ పరమశివుని జ్ఞాపకం చేస్తుంది.

విభూతి స్వచ్ఛమైన ధవళవర్ణము. అనగా తెలుపు రంగులో ఉంటుంది. ఇది ప్రాపంచిక వస్తువుల

యొక్క అంతిమ స్థితిని సూచిస్తుంటుంది. అనగా ఏ వస్తువైనా దహింపబడిన పిదప మిగిలేది భస్మము మాత్రమే అని లేదా స్వచ్ఛమైన ధవళ వర్ణముతో కూడిన పరబ్రహ్మ స్వరూపమని ఈ భస్మము జ్ఞప్తికి తెస్తున్నది. ఇలా విభూతిధారణ అనేక వేదాంత సత్యాలను తెలియజేస్తుంది.

వస్తువులన్నింటికి ఉత్పత్తి స్థానము మూలాధారము యొక్క చిహ్నంగా విభూతిని ధరిస్తాము.

ఒక వస్తువు దహింపబడినపుడు మొదట నలుపు రంగును, ఇంకను దహింపబడినపుడు తెలుపురంగును, మరల దహించినపుడు తుదిరూపము భస్మము మాత్రమే మిగులుతుంది. కనుక వస్తువులన్నిటికి తుది రూపము భస్మము మాత్రమే. కావున విభూతి వ్యవహారికంగా సంపదకి, ఆధ్యాత్మికంగా పరమేశ్వరునికి అన్వయిస్తుంది. జ్ఞానాగ్నిలో సర్వము దహింపబడిన తరువాత చివరకు మిగిలేది పరమేశ్వర లేదా పరబ్రహ్మ స్వరూపము మాత్రమే.

అలాగే ఎఱ్ఱని కుంకుమ లక్ష్మీదేవిని స్ఫురింపజేస్తుంది. కుంకుమ తయారుచేయడానికి నిర్ణీతమైన పద్ధతి ఉన్నది. పసుపు నిమ్మరసం, నెయ్యి మొదలగు పదార్థములతో తయారు చేసిన కుంకుమనే ధరించాలి. ఇలా తయారు చేసిన కుంకుమనే పూజకు, దేవతార్చనకు ఉపయోగించి ఆ తరువాత మనం పూజ కుంకుమ ధరించాలి. ఈ కుంకుమ లక్ష్మీదేవిని, పార్వతిదేవిని స్ఫురింపజేస్తుంది.

గోపిచందనం శ్రీ కృష్ణపరమాత్మ పవిత్ర పాద పంకజస్పర్శచే పునీతమైన గోపీమృత్తికను స్ఫురింపజేస్తూ శ్రీ కృష్ణపరమాత్మను గోపికలను జ్ఞప్తికి తెస్తుంది. శ్రీ మహావిష్ణువును మదిలో నిలుపుకోవటానికి గోపిచందనము ధరిస్తాము.

మధ్వులు తమ శరీరం మీద నల్లని చాందు చిహ్నాలు ధరిస్తారు. ఈ ప్రపంచం అశాశ్వతమైనదని ప్రతి వస్తువు నశిస్తుందని కాలి మసి అవుతుందనే నిజాన్ని ఈ చిహ్నాలు సూచిస్తాయి. ప్రతి వస్తువునందు వైరాగ్య భావాన్ని పెంచుకొని, ప్రాపంచిక విషయాలపై అనాశక్తిని పెంచుకోవాలి.

మన మతంయొక్క సంప్రదాయమైన ఏదో ఒక రీతిలో తిలకధారణ చేసేవారందరూ పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్ముతారన్న సత్యాన్ని కూడా వెల్లడి చేస్తుంది. బౌద్ధులు, జైనులు కూడా ఈ సిద్ధాంతాన్ని నమ్ముతుండడం వలన తిలకధారణ చేస్తున్నారు.

విభూతి మనలని కాపాడుతూ పునర్జన్మ సిద్ధాంతాన్ని పరమాత్మతత్త్వాన్ని మనకు స్ఫురణకు తెస్తుంది. జీవితంలో కష్టసుఖాలను, శుభాశుభాలను మనం అనుభవించకతప్పదు. వాటిని తప్పించుకోవడం అసాధ్యం కాని వాటి ఉధృతాన్ని కొంతవరకు తగ్గించవచ్చు. అందువలననే మనకు ప్రాయశ్చిత్తము, నవగ్రహ హోమమువంటి దోష ఉపశమనోపాయములు ఉన్నాయి. కష్టాలుభరించే మానసిక శక్తిని పెంపొందించుకున్న కారణంగా తరువాత వచ్చే కష్టాలకు తట్టుకునే శక్తిని పుంజుకుంటారు. వాటికంతగా చలించని మనోబలం కలుగుతుంది.

నుదుట విభూతిని ధరిస్తే అది మనకు పరమేశ్వరుని స్ఫురింపజేస్తుంది. బ్రహ్మదేవునిచే లిఖింపబడిన అశుభలలాటం దైవానుగ్రహం పొందుతుంది. అందువలన ఆటంకాలు, కష్టాలు, బాధలు, ఉధృతం తగ్గి ఉపశమనం పొందుతాం. విభూతి, తిలకధారణలోని ముఖ్యోద్దేశము ఇదే. సామాన్య మానవునికి కష్టాలను భరించే శక్తి సహజంగానే ఉండదు. కాని అతడు భక్తిని పెంపొందించుకుని నుదుట విభూతి లేక తిలకం ధరించి దాని ద్వారా ఈశ్వరుని స్ఫురణకు తెచ్చుకుంటే అతనికి దైవానుగ్రహం తప్పకలభిస్తుంది. తన కష్టాలన్నిటిని అమితమైన మానసిక శక్తితో భరించడానికి అవసరమైన మనోబలం పొందగలగడంలో అతిశయోక్తి లేదు.

అందువలన ప్రతి వ్యక్తి ఉదయాన్నే లేచి కాలకృత్యాలు, స్నానపానాదులు పూర్తి చేసుకొని నుదుట విభూతి, కుంకుమ లేక తిరుమణి ధరించి దైవాన్ని స్ఫురణకు తెచ్చుకుంటూ దైవానుగ్రహంతో దైనందిన కలాపాలు కొనసాగించాలని కోరుకుంటున్నాను.



# తపస్సు

శరీరాన్ని వేడెక్కించి, ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవడానికి ఉపయోగించే ముఖ్య సాధనం తపస్సు. ఇది ఎన్నోవిధములుగ నున్నది. ఏకాగ్రచిత్తంతో ఏదో ఒక దైవరూపాన్ని మనస్సులో ఆరాధించాలి. అందు ముఖ్యమైనవి కృచ్ఛ్రం, అతి కృచ్ఛ్రం, కృచ్ఛ్రాతికృచ్ఛ్రం.

పగలు మాత్రమే సాత్త్వికాహారం తీసికొని రాత్రి ఏమీ తినకూడదు. ఇలా మూడురోజులు చేయాలి. తరువాత మూడు రోజులు రాత్రి మాత్రమే తిని పగలు తినకూడదు. ఇంకొక మూడు రోజులు ఎవరినీ ఏమీ అడగకుండా ఎవరైనా (ఆయాచితంగా) ఇస్తే తినాలి. మరోమూడురోజులు పూర్తిగా ఉపవాసం చేయాలి. (మొత్తం పన్నెండు రోజులు) ఫలితం వేగంగా కలగాలంటే పగలంతా నిలుచునే ఉండాలి. రాత్రి అంతా కూర్చునే ఉండాలి. (నిద్రపోకూడదు) నిజం చెప్పాలి. అబద్ధం ఆడకూడదు. చెడ్డవారి స్నేహం ఎంత మాత్రం పనికిరాదు. రౌరవం యధా జయం మొదలగు సామలను గానం చేస్తూ ఉండాలి. ఆఖరున దేవతాతర్పణాదులు చేసి, స్వయంగా వండుకొని దేవతలకు నివేదించి తాను తినాలి. ఈ పన్నెండు రోజుల తపస్సుకు కృచ్ఛ్రం అంటారు.

దీనిని మించినది "అతి కృచ్ఛ్రం" పై చెప్పిన నియమాలను పాటిస్తూ, కుడిచేతిలో పట్టినంత అన్నం మాత్రమే రోజుకొకసారి తినాలి.

ఇంతకన్న కఠోరమైన తపస్సు "కృచ్ఛ్రాతి కృచ్ఛ్రం" ఇది పన్నెండు రోజులు చేయాలి నీటితో మాత్రమే జీవించాలి. తక్కిన నియమములు పైన చెప్పినవే. ఈ మూడు విధములైన తపస్సులు ఆచరిస్తే పాపాలన్నీ శమిస్తాయి. పరమ పవిత్రత సిద్ధిస్తుంది. సత్ఫలితాలు కలుగుతాయి. సందేహం లేదు.

*[సామ విధాన బ్రాహ్మణం నుంచి సేకరణ]*

### ఋషి – ముని

ఋషి : "సాంగ చతుర్వేద తపో యోగాదృషిః" అనగా షడంగ సహితముగ చతుర్వేదము లను అధ్యయనమొనర్చి తపస్సంపన్నుడగు వాడు ఋషి.

ముని : "నారాయణ పరాయణో నిర్ద్వంద్వోమునిః" అనగా నారాయణ పరాయణుడై ద్వంద్వాతీతుడగు వాడు ముని. ద్వంద్వాతీతుడనగా సుఖదుఃఖములు, కలిమిలేములు, శీతోష్ణములు, మొదలగువాటిని పాటింపనివాడు.



# అగ్నిహోత్ర–ప్రాముఖ్యము

భారతీయులు సాంస్కృతికంగా మహోన్నత ప్రమాణాలందుకున్నారు. ఇతరదేశాలలో సాంస్కృతిక చైతన్యం ఇంకా శైశవదశలో ఉన్నపుడే మన భారతీయులు సాంస్కృతికంగా ఎంతో ఉన్నతిని సాధించి, మార్గ దర్శకులైనారు.

మన జీవన విధానం ఎంతో లక్ష్యశుద్ధి కలిగినది కావడం వలన, మన జీవితాలను యజ్ఞంగా భావించడం వలన ఇట్టి ఉన్నతి సాధించడానికి అవకాశం కలిగినది. జాతక కర్మ, నామకరణాలనుంచి, అంత్యకాల కర్మకాండ వరకు మనకు వేదాలే పరమ ప్రమాణాలు. వేదోపదేశ మనే ధర్మక్షీరంనుంచి ఏర్పడిన మీగడలాంటిది భారతీయ సంస్కృతి.

మన భారతీయ జీవనంలో, సంస్కృతిలో వేదాలకు అత్యంత ఉన్నత స్థానం ఉన్నది. భూత, భవ్య, భవిష్యత్కాలాలకు మూడింటికి సంబంధించిన నిత్యమైన శబ్దరాశి వేదమని మన దృఢతర విశ్వాసం.

ఋగ్వేదంలో ఇంద్రుని తరువాత రెండవ స్థానం అగ్ని దేవునిదే. యజ్ఞాలలో మానవులు సమర్పించిన ఆహుతులను దేవతల కిచ్చి వారిని యజ్ఞ స్థలానికి తీసుకొని వస్తాడు. యజ్ఞానికి ఇతడేముఖ్యుడు. ఋత్విక్కుగాను, హోతగాను, పురోహితుడుగాను, అధ్వర్యుడుగాను, బ్రహ్మగాను స్తుతింపబడ్డాడు, ఋగ్వేదంలో అగ్ని దేవుడు.

తన భక్తులను రక్షించడం, వారు కోరిన వరాలివ్వడం, ఇతని కర్తవ్యాలని ఋగ్వేదంలో చెప్పబడ్డది. గృహసౌఖ్యం, ఆయుర్దాయం, సంపద ఇతడిచ్చేవరాలు. అందువలన ఋగ్వేద దేవతలలో అగ్ని చాలాముఖ్యుడు. ఋగ్వేదంలో అగ్నికున్న స్థానం చాలా విశిష్టమైనది. ఋగ్వేదం అగ్ని సూక్తంతోనే ప్రారంభమవుతున్నది. పవిత్రతకు, శక్తికి తేజస్సుకు అగ్ని కాణాచి.

కృష్ణ యజుర్వేదంలో అగ్నికికల స్థానం అద్వితీయమైనది.

ఇతనికి లోకంలో ప్రతివిషయమూ తెలుసు. విజ్ఞాన స్వరూపుడైన ఇతడు తనను ఆరాధించిన వారికి అండదండలుగా నిలుస్తాడు, జ్ఞానాభివృద్ధిని కలుగజేస్తాడు. ఇతడు సంపదకు నివాసస్థానం. మానవుల భయాలనన్నిటిని పోగొడుతూ వారి ధర్మవర్తనాన్ని కాపాడుతాడు. ఆత్మజ్ఞానాన్ని, మానసిక విజ్ఞానాన్ని కలిగించి మనలోని అంతఃశత్రువులను జయించడానికి, జ్ఞానాన్ని పొందడానికి కారణ భూతుడవుతాడని యజుర్వేదంలో చెప్పబడ్డది.

అగ్నిదేవుని సేవించడం ద్వారా ప్రజలు మంచి గృహస్థులై, సోమరితనం లేకుండా గృహస్థాశ్రమ విధులను సక్రమంగా నిర్వహించగలుగుతారు.

అగ్ని సర్వదేవతా స్వరూపుడు, తెలిసినవి, తెలియనివి, దేవకృతాలు, మనుష్యకృతాలు, పితృ కృతాలు, ఆత్మకృతాలు అయిన అన్నిపాపాలను ఇతడు పోగొడతాడు.

సామవేదంలో, అగ్నిదేవుని గూర్చి చెప్ప బడ్డది. ఇతడు ప్రత్యక్షదైవంగా పేర్కొనబడినది. తేజస్సు, బలం, ఆయుర్దాయం, ఆరోగ్యం మొదలగు లాభాలను మానవులకు సమకూరుస్తాడు.

అధర్వణవేదంలో కూడా అగ్నిదేవుని గూర్చి చెప్పబడ్డది. వాణిజ్యంలో లాభానికి, వ్యాపారం కోసం ఇతర దేశాలకు వెళ్ళినపుడు బాధలు కలుగకుండా చూడడానికి అగ్నిని శరణుపొంది ఆయన అనుగ్రహాన్ని కోరుతారు.

ఇట్టి మహత్తర శక్తిమంతుడైన అగ్నిదేవుని నిత్యారాధకులు నిత్యాగ్నిహోత్రులుగా చెప్పబడుచున్నారు. వారితేజస్సు నిరుపమానం అగ్నిహోత్రుని నిత్యారాధన వలన వ్యక్తిగతంగా కాక వాతావరణ కాలుష్య నివారణకు కూడా ఎంతో సహాయకారిగా ఉపయోగపడుతుంది. అందువలన అగ్నిదేవుని ఆరాధన ఐహిక ఆముష్మిక సాధనమగుచున్నది.

ఎన్నోదేశాలలో అనగా యూరప్, అమెరికా మరికొన్ని ఆసియాదేశాలలో కూడా గ్రామీణ వైద్య ప్రక్రియలలో అగ్నిహోత్ర భస్మంతో కలిపి తయారు చేసిన మందులను ఎన్నో రుగ్మతలు బాగు చేయుటకు ఉపయోగిస్తున్నారు ఈపద్ధతి "హోమపద్ధతిగా" పేరు పొందినది.

అగ్నిహోత్రము ప్రజ్వరిల్లజేయుటకు ప్రామాణికమైన సూర్యోదయ, సూర్యాస్తమయ సమయములు అతిముఖ్యము. (ప్రాంతాననుసరించి ఈ సమయాలు మారుతుంటాయి.)

కొన్ని వస్తు సముదాయములు, రాగితో చేయబడిన కూచిగానుండెడి (పిరమిడ్ వలె) పాత్రలో నిర్ణీత మంత్రోచ్చారణతో సూర్యోదయ, సూర్యాస్తమయ సమయములయందు ప్రజ్వరిల్ల జేసిన అగ్నిహోత్రము, ప్రత్యేక ప్రయోజనము, అమోఘ గుణకరముగా నుండుట నిశ్చయము.

పిరమిడ్ ఆకారముగల రాగిపాత్రయందు. సూర్యోదయ సూర్యాస్తమయ సమయములకు 8-10 నిముషముల పూర్వము ముందుగా ఎండిన ఆవు (గోవంశము) పేడ పిడకల ముక్కలను తీసికొని ఒక ముక్కను అగ్ని పాత్ర లోపల దిగువ భాగమున ఉంచవలెను. తరువాత రెండు - మూడు లీభాను (గుగ్గిలం) పలుకులు, లేదా హారతి కర్పూరము లేదా ఆవునేయి యొక్క దూది వత్తులను, మరికొన్ని పిడక ముక్కలపై ఉంచి వెలిగించవలెను. రావి, మఱ్ఱి, మేడి, మామిడి, మోదుగవంటి (యజ్ఞీయ) వృక్షముల సమిధలను కూడ పిడకలను వెలిగించుటకు ఉపయోగించవచ్చును. ఆ తరువాత మరిన్ని పిడక ముక్కలను పాత్ర లోపల అమర్చవలెను. అగ్నిపాత్రలో ధూమములేని ప్రజ్వలిత అగ్ని సరిగ్గా సూర్యోదయము - సూర్యాస్తమయ సమయమునకు తయారుగానుండవలెను. ఆ తరువాత మన చేతివ్రేళ్ళ మొనలతో గ్రహించగలిగినన్ని నూకలు లేని బియ్యమును (దంపుడు బియ్యము శ్రేష్ఠము) తీసికొని మన ఎడమ హస్తము లేదా ఒక శుభ్రమైన పళ్ళెంలో ఉంచవలెను. ఇదే విధముగా మరొక పర్యాయం చేయవలెను. ఈపై బియ్యమునకు రెండు-మూడు చుక్కల ఆవు నేయి వేసి కలుపుకొని రెండుభాగములుగా చేసుకొనవలయును. ఆవునెయ్యికు ప్రత్యామ్నాయము లేదు. సరిగా సూర్యోదయ, సూర్యాస్తమయ సమయ మున ఈ క్రింది మంత్రోచ్చారణతో అగ్నికి ఆవు నేయితో కలిపి యుంచిన బియ్యం (ఆహుతులు) సమర్పించవలెను.

సూర్యోదయ మంత్రము :

సూర్యాయస్వాహా, సూర్యాయ ఇదం న మమ
(మొదటి ఆహుతి)

ప్రజాపతయే స్వాహా, ప్రజాపతయే ఇదం న మమ
(రెండవ ఆహుతి)

సూర్యాస్తమయ మంత్రము :

అగ్నయే స్వాహా, అగ్నయే ఇదం న మమ
(మొదటి ఆహుతి)
ప్రజాపతయే స్వాహా, పతయే ఇదం నమమ
(రెండవ ఆహుతి)

స్వాహా అంటూ అగ్నిలో నేయితో కలిపిన బియ్యము (ఆహుతి) అర్పించవలెను. ఆ తరువాత మంత్రము పూర్తి చేయవలెను.

ఈ క్రియానంతరము, తనకు వీలైనంత సమయము సాధకుడు నిష్ఠతో ధ్యానము చేయవలెను.

ఈ అగ్నిహోత్ర క్రియవలన సాధకునకు ఎంతో స్వస్థత కలిగి, శక్తిమంతుడగును. ఉద్రిక్తత తొలగును. ఈ మంత్రోచ్ఛారణము వలన ప్రత్యేక మానసిక రుగ్మతలు నివారణకు, వాతావరణ కాల్యుష నివారణకు అవసరమగు శక్తిని కలుగజేయును.

ఇందులకై పిరమిడ్ ఆకారంలో రాగిపాత్ర అవసరమగును ఈ రాగిపాత్ర 14.5 సెం.మీ. x 14.5 సెం.మీ పై భాగాన ఉండి 5.25 x 5.25 సెం.మీ దిగువ భాగాన 6.5 సెం.మీ. ఎత్తుకలిగిన సూచీ (పిరమిడ్) ఆకారంలో పాత్ర, ముఖ్యమని చెప్పబడ్డది. ఈ పిరమిడ్ ఆకారముగల రాగిపాత్రలో విద్యుత్ అయస్కాంత తరంగాలు, సూర్యోదయకాలమున లేక సూర్యాస్త మయ కాలమున కలుగు జగత్సంబంధమైన తరంగము లతో కలియుట వలన అమితశక్తిని ఉత్పత్తి చేయు గుణము అధికముగా కలుగునని ఋజువైనది.

1969లో డా. అమర్ గోహెడ్ అను శాస్త్రజ్ఞుడు ఎంతో ఆసక్తికర విషయములను సేకరించి "లండన్ టైమ్స్" పత్రికలో వ్రాసినాడు. ఈ సూచీ ఆకారము శాస్త్రపరమైన విద్యుత్ తరంగ సృష్టికి గల అన్ని విశ్వశక్తి రహస్య సూత్రములను అధిగమించదని వక్కాణించెను.

గ్రీకు పదమైన 'పైర్' అనగా అగ్ని 'అమిడ్' అనగా మధ్య లేక కేంద్రము. అనగా ఒకప్రత్యేక సూచీ ఆకారము నకు మధ్యలో అగ్ని మరియు సూర్యోదయ, సూర్యాస్తమయ సమయములందుత్పన్నమగు శక్తి కలిగి యుండుట అని అర్థం.

అగ్నిహోత్రము ఎంతోశక్తివంతమైనది. ఇట్టి ప్రక్రియ. ఎంతో మహిమాన్వితమైనది. ప్రపంచ దేశాల లోని పరిశోధకులు, శాస్త్రజ్ఞులు, అగ్నిహోత్రంపై దృష్టి సారించి, దాని ఫలితాలను గురించి ఎంతో ఆసక్తిని కనబరుస్తున్నారు. వాతావరణ కాలుష్యం వలన ఈనాడు ప్రపంచం అల్లకల్లోలమవుతున్నది. శాస్త్రవిజ్ఞానము, సాంకేతిక పరిజ్ఞానాతిశయమువలన సంభవిస్తున్న వాతావరణ కాలుష్యం మానవాళి మనుగడకు తీవ్రమైన ఆటంకం కలిగిస్తున్నది. అందువలన ఈ దుష్పరిణామములను నివారించుటకు అగ్నిహోత్రంవినా ఇతర సాధనాలు నిష్ప్రయోజనమనే ఆలోచనకు అతి చేరువలో నున్నారు. వాతావరణపై అగ్నిహోత్ర ప్రభావాన్ని శాస్త్రీయ దృక్పథంలో వీక్షించి వివిధ ప్ర క్రియల ద్వారా ఎన్నో పరిశోధనలు చేయుచున్నారు.

అంతేకాక, మనకు భావ కాలుష్యం బెడదకూడా ఉన్నది. దీని నివారణకు ప్రయత్నములు సఫలీకృతం కాలేదు. సరికదా మరి కొన్ని దుష్ఫలితాలను కూడా ఇస్తున్నవి. అందువలన ఈ దుష్పరిణామాల బారి నుండి మనవాళినుద్ధరించుటకు మన ప్రాచీన సంప్రదాయమైన అగ్నిహోత్రాన్ని ఆశ్రయించడం మినహా యెట్టి అవకాశము కానవచ్చుట లేదు. అయితే, యింకను ఈ ప్రాచీన అగ్నిహోత్ర పూజా పద్ధతిపై ఎన్నో పరిశోధనలు చేయవలసి యున్నది.

ఔషధ, వ్యవసాయిక, ఇంధన, ప్రకృతి వైద్య, వాతావరణ కాలుష్య నివారణకు ఇట్టి అగ్నిహోత్ర ప్రక్రియ అవసరమని అనేక ప్రయోగములతో ఋజువగుచున్నది.

మాదక ద్రవ్య, మద్యపానముల వలన కలుగు దుష్ఫలితములను నివారించవచ్చునని లెఫ్టినెంట్ కర్నల్ జె.ఆర్. గొలేబా మహాశయుడు నుడివి యున్నాడు.

పశ్చిమజర్మనీలో "హోమోథెరపీ" ప్రక్రియ

తో ఎన్నో రుగ్మతలకు ఔషధసాధనంగా అగ్నిహోత్రం ఉపయోగిస్తున్నారు. మోనికాజెమ్లీ అను ఫార్మసిస్టు ఈ ప్రక్రియ ద్వారా అనేక రుగ్మతలను నిర్మూలించినాడు.

అంతేకాక, వ్యవసాయకముగా కూడ దీని ఉపయోగమునకై అనేక పరిశోధనలు జరుగుచున్నవి. ఇందుకు గౌతమఅధికారి ఎంతోకృషిని జరుపుచున్నారు. విత్తనశుద్ధి, పంట అధిక దిగుబడికి కూడ ఈ అగ్నిహోత్రప్రక్రియ ఉపయోగపడుచున్నదని తెలియజేసినారు. డా. రామాశ్రయ మిశ్రా మరికొన్ని పరిశోధనలు చేసి ఈవిషయమును రూఢి పరిచినారు. అగ్నిహోత్రము వలన వెలువడిన ధూళితో యీ పరిశోధనలు జరిగినవి. కురగాయలు పండించడములో ఎంతో అభివృద్ధి ఈ ప్రక్రియద్వారా సాధించుచున్నారు.

యోగప్రక్రియలు కూడా దీనివలన సాధించవచ్చునని "కుండలిని" శక్తిని ఉద్దేపింపచేయ వచ్చునని కూడా పరిశోధన వలన తెలియజేయుచున్నారు. జెర్రీ హోడ్జెన్ అను అమెరికా శాస్త్రవేత్త ఈ దిశగా అనేక పరిశోధనలు చేయుచున్నారు.

అంతేకాక అగ్నిహోత్రానికి పది ని॥ ముందు పది ని॥ వెనుక "కెర్లియన్" ఫొటోగ్రాఫీననుసరించి సాధకుని ఫొటో తీసిన పిదప స్పష్టత పరచు శక్తి, ద్విగుణీకృత శక్తి అధికమైనదని గుర్తించినారు.

అందువలన ఎట్టి తరతమ భేదములే లేక విశ్వమానవాళి, ఈ అగ్నిహోత్ర ప్రక్రియ ద్వారా సత్ఫలితములను సాధించి రానున్న తరముల వారికి మార్గదర్శకులగు దురుగాక యని ఆశించుచున్నాను.

[ముఖ్యాంశము : ఈ "అగ్నిహోత్ర" ప్రక్రియను బహుళ ప్రచారముచేయుటలో "ఇనిస్టిట్యూట్ ఇన్ వేదిక్ సైన్సెస్ ", శివపురి, అకల్‌కోట్ - 413216 మహారాష్ట్ర వారు మరియు ఆంధ్రప్రదేశ్‌లో చేయుచున్న కృషి ప్రశంసనీయంగా నున్నది. ఇంకను కావలసిన వివరాలకు వారిని సంప్రదించ ప్రార్థన. వారు ప్రచురించిన అగ్నిహోత్ర పుస్తకం చదివిన తరువాత వారి అనుమతితో ఈ విషయము వ్రాయడం జరిగింది. వారికి కృతజ్ఞతలు].



# అక్షతలతో పూజ : ఒక పరిశీలన

ఈ సృష్టికంతకు ప్రభువైనవాడు ఈశ్వరు డొక్కడే. ఆయన అంతటాఉన్నాడు. అందరి మానవుల హృదయములలో కూడ ఉన్నాడు. ఆయనే సత్యము, ఆయనే ధర్మము. ధర్మము కన్న గొప్పదైనదేదీలేదు. ధర్మపక్షమునవలంభించిన వాడెట్టి బలహీనుడైనను అధర్మ ప్రవర్తనగల గొప్పబలవంతుని ఓడించగలడు. బృహదారణ్యక ఉపనిషత్తులో ఈ విశిష్టమైన ప్రకటన ఈశ్వర శాసనముగ చేయబడినది.

పరబ్రహ్మ-పరమేశ్వరుడు దేశకాలాతీతుడు. అయినప్పటికి అతనిని నిరంతరము భజన, ధ్యానము మరియు స్మరణ చేయవలెనని ఆయన భక్తులు ఆయనను ఏయే రూపములతో చింతన చేయుదురో వారిపై కృపాదరణలతో అనుగ్రహించుటకు ఆయా రూపములతో వారికి లభ్యమగుచున్నాడని బ్రహ్మ సూత్రములలో చెప్పబడినది. (1-2-30 అను స్మృతే ర్చారదిః) శ్రీమద్భాగవతములో ఈ విషయము చెప్ప బడినది. ఆర్య జైమిని మతానుసారము కూడా ఈ విషయము స్పష్టము చేయబడినది.

పరమాత్మ సృష్టి, స్థితి, లయ కారకుడు. సర్వ వ్యాపకుడు. మన సనాతన ధర్మ సూత్రాలననుసరించి ఇట్టి పరమాత్మను రెండు రూపాలలో ఆరాధించ వచ్చు నని అవి ఏవన నిర్గుణారాధన, సగుణారాధనలని వేద విదులు చెప్పియున్నారు. మన మతంలోని విశిష్ట లక్షణము సగుణారాధన అయి ఉన్నది.

నిర్గుణారాధనలో అర్చన, అభిషేకం, పూజ, కీర్తనలవంటి సేవలకు అవకాశం లేదు. కాని సగుణా రాధనలో అభిషేకం, అర్చన, పూజ, కీర్తనల వంటి ఉపచారాలకు భగవదవతార లీలావైభవాలను గానం చేయడానికి ఎంతో అవకాశం ఉన్నది. మన మతంలో విగ్రహారాధన ఈ కారణాల వలన అనాదిగా వస్తున్నది.

ప్రతిగృహస్థుని ఇంటిలోను, దేవాలయాల లోను, ఏదో భగవత్ రూపాన్ని రచించి, చేయించి పూజాపునస్కారములను, జరపడం మన పురాతన సంప్రదాయంగా వస్తున్నది. పూజలు జరుపుటకు మనం అనేకరకాల పువ్వులను, బియ్యానికి (కొంత మంది తెల్లజొన్నలను కూడా వాడుచున్నారు) పసుపు, కుంకుమ పూసి (అక్షింతలు) అక్షతలు చేసి వాటితో భగవంతుని పూజిస్తున్నాం. అయితే అట్టి అక్షింతలకు బియ్యాన్నే ఎందుకు ఉపయోగించాలి? అనే విషయ పరిశీలనే ఈ వ్యాసముఖ్యోద్దేశం.

తెలుపురంగు సాత్త్విక లక్షణంగా చెప్పబడినది. తెల్లని బియ్యాన్ని పసుపు (కుంకుమ) పూసి అక్షతలుగా చేసి మనంపూజకు ఉపయోగిస్తున్నాం. అక్షింతలు అనగా క్షతం కానివి. అనగా విరవబడనివి లేక ముక్కలు కాకుండా పూర్తి గింజలుగా నున్నవి అని అర్థము. నూకలుగానున్న బియ్యపు గింజలను ఉపయోగించ రాదు. బియ్యపుగింజ మొత్తాన్ని ఉపయోగించాలి. విరవ బడిన లేక ముక్కలైన బియ్యపుగింజలను వేరుచేయాలి.

నవధాన్యాలలో, బియ్యంగా వచ్చే ధాన్యానికి ఎక్కువ ప్రాముఖ్యత వున్నది. ఇది ఆహారంగా అనగా అన్నంగా ఉపయోగపడుచున్నది. ఇందు సాత్త్విక లక్షణాల్నియ్యగల ధాతుసమూహములధికంగా ఉన్నవి. చాందగ్యోపనిషత్తు నందలి పంచాగ్నియను విద్య ప్రసిద్ధమై యున్నవి.

తన వద్ద కుటుంబభారము వహింపగలుగు సంతతి సంపద లేనందున గౌతమ మహర్షి తన కుమారు డైన శ్వేతకేతువును గృహస్థాశ్రమమున ప్రవేశించుటకు వలయు ధనార్జనచేసి యోగ్యపత్నిని పరిగ్రహించుట, శాస్త్రోదేశముగ జెప్పి, ఎక్కడను గర్వపడక, ధైర్య సాహసములతో బయలు వెడలి రమ్మని పంపెను.

తండ్రి ఉపదేశామృతమును గ్రోలిన శ్వేత కేతువు అనేకగ్రామములు తిరుగుతూ పాంచాలదేశ మార్గముపై పోవుచు ప్రవహణ జైబలి నగరమువైపు బయలు దేరెను. పాంచాల దేశాధ్యక్షుడగు ప్రవహణ జైబలి రాజభవనమున కేగి ద్వారపాలకునితో తన పేరు చెప్పి "విద్వద్పరిషత్తు సభా కార్యక్రమములనారంభింపగనే తనకు కూడ ఆహ్వానము వచ్చునట్లు చేయుమని చెప్పెను.

ప్రవహణ జైబలి ఆస్థానములో పండిత సమూహము విశేషముగా ఉండెడిది. సమస్త శాస్త్ర పారంగతులైన గొప్ప గొప్ప విద్వాంసులు అతని సభకు ప్రతిదినము వచ్చెడివారు. జైబలి కూడా నిత్యము నాలుగు గంటల కాలము విద్వత్పరిషత్ సభాధ్యక్షుడుగా ఉండెడివాడు. సభలో పాల్గొన వలెనని ఎవరైన నూతన విద్వాంసుడు వచ్చిన ఎడల ద్వారపాలకుడు మహారాజుతో అతని ఆగమన సమాచారము చెప్పుట పరిపాటిగ నున్నది. రాజసేవకులు శ్వేతకేతువును అతిథి మందిరమునకు తీసుకువెళ్ళి స్వాగత సత్కారములు చేసిరి.

విద్వత్ పరిషత్ కార్యము లారంభమగుటతో ద్వారపాలకుడు శ్వేతకేతువు వృత్తాంతము చెప్పి "శ్వేత కేతువులవారు పదునైదు రోజులు పాదయాత్ర చేసి తమ యాస్థాన పండితులతో శాస్త్రార్థముచేయగోరి వచ్చినారు" అని చెప్పెను. శ్వేతకేతువు అరుణి నామమున ప్రసిద్ధుడైన గౌతముడు తన తండ్రి యనియు, పూజ్య భరద్వాజుడు తన గురుదేవునిగా చెప్పి, తాను సమస్త శాస్త్రములు అధ్యయనం చేసి, తన పాండిత్యము పరి చయముచేసికొని, గృహస్థాశ్రమ ప్రవేశమునకు ధనమవసరమై యున్నదని ఎవరిని యాచించక తన పాండిత్య ప్రతిభతో ధనార్జన చేయ దలచినానని చెప్పెను. శ్వేత కేతువు మాటలను విని తనకు కావలసిన ధనమెంతయో చెప్పిన అర్పించెదనని రాజు తెలియజేసిన పిదప స్వాభిమానధనుడైన శ్వేత కేతువు అందులకంగీకరించక విద్వత్ పరిషత్లో పండితమండలి విజ్ఞానము పరీక్షింప దలచితినని చెప్పెను.

మహారాజామాటలు విని "ఋషి కుమారా! నేను మిమ్ము కొన్ని ప్రశ్నలడిగెదను. వాటికి మీరు సక్రమమైన సమాధానము లీయగలిగితిరేని పండిత పరిషత్తులో శాస్త్రార్థము చేయ మీరు సమర్థులని తలచెద"నని చెప్పి మరునాడు ఋషికుమారుని వద్దకు మహారాజు వచ్చి సువర్ణముద్రలను, గోవులను సమర్పించెను. తదుపరి ఐదు ప్రశ్నలడిగెను. అందుముఖ్యమైనవి యివి. "మరణానంతరము మానవులెక్కడకు పోయెదరు?"

"ఈ లోకమునకు మానవుడెట్లు తిరిగి రాగలడు?"

[మిగతా ప్రశ్నలు :

"దేవయాన పితృయానములు ఎక్కడ, ఎట్లున్నవి?"

"అనాదికాలమునుండి అసంఖ్యాకములుగ ప్రాణులు అనుదినము మరణించి మృత్యులోకము చేరుచున్నను అది ఏలనిండుటలేదు?"

"యాగములో పంచమాహుతియందు విడువ బడిన తరళద్రవ్యములను పురుషుడని ఎందుల కందురు?"]

ఈ ప్రశ్నలకు శ్వేతకేతువు లజ్జాతిశయమున, వినయ స్వరమున "మహారాజా! మీ ప్రశ్నలకు సమాధానమీయగల యోగ్యత, నాలో లేదు దయచేసి ఇక ఏమీ అడుగవద్దు" నెను.

ఈ ప్రశ్నలకు సమాధానమీయలేనందున శ్వేత కేతువు. తన ఆస్థాన విద్వాంసులతో శాస్త్రార్థము చేయ లేరని చెప్పి వలసిన ధనము ఇచ్చిపంపెను.

శ్వేతకేతువు, తన పిత్రాశ్రమమువైపు తిరిగి వచ్చు వివాహము చేసికొని వచ్చినపుడు మనోవ్యధతో నున్న కుమారుని గాంచి, కారణమడిగిన పిదప శ్వేత కేతుడు మహారాజడిగిన ప్రశ్నల విషయ మెరిగించి తాను

సమాధానము చెప్పలేనందుకు విచారించుచున్నానని ఆ ప్రశ్న పంచకమును తండ్రికి వినిపించెను.

తానుకూడా సమాధానమీయలేనని గౌతముడు, పాంచాల దేశ విద్వద్పరిషత్ప్రధాన ద్వారము వద్దకు వచ్చి తనరాక మహారాజు నకెరింగించెను. మహారాజా ప్రశ్నపంచకమునకు తగు సమాధానములిచ్చి విస్మయ చకితుని గావించెను.

మహారాజు చెప్పిన సమాధానములతో పురుషోత్పత్తికి సంబంధించి క్రమమును తెలియజేసి అట్టి క్రమము గ్రహించిన విద్వాంసుడు, బ్రహ్మోపాసన యందు సంలఘ్నుడయినవాడు. మరణానంతరము జ్యోతిర్మయ లోకమును పొందును. అక్కడ నుండి బ్రహ్మలోకమును పొందును. దేవయాన నామక పదమునకు ఇదియే పరిచయము దేవలోకముచేరు మార్గమిదియే.

ఈ మార్గముపై జ్ఞాన చింతనయందు దత్తచిత్తులగువారు పురోగమించి దేవలోకమునకుపోవుదురు. కాని అజ్ఞులయినవారు యజ్ఞములను ఆచరించి వాపీ, కూప, తటాకాదులు నిర్మింపజేసి ధర్మశాలాదులు నిర్మించి లేదా దాన, ధర్మాది, పుణ్యకార్యములొనర్చుట యందు దత్తచిత్తులైనవారు మరణానంతరము, పొగతో నిండిన చీకటిమార్గమయిన లోకమునకు చేరెదరు. అక్కడినుండి కృష్ణపక్షలోకము, దక్షిణయాన లోకము చేరెదరు. మధ్యలోని పితృలోకము చేరి అక్కడినుండి ఆకాశము, చంద్రలోకముచేరి దేవతలకు ఆహారమయ్యెదరు. అనగా దేవగణము వారిని భక్షించును. ఈ రీతిగ దేవతల ఉదరములయందుండి అన్నమువలె జీర్ణమగుచు తమ తమ కర్మల ననుసరించి నిర్ణీత కాలము వరకు అచ్చటనే యుండిపిదప ఆకాశము చేరెదరు. అనగా అకాశముతో కలిసిపోయి రూపరహితులై ఆపై వాయువుతో కలిసెదరు, ధూమములో కలిసెదరు. అచ్చటి నుండి మేఘ రూపముదాల్చి పిదప వర్ష రూపమున భూమిపై పడెదరు. తద్వారా అనేక ఆహారధాన్యములు, ఓషదులు, వనస్పతులు ఏర్పాటగుట వలన అందుండి వాటిని భుజించిన వారు పరిపుష్టులయి, సంతానోత్పాదన చేయుదురు ఒక్కరైనను అనేకులను పుట్టించుచుందురు.

అనగా ప్రతిజీవి (మానవుడు) వారి వారి కర్మలననుసరించి పుట్టుచూ, చచ్చునట్టి యోనులయందు పడిపోయెదరు. మరణానంతరం జీవుడు ఏదోఒక స్థానమునకు పోవునే కాని మరణింపడనుటకు కారణ మిదియే ఆ ప్రాణి తన శుభాశుభకర్మ ఫలములననుభవించుచునే యుండును. కనుక బుద్ధిమంతుడు సర్వదా హీన, అశుభాచరణములను అసహ్యించుకొనుచుండవలెను.

అందువలన ప్రాణి, ఆహారధాన్యమునందుండి మానవుని ఆహారము ద్వారా, లోన ప్రవేశించునని తెలియుచున్నది. బియ్యమును, అందుండగల ప్రాణితో భగవదర్పితము చేసినచో అందున్న ప్రాణి భగవద్భక్తుడై శుభకర్మల యందిచ్చకలవాడగునని మన పెద్దలు నమ్మి పూజ చేయుటకు సాత్వికాహారమైన బియ్యమును ఎంచుకొనినారని చెప్పుటకు అవకాశం ఎంతేని కలదనుటకు వీలుకలుగు చున్నది. అందువలన పూజకు పువ్వులకు బదులుగా అక్షింతలుపయోగించుచున్నారని తలంపు కలుగుచున్నది.

[విజ్ఞులు నాయీ వివరణ అంగీకరింపక ఇంకను ఏదైన కారణమును సవివరముగ తెలియపరచిన ఎడల కృతజ్ఞతతో ద్వితీయ ముద్రణ యందు వారిపేరును చేర్చి ఆలాగున తెలియజేసినవారిని తగు బహుమతితో సత్కరించెదము].

# భక్తలోకంలో శ్రీ ఆంజనేయస్వామి




పరమ భక్తాగ్రేసరుడు ఆంజనేయస్వామి. ఈ భక్తాగ్రేసరునికి, భక్తులమై పూజించడం భారతీయులమైన మన అందరము గొప్ప అదృష్టవంతులము. శ్రేయోదాయకమైన ఆంజనేయ ఉపాసన భక్త లోకంలో ప్రసిద్ధమైనది.

ఏ ఊరికి వెళ్ళినా, ఏదారిలో చూచినా హనుమంతుని విగ్రహం దర్శనమిస్తూనే ఉన్నది. మన దేశంలో రామాలయాల కంటే ఆంజనేయ నిలయాలే ఎక్కువగా కనిపిస్తున్నవని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

ఈ స్వామి, ఎక్కడెక్కడ శ్రీరామకీర్తనం జరుగుతుంటుందో అక్కడక్కడల్లా అంజలి ఘటించి, ఆనందభాష్పాలతో ఉంటాడని విశ్వసించి, స్వామికి నమస్కరించమని పెద్దలు చెపుతారు. అదృష్టవంతులకు ఆంజనేయస్వామి ప్రత్యక్షమవడం భక్తజన లోకంలో ప్రసిద్ధి.

శ్రీరామ పరివారంలో హనుమంతుడు ప్రథమ గణ్యుడు. ఈతని మహిమ అనన్య సామాన్యమైనది. హనుమంతుడు రామభక్తులకందరకూ వందనీయుడు, స్తవనీయుడు. సీతమ్మ శోకం పోగొట్టి లక్ష్మణుని ప్రాణం నిలిపి, శ్రీరాముని మహావిపత్తు నుండి తప్పించి లోకానికి శ్రీరామ రాజ్య సౌభాగ్యాన్ని అందించిన మహాధీశాలి హనుమంతుడు. శ్రీరామునిసేవ నిస్వార్థంగా చేసిన ఏకైక భక్తశేఖరునిగా ప్రసిద్ధిచెందిన వాడు హనుమంతుడు. ఈయన వాయునందనుడు. వాయువంతటి శక్తి సంపన్నుడు. గంధర్వ విద్యా తత్త్వజ్ఞుడు నవ వ్యాకరణవేత్త. పుట్టిన వెంటనే సూర్యబింబాన్ని పండనుకొని అందుకోవడానికి ఎగరటం నుంచి, అనేక మహాబల పరాక్రమాలను ప్రదర్శించి లోకోత్తరుడైన శ్రీరాముని పాదసేవాదురంధరుని చరిత్ర కడు పావనము. నిత్య పారాయణార్హము.

వాయుదేవుని అనుగ్రహమున శాపముచే అంజన అను వానరస్త్రీ అయి ఉండిన "పుంజిక స్థల" అను అప్సర స్త్రీకి జన్మించినవాడు పుట్టినతోడనే ఉదయించుచున్న సూర్య భగవానునిచూచి, పండు అని తలచి, భక్షించబోగా దేవేంద్రుడు తన వజ్రాయుధంతో ఇతని వామహనువునగొట్టెను. అట్లు కొట్టబడిన హనువు కలవాడగుటచే ఇతనికి హనుమంతుడని పేరు కలిగెను. అలాగున ఇంద్రునిచే దెబ్బతిని మూర్ఛితుడు కాగా వాయువు చూచి కోపించి తన వ్యాప్తిని ఉపసంహరించెను. అది తెలిసికొన్న దేవతలు వాయుపుత్రుని మూర్ఛనుండి తేర్చి బ్రహ్మాస్త్రముచే చావులేకుండను, స్వచ్ఛంద మరణము కలుగునట్లును, వరములు ఇచ్చి, వాయుబంధకమువలన బాధపడుచున్న లోకములను కాపాడిరి.

తరువాత సూర్యుని వద్దకు పోయి సకల శాస్త్రములు బోధింపుమని ప్రార్థింప, సూర్య భగవానుడు, 'నేనెప్పుడును తిరుగుచుందును కదా! నాతో ఎట్లు తిరిగెదవు' అని అడుగగా సూర్యుని రథముతో పాటు పరుగిడక తన దేహమును పెంచి ఉదయాస్తమయ పర్వతములమీద కాళ్ళుంచి, సూర్యుని వేడిమికి ఓర్చుకొని విద్య నభ్యసించిన ధీశాలి హనుమంతుడు.

శ్రీ రామలక్ష్మణులు సుగ్రీవుణ్ణి వెదుక్కుంటూ వస్తున్నపుడు దూరాన ఉన్నవారిని చూచిన సుగ్రీవుడు, వాలి పంపున తనమీదికి యుద్ధానికి వస్తున్నారేమో అని భయపడి వారెవరో చూచి తెలిసికొని రమ్మని హనుమంతుణ్ణి పంపుతాడు. ఆయన రామలక్ష్మణులను చూచి దగ్గరకు వచ్చి వారిని 'మీరెవరు?' అని ప్రశ్నిస్తాడు. శ్రీరామలక్ష్మణులను చూచిన ప్రథమ వీక్షణంలోనే (చూచి చూడగానే) వారి విశిష్టత గ్రహించిన మహా ధీశాలి, కుశాగ్రబుద్ధి హనుమంతుడు. శ్రీరాముడు హనుమంతుని గొప్పతనము గ్రహించాడు.

హనుమంతుడు వారిద్దరిని సుగ్రీవుని దగ్గరకు తీసుకువచ్చి శ్రీరామ సుగ్రీవసఖ్యం అగ్ని సాక్షిగా జరిపించాడు.

సీతమ్మను వెదకడానికి వానరులను పంపేప్పుడు కార్యసాధన విషయంలో హనుమంతుని మీదే ఆశపెట్టుకున్న సుగ్రీవుడు హనుమంతునితో చెప్పిన మాటలవలన సుగ్రీవునకు హనుమంతునిపై గల నమ్మకం గమనించదగ్గది.

సీత కనిపిస్తుందనే నమ్మకంతో గుర్తుగా శ్రీరాముడు ఉంగరం ఇస్తూ "ఈ ఉంగరం గుర్తుగా ఇవ్వటం వలన నీవు నా దగ్గరనుంచే వచ్చినట్లు సీత నిన్ను గమనిస్తుంది. నీ ప్రయత్నము, బలపరాక్రమాలు, సుగ్రీవ సందేశమునాకు కార్యసిద్ధిని చెపుతున్నాయి" అన్నాడు.

యుద్ధంలో వానరసర్వసేనా మూర్ఛ, రామలక్ష్మణుల మూర్ఛ సందర్భాలలో సంజీవిని తేవడానికి వెళ్ళిన సందర్భంలో హనుమదాకాశగమనం ఎంత గొప్పదో మనం గమనించగలం. ఓషధి లభించక, అదేదో నిర్ణయించలేక ఆ చెప్పినాయనే చూసుకుంటాడని పర్వాతాన్నే ఎత్తి చేత్తోపట్టుకు వచ్చిన దారినే యావత్భారతదేశం దాటి లంకలోకి ప్రవేశించడం పనయిపోయాక ఆ పర్వతాన్ని మళ్ళీ తీసుకొనిపోయి దాని చోటున పెట్టడం. ఇలా రెండుసార్లు చేయడం, ఆంజనేయస్వామి యొక్క మహాసాహస, సామర్థ్య మహామాన్విత తత్వానికి మనం ఆయనకు భక్తులుగా చేస్తున్నవి. ఈస్వామి పరాక్రమం లోకోత్తరంగా, సాటిలేనిదిగా ఉన్నదికదా!

సీతమ్మ రావణడెత్తుకుపోతుండగా తన నగలు క్రింద పడవేసినప్పుడైనా తాను చూడలేదు. నగలు వంటిమీద లేకుండా ఉండటాన్నిబట్టి ఆమెను గుర్తించాలి. జీవుడు పరమాత్మ దర్శనానికిపడే యాతన ఇలాగే ఉండాలి. సీతమ్మ కనిపించకపోయేసరికి ఎంతో దుఃఖి స్తాడు తిరిగివెళ్ళి సీత కనిపించలేదని చెబితే కలిగే అనర్థాలనెన్నిటినో ఊహించుకొంటాడు. ఇక్కడే చనిపోవడం మేలనుకొంటాడు.

వెతకగా సీతమ్మ దర్శనం అశోకవనంలో జరిగింది. ఆ సీతమ్మ ఎలా ఉన్నదో ఆమె వంటిమీద ఏనగలున్నాయని రామచంద్రుడు చెప్పాడో వాటిని గమనించాడు. ఆమెను చూచిన తరువాత అను కొన్నాడు. రాముడెందుకు అంత దుఃఖిస్తున్నాడో అర్థం చేసుకున్నాడు అంజనేయుడు. సీతారాముల న్యోన్యం తగినవారనే సంగతి అప్పుడర్థమయి మనసులో ఆ పుణ్యదంపతుల నభినందించు కున్నాడు. రావణుడు వచ్చి ఆమెతో మాటలాడి ఆమెచే తిరస్కృతుడవటాన్ని చెట్టుమీద నుంచి చూచిన తరువాత సీతాదేవి సామర్థ్యం అవగత మయింది. మనుష్యవాక్కుతో అర్థమయేలా చెప్పక తప్పదనుకున్నడు. వెంటనే రామకథ, తన వృత్తాంతం చెప్పాడు నమ్మకం కలిగించాడు. ఉంగరం ఇచ్చిన తరువాత ఆ సీతమ్మ నమ్మింది. ఆమెనోదార్చాడు. బ్రతికివుంటే నూరేళ్ళకైనా నరునకానందం కలుగు తుంది అన్నది నిజమనుకున్నాడు. ఆమె దుఃఖం చూడలేక ఇప్పుడే రామునివద్దకు చేరుస్తానన్నాడు "నా భుజంమీద కూర్చో, అగ్నిహోత్రుడు హోమ ద్రవ్యాన్ని ఇంద్రునకు అందించి నట్లు నిన్ను రాముడి కండిస్తా" నన్నాడు.

సీతమ్మ సమ్మతించలేదు. రాముడు, రావణుని, సభాంధవంగా జయించి, తనని తీసుకొని వెళితే అది ఆయనకు తగినట్టుంటుందని చెప్పిన సీతమ్మ ధైర్యానికి ఆంజనేయుడు ఎంతో ఆనందించాడు.

"నీవెక్కడున్నది తెలియక ఆలస్యమైంది తల్లీ!" అంటూ ఇంక ఆలస్యం కాదన్నాడు. కాకాసురుని వృత్తాంతం చెప్పి సీతమ్మతో "ఈ క్షణమే నీ దుఃఖాల కంతం అనుకోవమ్మా. నీవు కనిపించినందుకు మహోత్సాహంతో ప్రభువు రాముడు, లక్ష్మణుడు ఈ లంకనుభస్మంచేసి రామచంద్రుడు నిన్ను అయోధ్యకు తీసుకువెళతాడమ్మా!" అన్నాడు.

తరువాత రావణాసురుడితో మాట్లాడదామని అనుకుని అశోకవనం నాశనం చేసాడు. ఎందరో రాక్షస వీరులను చంపి, రావణ సన్నిధికేగి, అద్భుతంగా, నిర్భయంగా రాజనీతితో, దూతకృత్యం నెరవేర్చి కృత కృత్యుడయ్యాడు కపివీరుడు. పిదప లంకను భస్మం చేసాడు.

ఆ తరువాత తగులబడిపోయినవాటితోపాటు సీతమ్మకూడా భస్మం అయిపోతుందేమోయని ఎంతో దిగులుపడ్డాడు. ఆంజనేయుని తోకకి నిప్పంటించారని తెలిసికొని సీతమ్మ అగ్నిదేవుని ప్రార్థించి అతని ఎడ చల్లగా ఉండమని కోరింది. కోపం ఎన్నో అనర్థాలు తెస్తుందని మనమిక్కడ తెలిసికోవాలి. తరువాత సీతమ్మకేమీ బాధ కలుగలేదని తెలిసికొని ఆమె దయ వల్లనే తన తోకకూడా కాలలేదని గ్రహించి, ఎంతో ఆనందించాడు. ఆంజనేయుడు. సీతమ్మ దగ్గర సెలవు తీసుకొని సముద్రందాటి తిరిగి వస్తూ గర్జించాడు. జాంబవంతుడు విని హనుమంతుడు అన్ని విధాల కృతకృత్యుడయ్యాడని తలచాడు.

"సీతా దృష్టేతి విక్రాంత సంక్షేపేణ్యన్య వేదయత్" "కనిపించింది సీత" అని ఒక్కమాటలో చెప్పాడు. సీత ఉన్నవైపు తిరిగి శిరస్సు వంచి నమస్క రించి తాను చూచివచ్చింది, చేసివచ్చింది చెప్పాడు.

తరువాత వానరులు మధువనం ధ్వంసంచేసిన వార్త విని సుగ్రీవుడు అనుకున్నాడు సీతాదేవి కనిపిం చింది. సందేహంలేదు. హనుమంతుడే చూచాడు. ఈ పని హనుమంతుని వల్లే అయింది. అనుకున్నాడు.

రామరావణ యుద్ధంలో హనుమంతుడు చూపిన పరాక్రమం ఎంతో అద్భుతమైనది. ఆసక్తికర మైనది.

రావణుడు హనుమంతుని మొదట చూచి నప్పుడు ఈయన సాక్షాత్తు భగవానుడైన నందీ శ్వరుడేనని అనుకున్నాడు. మునుపు తాను కైలాసాన్ని కదిలించినపుడు తనను శపించినాడు. అలాగే హను మంతుడు కూడా రావణుని చూచినప్పుడు రాక్ష సేశ్వరుని ప్రభావం చూచి ఆశ్చర్యపడ్డాడు.

మనిషిని చూడగానే ఆ వ్యక్తి, వ్యక్తిత్వం గుర్తించే మహాశక్తిమంతుడు హనుమ. ఆ సంగతి రాముడు

మొదటిసారిగా హనుమంతుని చూడగా గుర్తించాడు. విభీషణ శరణాగతి సమయంలో విభీషణుని తమలో చేర్చుకోవాలా వద్దా యనే చర్చలో హనుమంతుని అభిప్రాయం అడిగాడు రామచంద్రుడు ఇక్కడ హనుమంతుని పరేంగిత జ్ఞానము రాజనీతి వైదుష్యము వెల్లడయాయి. శరణాగతుడైన విభీషణుని రక్షించవలసి నదిగా రామునికి తగిన విధంగా తన అభిప్రాయం వివరించాడు.

అలాగే రావణ వధానంతరం పుష్పక విమానం లో వస్తూ భరతుని మనోగతం తెలిసికొమ్మని ముందుగా శ్రీరామచంద్రుడు హనుమంతుని భరతుని దగ్గరకు పంపాడు. పధ్నాలుగు సంవత్సరాలు రాజ్య మేలిన భరతునిలో ఏదైనా మార్పు వచ్చిందేమో తెలుసుకురమ్మని. హనుమంతుని బుద్ధి బలం శ్రీరాముడు గుర్తించినందుకు నిదర్శనంగా వున్నదీ సంఘటన.

హనుమంతునికి శాపవశాత్తు కలిగిన నష్టం ఏమిటంటే తన శక్తి తనకు ఇతరులు గుర్తుచేస్తేకాని తెలియక పోవడం అయితే అన్ని విషయాలు అలామరచిపోతాడని మతిమరపు ఉన్నవాడని చెప్పడం సమంజసం కాదు. ఆయన అవసరం కాని విషయాలు పట్టించుకోక పోవటం, లేదా జ్ఞాపకముంచుకోక పోవటం లేదా జ్ఞాపకమున్నా సమయాన్ననుసరించి వాటిని కాలమే పరిష్కరిస్తుందని తలచి అవసరమైనంత వరకే పట్టించుకోవటం. ఆయన స్వభావంగా మనం గుర్తించాలి. సంజీవి కోసము పర్వతము మీదికి వెళ్ళిన తరువాత ఓషదులు గురించి తాను విన్న విషయాలు గుర్తుకురాక ఆపర్వతాన్నే ఆయన తేవడం వలన ఆయన ఎంత శక్తిమంతుడో, ధీమంతుడో, తెలిసింది.

అనుకూల, ప్రతికూల విషయాలు సునిశిత బుద్ధి చాతుర్యంతో హనుమంతుడు పరిష్క రించిన విధానం, మనకు ఆలోచనాశక్తిని ఉత్తమ పరిష్కార మార్గాన్ని సాధించే బుద్ధికుశలతను అందిస్తుందన డంలో అతిశయోక్తి లేదు. యుద్ధ సమయంలో జాంబవంతుడు మూర్ఛిల్లి, స్మృతి తప్పి పడిపోయి విభీషణాదులువెళ్ళి పలకరించినపుడు "హనుమంతుడు క్షేమంగా ఉన్నాడా?" అని అడిగి తెలుసుకున్నాడు. ఎందుకంటే ఆయన క్షేమంగా ఉంటే అందరూ జీవించగలరని చెప్పడం వలన హనుమంతుడు మహా శక్తి సంపన్నుడని వెల్లడయింది.

శ్రీరామ తత్త్వాన్ని, ఔన్నత్యాన్ని చూడగానే గ్రహించి, తన జీవితాన్ని ఆయనకు అంకితం చేసి, కైంకర్యం చేసి, హనుమంతుడు చరితార్థుడయాడు. "ఈ భూమిమీద రామకథ ఉన్నంతకాలం నా శరీరంలో ప్రాణాలు ఉంటాయి. నా పరమ స్నేహం నీయందు నిత్యంఉండుగాక! నా భక్తి, నా ఆలోచన వేరొక చోటికి పోకుండుగాక!" అని శ్రీరాముణ్ణి హనుమ కోరాడు.

ఆంజనేయుని భక్తి, శక్తి యుక్తులు ఒకదాని కొకటి పోటీపడునట్లు ఒకదానిని మించి ఒకటి యున్నట్లు తెలియుచున్నది. అతని మూర్తి, కీర్తి, నేర్పు, ఓర్పు దేవముఖ్యునిగా చేసినవి. ఇతని సన్నిధి కోసం మానవులే కాక సిద్ధులు, సాధ్యులు, యక్షులు, కిన్నెరులు, కింపురుషులు మున్నగువారు తీవ్రముగా భక్తిభావముతో ప్రయత్నిస్తున్నారు.

సాకినీ, ఢాకినీ, యక్షిణీ, కామినీ, మోహినీ, భూత ప్రేత, భేతాళ, కూష్మాండ మున్నగు పిశా చములు, దెయ్యములు ఆయనను తలంచుకొనగానే పటాపంచలయి పారిపోవునని భక్తుల నమ్మకము. తక్షకుడు, అనంతుడు, కర్కోటకాది నాగుల విషము ఆంజనేయుపాసకులనేమీ చేయలేదని, ఆయన భజన వలన విముక్తులయ్యేదరని, యంత్ర, తంత్రముల వలన హానిచెందరని భక్తుల ప్రగాఢ నమ్మకమై యున్నది.

అందువలన రామభక్తాగ్రేసరుడైన హనుమం తుని ఉపాసన ఎంతో శ్రేయస్కరమైనదని భక్తజనుల నమ్మిక. అంతేకాదు పరమ భక్తునకు అసాధ్యమేదీ లేదనుటకు చక్కని ఉదాహరణ హనుమంతుని దివ్య చరిత్ర.

# శ్రీ కన్యకాపరమేశ్వరి

శ్రీ కుసుమశ్రేష్ఠి, కుసుమాంబ అను పుణ్యవైశ్య దంపతుల పుత్రిక కన్యకాంబ. ఈమె మొదటి పేరు వాసవాంబ. ఈమె తండ్రి పుత్రకామేష్ఠి యాగము చేయుటచే వారికీమెయు, విరూపాక్షుడను పుత్రుడును కలిగిరి.

విష్ణువర్ధనుడను మహారాజు కుసుమశ్రేష్ఠి నివాస స్థానమైన పెనుగొండ గ్రామ సమీపమునకు వచ్చెను. పురమునగల వైశ్య ప్రముఖులెదురుగ బోయి ఆ మహారాజును తమ నగరమునకు తీసికొనిపోయి ఉచితమైన అతిథి మర్యాదలతో సత్కరించిరి. ఆ మహారాజు వారి సపర్యలకు మిక్కిలి సంతసించి వారిలో ప్రతి యొక్కరికి స్వయముగ తాంబూలములతో సత్కరించదలచెను. ముందుగ తాంబూలము కుసుమాంబ తీసికొనెను. పిమ్మట వాసవాంబ తాంబూలమునకై గొని వచ్చిరి. ఆమె అద్భుత సౌందర్యమునుగాంచి ఆ మహారాజు మోహితుడై ఆమెను తనకిచ్చి వివాహము చేయుమని కోరెను. అట్లు చేయుటకు వైశ్య ప్రముఖులు అంగీకరించలేదు.

అంతట నారాజు కోపగించి వారిని పరాజితులను గావించి ఎట్టైనను వాసవాంబను చేపట్టెదనని శపధము చేసెను.

పూర్వాపరములు ఆలోచించిన పిదప వాసవాంబను ఆ రాజునకిచ్చి వివాహము చేయుటకు సమ్మతించి తన బంధువులు రాజాగ్రహమునకు గురికాకుండ జూచుటకై కుసుమశ్రేష్ఠి వివాహమునకు ముహూర్తము రెండు నెలల తరువాత నిశ్చయించెను. అప్పటికా మహారాజు సమ్మతించి తన పట్టణమునకు తిరిగిపోయెను.

తదుపరి వైశ్య ప్రముఖులందరు చర్చించి, విష్ణువర్ధనునకు వాసవాంబను ఎట్టి పరిస్థితులలోనైనను ఈయ రాదని నిశ్చయించి ఆ వర్తమానము మహారాజునకెరింగింప రాయబారులను పంపిరి.

మహారాజు వద్ద కూడ కొంత వాగ్వివాదము జరిగిన పిమ్మట, ఆ రాయబారులు వాసవాంబను ఆ మహారాజు కీయరాదను తమ దృఢ నిశ్చయమును తెలియజేసిరి. అంత నా మహారాజు వారిని బంధించి పెనుగొండపై దాడికి వెడలెను.

రాయబారులు విష్ణువర్ధుని సేవకుల నుండి ఎటులనో తప్పించుకొని పెనుగొండకు ముందుగా జేరుకొని, యీవిషయమై కుసుమ శ్రేష్ఠితో ఆలోచింప సాగిరి. కుసుమశ్రేష్ఠి కుమారుడైన విరూపాక్షుడు తన సోదరిని ఆ రాజునకిచ్చుట కంటె అగ్ని ప్రవేశము చేయుట ఉచితమని పలుకగా అచ్చట నున్నవారిలో కొందరు దానికి సమ్మతించిరి. మహారాజు పెనుగొండ చేరకముందే వాసవాంబను అగ్నిప్రవేశము చేయించుటకు నిశ్చయించిరి. ఇట్టి ఘోరనిర్ణయమునకు అందరును దుఃఖించసాగిరి.

అంతట వాసవాంబ తాను శాపవశమున నరజన్మమెత్తిన శచీదేవినని వారికి జెప్పెను. ఆ వృత్తాంతము విని నంతనే వారందరు ధైర్యముతో ఆమెతోపాటు అగ్నిప్రవేశముచేసి స్వర్గస్థులైరి. ఆ విధంగా అగ్నిప్రవేశము చేసినవారు నూటరెండు గోత్రములువారుగ ప్రసిద్ధులైరి.

ఇట్లా త్మార్పణముచేసి ఘోర నిరంకుశత్వమును అంతముచేసి ధర్మనిరతికి పూనుకొని, నిర్మల ధర్మస్వరూపిణి అయి అగ్నిగుండము నుండి పరంజ్యోతిగా కోటి సూర్యకాంతులతో శ్రీ వాసవీకన్యాకా పరమేశ్వరిగా ఉద్భవించిన ఈ మహాదేవి మనకెల్లరకు సదా పూజనీయురాలు. ఈమెకు ఎన్నో ఆలయము లున్నవి.

# సాలగ్రామ పూజ : ఒక పరిశీలన

దేవతార్చన విధానములలో సాలగ్రామార్చన అతి ప్రాచీనమైనది, పవిత్రమైనది.

వడిగాపారే పుణ్యనదుల తీరాన లభ్యమయ్యే సాలగ్రామాలు పవిత్రమైనవి. కొన్ని అండాకారముగాను, కొన్ని గుండ్రని ఆకారంతో (గోళీలవలె) యుండునవి. ఇవి చుట్టును అతి నునుపుదనము కలిగి మానవులచే చేయబడక, ప్రకృతిసిద్ధముగ అట్టి ఆకారములు పొందినరాళ్లు కొన్ని తెల్లనివి, కొన్ని నల్లనివిగా యుండును.

ప్రకృతి వైచిత్ర్యములవలనను, మరియే యితర కారణములవలననైనను కొన్ని పెద్దరాళ్లు, ప్రవాహ మార్గమునకు అవరోధముగా వచ్చుటవలన ప్రవాహములో వేగమువలన కొట్టుకొనివచ్చుచు, పగిలి చిన్న చిన్నరాళ్లై ప్రవాహ ఒరవడికి అటు నిటు ఒరిసికొని ఆ తాకిడికి నునుపుదనముపొంది అండాకృతి లేక గుండ్రని ఆకారములుపొంది, ప్రశాంతముగా పారు నదీ తీరమునకు కొట్టుకొనివచ్చిపడి లభ్యమగుట, వీటి సహజ లక్షణమయి ఉన్నది.

అనగా స్వతస్సిద్ధమైన, ప్రకృతి పరిణామ విశేషమువలన ఇట్టి అందమైన, పవిత్రమైన ఆకృతులు పొందిన రాళ్లను సాలగ్రామములందురు. ఇవి మన సంప్రదాయబద్ధముగ, పూజనీయములై యున్నవి. వీటి గమనము, పరిణామములను పరిశీలించినచో ఒక పరమ (జీవిత) సత్యము గోచరింపకమానదు.

జీవాత్మ, ఈ అనంత జగత్తునకు మూలాధారమైన బ్రహ్మపదార్థమునుండి కారణాంతరముచే విడివడి కాలమనే మహా ప్రవాహంలో కొట్టుకొనివచ్చుచు అనేక జన్మలెత్తుతూ, అనగా ప్రవాహ ఒరవడికి అటు నిటు కొట్టుకొనుచు, కొండొకచో చిక్కుపడి ఉంటూ మరల పారే నీటితో సాగుతూ, క్రమాకృతిలేక ముడిపదార్థమువలె నున్నరాయి, సాలగ్రామమువలె నునుపైనట్లు, అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే, జీవాత్మ నావరించియున్న వాసనలచే (నికృష్టాకృతులచే క్రమబద్ధత లేని రాయివలె) నిండియుండి, కాల ప్రవాహ ఒరవడికి, ఇట్టి వాసనలను పోగొట్టుకొని పరిశుద్ధమైన ఆకృతితో వెలుగుచు ప్రకాశవంతమగును.

సంకల్పక్షయము, వాసనాక్షయము అనగా అనేక జన్మలయందలి కోరికలు, అలవాట్లు, అభ్యాసములు సంస్కారములు ఒకదానితో ఒకటి చేరి బాగుగా దృఢపడి వాసనగాఏర్పడును. అట్టి వాసనలను త్యజించుట అనగా

దృఢ భావనయా వ్యక్త పూర్వాపర విచారణమ్
యదాదానం పదార్థస్య, వాసనా సాప్రకీర్తితా.
(శ్రీ వశిష్ఠగీత)

వాసనా వైవశ్యముచే మనుజుడు తన వాస్తవ స్వరూపమును బాగుగా త్యజించివైచి దోషయుక్తమగు దృష్టికలవాడై సమస్తమును భ్రాంతి సహితముగ గాంచు కామాది వాసనలనే త్రాళ్ళచే బంధింపబడి, నదీ తీరమందలి నాచు తీగలు మొదలయిన (చిన్న రాళ్లను ఇవి ఆపినట్లు) ఆశాపాశములందు తగుల్కొని యున్నవాడు. జన్మపరంపరలచే అభ్యాసము చేసి వాసనా రాహిత్యుడై, సాలగ్రామమువలె మహోన్నతుడు కావలెనని, విజ్ఞులు చెప్పుచున్నారు.

విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిదః
సంతక్త వాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదం
(శ్రీ వశిష్ఠగీత)

శాస్త్రములన్నీ బాగుగా విచారించిన పిదప మరియు చిరకాలము ఆత్మజ్ఞుల తోటి పరస్పర సంవాదముల ద్వారా ఆత్మతత్త్వమును దృఢపరచుకొనిన పిమ్మట గ్రహించినది ఏమన, ఎన్ని విచారించినను వాసనలను కోరికలను ఆశలను, సంపూర్ణముగ

త్యజించి, ఆత్మయందు మౌనముగా నుండుటకంటె ఉత్తమమైనపదవి ఇంకొకటిలేదు అని వశిష్ఠ మహర్షి నొక్కి వక్కాణించెను.

ఇట్టి అద్భుతమైన విజ్ఞాన విషయమును పరిశీలించిన మీదట క్రమాకృతి లేని రాయి. నది పుట్టిన ప్రదేశము నుంచి ఎన్నో అడ్డంకులు నధిగమించి, చిక్కులను విడతీసుకొని, ఆలాగు విడివడిన రాయి చుట్టును అనగా అన్నివైపుల నునుపుదేరి నిర్ణీత రూపమునకు వచ్చిన పిదప, ప్రశాంతముగ పారు మైదాన ప్రదేశమునకు వచ్చి యట స్థిరపడిగాని, ఒడ్డునకు కొట్టుకొని వచ్చిగాని లభ్యమయ్యే సాలగ్రామము వలె పవిత్రమై నది ఆత్మ. అట్టి సాలగ్రామములు, ఆత్మతత్త్వము దృఢముగ పొందిన అనగా కోరికలను ఆశలను వీడి, పవిత్రమైనట్టి ఆత్మస్వరూపునితో సమానమని పెద్దలు సూచించు చున్నారు. అట్టి ఆత్మ స్వరూపుడు పరమపూజనీయుడని సూచించునదే సాలగ్రామ పూజ.

ఈ కలియుగమున, తులసి దళములు, గంగా జలములు, మరియు సాలగ్రామములయందు దైవత్వ ముండునని వేదవిదులు వక్కాణించుచున్నారు.

సాలగ్రామములలో అనేక విధములైనవి కలవు. ఈ తరగతి వాటి చిహ్నములు, ఆకృతులను బట్టి నిర్ణయించెదరు. అవి యేవన, షడ్చక్రసీతారామం, సంతాన గోపాలం, లక్ష్మీ నరశింహం, హయగ్రీవము, శ్రీధరమూర్తి, మత్స్యమూర్తి వాసుదేవమూర్తి, మరియు బ్రహ్మ మొదలయినవి.

ఈ సాలగ్రామ పూజానుష్ఠానముల వలన, అన్న వస్త్రములకు లోటు లేకుండుట, సద్బుద్ధి కలిగిన సంతానప్రాప్తి, శత్రుదోష నివారణ, విద్యా విజ్ఞాన సమృద్ధి, ఐశ్వర్యము, ఆరోగ్యము, వంశాభివృద్ధి మరియు మోక్షకారకములని పెద్దల అనుభవములోని విషయములయి వున్నవి.

ఈనాటికి అనేక వైష్ణవ దేవాలయములలో నియమిత పద్ధతులలో సాలగ్రామ పూజలు జరుపు చుండుట ముదావహము.

దేవస్థానాధికారులు ఈ విషయమునందు శ్రద్ధ వహించి తగు ప్రచారమొనరించి భక్తులు సాలగ్రామ పూజలు జరిపించుకొనుటకు ఇతోధికమైన అవకాశములు కల్పించెదరుగాక.

మనకు ఇట్టి మహోత్కృష్ట జ్ఞానోపదేశము సంపూర్ణముగ బోధపడుటకు, దూరదృష్టితో మన ఋషులు ఏర్పాటుచేసిన ఒకానొక పూజావిధాన మీ సాలగ్రామపూజ.





# శబరిమల

# శ్రీ అయ్యప్పస్వామి

శ్రీ అయ్యప్పస్వామి పూజాపద్ధతి ప్రత్యేక ప్రతిపత్తి కలిగిన వైష్ణవ శైవమత అద్భుత సమ్మేళనము. హరిహరుల కుమారునిగా శ్రీ అయ్యప్పస్వామి వైష్ణవ శైవ భక్తులకాశ్రయ మిచ్చుదేవరయని వారి నమ్మకము చూరగొన్న పరమ పవిత్రమూర్తి.

అతిలోక సౌందర్యవాహిని, మోహిని రూప శ్రీహరి పరమశివుల కలయికతో శ్రీ అయ్యప్పస్వామి జననము సర్వలోకపూజ్యమైనది. పవిత్ర పంపా నదీ తీరాన బాలునిగానున్న శ్రీ అయ్యప్పను అనపత్యుడైన పాతాళరాజు చూచి ఇంటికి తెచ్చుకొని పెంచుకొనెను. అమూల్యమణి కంఠాభరణముగాగల ఈ బాలుడు మణి కంఠనామముతో ప్రసిద్ధుడాయెను.

కాలక్రమమున, రాణి ప్రసవించి కుమారుని గనెను. ఇద్దరు దినదిన ప్రవర్ధమానముగ పెరుగు చుండిరి. తదుపరి కొంతకాలమునకు ఈ ఇద్దరిలో రాజ్యాధికారమునకు వారసుని ఎంపికలో సందిగ్ధము సంభవించెను. రాణి తన కుమారునికే రాజ్యమప్పగించి ఉత్తరాధికారిని జేయ సంకల్పించెను. తన దుష్ట మంత్రాంగముతో మణికంఠుని అనేక కష్టముల పాల్జేసెను. రోగగ్రస్తురాలివలె నటించుచు, ఔషధముగా మణికంఠుని, పులిపాలు తెమ్మని కోరెను.

దేవతల యభీష్టము మేరకు సంకట కారకుడైన మహిషాసురుని సంహరించుటకు మణికంఠుని ఆయత్త పరచుటకు ఈ పరీక్ష జరిగెను. మహిషాసురుని సంహ రించి పులివాహనునిగా మణికంఠుడు గృహమున కరుదెంచి అందరిని సంభ్రమాశ్చర్యముల దేలియాడ జేసెను.

మహిమాన్వితుడైన మణికంఠుడే రాజ్యార్హుడని నిర్ణయించి రాజ్యము, మణికంఠుని కప్పజెప్ప నిర్ణ యించిరి. కాని మణికంఠుడందుల కంగీకరింపక తన శేషజీవితమును తపస్సులో గడుపుటకు నిశ్చయించు కొనెను.

పాతాళరాజు, అద్భుత దేవాలయమును శబరి కొండల నడుమ నిర్మించి యిచ్చెను. అదియే నేడు శబరిమలయందు వెలసిన శ్రీ అయ్యప్పస్వామి దేవాలయముగ, ప్రసిద్ధిగాంచినది.

నేడు భక్తులు, సాంప్రదాయముగ నున్న 'ఎరుమెలి' దారిగుండా శబరిమలకు ప్రయాణము చేయుచున్నారు. స్వామిని చేరుటకు కొండదారి నిటారుగానుండి జారుడు స్వభావము కలిగి బహు కష్ట సాధ్యమగు చున్నది. అయినను భక్తజనసందోహము, మహోత్సాహముతో, శ్రీ అయ్యప్పదేవాలయము

చుట్టూ దట్టమైన అడవి, క్రూరజంతు సందోహ మున్నను లెక్కచేయక, ప్రతిసంవత్సరము మిక్కుటముగా స్వామి దర్శనమునకై వచ్చుచున్నారు.

ప్రతియేట, డిసెంబరు మాసమున జరుగు మండలపూజ, మకర విలక్కు, విశు, చైత్ర ప్రథమ దినమునందు భక్తులు స్వామిని దర్శించుటకు అధిక సంఖ్యలో వచ్చుచున్నారు. మకరజ్యోతి దర్శించుట మహద్భాగ్యముగ భక్తులు పరిగణించుచున్నారు.

శబరిమల యాత్రచేయు భక్తులు నవంబరు నెలలో నలభైఒక రోజులు వ్రతదీక్షతో తులసిమాల (శబరిమల దర్శించిన స్వామి ఆశీర్వచనములతో) ధరించి కటికనేల పరుండుట, మాంసాహార విసర్జన మొదలుగాగల నియమములతో కఠోరవ్రతదీక్ష, భక్తులను స్వాములుగ తీర్చిదిద్ది మానసిక, శారీరకముగా శబరియాత్రచేయుటకు సమాయత్తముచేయును.

స్వామి కైంకర్య నిమిత్తము సంబారములను భక్తులే స్వయముగ శిరమునందుంచుకొని (ఇరుముడి) యాత్రచేయుట విధిగా నిర్ణయించబడినది.

పదునెనిమిది మెట్లపైసాగి స్వామి దర్శనము చేయుటకై శబరిమల యాత్రచేయు భక్తులు, వీర, పద్మాశన, చిన్ముద్రమూర్తి అయిన శ్రీ అయ్యప్ప స్వామిని సేవించి, నిజజీవితములో అట్టి దీక్షను సాగించుచు కడు ధన్యులగుచున్నారు. వారు స్వాముల వలె కడు పూజనీయులగుచున్నారు. ఈ స్వామికి మన ఆంధ్ర దేశమున కూడా ఎన్నో ఆలయములు కలవు.



# శ్రీ సూర్యారాధన : శ్రీ సూర్య దేవాలయాలు

ప్రపంచములో జీవకోటికి ప్రాణశక్తిని ప్రసాదించే ప్రభాకరుడు ప్రత్యక్షదేవం. ఇతర దేవతలు భావనాగమ్యులు. సకల దేవతల తేజస్సును, ఓజస్సును శక్తిని, సామర్థ్యాన్ని, అంశను, అనుగ్రహాన్ని తనలో కలుపుకొని తనను ఆరాధించే వారిని తగురీతిలో తరింపజేసే ఆదిత్యుని ఆరాధించడం మన సంప్రదాయం.

అమరకోశ అర్థాల ననుసరించి సూర్యునికి ఏభై రెండు పర్యాయపదాలున్నాయి. అందుకొన్ని, ప్రభాకరుడు, సవిత, మిత్ర, హిరణ్యగర్భుడు, ఆదిత్యుడు, తరణి అనునవి. ఈయన చీకటిని పోగొట్టువాడని మనందరకు తెలిసినదే.

మన పూర్వుల దూరదృష్టి సాటిలేనిది. సమస్త జనులకు ఎట్టి భేదభావములు లేకుండ దైవదర్శనం సుసాధ్యం చేద్దామనే సంకల్పంతో నిరాకారుడైన దేవునికి రూపకల్పనచేసి, అర్చనాదులకు నియమము లేర్పరచి, గుడులు గోపురాలు నిర్మించారు. శ్రీ సూర్య దేవునకు కూడ దేవాలయాలు నిర్మించారు.

సృష్టి ఆరంభంలో వెలసిన శ్రీ సూర్య భగవానుడు భూలోకంలోని సమస్త ప్రాణులకు నియమ ప్రకారం దర్శనమిస్తున్నాడు. అందుకే ఆయన ప్రత్యక్ష దైవం అన్నారు పెద్దలు. ఈయన సులభ సాధ్యుడు. సర్వసాక్షి, ఆరోగ్యప్రదాత, కరుణా సాగరుడు, అనాదిగా మన పూర్వులు శ్రీ సూర్యారాధనే తరుణోపాయంగా భావించి, ఆచరించి, తరించారు.

అష్టాదశపురాణ, ఉప పురాణాల్లో శ్రీ సూర్య దేవుని గురించి కూడ ఎన్నో గాథలు వున్నవి. ఆరు ఉపాసనా మార్గాలలో అర్క అనగా సూర్యునకు సంబంధించిన ఉపాసన కూడా ఎంతో ప్రాముఖ్యాన్ని ప్రాచుర్యాన్ని పొందింది. మన మహర్షులు యోగ సాధనకు అతిచేరువైనది శ్రీ సూర్యోపాసన.

మండల బ్రాహ్మణము, శుక్ల యజుర్వేదాంతర్గతమైనది. ప్రత్యక్షదైవమగు శ్రీ సూర్య భగవానుని స్తుతించినదీ బ్రాహ్మణము. అందువలన సర్వోత్కృష్టమైనది. సూర్యుడు అగ్నిస్వరూపుడని చెప్పుచున్నదీ వేదభాగము.

ఋగ్వేదమున మహాసౌరమను మంత్ర భాగమున శ్రీ సూర్యభగవానుని వర్ణన కలదు. యజుర్వేదమున అరుణమను భాగమున, సామవేదమునందు, అధర్వణ వేదమున విశేషించి శ్రీ సూర్య భగవానుని వర్ణనకలదు. అష్టాదశ పురాణములు, భగవద్గీత, భారత, భాగవత, రామాయణాదులలో శ్రీ సూర్య వర్ణన, మహిమలు వర్ణింపబడినవి.

యజ్ఞవల్క్య మహాఋషి సూర్య స్తోత్రమును రచించి సూర్యునారాధించి, శుక్ల యజుర్వేదమును పొందదలచి శ్రీ సూర్యుని శరణువేడినట్లు చెప్ప బడినది.

సూర్యుడు సకల లోకములకు ఆత్మ స్వరూపుడు. భూత, భవిష్యాదాది బేధ, బిన్నకాల స్వరూపుడై లోకములను ఉద్ధరించుచు, లోకముల యొక్క నడకను, నడిపించుచున్నాడు.

ఈ సూర్యరూపము ద్వైత లక్షణమైనది. ఇంద్రియ గ్రాహ్యము. రెండవది శుద్ధచైతన్య స్వరూపము. అద్వైతము ఈ రెండు రూపములు సూర్యునకు గలవని, విభ్రాట్ అనువాకమునందు పన్నెండవ సూత్రమున చెప్పబడినది.

శ్రీ సూర్యరశ్మి ప్రభావములు అనంతములు. "సర్వలోక ప్రదీపికాః" అనగా లోకములను ప్రకాశింప జేయుచున్నవి. శ్రీ సూర్యభగవానునికి సహస్ర కిరణములు గలవని వేదములలో వర్ణనకలదు. ఈ వేయి కిరణములపైన ఏడు కిరణములు శ్రేష్ఠమైనవి. అందువలన వీనిని "గ్రహయోనయః" అని అందురు. ఇవి ఏడును, సుషుమ్నము, హరికేశము, విశ్వకర్మ, విశ్వవ్యచ, సంపద్వసు, అర్వాగ్వసు, స్వరాడ్వసు- అనునవి. ఈ కిరణములు, నక్షత్రములను, బుధ గ్రహమును, శుక్రగ్రహమును బృహస్పతిని, శనైశ్చరుని పోషించుచు తద్వారా లోకములను తృప్తిపరచుచున్నవి.

శ్రీ సూర్యభగవానుని వేయి కిరణములు, ఏడు కిరణములేకాక ఇంకొక నాలుగువందల కిరణములు వర్షములు వచ్చుటకై యేర్పడియున్నవి. మరి మూడు వందల కిరణములవలన మంచుకురియుటకు అవకాశ మేర్పడుచున్నది.

మాఘ మాసమున శ్రీ సూర్యభగవానుడు 'వరుణ' అను పేర, ఫాల్గుణమున 'పూషా' చైత్రమున 'ఈశ్వర' వైశాఖమున 'ధాతా' జ్యేష్ఠమున 'ఇంద్ర', ఆషాఢ మున 'సవిత' శ్రావణమున 'వివస్వాన్' భాద్ర పదమున 'భగుడు, ఆశ్వీయుజమున 'పర్యానుడు', కార్తీకమున 'త్వష్టా', మార్గశిరమున 'భాస్కర', పుష్యమున 'విష్ణుడు' అని వ్యవహరింపబడునని వేదములయందు చెప్పబడి నది.

సూర్యుడు స్వయంభువు. శుక్లయజుస్సంహిత యందు శ్రీ సూర్యభగవానుని గూర్చి చెప్పబడినది.

అందరిని మేల్కొలిపి కర్మలయందు ప్రేరేపించే వాడు. అందుచేత అందరికి హితుడు. ఇతని మరి యొక రూపమే విజ్ఞానానందఘనమైనఆత్మ. ఇంత ప్రదేశ ములో ఉన్నదనికాని, ఇంతకాలములో ఉన్నదని కాని చెప్పవీలులేని దీయన రూపము. ఇతడు హిరణ్యపాణి. పాపులుకూడ అదిత్యోపాసనచే సుమతులవుతున్నారు. ఈతడు నిధిపాలకుడు. వర్చస్సుకోసం, దృష్టికోసం, మంచి జ్ఞానంకోసం ఇతడుపాసింపబడుతున్నాడు.

విభ్రాట్ అనే మహర్షి సూర్యుని వర్ణించాడు. చక్కగా ప్రకాశిస్తున్న సూర్యకాంతి ప్రాణుల్లో ప్రాణ వాయువురూపంగా సంచరిస్తుంటుంది. భూమ్యా కాశాలకు దీప్తిని కలుగజేస్తుంది. లోకం యొక్క జీవ నాడి సూర్యుడే. ఇతనిని ఆరాధించే వారికి ఆరోగ్యాన్నిస్తాడు.

ఋగ్వేదంలో వర్ణింపబడిన మిత్రుడే, అధర్వ వేదంలో సూర్యుడుగా, పూషగా, ఆదిత్యుడుగా వర్ణింప బడ్డాడు. ఈయన ధనాన్నిచ్చే దేవత. పూష్ణరూపంలో సుఖప్రసవాన్ని కలుగజేసేవాడుగా, అదిత్యరూపంలో వాత పిత్తాదిరోగాలను నివారించే వాడుగా స్తోత్రం చేయ బడ్డాడు. సూర్యరూపంలో కామెర్లరోగాన్ని పోగొడ తాడు. సవితృ రూపంలో సర్వశస్త్ర బాధలను నివారిస్తాడు. మిగతా దేవతలలాగ సూర్యుడుకూడ మనం ద్వేషించినవారిని, మనలను ద్వేషించేవారిని నశింప జేస్తాడు. చౌలం, కేశఖండనలు మొదలగు స్మార్త కర్మలలో మిత్రరూపంలో కుమారుని రక్షించవలసిన దిగా సూర్యుని ప్రార్థించడం జరుగుతుంది. వడదెబ్బ కొట్టినవారికి సూర్యుడు వర్చస్సును ఇస్తాడు. సవితృ రూపంలో ధనాన్ని, బలాన్ని ఇస్తాడు. త్వష్ణ రూపంలో సంతానాన్ని ఇస్తాడు. ఉదయిస్తున్న ఆదిత్యుడు గోవు లకు రోగాల్ని కలిగించే క్రిములను చంపుతాడు. ఉపనయనంలో వటువుకు మిత్ర, సవితృ, త్వష్టు రూపంలో రక్షిస్తాడు. బాలగ్రహశాంతికి, క్షయ, కుష్ఠు మొదలగు రోగాల నివారణకు సవితృరూపంలోను, సూర్యరూపంలోను అనుగ్రహిస్తాడు.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పరిరేక ఆసీత్" శ్రుతి కీర్తించిన హిరణ్యగర్భుడు సూర్యుడే. కాల స్వరూపుడైన శ్రీ సూర్యభగవానుడు, పరమాణువు మొదలు సంవత్సర పర్యంతం ద్వాదశరాశి రూపమైన భువనకోశాన్ని ప్రదక్షిణంచేస్తూ ఉంటాడు.

ఆదిత్యరూప వర్ణన శ్రీవ్యాస భాగవతంలో కూడ విపులంగా వివరించబడి ఉన్నది.

మయూరుడు అనే ప్రాచీన సంస్కృత కవి సూర్యస్తోత్రాత్మకంగా వ్రాసిన శతకమే 'సూర్య శతకము' దీనిని వ్రాసిన తరువాత మయూరకవి కుష్ఠు రోగంనుండి విముక్తుడైనాడని తెలుస్తున్నది.

అగస్త్య మహాఋషి 'ఆదిత్య హృదయమ'ను పేర శ్రీ సూర్యదేవుని మహిమలను వర్ణించి చెప్పినట్లు వాల్మీకి రామాయణమునందు కలదు. రావణవధకు పూర్వము శ్రీరామునకు ఈ మహర్షి ఆదిత్య హృదయమును ఉపదేశించెనని వాల్మీకి రామాయణ గాథ కలదు. 'ఆదిత్య హృదయము' ఎంతో ప్రాచుర్యము చెందినది.

భగవద్గీతలో విభూతి యోగంలో 'ఆదిత్యానాం

అహం విష్ణు జ్యోతిషా రవి రంశుమాన్ అనగా విష్ణు రూపము, సూర్యరూపము తనదేనని స్పష్టంగా చెప్పి నాడు, శ్రీ కృష్ణపరమాత్మ. అంతేకాదు పురుషోత్తమ ప్రాప్తి యోగంలో 'యదా దిత్య గతం తేజో జగద్భా నయతే ఖిలమ్' అనే శ్లోకానన్నసురించి సూర్యుని యందున్న తేజస్సు అనగా ప్రకాశము, చైతన్యము అంతయు నాదిగా యెరుంగవలయునని శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పడం జరిగినది.

మకరకుండలాది ఆభరణాదులు కలిగిన శ్రీ మహావిష్ణువే సూర్యమండలములో శ్రీ సూర్య నారాయణుడై జీవుల సృష్టి, స్థితి, లయములకు, కాల స్వరూపుడుగ కారణమవుతున్నాడు.

ఆదిత్యుడు ఉదయించే తూర్పు దిక్కు మనకు పరమపవిత్రమైనది. దేవాలయములలో మూల విగ్రహ ములు తూర్పువైపు చూచేటట్టు ప్రతిష్ఠింపబడి ఉండ టము, తూర్పు దిక్కునకుగల ప్రాముఖ్యతను తెలుపుచున్నది.

సూర్యునియందలి శ్రేష్ఠ తేజస్సే గాయత్రి. సూర్యుడు సర్వసాక్షియై ఈశ్వరుడగుటవలన, సూర్యాంతర్గత చైతన్యమగు ఈశ్వరుడే గాయిత్రియని తెలియవలయును.

ఈ సూర్యుడు గాయత్రికి ఆరాధ్య స్వరూపము. ఇతడు సర్వదేవాత్మకుడు. త్రిమూర్త్యాత్మకుడు. త్రిమూర్తి స్వరూపుడు. వేదత్రయా స్వరూపుడు. బ్రహ్మణి, సావిత్రి, రౌద్రి, సరస్వతి, శక్తి స్వరూపి 'ఓం' కార స్వరూపుడు ఈయనయే అయి వున్నాడు.

శ్రీ ఆంజనేయుడు శ్రీ సూర్యదేవుని వలన, నాల్గువేదములు, సమస్త శాస్త్రములు, నవవ్యాకరణాదుల నభ్యసించెను. అందువలన ఆంజనేయునకు సూర్య దేవుడే గురువు.

సూర్యుడు నిష్కామ కర్ముడు. చేతన జగత్తు నంతటికి ప్రాణదాతయగు భాస్కరుడు విరామ మెరుగడు. సర్వజీవులకు సమస్నేహం కూరుస్తు న్నాడు. స్తుతి, నిందలకతీతుడు ఇవన్నీ కార్యసాధనకు లక్షణాలేకదా.

సూర్యారాధన మనకు పూర్వం నుంచీ ఉన్నందు వల్లనే ఆ దేవుడి పేర్లు చాలామంది పెట్టుకుంటున్నారు. సూరి, సూరీడు, సూర్యకాంతం, సూర్య మణి, సూర్య నారాయణ, ప్రభాకరం, దివాకరం, రవి, భాస్కరం, భాను మూర్తి -ఇలాగ ఎన్నో ఆదిత్య బిరుదు రాజవంశాలలో వ్యాప్తిగా ఉండేది.

ఈ జీవన ప్రవాహంలో తరాలు మారినా, జీవన వ్యవస్థరూపం మారకూడదు. అందుకు కారకుడైన సూర్యుడి గుణాలైన, నిర్విరామకృషి, నిష్పక్షపాతబుద్ధి నిరహంకారాలను పుణికిపుచ్చుకుని స్నేహమాధుర్యా లను హృదయమున నింపుకొని కర్తవ్యపరాయణులై నపుడు సమాజజీవనము ఎంతో సాఫీగా సాగుతుంది.

వారానికి గల ఏడు రోజుల్లో మొట్టమొదటిది ఆది(త్య)వారం ప్రతి ఆదివారం సూర్యుని ఆరాధిస్తే చర్మవ్యాధులు, కంటి జబ్బులు నయమవుతాయని పెద్దలంటారు. రోగాలు రాకుండా ఉంటాయి. మాఘ మాసపు ఆదివారాలకు ప్రాముఖ్యత వున్నది. సూర్యుడికి క్షీరాన్న నివేదన చెయ్యడం పరిపాటి.

సూర్యదేవుడు సప్తసంఖ్య ప్రధానుడు. ఆయనది బంగారు రథం. గుర్రాలు ఏడు.

సప్తమి తిథినాడు సూర్యారాధన ఎంతో ముఖ్యం సప్తమీ వ్రతాలు ఎన్నో రకాలున్నాయి. కళ్యాణ సప్తమి, కమల సప్తమి, రథాంక సప్తమి, మహాసప్తమి, జయసప్తమి, మార్తాండ సప్తమి అర్క సంపుట సప్తమి -ఇలా ఎన్నో ఉన్నాయి. అన్నింటిలో రథసప్తమి, మాఘ శుద్ధ సప్తమి ముఖ్యమైనవి. సూర్యోదయ సమయాన ఆకాశంలో నక్షత్రాల సన్నివేశం రథాకారంలో ఉంటుంది. అందు వలన దీనికి ఈ పేరు వచ్చినది. రథసప్తమికి చలిపోయి వేసవి ప్రారంభం అవుతుంది. ప్రాణి కోటికి క్రొత్త చైతన్యం కలుగుతుంది.

ప్రత్యక్షదేవమైన శ్రీ సూర్యారాధన శుభకరం, ఆరోగ్యప్రదమనడంలో సందేహంలేదు.

## శ్రీ సూర్యదేవాలయాలు

ప్రత్యక్షదైవంగా మనం పూజిస్తున్న శ్రీ సూర్య భగవానుడికి భారతదేశం మొత్తం మీద అయిదారు

ఆలయాలు మాత్రమే ఉన్నాయి. (త్వరలో హైదరాబాద్‌లో గొప్ప సూర్యదేవాలయ నిర్మాణం జరుగనున్నది. విగ్రహాలు తయారగుచున్నవి).

ప్రపంచప్రఖ్యాతిగాంచినది ఒరిస్సాలోని కోణార్క దేవాలయం. ఇది సముద్రతీరాన భువనేశ్వర్‌కి నలభై మైళ్ళ దూరంలో ఉన్నది.

**ఈ దేవాలయ పురాణగాథ:** శ్రీ కృష్ణునికి జాంబవతి వలన సాంబుడనే కుమారుడు కలిగాడు. నారద మహర్షికి సాంబునిపై కోపము వచ్చిందొకప్పుడు. సాంబుడు గోపికలను అవహేళన చేసేటట్టు నారదుడు పురికొల్పాడు. శ్రీ కృష్ణుని కోపానికి గురియై కుష్ఠు రోగి అయ్యేటట్లు శ్రీ కృష్ణునివలన శాపం పొందాడు.

శాపగ్రస్తుడైన సాంబుడు, ఘోరవ్యాధితో బాధపడుతూ అడవుల వెంట తిరుగుతూ ఉండగా ఆ సంగతి తెలిసికొని శ్రీ కృష్ణుడు తన తొందరపాటునకు నొచ్చుకొని, కొడుకును చేరబిలిచి శ్రీ సూర్య జపం చేయమని హితవు చెప్పాడు అపుడు సాంబుడు మైత్రేయ ఆరణ్యంలో పన్నెండేళ్ళపాటు, తేజోమూర్తియైన సూర్యుని ఆరాధించాడు.

ఆ తరువాత తామరాకులపైన చంద్రభాగా నది అలల మీద తేలియాడుతున్న సూర్యవిగ్రహాన్ని బయటికితీసి సముద్రతీరాన ఆలయం నిర్మించి ఆ సూర్యమూర్తిని ప్రతిష్ఠించాడు. అంతట శాపవిముక్తి కలిగి వ్యాధి నివారణమయింది.

కళింగరాజ్యంలోగల పంచక్షేత్రాలలో కోణార్క క్షేత్రం అతి ముఖ్యమైనది. ఆలయ శిల్ప విశేషం వర్ణనాతీతం. 1200 మంది శిల్పులు పదహారేళ్ళపాటు పని చేసి ఆపురూపమైన ఈ దేవాలయాన్ని నిర్మించారు. దీనికి ఆనాటి లెఖ్ఖల్లో నలభైకోట్ల రూపాయలు ధనము ఖర్చైందటారు.

బ్రహ్మాండమైన ఈ సూర్యాలయం శిథిలమై పోవడానికి కారణంగా ఒక పురాణగాధ ఉందని చెబుతారు పెద్దలు. ఇది చంద్రభాగ అనే మునికుమార్తె గాధగా ప్రసిద్ధమైనది.

తుఫానుల వలన, తీవ్రమైన సముద్ర కెరటాలు సూర్యదేవుని ఆలయ గోపురాన్నంతటిని నేలమట్టం చేసాయి. సూర్యదేవునికి సంబంధించిన ఈ ప్రదేశం ఈనాడు ఒక దివ్యక్షేత్రమే కాక చారిత్రిక ప్రసిద్ధిని కూడా పొంది, ఖండఖండాంతరాల నించి యాత్రికులు వచ్చి ఆలయ నిర్మాణము తిలకించి ధన్యులవుతున్నారు.

**మార్తాండాలయం :** దీనిని లలితాదిత్యుడు నిర్మించాడు. విగ్రహము గోపురము కంటికి కనబడకుండ శిథిలమయిపోయాయి. ఇది కాశ్మీర్ (ఇస్లామాబాద్) సమీపాన వున్నది.

**మొథెరా సూర్యాలయం :** గుజరాత్‌లో మొథెరా సూర్యాలయం చెప్పుకోదగ్గది. శిల్పవిషయంలో కోణార్కతో సరి తూగుతుంది. విగ్రహం కానరాదు. అహమ్మదాబాద్‌కి 125 కి.మీ. దూరంలో వున్నది. శిఖరం శిథిల మయింది. నిలచియున్న భాగాన్ని చూసి ఆలయం పూర్వవైభవం వూహించుకోవలసినదే. గర్భగుడి గోడల మీద చెక్కిన ద్వాదశ మూర్తులు, ప్రాకారం గోడల మీద 'ఈరానీ బాణీ'లో చెక్కిన ఇరవైనాలుగు సూర్యమూర్తులు చూడదగ్గవి. అయనాల మార్పు సమయంలో ఉదయ భానుడి కిరణాలు మంటపం నించి సరాసరి గర్భగుడిలో పడేటట్లు ఈ ఆలయ నిర్మాణం జరిగింది.

దక్షిణాదిన కుంభకోణానికి తూర్పుగా, తిరువడైమరుదూర్‌కి రెండు మైళ్ళలో 'సూర్యనార్ కోయిల్' ఉన్నది. నిత్యపూజలు జరిగే ఈ ఆలయాన్ని కులోత్తుంగ చోళుడు నిర్మించినట్లు చెబుతారు.

కర్ణాటక దేశంలో ఐహోళికలో సూర్యాలయం పూర్తిగా శిథిలమయిపోయినా విగ్రహం చెక్కుచెదరకుండా వున్నది.

ఇప్పటి శ్రీకాకుళం జిల్లా (మనరాష్ట్రంలో) హర్షవిల్లి గ్రామం – ఈనాటి అరసవల్లి – శ్రీకాకుళానికి రెండు మైళ్ళదూరాన, శ్రీకూర్మం వెళ్ళే దారిలోఉన్నది శ్రీ సూర్యనారాయణ స్వామి దేవాలయం. ఈ క్షేత్రం ఆంధ్రదేశాన ప్రసిద్ధి చెందినది నిత్య పూజలు జరుపబడుచున్నవి.

ఈ దేవాలయ శిల్ప చాతుర్యం చెప్పుకోదగ్గది. ఉత్తర దక్షిణాయనాలు మార్పు చెందే కాలాన సూర్య కిరణాలు సరిగా స్వామి వారి పాదాల పైన పడతాయి.

(ఈ దేవాలయాన్ని గురించిన ఇతర వివరాలు, స్థల పురాణం శ్రీకాకుళం జిల్లా దేవాలయాల వివరాలలో పొందుపరచడమైనది. చదువరులు గమనించ ప్రార్థన)

# అర్చన - అర్చకులు - సాంప్రదాయములు

దేవాలయములను నిర్మించి స్వామిని ప్రతిష్ఠించిన తరువాత స్వామివారిని అర్చించుటకు, పూజించుటకు అనాది నుండియు, కొన్ని సాంప్రదాయములు కలవారిని భగవదర్చకులుగా నియామకము జరిగినది.

భగవచ్ఛాస్త్రముల యందు చెప్పబడినటుల అర్చకుని తపోనిష్ఠ వలనను, అర్చన యొక్క విశిష్టత వలనను మూర్తి యొక్క సౌందర్యము వలనను, విగ్రహము నందు, ప్రతిమయందు భగవత్సాన్నిధ్యము కలుగుచున్నది.

యజకులనగా అర్చకులు. అనగా భగవంతుని పూజించువారు.

భగవదాలయ నిర్మాణానంతరము, భగవదర్చకుల స్థానము అత్యంత పవిత్రమై, ప్రధానమై యున్నది.

'అర్చకస్తు హరి స్సాక్షాత్ చరరూపీన సంశయః' అని 'విష్ణ్వర్చకో విష్ణు సదృశః' అను ప్రమాణములను బట్టి ఈ సాంప్రదాయ మేర్పడినది.

దైవసంబంధమైన స్థానములలో అర్చక స్థానము తరువాతనే ఇతర స్థానములు ప్రాముఖ్యత చెందుచున్నది. భగవంతునికి సంబంధించి నిత్యము సలిపెడు దైవకార్యక్రమములలో ఏమాత్రము లోప మున్నను గ్రామములకు దేశానికి అరిష్టములు సంభవించునని శాస్త్రములు చెప్పుచున్నవి.

మానవులందరి పక్షమున ప్రతినిధియై దేశములోని సమస్త మానవ కళ్యాణము కొరకు, శాంతి కొరకు, భగవంతునికి చేయు అర్చనలో ఎట్టి కళంకము లేకుండ, నిస్స్వార్థముగ, పక్షపాతము లేని విశాలబుద్ధితో, సద్భక్తితో భగవంతుని సేవించి, తాను తరించి, ప్రజలందరిని తరింపజేయు వృత్తులలో అర్చనా వృత్తి అనాది నుండియు, ప్రాచుర్యము, ప్రాముఖ్యము వహించుచున్నది.

ప్రతిరోజు, ప్రాంతఃకాలమున లేచి, స్నానము చేసి పరిశుభ్రమైన వస్త్రములు దరించి బొట్టు పెట్టుకొని, (వారిమతానుసారము) దేవాలయమునకు పోయి, దేవాలయమునందుగల మాలిన్య ద్రవ్యములను (నిర్మాల్యమును) బయట పారబోయవలెను. తీర్థ పాత్రలు శుద్ధిచేసి, తులసి, పుష్పములు (కుంకుమ) మొదలైన పూజాద్రవ్యములతో స్వామివారికి అర్చన చేయవలెను. తరువాత స్వామివారికి అన్నము, పెరుగు, నెయ్యి మొదలగునవి, నివేదన చేయవలెను. సాయంసమయమున స్వామివారికి దీపారాధన చేసి అవసర నివేదన సమర్పించవలెను. శాస్త్రములలో చెప్పబడిన పద్ధతిలో నిత్యనైమిత్తిక పూజా పునస్కారములు చేయుట అర్చకుల ప్రధాన ధర్మము. కర్తవ్యము కూడను అయివున్నది.

అర్చకులు దేవాలయములలో నిత్యము సమస్త ప్రజల యోగక్షేమములు కలిగి యుండునట్లును, వ్యాధులు రాకుండ, దొంగల భయము నుండి, శత్రువుల దండయాత్రలనుండి, అగ్నిక్షామాది సంకటములనుండి ప్రజలను కాపాడవలసినదిగ కోరుచు అందరి పక్షమున, ప్రతినిధులుగ స్వామివారి పాదముల కడ, మంత్రపుష్పములను సమర్పించవలెను.

వీరు ఇతర వృత్తులకెగబడక అర్చనాది విధులను సక్రమముగా నిర్వర్తించుటకై అనాది నుండియు దాతలు మాన్యములిచ్చి వలయు సౌకర్యములు కల్పించి వీరిని పోషించిరి.

అనాదిగ విష్ణ్వాలయములలో 'వైఖానస' 'పాంచ రాత్రో సాంప్రదాయముల ననుసరించియు శివా లయములలో ఆదిశైవుల సాంప్రదాయ పద్ధతి ననుస రించియు భగవంతునికి అర్చన, ఉత్సవములు జరుప బడుచున్నవి.

విశిష్టాద్వైత సిద్ధాంతము॥ను ప్రప్రథమమున సర్వజగదాధారభూతుడైన శ్రీ మహావిష్ణువు దివ్యాంశ ముతో నవతరించిన శ్రీ విఖనో మునీంద్రులు ప్రభోధించినట్లు తెలియుచున్నది. ఈ పరమ పవిత్ర తాత్త్విక వాదమును బహుళ వ్యాప్తికి తెచ్చిన పూజ్యులు భృగు, మరీచి, అత్రి కశ్యపులు అను మహర్షులు, వీరు శ్రీ విఖనోముని వలన విశిష్టాద్వైత పావన తత్త్వమును గ్రహించి పిదప వారు తమ సంహితలలో బాగుగా వివరించినారు.

వేద వేదాంత సమ్మతమై మహర్షి గణప్రకాశిత మై విరాజిల్లుచున్న విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రాచీను లైన శ్రీ వైఖానస వైష్ణవుల చేతను శ్రీ పాంచరాత్ర వైష్ణవుల చేతను, పూజ్యులు మహా భక్తులైన ఆళ్వారుల చేతను శ్రీ వైష్ణవాచార్యుల చేతను ఆచరింపబడుచు ప్రభోదింపబడుచున్నది. మానుష, దైవిక కర్మలను బోధించు శ్రీ సూత్రము, శ్రీ శాస్త్రము శ్రీ వైఖానసునిచే ప్రవచించబడి ఈ సూత్ర శాస్త్రములకు, శ్రీ వైఖానస మహర్షియే కర్త యని తెలియుచున్నది.

శ్రీమన్నారాయణుడు అర్చావతారుడుగ అవత రింపబోవు సమయమున తదర్చావిధానమును ఎరుక పరచి ప్రజలను తరింపజేయుటకొక విశిష్ట శక్తి సంపన్నుడైన మహామునిని శ్రీ మహావిష్ణువు సృజించెను. ఆ మహనీయుడే శ్రీ మహావిష్ణువు మానస పుత్రుడు శ్రీ వైఖానసుడు, ఈయన శంఖ చక్రములు, కిరీటము, ఊర్ధ్వపుండ్రములు, పద్మాక్ష మాలికలు, దండ కమండలముతో జటలను కలిగి శ్రీ విఖనసుడు రెండవ శ్రీ మహావిష్ణువు వలె ప్రకాశించెను

శ్రీ మహా విష్ణువును వేదోక్త విధానముగ నారాధించు పద్ధతులను బోధించి ఏకానీయ, యజ్ఞా ఖానుసారముగ నొక సూత్రమును రచింపుమనియు అది వైఖానసమను పేరు జగద్విఖ్యాత మగునని శ్రీ మహా విష్ణువునుడివెను. విఖానసుడు, భగవంతుని యాజ్ఞానుసారముగ 32 విభాగములు గల కల్ప సూత్రమును ఒకటిన్నర కోటి ప్రమాణములు గల భగవచ్ఛాస్త్రమును రచించెను. విఖానసముని ముఖ్య శిష్యులైన భృగు, మరీచి, అత్రి కశ్యపులు నాలుగు లక్షల గ్రంథము అధికారసంహిత, తంత్రకాండములను పేర్లతో వ్రాసి యుండిరి. ఈ గ్రంథములు, దేవాలయ నిర్మాణము ప్రతిష్ఠోత్సవములకు సంబంధించిన అనేక ముఖ్య విషయములను తెలియపరచుచు, అధ్యాత్మిక పురోభివృద్ధికి ఎంతగనో దోహదమొనర్చు చున్నవి.

వైశానససూత్రమందు చెప్పబడిన సంస్కారము లచే సంస్కరింపబడుచున్న వైఖానసులు సహజ వైష్ణవులు, జన్మవైష్ణవులు నైయున్నారు. వైఖానసులకు ఆగర్భ వైష్ణవులను వ్యవహారము కలదు. గర్భవైష్ణవు లగు వైఖానసులకు (శ్రీనివాసదీక్షితీయము) నేనే గురువునని భగవద్వాక్యము ప్రసిద్ధము. గర్భవైష్ణవు లనగా తల్లి కడుపున నున్నపుడే ఎనిమిదవ నెలయందు వైఖాన సూత్రమందు శ్రీ వైష్ణవత్వ సిద్ధికై చెప్పబడిన 'విష్ణుబలి' యను సంస్కారముచే సంస్కరింపబడి వైష్ణవత్వమును పొందినవారు. విఖనసుని వేదక్రియలు పూర్తి వైష్ణవ స్వభావమును కలిగియున్నవి.

మనదేశములోని విఖానసుల అనుచరులందరు ఆగర్భ వైష్ణవులు. వీరు వైష్ణవత్వము కొరకు ఇతర ప్రత్యేక దీక్షను తీసికొన నవసరములేదు. కాని యితర ఋషి సాంప్రదాయములకు చెందినవారు వైష్ణవత్వము పొందుటకు ప్రత్యేకదీక్ష అత్యవసరమై యున్నది.

అనాది నుండియు నేటివరకు ఆంధ్ర, ద్రవిడ కర్ణాటక రాష్ట్రములందు పేరొందిన విష్ణ్వాలయము

లలో వైఖానసులే అర్చకులుగా నున్నారు. నేటికిని వైఖానస సూత్రప్రకారము దేవునారాదించుచున్న ప్రసిద్ధ దేవాలయములలో తిరుపతి, తిరుమల, మధుర, శ్రీ వైకుంఠము, వానమామలై, నవతిరుపతి, మహాబలిపురము, తిరువక్కోళి, శ్రీ పెరుంబూరు, మంగళగిరి, చోళంగిపురం, వేదాద్రి, భావనారాయ స్వామి పొన్నూరు ముఖ్యమైనవి.

పాంచరాత్రులు : పాంచరాత్రమనగా ఐదు రాత్రులయందు చెప్పబడినది. శ్రీమన్నారాయణునిచే పూర్వమొక సమయమందు ఐదుగురికి అనగా శ్రీదేవి, బ్రహ్మ, అనంత, గరుడ మరియు విష్వక్సేనులకు ఉపదేశించిన శాస్త్రము పాంచరాత్రమని సార్ధక నామ ధేయముతో పిలువబడుచున్నది. శ్రీ మహావిష్ణువు ప్రతిష్ఠార్చనోత్సవాది విషయములను, అర్చావతార వైభవములను, భక్తిప్రవత్తులతో కూడిన భగవదా రాధనమే మోక్షసాధనమను సిద్ధాంతమును చక్కగా నిరూపించు తాత్త్విక విషయములనేకములీ శాస్త్ర మందు జెప్పబడియున్నవి. ఈ పంచరాత్ర సంహితలు నూట ఎనిమిదిగ బేర్కొనబడుచున్నవి. ఈ పంచ రాత్రము ననుసరించి యుండువారే పాంచ రాత్రులు. వీరు అనేక సూత్రములు కలవారై యున్నారు. ఇందు శుక్లయజుశ్శాకీయులు, కాత్యాయన సూత్రులు, కృష్ణ యజుశ్శాకీయులు ఆపస్తంబ సూత్రులు మొదలగు వారు కలరు. తమిళనాడు నందలి శ్రీరంగ క్షేత్రమున శ్రీ రంగనాధుని పూజించు ప్రధానార్చకులు కాత్యా యన సూత్రీకుల పాంచ రాత్రులు, తెలుగు దేశ మందలి భద్రాచల క్షేత్రమున శ్రీ సీతారాముల నర్చించు ప్రధానార్చకులు ఆపస్తంబ సూత్రీకులగు పాంచరాత్రులు వీరు వంశపారం పర్యముగా భగవదారాధన చేయువారు. ఈ శాస్త్రము సృష్ట్యాది నుండియు బహుళ ప్రచారములో నుండి అన్ని యుగముల యందు జీవించి యున్నది.

పాంచరాత్ర సిద్ధాంత ప్రకారము, అర్చన జరుగుచున్న ప్రసిద్ధ దేవాలయములు శ్రీ రంగము, కంచి, తిరువళ్లూరు అహోబిలము, సింహాచలము మొదలగు క్షేత్రములు. వీరు శ్రీ మహావిష్ణువునే పరమ దైవమని నమ్మి ఇతర వృత్తుల నవలంబించక విష్ణ్వాలయములలోనే పూజలు చేయుచు సొమ్ములై కాలము గడుపుచున్నారు. ఈ శాస్త్రమునకు శ్రీమన్నారాయణుడు వక్తగా నుండి, నారదుని నుండి బహిర్గతమై యుండి నందున, ఇవి అత్యంత ప్రాముఖ్యము వహించియున్నది.

ఆళ్వారులు : వీరు అర్చావతార మహాత్మ్య మును లోకమునకు చాటి చెప్పిరి. వీరు పదుగరని శ్రీ పరాశర భట్టరువారు చెప్పియున్నారు.

ఆదిశైవులు : శివార్చన జరిపెడు ఆదిశైవుల సాంప్రదాయము బహు పురాతనమైనది. శివభక్తులు శైవులనబడుచున్నారు. వీరి సిద్ధాంతము శివాద్వైతము. అనగా శివునితో సమానుడగు రెండవవాడు లేడని యర్థము. ఆది శైవ మతము మహాశైవ మతము, శుద్ధ శైవ మతము అని మరికొన్ని శైవ మతములున్నవని తెలియుచున్నది కామికము మొదలగు ఇరువదెనిమిది లేక ముప్పది రెండు శైవాగమములు వీరశైవులు బసవేశ్వరుని సాంప్రదాయమును అనుసరించు చున్నారు. వీరు శివార్చకులు. ఆదిశైవులకు దక్షిణాదిని 'గురుక్కల్' అని వ్యవహరించెదరు. వీరు సగుణో పాసకులు. విగ్రహారాధనకు ప్రధానులు. వీరి శాఖ చిదంబరంలో వ్యాపించి యున్నది. బోధాయన సూత్రము వీరి ప్రధాన గ్రంథము.

నాయనార్లు : ప్రముఖ శివభక్తులు నాయనార్లని పిలువబడుచుండిరి. నాయనార్లు అరవై మూడు మంది యని తెలియుచున్నది. వీరు వివిధ వర్ణములకు చెందినవారై జాతి, వర్ణ కుల వ్యవస్థ కతీతముగ నుండుట గమనించవలసిన విషయము. ఆదిశైవులు బ్రాహ్మణులు, రాజులు, వర్తకులు, వ్యవసాయదార్లు, ఆటవికులు, పల్లెవారు, పంచములు, స్త్రీలు, సర్వ జాతుల వారుండుట ముఖ్యము. సర్వ సమత్వము

వీరియందు స్పష్టముగా అనుసరింపబడుచున్నది.

తిరువళ్లువరు రచించిన అతి పవిత్ర గ్రంధము "తిరుక్కురల్" ఇందు ధర్మ, అర్థ, కామములను మూడు పురుషార్థముల గురించి, మూడు భాగములుగ వ్రాయబడిన ఉపదేశ గ్రంధము. తమిళ భాషలో వైష్ణవ ఆళ్వారులును శైవ నాయనారులును గొప్ప భక్తి సాహిత్యమును రచించి, తమిళ వాఙ్మయమును సుసంపన్నముగా జేసిన ప్రముఖులుగా కీర్తింపబడు చున్నారు.

కలిప్రభావము వల్లనో అన్నట్లు ఈనాడు అర్చకులు సంఘంలో అంతగా రాణించుటలేదు. నిజం చెప్పాలంటే పూజా కార్యక్రమాలు చాలమటుకు యాంత్రికంగా జరిగిపోతున్నవి. భగవదర్చనకు కావలసిన విద్యాసంపద అర్చకులలో లోపించడం, శ్రద్ధాభక్తులు, వినయ విధేయతలు, ఆత్మగౌరవాలు, పరస్పర విన్యాసాలు క్రమంగా లోపించడమే దీనికి ప్రధాన కారణాలుగా చెప్పుకోవచ్చును. ఇట్లు తగ్గిపోవడానికి ఈనాటి జీవిత ప్రమాణాలే ముఖ్య కారణమని కూడ అంగీకరించాలి. వ్యక్తిగతమైన ఆర్థిక బాధలెన్ని వున్నా అర్చక వృత్తికి కావలసిన వేషభాషలు, సచ్ఛీలము, మంత్రశుద్ధి వినయ సంపద సాదు భాషణము, దైవభక్తి, సాంప్రదాయ స్వరూప విజ్ఞానము, సాంప్రదాయమునందు విశ్వాసము శ్రద్ధాభక్తులు, పాప పుణ్య వివేకము ఇత్యాదులు అందరు అలవరచుకో వలసిన అవసరం ఎంతేన కలదు.

దేశ సౌభాగ్యాన్ని, ఆధ్యాత్మిక సంపదను పెంపొందించే యత్నంలో అర్చకులు భాగస్వాములు. అర్చకుల కష్ట, సుఖాలను, ఈతిబాధలను ప్రజలు, ప్రభుత్వం గుర్తించాలి. వారిని ఆదుకోవాలి. అర్చకులు కూడ ఓర్మితో సహకరించాలి. అర్చకులు అర్చకులు గాను, దేవాలయములు, దేవాలయాలుగాను వర్ధిల్లాలి.

అర్చకులలో పెద్దను దేవాలయ పరిపాలన సంఘంలో సభ్యునిగా చేర్చివారి సలహాలను కూడ, తీసికుంటే బాగుంటుంది.

అర్చకుల సంక్షేమానికి మన దేవాదాయ శాఖ చేయుచున్న ప్రయత్నములు ఈ సందర్భములో ఆమోదించి అభినందించి, ప్రోత్సాహమివ్వాలి. అందుకు ఎంతో కృషి జరగాలి.

స్వర్గ, మర్త్య పాతాళములు : మూడు లోకములు

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు : ముగ్గురు దేవులు

ఋగ్యయజుస్సామములు : మూడు వేదములు

గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని : మూడగ్నులు

సూర్యచంద్రాగ్నులు : మూడు జ్యోతిస్సులు

ధర్మార్థ కామములు : మూడు పురుషార్థములు

సత్వరజస్తమస్సులు : మూడు గుణములు.



# యాదగిరి గుట్ట
## (నల్గొండ జిల్లా)

పూర్వము హిరణ్యకశిపుని వధించిన పిమ్మట ప్రహ్లాదుని తపస్సుకు మెచ్చి శ్రీనరసింహస్వామి యాదగిరి శిఖరాగ్ర మందలి విశాలమైన పర్వత గుహ లోనికి వేంచేసిరి. బ్రహ్మాది దేవతలు స్వామిని ఆరాధించిరి. ఎందరో మహర్షులు నేటికీ అదృశ్యముగా ఇచ్చటకు విచ్చేసి శ్రీ స్వామి వారిని ఆరాధించుచుందురని దృష్టాంతములను బట్టి తెలియుచున్నది. అందుచే ఈ క్షేత్రము ఋషి ఆరాధనాక్షేత్రమని ప్రసిద్ధిగాంచినది.

కొంత కాలము పిమ్మట ఋష్యశృంగుని పుత్రుడైన యాదఋషి శ్రీ ఆంజనేయస్వామి వారి ఆశీస్సులతో తీవ్ర తపము గావించిరి. తపస్సుకు మెచ్చి శ్రీ భగవానుడు జ్వాలానృసింహస్వామిగా సాక్షాత్కరించెను. పిమ్మట జ్వాలానరసింహ యోగానంద, గండ భేరుండ, ఉగ్ర నరసింహ మరియు లక్ష్మీనరసింహ స్వామి అర్చారూపములో ఆవిర్భవించెను. ఈక్షేత్రము పంచ నారసింహ క్షేత్రమని ప్రసిద్ధి గాంచినది. శ్రీ జ్వాలా నరసింహస్వామి రెండు శిలా ఫలకముల మధ్య దీర్ఘమైన శ్రీచూర్ణరేఖవలె భక్తులకు దర్శన మిచ్చుచున్నాడు.

గ్రహబాధలు, శారీరక ఇతర ఈతి బాధలు గలవారు మండలం (నలుబది దినములు) ప్రదక్షిణలు చేసి శ్రీ స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులగుచున్నారు. ఈ క్షేత్రము వేలాది యాత్రికులచే, భక్తులచే ఆకర్షించబడి, ఆరాధించబడి అతి శీఘ్రగతిని అభివృద్ధి గాంచుచున్నది. డాక్టర్లు కూడ బాగు చేయలేని దీర్ఘరోగాలతో మరియు గ్రహబాధలతో బాధపడుచున్నటు వంటి ఎంతో మంది భక్తులు ఇక్కడ శ్రీస్వామి వారిని సేవించిన, శ్రీస్వామివారు, వారికి స్వప్నమున సాక్షాత్కరించి వారికి ఆపరేషన్లు వంటి ఆధునిక పద్ధతుల ద్వారా చికిత్స చేసిన నిదర్శనములు ఎన్నో కలవు.

ఇచ్చట ధార్మిక, సాహిత్య, సంగీత సమావేశములు, దేశ దేశాలలో ప్రసిద్ధి కెక్కి ప్రశంసార్హమై యున్నవి. బ్రహ్మోత్సవములందు భక్తులచే నిండి భూతల స్వర్గమాయనునట్లు ప్రకాశించుచుండును.

భక్తుల సౌకర్యార్థమై ఈ క్రింది శాశ్వత కైంకర్యములు ఏర్పాటు చేయబడినవి.

భక్తుడు చెల్లించినచో సం.రంలో ఒక రోజు తమ గోత్ర నామములతో చేయబడు ఉత్సవములు పూజలు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శాశ్వత బ్రహ్మోత్సవము | రు. | 7,000 | |
| 2. | శాశ్వత కళ్యాణోత్సవము | రు. | 2,500 | |
| 3. | శాశ్వత సహస్రనామార్చన | రు. | 116 | |
| 4. | శాశ్వత లక్ష్మి సహస్రనామార్చన | రు. | 116 | |
| 5. | శాశ్వత నిత్య ప్రసాదవితరణ | రు. | 516 | |
| 6. | శ్రీ ఆంజనేయస్వామికి ఆకుపూజ | రు. | 1600 | మంగళవారం |
| 7. | శాశ్వత స్వామివారి నిజాభిషేకం | రు. | 5,000 | |
| 8. | అమ్మవారి అభిషేకం | రు. | 3,000 | |

గమనిక : భక్తుడు డబ్బు చెల్లించిన తదుపరి ఒక సంవత్సరము తరువాత పూజలు ప్రారంభించబడును.

ఈ క్షేత్రము హైదరాబాదు విజయవాడ రైలు మార్గములో రాయిగిరి స్టేషనుకు నాలుగు కి.మీ భువనగిరి రైలు స్టేషనుకు పదిహేను కి.మీ దూరములో కలదు. హైదరాబాదుకు సుమారు అరవై కి.మీ దూరములో కలదు. సుదూర ప్రాంతముల నుండి ఈ క్షేత్రమునకు బస్సు సౌకర్యం కలదు. కొండపై వరకు ఘాట్ రోడ్ కలదు.

ముఖ్య గమనిక : పూజలకు మరియు ధర్మశాలల నిర్మాణమునకు లేక ఏ ఇతర విరాళములు ఇచ్చిన భక్తులకు ఆదాయపు పన్ను నుండి సెక్షన్ 80 జి. క్రింద మినహాయింపు సౌకర్యము కలదు.

విశేష పూజలతో, శ్రీ సత్యనారాయణ వ్రతములతో కలియుగ వైకుంఠముగా వెలుగొందు చున్న శ్రీ లక్ష్మి నరసింహ స్వామిని దర్శించి తరించండి.

**బి. నరసింహమూర్తి**
వంశపారంపర్య ధర్మకర్త

**పి.జి. చౌదరి**
కార్యనిర్వహణాధికారి





# శ్రీకాళహస్తి
## చిత్తూరుజిల్లా (ఆంధ్రప్రదేశ్)



ఆంధ్రదేశమున గల అనేక క్షేత్రములలో శ్రీ కాళహస్తి మహా క్షేత్రము పరమ పవిత్రమైన క్షేత్రము. ఈ క్షేత్రము దక్షిణ కైలాసము, సత్యవ్రత మహా భాస్కరక్షేత్రము, సద్యోముక్తి క్షేత్రము శివానందైక నిలయమని అనేక నామాంతరములతో ప్రసిద్ధి గా ంచు చున్నది.

సాలీడు, సర్పము, ఏనుగు ఈ మూడు జంతు రాజములు ఈశ్వరుని ఆరాధించి పూర్వ జన్మ శాప విమోచనము పొంది మోక్షమొందినవి. అందువలననే శ్రీకాళహస్తి అని ఈ క్షేత్రమునకు-సార్థక-నామధేయ మేర్పడినది.

పంచభూత శైవ క్షేత్రములలో శ్రీకాళహస్తి ప్రసిద్ధి చెందినది కంచిలో పృధ్వీలింగము, జంబు కేశ్వరంలో జలలింగము తిరువణ్ణామలైలో తేజో లింగము శ్రీకాళహస్తిలో వాయులింగము చిదం బరంలో ఆకాశ లింగము-ఇవి పంచభూత క్షేత్రములు.

ఇచ్చట సువర్ణముఖీ నది దక్షిణ కైలాసమనే కొండలోయలో నుండి ఉత్తర వాహినిగా బ్రహ్మదేవుని వర ప్రసాదముచే ప్రవహించు చున్నది. అగస్త్య మహా ముని తపః ప్రభావముచే భువికి దిగి పావనము చేయు దివ్య ప్రవాహము. ఈ దేవాలయం ధర్మార్థ కామ మోక్షములనెడి చతుర్విధ పురుషార్థములను వ్యక్త పరచుచున్నది. శరీరావయ నిర్మాణ క్రమముతో శిల్ప సౌందర్యము కళాపూరితమయి యున్నది.

శ్రీకాళహస్తీశ్వరాలయం నందు నిత్యాన్నదానం ను ప్రారంభించుటకు చర్యలు గైకొనబడుతున్నాయి. భక్తులు దాతల విరాళాలను ఆలయముపకు సమ ర్పించి రశీదులు పొందవచ్చు. దాతల కోరికమీద వారు కోరిన రోజున వారిపేరున అన్నదానము చేయ బడును. విరాళములు రు. 1,116 అంతకు పై నుండి స్వీకరించబడును. ఆ డబ్బు బ్యాంకు నుందు డిపా జిట్ వేసి అందుపై వచ్చు వడ్డీ పైకముతో నిత్యాన్న దాన కార్యక్రమము జరుపబడును.

దక్షిణ కైలాస పర్వతములైన భక్త కన్నప్ప కొండపై కాటేజీల నిర్మాణములకు దాతలు సహ కరించాలని కోరుతున్నాము. విరాళాలను విరివిగా యిచ్చి కార్యక్రమములకు సహకరించి శ్రీ స్వామి వారి ఆశీస్సుల పొందమని ప్రార్థన.

1. శ్రీస్వామి అమ్మవార్లకు రు 6.5 లక్షల వ్యయముతో రెండవ క్రొత్త రథము నిర్మాణమునకు

2. శ్రీ కుమార స్వామి వారి దేవస్థానమును రూ. 10 లక్షల వ్యయముతో పునర్నిర్మాణము,

3. శ్రీ కృష్ణదేవరాయలచే నిర్మించిన రాజ గోపురమును రూ 15 లక్షల వ్యముతో మరమ్మత్తు చేపట్టబడు పని

4. యాత్రికులకు వసతి గృహములు రూ 30 లక్షల వ్యముతో నిర్మించుట,

5. దేవాలయములో అద్దాల మండపము నిర్మించుట,

6. శ్రీ మణికంఠేశ్వరస్వామి దేవాలయమునకు రూ. 10 లక్షల వ్యయముతో జీర్ణోద్ధరణ చేయుట,

7. యాత్రికుల సౌకర్యార్థం లక్ష రూపాయల వ్యయంతో స్నానపు గదుల నిర్మాణం వివిధ దశల్లో వుంది.

8. కన్నప్ప నేత్రాలయ నిర్మాణం.

పై నిర్మాణ కార్యక్రమముల కొరకు భక్తులు సమర్పించుకొను విరాళములను విరివిగా కార్య నిర్వాహణాధికారి వారి కార్యాలయమునకు డ్రాఫ్ట్, చెక్కు లేక మని ఆర్డరు ద్వారా పంపినచో స్వీకరించబడును.

**భక్తులకు ఈ క్షేత్ర సందర్శనం మహా భాగ్యం !**

కార్యనిర్వహణాధికారి

శుభమస్తు – సర్వేజనాస్సుఖినోభవన్తు





# అన్నవరం
## (తూర్పు గోదావరి జిల్లా)
## (ఆంధ్ర ప్రదేశ్)

తూర్పు గోదావరి జిల్లా అన్నవరంలో వేంచేసిన శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామిని తెలియని ఆంధ్రులుండరంటే అతిశయోక్తి కాదు.

ప్రతియింటా శ్రీ సత్యదేవుని పటమో, ఆయన వ్రత పుస్తకమో వుండి వుంటుంది. ఆ స్వామి పేరుతో ప్రతి యింటా ఒకరుంటారు. మన మనసులలో గొప్ప స్థానాన్ని పొందిన మహిమగల దేవుడు శ్రీ సత్య దేవుడు. శ్రీసత్యదేవునికి ఒక శతాబ్దముగ బహుళ ప్రచార మందించిన దివ్యక్షేత్రము అన్నవరము.

ఈ స్వామి మహిమలు, చరిత్ర స్కాంద పురాణ మున రేవాఖండమున విపులీకరింపబడినవి. అనాదిగా గృహస్థులెల్లరు శ్రీ సత్యదేవుని వ్రతమాచరించుచు, ఆయన కథలు వినుచు, గొప్ప మానసికానందము పొందుచున్న శ్రీ సత్యదేవుడు మన ఇలవేలుపుగా ప్రసిద్ధికెక్కిన మహిమగల దేవుడు.

పవిత్ర పంపానదీ తీరాన రత్నగిరి సానువుల దరి అన్నవరం గ్రామం ప్రక్కన ఖర నామ సంవత్సర శ్రావణ శుద్ధ విదియనాడు శ్రీ సత్య దేవుడు స్వయం వ్యక్త మైన దివ్య క్షేత్రమిది. అప్పటి పరిపాలకులు శ్రీ సత్యదేవుని విగ్రహమును పూజాపునస్కారములతో ప్రతిష్ఠ గావించి ధన్యతములైరి.

ఈ దేవాలయ నిర్మాణము రథము వలెనే కాక రెండంస్తులుగా జరిగినది. పై అంతస్తులో ఎడమవైపు శ్రీ అనంత లక్ష్మి సత్యవతీ సమేతుడై శ్రీ సత్యదేవుడు కుడివైపు శ్రీ గరళకంఠునితో కొలువై యున్నాడు. అందువలన యీ క్షేత్రము హరిహరు లకు సంగమ స్థానమైనది. హిరణ్య గర్భుడిగా ప్రసిద్ధి కెక్కిన ఈ సత్యదేవుని క్షేత్రము ప్రత్యేకతను కలిగి యున్నది. ఇంత మహిమ గల క్షేత్రము మన దేశమున మరి యొకటి లేదు.

ఈ దేవాలయ దిగువ భాగమున మహా యంత్రము పీఠ మధ్యస్థమున శ్రీ సత్యదేవుని హరిహర హిరణ్యగర్భ త్రిమూర్త్యాత్మక స్వరూపముగ ప్రతిష్ఠింప బడి పై భాగాన యంత్రము బీజాక్షర సంపుటితో స్థాపన జరిపించ బడినది. దానిని ఆనుకొని మధ్యలో బిందు రూపముగ స్థంబాకృతి శ్రీ సత్యదేవుని స్వయం వ్యక్త మూర్తిని స్థాపించినారు ఆనాటి భక్త జన శిఖామణులు.

అపూర్వమైన యిట్టి యంత్రరాజము భక్త జన సందోహాన్ని ఆకర్షిస్తున్నదనడంలో అతిశయోక్తి లేదు. ఈ యంత్రము శ్రీత్రిపాదవిభూతినారాయణ ఉపనిషద్ మంత్రముననుసరించి స్థాపించబడినది.

ఈ యంత్రమునకు నాలుగు దిక్కుల యందు శ్రీ గణపతి, సూర్యనారాయణ స్వామి, శ్రీ బాల త్రిపుర సుందరి, మహేశ్వర స్వామి వార్లు స్థాపింప బడినారు. ఈ యంత్రమందు శ్రీ సత్యదేవుడు స్థితుడై నందున ఈ క్షేత్రము శ్రీవిష్ణు పంచాయతనముగ ప్రసిద్ధి చెందినది. మన దేశములో యిట్టి యంత్ర సంపుటి గల క్షేత్రమెచ్చటను లేదు.

ప్రకృతి సహజ సౌందర్యమీ క్షేత్రమునకుపెట్టని అలంకారమై, తూర్పు కనుమలనానుకొని ప్రవహిస్తున్న పంపానది, రత్నగిరి సహితమై ఆహ్లాదకరముగ భాసిస్తున్నది.

ఈ క్షేత్ర పాలకులుగ శ్రీ సీతారాములు, యీ క్షేత్ర సంరక్షకురాలుగ శ్రీ వనదుర్గ, అన్నవరం గ్రామ దేవతగా శ్రీ కనకదుర్గ ఈ క్షేత్రమునకు సంపూర్ణతను చేకూర్చినారు.

శ్రీ సత్యనారాయణ వ్రతములకు ఈ క్షేత్రము బహు ప్రసిద్ధి కెక్కినది. పరమ పవిత్రమైన యీ క్షేత్ర దర్శనముతో భక్త జన సందోహము ఆనందోత్సాహములతో నిత్యము దర్శనీయ మగుచున్నది.

భక్తుల సౌకర్యము కొరకు నిత్యాన్నదాన పథకము ప్రవేశపెట్టబడి అమలు పరచబడుచున్నది. ఉదయం ఆరు గంటలనుండి రాత్రి ఎనిమిది గంటల వరకు భక్తులు స్వామిని సేవింపవచ్చును. వ్రతములు జరుపు కొనవచ్చును. పర్వదినములలో ఇంకను ఎక్కువ సమయము స్వామి దర్శనానికి వీలు కలిగిస్తున్నారు.

ఎల్లరు శ్రీ సత్యదేవుని కృపకు పాత్రులు కాగ లరని ఆకాంక్ష.

కార్యనిర్వహణాధికారి,
**శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామి దేవస్థానం**
అన్నవరం-తూర్పుగోదావరి జిల్లా.



# బంగారము : దేవాలయములు

ప్రపంచంలో ప్రజల జీవనవిధానం, బంగారానికి అత్యంత విలువను, ప్రాధాన్యాన్ని ఇస్తున్నది. ఈ విలువ రోజు రోజుకి పెరుగుతున్నది.

బంగారం నిల్వలు ఎక్కువగా ఉన్న దేశమే బలవంత మైనది. శక్తి వంతమైనది. ఉన్నతమైనది. గౌరవనీయ మైనది. సువర్ణాధిక్యత వలన ఇట్టి గౌరవస్థానమాదేశము నకు కలుగుచున్నది.

ప్రత్యక్ష దైవమైన శ్రీ సూర్య భగవానుడు హిరణ్య గర్భుడుగా పిలువబడుచున్నాడు. శ్రీ లలితా మహా దేవికి శిరోభూషణము మొదలు మట్టెల వరకు గల కాళికా పురాణమునందు చెప్పబడిన, నలుగుబది నాలుగు బంగారు ఆభరణ ములచేతను, కల్ప సూత్రమందు చెప్పబడిన ఇతర బంగారు నగల చేతను అలంకరింపబడినదిగా చెప్పబడినది.

ఏడు పార్థివ (యజ్ఞ) సంబారములయందు సువర్ణము కావలసి యున్నది.

సువర్ణము పవిత్రమైన వస్తు విశేషము. దాతను శుద్ధునిగను, పవిత్రునిగనుచేయు వస్తువు. అంతేకాక హిరణ్యదానముచే ఇతనికిమృదువగు అన్నము లభించును.

లోకములో పురుషుడు అనేక విధముల అశుచిత్వ మును పొందును. అందుచే అభోజ్యాన్నమైన అన్నము కలవాడగును. వైశ్వానరాగ్ని ఇతనిని పవిత్రము చేయును ఈకర్మలో హిరణ్యమును దక్షిణగ నీయవలెను. హిరణ్యము పవిత్రమైనదగుటచే అపవిత్రుడగు యజమానిని పవిత్రు నిగ చేయును.

రాజసూయాంతర్గత అభిషేచనీయమను సోమ యాగములో మహారాజునకు అభిషేకము చేసెదరు. అభి షేక నిమిత్తమై సమాయత్తపరుపబడిన సరస్వతీనది, సముద్రము మున్నగువాటి జలములను మంత్ర సంస్కారము జరిపిన పిదప శతమానమగు (నూరు గురి వెంద గింజల యెత్తు ప్రమాణము) హిరణ్యమును ఆ ఉదకములయందు మంత్ర పూర్వకముగ, ఉత్పవనము చేయవలెను. హిరణ్యగతమగు శతసంఖ్యచే పురుషుడు సంపూర్ణాయుషునందును, ఇంద్రియములందును ప్రతిష్ఠి తుడగును.

బంగారము యవాది ధాన్యములవలె అగ్ని సంయో గమున్నను పక్వముకాదు. వాక్కునకు బంగారము బంధువుగా చెప్పబడినది. ధనముండుటచే రాజులు మంత్రులు మున్నగువారి వాక్కును అందరు ఆదరించె దరు.

బంగారము అమృతము వంటిది. ఎందువలనంటే మరణ రహితమైనది. రాజసూయాది క్రతువులలో విని యోగము ద్వారా సువర్ణము అపమృత్యు నివారకము, సుఖ సంధాయకము అని శ్రుతులు ప్రశంసించుచున్నవి. కావు ననే వివాహములందు సువర్ణ మంగళసూత్రము (శత మానము) అపమృత్యు నివారణ ద్వారా, సుఖ సంధానము కొరకు, ధరించుట ఆచారమగుచున్నది.

ఈ విధముగ హిరణ్యము అతి ప్రశస్తమైనది కావున స్మార్తకర్మలో గూడ దీనిని వినియోగించుట కలదు.

బ్రహ్మచారి గురుకులములో, ఉపనయనానంత రము వేదాధ్యయనాదులు సలిపి ఇంటికి వచ్చిన పిదప స్నాతకవ్రతము జరిపెదరు. ఆస్నాతకములో బంగారు కర్ణా భరణములు రెండు తీసికొనివచ్చి 'దర్వి' అనుహోమ పాత్రయందు వాటిని ఉంచి ఆదర్వియందు ఆజ్యమును పోసి, ఆ ఆజ్యమును "ఆయుష్యం" ఇత్యాది మంత్రము లచే హోమము చేయవలెను. పిమ్మట ఆ హోమపాత్ర నుండి ఆ కర్ణా భరణములను తీసి చెవులకు సమంత్రముగ ధరించవలెను.

హిరణ్య దానముచే అపమృత్యువుతొలగును. గాన హిరణ్యము ఆయుస్సునకు కారణము, హిరణ్య ధారణ శోభ నిచ్చును గాన అది వర్చో హేతువు హిరణ్యవంతునకు కీర్తి యుండును. కాని అది కీర్తికి కారణము, హిరణ్యవంతునకు సర్వకార్యములందును విజయమును మనము చూచు చున్నాము.

హిరణ్యము కలిగినవాడు అసత్యము పలికనను ప్రజలు నమ్మెదరు. కాన హిరణ్యము సత్యమును తిరస్క రించునట్టిది. శత్రువుల ధనమును జయించుటకు సాధన మైనది. సర్వసమృద్ధులును సంపూర్ణముగ హిరణ్యము నందు స్థాపితములైనవి.

పూర్వము ప్రజాపతి ప్రజలను ఉత్పాదన చేయ వలెనని కోరుచున్న వాడగుచు తపస్సుచేసెను. అపుడు ప్రజాపతి తన అభీష్టసిద్ధికి సాధనముగ కొంచెము హిణ్యమును ఉత్పాదన చేసెను. దానిని జఠరాగ్నియందు నిక్షిప్తముచేసెను. బాహ్యాగ్నియందు ప్రక్షిప్తమగు హిరణ్యము కొంచెమైనను కార్యము నెరవేర్చలేదు. అందువలన బహిర్గతమైన సువర్ణమే కార్యసాధనమగును. అందువలన బంగారు ఆభరణములు ధరించి బహిర్గతము చేయుట జయకారణమైనది.

ఈ విధముగ సర్వలోహములలో ఉత్కృష్టమైన హిరణ్యము యొక్క దానమును, ప్రతిగ్రహమును కూడ విశేషించి విపులముగ చెప్పుచు, శ్రుతి, హిరణ్యమును అనేక శ్రేయస్సులకు సాధనముగ వక్కాణించినది.

మహాత్ములకు, భోజనము చేసిన పిదప హిరణ్య దక్షిణ నివ్వవలసినదిగ శ్రుతి చెప్పుచున్నది.

అవధానము, యజ్ఞము చేయు యజమాని ఆయు ష్కామేష్టియనియు, కుండలేష్టియనియు రెండు సామలచే వ్యవహరింపబడెడు ఇష్టిని చేసి చెవులకు కుండలములను ధరించవలెను.

సువర్ణము నుండి పానము, అమృతము నుండి పానము గనుకనే అన్నప్రాసనలో సువర్ణ నిర్మితమైన అంగుళీయకమును (ఉంగరమును) దర్భచే జారుముడి వేసి ఆ ఉంగరముచే క్షీరాన్నము (ద్రవ్యమును) కుమారు నిచే ప్రాశన చేయింతురు. ఇది ప్రాథమికాన్నప్రాశన.

హిరణ్యము సామవేద రూపము కనుక హిరణ్య దానము తేజఃప్రాప్తి, సామ వేద ప్రాప్తియగు మహాఫలము బోధింపబడుచున్నది. హిరణ్య దానముచే, హిరణ్య సదృశ మగు జోతిస్సుకలవాడై స్వర్గలోకమునుపొందును. అందు వలన బంగారముతో చేసిన పుస్తెలను విజ్ఞులు దానము చేసి విశేష ఫలమును పొందుచున్నారు.

పై విధముగ సువర్ణము ప్రశస్తమైనది కావున పురుషునిచే హస్తకర్ణాదులయందు ధరించి, ఈ ధారణచే లోక ద్వయమందు రమణీయుడగును. అందువలన తిరస్కారము, అప్రియముపొందడు. పూర్వమీమాంసా శాస్త్రములో ఈ సువర్ణధారణము పురుషార్థమని విమర్శించి, సిద్ధాంతీకరించినది గాన లోకమున 'సువర్ణ ధారణము' విహితమైనది.

దేవాలయములయందు దేవునకు అలంకారము లుగ సువర్ణము ప్రాముఖ్యమునకువచ్చెను. గర్భగుడిపై బంగారము తొడుగుగా బహిర్గతముచేయుట అవసర మాయెను. అందువలన ఆ దేవుడు, ఆ గుడి మహిమా న్వితమై, అమృతోపమానమై, సమృద్ధికి హేతువై దినదిన ప్రవర్థమానమగుచు, న్యూనత రహితమై శ్రుతి సిద్ధమై వెలుగొందుట మనము ప్రత్యక్షముగ చూచుచున్నాము కదా.

ప్రజాపతి సువర్ణమును సృష్టించి ఎవడైనను చేతను డగు పురుషునకు హిరణ్యరూప దక్షిణ నివ్వవలెనని అన్వేషణ చేసి అట్టి చేతనుడగు పురుషుడు హిరణ్యమును ప్రతిగ్రహిం చెడివాడు లభించక పోవుటచే తన దక్షిణ హస్తము కొరకే ఆ హిరణ్య రూపమగు దక్షిణ నిచ్చెను. కార్య సామర్థ్యము కొరకే దక్షిణారూపమైన హిరణ్యమును ప్రతిగ్రహించు చుంటినని పలుకుచు ప్రజాపతి ఆ దక్షిణను గ్రహించెను. అనంతరము ప్రజాపతి సమర్థుడాయెను. కావున దేవునికి హిరణ్యము సమర్పించుట వేదవిహితము ధర్మసమ్మతమైనది.

అందువలన మన సంస్కృతి సంప్రదాయముల ననుసరించి దేవునకి సువర్ణమును మ్రొక్కుబడులుగ సమర్పించుట ఆచారమాయెను. నిలువుదోపిడిలుగ బంగారము సమర్పించుట ఎంతో ప్రాముఖ్యమునకు వచ్చెను.

# గోవు విశిష్ఠత : గోసేవ

మన సంస్కృతి, సంప్రదాయముల ననుసరించి గోవు ఎంతో ప్రాముఖ్యమును చెందినది.

సర్వసమర్థుడగు జగదీశ్వరుని, సృష్టియందు గల అన్ని విచిత్రములలో మాతృదేవతా సృష్టి కడు ఆశ్చర్యము గను ఆనందముగను, ప్రయోజనకారిగాను ఉన్నది. మాతృ దేవతను సృష్టించి భగవానుడు తన భక్తులను తానే ఏర్పరచుకొన్నట్లయినది. భక్తికి మాతృదేవత దీవనలే అత్యంత అవసరమగుచున్నది. అందుకనే మన పెద్దలు తల్లిని మించిన దైవము లేదనన్నారు. "మాతృదేవోభవ" అని కదా ఆర్యోక్తి.

మన కిద్దరు తల్లులుగా మన జీవనసరళిలో మాతృ దేవత తరువాత స్థానం గోమాత ఆక్రమించినది. మన జీవన విధానం గోమాత పై కేంద్రీకరించి ఉన్నదని, అట్టి స్థానం అలాగే ఉంటుందని రూఢి అయినది. గోవుకు ఇస్తున్న ప్రాధాన్యత గోమాత మనకిస్తున్న పవిత్ర వస్తు సముదాయముతో పోలిస్తే చాలా తక్కువే ననిపిస్తుంది.

గోవే లేకున్నట్లయితే మానవుని మనుగడ సాఫీగా జరగడానికి అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయి. ఎందుకనగా గోవులు మనలను పోషిస్తున్నవి కనక.

పూర్వము ప్రజాపతి అచేతనములగు నదులు పర్వతములు మున్నగువాటిని సృజించి, జీవాత్మతో కూడిన చేతనమగు వస్తుజాతము అగ్ని యందు ఉత్పన్నము కావలెనని కోరి అగ్నియందు ఉత్పత్తికి సాధకమగు హోమ మునుచేసెను. ఆ హోమమంత్ర ప్రభావముననుసరించి అగ్ని, వాయువు, ఆదిత్యుడు జనించిరి. అనంతరము అగ్ని మున్నగువారు పరస్పరము విచారించి ప్రజాపతి హోమమువలన, చేతనులమగు మనమెట్లు జనించితిమో అట్లే మనకుగూడ జీవాత్మ పేతమగు చేతన వస్తువు పుట్టుగాక యని మాట్లాడుకొని, కృతనిశ్చయముతో హోమము నడిపిరి. అగ్ని "ప్రాణేభ్య స్స్వాహా" అను మంత్రముచే ప్రాణముల కొరకు హోమము చేసెను. శరీరము కొరకు వాయువు హోమము చేసెను. చక్షుల కొరకు ఆదిత్యుడు హోమము చేసెను. ఆ ముగ్గిరి హోమము వలన గోవు ఒక్కటియే ఉత్పన్నమయినది (కృ.య.బ్రా.౭కాం).

గోవునకు అందువలన వేద ప్రమాణమైన ప్రాముఖ్యము కలదు. గోక్షీరం కోసం అగ్ని, వాయువు, ఆదిత్యులు వివాదగ్రస్తులయినట్లు కృష్ణ యజుర్వేద బ్రాహ్మణమునందు చెప్పబడినది. అగ్ని సంబంధమగు హోమము వలన గోవు జనించుట వలన గోవునకు అగ్నిహోత్రమని పేరు వచ్చినది.

గోక్షీరము వలన, కవ్వముచే మథించిన పిదప, ఉత్పన్నమైన వెన్న, నెయ్యి దేవతలకు ప్రియమైనవి.

వెన్న మూలభూతమగు పాలను గూర్చి కృష్ణ యజుర్వేదములోని శ్రుతి వివరించుచున్నది.

'లభివాన్యాయై దుగ్ధే భవతి సాహి పితృదేవత్యం దుహే! (కృ.య.బ్రా. 1కాం. 6 ప్ర).

ఈ శ్రుతిననుసరించి సజీవమగు దూడగల గోక్షీరములు ప్రశస్తములని తెలియుచున్నది.

దేవగణములకు ఎన్నో గోగణములున్నవని ఈ వేదము వలన తెలియుచున్నది. ఇంద్ర పురోహితుడగు బృహస్పతికి ఎన్నో గోవులున్నట్లు తెలియుచున్నది.

యజ్ఞయాగాది, కృతువులందును, పితృకర్మల యందును గోదానము, హిరణ్యదానముతో చేయవలెనని శ్రుతి బోధించుచున్నది.

గోవును, గొఱ్ఱెను, అశ్వమును దేనిని హింసింప వద్దని, సర్వభూతములను సమదృష్టితో చూడమని వేదములు శాసించుచున్నవి.

పాలు యిచ్చు గోవులు మిక్కిలిగా నున్నచో అన్న రసముల మిక్కిలిగా లభించును. గోవులున్నయిల్లు, గ్రామము, రాష్ట్రము, దేశము సర్వసమృద్ధమగును.

అంతేకాక గోవునకు అనేక దేవాలయ క్షేత్ర మహాత్మ్యములతో విశేష సంబంధము కలదు.

ప్రఖ్యాత శైవ క్షేత్రమైన శ్రీశైల స్థల పురాణము ననుసరించి చంద్రావతి అనే రాజకుమారి తన ఆవులను కాసే గోపాలుని కథనాన్ననుసరించి గోవుపాలివ్వక ఆ గోవు తన పాలను శివలింగముపై పోయుచుండెను. తద్వారా శివలింగము బయటపడెను. అదియే శ్రీశైల దేవాలయము కట్టబడిన స్థలము.

అటులనే కపిల మల్లేశ్వరస్వామి స్థల పురాణము ననుసరించి ఒక కపిల గోవు ద్వారా ఈ స్వామి వ్యక్త మయ్యెను.

కడప జిల్లాలోని సంగమేశ్వర దేవాలయము (అనిమెల). రాజపాళెంలో ఒక రైతు వద్ద సాధువైన ఆవు ఉండెడిది. ఆ గోవుపాలిచ్చు దినములలో ప్రతి దినము సంగమేశ్వరు డున్న పుట్టలో తన పాలను విడిచి ఇంటికి వచ్చెడిది. తద్వారా పుట్టలోను శ్రీ సంగమేశ్వరుడు బయలుపడెను.

అటులనే శ్రీత్రేతేశ్వరస్వామి పరశురామక్షేత్రము (హత్సరాల) యందు గోవు ద్వారా బయటపడెను.

ఇంకను అనేక ఇతిహాసములు, చరిత్రల వివరముల ననుసరించి గోవు మన జీవనమునందు ప్రముఖ పాత్ర వహించుచున్నది. మనకు గోమాత పరమ పవిత్రమైనది. పూజనీయమైనది. అందువలన గోసేవ మన జీవన విధానములోనున్నది. గోసంరక్షణ మన ప్రథమకర్తవ్యమై యున్నది. ఈ కర్తవ్యము మనము మరువకుందుము గాక.



# కృష్ణాజిన మహత్త్వము

ఉపనయనము, యజ్ఞయాగాదులు, చైనము మొదలగు సర్వకర్మలయందును కృష్ణాజినము అనగా లేడి చర్మమును ఉపయోగించుట సంప్రదాయముగ నున్నది. ఈ ఆచారము అనాదిగ వస్తున్నది.

కృష్ణాజిన మహత్త్వము వేదములలో చెప్పబడినది.

'హరిణస్యరఘుష్యదోధి శీర్షణి భేషజం।

సక్షేత్రియం విషాణయా విషూచీన మనీనశత్

(అ.వే. సం. 3. కాం. 2 అను)

తొందర తొందరగా నడిచెడి లేడి యొక్క శిరస్సునందు రోగములను దగ్గరకు రానీయని శృంగరూపమగు (కొమ్ముల రూపమున) ఔషధమున్నది. ఈ కొమ్మునందు (దుప్పికొమ్ము) తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిన మహావ్యాధులను తొలగించెడి ఔషధ విశేషము కలదని స్పష్టముగ అథర్వణవేదము చెప్పుచున్నది.

అథర్వణవేదమునందు హరిణమును తన నాలుగు పాదముచేతను (తల్లిదండ్రుల ద్వారా సంక్రమించిన) వ్యాధులను పీడించి, తొలగించవలెనని ప్రార్థన చేయబడినది. రోగి గుండెల యందు దృఢముగ నాటుకొనియున్న క్షేత్రియ రోగములను నశింపజేయు మని ప్రార్థన కలదు.

భూమియందు పరువబడి మనచే చూడబడుచున్న లేడి చర్మము ఇంటిపై కప్పువలె భాసించుచు క్షయ, కుష్ఠాది రూపముగ బహువిధమగు నీక్షేత్రియ రోగములను సర్వావయములనుండి నశింపజేయుమని కోరడము జరిగినది.

అంతేకాక, అట్టి రోగములకు చికిత్సా విధానము కూడ చెప్పబడినది అథర్వణవేదములో. 'హరిణస్య' అనే సూక్తములో. ఈ సూక్తమునననుసరించి, రోగి యొక్క హస్తమందు లేడి కొమ్మును కట్టవలెను. మరియు లేడి కొమ్ము నీటిలో వేసి ఆ ఉదకమును పానమును ఆచమనమును చేయించవలెను. శంఖుచ్ఛిద్ర భాగమును కాల్చి, నీటియందు వేసి, ఆ నీటిచే ఉషఃకాలమందు రోగిని స్నానము చేయించవలెను. అనంతరమ యవలను అన్నముగా వండి ఈ సూక్తముచే హోమము చేసి, శేషమును ఈ సూక్తముచే అభిమంత్రణ చేసి, రోగిచే భక్షింపచేయవలెను. ఈ విషయము సంహితావిధి అనుభాగములో కూడ చెప్పబడినది.

యజ్ఞములో కృష్ణాజిన, కృష్ణ విషాణముల యొక్క (కొమ్ములు) అవశ్యకతను గూర్చి యజుర్వేదములో కూడ చెప్పబడినది.

కౌమారీ మహాశాంతి యందు కూడ రోగియైన బాలునకు రోగ నివృత్తి కొరకు హరిణ విషాణము యొక్క ఉపయోగమును నక్షత్రకల్పకారుడు చెప్పియున్నాడు.

'హరిణస్యేతి విషాణాగ్రం కౌమార్యం' ఇతి।

[అ.వే.సం. 3కాం]

ఇంకను యజుర్వేదములో కృష్ణాజిన, కృష్ణ విషాణముల యొక్క అవశ్యకతను గురించి చెప్పబడినది.

ఒకప్పుడు ఋగ్వేదాభిమాని దేవతయు సామవేదాభిమాని దేవతయు ఏదో నిమిత్తముచే యజ్ఞావసరమున తమ స్వరూపమును ప్రకాశింప చేయక ఆత్మ తిరోధానము కొరకు అనగా దేవతలకు తమ శరీరము కనబడకుండ, కృష్ణమృగ రూపమును ధరించి దేవతల నుండి వెడలి, ఒక ప్రదేశమందు రహస్యముగ నుండిరి. అపుడు దేవతలు "ఋక్సామ దేవతలు ఏ పురుషుని పొందునో ఆ పురుషుడు యజ్ఞఫలమును పొందును" అనగా "నిగూఢమైన ఋక్సామ దేవతలు లభించుటచే వేదత్రయము చేత యజ్ఞము పూర్తియగును. అందువలన యజమానుడు సంపూర్ణ ఫలమును పొందును" అని ఆలోచించి ఆ ఋక్సామ దేవతలను స్వాధీనము చేసికొనిరి. పిదప ఆ దేవతలు, అహోరాత్రముల మహిమరూపమగు శుక్ల, కృష్ణ రూపద్వయమును, తమ మృగరూపమునందు (హరిణ రూపమునందు) స్థాపనచేసి, దేవ సమీపమునకు వచ్చినవి.

అనగా ఋగ్దేవత అహస్సు యొక్క శుక్ల రూపమును స్వీకరించి, కృష్ణాజినముపై శుక్లరేఖగా ఏర్పడెను. సామ దేవత రాత్రియొక్క కృష్ణరూపమును గ్రహించి కృష్ణాజినముపై కృష్ణరేఖగా ఏర్పడెను. అందువలన లేడి చర్మముపై (కృష్ణా జినము) తెల్లని నల్లని రెండు రంగుల చారలు, (మచ్చ లుండును). వాటిలో తెల్లని మచ్చ ఋగ్వేద రూపము, నల్లని చార సామవేద స్వరూపము.

కావున ఋక్సామ వేదముల స్వరూపమగు కృష్ణాజినముచే యజమానుని, దీక్ష చేయించవలసినదిగా శ్రుతి చెప్పియున్నది. కృష్ణాజినమును అంతర్వేది యందు పరచి దానిపై యజమానుడు కూర్చొనుట మొదలగు సంస్కారములు సమంత్రముగా జరిపెదరు.

'కృష్ణజినేన దీక్షయతి, బ్రహ్మణోవాఏత ద్రూపం
యత్కృష్ణాజినం బ్రహ్మణైవైనం దీక్షయతి'
(కృ.య.సం.6-1-3)

అధ్వర్యుడు ఒక కృష్ణాజినముచేగాని, రెండు కృష్ణాజినములచే గాని యజమానుని దీక్షాయుక్తునిగా చేయవలెను. తరువాత సమంత్రముగ కృష్ణా జినము యొక్క శుక్ల, కృష్ణ రేఖలను తాకవలెను.

శ్రీ విద్యారణ్యుల భాష్యముననుసరించి, ఈ శుక్ల, కృష్ణరేఖలు తాకుట చేత ఋక్సామదేవతా ప్రాప్తియేకాక, ఋక్సామలందు నిగూఢమగు అహోరాత్ర సంబంధమగు శుక్ల, కృష్ణ వర్ణరూపమగు సారమును గూడ పొందినవాడగును.

కృష్ణా జినము వేదరూపమైనది కావున వేదోక్త మంత్రముచేతనే యజ్ఞ సమాప్తిని పొందవలెను. కృష్ణాజినమును నావగా నిరూపించి దానిని సమంత్రముగ ఆరోహణ చేసి యజ్ఞసమాప్తిని పొందవలెనని శ్రుతి చెప్పుచున్నది.

సమంత్రముగ కృష్ణ మృగము యొక్క కొమ్మును యజమానుడు గ్రహించి తనహస్తమునకు (మణికట్టుకనకు) కట్టుకొనవలెను.

అంతేకాక పరమశివుని వామ హస్తమున లేడి ధరించుట, మనమెరిగినదే.

గౌతమ బుద్ధుడు తన మొదటి ధర్మోపదేశము లేళ్ళ వనములో జరిపెను.

అందువలన లేడి మన హిందూధర్మమునందు ఉన్నత స్థానమునందున్నది.

యజ్ఞ పురుషుడు కూడ కృష్ణమృగ రూపమును ధరించినట్లు శ్రుతి బోధించుచున్నది. కృష్ణాజినము 'వేద స్వరూపమే కాక' యజ్ఞోవై విష్ణుః' అను శ్రుతిననుసరించి విష్ణురూపమని కూడ తెలియుచున్నది. కావున కృష్ణాజినము, మహామహిమోపేతమని స్పష్టమగుచున్నది.



# "స్వాహా" అనగా...

'స్వాహా' యను మంత్రోత్పత్తి జరుగుటకు ముందుగా విచారణ (ప్రాదుర్భావము) ప్రారంభమగుట తెలిసికొనవలెను.

పూర్వము, ప్రజాపతి యొక్క స్వేదోదకము ఘృతరూపమైనట్లుగా శ్రుతి చెప్పుచున్నది. అంతనా ప్రజాపతి ఆ ఘృతమును అగ్నియందు హోమము చేయదలచి హస్తముతో గ్రహించి తన మనంబున "ఈ ఘృతము స్వేద జలరూపము కావున అపవిత్రమైనది. హోమము చేయుటకు పనికి వచ్చునా? లేదా?" యను సంశయము జనించెను. ఈ సంశయమునకు 'విచికిత్సా' అని పేరు. ప్రజాపతికి హోమ విషయమున సంశయము జనించి నప్పటినించి లోకమున కార్యారంభమునందు విచికిత్స (విచారము) ప్రారంభమైనదని కృష్ణయజుర్వేదము చెప్పుచున్నది.

"య ఏవం విద్వాన్ విచికిత్సతి।
వసీయ ఏవ చేతయేతే॥" (కృ.య.బ్రా. 2-1-2)

ఈ విధముగ ప్రజాపతి యొక్క విచికిత్సోత్పత్తిని తెలిసికొని, కార్యారంభములందు స్వయముగ విమర్శించి చేయదగిన కార్యమును, పనిని నిశ్చయించు పురుషుడు పొరబడక, వస్తు తత్వమునే నిశ్చయించును.

స్వేదరూపమగు ఘృతమును (నెయ్యి) చేత పట్టుకొని హోమవిషయములలో సందేహగ్రస్తుడగు ప్రజాపతిని గూర్చి అశరీరవాణి "హోమమును చేయుము" అని పలికెను. పిదప ప్రజాపతి "నీవు ఎవరు?" అని ప్రశ్నింపగా, ఆ అశరీరవాక్కు 'నేను నీ సంబంధమగు వాక్కునే" అని జవాబిచ్చెను. ఆ వెంటనే ప్రజాపతి 'స్వాహా' అను మంత్రముచే హోమము చేసెను.

'స్వా' స్వకీయావాక్ జుహుదీత్యాహా = స్వాహా' అనగా స్వకీయమగు వాక్కు హోమమును చేయమని పలికెనని అర్థము.

"సుష్ఠు మదభిప్రాయాను రూపమేవాహ = స్వాహా". అనగా యోగ్యముగ నా అభిప్రాయాను సారముగనే పలికినదని అర్థము.

పై విధమగ ప్రజాపతి ఆ ఘృతమును 'స్వాహా' అను మంత్రముచే హోమము గావించినది మొదలు 'స్వా' 'ఆహా' అను పద ద్వయముగాని, లేక 'సు' 'ఆహ' అను పద ద్వయము గాని కలసి స్వాహా మంత్రము యొక్క స్వరూప మేర్పడెను.

ఈ విధమగు స్వాహాకారోత్పత్తిని తెలిసిన పురుషుడు స్వాహాకార హోమముచే కర్మఫలమును సాధించువాడగును.

ఈ స్వాహాకారోత్పత్తిని తెలిసికొనిన మానవునకు స్వాహాకారహోమము ఎన్నడును వ్యర్థము కాదు. భోగము కొరకే యగును. కావున, స్వాహా కారముచే హోమము చేయవలెనని తాత్పర్యము. ఇట్టి విధి ననుసరించి, శ్రౌత, స్మార్త కర్మలయందు, దర్వీహోమములు స్వాహాకార మంత్రముచే చేయు ఆచారము నేటివరకు గానవచ్చుచున్నది.

పై వివరణననుసరించి స్వాహా శబ్దము దేవతలకు హవిర్దాన వాచకమని తెలియుచున్నది. స్వాహా శబ్దము దేవతలకు హవిస్సు నిచ్చునపుడుపయోగింపబడుచున్నది. ద్రవ్యత్యాగ వచనములందు స్వాహా శబ్దమునకు, శ్రీ లలితా మహాదేవి తదర్థ స్వరూపము. మార్కండేయ పురాణము ననుసరించి, దేవతలకు హవిస్సు సమర్పించునపుడు 'స్వాహా' యని ఉచ్చరించునపుడు శ్రీ లలితా మహాదేవిని ఉచ్చరించినటులేయని బ్రహ్మావాదులు తలంచుచున్నారు. సమస్త యాగములందు 'స్వాహా' యని శ్రీ దేవీ నామోచ్చారణచే సకల దేవతలు తృప్తిని పొందుచున్నారు. పితృగణములు తృప్తి చెందుచున్నవి. 'స్వ' అనగా స్వరము మరియు ఆత్మ. అహ అనగా గతి పొందుట అను అర్థమున

స్వర్గాత్మ అనియు స్వాత్మ అనియు చెప్పబడనిది. తైత్తరీ యోపనిషత్తునందు 'ఆమెయే నీవాక్కు' అని చెప్పబడు టచే స్వాహా శబ్దమునకు తన వాక్కు అని అర్థము.

స్వాహాదేవి మహేశ్వర పీఠమునకు అదిష్ఠాత్రి. పద్మపురాణమునందు "స్వాహాదేవి మహేశ్వరపురమందు -న్నది" అని చెప్పబడినది. అందువలన శ్రీ లలితా మహా దేవికి "స్వాహాయై నమః" అను ప్రయోగముకలదు. అధర్వణ శ్రుతి యందు ఈ విషయమే నిరూపితమైనది.

వాయుపురాణముననుసరించి "ద్విజులు, పరమ శివునికి అగ్ని శరీరము కలదనియు, అతని భార్య స్వాహాదేవి యనియు స్కందుడు కుమారుడునియు తెలిసికొను చున్నారు" అని కలదు.

అందువలన ఏ అర్థము, వివరణననుసరించినను యజ్ఞములందు, పూజలు చేయునపుడు ఈ 'స్వాహా శబ్దము అతి ముఖ్యమైనది.





# మాతృదేవతారాధన

మన భరతవర్షము నందు యుగయుగాలుగా మాతృ దేవతారాధన బహుళ వ్యాప్తి చెందియున్నది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యని మాతృభూమి స్వర్గముకంటెమిన్నయని, ఈ సృష్టికి మూలము మాతృ దేవతా మూర్తియే నని మన నమ్మకము.

దైవము అన్ని తావులయందును ఉండుట కష్ట మని యెంచి మాతృమూర్తులను సృష్టించెనని యూదులు నమ్ముచున్నారు.

నిత్య చైతన్యమూర్తిగా మాతృదేవతను ఆరా ధించెదరని, అట్టి ఆరాధన సృష్టి, స్థితి, లయములకు ఆమెయే మూలాధారమని నమ్ముటచేతనేనని జిర్‌జాన్ ఉడ్రాఫ్ మహాశయుడు నుడివెను. ప్రాచీన కాలము నుండి ప్రకృతినే పరాశక్తిగా భావించి, ఆమె నెన్నియో పేర్లతో కొలిచెడివారని ఆమెయే "ఇసిస్" అని "మేరి" యని మరియు దుర్గయని వివిధ నామములతో పిలవ బడడం జరిగినదని తెలియుచున్నది. ఇట్టి మాతృ దేవతారాధన మనదేశమునందు బహుళ ప్రచారము నంది, కాలప్రభావము వలన అట్టి ఆరాధన తగ్గక యుగయుగములుగా అభివృద్ధి చెందుచునే యున్నది.

ప్రఖ్యాత మహాకవి, వేదాంతి శ్రీ సుబ్రహ్మణ్య భారతి భగవంతుని పితృ దేవతగా ఆరాధించుట అను సరణీయమేయైనా, మాతృదేవతగా ఆరాధించుట అత్యంత సహజమైనదని, అట్టి దేవతామూర్తితో తాదాత్మ్యము చెందు ఆధ్యాత్మిక ఆవశ్యకతను నొక్కి వక్కాణించి యున్నారు. భగవానునిగా ఆమెయే యను భావన అవసరమైనదని మన నిత్యానుభూతి అయి ఉన్నదని చెప్పియున్నారు.

మన సంస్కృతి వలే మాతృదేవతారాధన మన దేశమునందు అతిప్రాచీనమైనది. మోహంజాధారో, హరప్పా త్రవ్వకాలయందు కనుగొనబడిన చిహ్నముల ననుసరించి ఆనాడు మాతృదేవతరాధన బహుళ ప్రచారములోనున్నట్లు తెలియవచ్చినది. వేదకాలము నకు ముందే మాతృదేవతారాధన కలదు. ఋగ్వేద సంహితలో దేవీ సూక్తమునందు వాగ్దేవత మాతృ దేవతకు ప్రతీకయని తెలియుచున్నది. అందు నిస్సహాయు లకు మరియు బాధాతప్తులకే కాక ఈ విశ్వమంతకు ఆమెయే ముఖ్యరాలిగా ఎన్నబడినది. అంతేకాక మిగతా దేవతలకు ఆమెయే ఆధారభూతురా లని వక్కాణించెను. ఆమెయే ఆశ్రితులకు తృప్తిని,

జయమును కలుగజేయుచున్నదని వివరించెను. అధర్వణవేదమునను సరించి, ఆమెయే యీ విశ్వ జీవ కోటికి మాతృమూర్తి. యజుర్వేదములో ఆమె అంబికగా పేర్కొనబడినది. ఉపనిషత్తులు ఆమెయే "ఉమ"యని, హైమవతియని ఆమె గుణగుణములను కీర్తించినవి. బ్రహ్మాండ పురాణములో మాతృమూర్తి విశిష్టత, విపులంగా పేర్కొనబడినది.

బ్రహ్మవైవర్త పురాణమునందు శ్రీకృష్ణ పరామాత్మ మాతృమూర్తిని సేవించినట్లును, పరమ శివుడు త్రిపురాసురసంహారమునకు ముందు దేవీ మూర్తిని పూజించెననియు మరియు బ్రహ్మదేవుడు మధుకైటభులతో పోరు సమయమునను, ఇంద్రుడు దూర్వాసుని కోపమునకు గురి అయినపుడు, మాతృ మూర్తినే ఆశ్రయించిరి.

తులసీ రామాయణములో సీతాదేవి శ్రీ రాముని తననాధునిగ, తనకు లభించునటుల చేయ -మని దుర్గాదేవిని పూజించినది. భాగవతాన్ననుసరించి రుక్మిణి శ్రీకృష్ణుని తన భర్తగా చేయమని దేవిని ప్రార్థిం చినట్లున్నది. కురుక్షేత్ర యుద్ధమునకు ముందు అర్జునుని శ్రీ దుర్గ, మాతృదేవతారాధన చేయమని చెప్పినట్లు భాగవతమునందు కలదు.

తల్లిని పూజించవలెనని చెప్పుచూ, మాతృ దేవతను విశ్వమాతయని, ఆమెయే పరమ దయా మూర్తియని మనము నమ్ముచూ మనగలుగు చున్నాము.

శాక్తేయులతంత్రమంత్రములలోమాతృదేవతా రాధన ప్రత్యేకత సంతరించుకొన్నది. ఆమెయే శక్తి యని ఈ భువన కోశమును నడిపించుచున్నదని నమ్మెదరు. తంత్రమనగా శరీరమును రక్షించునదని అర్థము.ఓంకారము శక్తిస్వరూపముగా పేర్కొనబడినది.

మాతృదేవతారాధన సర్వమతముల యందు ఆచరణలోనున్నది. 'తారా' అనే మాతృమూర్తి టిబెట నులకు, "ఉమ్మ" లేక "ఉమ్మ" బాబిలోనియాలోను, ద్రావిడుల 'అమ్మ' ఇవన్నియు ఉమాదేవిని స్ఫురింప జేయుచున్నవి.

కుషానులకాలమునాటి నాణెముల యందును, మౌర్యుల కాలమునాటి పళ్ళెరముల యందును శివ పార్వతిమూర్తుల రూపములుండుట గమనించబడినది.

క్రైస్తవులు కూడా మాతృదేవతారాధన "మేరీ మాతా"గా మనమెరిగినదే.

భరతఖండమునందు కాశ్మీరమునుండి కన్యా కుమారి వరకు గల ప్రఖ్యాతి పొందిన దేవాలయము లలో శ్రీచక్రము కలిగిన శక్తి పీఠములనేకములు కలవు

కేరళయందలి భగవతి, కాళీ, లలితాదేవి, తమిళ నాడు, కనకదుర్గ ఆంధ్రప్రదేశ్ కర్ణాటకలోని 'ఛాముండే శ్వరి';మహారాష్ట్రలోని 'భవాని', రాజస్థాన్, గుజరాత్ లలో 'అంబిక', బెంగాల్‌లోని 'కాళీ' లేక 'దుర్గ', అస్సాం లోని కామాఖ్య, ఉత్తర ప్రదేశ్‌లోని 'రాధ', 'సీతాదేవి' ఇవన్నియు మాతృమూర్తులే.

స్త్రీ దేవతలను గురించి గోపద బ్రాహ్మణ ములో చెప్పబడినది. అదితి భూదేవిగా, ప్రపంచానికి తల్లిగాచెప్పబడినది. ఆమెయే ప్రపంచాన్ని భరిస్తున్నది.

ఋగ్వేదమునందలి సూక్తములు దేవతాస్తుతి పూర్వకములుగాను, ప్రార్థనా పూర్వకముగా నున్నవి. అదితి, ఇంద్రాణి, వరుణాని మున్నగు స్త్రీ దేవతలు కూడా కలరు. అదితి దేవతల తల్లి. స్త్రీ, పురుషుల దైవములను పూజించెడివారు ఋగ్వేదకాలములో

మాతృమూర్తి కల్పన వేదకాలమునుంచి యున్నదని, ఈ భూమి తల్లి. అగ్నిలో ఆహుతులను వేయడానికి అనుమతిని ఇవ్వమని ఆమెను కోరడం జరిగినది. (ఋగ్వేదం ప్రథమాధ్యాయం)

పూజ్యపాదులు శ్రీ శంకరాచార్యులవారు శ్రీ దుర్గామాతను ఎన్నోవిధముల కీర్తించి, ఆమెను బహు విధముల ప్రార్థించి, మనకు అట్టి అవకాశము కలిగించిన మహనీయుడు.

ఎందరో పండితులు, శాస్త్రవేత్తలు, వేదాంతులు మాతృదేవతారాధన వలననే పవిత్రులై లబ్ధప్రతిష్ఠులైనారు. కాళిదాసు, ఉజ్జయిని దుర్గామాతను ఆరాధించి ఆమెభక్తుడై - మహాకవియై యుగపురుషుడై కీర్తి గడించినాడు.

మాతృదేవత అనేక రూపములలో భక్తులను అనుగ్రహించుచుండునని, ఆమె కటాక్షము అనంత సాగరమని, ఎందరో మహానుభావులు, మహాభక్తులు అనుభవపూర్వకముగ మనకు,తెలియజేసియున్నారు.

హిందూరాజ్యమును నిష్కంటకము జేసిన మహాత్ముడు ఛత్రపతి శివాజీ. 'తుల్జాభవాని'గ ఆమె ఆదరణకు పాత్రుడైనాడు. స్వామి వివేకానందుడు కాళి మాతపై ఎన్నోరచనలుచేసి కాశ్మీరములో క్షీరభవానిని, కన్యాకుమారిని పూజించి జగత్ప్రసిద్ధుడైన పరివ్రాజకుని గ పేరొందినది మాతృదేవతారాధనవలననేకదా!

మన స్వాతంత్ర్య సంగ్రామ దినములలో స్వామి వివేకానందులు, అరవిందులు, బకిన్ చంద్ర, సోదరి నివేదిత, సుబ్రహ్మణ్య భారతి భారతమాతను పూజించవలెనని, మనజాతిని జాగృతం చేసిన మహనీయులు. అట్టి జాగృతి విభిన్న సంస్కృతుల సంగమమైన భరత జాతిని ఏకోన్ముఖులను చేసి, భరతమాత దాస్య శృంఖలములను ఛేదించ పూనుకొనునట్లు చేసారు. కృతకృత్యులైనారు.

బెంగాలులో దుర్గా పూజద్వారా మాతృభూమి యందమిత భక్తిప్రపత్తులు కలుగుటకు 'వందేమాతరం' మనకందించినాడు బకించంద్ర. వసంత నవరాత్రుల యందు దుర్గామాతను పూజించుట మన సాంప్రదాయబద్ధము చేసి ఎందరో మహా భక్తులు, చరితార్థులగుచున్నారు.

పాండవులజ్ఞాతవాసము ముగిసిన పిమ్మట దుర్గను పూజించి, వారు జమ్మిచెట్టుపై దాచియుంచిన అస్త్రములకు పూజలు చేసిన ఆనాటి సంఘటన ఈనాటివరకు దుర్గాపూజగా ప్రసిద్ధి చెందినది.

అక్బరుపరిపాలన కాలములో అనగా క్రీ.శ. 1580 లో రాజాకంగసు నారాయణ బెంగాలులో దుర్గపూజ చాలా ధనము వెచ్చించి నవరాత్రులు జరిపించినట్లు తెలియుచున్నది. విజయనగర ప్రభువులు కూడ ఎంతో వైభవముగ తొమ్మిది రోజులు దుర్గాపూజ జరిపించినట్లు పోర్చుగీసు బాటసారి "ఫర్గుసన్" మహాశయుని వ్రాతల వలన తెలియుచున్నది.

అట్టి సంప్రదాయము మైసూరు ప్రభువులైన వడయర్లు కూడ అనుసరించినట్లు మనకు చరిత్ర తెలుపు చున్నది. మైసూరులో ఈనాటికీ ఈ దుర్గా పూజా సంప్రదాయము కొనసాగుచునే యున్నది.

ఇలా మన భారతదేశమునందు మాతృదేవతారాధన మన సంస్కృతిలో భాగముగ వర్ధిల్లుచున్నది. ఈ సందర్భమున ఎందరో మహాకవులు, పండితులు దుర్గామహా దేవిని గూర్చి ఎన్నో ప్రార్థనాశ్లోకములను మనకందించినారు. అందు ఆదిశంకరులవారి అన్నపూర్ణస్తోత్రము, సౌందర్యలహరి, దేవీస్తోత్రము, పంచరత్న రాజేశ్వరీ అష్టకము, ఉమా మహేశ్వరీ స్తోత్రము, ఇంద్రకృతమైన శ్రీ మహాలక్ష్మి ప్రార్థన. ఇవికాక తులసీ ప్రార్థన, గోదేవి ప్రార్థన (కన్నతల్లి) గాయత్రీ దేవి ప్రార్థన, కన్యకాపరమేశ్వరీ ప్రార్థన, మహాభారత సావిత్రి ప్రకరణము - ఇవి అన్నియు భక్తి ప్రపత్తుల పూర్ణ స్వరూప వైభవ ప్రకటనా సాధనములుగా కీర్తిగాంచినవి. అంతేకాక ఆంధ్రసారస్వతమునకు మణిమకుటములుగా వర్ధిల్లుచున్నవి.

ఆమెయే కనకదుర్గ, చండి, భైరవి, అన్నపూర్ణ, దుర్గ, మహాలక్ష్మి, మంగళగౌరి, లలిత, పార్వతి, లోకమాత తులసి మొదలుగాగల మహాశక్తి స్వరూపిణి. కరుణాతరంగ. ఈమెను ఏ రూపమునైనను సేవించి భక్తమహాశయులు తరించెదరు గాక!



# విగ్రహారాధన

విగ్రహారాధన ప్రాచీన హైందవ సంప్రదాయమై యున్నది. శాస్త్రబద్ధమైన విగ్రహారాధన మన ధర్మమందు అతిప్రసిద్ధమై యున్నది.

ఎందరో మహర్షులు, జ్ఞానులు విగ్రహారాధన శాస్త్ర సమ్మతమైనదని సోదాహరణముగా నిరూపించి యున్నారు. కపిలమహర్షి, వ్యాసభగవానుడు, పూజ్యపాదులు ఆదిశంకరులవారు, వివేకానందస్వామి, విగ్రహారాధన శాస్త్ర సమ్మతము మరియు ముముక్షువులకు అత్యంత ఆవశ్యకమని నొక్కి వక్కాణించి యున్నారు.

శ్రీరామకృష్ణ పరమహంస యొక్క శిష్యుడును సర్వమతములు సత్యములేయని సర్వమత సమన్వయము గావించి, హిందూమత ధర్మ సూక్ష్మములను ఖండ, ఖండాంతరములయందు వ్యాప్తి యొనరించిన పుణ్య పురుషుడు శ్రీ వివేకానందస్వామి. విగ్రహారాధన ఆవశ్యకతను నిరూపించినాడు.

మహనీయుల సేవా శుశ్రూషలు సలిపి వారి సాన్నిధ్యమునందు గొప్ప ఆధ్యాత్మిక అనుభూతులను తాము పొంది, తమ జీవిత లక్ష్య మేదియో, భగవంతుని స్వరూపమెట్టిదో ఆత్మసాక్షాత్కార మార్గమునకు మార్గములెవ్వియో, తమ సాధనలద్వారా చక్కగ తెలిసికొనుటయే గాక, తమ దివ్యానుభూతులను ఇతరులకు కూడా తెలియజేసి వారిని కూడా దైవోన్ముఖులను చేయుటకు పాటుపడిన మహనీయులెందరో కలరు. అట్టి మహనీయులలో స్వామి వివేకానందులు ఒకరు.

వారు తమ పాశ్చాత్యదేశ పర్యటనలు ముగించుకొని, భరతఖండమున ఆధ్యాత్మిక పునర్జీవమునకు ఎంతో పాటుపడిరి. ఆ సమయమున తమ ప్రచార కార్యక్రమ సందర్భమున ఒకప్పుడు వివేకానంద స్వామి వారిని ఆళ్వార్ మహారాజా తన రాజభవనమునకు ఆహ్వానించి సత్కరించెను. ఆనాడు భోజనానంతరము ఇరువురును పలు ఆధ్యాత్మిక విషయములను చర్చ జరుపుచూ ఇష్టాగోష్ఠిగ సంభాషించుకొనునపుడు సందర్భవశమున,విగ్రహారాధన విషయము ప్రస్తావనకు వచ్చెను. ఆళ్వార్ మహారాజునకు విగ్రహారాధన అంటే గిట్టదు. రాళ్ళకు పూజలు, నమస్కారములు చేయుటలో ఎట్టి సమంజసత్వములేదని అతని దృఢ విశ్వాసము. ఈతని అభిప్రాయము అవగతము చేసి

కొన్న వివేకానందులు ఎంతో నైపుణ్యము కలవారును, అన్ని విషయములు తెలిసిన వారును కనుక, మోక్ష సాధనకు ప్రారంభమున చిత్తైకాగ్రత అత్యంత ఆవశ్యక మని అట్టి సాధనకు ఏదైనా (ఉపాధి) వస్తువు ఉండవలె నని తెలిసినవారు కనుక విగ్రహారాధనను బలపరచు వారై యుండిరి. వారిరువురి సంభాషణలో మహారాజు విగ్రహారాధనను ఖండించుచునే యుండెను. ఎంత చెప్పినను ఆయన వినలేదు.

అపుడు, వివేకానందులు అచటనే రాజభవన గోడకు వ్రేలాడగట్టబడి యున్న ఒక పెద్ద పటమును క్రిందకు దింపించి "ఈ పటము ఎవరిది"? అని రాజును అడుగగా ఆయన "మా తండ్రిగారిది" అని చెప్పెను. అంత స్వామివారు "రాజా! ఆ పటముపై మురికి వేయగలరా?" అని ప్రశ్నింపగ "అదెట్లు వీలగును? ఆ పటము మా జనకులదికదా!" అని రాజు సమాధానము చెప్పెను.

అపుడు వివేకానందులు "అది మీ నాయన యెట్లగును? అది గ్లాసు, కొయ్యే కదా!" అని అడుగగ రాజు "అయినప్పటికి ఆ పటము మా తండ్రి గారి చిహ్నము. వారి రూపము. అది మా తండ్రిని జ్ఞాపకము చేయును కదా!" అని చెప్పెను.

అంత వివేకానందుడు "మహాశయా! అదే విధముగా దేవాలయములోని విగ్రహము రాతి బొమ్మ అయినప్పటికి బ్రహ్మాండమంతయు వ్యాపించిన దేవ దేవుని, భగవంతుని, జ్ఞాపకము చేయును. మనసుకు స్ఫురింపజేయును. విగ్రహాదులయొక్క అవసరము భక్త జనులకు భగవత్స్మృతిని కలిగించుటయే" అని వివరిం చుచూ "కావున మానవుని ఆధ్యాత్మికోన్నతికి విగ్రహా రాధన ప్రారంభమున అత్యంతావశ్యకమై ఉన్నది" అని బోధింప మహారాజునకు జ్ఞానోదయమై తన అభిప్రాయమును మార్చుకొనెను.

సాధకులకు ఆధ్యాత్మికోన్నతి సాధించుటకు ప్రారంభములో విగ్రహారాధన అత్యవసరమని, విగ్రహములను ఎవరి అభిరుచులకు తగిన విధముగా అందుకు ప్రతీకలుగ రూపొందించి, ఆ దేవుని స్ఫురింప జేయునట్లు, సంప్రదాయ సిద్ధముగ రూపొందించిరి మన పూర్వులు.

అట్టి విగ్రహారాధన ద్వారా చిత్తైకాగ్రత భక్తి తత్పరత, చక్కగ అభివృద్ధి చేసికొన సాధకులు క్రమ క్రమముగ ఉన్నత శిఖరములను చేరుకొనవలయునని, పిదప నిర్గుణ, నిరాకార పరబ్రహ్మమును తెలిసికొన వలయునని, మహాత్ములు చెప్పుచున్నారు.



# దేవాలయాలు - విశిష్టత

భగవానుని సృష్టిలో మానవునికి విశిష్ట స్థానమున్నది. మంచిచెడులను విచక్షణ చేసే జ్ఞానముండుటచే బుద్ధి కలిగిన మానవుడు సత్యాన్వేషియై నిరంతర కృషి చేస్తూ విశ్వాంతర్గత సత్యాలను తెలిసికోవడానికి ప్రయత్నించాడు. ఈ సృష్టికి కారణమొకటుండాలని అట్టి మహాశక్తి (విరాట్) కలదని హేతుబద్ధంగా గ్రహించాడు. ఆ మహా శక్తిని ఉపాసించడం ప్రారంభించాడు. ప్రకృతిలోనే భగవానుని (విరాట్) దివ్య రూపాన్ని ప్రతిష్ఠించుకొని ఆరాధించ ప్రయత్నించాడు. అట్టి ఆరాధనలో తన అంతఃకరణ శుద్ధి చెందినది విశ్వంలో నిండియున్న చైతన్యమే తనలోనూ ఉన్నదని గ్రహించాడు. ఈ విశ్వమంతయు విశ్వనాథుని మందిరమైతే తనలోని ఆత్మకు తన శరీరమే మందిరమని అనుభూతి చెందాడు.

దేహమే దేవాలయమని, జీవుడే దేవుడని అనుభవ పూర్వకంగా గ్రహించి,ఆత్మానందాన్ని అనుభవించి తరించాడు.

స్వానుభవంతో తృప్తి చెందిన ఆత్మవిదుడు అన్యులకు ఆదర్శంగా నిలిచి, ఇతరులకు కూడా అట్టి దివ్యానందాన్ని అనుభవించేలాచేయాలని వారినికూడా తరింపజేయాలని ప్రయత్నించాడు. తీవ్రమైన బహుముఖ కృషిజరిపాడు. అట్టి ఆలోచనలకు ఆకృతి కల్పించాడు. అంతర్యంలోని శోభను ప్రతిబింబించునట్లు బాహ్యంలో ఆలయాన్ని నిర్మించాడు. అదియే దేవాలయము.

భగవానుని దివ్య తేజస్సును అంతర్యంలో దర్శించుటకు ఉపకరించు పరమ పవిత్ర బాహ్య సాధనగా తీర్చిదిద్దాడు. దేహి దేహములకు, దేవ, దేవాలయములకు అతి సామీప్య, సారూప్య మున్నదని గ్రహించాడు. సాధకులచే గ్రహింపజేసాడు. ఇట్టి ఆర్ష ఋషుల ఆధ్యాత్మికావగాహన, అంతఃకరణ శుద్ధి గలవానికే అవగతమవుతుందని అనుభవముగల పెద్దలు చెప్పిన, విని ఆచరించు చున్నాడు. అనుభవములోనికి తెచ్చుకొని ఎందరో తరించారు, తరించుచున్నారు.

దేహమే దేవాలయము, జీవుడేదేవుడు. దేహములోని ఆత్మను దర్శించు విధమే దేవాలయ ములోని దేవుని దర్శించుట యని ప్రత్యేక పద్ధతి ద్వారా తెలియజేసాడు.

బాహ్యరూపంలో సాగించు అర్చనలు, పూజలు మొదలగునవి అంతర్యంలోనికి తొంగిచూసి అనుభూతులుగా నిండుటకే ఆగమ సిద్ధాంతములను ప్రవేశపెట్టాడు.

అట్టి మహనీయులు పుట్టి, తాము తరించి ఎందరినో తరింపజేసిన ఈ దివ్య భారతావనిలో పుట్టుటకు తానెంతో అదృష్టవంతుడనని ప్రతి భారతీయుడు నమ్ముచున్నాడు.

దేవాలయ గోపురము ద్వారా దేవాలయము లోనికి ప్రవేశించెదము కదా. గోపురము ఎత్తుగా నుండి దానిపై అనేక రకములైన బొమ్మలు అనగా దేవతలు, దిక్పాలకులు, ఋషులు, మృగములు, లతలు ఇంకను అనేకములుండును. మానవుని శిరస్సే ఆలయ గోపురమని గ్రహించవలెను. తల కూడా గోపురము వలె ఎత్తుగా నుండెను. దేవాలయము గోపురముపై అనేక బొమ్మలున్నట్లే మానవుని మస్తిష్కంలో కూడా మానసిక చిత్రములు అనేకములు చోటు చేసికొని

యున్నవి. విశ్వ పరిపాలనా యంత్రాంగమంతా గోపుర చిత్రములో గోచరించు లాగున మానవుని జీవన రీతులన్నియు మనసులో స్థిరపరచబడి యున్నవి. మనిషి మనసులో కదిలే దుష్టసంకల్పాలు, ఆలోచనలు ఆలయ గోపురముపైనున్న బూతు బొమ్మలకు నిదర్శనములై యున్నవి.

ఆలయ గోపురముపై నున్న బొమ్మలను లక్ష్యము చేయకుండా, లోపలకు వెళ్ళునట్లు బాహ్య దృశ్యములను మానసిక సంకల్పములను అధిగమించి, భక్తులు, అంతర్ముఖులు కావలయునని గ్రహించుట అవసరమగు చున్నది.

ఆలయములోనికి రాగానే బలిపీఠము కనబడు తుంది. ఆ బలిపీఠమునందు భక్తుడు సాష్టాంగపడ తాడు. అలాగే అంతర్ముఖుడైన భక్తుడు అహంకారాన్ని భగవంతునకు బలిఇచ్చి భగవంతుని శరణు కోరుతాడు. బలిపీఠము వద్ద సాష్టాంగ నమస్కారము చేయుటలో గల అంతరార్థమిదియే.

పిదప ధ్వజ స్థంభము. దానిపై గల పతాకమును చూస్తాడు భక్తుడు. ఆ పతాకము గర్భాలయము వైపు దారి చూపునట్లు నిలబడి ఉంటుంది. అహంకారాన్ని సమూలముగా త్యజించి, భగవానునికి శరణాగతుడైన భక్తునికి భగవానుడు తన హృదయ మందిరములో ప్రవేశించెడి అవకాశమును, పొందుతాడని భావము.

ఆ వెనుక వాహన మూర్తి దర్శనమిస్తుంది. నందీశ్వరుడు, గరుత్మంతుడు హనుమంతుడు, మూషికము, నెమలి ఇవి మనకు తరచు కనిపించే వాహన మూర్తులు. వాహనము పూజార్హమైనట్లే అనగా ఎల్లప్పుడు భగవానుని మోయుట చేతనే కదా పూజార్హ మైనవి. అటులనే అహంకార మమకారములను విసర్జించి, సంపూర్ణ శరణాగతుడైన భక్తుడు, తన యందు ప్రాపంచిక విషయాలను భరించకుండా భగవంతుని ప్రార్థిస్తూ అనగా మోస్తూ జీవించాలని అంతరార్థ మున్నది. వాహన మూర్తికీ భగవంతునికి మధ్య నిలబడ కూడదని పెద్దలు చెబుతారు. అనగా భగవంతునికి భక్తుని మధ్య ఉండకూడదని అంతరార్థమున్నది.

భగవంతుని చేరుకోవడానికి అనేక మార్గాలు కలవు. ఎవరికి తోచిన, నచ్చిన మార్గాన్ని అనుసరించ డానికి అవకాశములున్నవి. వారెన్నుకున్న మార్గము సరియైనది కాదని వాదిస్తూ వారికి అడ్డు నిలబడటం అనుచితమని ధ్వనిస్తున్నది.

గర్భాలయంలో అంతా చీకటిగా ఉంటుంది. ఏమీ కనిపించదు. విగ్రహం కనబడకుండా తెరవేయ బడుతుంది. కొద్దిసేపు అక్కడ ప్రశాంతముగా నిలబడగా తెర తీయబడుతుంది. గంటలు మ్రోగుతాయి. హారతి ఇవ్వబడుతుంది. ఆ దివ్యకాంతిలో స్వామిని దర్శిం చడం జరుగుతుంది. స్వామికి నమస్కరించి, కనులు మూయడం జరుగుతుంది.

అంతర్ముఖుడైన భక్తుడు హృదయగుహ చెంతకు చేరగానే 'అవిద్య' అనే గాఢాంధకారం అలము కొని ఉంటుంది. కొంత కాలము ప్రశాంతముగా నిర్మల ముగా అచటనే వేచి యుండి సాధన కొనసాగించాలి. అలా కొనసాగించిన సాధన ఫలించిన తరువాత అజ్ఞానపు తెర తొలగగానే అనాహత శబ్దమనెడి ఘంటా నాదము వినబడుతుంది. వెంటనే జ్ఞాన ప్రకాశమనే వెలుగు ప్రకాశిస్తుంది. ఆ వెలుగులో ఆత్మ దర్శన మౌతుంది. అంత భక్తుడు అంతర్ముఖుడైనట్లే. అట్టి దివ్యోన్మత్త స్థితిలో హృదయస్థానమున చేతులుంచి నమస్కరించడం జరుగుతుంది. "జీవ బ్రహ్మైక్యము" జరిగినదనమాట. ఇదియే అంతరార్థము.

పంచేంద్రియ నిగ్రహమే ఆలయములో జరుగు అర్చనలోని అంతరార్థము. గర్భాలయము చీకటిగా

నుండి, భగవానుడు తప్ప మరేమీ కనబడదు. ఈ విధముగ దృగేంద్రియము నిగ్రహించబడి భగవంతుడు తప్ప అన్య వస్తువు కనబడడం అవాంఛనీయమని తెలియజేయ బడుచున్నది.

ఆలయములో ఉచ్చరింపబడు మంత్రములు అక్కడ ధ్వనించు ఘంటానాదము,శ్రోతేంద్రియమును నిగ్రహించి, అంతర్యములో ఆధ్యాత్మిక వాతావరణం కలుగ జేయును. భగవత్సంబంధమైన విషయులనే వినవలయుననెడి అంతర్భావము స్ఫురించుచున్నది.

ఆలయములో వ్యాప్తిచెందుచున్న సువాసనలు మొదలగునవి ఘ్రాణేంద్రియమును నిగ్రహించును. భక్తునిలో ఉన్న సకలవాసనలను భగవానుని పాదముల చెంత సమర్పించ వలెననెడి అంతరార్థము గోచరించు చున్నది. తదుపరి, ఆలయమునందు అందించబడు తీర్థ ప్రసాదములు, రసేంద్రియము నిగ్రహించును. అవి భగవత్ ప్రసాదముల వలే భక్తుని మనసునందు ఎంతో భక్తి శ్రద్ధలను కలుగజేయును. అట్టి ప్రసాదమును స్వీక రించుట వలన ప్రసాద బుద్ధిని ఏర్పరచుకొనుటయే అందలి సూక్ష్మ అవగాహనయై యున్నది.

గంధ, భస్మాదులు శరీరమునకు పూసుకొనుట ద్వారా మరియు భగవదర్పితమైన పుష్పములను పత్రములను చెవియందు ధరించుట ద్వారా త్వగింద్రియము నిగ్రహించబడుచున్నది. అనగా స్పర్శద్వారా భగవద్భక్తిని హృదయమునందు నింపుకొనుటకు చేయు ప్రయత్నమై యున్నది.

అంతేకాక స్వామి నామాలు, నేత్రాలను కప్పి ఉంచడములోని ఆంతర్యము బహు సూక్ష్మమైనది. దృష్టిని బహిర్ముఖముగా వస్తు ప్రపంచముపై సారించడము వలన ఉపయోగము లేదని అంతరంగిక దృష్టిలో ఆత్మానుభూతి పొందిన పిమ్మట బాహ్యమంతా బ్రహ్మమయముగానే గోచరిస్తుందను సందేశము కూడా ఇమిడి యున్నది.

ఈ విధముగా ఆలయ ప్రవేశము చేసినది మొదలు తీర్థ ప్రసాదములు స్వీకరించి తిరిగి బయలు దేరు నంతవరకు భక్తుడు (సాధకుడు) వేయు ప్రతి అడుగు, చేయు ప్రతి సంకల్పము భగవంతుని అనన్య చైతన్యములోలయము అగుటకు చేయుప్రయత్నమే. పూజనల్పి, తీర్థ ప్రసాదములను స్వీకరించి గర్భాలయము నుండి బయటకు వచ్చిన భక్తుడు, ఒకచోట కూర్చొని ధ్యానము చేసి తర్వాత లేచి వస్తుంటాడు. అనగా భగవానుని దర్శించిన పిదప స్థితుడై ఆత్మానందమునను భవిస్తూ, అంతర్ముఖుడై ఉండవలెనను టయే ఇందలి గూఢార్థము.

ఇట్టి అపూర్వ మహోన్నత ఆధ్యాత్మిక భావనా పటిమతో నిర్మితమైన మన దేవాలయాలు నిరుపమాన తాత్త్విక కళాఖండాలతో, శిల్ప సంపదతో మన భరత ఖండమునందు మన పూర్వులు ఎంతో శ్రమ కోర్చి మనకందించిన పవిత్ర వారసత్వ సంపద. దక్షిణ భారతాన వెలసిన ఆలయాల వైభవము చెప్పనలవి కానిది. అందు గోచరించు శిల్ప చాతుర్యము అత్యద్భుతము. కళా సౌందర్యము అసమానము. మన వాస్తు శాస్త్రజ్ఞులు వాటికి దైవత్వమును కలిగించిన తీరు అనిర్వచనీయము.

అట్టి మహోన్నత వారసత్వ సంపదలను మనము నిత్యము దర్శించుచూ వాటి పవిత్రతను కాపాడుతూ, వాటిని రక్షించుకోవలసిన బాధ్యత మనందరిపై నున్నదనుటలో అతిశయోక్తి లేదు.







శ్రీ గణేశ దేవాలయము. సికింద్రాబాదు (రైల్వే స్టేషన్ దగ్గర)



శ్రీ సిద్ధి రామేశ్వరస్వామి
బికనూరు, నిజామాబాద్ జిల్లా.



శ్రీ పైడితల్లమ్మ జాతర : సిరిమాను
ఉత్సవము : విజయనగరం.



శ్రీ మత్పయో నిధి నికేతన చక్రపాణే
భోగీన్ద్ర భోగమణి రాజిత పుణ్యమూర్తే
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీ నృసింహ మమ దేహికరావలమ్బమ్.

మన ఆంధ్రావనియందు గల ప్రముఖ పుణ్య క్షేత్రములలో పెనుశిల నరసింహక్షేత్రము ప్రసిద్ధమైనది. ఈ క్షేత్రము నెల్లూరు జిల్లా రాపూరు మండలమందున్నది. గోనుపల్లి గ్రామమునకు 7 కిలోమీటర్ల దూరమున నెల్లూరు పట్టణమునకు పశ్చిమముగ సుమారు 80 కిలో మీటర్ల దూరమున నున్నది. ఇచ్చటి శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారు నవనారసింహులలో నొకరుగ పిలువబడుతున్నారు. ఈ స్వామివారు చెంచులక్ష్మీ సమేతుడై నిరాకార రూపమున స్వయంభువుగ నవతరించెను. ఇచ్చట అమ్మవారికి యొక ప్రత్యేకత కలదు. సాధారణముగా విష్ణాలయములందు పట్ట మహిషి స్వామి వారికి అభిముఖము గానో లేక వామదిశగా పార్శ్వము లందో యుండును. కాని యీ క్షేత్రమున అమ్మవారు స్వామివారికి వామభాగమున భక్త స్థానమున పరాఙ్ముఖిగ వెలసి పరిపూర్ణ స్వాతంత్రముగ నుండును.

దశావతారములలో మేటియై కృతయుగమున అవతరించిన నాలుగవ అవతారము నృసింహావ తారము. ఈ అవతారమున శ్రీ మహావిష్ణువు దుష్టశిక్షణ, శిష్ట రక్షణ (దుష్ట దానవుడైన హిరణ్యకశిపుని వధ - భక్త ప్రహ్లాద రక్షణ) చేసి తనచే సృజింపబడు ముక్తజీవులను తరింపచేయుటకు యిలపై, నవనారసింహులుగా స్థిరమైనాడు. ఇట్టి క్షేత్రము లలో యీ చత్రవటి నారసింహ క్షేత్రము మహిమాన్విత మైనది.

నృసింహావతారమున హిరణ్యకశిపువధానంతరం ఉగ్రరూపుడైన నారసింహుడు సర్వం విష్ణుమయం జగత్ అను రీతిగ ఈ జగత్తునందు సర్వవ్యాపియై భక్తుల అభీష్టము మేరకు అచ్చటచ్చట స్వయంభువుగా అవతరించినాడు. ఈ క్షేత్రము చెంచురాజులకు నిలయమైనందున ఉగ్రరూపుడైన నరసింహుడు సుందరాంగియైన చెంచు వనిత చెలిమిచే శాంతించి చెంచు రాజులకు కప్పము చెల్లించి చెంచు పట్టిని చేపట్టి పరిణయమాడి ఆ సుందర వనితను పెనవేసుకొని శిలారూపమున స్థిరమైనట్లు చరిత్ర వలన తెలియుచున్నది.

ఈ క్షేత్రము తూర్పు కనుమల మధ్య పాద భాగమున సముద్ర మట్టమునకు సుమారు 3000 అడుగుల ఎత్తున నున్నది. ఈ స్వయమవతారమూర్తి వెనుక భాగమున మహాశిలగిరి (గొప్ప పర్వతరాజము) యున్నది. ఇది సర్పాకృతిగా, నెల్లూరు - కడప మండల ముల మధ్యభాగమున, హిమగిరి, తూర్పు పశ్చిమ సముద్రములకు కొలమానముగ నున్నట్లు ఉత్తర - దక్షిణముగ శ్రీశైల, వరాహ (వెంకటాచలం) క్షేత్రమునకు కొలబద్దవలె కనిపించును. ఈ సర్పాకృతిగల నగము యొక్క శిరో భాగమున (వరాహ క్షేత్రమున) వెంకటేశుడు అవతరించి, కటి భాగమున శ్రీ నృసింహుడు వెలసి స్థితికారకులై, తన్నారాధించు భక్తులకు వరములొసంగుచు నుండ, లయ చక్రవర్తియైన పార్వతీశుడు శ్రీశైలక్షేత్రమున వాల(అంత్య) భాగమున వెలసి ఆర్తనాదులను ఆనందింప జేయు చున్నాడు. ఈ గిరిశిఖరముననుండి జాలు వారు వర్షపు నీటి ధారలు, వెండి కరిగి మూసలో పోయి రీతిన స్వచ్ఛముగ నుండి పర్వత పాద భాగమున నున్న కణ్వ నదిని ప్రవేశించి తద్వారా దిగువ గ్రామాదులకు వర ప్రసాదియై కండలేరు జలాశయమున, నిక్షిప్తమగుచున్నది.

వర్ష ఋతువున యీ పర్వతరాజము శిఖరములను మేఘుడు తన సహజ చెలిమిచే, దోబూచులాడి ముద్దాడుచు న్నట్లు, కనిపించును. నాటి రోజులలో ప్రకృతి సౌందర్య మును కనులారగాంచవలెనే గాని వ్రాతల కలవిగాదు. ఈ క్షేత్ర కణ్వనదీ తీరమున శాకుంతల సంరక్షకుడైన కణ్వ ఋషి మహాతప మొనర్చి స్వామిని ఆరాధించినట్లు ప్రతీతిగ చెప్పుచుండును. అలనాడు మహర్షులచే ఆరాధింపబడిన పెనుశిలేశుడు యీనాడు భక్తులకు సులభుడై కోరినవరము లిచ్చుచున్నాడు. ఈస్వామివారు చెంచు వనితయైన లక్ష్మీ దేవిని పెనవేసుకుని అవతరించి యుండుటచే పెనుశిల లక్ష్మీ నరశింహుడుగా పిలవబడుచున్నాడు. ఈ పెనుశిల క్షేత్రము కాలగమనమున రూపాంతరమైన పెంచలకోనగా మారిపామరుల హృదయములలో స్థిరమైనది. ఈప్రాంతం వారు నేటికిన్నీ తమ సంతానములకు పెంచలయ్య, పెంచ లమ్మ అని స్వామి వారి పేరు పెట్టుకొనుట జరుగుచున్నది. ఈ క్షేత్రమున స్వామివారు ఆదియుగమున అవతరించి నందున, యుగయుగాలలో మార్పులు చెంది నేటికి గొప్ప వరప్రసాదక్షేత్రముగ విలసిల్లుచున్నది. ఇందులకు నిదర్శ నముగా ఈ క్షేత్రమున స్వామి వారికి వారమున కొకసారి (శనివారము) మాత్రము పూజానైవేద్యాదులు గత 30 సంవత్సరముల నుంచీ జరుగుచుండెను. నాటి రోజు లలో యీ పర్వతపంక్తులలో కూడిన కీకారణ్యమున అసంఖ్యాక క్రూరమృగ జాతుల భీతిచే నరసంచారము లేకుండ యుండెడిదట. ఈకారణముచే కాబోలు స్వామివారి ఉత్సవ మూర్తులను గోనుపల్లి గ్రామమునందుంచి పూజాదికములు నిర్వర్తించుచూ, వారపూజ మాత్రం ఈ క్షేత్రమున జరుపు ఆచారముగ నుండెను. ఈ పర్వతారణ్య మహాక్షేత్రమున మహోత్సవములకు (నృసింహజయంతి) వచ్చు అసం ఖ్యాక భక్తకోటికి క్రిమికీటకాది బాధలుకూడా కలుగవు. ఇచ్చట సేవచేయువారికి గ్రహదోషములు తొలగిపోవును. మరియు సంతానము లేని వారు వరపడు సేవచే సంతాన ప్రాప్తులగుచున్నారు. ఇది నేటికిని సత్యముగ జరుగు చున్నది. ఇప్పుడు యీ క్షేత్రమున అనుదినం త్రికాలా రాధనలు జరుగుచున్నది. వైశాఖ మాస బ్రహ్మోత్సవములు ఆశ్వయుజ మాసమున శరన్నవరాత్రి ఉత్సవములు మిక్కిలి శోభాయమానముగ కనులా నందముగ జరుగును.

ఈ క్షేత్రమున స్వామి వారికి శనివారము ముఖ్యవ్రత దినముగా భావించి భక్తులు కొని యాడెదరు. ఈ ఆలయమున పాంచరాత్రయుక్త, పంచాహ్నిక విధానముగ బ్రహ్మోత్సవము వైశాఖ శుద్ధ ద్వాదశి నాడు ప్రారంభమై వైభవముగా జరుగును. వైశాఖ శుద్ధ చతుర్దశి ప్రధానముగ నెంచి నాటి రోజు గరుడ సేవ మహోత్సవము జరుగును. ఆ రోజు శ్రీ వారిని సేవించు భక్తగణము అసంఖ్యాకముగ నుండి వసంతమున వృక్షపత్రముల వలె ఈ పుణ్యక్షేత్ర వసుధపై, భక్త శిఖామణులు ప్రకాశింతురు. బ్రహ్మోత్సవ ములకుగాను ఉత్సవమూర్తులను గోనుపల్లి గ్రామము నుండి పల్లకిలో బోయలచే కళ్యాణ చక్రవర్తివలె వేంచేపు చేసుకొని వచ్చి, మహోత్సవమున జరుగు కళ్యాణ, రథోత్సవ, వసం తోత్సవ, అవభృధస్నానాంతరం మరలా గోనుపల్లి గ్రామ మున యధాస్థానమునకు పట్టాభిషిక్తుడైన యువరాజుని వలె వేంచేపుచేసెదరు. ఈ క్షేత్రమునకు సమీపమున 5 కిలోమీటర్ల దూరమున భైరవకోనయను పుణ్యస్థలము కలదు. అచ్చట శ్రీ స్వామి వారి మహోత్సవ పూర్వోత్తర కాలములందు సుమారు ఒకమాసము స్వామివారికి ఛత్రము పట్టెదరని జనాంతికవానుడి. ఈ దృశ్యమును నేటికిని భానోదయ కాలమున భక్తులు తిలకించు చుందురు. ఈ కారణముచేత యీ స్వామివారికి ఛత్రవటి నారసింహ స్వామియని పేరు సార్ధకమైనది.

ఛత్రవట పెనుశిల లక్ష్మీ నృసింహ సేవాఫలసిద్ధిరస్తు
ఆదిలక్ష్మీ సమేతాయ వాంఛితార్ధ ప్రదాయినే
మహా శిలగిరీశాయ శ్రీ నృసింహాయ మంగళమ్



# శ్రీ మహానందీశ్వర స్వామి దేవస్థానం

## మహానంది – 518 673 (ఫోన్ : 46)

## (కర్నూలు జిల్లా : ఆంధ్రప్రదేశ్)



నంద్యాల లేక నంద మండలమును పాలించిన వారిలో నందుడను రాజు శివునకు క్షీరాభిషేక మొన రించ వలెనని తలంపు కలిగి గోపవర ప్రాంతమందలి ఆలమందల నుండి పాలు తేవలసినదిగా యాజ్ఞా పించెను. అక్కడి ఆవులలో నొకటి అరణ్యమున ఆకులలములు మేసి సాయం సమయమున పాలీయ కుండెను. అందులకు ఆవుల కాపరి కలత జెంది ఒక నాడు ఆవును వెంబడించెను. ఆ యావు అడవిలో ఒక పుట్ట చెంతకు వెళ్లి పచ్చిక మేసి అటు యిటు తిరిగి పుట్ట పై పాలు కార్చుచుండెను. ఈ సంగతి ఆలకాపరి రాజునకు తెలిపెను. అంత మరునాడు రాజు స్వయముగ అరణ్యమునకు వెళ్లి యీ ఆశ్చర్య కర దృశ్యమును చూసి ఆనందాతిశయముతో ఇంకను సమీపముగా చూచుటకు ప్రయత్నించెను. అంత ప్రశాంత వాతావరణము భగ్నమయ్యెను. తొట్రుపాటుతో నాయావు బెదరి పుట్ట మీద పాదము పెట్టెను. రాజు విచార గ్రస్థుడై అంతఃపురము జేరెను. ఆ రాత్రి స్వప్నములో పరమ శివుడు ప్రత్యక్షమై ఆ ప్రాంతమున పూజా మందిరము నిర్మింపుమని ఆన తిచ్చెను. నందన రాజు శివుని యాజ్ఞపై ఈ ఆలయ మును నిర్మించెనని, ఆ పుట్టయే శిలా రూపమున ఆవు పాదముద్రతో వెలసిన పరమశివుడని ఒక గాథ కలదు.

శిలాదుడను మహర్షి శివుని గూర్చి ఘోర తపము చేయగా శివుడు ప్రత్యక్షమై మోక్షము ప్రసాదింపుమని కోరిన శిలాదునకు, సంతాన ప్రాప్తి మరియు మోక్ష ప్రాప్తి కలుగునట్లు వరమిచ్చి ఈ క్షేత్ర మందుగల పుట్ట నుండి ఒక బాలకుని తీసి యిచ్చెను. పరమానంద భరితుడైన శిలాద మహర్షి ఆ బాలకునకు మహా నందుడను పేరు పెట్టెను. అట్లు పరమేశ్వరానుగ్రహము వలన పుట్ట నుండి మహా నందుడు జన్మించిన (స్థలము) క్షేత్రమునకు మహా నంది క్షేత్రమను పేరు వచ్చెను.

బ్రహ్మ గుండము, విష్ణు గుండము, రుద్ర గుండము అని మూడు జలధారలు ఈ క్షేత్రమును పవిత్రము చేయుచున్నవి.

బ్రహ్మ గుండము నందలి జలము ఈ క్షేత్ర జలావసరము తీర్చుచున్నది. విష్ణుగుండపు నీటి ధార పరిసర సాగుకై ఉపయోగ పడుచున్నది. రుద్ర గుండ మందలి నీటిధార శివ లింగమునకు క్రింద నుండి వచ్చు చున్నది. ఈ దేవాలయ ప్రాకారము లోపల నిర్మించిన పుష్కరిణిలో ప్రవేశించి రెండు తూముల ద్వారా వెలుపలకు ప్రవహించి వెయ్యి ఎకర ముల భూమి సాగుకు ఉపకరించుచున్నది. ఈ జలము అతి స్వచ్ఛముగ, వెచ్చగ యుండుటయే గాక యిందు స్నాన మాచరించిన వారికి సకల పాపములు తొలగి, పుణ్యము కలుగునని, ఉల్లాసము, ఆరోగ్య మును, మనశ్శాంతిని కలిగించునని ప్రతీతి. ఇందలి నీటి

ప్రవాహము అన్ని కాలముల యందు ఒకే లాగున ఉండుట అత్యంతాశ్చర్యము కలిగించుచున్నది.

ఈ స్వామి వారి ఆలయమునకు దక్షిణ భాగమున శ్రీ కామేశ్వరి ఆలయము కలదు.మరియు శ్రీ కోదండ రాముల వారి ఆలయము ఈ క్షేత్రమునకు భక్తులను విశేషముగ ఆకర్షించుచున్నది.

ఈ క్షేత్రమునకు తొమ్మిది మైళ్ల విస్తీర్ణములో నవనందులు కలవు. ప్రథమ, నాగ, సోమ, సూర్య, శివ, విష్ణు, వినాయక, గరుడ, మహానందులు సూర్యోదయము నుండి సూర్యాస్తమయము లోపల దర్శించ వలెను.

ఈ క్షేత్రమునకు ధర్మకర్తలుగా పనిచేసిన కీ.శే. శ్రీ భైరవ జోస్యుల మహానందయ్య దంపతులు ఈ క్షేత్రాభివృద్ధికి ఎంతోకృషిచేసి చిరస్మరణీయులైనారు. ప్రస్తుత మీ క్షేత్రమెంతో అభివృద్ధిని సాధించినది. ప్రతి నిత్యము భక్తుల సంఖ్య వేలకు మించుచున్నది.

ప్రకృతి రమణీకతతో విలసిల్లుచున్న ఈ క్షేత్ర దర్శనము, పుష్కరిణిలో స్నానము చిరస్మరణీయములై మరల మరల ఈ క్షేత్ర దర్శనమునకు కుతూహలము కలిగించుననుటలో అతిశయోక్తి లేదు.

ఈ దేవస్థానములో యాత్రీకుల సౌకర్యార్థమై 50 రూముల వసతి గృహము ఏర్పాటు చేయు నిమిత్తము ప్రస్తుతము 12 రూములు రు. 7,76,000/లు అంచనాలతో పని ప్రారంభించడమైనది. ప్రస్తుతము పని చురుకుగా జరుగుచున్నది.

మరియు దేవాలయము యొక్క ప్రాశస్త్యము దృష్టిలో వుంచుకొని, రెండవ ప్రాకారము రు. 9,76,000/-ల అంచనాలతో నిర్మాణము జరుగుచున్నది. ఈ ప్రాకారము పని కూడా దాదాపు మూడు వంతుల వరకు జరిగినది. పై రెండు పనులకు 1989-90 ఆర్థిక సంవత్సరమునకు రు. 4,45,730-80 ఖర్చు చేయడమైనది.

ప్రతి సంవత్సరము మాఘ, ఫాల్గుణ మాసములలో శివరాత్రి పర్వ దినములో బ్రహ్మోత్సవములు జరుగును. శ్రీ మహనందీశ్వర స్వామిని దర్శించి తరించండి.

యం. పున్నారెడ్డి,

కార్యనిర్వహణాధికారి, (సహాయ కమీషనరు)



# మామిడి కుదురు మండలము
## (తూర్పు గోదావరి జిల్లా.)



తూర్పుగోదావరి జిల్లా, మామిడి కుదురు మండలములో గల అప్పనపల్లి పూర్వము అరణ్య ప్రాంతము. ఈ ప్రాంతమును ఆనుకొని వైనతేయ అను గోదావరి నది ఉత్తర వాహినిగా ప్రవహించుచూ బెండమూరులంకవద్ద సముద్రమున కలియుచున్నది. నది ఉత్తర వాహినిగా ప్రవహించుట వలన పవిత్రతకు, పుణ్య క్షేత్రమగుటకు అలవాలమయినది.

పూర్వము ఈ ప్రాంతమున మహర్షులు తపస్సు చేసి, తమ ప్రాణములను ఇచ్చట అర్పణము చేసి నందున దీనికి అర్పణపల్లి అనియు క్రమేణా అప్పన పల్లిగా మారినదనియు వినికిడి. మరియు అప్పన్న అను బాలుడు తపస్సు చేసి తరించినందున అప్పన పల్లి అను నామకరణము వచ్చినదనియు కూడ వినికిడి. ఈ ప్రాంతమున ఎందరో మహర్షులు తపస్సులు చేసి, వైనతేయ గోదావరిలో స్నాన మాచరించి తరించిన పుణ్య భూమి. అందుచే దీనిని ఉత్తర కాశీగా కూడ పిలువ బడుచున్నది.

ఈ పుణ్య భూమిలో శ్రీ మొల్లేటి మునెయ్య, మంగాయమ్మ పుణ్య దంపతులకు శ్రీ రామస్వామి గారు జన్మించినారు. వీరు చిన్నతనము నుంచి దైవ చింతన గలవారు. వీరి భార్య ఆదిలక్ష్మిగారు. దంపతులు శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులు. శ్రీ రామ స్వామిగారు కొబ్బరి కొట్టు నిర్మించుకొని, అందు కొబ్బరి కాయలు వ్యాపారము చేసికొనుచూ శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి తన వ్యాపారములో వచ్చిన లాభంలో వాటా ఇచ్చి సదరు వాటా సొమ్మును ప్రతి సంవత్సరం తిరుపతి వెళ్ళి శ్రీ స్వామి వారి హుండీలో వేయుచుండెడివారు. ఆ విధముగా ఒక సారి తిరుపతి వెళ్ళగా స్వామి శ్రీ రామస్వామిగారికి కలలో కనపడి నీవు నా చెంతకు రానవసరము లేదు. నేనే నీ వద్దకు వచ్చుచున్నాను. అచటనే నన్ను పూజించుకొనుము అని చెప్పగా శ్రీ రామస్వామి గారు కొబ్బరి కొట్టు నందు మందిరము నిర్మించి పూజలు చేసుకొనుట జరిగినది. ఈ విషయము లోక విఖ్యాతి గాంచి వేలాది మంది భక్తులు శ్రీస్వామివారి దర్శనము చేసు కొనుచూ, ముడుపులు, మొక్కు బడులు హుండీలో వేయుట జరిగినది.

శ్రీరామస్వామి గారు వచ్చిన సొమ్ముతో నూతనముగా ఆలయం, మరియు భక్తుల సౌకర్యము కొరకు సత్రములు, గెస్టు హౌస్ నిర్మించిరి. మరియు నిత్యము ప్రసాదముగా పులిహోర ఉచితముగా భక్తులకు పంచుట జరుగుచున్నది. క్రమేణా యాత్ర దినదిన ప్రవర్ధమానము అయినది.

1981 సంవత్సరములో దేవాదాయ ధర్మాదాయ శాఖ వారు చట్ట ప్రకారము స్వాధీనము చేసుకొనగా నిర్మాత శ్రీ రామస్వామి గారు కోర్టునందు వాజ్యము వేసి యున్నారు. 10-4-1990 తేదీన దేవస్థానమును పూర్తిగా దేవాదాయ ధర్మాదాయ శాఖ వారికి హైకోర్టు వారు స్వాధీనము చేయుటజరిగినది.

కోర్టుఆదేశములువచ్చిన తరువాత దేవాదాయ ధర్మాదాయ శాఖ ది 4.7.91 తేదిని శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠానాచార్యులు, ఉభయ వేదాంతా చార్య పీఠాధిపతులు, వేద విశ్వవిద్యాలయ స్థాపకులు, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామి శ్రీహస్తములతో పాంచరాత్రాగమ విధానమున, పాంచాహ్నిక దీక్షతో అతి వైభవముగా, అతి వైదికముగా శ్రీ బాలబాలాజీస్వామి, పద్మావతి అమ్మవారు, ఆండాళ్ అమ్మవారు, మరియు గరుడాళ్వారు ప్రతిష్ఠ జరుపబడినది.

భక్తుల సౌకర్యము కొరకు దేవస్థానము వారు అనేక నిర్మాణపు పనులు చేపట్టియున్నారు. ఈ అప్పనపల్లి పుణ్య క్షేత్రములో శ్రీ బాల బాలాజీ స్వామివారిని ప్రతి నిత్యము అనేక వేల మంది భక్తులు దర్శించి మరియు పూజించి తమ తమ మ్రొక్కుబడులను చెల్లించుకొనుచూ ముక్తులగుచున్నారు.

అప్పనపల్లి గ్రామములో వేంచేసి యున్న శ్రీ బాల బాలాజీ స్వామి వారిని దర్శించి తీర్థ ప్రసాదములు స్వీకరించి తరించండి.

**రూటు :** జగ్గన్నపేట (తాటిపాక) పట్టణమునకు 10 కిలో మీటర్ల దూరమున తూర్పు వైపున ఉన్నది. సఖినేటిపల్లి, కాకినాడ, ఏలూరు, తాడేపల్లి గూడెం, జంగారెడ్డి గూడెం, రాజమండ్రిల నుంచి రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ వారిచే బస్సులు నడుపబడుచున్నవి.

**బి. ఆనందరావు బి.ఎ.**
సహాయ కమీషనరు మరియు
కార్యనిర్వహణాధికారి.





శ్రీ భద్రకాళిదేవి, వరంగల్



అంతర్వేది దేవాలయము, పశ్చిమ గోదావరి జిల్లా



శ్రీ ముఖలింగేశ్వర దేవాలయదృశ్యము, ముఖలింగం, శ్రీకాకుళం జిల్లా



SIAO | RRIF

# గరుత్మంతుడు

శ్రీ
9 Sm, 8A
కృష్ణమూర్తి

శ్రీ మహావిష్ణువు వాహనముగా గరుత్మంతుడు ప్రసిద్ధుడు. గరుడ వాహనుడుగానే శ్రీమహా విష్ణువు గజేంద్రుని రక్షించినాడు.

గరుత్మంతుడు నిత్య ముక్తుడు. అఖండ జ్ఞాన సంపన్నుడు. శ్రీమద్భాగవతము గరుత్మంతుని సర్వ దేవతా మూర్తిగా వర్ణించినది.

'ఆకర్ణయన్ పత్ర రథేంద్ర పక్షీరుచ్చారితం స్తోమముదీర్ణసామ" యని భాగవతము చెప్పుచున్నది. 'బృహత్' మరియు 'రథంతరము' అనునవి సామ వేద భాగములనియు అవే గరుత్మంతుని రెక్కలనియు వాని కదలికల వలన సామగాన నాదము వెలువడుతుందని అందువలన ఈ భక్తాగ్రణికి 'గరుత్మాన్' అని పేరు వచ్చినదని శాస్త్ర విదితమైనది.

ఈతనికి గరుత్మాన్, గరుడ, తార్క్ష్య, వైనతేయ ఖగేశ్వర, నాగాంతక, విష్ణురథ, సుపర్ణ, పన్నగాశన అను పేర్లు కలవని 'అమర కోశము' చెప్పుచున్నది. నాగాభరణ భూషణుడు, కపిలాక్షుడు అని గరుడ కల్పము చెప్పు చున్నది.

వినతా, కశ్యపులకు జన్మించిన వాడు గరుత్మంతుడు. వినతా తనయుడైనందున వైనతేయుడని, కశ్యపునకు తార్క్ష్యుడను పేరున్నందువలన తార్క్ష్యుడని యీతనిని పిలిచారు. తన విభూతులలో గరుడు డొకడని శ్రీ కృష్ణ పరమాత్మ "వైనతేయశ్చ పక్షిణాం" అని ప్రకటించాడు. Rs: 200=00

వేదములకు గరుడుడని పేరు కలదు. వేదములు శ్రీ మహావిష్ణువునకు వాహనములు. "త్రివృత్ వేదః। సుపర్ణాఖ్యోయజ్ఞం వహతి పూరుషం" అని కదా భాగవతము చెప్పుచున్నది.

శ్రీ మద్భాగవతమునందే కాక అగ్ని పురాణం శ్రీ మన్మహాభారత, ఆదిపర్వమునందు కూడ గరుడుని గూర్చి విపులముగా వర్ణింపబడినది.

వినతా దాస్యమును పోగొట్టుటకు అమృతాన్ని తీసికొని గరుడుడు ఆకాశంలో పయనిస్తున్నప్పుడు శ్రీహరి ఆతనికి దర్శన మిచ్చి వరము కొరుకొనమన ధ్వజం"గా తనను గ్రహింపమని గరుడుడు ప్రార్థించగా అందులకు శ్రీహరి అనుగ్రహించి, అతనికి అమృత పానం లేకుండానే, అజరామరత్వాన్ని అనుగ్రహించాడు. గరుడుడు కూడా అందుకు ప్రత్యుపకారంగా శ్రీహరిని ఒక వరాన్ని కోరుకొమ్మని అడుగగా తనకు వాహనంగా ఉండమని శ్రీహరి ఆజ్ఞాపించాడు.

అమృతాన్ని తీసికొనివెళ్ళేటప్పుడు, ఇంద్రుడు తన వజ్రాయుధంతో గరుడుని గాయ పరచ ప్రయత్నించాడు. గరుడుడు దధీచిమహర్షికి, వజ్రాయుధానికి నమస్కరించాడు. అపుడా వజ్రాయుధము గరుడుని ఏమీ చేయలేకపోయింది. పిదప గరుడుడు దధీచిని ఉపేంద్రుని గౌరవింపతలచి తన రెక్క నొక దానిని త్యజించినాడు. అలా విడిచిన రెక్క ఎంతో అందమైన దట! అందువలన గరుడునకు సుపర్ణుడని పేరు వచ్చినది. సుపర్ణుని పేర వైదిక సూక్త మొకటి కలదు.

"హృష్టాని సర్వభూతాని నామ చక్ర
గరుత్మతః ।
సురూపం పత్రమాలక్ష్య సుపర్ణోయం భయత్వితి ॥"
[శ్రీ మన్మహాభారతం]

జ్యోతి శ్శాస్త్రి ప్రమాణాన్ననుసరించి మకరంలో శ్రవణం అనే ఒక నక్షత్రముంది. అది విష్ణు దేవతాకము శ్రవణముకంటె ముందు గరుడ నక్షత్రమున్నది. అందువలన వాహనంగా ధ్వజంగా గురుడ నక్షత్రం శ్రవణ (విష్ణు) నక్షత్రానికి భాసిస్తూ ఉంటుంది.

శ్రీమద్భాగవతా న్ననుసరించి భగవానుని క్రియా శక్తియే రథారూపాన్ని ధరించింది. 'ఈరథంలో పయనిస్తూ'వర అభయ ముద్రాంకితుడై శ్రీహరి భక్తులకు, ప్రసన్నులకు అభయాన్ని, వరాల్ని అనుగ్రహిస్తూంటాడని గరుడుడిచ్చుట పురుషాకార ఆచార్య ధర్మాలను నిర్వహిస్తూ ఉంటాడని తెలుస్తున్నది.

గరుడుని పేర పాంచరాత్ర శాస్త్రము కూడ ఒకటుంది. ఆకాశ భైరవ తంత్రంలో తార్క్ష్య కల్పమని కూడ ఒక కల్పం ఉంది.

శ్రీ మహావిష్ణువును తన మూపున వహించి భూమియందు విహరించిన చోటులందున్న పర్వతాలకు గరుడాద్రులని పేరు. ఆ పర్వతాలే అహోబిల, శ్రీ పర్వతాలు.

గరుడునకు ఆంధ్రుడని పేరు కూడ కలదు. ఆంధ్రునిచేతగాని రాబడిన దైవమునకు ఆంధ్రుడని, అతడు విలసిల్లిన దేశము గావున ఆంధ్రదేశమని తెలుగుదేశానికి పేరు వచ్చినది. శ్రీకాకుళంలో వెలసిన విష్ణువునకు "ఆంధ్రవిష్ణువు" అని పేరు కలదన్న సంగతి లోకవిదితము కదా.

పన్నిద్ద రాళ్వారులలో గరుడాంశ సంభూతులు కూడ ఒకరున్నారు. గరుడ సేవను సేవించడం వైష్ణవులకు ముఖ్య విధుల్లో ఒకటి. కంచి క్షేత్రంలో విలసిల్లిన వరద రాజ పెరుమాళ్ళు గరుడ వాహనుడై ఊరేగుటను జన్మలో ఒక సారైనా చూచి తరించండని పెద్దలు చెబుతారు.

ప్రతి వైష్ణవ దేవాలయ ప్రాంగణములో ధ్వజ స్థంభము వద్ద "గరుడ మూర్తి" తప్పక ఉంటుంది. మొదట గరుడుని 'పెరియసిరువడి' సేవించి గాని భగవానుని సేవింపరాదన్నది శాస్త్ర నియమమై యున్నది.

శ్రీ రంగక్షేత్రమునందు గరుడునకు ఒక ప్రత్యేక మందిరమున్నది. అందలి గరుడ విగ్రహపు సొంపు, ఆకారాలు వర్ణింపరానివి. గుంటూరు జిల్లా పొన్నూరులో పెద్ద గరుడ విగ్రహము, దేవాలయము కూడా నిర్మింపబడినవి.

శ్రీ వేదాంత దేశికుల వారు గరుడోపాసన చేసిన తర్వాతనే హయగ్రీవుల దర్శనమై, అఖండ పాండిత్యము, అసమాన వైదుష్యము అలవడినవట! ఈయన గరుడ దండకం, గరుడ పంచశత్ అను రెండు స్తోత్రాలను రచించారు.

గరుడ భగవానుని సేవించి తరించెదము గాక.

*(శ్రీ నాంపల్లి వెంకటరంగారావుగారు గరుడుని గూర్చి వ్రాసిన వ్యాసం ఆధారంగా వ్రాయబడినది. వారికి కృతజ్ఞతలు. - రచయిత)*



# శ్రీ విద్యారణ్యస్వామి

క్రీ.శ. పదమూడవ శతాబ్ది పూర్వార్ధమందు, మతోన్మాదుల మహోపద్రవము నుండి, క్షీణిస్తున్న హిందూ ధర్మాన్ని తిరిగి నిలిపి ఉంచేందుకు తన జీవితాన్ని గొప్ప తపస్సుగా ధార పోసి, వేద ధర్మానికి అఖండ జ్యోతిగా అవతరించిన మహా పురుషుడు, మహా మనీషి శ్రీ విద్యారణ్యస్వామి వారు.

విజయనగర ప్రభువులకు గురువుగా, సలహా దారుడుగా, రాజకీయ వ్యూహాలతో అపర చాణుక్యు డుగా, యుద్ధ నీతి విశారదుడుగా, ధర్మమూర్తిగా, సామాన్య ప్రజలకు హిందూ ధర్మాన్ని బోధించి వారిచే అనుసరింపజేస్తూ, శంకర పీఠానికి అధిపతిగా, శృంగేరీ పీఠాన్ని అధిష్ఠించి, ధర్మబద్ధంగా పరిపాలన చేసిన పరమహంస పరివ్రాజకుడై, పూర్ణాయుష్కుడై యుగ పురుషుడై వెలుగొందిన పుణ్యపురుషుడు శ్రీ విద్యా రణ్యులవారు.

వీరు శ్రీ శృంగేరీ పీఠాధిపత్యానంతరము, ఆది శంకరుల 'అద్వైత' సిద్ధాంతమును బహుళ ప్రచారము చేసినారు. అంతేకాక అద్వైత సిద్ధాంతమును విపులముగా వివరించే పెక్కు ప్రామాణిక గ్రంథాలను రచించి, అనితర సాధ్యమైన కృషి సలిపిన మహాను భావుడీయన. శ్రీ విద్యను గూర్చిన యోగశాస్త్ర పర మైన శ్రీ విద్యోపాసనలోని రహస్యాలను, క్షుణ్ణంగా తెలిసిన గొప్ప సాధకుడీయన.

వేద సంస్కృతిని, ఆంధ్రదేశములోని రాయల సీమలో నాటి, దాని శాఖలను నలుదిక్కుల, విస్తృత పరచి, హిందూ మతాన్ని ఉద్ధరించిన, మహాతపస్వి, శ్రీ విద్యారణ్యులవారు.

హిందూ మతమంటే, మతం మాత్రమే కాదని, నిరూపిస్తూ ఆయుర్వేదం, సంగీతం, జ్యోతిష్యం, యోగసాధన, వేదాంతం, కావ్యములు. ఉపనిత్సారం, వేదార్థము శ్రీవిద్యా రహస్యమైన మంత్రశాస్త్రము మొదలగు అనేకానేక శాస్త్ర రచనలు గావించి, హిందూ ధర్మాన్ని, సంస్కృతిని పరిపుష్టంగా తీర్చిదిద్ది, మనకందించిన మహాయోగి శ్రీ విద్యారణ్యులవారు.

ఈయన సమకాలికులలో గొప్ప తాత్త్వికుడు, మహావక్త, ప్రవక్తయైన శ్రీ వేదాంత దేశికులంతటి మహనీయునిచే నిష్పక్షపాతంగా

"అసినా తత్త్వమసి నాపర జీవ ప్రభేదినా
విద్యారణ్య, మహారణ్యం అక్షోభ్యముని రచ్చినతొ

అని శ్రీ విద్యారణ్యుని పాండితీ ప్రతిభను గుర్తించి, కీర్తించబడిన మహాతత్వవేత్త శ్రీ విద్యారణ్యుల వారు.

ఆనాడు వీరు, సాయణులు, మతోన్మాదుల మహోపద్రవము నుండి దేశమును రక్షింప, ప్రతిఘటించి, నిలువని యెడల, ఈ దేశమంతయు ఏమయి యుండెడిదో ఊహించుటకు కూడా అలవి కానిది. ఈయన జీవితములోని వివిధ దశలను మన మందరము తెలిసికొనడమే కాక, రానున్న తరముల వారికి మహనీయుని జీవిత విశేషములను, తెలియజెప్ప వలసిన అవసరం ఎంతేన కలదు.

ఈ పరివ్రాజకుని హిందూ ధర్మ పరిరక్షకుని మనము ఆదర్శంగా తీసికొని, మనసా, వాచా, కర్మణా, సంస్మరించి వారి ఆశయ సాధనకు కృషి చేయడమే ఆయనకు మన మందించే ఘనమైన నివాళి.

శ్రీ విద్యారణ్యుల వారు తెలుగు వారవడం మనకు కలిగిన గొప్ప అదృష్టం.





# శ్రీకాకుళము జిల్లా

కళింగదశమును తొమ్మిది శతాబ్దముల పర్యంతము అవిచ్ఛిన్నంగా పరిపాలించిన, తూర్పు గంగ వంశం వారి చరిత్ర చెప్పుకోదగినది. వీరు నూతన శకమును స్థాపించిరి. దీనికి గంగాశకము అందురు. మహావైభవ దశలో గంగరాజ్యము ఉత్తరమున గంగానది నుండి దక్షిణమున గోదావరినది వరకు వ్యాపించి యుండెను. ఈ గంగవంశ పరిపాలకులలో మొదటి వారు శైవులు. తరువాతవారు వైష్ణవులు. వీరు గొప్ప దేవాలయములు నిర్మించిరి. మన రాష్ట్ర మందలి శ్రీకాకుళము జిల్లాలోని శ్రీకూర్మము, ముఖలింగము వీరు నిర్మించినవే. ఒరిస్సాలోని పూరీ (జగన్నాథము), కోణార్క శ్రీ సూర్య దేవాలయము కూడా వీరు నిర్మించినవే.

శ్రీకాకుళము జిల్లా మన రాష్ట్రమునకు తూర్పున ఉన్నది. ఈ జిల్లాలో చెప్పుకోదగిన దేవాలయాలు అనేకములు కలవు. అందు బహు ప్రసిద్ధి చెందిన దేవాలయాలు అరసవిల్లి, శ్రీకూర్మము, ముఖ లింగము, శ్రీ ఉమారుద్ర కోటీశ్వరస్వామి దేవాలయము.

ఈ జిల్లాలో అతిప్రాముఖ్యమునకు వచ్చిన క్షేత్రము (శ్రీకాకుళము పట్టణమునకు దగ్గరగా) అరసవిల్లిలో వేంచేసి యున్న శ్రీ సూర్య నారాయణ స్వామి వారి దేవాలయము. ఈ దేవాలయము క్రీ.శ. 672వ సంవత్సరంలో కళింగదేశాధిపతి అయిన శ్రీ దేవేంద్ర వర్మ నిర్మించినట్లు తెలియుచున్నది. పద కొండవ శతాబ్దంలో గంగవంశీయుడైన అనంతవర్మ చోడగంగ దేవుని కాలములో నిత్యపూజలు, భోగాదు లకు, సంస్కృత పాఠశాల నిర్వహణకు భూదానము చేసినట్లు శిలాశాసనము వలన తెలియుచున్నది.

అరసవిల్లి క్షేత్ర ప్రసిద్ధికి కారణం శ్రీ సూర్య భగవానుడు వెలసిన విధము - చిత్రమైన పురాణ గాధ.

ద్వాపరయుగమందు కౌరవ పాండవ యుద్ధ సమయమున శ్రీ కృష్ణుడు పాండవపక్షము వహించెను. భీమ, దుర్యోధనులు తన వద్ద గదా యుద్ధము నేర్చు కున్న శిష్యులే, అయినా బలరామునికి దుర్యోధనునిపై అభిమానము మెండు. తమ్ముడు ఒక పక్షాన్నుండగా

తను ఎదిరి పక్షాన ఉండటం ఇష్టంలేక బలరాముడు తీర్థయాత్రలకై బయలు దేరెను.

అలా తాను కళింగ దేశం వచ్చినప్పటి కచట తీవ్రనీటి కాటకము ఏర్పడెను. అగచాట్లు పడుచున్న కళింగ దేశస్థులు బలరాముణ్ణి ఆశ్రయించారు. వారి ప్రార్థన విని, బలరాముడు తన ఆయుధమైన నాగలిని భూమిలోనికి గుచ్చి, నీటిని పైకితీసికొని వచ్చెను. ఈ జిల్లాలో ప్రవహిస్తున్న నాగావళి నది ఇదేనని జన శ్రుతి.

బలరాముడు ఆ ప్రదేశమునందు పంచలింగ ప్రతిష్ఠ చేయదలచి దేవతలనందరినీ రమ్మని ఆహ్వానించాడు. నాగావళినది ఒడ్డున రుద్రకోటేశ్వరాలయం స్థాపనకు ఏర్పాటు జరిగినది.

సరిగా ముహూర్తానికి దేవతలందరూ వచ్చారు. కానీ దేవేంద్రుడు రాలేక పోయాడు. దేవేంద్రుడు రాత్రి వేళ బయలుదేరి శ్రీ కోటీశ్వరస్వామి దర్శనానికి వచ్చినప్పటికి, నందీశ్వరుడు వీల్లేదని అటకాయించాడు. కోపావేశంతో ఇంద్రుడు వజ్రాయుధం పైకెత్తాడు. నందీశ్వరుడు తన వాడి కొమ్ములతో ఇంద్రుణ్ణి పొడిచాడు. విసిరివేసాడు. ఆ దెబ్బతో మహేంద్రుడు మైలు దూరాన ఉన్న అరసవిల్లి సమీపాన పడ్డాడు.

స్పృహ తప్పి పడిపోయిన ఇంద్రుడికి శ్రీ సూర్యభగవానుడు సాక్షాత్కరించి, నీవు పడి వున్న చోట తవ్విస్తే శిలా విగ్రహం కనిపిస్తుంది. దానిని ప్రతిష్ఠించి పూజించావంటే, సకల బాధల నుండి విముక్తుడవవుతావని, పూర్తి ఆరోగ్యం కలుగుతుందని చెప్పి, అదృశ్యుడయ్యాడు. దేవేంద్రుడు ఆ విగ్రహాన్ని పైకి తీసి అక్కడ ప్రతిష్ఠించాడు. సూర్యుణ్ణారాధించి పూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు. తన నగరానికి చేరుకున్నాడు. మానవాళికి ఆయురారోగ్యములు ఐశ్వర్యము ప్రసాదించడానికిగాను శ్రీ సూర్య భగవానుడు అరసవిల్లి క్షేత్రమున వెలసినట్లును, దేవేంద్రుడు ప్రతిష్ఠించి నట్లును భవిష్యత్ పురాణము వలన తెలుస్తున్నది.

ఉత్తరాయణ పుణ్యకాలమందు సూర్యుని ప్రాతః కిరణాలు ఆలయములో గల మూల విరాట్పై ప్రసరించుట గొప్ప విశేషమిచట. ఆరోగ్యం కొరకు శ్రీ సూర్యదేవుని సేవిస్తారు భక్తులు. ఆంధ్రదేశమున పూజలందుకొనుచున్న సుప్రసిద్ధమైన సూర్యదేవాలయ మిది ఒక్కటే. సూర్యదేవుని వలన ఈ క్షేత్రమునకు ప్రసిద్ధి కలుగుచున్నది.

ఈ సూర్యమూర్తి విగ్రహాన్ని శిల్పాచార్యుడు కడు చాకచక్యంతో నిర్మించాడు. ఏడుగుర్రాలు, వాటిని నడిపే అనూరుడు ఉషా, పద్మినీ, ఛాయలనే భార్యలు పద్మహస్తుడై అతి సుందరంగా ఆ శిల్పి చెక్కిన శ్రీ సూర్యమూర్తిని తిలకించుట గొప్ప అనుభవమవుతుంది. ఆ శిల్పి ప్రజ్ఞ ద్యోతకమవుతుంది. ముందున్న మహాద్వారాన్ని చూస్తే ఒక రాజసౌధము తలపునకు వస్తుంది. రంగు రంగుల పాలరాతితో చెక్కబడిన గర్భాలయము చూడముచ్చటగా ఉంటుంది.

బలరాముడు ప్రతిష్ఠించిన పంచలింగ క్షేత్రాలు, శ్రీ రుద్రకోటీశ్వరుడు (శ్రీకాకుళం) సంగమేశ్వరుడు (సంగం) సోమేశ్వరుడు (గుంప) పాయకేశ్వరుడు (పాయకపాడు) మణినాగేశ్వరుడు (కళ్ళేపల్లి).

## శ్రీ కూర్మక్షేత్రం

శ్రీ కూర్మక్షేత్రము అరసవిల్లికి తూర్పున సుమారు 8 కి.మీ. దూరమున సముద్ర తీరమున కలదు. శ్రీ కూర్మమునందు శ్రీ కూర్మనాథ స్వామి శ్రీమన్నారాయణముని రెండవ అవతారమైన కూర్మ రూపమున వెలసియున్నారు.

క్రీ.శ. 4 నుంచి 14వ శతాబ్ది వరకు కళింగ రాజ్యమును పరిపాలించిన ప్రభువులను గూర్చి తెలియజేయు శాసనములెన్నియో ఇచట గలవు.

శ్రీ కూర్మనాథుని లింగము గుప్త లింగమనియు శ్రీరామానుజుని ప్రభావముచే ఇది కూర్మనాథునిగా మారినదనియు గాథలు కలవు.

దక్షిణ సముద్ర తీరమున శ్వేతాచలమను పర్వతమున్నది. శ్వేత చక్రవర్తి ఈ ప్రాంతమును పరిపాలించుచుండెను. ఇతని ధర్మపత్ని మహా భక్తురాలు. ఒకానొక ఏకాదశినాడు ఈమె వ్రతము చేయునపుడు ఆమెకు వ్రతభంగము కలిగించుటకు శ్వేత చక్రవర్తి అంతః పురమున ప్రవేశించగా, ఆమె వ్రతభంగము కలుగకుండ శ్రీహరిని ప్రార్థించగా, వారిరువురి మధ్య గంగ ఉద్భ వించెననియు, ఈ గంగాదేవియే వంశధార నది యని ప్రతీతి. శ్వేత చక్రవర్తి శ్రీహరిని గూర్చి తపస్సుచేయగా శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమయ్యెనని, స్థల పురాణము ననుసరించి తెలియుచున్నది.

ఈ దేవాలయము నందు స్వామి పడమటి ముఖముగా నుండుట, రెండు ధ్వజస్థంబములు కలిగి యుండుట, ఈ దేవాలయమందలి గొప్ప విశేషములు. మన ఆంధ్రదేశమునందే కాక మన భరతఖండ మందు ఏకైక కూర్మనాథుని దేవాలయమిదియే.

## ముఖలింగ క్షేత్రము

(శ్రీకాకుళము) ఆముదాలవలస రైల్వేస్టేషనుకు సుమారు 30 కి.మీ. దూరమున అతిప్రాచీనమైన శ్రీముఖ లింగేశ్వర స్వామి దేవాలయము కలదు. ఈ దేవాలయమునందు ఎన్నో శిలాశాసనములు నిక్షిప్తమై యున్నవి.

హిమాలయ పర్వతముపై పర్వతుడు, నారదుడు అను మునీశ్వరులు యజ్ఞము చేసిరి. ఆ యజ్ఞమును చూడవచ్చిన గంధర్వులు గానము చేసిరి. ఆ గంధర్వుల గానకళా కౌశలమునకు ఆ పర్వతముపై గల శబర కన్యలు ఆశ్చర్యపడిరి. గంధర్వులు ఆ శబర కన్యలను మోహించిరి. వాసుదేవ మహర్షి ఆ గంధర్వులను మీరు శబరులై జన్మింపుడని శపించగా గంధర్వులు పరమశివుని ప్రార్థించిరి. పరమశివుడు ఆ మహర్షి శాపము అనుభవించక తప్పదని శ్రీ కూర్మ ప్రాంతములో గల వనములో శబరులై పుట్టుడనియు తానచ్చట వెలసి, శాపవిమోచన గావింతుననియు చెప్పెను. గంధర్వరాజగు చిత్రసేనుడు శబర నాయకుడుగా జన్మించెను. ఆయన భార్య యగు చిత్ర, జంగమ స్త్రీగా జన్మించెను. శబరనాయకుడు శబర కాంతను, జంగమ స్త్రీని పెండ్లాడెను. శబర నాయకునికి ఇరువురి భార్యల పోరు హెచ్చెను. ఆయన తన ఇరువురి భార్యలకు, అడవిలోగల ఇప్పచెట్లను చూపించి, అందుగల రెండు కొమ్మలను చెరియొకటి పంచి, ఆ పువ్వులను అమ్ముకొని జీవింపుడని ఆజ్ఞాపించెను. అయినప్పటికి ఇంకను తన భార్యలు తగవులాట మానని కారణాన, శబర నాయకుడు ఆ చెట్లను మొదళ్ళవరకు నరికివేసెను. ఆ చెట్ల నుండి గొప్ప వెలుగుతో పరమ శివుడు వెలసి, శబరులైన గంధర్వులకు శాప విముక్తి గావించెను.

కళింగరాజైన విష్ణువర్థనునకు శ్రీ మధుకేశ్వరుడు స్వప్నములో కనిపించి, ఆలయ నిర్మాణము గావింపమని కోరెను. ప్రస్తుతముగల ఆలయం గంగ వంశస్థులైన రాజులచే నిర్మింపబడినది. ఆలయము వంశధారా నది తీరమున కలదు.

శ్రీ ముఖలింగేశ్వర దేవాలయాన్ని శ్రీ మధుకేశ్వరస్వామి దేవాలయం అని కూడా అంటారు. ఇది క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దములో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. స్కాందపురాణ ఉత్తర భాగాన్ననుసరించి, గజపతుల వంశం వాడైన మధుకర్ణ విష్ణువర్థనుడు భూగర్భంలో పడియున్న శ్రీ మధుకేశ్వర లింగాన్ని పైకి తీయించి, ఆలయం మండపం నిర్మించినట్లు తెలియుచున్నది. ఈ దేవాలయ స్థంబాల మీద నున్న శిలాఫలకాల మీద, ఎన్నో శాసనాలు కలవు. దేవాలయం ఉత్తరప్రాంతశిల్ప సంప్రదాయంతో కట్టబడినది. అయితే కొంత భాగం దక్షిణ ప్రాంత

సంప్రదాయం కూడా ఉన్నది. శిల్పి తన చాతుర్యంతో ఉత్తర, దక్షిణ సంప్రదాయాలను మేళవించి, వినూతన శైలిని సృష్టించి చరితార్థుడైనాడు. గర్భగుడిపైన విమానం ఉత్తరదేశ సంప్రదాయంతో కట్టబడి యున్నది. ముఖ మండపం లేక అర్థ మండపం కట్టడం దక్షిణాది సంప్రదాయం కనిపిస్తున్నది. ఈ దేవాలయం నిర్మించిన కళింగ శిల్పుల అసాధారణ రచనాశక్తి, హస్త కౌశలము, బుద్ధి కుశలత చెప్పకోదగినవి. ఈ అంశాలు శిల్పాలలో, ప్రతి నిర్మాణంలో ప్రతిచోట వ్యక్తమవు చున్నవి. సింహద్వారాన్నిదాటి లోపలకువెళ్తే ద్వారము పై మధుకేశ్వరుడు ఉద్భవించిన తీరు, మలచబడిన శిలాఫలకం అద్భుతమైన వనితనంతో కనబడు తున్నది. తరువాత నందీశ్వరుడు, ఎన్నో శిల్పాలు. ముఖ్యంగా సరస్వతీ దేవి విగ్రహం జగదేక మోహనంగా, దర్శనీయంగా ఉన్నవి. ఇలా ఎన్నోశిల్పాలు కమనీయ శిల్ప రచనా చాతుర్యంతో దర్శనమిస్తాయి. క్షేత్రపాల కుడైన వాసుదేవ మూర్తి శిల్పం, తారాదేవి విగ్రహం, పన్నెండు చేతులతో కూడిన నటరాజ విగ్రహం ఇంకా ఆలయంమీద అనేక మూర్తులు కన్నులకు విందు చేస్తాయి. అంతే కాక చింతామణి గణపతి, సాక్షి గణపతి, డుంఠి విఘ్నేశ్వర మూర్తులు కాక, నృత్య గణపతి కనులకు విందు చేస్తుంటాయి. ఇంకొక చోట ఆలయ శిలాఫలకం మీద భైరవ మూర్తి, అర్థనారీశ్వర శిల్పాలు చూడదగ్గవి. హరిహర మూర్తి శిల్పం ఈ దేవాలయ ప్రాచీనతను సూచిస్తున్నది.

శ్రీముఖలింగేశ్వరాలయానికి పంచపీఠ స్థలమని ప్రసిద్ధి కలదు. ఇందు ఆదిత్యుడు, అంబిక, విష్ణుమూర్తి, వినాయకుడు, మహేశ్వరుడు వున్నారు. వీరిని పంచాయతన దేవతలని అంటారు. ఈ ప్రదేశంలో, మంత్రానుష్ఠానం చేసినట్లయితే మంత్రసిద్ధి, దేవతా దర్శనము తక్కువ కాలములోనే జరుగుతుందని అనేకులు నమ్ముతారు. ఇలాంటి విశిష్ట కారణాల వలన ఈ క్షేత్రం ప్రత్యేకతను సంతరించుకొన్నది.

శ్రీమధుకేశ్వర స్వామివారి దేవేరి వరాహి, ఈ దేవాలయంలో సప్తమాతృకలమూర్తులు రమణీయంగా చెక్కబడి యున్నవి. వరాహిదేవి ఎనిమిది చేతులతో వున్నది. మహిషాసురమర్థని కూడా కలదు. ఈ దేవాలయంలో ఇంకను అనేక కమనీయ శిల్పాలు ఉన్నవి. గరుడవాహనుడైన శ్రీహరి, సూర్యదేవుడు దర్శనీయంగా నున్నవి.

ఈ దేవాలయ మంటపంలో మహాభయంకర మైన పశుపతిమూర్తి ఉన్నది. సింహ వాహనుడీయన. రెండు ప్రక్కల గంగా పార్వతులున్నారు. ముఖ మండపం నుండి దక్షిణ ద్వారాన నుండి వెలుపలికి వచ్చేటప్పుడు పార్వతీ పరమేశ్వరుల ద్యూతక్రీడ చెక్కబడిన శిల్పం చూడముచ్చట కలుగుతుంది.

ఇక్కడి అనేక శిల్పాలలో కళింగదేశపు కట్టు జుట్టు మొదలైన వేషధారణ చూడగలము. వజ్రహస్త మహారాజ విగ్రహం కూడా ఉన్నది. జైన బౌద్ధ చిహ్నాలు కూడా కనబడుతున్నవి,

భీమేశ్వర, సోమేశ్వరాలయాలు కూడా ఉన్నవి. ఇవి సుమారు నూరు గజాల దూరంలో అనగా మధు కేశ్వరుని దేవాలయానికి దగ్గరలో కలవు. ఈ ఆలయం చిన్నదైనా శిల్పాల విషయంలో గొప్పగా ఉన్నది. సోమేశ్వరస్వామి లింగము నల్లనై నునుపు దేరి చూడముచ్చగా ఉంటుంది.

శ్రీకాకుళం పట్టణమందు నాగావళీ నదీ తీరాన బలరామ ప్రతిష్ఠితమైన శ్రీ ఉమారుద్ర కోటీశ్వర స్వామి ఆలయం కలదు. ఇందు గల పెద్ద నందీశ్వర విగ్రహం చూడదగ్గది.

శ్రీ రుద్రకోటీశ్వర స్వామి తన సతీమణితో ఏకాంత మందుండగా, దేవేంద్రుడు వీరి దర్శనార్థము రాగా, ద్వారాన గల నందీశ్వరుడు అతని రాక నిరోధించి నట్లు పురాణ ప్రసిద్ధి కలదు. ఈ దేవాలయము నాగా

వళీ నదీ తీర మందు బలరామునిచే ప్రతిష్ఠించబడిన పంచలింగములలో ఇది ఒకటి.

కురుక్షేత్ర సంగ్రామానంతరము, తన శిష్యుడైన దుర్యోధనుని అక్రమంగా వధించినారని విని, బల రాముడు కోపించి, తన నాగటిచాలును ఎత్తి పాండవుల పైకి వెళ్ళగా, శ్రీ కృష్ణ పరమాత్మ శాంతిపజేసినట్లు పురాణ ప్రసిద్ధి కలదు. శ్రీ బలరాముడు ఎత్తిన నాగటి చాలు దెబ్బలకు నాగావళినదిగా నైనదని, ఆ నదీతీరము నందు ఐదు స్థలములలో శ్రీ బలరాముడు పంచ లింగములు ప్రతిష్ఠించినని పురాణ ప్రసిద్ధి కలదు.

నాగావళి నది సముద్రములో కలియు సంగమ స్థానములో (కళ్లేపల్లి గ్రామమున) శ్రీమణి నాగేశ్వర స్వామి, శ్రీకాకుళ పట్టణములో శ్రీ ఉమారుద్ర కోటీ శ్వర స్వామి, పాలకొండ తాలూకా సంగాము గ్రామము నందుగల శ్రీ సంగమేశ్వరస్వామి, పార్వతీపురం తాలూకా గుంప గ్రామంలో శ్రీ సోమేశ్వర స్వామి, ఒరిస్సా రాష్ట్రములో పాయకపాడులో అయిదవ లింగమును ప్రసిద్ధి చెందినది.

కార్తీక మాసమందును, మహాశివరాత్రికిని ఇచ్చట గొప్ప ఉత్సవములు జరుగును. మహాశివ రాత్రి రోజు ఈ పంచమహా తీర్థములను అభిషేకించిన విశేష ఫలసిద్ధి కలుగునని పెద్దలు చెప్పుచున్నారు.

మరియు ఈ జిల్లాలోని రావివలస గ్రామమున (టెక్కలి మండలము) శ్రీ యెండల మల్లిఖార్జున స్వామి దేవాలయముకలదు. ఈ దేవాలయము నందలి శివలింగము చాల పెద్దది. స్వయంభువు. ఆయురా రోగ్యములు ఈ స్వామి అనుగ్రహిస్తాడని ప్రతీతి.





# విజయనగరం జిల్లా

విజయనగరం రైల్వే స్టేషనుకు దగ్గరలోనున్న శ్రీ పైడితల్లి అమ్మవారి దేవాలయం చూడదగ్గది. మూలవిరాట్ దేవాలయమిది. ఈ ఆలయమే అసలు పైడిమాంబ గుడి అని పెద్దలు చెబుతారు. ఈనాటికీ చాలా మంది వృద్ధులు ఈ ఆలయానికి వెళ్ళి శ్రీ అమ్మ వారికి పూజలు జరుపుతుండడం విశేషము. దీనిని వనంగుడి దేవాలయము అంటుంటారు.

విజయనగరం రైల్వే స్టేషనుకు సుమారు 3 కి.మీ. దూరమున ముఖ్య రహదారిపై (మూడు లాంతర్ల వద్ద) మహాత్మాగాంధీ రోడ్డుననున్న దేవాలయము చదురుగుడి. ఇచ్చటనే శ్రీపైడితల్లి అమ్మవారు 1924 లో వెలసినట్లు అప్పటినుండి ఈ ఆలయ అజమాయిషీ విజయనగరం రాజావారి ఆధీనంలో దివాన్‌గారి పెత్తనంలో పరిపాలన సాగేదని 1966లో ఈ ఆలయం తూ॥ గోదావరిజిల్లాకు చెందిన కాకినాడ తాలూకా మట్లపాలెం రాజులు శ్రీమతి పెనుమత్స వేంకట సూర్యంగారి ప్రోద్బలంతో ఇంకను అనేకమంది పుర ప్రముఖుల సహకారంతో ఆలయం పునరుద్ధరింప బడినదని అమ్మవారు అప్పట్లో తూర్పుదిశగా ఉండేదని పెద్దలు చెబుతారు. విజయ నగరం మహారాజులు 104 దేవాలయాలు నిర్మించారని తెలుస్తున్నది. ఈ ఆలయ చరిత్రల వలన శ్రీ పైడి మాంబ చరిత్ర గురించి తెలుస్తున్నది.

అయితే, ఈ దేవాలయచరిత్ర ఇదమిద్ధంగా తెలియకున్నా ఈమె గురించి అనేక గాథలు జనశ్రుతు లుగా వస్తున్నవి. ఈ దేవాలయ వంశపారంపర్య ధర్మకర్త గౌరవనీయులు శ్రీ పి.వి.జి.రాజు. రాజాసాహెబ్ వారి పర్యవేక్షణలో నూతన పోకడలతో దినదినాభివృద్ధి చెందుతున్నది.

ఈ దేవత ఎంతో శక్తివంతురాలిగా, కరుణా స్వరూపిణిగా ప్రసిద్ధిచెందింది. ఈ ప్రాంత భక్తజనులు ప్రతి శుభకార్యారంభమున ఈమెకు నమస్కరించి, ఈమెను సేవించి ఆ తరువాతనే ప్రారంభిస్తారు. ఈ ఆనవాయితీ ఎన్నో సంవత్సరాలనుంచి కొనసాగు తున్నది.

విజయనగర ప్రజల భక్తి ప్రపత్తులకు తరతరాల జానపద సంప్రదాయాలకు ప్రతీకగా విజయనగర పైడిమాంబ జాతర (ఉత్సవం) ప్రతి సంవత్సరం విజయదశమి తరువాత వచ్చే మంగళవారం రోజున "సిరిమాను" ఉత్సవంగా జరపడం ఆనవాయితీ.

తరువాత పదిహేను రోజులకు "ఉయ్యాల కంబాల" ఉత్సవం జరుపుతారు. అదే రోజు రాత్రి డప్పులు, డోలు, సన్నాయి మేళాలతో ఊరేగిస్తూ అమ్మవారిని వనంగుడికి తీసుకొనివెళ్లి అనుపు ఉత్సవం జరుపుతారు. అప్పటి నుండి అమ్మ వారు ఆరునెలల వరకు వనంగుడిలో ఉంటుంది. ప్రతి సంవత్సరం అమ్మవారిని వనంగుడి వద్దనుండి మూడు లాంతర్ల వద్దనున్న గుడికి తీసుకొనివస్తారు. రాత్రి తొమ్మిది గంటలకు దేవాలయ అర్చకస్వామి ఇంటి వద్ద నుండి అమ్మవారి ప్రతిమ పసుపు కుంకుమలతో అలంకరించి ఘటంపైపెట్టి అఖండజ్యోతి వెలిగించి హుకుంపేట నుండి దేవాలయం వీధిగుండా మూడు లాంతర్ల వద్దనున్న ఆలయమునకు (చదురు గుడికి) తీసికొని వచ్చి అమ్మవారికి పూజలు జరిపి అక్కడ నుండి రైల్వేస్టేషను వద్దనున్న వనం గుడికి ఊరేగింపుగా వెళ్ళి 'మూలవిరాట్' అమ్మవారికి కుంభం పోసి పూజలు జరిపి అమ్మవారి ప్రతిమ కలశము పసుపు కుంకుమలతో పెద్ద చెరువు తూర్పు గట్టునకు వచ్చి చెరువులో స్నానాది కార్యక్రమములు జరిపి ఆలయపుజారి మంత్రోచ్చారణ జరిపి అమ్మ వారిని రమ్మని భక్తులు నినాదాలు చేస్తూ పిలుస్తారు.

తరువాత పెద్ద చెరువు నుండి అమ్మవారిని పసుపు కుంకుమలతో మూడు లాంతర్ల వద్ద నున్న గుడికి తెచ్చి ఆ పసుపు కుంకుమలు అమ్మ వారికి పూసి అప్పటినుండి అనగా వైశాఖ శుద్ధ దశమి మంగళవారం నుండి "సిరిమాను" ఉయ్యాల కంబాల ఉత్సవాలు జరిగేవరకు శ్రీ అమ్మవారు మూడు లాంతర్ల వద్దనున్న గుడిలో ఉంచుతారు. ఈ ఆరు నెలలూ భక్తులు అధిక సంఖ్యలో అమ్మవారిని ప్రతి నిత్యము పూజలు జరిపి, తృప్తి చెందుతారు.

ప్రతి సంవత్సరం విజయదశమి వెళ్ళిన మొదటి మంగళవారం సిరిమాను ఉత్సవం వైభవోపేతంగా జరుపుతారు. ఈ ఉత్సవమెంతో ప్రత్యేకతను, వైభవాన్ని సంతరించుకొన్నది. ఈ జాతరను తిలకించడానికి లక్షలాది భక్తజన సందోహం విజయ నగరానికి తరలి వస్తారు. శ్రీ పూరీ జగన్నాథ ఉత్సవం తరువాత అంతటి వైభవంగా జరిగే ఉత్సవమిది.

"సిరిమాను" గురించి పదిహేను రోజులు ముందుగా శ్రీ పైడిమాంబ అమ్మవారు పూజారికి కలలో కనిపించి సిరిమాను ఏ ప్రాంతంలో నున్నదో చెబుతుంది. తరువాత పుజారి కోరిక ననుస రించి "సిరిమాను చెట్టు" ఉన్న స్థలంగల వ్యక్తి ఎంతటి వాడైనప్పటికిని ఆసిరిమాను కొట్టుటకు అంగీకరించక తప్పదు. ఈ సిరిమాను కొట్టుటకుముందు అర్చక స్వామి నియమ నిష్ఠలతో ఉపవాసముండి ఆ వృక్ష రాజమునకు కుంభముపోసి (అన్నము) పూజలు చేసి ఆమ్రానునుకొట్టి తీసుకొనిరావడం ఆనవాయితీగా వస్తున్నది. ఈ సందర్భములో విజయనగరం, హుకుం పేట వాస్తవ్యులు ఎక్కువగా పాల్గొనడం జరుగుతున్నది. ఈ సిరిమానును పూజారి ఇంటికి తెచ్చి అనుభవజ్ఞు లయిన వడ్రంగి పనివారితో ఈ మానును అందముగా మలచి సిరిమానుగా తయారుచేసి రథముపై అమర్చ డము జరుగుతుంది. ఈ సిరిమాను పూజారి, ఇంటి వద్దనుండి మూడు లాంతర్ల వద్దకు, మంగళవారం మధ్యాహ్నం రెండుగంటలకు తీసుకొనిరావడం జరుగు తుంది. తదుపరి సిరిమాను రథము పైకి ఎక్కించి ఊరేగింపు కొరకు సిద్ధము చేస్తారు. అదే రోజు సమారు మూడుగంటల ప్రాంతంలో పూజారి దేవాలయ సాంప్రదాయాననుసరించి అలంకరించుకొని హుకుం పేట నుంచి ఊరేగింపుగా వేలాదిమంది భక్తులు వెంట రాగా ఆలయమునకు వచ్చి అమ్మవారిని దర్శించుకొని సిరిమానుపై ఆసీనడవు తాడు. పూజారి ఇంటి వద్ద నుండి కాలినడకన వచ్చే సమయాన భక్తులు ఆయన కాళ్ళపై బిందెలతో పసుపు నీళ్ళుపోసి తమ చంటి పిల్లలను నేలపై పరుండబెట్టి పూజారిచే వారిపై నుండి దాటించుట జరుగుతుంది. మధ్యాహ్నం మూడు, నాలుగు గంటల సమయమున ప్రారంభమై ఈ

సిరిమాను ఉత్సవము మూడు పర్యాయములు దేవాలయం నుండి రాజావారి కోటవరకు తిరుగుతుంది. కోటపై విజయనగరరాజ వంశీయులు ఆసీనులై సిరిమాను పైనున్న అమ్మవారు, పూజారికి నూతన వస్త్రములు ఇచ్చి శ్రీ అమ్మవారికి పూజలు జరిపించు కోవడం ఆచారంగా వస్తున్నవి. ఈ సిరిమాను పొడవు సుమారు ముప్పై, నలభై అడుగులు ఉంటుంది. ఈ సిరిమానుకు ముందు తెల్ల ఏనుగు రూపమున తయారుచేయబడిన రథము ఉంటుంది.

పూర్వం మహారాజులు సిరిమాను ఊరేగింపు ముందు తెల్ల ఏనుగు అంబారీపై ఆసీనులై ఊరేగింపులో పాల్గొనేవారని, నేడు ఆ ఆచారం తెల్ల ఏనుగుకు బదులుగా ఏనుగువలె తయారుచేసిన బొమ్మతో సిరిమాను ముందు ఊరేగించడం ఆచారమైనది తదుపరి "అంజలి" రథము దానిపై ముసుగులు వేసుకొని ఐదుగురు మనుష్యులు కూర్చొని ఉండటం జరుగుతుంది. ఇట్టి పూజా కార్యక్రమం మనదేశంలో ఎచ్చటను జరుగు తున్నట్లు తెలియుటలేదు. ఈ అంజలి రథం విశిష్టత ఆ ప్రాంతము భక్తుల విశేషముగా చెప్పుకుంటారు. శ్రీ పైడిమాంబ అమ్మవారు కన్యగా మృతి చెందినందున ఆమెకు పసుపు కుంకుమలతో ఉన్న స్త్రీలు (ముత్తైదువలు) అంటే ఎంతో ఇష్టమని అందుకే ఈమె వెంట సిరిమానుకు ముందున్న రథముపై ఐదుగురు స్త్రీలుకూర్చుండి ఊరేగింపులో పాల్గొనడం ఆచారముగా వస్తున్నది.

ఈ సిరిమాను వెంట "పాలధార" అని బెస్తల వలలతో అలంకరించిన గొడుగు ఆకారములోనున్న రథమును ఫల పుష్పాదులతో అలంకరించి ఊరేగింపులో పాల్గొనడం విశేషముగా చెపుతారిక్కడి వారు. ఈ పాలధారను తయారు చేయడములో విజయనగరం యాతవీథి వాస్తవ్యులు ప్రముఖపాత్ర వహిస్తున్నారు. సరిగ్గా సూర్యాస్తమయ సమయానికి ముందుగా ఈ సిరిమాను ఊరేగింపు ముగిస్తారు. ఉత్తరాంధ్ర మంచేకాక ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాల నుంచి వేలాది భక్తులు పాల్గొని అమ్మవారిని దర్శించి సేవిస్తారు. ఉత్సవానంతరం మూడు లాంతర్ల వద్దనున్న సిరిమానుకి వేలాదిమంది పూజలు చేసికొని మాను యొక్క పేడుముక్కలను తీసుకొని వెళ్ళి రైతులు తమ నాగలివద్ద వుంచి పూజలు జరుపుతారు. అందువలన పంటలు బాగా పండుతాయని వారి నమ్మకం.

ఈ దేవాలయానికి స్థలపురాణం లేకపోయి నప్పటికి జన శ్రుతిననుసరించి ప్రతి గ్రామం లోను పట్టణంలోను వివిధ పేర్లతో గ్రామదేవతలు ఉన్నట్లే విజయనగరంలోకూడా ఈ అమ్మవారు గ్రామదేవత యని కొందరు చెబుతుంటే మరికొందరు ఈ అమ్మ వారు మహారాజుల తోబుట్టువని అంటున్నారు.

ఏది ఏమయినా విజయనగరం శ్రీ పైడిమాంబ అమ్మవారు మహారాజుల వంశానికి గల సంబంధం అత్యంత సన్నిహితమైనదనడానికి ఎన్నో ఆధారా లున్నాయి అని ఇచ్చటి శ్రీ పైడిమాంబ అమ్మవారి చరిత్రవలన తెలుస్తున్నది. శ్రీ పైడిమాంబ పుట్టు పూర్వోత్త రాలు తెలియకున్నప్పటికి జనశ్రుతిగా విన వస్తున్న గాథలు వింటే శ్రీ పైడిమాంబ బొబ్బిలియుద్ధం తరువాత విజయదశమి పిదప వచ్చిన మంగళవారం అర్ధరాత్రి పట్టణాన పడమటనుగల పెద్ద చెరువులో లభించిన విగ్రహము ఈనాటి ఈ ప్రాంత ప్రజల ఇలవేలుపు పసిడితల్లి శ్రీ పైడిమాంబ అని తెలుస్తున్నది.

1976 సం॥లో ఈ దేవాలయము రాష్ట్ర దేవాదాయ శాఖకు పూర్తి అజమాయిషీలోనికి వచ్చినది.

1980లో తూర్పునఉన్న శ్రీ అమ్మవారిని ఉత్తరదిశగా ప్రతిష్ఠించి రాజగోపురం నిర్మాణం జరిగింది. ప్రస్తుతం ఈ ఆలయం నిత్యం భక్తులరాక పోక లతో కళకళలాడుతూ ఎంతో వైభవంగా విరాజిల్లుచున్నది.

## శ్రీ వేంకటేశ్వరాలయము తోటపల్లి

విజయనగరంజిల్లాలో పార్వతీపురం సమీపంలో నాగావళి నదీతీరమున "తోటపల్లి" వద్దగల శ్రీ వేంకటేశ్వరాలయము ఈ జిల్లాలో చెప్పుకోదగ్గ దేవాలయము, ఎంతో వైభవోపేతముగా నుంటూ

ఎంతో అభివృద్ధిని సాధిస్తున్నది. రెండవ తిరుపతి తిరుమలగా దినదిన ప్రవర్ధమానమగుచు భక్తజనుల రాకపోకలతో కళకళలాడుచున్నది. వసతి గృహములు కళ్యాణమండపము ఇంకనూ అనేక సౌకర్యములతో ఈ క్షేత్రము దర్శనీయమగుచున్నది.

## శ్రీరామ క్షేత్రం, రామతీర్థాలు

విజయనగరానికి సమారు 15 కి.మీ దూరంలో ప్రఖ్యాతివహిస్తున్న శ్రీరామ క్షేత్రం "రామతీర్థాలు" ఉన్నది. ఎంతో పురాతనమైనదీ క్షేత్రం ఎన్నో సంవత్సరాల కిందటనే ఈ క్షేత్ర నిర్మాణం జరిగినదని తెలుస్తున్నది. విశాల ప్రాంగణములతో నిర్మాణమైన ఈ దేవాలయము వాస్తుశాస్త్ర ప్రమాణముగా కొండ ప్రక్కగా నిర్మింపబడిన ఈ క్షేత్రం భక్త జనులను ఆకర్షిస్తూ ప్రఖ్యాతి చెందినది.

## శివ క్షేత్రం, పుణ్యగిరి

విజయనగరానికి సుమారు 35కి.మీ. దూరమున గల శృంగవరపుకోటకు సుమారు 5 కి.మీ. దూరంలో పశ్చిమానగల గొప్ప శైవ క్షేత్రము పుణ్యగిరి. ఈ క్షేత్ర పురాణము ఇదమిద్దమని చెప్పతగిన చారిత్రక ఆధార ములుకానీ పురాణ ఇతిహాస గాథలుకానీ లేవు. అయితే ఎన్నో శతాబ్దాల నుంచి పండిత పామరులచే విశేషంగా ఈ క్షేత్ర విశిష్టత కొనియాడబడుచున్నది. బహుప్రచార ములో నున్న ఈ క్షేత్రచరిత్ర ఈ విధముగానున్నది.

సముద్ర మట్టమునకు సుమారు 2000 అడుగుల ఎత్తునగల తూర్పు కనుమల రమణీయ ప్రకృతి సౌందర్యముతో విలసిల్లుచున్న కొండవాలులో ఈ క్షేత్రమున్నది. ఈ దేవాలయము బహు పురాతన మని చెప్పుటకు ఈ దేవాలయ స్థల నిర్దేశనము గమనించిన తెలియగలదు.

ప్రాచీనకాలమందు ఈ పర్వతశ్రేణుల యందు అనేకమంది యోగులు, తాపసులు, పుణ్య పురుషులు, మరియు సిద్ధులు పరమేశ్వరుని ధ్యానించి ముక్తి నొందిరి. అందువలననే యీగిరి పుణ్యగిరిగా ప్రసిద్ధి చెందినది. సహజ సౌందర్యముతో, సెలయేరులతో, వివిధ వృక్షజాలములతో విరబూచిన అడవి మల్లెలు యశోదావనముతో మనోల్లాసముగా నుండి బహుదర్శ నీయమైన స్థలములో ఈ క్షేత్రము వెలయుట దైవ నిర్ణయమనుటకెట్టి సందేహములేదు. ఈ సుందర దృశ్యములను చూడవలయునేకాని వర్ణింప వీలుపడదు.

ద్వాపర యుగమున పాండు సుతులు జూదమున ఓడిన అనంతరము అరణ్యావాసము గడిపినదీ ప్రాంతమని స్థానికుల కథనము. విరాటరాజు కొలువులో వీరు మారువేషముతో గడిపిన (భారత కథనము ననుసరించి) మత్స్యదేశము నేడు జల విద్యుత్ కేంద్రమైన "మాచ్ ఖండ్" అనియు మత్స్యగుండము అనియు ఈ ప్రాంతమునకు సంబంధించి విజయనగర జిల్లా అంతయు విరాటరాజ్య విస్తీర్ణమై ఉండవచ్చునని ఈ క్షేత్ర ప్రాంతముననే విరాటరాజు కొలువు ఉండ వచ్చునని ఇందుకు నిదర్శనములుగా నేటికినీ రాతితో చెక్కబడిన సింహాసనములు, రాతితో కట్టబడిన కట్టడములు కొన్ని కుడ్య శిథిలములు చూడదగి యున్నవి. సువిశాలమైన అరకులోయ యందే ఉత్తర దక్షిణ గోగ్రహణములు జరిగెనని జన శృతికలదు. శృంగ వరపుకోటలో కూడా మట్టికోట నేటికీ కలదు. ఈ కోటయే కీచకుని కోటయని స్థానికుల నమ్మకము భీమునిచే వధింపబడిన కీచకునిచే శృంగార విహారము లకు వినియోగించుటచే శృంగారపుకోట నేడు శృంగ వరపుకోట గ్రామముగా మారినదని చెప్పుచున్నారు. ఇంకను ఎన్నో పరిశోధనలు జరుపవలసియున్నది.

అకాల మరణమువల్ల కీచకునికి ముక్తి లేదని వగచుచున్న విరాటరాజు భార్య సుదేష్ణ గారి కుటుంబీ కులనుచూచి విరాటరాజు, కంకుభట్టుగానున్న ధర్మ రాజును ముక్తిమార్గము తెలియపరచమని ప్రార్థింప

ధర్మరాజు శివుని ప్రార్థింప పరమశివుడు జటాఝూటము నుండి నొక నీటిధారను ప్రసరింపజేయగా ఉద్భవించిన నీటిధారయే కీచకునికి ముక్తిని ప్రసాదించినదని అదియే నేటి, ఇచ్చటగల పుట్టుధార యని స్థానికులు పిలుచుచున్నారు.

కాశీ క్షేత్రమువలే ఇచ్చటకూడా కోటి లింగా విర్భణము కావించబడినందున కీచకుని అస్థి నిమజ్జన వారి కుటింబీకులచే ఇచ్చటనే జరిపించినట్లు చెప్పుకొనుటకద్దు. ఈ లింగములు అధోముఖములుగా ఉంటూ ప్రతి లింగమునుండీ గంగ ఉద్భవించుట మన దేశములో ఎచ్చటనులేని ఈ క్షేత్ర విశిష్ఠతను చాటుచున్నది. మనదేశమున శ్రీశైలం, కోటిపల్లి మొదలగు గొప్ప శైవ క్షేత్రములందు శివలింగములు భూమిపైన ఊర్ధ్వముఖముగా ఉంటూ ఆ లింగముల ప్రక్కనుండి యో క్రిందనుండియో గంగోద్భవం జరుగుచున్నది. కాని ఇచ్చటి స్థితి అట్టిదికాదు. ఈశ్వరుని శిరస్సు నుండే గంగోత్పత్తి జరుగుచున్నదా! ఎచ్చట నుండి ఈ నీరు వచ్చుచున్నది! సంతత ధారాపాతంగా వచ్చు చున్న ఈ పవిత్రజలాలలో అస్థి నిమజ్జనం పుణ్య ప్రథమని నమ్ముచున్న ఇచ్చట భక్తజనుల నమ్మకమే క్షేత్ర ప్రసిద్ధికి ముఖ్యకారణముగానున్నది.

అజ్ఞాతవాస ప్రారంభమున పాండవులు అస్త్ర శస్త్రములను ఈ ప్రాంతమునకు సుమారు 15 కి.మీ. దూరమును జమ్మి వృక్షముపై దాచుటచే ఆ ప్రాంతమును జామిగాను రాత్రియంతయు నిద్ర లేకుండా ఇచ్చట పాండవులు అజ్ఞాతవాసము గడిపిన ప్రదేశము "జాగరము"గాను పిలువబడుచున్నవని జన శ్రుతి సహదేవుడు ఆలమందలను ఈ ప్రాంతమున కాచుచుండెడివాడని అందుచే "అలమండ"గాను ధర్మ రాజు సేవలు గుర్తించి విరాటరాజు నేడు పిలువబడుచున్న ధర్మవరం కానుగా నిచ్చెనని ప్రతీతి కలదు.

శృంగవరపుకోటలో పాండవుల చావిడి అను ప్రదేశము కలదు. నేడిది అంగడిగా మార్చబడినను పూర్వ సంప్రదాయాన్ని విస్మరించక పాండవుల చావిడిగా నొక గదిని ప్రత్యేకించి ఇందు విగ్రహముల నుంచిరి. అందువలన ఈ ప్రాంతమును భారత గాథకు అన్వయించుట జన సమన్వయమునకు పరిపాటి అయినది.

ఇచ్చటగల క్షేత్రముతోపాటు శృంగవరపు కోటలో వెలసిన "ఎరికెమ్మ పేరంటాలు" ధర్మవరం దగ్గరనున్న "సన్యాసయ్య స్వామి"కి కలసి మహా శివరాత్రి నుంచి అష్టమి వరకు జాతర సాగును. పుణ్యగిరి దర్శించుచున్న భక్తుల పేరంటాలును కూడా దర్శించి తృప్తిచెందుచున్నారు.

ఇచ్చటగల "ఎరికెమ్మ పేరంటాలు" దార గంగమ్మకు వారి కుటుంబీకులు భక్తులట. ఈ పేరంటాలుకు ఒకనాడు దారగంగమ్మ కనిపించి పేరంటాలు భర్తకు గండం ఉన్నదని తాను పుణ్యగిరి ప్రాంతమున ఉండనన్నికావున నీ భర్తను పుణ్యగిరి అడవికి రావద్దని చెప్పెనట ఈ కలలోని వార్తను తన భర్తకు చెప్పినదట. అతడు వినిపించుకొనక కలను పట్టించుకొనవద్దని మామూలుగా అడవికివెళ్ళి కర్రలు కొట్టు చుండగా వెనుకగా పెద్దపులివచ్చి ఈతనిని చంపి వేసెను. అతనితో ఉన్నవారిది గమనించి భయపడి ఏమియు చేయలేక గ్రామమునకు తిరిగివచ్చి పేరంటాలుకు చెప్పిరి.

పిదప పేరంటాలు శపదము చేయుటచే బంధువులు గ్రామస్తులు కొందరు డప్పులతో పుణ్యగిరి అడవిలో పులి ఉన్న ప్రదేశానికి వెళ్ళి పులి తినగా మిగిలిన శరీర భాగములను అతడు విడచిన దుప్పటిలో కట్టి గ్రామానికి తీసుకొని వచ్చారు. పేరంటాలు భర్త శరీరముపైపడి దుఃఖించిలేచి తాను సహగమనం చేయదలచుకొంటినని, గ్రామస్తులు అందుకు సమ్మతించమని కోరినదట. గ్రామస్తులు బంధువులు అంగీకరించలేదు. పేరంటాలు తన శపధాన్ని నెరవేర్చు కుంటానని పట్టుపట్టింది. ఇందుకు నిదర్శనంగా తన భర్తకు ప్రదిక్షణచేయగా, ఆ కళేబరము మాట్లాడెనట! అంతట గ్రామస్తులు, ఆమె బంధువులు సహగమనానికి అంగీకరించి కావలసిన ఏర్పాట్లు చేసిరట పేరంటాలు గ్రామంలో ఉన్న షావుకార్లను పసుపు, కుంకుమ అడిగినదట. అందుకు షావుకార్లు సాయంత్రమైనదని ఇచ్చుటకు నిరాకరించినందున, షావుకార్ల కుటుంబీకు

లకు ఇచ్చట వివాహములు జరిపించిన వధూవరులు చనిపోయెదరని చెప్పెనదట. గ్రామస్తులు పాలు, నువ్వులు ఇచ్చుటకు కూడా సమ్మతించనందున పాడితోపాటు నువ్వుల పంటకూడా సశ్యముగా పండ కూడదని తాను సహగమనము చేయు సందర్భమున శపించినదట. ఆ శాప పర్యవసానముగ, నేటికినీ షావుకార్లు ఈ గ్రామంలో వివాహములు జరుపుటలేదు. పాడి, నువ్వులు ఇతర గ్రామాలతోపోల్చిచూస్తే చాలా అరుదుగా ఫలితం కనబడుచున్న దీనాటికి. అప్పటి నుండీ ఈ క్షేత్రమును దర్శించు యాత్రికులు పేరంటాలుకు పసుపు కుంకుమ మరియు ఫలములు సమర్పించుకుంటూ, తమకు బిడ్డలకు ఎట్టి ఆపదలు రాకుండా కాపాడమని ప్రార్థించుకుంటారీనాటికి.

ఈ క్షేత్రమునకు సుమారు 4కి.మీ. దూరమున ధర్మవరం "సన్యాసయ్య స్వామి" ఆలయము కలదు. ఈ ప్రాంతమున ఒకప్పుడు ముషిడిచెట్ల వనం ఉండెడిది. ఈ వనమునందు ఒకానొక శక్తి సంచరించుచు ఆడపిల్ల రూపమున గ్రామస్తుల పిల్లలను ఎత్తుకొని వచ్చి తినుచుండెడిదట. ఈ సంఘటన కాలక్రమమున భరించరానిదయినదట. గ్రామస్తులు భయాందోళనలతో తమ పిల్లల కొరకు వెదుకుచుండెడివారట. ఒకనాడీ ముషిడి వనమునందు ఆ పిల్లల అస్థిపంజరములు కనుగొని, ఇందుకు కారణం తెలిసికొని పిల్లరూపమున వచ్చెడిది శక్తి అని గ్రహించి పుణ్యగిరి క్షేత్రమందు తపస్సు చేసుకొనుచున్న సాధుపుంగవునికి తమకు కలుగుచున్న కష్టములను విన్నవించిరట. నివారణోపాయము కొరకు వారిని అర్థించిరట. వీరి అభ్యర్థన విని చలించిపోయిన ఆ తాపసి ఇచ్చటకువచ్చి అందుగల శక్తిని గ్రహించి దానిని బంధించి, భైరవ యంత్రాన్నిచట ప్రతిష్ఠించెను. పిమ్మట ఆ శక్తి స్వామినుద్దేశించి తననీ విధముగ బంధించిన ఫలమేమని అడుగగా తొలుత నిన్ను కొలచినవారికి, వారి సంతానమునకు పీడ పిశాచముల బాధకలగకుండా ఉండుటకై తాను భైరవ యంత్రమును స్థాపించితినని చెప్పెనట. అంతేకాక ఈ తాపసి ఇచ్చటనే 'సంతాన గోపాల యంత్రము' ను స్థాపించి పిదప ఆయన ఇచ్చటనే సమాధిపొందెను. అందువలన ఇచ్చట పూజలు జరిపించినవారికి సంతానప్రాప్తి కలుగు నని నమ్మకము కలిగి అదీనాటికీ ఇచ్చట ప్రబలముగా నున్నది. అందువలన ఇచ్చట దేవునకు సంతాన గోపాలస్వామి అని పేరు కూడా కలదు. ఈ మహాత్ముని కృపవలన మానవాళికేకాక పశుగణములకు కూడా పీడ పిశాచములు శోకనీయ కుండా, ఈ యంత్రము ద్వారా ఎంతో లాభపడుచున్నారు. శతాబ్దములనుంచి ఈ జిల్లా వారే కాక ఇతర జిల్లాలనుంచి కూడా భక్తులు వచ్చి స్వామిని దర్శించుచున్నారు.

ఈస్వామిని దర్శించిన పిదప కలిగిన సంతానమునకు యీ స్వామి పేరట 'సన్యాసయ్య', 'సన్యాశిరావు' అను పేర్లతో పిలుచుట జరుగుచున్నది.

అంతేకాక యీ ప్రాంతమున ప్రతి పాల పశువు ప్రసవమైన పిదప ఇచ్చెడి పాలను ప్రథమంగా యీ స్వామివారికి సమర్పించనిదే యే గృహస్తులూ పాలను వినియోగించరు. ఈ విధముగా ఈ స్వామి ఇచ్చట బహు ప్రసిద్ధి చెందియున్నారు. అందువలన ఈ క్షేత్ర మహిమ ఎందరో భక్త జనులు ఆశాజనకముగా నుండి ఈ క్షేత్రమును దర్శించి తృప్తులగుచుండుటవలన ఈ క్షేత్రమెంతో అభివృద్ధి సాధించుచున్నది.

ఇచ్చట దేవస్థాన పరిపాలకులు ఎన్నో అభివృద్ధి కార్యక్రమములు చేపట్టి వాటిని అమలు చేయుచు గణనీయమైన సేవ చేస్తున్నారు. వారందరూ అభినందనీయులు.

| | | |
|---|---|---|
| అనర్థం | : | నాది నాకుఉండనీ, నీదికూడా నాకియ్యి అనుతలంపు |
| స్వార్థం | : | నాది నాకు ఉండనీ, నీది నువ్వుంచుకో అను తలంపు |
| పరార్థం | : | నీది నువ్వుంచుకో, నాది కూడా నీవే తీసుకో అను తలంపు |
| పరమార్థం | : | నాదిలేదు, నీదీలేదు, అంతా పరబ్రహ్మం అను తలంపు |

(సేకరణ : వేదాంతభేరి, జూలై 91)



# విశాఖపట్టణం జిల్లా

శ్రీ వరాహలక్ష్మి నృసింహస్వామి వేంచేసి యున్న శ్రీ సింహాచల మహాక్షేత్రము ప్రకృతి రమణీయకతతో విరాజిల్లుచున్న ఆహ్లాదకరమైన వాతావరణం మధ్యన, సముద్ర మట్టమునకు 800 అడుగుల ఎత్తున, తూర్పు కనుమల సముదాయ సమీపమున ప్రసిద్ధి గాంచిన ఆంధ్రుల ఓడరేవు విశాఖపట్టణమునకు సుమారు 12 కి.మీ. దూరమున (ఉత్తరాన) కలదు. సింహాచల రైలుస్టేషనుకు సుమారు ఐదు కి.మీ. దూరమున కలదు.

శ్రీ సింహాచల క్షేత్రము సముద్రమట్టమునకు సుమారు 1000 అడుగుల యెత్తునున్నది. ప్రకృతి సమజమైన పర్వత లోయలో, సహజ జలవనరుల సముదాయ మధ్యన నెలకొని యున్నది. సమీపమున గల అడివివరము ఈ క్షేత్రమునకు కలిసియేయున్నది. దేవాలయ పరిపాలనావిభాగములు, ఆగమపాఠశాల, ఆరోగ్యశాల, పూజారుల వసతి గృహములు, యాత్రిక నివాసములు మొదలగు సదుపాయములిచ్చటనే గలవు. ఈ దేవాలయ భూవసతి, పూలతోటలు, స్వామి పుష్కరిణి, వరాహ పుష్కరిణి ఇచ్చటనే యున్నవి.

తెప్పోత్సవ సమయమునను, శమీపూజ సమయమునను, డోలోత్సవ, మకరివేట ఉత్సవ సమయములందును స్వామి సకల లాంఛనములతో కొండ దిగి ఉత్సవములు ముగిసిన పిదప మరల పర్వతారోహణము చేయును.

కైలాస పర్వత శ్రేణిలోనున్న ఈ కొండ విహంగ వీక్షణముగ చూచే వారికి కూర్చున్న సింహం ఆకారములో కనిపిస్తుంది. కనుక దీనికి సింహాచలము అని పేరు వచ్చినదని చెపు తారు. అంతే కాక శ్రీ వరాహలక్ష్మి నృసింహ దేవుడున్న కొండ కనుక సింహాచలమని పేరు వచ్చినదని కొందరు చెబుతారు.

సామాన్యంగా నరసింహక్షేత్రంలో నీటి ఎద్దడి ఉంటుంది. కోరుకొండ, మంగళగిరి మొదలయినవిందుకు ఉదాహరణలు. దీనికి స్వామి ఉగ్రత కారణమంటారు. అయితే ఈ క్షేత్రము వరాహనరసింహము కనుక ఈ కొండ ఒకనీటి బుగ్గ అనదగినంతగాధారలతో, నీటి బుగ్గలతో నిండి ఉంటుంది. ఈ నీటిధారలను నేర్పుగా కొండ అంతటా ప్రవహింపజేస్తున్నందువలన ఈ

కొండ అంతటా మల్లె, మొల్ల, సంపెంగవంటి రకరకాల పూల చెట్లతో తీగెలతో, అనాస, పనస వంటి ఫల వృక్షాదులతో కన్నుల విందుగా ఉంటుంది, ఈ క్షేత్ర రాజ పరిసరాలు. అంతేకాక స్వామికి ఆదాయం కూడా తెచ్చిపెడుతున్నవీ తోటలు.

ఆకాశధార, గంగధార మొదలైన ధారలలో స్నానం చేసి, పితరులకు తర్పణాలు విడవడం బహు ఫలదాయకమని, భక్తులనమ్మిక. సింహాచలాన్ని సింహాద్రి అని కూడా అంటారు.

అడవివరము నుంచి దేవళానికి చేరడానికి సుమారు వేయిమెట్ల దారి కూడ ఉన్నది. ఇటీవల మూడు మైళ్ళ ఘాటురోడ్డున బస్సు సౌకర్యమూ ఏర్పడినది.

శ్రీ సింహాచలమునందు వెలసిన ఈ స్వామి ముప్పైరెండురకాల పేర్లతో పిలవబడుతున్న నరసింహ స్వామి. బహురూప విశేషములలో శ్రీవరాహలక్ష్మి నరసింహరూపం ఒకటి. ఈ స్వామిని ఈ ప్రాంతాలలో ఎక్కువగా అప్పన్న - అన్నపేరుతోను, సింహాద్రి అప్పన్న అన్న పేరుతోను భక్తులు శ్రద్ధాభక్తులతో పిలుచుకొంటూ ఉంటారు. తమిళంలో అప్ప అంటే తండ్రి అనీ కనుక ఈ స్వామికి అప్పన్న అన్న పేరు వచ్చినదని చెబుతారు. గోదావరి నుండి ప్రారంభమై, ఉత్కళం వరకు గల ప్రాంతముపై ఈ స్వామి ప్రభావం అధికము. కనుక అక్కడివార్ల పేర్లలో అప్పన్న, అప్పయ్య, అప్పమ్మ, అప్పలనరసయ్య, అప్పల నరసమ్మ, అప్పలకొండ, సింహాద్రి, సింహాచలం వంటి పేర్లు తరచు కనిపిస్తూ ఉంటాయి.

వనములయందును, పర్వతములయందును నృసింహక్షేత్రములనేకము కలవు. నృసింహదేవుని మహాద్భుత దివ్యరూపములనంతములు. వానిలో అహోబిలము, పాపహరము, కృతశౌచము, సింహాచలము అనునీ నాలుగు క్షేత్రములు ప్రధానములని వేద విదుల వక్కాణించుచున్నారు. అహోబిల క్షేత్రమున నరసింహుడు స్థంబము నుండి వెడలి తనవాడిగోళ్ళచే హిరణ్యకశిపుని చీల్చి చంపినందున యాతని బలమును గాంచిన దేవతలు "అహోబలం" అని ఆశ్చర్యపడుటచే నీ క్షేత్రమునకు ఆ పేరు కలిగినది. పాపహర క్షేత్రమున శ్రీహరి, బిడాల నరకేసరీ రూపమునను, కృతశౌచ మున నరహరి యోగినీ చక్రము చేతను ప్రకాసించుచూ, నారాయణుడు రక్తముచే తడిసిన తన శరీరము నట పరిశుద్ధముగా చేసికొనుట వలనను, హిరణ్యకశిపుడు పరమభక్తుడైన కుమారుని నిర్దయుడై సముద్రమున త్రోయింప, శ్రీహరి అతి త్వరితముగా వైకుంఠము నుండి శాంతభావమున నరహరిరూపమున సింహాద్రికరుదెంచుటవలనను ఈ క్షేత్రములమహాత్మ్య మింతింత అనరానిదయ్యెను. నృసింహుడు జగన్నాథమున ఏ రూపమున వసించెనో ఆ రూపము తోడనే సింహాచలమునను వసియించెనని పెద్దలు చెప్పుచున్నారు. శ్రీ వైష్ణవ సంప్రదాయములో చెప్పబడిన నూట ఎనిమిది దివ్య తిరుపతులలో సింహాచలం కూడా పేర్కొనబడినది.

పూర్వము కృతయుగమున బ్రహ్మదేవుని మానసపుత్రులైన సనకసనందనాదులు వైకుంఠమున శ్రీహరిని దర్శించాలని వెళ్ళారు. శ్రీహరికి ద్వార పాలకులుగా యున్న జయ, విజయలు ఈ యోగీశ్వరులను అడ్డగించగా శ్రీహరివచ్చి ఇక్కడే ఉండిపోయినారేమిటని అడిగితే వారు జరిగినది చెప్పారు. శ్రీహరి జయ విజయులను మూడుజన్మలు రాక్షసులుగా ఉండి తరువాత తన సాన్నిధ్యానికి వస్తారని పంపాడు. వారు దితి కశ్యపులకు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షులుగా పుట్టారు.

వీరిలో హిరణ్యాక్షుడు భూమిని తీసుకొని పోయి పాతాళంలో దాచాడు. అతని దుండగాలను దేవతలు శ్రీహరికి వినిపింప శ్రీహరి యజ్ఞ వరాహ

రూపంలో సాక్షాత్కరించి, హిరణ్యాక్షుని సంహరించాడు. భూమిని తన కోరలతో పైకెత్తాడు.

హిరణ్యాకశ్యపుడది విని వింధ్యపర్వతం మీద తపస్సు చేసాడు. బ్రహ్మచే వరంపొందాడు. ఆయుధాల చేగానీ, ఏ ప్రాణిచేతగాని, భూమ్యాకాశ, పాతాళాలలో గాని అతనికి చావులేకుండా వరము పొందాడు. వర గర్వంతో ఇంద్రాదులను జయించి ముల్లోకములను వశపరచుకొన్నాడు. దేవతల దుస్థితివిని బ్రహ్మ వైకుంఠానికి వెళ్ళగా వారిని సుముఖుడు అనే ద్వార పాలకుడు అడ్డగించ, సుప్రతిష్ఠుడనే రెండవ ద్వార పాలకుడు వెళ్ళి వారి రాక శ్రీహరికి చెప్పాడు. దేవతలు తమ బాధలు చెప్పుకొని మా దుఃఖ సమాచారము మీతో చెప్పుకుందామని వస్తే ఇతడు ఆపి బాధించడాని చెప్పుకొన్నారు. శ్రీహరి వారిని ఓదార్చి అద్భుతమైన రూపంతో తానారాక్షసుని సంహరిస్తానని చెప్పి తన దర్శనానికి వచ్చిన వారిని నిరోధించినందుకు సుముఖుని ఆ రాక్షసునికే కొడుకుగా పుట్టమని చెప్పగా సుముఖుడు ప్రహ్లాదుడై వానికి పుట్టాడు.

పుట్టుక నుంచి ప్రహ్లాదుడు హరిభక్తుడైనాడు. లోక కంఠకుడైన హిరణ్యా కశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదుని చదివింపనెంచి ఉపాధ్యాయులైన చండామార్కుల వద్దకు పంపాడు ప్రహ్లాదుడు వారు చదివించి నట్లు చదువక శ్రీహరి భక్తుడగుటచే, తన తండ్రికి శత్రువగు హరినామస్మరణ చేయుచుండగా ఆచార్యులు హిరణ్యకశిపునకావిషయము తెలియజేసిరి. హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని తన అభిమతానుసారము ప్రవర్తింప జేయుటకు ప్రయత్నించి విఫలుడై, ఆ బాలుని అనేక విధముల దండించెను. సేవకులు గదలతో కొట్టారు. కత్తులతో గొడ్డళ్ళతో నరకబోయారు. ఏనుగులు చేత తొక్కించారు. పాములచేత కరిపించారు. అగ్నిలో తగుల పెట్టపోయారు. విష ప్రయోగం చేసారు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. మళ్ళీ చదువవేసారు మళ్ళీ ప్రయోజనం లేదన్నారు.

ఈసారి హిరణ్యకశిపుడు విసిగివేసారి సముద్రంలో పడవేసి పైన పెద్ద కొండ పెట్టమన్నాడు. సేవకులు అలాగుననే పడవేసి పైన ఐదామడల నిడివిగల కొండ పెట్టారు. సముద్రం అల్లకల్లోలమై గట్టుపైకి పొంగింది. రాక్షసులు భయపడి పారిపోయారు. ప్రహ్లాదుని కట్లు తెగిపోయాయి. సముద్రుడు పురుషరూపంలో వచ్చి ప్రహ్లాదుని సేవించాడు. ప్రహ్లాదుడు పరిపరివిధముల శ్రీహరిని స్తుతించాడు. శ్రీహరిని గూర్చి "త్రాహి" (రక్షింపుము) అని కేకవేసెను. ఆ ఆర్తనాదము వైకుంఠ, వాసుని చెవిని పడినంతనే వెంటనే శ్రీ హరివచ్చాడు. జారుతున్న తన పీతాంబరాన్ని ఎడమ చేతితో పట్టుకున్నాడు. వాకిట్లో ఉన్న గరుత్మంతునెక్కి వచ్చాడు. ఎడమ చేతితో ఆ వస్త్రాన్ని అలాగే పట్టుకొన్నాడు వేగానికి గరుత్మంతుడలసి పోయాడు శ్రీహరి కుడిచేతితో గరుత్మంతుని చేత అమృతం త్రాగించాడు.

శ్రీహరి ఈకొండమీది కురికి, సముద్ర గర్భమునమున్న ప్రహ్లాదుని ఒడ్డున చేర్చి అభయమొసగాడు. ప్రహ్లాదుడు స్వామిని పరిపరి విధముల స్తుతించాడు. హిరణ్యకశిపుని నివాసస్థలమగు అహోబిలము నకేగి నరసింహ రూపమున, స్థంభమునుండి బయల్వె డలి హిరణ్యకశిపుని చీల్చి చంపి, ప్రహ్లాదునా యహో బిల సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుని గావించెను.

మరునాడు ప్రహ్లాదుడు బ్రతికి ఉన్నాడని తెలిసి హిరణ్యకశిపుడు నీ హరిని ఈ స్థంభములో చూపించమన్నాడు. స్థంబాన్ని బ్రద్దలు కొట్టాడు. అపుడు శ్రీ నరసింహస్వామి వెలువడి శ్రీ హిరణ్యకశిపుని సంహరించెను. చావు తప్పించుకోడానికి రాక్షసుడంతకు మునుపు అనేక రూపాలు ధరించి స్వామి హిరణ్య కశిపునితో పోరాడెను. వాటిలో నరసింహుని ముప్పై రెండు రూపాలు ప్రసిద్ధి చెందాయి.

ప్రహ్లాదుని కోరికమేరకు స్వామి నిన్నటి వరాహ రూపము రేపటి నరసింహ రూపము కలిసిన రూపంలో స్సాక్షాత్కరించి ఈ కొండ మీద ఈ రూపంలో ఉండి కొలిచినవారి కోరికలు తీరుస్తానననెను.

పిదప ప్రహ్లాదుడు పెద్దవాడైనాడు. ఆయనకు విరోచనుడనే కుమారుడు కలిగాడు. ప్రహ్లాదుడు విరోచనుని రాజుగా చేసాడు. చిన్నప్పుడు తనను కాపాడిన స్వామిని తలుచుకున్నాడు. పురోహితాదు లను, పూజ సామాగ్రిని వెంట తీసికొని సింహాచలం చేరుకుని స్వామి కోసం వెతికాడు; స్వామి మాలతి పొదలో కనిపించాడు. మొదట సామాన్య పూజచేసాడు ప్రహ్లాదుడు. తరువాత విశ్వకర్మను రావించి విమానం కట్టించాడు. పట్టణం వెలసిందచ్చట. స్వామిని పూజిస్తూ కాలం గడుపుతున్నాడు.

బ్రహ్మదేవునకు శాంతాకారంతో ఉన్న నరసింహుని చూడాలనిపించింది. ఆ విషయం తెలుసు కొందామని వైకుంఠము వెళ్ళాడు స్వామి తానా రూపంలో సింహాచలం మీదనున్నానని తెలిపినంత బ్రహ్మవచ్చి శ్రీస్వామిని అర్చించాడు. పిదప రుద్రుడు, ఇంద్రుడు, వరుణుడు మొదలయిన దేవతలందరూ పూజించారుస్వామిని. పిదప కలికాలంవచ్చింది. ప్రజలు స్వామిని సేవించటం మానుకున్నారు అక్కడ జనం రోగాలువచ్చి కొండ వదలిపోయారు. నృసింహుని మీద పుట్టలు లేచాయి మళ్ళీ కృతయుగం వచ్చింది.

చంద్రవంశపు రాజు పురూరవుడు దిగ్విజయ యాత్రను చేసి బ్రహ్మను ఆరాధించి కాలగమనమనే విమానం పొంది భార్య ఊర్వశితో కలసి ఇద్దరూ ఆ విమానం మీద దక్షిణ దిక్కుగా వెళుతూ సింహాచలం అందం చూసిఆశ్చర్యపోయారు. దాని మీదగా వెళ్ళు చున్న విమానం ఆగిపోయింది. ఊర్వశి పూర్వవృత్తాం తమును స్మరించి విషయమును గ్రహించి, రాజుకు చెప్పి కొండ మీద స్వామిని వెదికి స్వామిని పూజించ మని చెప్పినది. స్వామి కోసం వెదికారు. కనబడలేదు. స్వామి కనబడేవరకు దర్భశయనం చేస్తానని సంకల్పిం చుకుని మూడురాత్రుళ్ళు మూడుపగళ్ళు పురూరవుడు స్వామిని పూజించాడు. స్వామి కలలో కనిపించి నీ యెదుటి పుట్టలో నేనున్నానని చెప్పి ఏమి చేయాలో తెలియ జేసెను.

పురూరవుడు, స్వామి చెప్పిన ప్రకారము పాలతో పుట్ట కడిగించి పంచామృతాభిషేకం చేయిం చాడు. వస్త్రమూల్యములు సమర్పించాడు. ధూప, దీప నైవేద్యాలతో స్వామినిసేవించి చందనంతో మెత్తించాడు స్వామిని. మళ్ళీ స్వామిని వస్త్రమాలిక లతో పూజాంచాడు.

ఆకాలంలో చందనం తీసిన వాని వంశం హరిస్తుందని స్వామి చెప్పారు. పురూరవుడు మండప గోపురాదులు నిర్మించి, నిత్యార్చనకు వేదవిదులను ఏర్పరచి వారికి అగ్రహారాలిచ్చి పట్టణం కట్టించాడు. నరసింహునికి అనేక గ్రామాలిచ్చాడు. ఇది ఆ ప్రభువు చేసినది త్రేతాయుగం మొదటి రోజున.చంద్రవంశపు రాజులందరూ కలిలోను ఆరాధిస్తుండగా కృతాంతం వరకు స్వామి ఉంటాడని క్షేత్రమహాత్మ్యం. ఇట్టి పరిస్థితులలో ఇక్కడి దేవాలయం కృతయుగంలోనే ఏర్పడినదని తెలుస్తున్నది.

ఆధునిక శాస్త్రీయ పద్ధతులలో ఈ క్షేత్ర చరిత్ర పునర్నించాలంటే 13వ శతాబ్దానికి ముందటి చరిత్ర కానవచ్చుట లేదు. క్రీ.శ. 1268లో గాంగ వంశీయు డైన మొదటి నరసింహదేవుని (1238-68) సేనాని రాజాజ్ఞ ననుసరించి, అంతకు మునుపు ఉన్న కట్టడా లను తొలగించి క్రొత్తవి కట్టినట్లు తెలుస్తున్నది. అంతకు పూర్వకాలానికి చెందిన అనేక శాసనాలు లభిస్తున్నవి. వీటిలో మొదటి శాసనం 1087లో కులోత్తుంగ చోళుడు వేయించినది.

ఆండాళ్ళు ఆలయం ప్రధానాలయానికి పడమరగా నున్నది. ఈ ఆలయం 18వ శతాబ్ది నిర్మాణమని చారిత్రకుల అభిప్రాయముగ నున్నది.

గాంగవంశీయులే కాక వారి సామంతులు వడ్డాది మాత్యులు, ఎలమంచిలి చాళుక్యులు, వేదపురాణేతి హాసాలు తమ దాతృత్వంలో వర్ధిల్లున్నట్లు ఏర్పాట్లు చేసారు. 15వ శతాబ్ది ఉత్తరార్థం నుంచి గజపతులు ఆధిపత్యానికి వచ్చారు.

శ్రీ కృష్ణదేవరాయలు వారీ స్వామిని సేవించు కొనునట్లు శాసనాధారం ఉన్నది. 30.3.1516న స్వామిని దర్శించినట్లు తెలుస్తున్నది. రాయలు వారు సింహాచలం వద్ద జయస్థంభం కట్టించినట్లు తెలుస్తు న్నది. రాయలువారు రాసిన ఆముక్తమాల్యదలో ఈ విషయమున్నది.

1580-1612 నడుమ స్వామి సేవలకు ఇబ్బంది కలిగినట్లు తెలుస్తున్నది. 17వ శతాబ్ది ఉత్త రార్థం నుంచి పూసపాటివంశీయులైన రాజులే స్వామిని విశేషంగా ఆరాధిస్తూవచ్చారు. వీరు ఆలయంలో అనేక నిర్మాణాలు చేయించారు. 18వ శతాబ్ది పూర్వార్థంలో వీరే ఆలయ ధర్మకర్తలయారు. ఆలయాన్ని ఎంతో అభివృద్ధి చేసారు.

క్రీ.శ. 14వ శతాబ్దిలో జీవించిన కాంతకృష్ణమా చార్యులు అనే భక్తకవి, సింహాచల స్వామిని చాతుర్లక్ష వచనాలతో స్తుతించి వాఙ్మూజ గావించాడు. ఈ భక్తుడు ఈ స్వామికి అనేక కైంకర్యాలు చేసినట్లుగాను, ప్రతాపరుద్ర చక్రవర్తి వలన (కాకతీయ) అగ్రహారాదిక ములు పొందినట్లుగాను చారిత్రికాధారాలున్నాయి.

1713-1757 నడుమ విజయనగర రాజ్య మేలిన విజయరామరాజుగారి కాలంలో శ్రీకాకుళం సర్కారుకు చెందిన జాఫర్ ఆలీఖాన్‌కె వీరికి బేధాలు వచ్చాయి. ఈతడు మరాఠులతో కలిసి వీరి రాజ్యం దోచుకున్నాడు. ఈ సందర్భులోనే ఆలయం మీదకి తురుష్క దండయాత్ర జరిగినది. ఈ దాడిని ఆపమని ఈ మహారాజు ఆదరణను పొందిన కూర్మనాథకవి స్వామిని ఆలయంలో ఉండి ప్రార్థించాడు. ప్రసిద్ధి చెందిన సింహాద్రి నరసింహ శతకము ఈ ప్రార్థనా ఫలితమే.

ఈ శతకాన్నిబట్టి స్వామి కందిరీగల రూపంలో సైన్యాన్ని కుట్టి తరిమి వేసినట్లు గ్రహించవచ్చును. ఈ శతకం స్వామి మహాత్మ్యానికి మంచి కవిత్వానికి నిదర్శనంగా ఈనాటికీ నిలిచి ఉన్నది.

శ్రీరామానుజాచార్యుల వారీ క్షేత్రాన్ని దర్శించి ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించారు. 18వ శతాబ్దములో ప్రసిద్ధ మాధవస్వామి నరహరి తీర్థులవారు ఈ క్షేత్రాన్ని పాండిత్య ధార్మిక కేంద్రముగా ప్రసిద్ధి చెందుటకు ఎంతో సాయపడ్డారు.

సాహిత్యంలో మొదటిసారిగా సింహాద్రిని 14వ శతాబ్దిలో ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణం పేర్కొన్నది. ఈ క్షేత్ర తిరునాళ్ళపై శ్రీనాథుని చాటువులు ప్రసిద్ధి కెక్కాయి. 15వ శతాబ్దికి చెందిన అన్నమాచార్యులు స్వామిమీద కీర్తనలు రచించారు. 18వ శతాబ్దిలో కూచి మంచి తిమ్మకవి సింహశైల మహాత్మ్యం రచించాడు. 19వ శతాబ్దిలో కట్టమూరి కామేశ్వరకవి సింహాచల చరిత్ర వ్రాసారు. ముడుంబై నరసింహాచార్య కవిగా రెహోన్న స్తుతులు స్వామి మీద వ్రాసారు. కొన్నిటిని దేవస్థానంవారు ప్రచురించిరి. ముఖ్యంగా ఆంగ్లంలో శ్రీ కే. సుందరంగారు వ్రాసిన "సింహాచలం టెంపుల్" అనే పరిశోధనా సిద్ధాంత వ్యాసం ఎన్నదగినది. చక్కని భాషా శైలితో ఎంతో సమగ్రమైన యీ గ్రంథాన్ని దేవస్థానం వారు ప్రచురించారు. ఇట్టి పరిశోధనా గ్రంథము మన పవిత్ర దేవాలయములపై వ్రాయవలసి ఉన్నది.

ఈ దేవస్థానం పరిపాలనా బాధ్యతలను పర్య వేక్షించడం గంగవంశ రాజుల కాలంలోనే ఏర్పడినట్లు తెలుస్తున్నది. పూసపాటి రాజుల కాలంలోనూ కొన సాగింది. విజయనగరం కోటలో దేవస్థానానికి ప్రత్యేక కార్యాలయముండేడిది. మాన్యశ్రీ పి.వి.జి. రాజాగారు

విజయనగరం రాజావారైనది 1946లో అప్పటి నుంచి దేవస్థానం పరిపాలన వారికి దఖలు పడింది. హిందూ దేవాదాయ ధర్మాదాయసంస్థ ఆలయ వ్యవహారాలను నడిపిస్తున్నారు. వంశపారంపర్య ధర్మ కర్తగా శ్రీ పి.వి.జి. రాజుగారు కొనసాగుతున్నారు.

ఎన్నో ఉత్తమకార్యాలకై ఈ దేవాలయ నిధులు ఖర్చు చేస్తున్నారు. ఆగమ పాఠశాల, విద్యార్థి వసతి గృహం, (విజయ నగరం), కుష్టువుల శరణాలయం (విశాఖపట్టణం) మొదలయిన ధార్మిక కార్యకలాపాలను ఈ దేవస్థానం నిర్వహిస్తుంది. స్వామికి ప్రతి నిత్యము అనే కములైన ఉత్సవాలు జరుపుచున్నారు. అంతేకాక కళ్యా ణోత్సవము, స్వామి చందనోత్సవము విశేషంగా జరుగుత విచట. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ ఏకాదశి నుంచి పౌర్ణమి వరకు కళ్యాణోత్సవము, వైశాఖ శుద్ధ తృతీయ నాడు చందనోత్సవం వైభవంగా జరుపుతారు. సుమారు 18 గం. ఆనాడు స్వామి నిజరూపదర్శనానికి భక్తులననుమతిస్తారు. సాయంకాలం చందనాభిషేకం చేస్తారు. సహస్రఘటాభిషేకం తరువాతమరల చందనం పట్టిస్తారు స్వామికి. ఇంకను అనేక ఉత్సవములు స్వామి వారికి జరిపిస్తారు.

శ్రీ సింహాచలక్షేత్ర మహాత్మ్యం ఇలా చెబు తున్నది. ఈ క్షేత్రమంతా పుణ్యమైనదని. అంతే కాక ఇక్కడ జరిగే ఉత్సవాలలో పాల్గొనినవారు పాపవిముక్తు లౌతారు. ఇట్టి చరిత్రమహిమగల సింహాచల వరాహలక్ష్మి దేవస్థానం వారు వరాహపురాణాన్ని (ఆంధ్రాను వాదం) ప్రచురించి చరిత్రార్థులైనారు. ఎంతో పవిత్ర గ్రంథ మిది. ఎన్నో ధర్మశాలలు వసతి గృహాలు ఇచట కలవు. విశాఖపట్టణంనుంచి ఇచ్చటకు బస్సుసౌకర్యము కలదు.

ఈ స్వామిని సేవించే వారికి తెలిసి తెలియక చేసిన పాపాల వల్ల భయం నశించి ఎంతో మానసికా నందం కలుగుతుందనడంలో ఎట్టి సందేహమూ లేదు.

## విశాఖపట్టణం – బురుజుపేట

### శ్రీ కనకమహాలక్ష్మి అమ్మవారి దివ్య క్షేత్రం :

విశాఖపట్టణం బురుజుపేటలో నెలకొనియున్న శ్రీ కనకమహాలక్ష్మి అమ్మవారి విగ్రహం చాలా విశిష్టమై నది. ఇది ఒక బహిరంగ (మండపములో) స్థలములో ప్రతిష్ఠింపబడి యున్నది. చాలా పురాతనమైనది. ఇక్కడి విగ్రహం ఎంతో కాలంగా నెలకొని యున్నది. ఈ ప్రాంతాన్ని ఒకప్పుడు పాలించే విశాఖరాజు కోట బురుజు ఈ పరిసరాలలోనే ఉండేదని ఇది విశాఖరాజుల యిలవేలుపు యని తెలియుచున్నది.

వర్ణ, వర్గ వివక్షత, తరతమ బేధాల్లేక పూజలు చేసికోవడానికి వచ్చిన భక్తులు ఎవరికివారే పూజారితో ప్రమేయం లేకుండా అమ్మవారికి స్వయంగా పసుపు కుంకుమ పూజలు చేసి కొబ్బరికాయ కొట్టి దేవికి నివేదించే సంప్రదాయము ఈ అమ్మవారి ప్రత్యేకత.

ఈ దేవత చల్లనితల్లిఃకోరిన కోరికలిచ్చే కొంగు బంగారంగా, నిధులను ప్రసాదించే దైవంగా స్త్రీలకు ఐదవతనాన్ని నగరవాసులకు ఆరోగ్యాన్ని, ఆనందాన్ని ఇనుమడింపజేసే దేవతగా విశాఖ పుర ప్రజలు నిత్యమూ యీ దేవిని ఆరాధిస్తుంటారు. అమ్మవారి అనుగ్రహం కోసం భక్తులు పుట్టిన పసిపాపలను అమ్మవారి ఒడిలో ఉంచి అమ్మవారిని అత్యంత భక్తి శ్రద్ధలతో పూజిస్తారు. సంవత్సరం పొడుగునా భక్తులు తండోపతండాలుగా వచ్చి అమ్మవారిని ఆరాధిస్తారు. అయితే లక్ష్మి, శుక్ర వారాలలో, అమ్మవారిని విశేషంగా భక్తులు దర్శిస్తారు. ప్రతి సంవత్సరం మార్గశిర మాసం, నెల రోజులు, అమ్మవారి వార్షికోత్సవాలు ఎంతో భక్తి శ్రద్ధలతో జరుగుతాయి. లక్షలాది భక్తులు గ్రామ గ్రామాల నుండి ఈ ఉత్సవ దినాలలో ఎంతో భక్తి శ్రద్ధలతో క్యూలో గంటల తరబడి నిలబడి అమ్మవారి దర్శనం చేసు కుంటారు. ప్రస్తుతం ఈ క్షేత్రం దేవాదాయ శాఖ పరిపాలనలోనున్నది.



# తూర్పు గోదావరి జిల్లా

## శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి దేవస్థానం : అన్నవరం

తూర్పు గోదావరి జిల్లా అన్నవరంలో వేంచేసి యున్న శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామి వారిని తెలియని ఆంధ్రులుండరంటే అతిశయోక్తి కాదు. ప్రసిద్ధిచెందిన ఈ క్షేత్రము తూర్పు గోదావరి జిల్లాకేగాక యావదాంధ్ర దేశమునకు మణిమకుటాయ మానమైనది.

పవిత్ర పంపానది గట్టున రత్నగిరియను కొండపై శ్రీ సత్యనారాయణస్వామి స్వయంభూవై యున్నాడు. సమీపాన అన్నవరం గ్రామమున్నది. ఈయన ఖరనామసంవత్సర శ్రావణ శుద్ధ విదియనాడు అనగా 1891 వ సంవన ఆనాటి రాజ్యపాలకులచే ప్రతిష్ఠించబడిన ఈ క్షేత్రము ఎంతో అభివృద్ధిని సాధించినది.

ఈ దేవాలయము రథమువలె రూపొంది రెండతస్థుల భవనమువలె కడు సుందరముగ మరియు వినూత్నవిధానమున రూపొందించబడినది. పై అంతస్థులో శ్రీ సత్యనారాయణ స్వామి తన దేవేరి యైన అనంతలక్ష్మి సత్యవతీదేవి వామభాగమున వేం చేసియున్నది. కుడిప్రక్క పరమశివుడు కొలువై యున్నాడు. అందువలన ఈ క్షేత్రము హరిహరులకిరవై అద్భుత మహిమాన్వితమై ఆంధ్రుల ఆరాధ్య క్షేత్రమై కోరిన కోర్కెలు దీర్చే కొండంత దేవుడుగ శ్రీ సత్య నారాయణస్వామి ఆంధ్రుల ఇలవేలుపై వెలుగొందు చున్నాడీచట. ఇట్టి శక్తివంతమైన హరిహర క్షేత్రము మరెచ్చటనూ కానలేము.

ఈ దేవాలయ దిగువ అంతస్థులో "మహా యంత్రము" స్వామి పీఠము వద్ద ప్రతిష్ఠితమై యున్నది. ఈ యంత్రము హరిహర హిరణ్య గర్భ త్రిమూర్త్యాత్మక స్వరూపమై వెలుగొందుచున్నది. దర్శనమాత్రమున ఎంతో మానసికానందము కల్గించు చున్నదీ యంత్రరాజము. శ్రీ సత్యదేవుని స్వరూప మిందిమిడియున్నది. ఈ దిగువ అంతస్థులో త్రిపుటిగాబీజాక్షరసంపుటి మరియు బిందు రూపముగ ప్రతిష్ఠింపబడి అద్దానిపై స్వయంభవుయైన శ్రీ సత్య నారాయణస్వామి ప్రతిష్ఠింపబడియుండి, విశేషాకర్షణ

కలిగి అశేష భక్త జనసందోహమును ఆకర్షించుచున్నది. మహాద్భుత మైన యీ ఏర్పాటు చూసితీరవలసినదే కాని చెప్ప, వ్రాయ నలవికాదు.

ఈ "మహాయంత్రము" యాత్రికజన సందోహమును మంత్రముగ్ధులను గావించుచున్నది. సుదూర ప్రాంతముల నుండి భక్త మహాజనులిచటకు అనేక వ్యయ ప్రయాసలకోర్చి వచ్చి స్వామిని దర్శించి పడినశ్రమను మరచి ఎంతో తృప్తిగా మహదానందముతో మరలిపోవుచున్నారు. ఈ మహా యంత్ర రాజము "త్రిపాద నారాయణ ఉపనిషద్" ననుసరించి రచింపబడి ప్రతిష్ఠించబడినది. ఈ యంత్ర నలు దిశల యందు గణపతి, సూర్యదేవుడు, బాలత్రిపుర సుందరి, మహేశ్వరస్వామి మరియు మధ్యగా శ్రీ సత్యదేవుడు ప్రతిష్ఠింపబడి విష్ణుపాంచాయతనమైనఈ యంత్రము ఈ క్షేత్రమునకు విశేష ఆకర్షణను సమకూర్చు చున్నది. ఇట్టి యంత్ర ప్రతిష్ఠ మన దేశము నందెచ్చటను కానలేము.

ఇచ్చట ప్రకృతి రమణీయకత ఎన్నదగినది. రత్నగిరి చుట్టూ ఎత్తైన తూర్పు కనుమలు, ఒకవైపు సముద్రము, మరియొకవైపు పచ్చని పచ్చికబయళ్ళు, పంపానది, రత్నగిరిచుట్టుచూ ఎంతో ఆహ్లాదకరమైన, మరియ కన్నులకింపైన రీతిలో ప్రకృతి సహజ సౌందర్యముతో అలరారుచున్నది. ఈ క్షేత్ర పరిసరములు ప్రకృతి సౌందర్యమున కాటపట్టులై ఎంతో మానసికోల్లాసము కలిగించుచున్నవి. ఈ రత్నగిరి సముద్రమునకు సుమారు 300 అడుగుల ఎత్తున నుండి, నాలుగు వందల అరవై మెట్లతోనుండి, స్వామిని దర్శించుటకు ఎంతో వీలుకలుగుచున్నది.

తూర్పుగోదావరి జిల్లాకేకాక యావదాంధ్రలో అందరికీ వరాలిచ్చే దేవుడిగా ప్రసిద్ధిచెందిన ఈ స్వామి 1990 నాటికి నూరేండ్ల పండుగ జరుపుకున్నాడు. శతజయంతి ఉత్సవములను ఎంతో వైభవముగ జరిపించినారు. ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేస్తున్నారు. దేవస్థానం రూపురేఖలు పూర్తిగా మారి పోయినవి. పటిష్ఠమైనకట్టడాలను పునర్నిర్మించినారు.

రత్నగిరి మీద శ్రీ సత్యనారాయణ స్వామివారి ఆవిర్భావగాథ పురాణ ప్రసిద్ధమైనది జన బాహుళ్యము నకు నమ్మిక కలిగించినది.

భక్తి తత్త్వవిశారదుడు దేవముని నారద మహర్షి త్రిలోక సంచారంచేస్తూ శ్రీమన్నారాయణ నామ సంకీర్తనం చేస్తూ భూలోకమందలి భరతవర్షానికి రావడం జరిగింది. ఆయన వచ్చే సమయములో ఈ దేశస్థితి కడుహీనదశలో నున్నది. ఎక్కడ చూచినా కరువు, కాటకాలు, వ్యాధులు, మహావ్యధలేకాక అన్యోన్య కలహాలు - ఇటువంటి వాటిచేత ప్రజలలో అస్థిరత్వం ఏర్పడి కడుపునిండా తిండిలేక బాధపడే పరిస్థితి ఏర్పడినది. పల్లెల్లో, పట్టణాలలో ఆర్తనాదాలు తప్ప ఆనందం లేశమైనా లేకపోయినది.

దేవముని నారదుడు పరిస్థితిని గమనించి, పుణ్య భూమి, రత్నగర్భయైన భరతఖండం ఈ విదంగా ఉండడం ఆయనకు జాలి కలిగించింది. అన్ని జీవులూ విచారంతో బాధలతో అలమటించడం, కష్టనష్టాలతో కాలక్షేపం చేస్తూండటం ఆయనకు ఎంతో విచారం కలిగించింది. శ్రీమన్నారాయణుని అనుగ్రహంతో భూలోకాన్ని ఉద్ధరించాలనే సంకల్పంతో దేవముని బయలుదేరాడు. నారదుని ధ్యానకీర్తనలకు సంతృప్తుడైన శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించాడు. ఆ దివ్యమంగళమూర్తి ఎంతో విలక్షణంగా ఉన్నది. శ్రీమన్నారాయణ రూపాన్ని, శివరూపాన్ని, బ్రహ్మ రూపాన్ని క్షణక్షణానికి శ్రీమన్నారాయణుని కటాక్షంతో నారదమహాముని దర్శించాడు. ఆనంద పరవశుడయ్యాడు.

మూర్తిత్రయ గుణస్ఫోరకంగా దర్శనం ఇచ్చిన దేవదేవునికి పులకితాంగుడై అపరమ భాగవతోత్తముడు

ప్రయాణము చేసాడు. పరంధాముడు అసుర మునిని క్షేమ సమాచారములడిగి నారదా! త్రిలోక సంచారంలో వింతలూ విశేషాలూ ఏమైనా ఉంటే చెప్పమన్నాడు. అపుడు నారదుడు భూలోకవాసుల బాధలను, దుర్భిక్షంతో, వ్యాధులతో అలమటిస్తున్న వైనం విన్నవించాడు. అందరూ కూటికి, గుడ్డకు మొహం వాచి యున్నారని క్షోభ కలిగించే క్షామంతోనూ, మతభేదాలు, శివుడే అధికుడని, విష్ణువును మించిన దేవుడు లేడని అన్యోన్యం వాదించుకుంటూ క్రమంగా హింసాకృత్యాలను శంసయించకుండా జరుపుతూ అశాంతితో గడుపుతున్నారని వారి దుఃఖమూ, విరోధ భావనలూ తొలగిపోయే విధంగా అవతరించి లోక కళ్యాణం కలిగించాలని ప్రార్థించాడు.

అచిరకాలంలోనే భరతభూమియందలి ఆంధ్ర ప్రాంతంలో అర్చాకృతిగా అవతరించి, ప్రజాక్షేమం, లోకకళ్యాణం కలుగజేస్తానని వాగ్దానంచేసి శ్రీమన్నారాయణుడు అంతర్ధానం అయ్యాడు.

వేదశాస్త్ర, విజ్ఞానానికి, పుణ్యకర్మలకు ఆలవాల మైన పవిత్రభూమియైన ఆంధ్రదేశంలో, పరమ పావనమైన గోదావరీతీర మండలంలో "అన్నవరం" లో భగవానుడు శ్రీసత్యదేవునిగా, రత్నాద్రిపై స్వయం ప్రతిష్ఠుడు కావడానికి, సంకల్పించుకున్నాడు.

శ్రీరాజా ఇనుగంటి వేంకటరామరాయిణం బహద్దరువారు దాతృత్వంలో సద్గుణసంపత్తితోఆనాడు బాగా ప్రఖ్యాతుడైన ఈ ప్రభువు. ఆధ్యాత్మిక బుద్ధితో, ఆయన ఎన్నో సత్కార్యాలు నిర్వహించే వాడని పెద్దలుచెబుతారు. కవులను, కళాకారులను ఆదరించి సత్కరించే సద్గుణుడు. ఒకనాటి రాత్రి శ్రీ మన్నారాయణుడు ఆయనకు కలలో దర్శనమిచ్చి తాను సత్యదేవుడనని హరిహర హిరణ్య గర్భాకారంగా రత్నగిరిమీద అవతరిస్తానని స్వప్నరూపంలో దర్శన మిచ్చిన రూపంలో అవతరిస్తానని, రత్నాచలంలో అర్చారూపంలో గోచరిస్తానని, ఖర నామసంవత్సర శ్రావణ శుక్ల ద్వితీయనాడు తన ఆవిర్భావం జరుగు తుందని తరువాత చేయవలసినది చేయమని చెప్పి అంతర్ధానమయ్యెను.

తన అదృష్ట విశేషానికి ఆనందపడుతూ బంధు మిత్రులందకూ ఈ స్వప్నవార్త చెప్పాడాయన. విన్న వారెంతో సంతోషపడి, తెల్లవారుజామున వచ్చిన కల కల్లకాదని, తప్పక నెరవేరుతుందని చెప్పారు. ప్రభువు, భగవదాజ్ఞ శిరసావహించి వర్ష ఋతువు ఆరంభాన శ్రావణ శుక్ల విదియనాడు శ్రీసత్యదేవుని స్వయం ప్రకాశం అభివ్యక్తమయ్యే రోజుకు ముందురోజు రాత్రి ప్రభువు పౌరజనంతో సహజాగరణంచేసి, మరునాడు ఉషఃకాలములో పవిత్ర పంపానదిలో స్నానంచేసి పూజాది కాలు ముగించుకుని భక్త బృందంతో మంగళ వాద్యాలతో రత్నగిరికి బయలుదేరాడు. ముందుగా గ్రామ దేవత 'నేరేళ్ళమ్మ' కోవెల దగ్గరకు వెళ్ళి పూజలు జరిపి ఆ కోవెల కెదురుగానున్న చిట్టడివిలో ఆవరించియున్న మెట్టుకు నమస్కరించి, పరమ భక్తి ప్రపత్తులతో స్వామి సంకీర్తనలుచేస్తూ కొండయెక్కి వెదకడం ప్రారంభించారు.

శ్రీరామకృష్ణ, గోవిందాది నామోచ్చారణలతో మంగళవాద్య ధ్వనులతో రత్నగిరి కళకళలాడింది. ఎంతో సందడిగా ఉన్నది. హరినామ సంకీర్తనలతో ఆనాటి అచ్చటి వాతావరణం భక్తిప్రపత్తులతో నిండి పోయింది. ప్రభువు చెట్లలో, పుట్లలో శ్రీసత్యదేవునికై వెదకుతూ నామ సంకీర్తన చేస్తూ, భక్తి పారవశ్యంతో ఉన్నారు. ఆయన వెనుక భక్తజనులు ధూపదీపాలతో ఆ రత్నగిరిపై చెట్టుచెట్టూ వెదకుతుండగా ఒక కుంకుడుచెట్టు మొదట దేవదేవుని స్వరూపావిర్భావం కల్పవృక్ష లాభంగా గోచరించినమీదట ప్రభువు ఆనంద బాష్పధారలతో, శ్రీసత్యదేవుని విగ్రహ శ్రీచరణాలు తడుపుతూ సాష్టాంగ ప్రణామాలు చేసాడు. భక్తు లందరూ ఆనాటి అపురూప దివ్యదర్శన భాగ్యంతో

పేదలకు పెన్నిధి దొరికొనట్లు మహదానందపడుతూ స్వామివారికి మ్రొక్కరిల్లారు. రత్నగిరి మంగళవాద్యాలతో వేద ఘోషలతో పునీతమయిందానాడు. విప్రోత్తములు సత్యదేవునకు అర్చనలు చేసారు.

కొంతసేపటికి రత్నాలగుట్టమీద స్వయం ప్రకాశుడైన శ్రీసత్యదేవుడు లోకానుగ్రహకాంక్షతో స్వయంవ్యక్తుడైన శుభవార్త మలయమారుతంలా ఎల్లెడలా వ్యాపించింది. భక్తజనసందోహం మిక్కుటమయినది. ఆ శుభదినమే ఖరనామసంవత్సర శ్రావణ శుక్ల ద్వితీయ సరియగు బహుళ సంవత్సరం 1891. శక సంవత్సరం 1831 పరమాత్మ రత్నగిరిమీద అనంత లక్ష్మి సత్యవతీ దేవితో గృహస్థాశ్రమం స్వీకరించారు ఆనాడు. వైశాఖ శుద్ధ ఏకాదశి స్వామివారి కల్యాణ దినము. ఆనాటి నుంచీ శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామిగా భక్తజనులతో పూజలందుకొంటూ భక్తజనుల కోరికలను తీరుస్తూ శ్రీ అన్నవర సత్యనారాయణ స్వామిగా బహుప్రసిద్ధి చెందినారు.

స్వామివారి పేరు శ్రీవీరవేంకట సత్యనారాయణ స్వామిగా ఎంతో అర్థవంతముగా వెలుగొందుచున్నది. వీర అనగా విక్రమశాలియని, అశురసంహారంచేసియున్నందున తార్కాణంగా వీర శబ్దం తగియున్నదని కామక్రోధాది ఆత్మ శత్రువులను నిర్మూలన చేసి, భక్త కోటికి జ్ఞానప్రదానంచేసి మోక్షాన్ని అందించడంలో స్వామి వారి వీరత్వం లోకప్రసిద్ధమని, వేంకట శబ్దమునకు పాపములు పోగొట్టువాడని ఐశ్వర్య ప్రదాతయని, సత్యపదం పరమాత్మవాచకమని "సత్యం జ్ఞానమనంతబ్రహ్మ".... "తస్మత్ సత్యంపరమం వదంతి" ఇత్యాది శత్రువులవలన సత్యము యొక్క సర్వోత్కృష్టతను తెలుపుతున్నదని, నారాయణ శబ్దం నారములు ఆయనములుగా కలవాడని (అనగా ఆత్మ నుండి జనించిన ఆకాశాదులునారములు) కారణాత్మతో కార్యములయందు వ్యాపించి ఉన్నవాడని పెద్దలు అర్థవివరణ చేసారు.

శ్రీ శంకరపూజ్యపాదులు తమ విష్ణు సహస్ర నామభాష్యంతో "సత్య" శబ్దానికి అర్థవివరణ చేసారు. "106 ః సత్యః సత్యజ్ఞానమనన్తం బ్రహ్మ" అను శ్రుతి ననుసరించి సత్యస్వరూపుడు శ్రీమన్నారాయణుడని, సత్పురుషులయందు సాధుత్వముకలవాడగుట వలన "సత్యః" అనబడుచున్నాడని "ప్రాణ, అన్న, ఆదిత్య రూపుడగు పరమేశ్వరుడు "సత్యః" అను నామము చేత స్తుతింపబడుచున్నాడని వివరించియున్నారు. అంతే కాక సత్యభాషణ ధర్మస్వరూపుడుగాన "సత్యః" అనుబడుచున్నాడనిరి.

శ్రీ లక్ష్మీసహితుడైన వీరవేంకట సత్యనారాయణ స్వామివారు భక్తులకు కన్నులపండువుగా తమ వైభవాన్ని వ్యక్తీకరించడంతో ఒక చిట్టడవి పరమ పవిత్ర క్షేత్రంగా పరిణమిల్లినది. ఒక చిన్నగుట్ట రత్నాద్రిగా పేరుగడించినది; ఒక చిన్న గ్రామం "అన్నవరం"గా పేరుగాంచినది. ఒక సెలయేరు పవిత్ర పంపానదిగా పెంపువహిస్తున్నది. ఇది భగవానుని లీలగాక మరేమిటి?

హరిహరబ్రహ్మాత్మకమైన స్వామివారి "స్మార్త మూర్తి" వేదోక్తంగా ప్రతిష్ఠితమైన వార్తవిని దేశ దేశాల నుండి ఎందరో భక్తులువచ్చి కానుకలు సమర్పించారు. వ్రతాలు చేసుకున్నారు. అభిషేకాలు, అర్చనలు, పూజలు జరిపించుకున్నారు. స్వామికి ఛత్ర, చామరాలు, ఎన్నో కానుకలు సమర్పించారు. రత్నాద్రి చేరుకోవడానికి మెట్లు, మండపాది నిర్మాణాలు, ఆలయ ప్రాకారాదులు, వెంటవెంటనే సమకూర్చారు.

యాత్రిక జనసందోహంతో అన్నవర క్షేత్రం నిత్య కళ్యాణ వైభోగంగా విరాజిల్లుతూ ఉన్నది. సుప్రసిద్ధ పండితప్రకాండులు, శతావధానులు అయిన తిరుపతి వేంకటకవులు రత్నగిరిమీద శ్రీ సత్యనారాయణ స్వామి సన్నిధిని శతావధానంచేసిన సందర్భంలో ఎన్నో పద్యరత్నాలతో స్వామిని అలంకరించారు. శతాధికగ్రంథకర్త, మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి గారు శ్రీ సత్యనారాయణస్వామి వారిని గూర్చి ఎన్నో

పద్యాలు వ్రాసారు. శతావధాని శ్రీ పీసుపాటి చిదంబరశాస్త్రిగారు స్వామివారి అనుగ్రహాన్ని కాంక్షిస్తూ పద్యాలు చెప్పారు. శ్రీ అల్లమరాజు రంగశాయికవి భక్తి పరవశత్వంతో శ్రీస్వామివారినిపద్యాలతో స్తుతించారు. తెలుగులోనే కాక సంస్కృత భాషలోకూడా స్వామి వారిపై ఎన్నో స్తోత్ర శ్లోకాలు రచించి కృతార్థులైన విద్వత్కవులు ఎందరో ఉన్నారు.

శ్రీరాజా ఇనుగంటి రాజగోపాల వేంకట రామ సూర్యప్రకాశరావుగారు అన్నవరం దేవస్థానం ధర్మకర్త లుగా ఉన్నపుడు శ్రీ ఓలేటి పార్వతీశంగారు దేవస్థాన కవిగా "శ్రీ సత్యదేవ విలాసమను పేర దివ్య కావ్య రచనచేసి స్వామివారి ఆవిర్భావ వైభవములు గ్రంధస్తం చేసినారు.

ఇప్పుడు మన రాష్ట్రంలో, మన దేశంలో శ్రీ సత్యనారాయణుని వ్రతానికి ఉన్నంత ప్రాచుర్యం మరియే వ్రతానికి లేదనడం, అతిశయోక్తికాదు. సర్వ మతములవారు సర్వసిద్ధాంతములవారు, అన్ని దినములలోను ఈ సత్యనారాయణ వ్రతాన్ని కడు భక్తి శ్రద్ధలతో చేస్తూ ఎంతో సాఫల్యాన్ని మానసిక తృప్తినీ పొందుతున్నారు. బీద, గొప్ప తారతమ్యం లేకుండా అందరూ సత్యదేవుని ఆరాధించి తరిస్తున్నారు.

ఈ సత్యదేవుని వ్రతకల్పం స్కాందపురాణం రేవాఖండంలో అయిదు అధ్యాయములుగాయున్నది. శ్రీ సత్యనారాయణ వ్రత విధానము నారదునకు శ్రీమన్నారాయణుడు చెప్పినట్లున్నది. విధివిధానంగా యీ వ్రతంచేసి ప్రసాదం స్వీకరించి అభీష్ట సిద్ధులు పొందినవారి గాథలు ఎన్నో యీ రేవా ఖండంలో ఉన్నవి.

కాశీలోని ఒకనిరుపేద బ్రాహ్మణుడు "శ్రీసత్య నారాయణవ్రతం" ఆచరించి సర్వ సౌభాగ్యములు పొందుతాడు. కట్టెలమ్ముకుని బ్రతికే ఒక దరిద్రుడు యథాశక్తి భక్తితో యీ వ్రతంచేసి పాపవిముక్తుడై వైకుంఠము చేరుకుంటాడు. సాధువనే ఒక వైశ్యుడు సత్యనారాయణ వ్రతం చేసి ఎన్నో ఆపదలనుండి బయటపడి ఐశ్వర్య వంతుడవుతాడు. తుంగధ్వజుడనే మహారాజు వేటకువెళ్ళి, గోపాలకులిచ్చిన ప్రసాదం గర్వముతో తిరస్కరించి రాజ్యభ్రష్టుడై బుద్ధితెచ్చుకుని మరల ప్రసాదం స్వీకరించి రాజ్యం తిరిగి సంపాదించుకుంటాడు. ఇంకా ఎన్నో కథలు సత్య నారాయణ వ్రతప్రభావాన్ని తెలుపుతున్నవి.

సామూహికంగా జరుగుతున్న ఈ సత్య నారాయణ వ్రతాలు అన్నవర క్షేత్రంలోచూసి తీరవలసిందే. వరసలుగా దంపతులు శుచిగా భక్తితో కూర్చుని ఉంటారు. పూజా ద్రవ్యములు దేవస్థానము వారే ఏర్పాటుచేస్తారు. ఉపనయనాలు, వివాహాలు, కేశఖండనం, అక్షరాభాస్యాలు జరిపేవారు, వ్రతాలు చేసుకునేవారు ఈ విధంగా వేలాది భక్తజనంతో నిత్యము అన్నవరం రత్నగిరి కళ్యాణసుందరంగా, వెలుగొందుతూ ఉంటుంది. శ్రీ సత్యదేవుడు ఇచ్చట వెలసి నూరేండ్లు గడచిన సందర్భముగా రాష్ట్ర దేవాదాయ శాఖవారు కోటి రూపాయల ఖర్చుతో ఎన్నో అభివృద్ధి కార్య క్రమాలు అమలుపరచారు. ఇందులో భాగంగా అనేక కట్టడాలు నిర్మించారు. పాతవాటిని కొత్తగా వాస్తు బద్ధంగా రూపుదిద్దారు. ప్రధాన ఆలయం చుట్టూ రథమార్గాన్ని నిర్మించారు. వంద సం॥లు గడిచిన సందర్భంగా ఎంతో వైభవంగా పూజా కార్యక్రమాలు నిర్వహించారు. ప్రముఖ సంస్కృత పండితులు శ్రీ మాడుగులు నాగఫణిశర్మ వ్రాసిన జగద్గురు శృంగేరి పీఠాధిపతి ఆమోదంపొందిన శ్రీ సత్యదేవుని సుప్రభాతం స్వామివారి జయంతినాడు ఆవిష్కరింప జేసారు. కొత్తగా వసతి సదుపాయాలు, నిత్యాన్నదాన పథకం (నిధి) ఏర్పాటుచేసారు. సంస్కృతం నుంచి తెలుగులోకి అనువదించిన "రేవాఖండం" గ్రంథాన్ని కూడా ఆవిష్కరించారు. తెలుగులో ఈ గ్రంథరచన జరగడం ముదావహం ఇందు సత్యదేవుని మహాత్మ్యం ఉన్నది.

ఇంకను ఎంతో ప్రాచుర్యం ఈ క్షేత్రానికి జరుపవలసిన అవసరమున్నదని తోస్తున్నది.

## శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరాలయం

దక్షిణ కాశీగా ప్రసిద్ధిగాంచిన "ద్రాక్షారామం" తూర్పుగోదావరిజిల్లా దక్షిణానగల అతి ప్రాముఖ్యమైన పుణ్యక్షేత్రాలలో ఒకటి. ద్రాక్షారామ భీమేశ్వరాలయం పంచారామాలలో ఒకటైన ప్రసిద్ధిచెందిన శైవక్షేత్రం. ఇక్కడ సప్తగోదావరులు అంతర్వాహినులై ప్రవహిస్తు న్నాయి.

ఇంతేకాక, ఎంతో చారిత్రిక ప్రాధాన్యత కలిగి ఉన్నదీ క్షేత్రం ఎన్నో శాసనాలిక్కడ లభిస్తున్నవి. అందువలన పౌరాణిక, చారిత్రిక అద్భుత శిల్పకళాభి రామమే ద్రాక్షారామం.

శ్రీనాథ కవిసార్వభౌముడు తన భీమేశ్వర పురాణంలో ఈ క్షేత్ర వైభవాన్ని విపులంగా అభి వర్ణించాడు. గోపురాల నిర్మాణ వైశిష్ట్యాన్ని అందంగా అభివర్ణించాడు క్షేత్రానికి నలుదిక్కుల ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ, దక్షిణ నందవనవాటి "దక్ష వాటి" యని శ్రీనాథుడు కీర్తించాడు.

దక్షుడు యజ్ఞం చేసిన ప్రదేశం కాబట్టి ద్రాక్షా రామం అయింది. రాక్షసుల బాధలు ఎక్కువ కావడంతో దేవతలు పరమ శివుణ్ణి ప్రార్థించారు. పరమ శివుడు త్రిపురాసుర సంహారం చేసాడు. ఆ రాక్షసుని మెడలోని శివలింగము ఐదు ముక్కలుగా ఛేదింపబడి గాలిలోనికెగిరి, ఐదుచోట్లపడ్డాయి. ఆ ముక్కలు పడిన ఐదు ప్రదేశాలలోను ఐదు శివక్షేత్రాలు వెలిసాయి. అవే పంచారామములుగా ప్రసిద్ధి చెందాయని చెబుతారు. "అమరారామము" (గుంటూరు జిల్లాలోని అమరావతి) భీమారామము (గీసుపూడి, భీమవరం) క్షీరారామం (పాలకొల్లు) కుమారారామం (చాలుక్య భీమవరం సామర్లకోట) ద్రాక్షారామం (ద్రాక్షారామ) అని ప్రసిద్ధి చెందాయి. శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరుని సూర్యుని ప్రతిష్ఠగా భీమేశ్వరపురాణం చెప్తుతుంది. ఇక్కడి శివలింగం ఎత్తు 15 అడుగులు కాగా చుట్టూ రెండంతస్తుల ఆలయం ఉంది. ఆలయం క్రింద అంతస్తు చీకటిగా ఉంటుంది. ఈ అంతస్తులో ప్రదక్షిణలు జరిపి పై అంతస్తులో అర్చనలు జరపడం ఇక్కడి ఆచారం.

శ్రీ భీమేశ్వరలింగం శిఖరాన గంట్లుపడి వుంటుంది. పాశుపతాస్త్రం సంపాదించే సమయంలో అర్జునుడు శివునిపై ప్రయోగించిన అస్త్రాలవల్ల ఇలాతూట్లు ఏర్పడ్డాయని, భావిస్తారు. శివుడు ఛేదించిన లింగ భాగాన్ని ద్రాక్షారామంలో ప్రతిష్ఠించదలచిన సప్త మహా ఋషులు ముహూర్తాన్ని నిర్ణయించి, స్థలశుద్ధికై గోదావరిని ఆహ్వానించారు. అందుకు గోదావరి అంగీకరించి వారివెంట ప్రవహిస్తుండగా రాక్షసులు యజ్ఞోపకరణాలు ఆ ప్రవాహంలో కొట్టుకుపోగా, సప్త ఋషులు రాక్షసులకోపానికి నదిగురికాగా, తుల్యభాగుడు అనే ఋషి సత్తముడు వారికి మధ్యవర్తిగా వ్యవహరించి సప్త ఋషుల పేర అంతర్వాహినిగా ద్రాక్షారామం చేరడానికి ఒప్పందం చేసాడు. ఆ విధంగా వచ్చిన గోదావరి శాఖలు భీమేశ్వరుని సమీపంలో "సప్త గోదావరి" అనే కొలనుగా ఏర్పడినదని, భీమేశ్వర పురాణంలోనున్నది.

శివుని అర్ధాంగిగా పార్వతీదేవి దక్షుని యజ్ఞ శాలలో అవమానింపబడి అగ్నికి ఆహుతికాగా శివుడు తన జటాజూటం నుండి వీరభద్రుని సృష్టించి పంపగా వీరభద్రుడు ద్రాక్షారామాన్ని ధ్వంసంచేసాడని పురాణ గాథ ఉన్నది.

### ద్రాక్షారామ క్షేత్ర మహిమను తెలిపే మరో గాథ

కాశీ విశ్వేశ్వరస్వామి ఒకప్పుడు వ్యాస భగవానుని పరీక్షించాలనే తలపుకలిగిన ఫలితంగా వ్యాస భగవానునికి, ఆయన శిష్యులకు కాశీనగరంలో భిక్ష లభించలేదు. ఆకలిబాధ కోర్వలేక వ్యాసుడు కాశీ నగరాన్ని శపించడానికి సిద్ధపడినప్పుడు ముసలి ముత్తైదువ రూపంలో వ్యాసభగవానునికి అతని

శిష్యులకుభిక్షలందజేసి వారి ఆకలితీర్చింది అన్నపూర్ణ మహాదేవి. అంతట కాశీ విశ్వేశ్వరుడు కాశీ పురం మోక్షాన్ని ప్రసాదించే క్షేత్రమే తప్ప భోగ జీవితానికి అనువైన క్షేత్రంకాదని భక్తులకు తెలియ జేసాడు.

ద్రాక్షారామ భీమేశ్వరుని సేవించినట్లయితే ఇహ పరసుఖాలు లభిస్తున్నవని, అన్నపూర్ణదేవి వ్యాసునకు ఆయన శిష్యులకు తెలియజెప్పింది. వ్యాస భగవానుడు శిష్యబృందంతో ద్రాక్షారామం చేరు కున్నాడు. ఇక్కడ భీమేశ్వరస్వామి సేవలో కాశీ వియోగ దుఃఖాన్ని మరచిపోయారు వారందరూ. శ్రీ భీమేశ్వరస్వామి భక్తులపాలిటి కల్పవృక్షమని వేముల వాడ భీమకవి వృత్తాంతం ఋజువుచేస్తున్నది.

మన తెలుగుదేశానికి త్రిలింగదేశమనే నామాం తరమున్నది. శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామాల మధ్య దేశము కనుక ఆ పేరు వచ్చినదని పెద్దలు చెబుతారు.

భీమేశ్వరస్వామి క్షేత్రం (ఆరు ఎకరాలు) చుట్టూ 12 అడుగుల ఎత్తుగల పెద్దరాతిగోడ వున్నది. గర్భాలయం నాలుగుదిక్కులలోను 13 స్థంబాల మంగళవారపు మండపం, సప్త గోదావరి మండపాలు, శంకర నారాయణుని ఆలయం, వామనుడు, విశ్వేశ్వ రుడు, అన్నపూర్ణ, దుండిగణపతి, నృత్యగణపతి, మాణిక్యాంబ ఆలయంపై అంతస్తులో వీరభద్రుడు నటుకభైరవుడు, కాశీలోవలె కుడిచేతిమీద తొండం కలిగిన గణపతి, నాగేశ్వరుడు, చతుర్ముఖ బ్రహ్మేశ్వ రుడు క్షేత్రపాలకుడులక్ష్మినారాయణస్వామి, విరూపాక్ష స్వామి, నటరాజు, సుబ్రహ్మణ్యేశ్వరుడు, దుర్గ, కైలాస పతి, వ్యాసుని ఆలయాలతోపాటు భీమేశ్వరుడు కొలువుతీరి వున్నారు.

ఈ ద్రాక్షారామ మహిమ సంస్కృత స్కాంద పురాణాంతర్గతమైన గోదావరీ ఖండములో వర్ణింపబడి యున్నది. తెలుగులో శ్రీనాథ కవీంద్రుడు అంతగా వర్ణించడం వలననే ద్రాక్షారామానికి ఆ భీమేశ్వర స్వామికి అంతటి మహా ప్రసిద్ధి ఏర్పడ్డదని అనుకో వచ్చును.

కాశీ విశ్వనాథస్వామి కంటే ద్రాక్షారామ భీమేశ్వరుడే శ్రేష్ఠుడని, ఈ క్షేత్రం భోగమోక్ష భూమి యని భీమఖండంలో వర్ణింపబడ్డది.

భీమేశ్వరాలయం నాగరశైలిలో వున్నది. మూల నుండి శిఖరంవరకు చతురస్రాకారంగా ఉండే శిల్ప రీతిని నాగరమని శిల్ప శాస్త్రజ్ఞులు చెబుతారు. దేవాలయం నమూనా ఒక చిన్న శిలమీద తీర్చబడి ఒక మూల స్థాపింపబడి యున్నది.

ఈ భీమేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించినది సూర్య దేవుడని చెప్పుకొన్నాము. ఇంత ఎత్తైన శివలింగాలు అరుదు. దాదాపు మూడు అడుగులకు మించిన లింగ శిరస్సును రెండవ అంతస్తులో దర్శించవచ్చు. దీనికే నాగాభరణం అలంకృతమై వుంటుంది. దీనిని అర్ధ నారీశ్వరలింగం, స్ఫటికలింగం అనికూడా చెబుతారు. ఇందుకు దృష్టాంతంగా లింగం దాదాపు సగభాగం, తెల్ల గాను, సగభాగం నల్లగాను ఉంటుంది. నల్లనిభాగం శివ స్వరూపం తెల్లని భాగం దేవీస్వరూపం అని చెబుతారు.

ఈ భీమేశ్వరుని అర్ధాంగి మాణిక్యాంబ. ఈమె భీమేశ్వరాలయంలోకాక ఆలయానికి ఎడమవైపున తిరుచుట్టుమాలెలోని ప్రత్యేక మందిరంలో ప్రతిష్ఠి తమై ఉన్నది. భారతదేశములోని అష్టాదశ శక్తులలో, ఈ మాణిక్యామాంబ ఒకతె.

భీమేశ్వరాలయ శిలాఫలకాలమీద, ప్రతి శిలా ఖండంపైనా వందలకొలది శాసనాలు చెక్కబడి వున్నవి. ఈ శాసన లిపికి నేటి తెలుగులిపికీ కొన్ని తేడాలున్నందువలన వీటిని అందరూ చదవడానికి వీలుపడలేదు. ఆలయాన్ని దర్శించి, ఆయా దాన ధర్మాలుచేసిన పూర్వపు మహారాజులు, రాజ పురుషులు, దాతలు చెక్కించినవే యీ శాసనాలు.

భీమేశ్వరలింగం సూర్యప్రతిష్ఠితం అయినందు వలన తాపోపశాంతికి అష్టదిక్కులా, అష్టసోమలింగాలు ప్రతిష్ఠితములైయున్నవి. సుమారు 382 శాసనాలు దేవాలయ గోడలపై వున్నవి. ఈ శాసనాలు 11 నుండి 15వ శతాబ్దానికి చెందినవిగా చెబుతున్నారు.

పంచారామాలు బౌద్ధకేంద్రాలని, బౌద్ధమతం క్షీణదశలో ఉన్న సమయంలో శైవాచార్యులు ఈ ఆలయాలను చేజిక్కించుకుని శైవ క్షేత్రాలుగా మార్చారనే కథకూడా ప్రాచుర్యంలో ఉన్నది. ఇందుకు నిదర్శనంగా భిక్షాపాత్రలు, కుండపెంకులు ద్రాక్షారామ ప్రాంతంలో లభించినట్లుగా చరిత్రకారులు చెబుతున్నారు.

ప్రతి సంవత్సరం మాఘ శుద్ధ ఏకాదశి రోజున శ్రీభీమేశ్వరస్వామికి, శ్రీలక్ష్మినారాయణస్వామికి, శ్రీసూర్యేశ్వరస్వామికి పాంచాహ్నికంగా ధ్వజారోహణ, కళ్యాణ మహోత్సవాలు వైభవోపేతంగా జరుగు తాయి. ప్రస్తుతం ఈ దేవాలయం దేవాదాయ ధర్మా దాయశాఖ ఆధీనంలో పురావస్తుశాఖవారి పర్యవేక్షణలో ఉన్నది. ఈ ఆలయ వంశపారంపర్య ధర్మకర్తలుగా రామచంద్ర పురం వాస్తవ్యులు మున్సిపల్ ఛైర్మన్ శ్రీరాజా కాకర్ల పూడి రామచంద్రరాజు బహదూర్‌వారి ఆధ్వర్యంలో ఉన్నది.

ప్రస్తుతం, ఆలయంలో, పురావస్తుశాఖవారు "చీకటికోణం"మరమ్మత్తులు చేపట్టి నిర్వహిస్తున్నారు.

ఎంతో మహిమాన్వితమైన ఈ క్షేత్రం ఆంధ్ర దేశంలో ఉండడం మనందరి అదృష్ట విశేషమని చెప్పాలి.

## శ్రీ మందేశ్వర (శనేశ్వర) స్వామి దేవస్థానం : మందపల్లి

తూర్పు గోదావరిజిల్లా కొత్తపేట తాలూకా కొత్త పేటమీదుగా అమలాపురంపోవు బస్సు మార్గమున 8 కి.మీ. దూరమున మందపల్లి కలదు.

ఈ తీర్థమును గూర్చి బ్రహ్మపురాణము నందలి గౌతమీ మహాత్మ్యము నందు వర్ణింపబడినది. అశ్వత్థ పిప్పల, శనైశ్చాది తీర్థసముదాయముగల మందపల్లి క్షేత్రము చాల పవిత్రమైనది.

ఈ మందపల్లి క్షేత్రమున పదునాలుగువేల నూటఎనిమిది పుణ్యతీర్థములుకలవు. వీటిలో ప్రధాన మైనవి. అశ్వత్థ తీర్థము, అగస్త్య తీర్థము, సాత్రిక తీర్థము యాగ్నిక తీర్థము, సౌమగ తీర్థము మొదలగునవి ముఖ్యమైనవి.

ఒకప్పుడు మేరుపర్వతముపై కోపముతో అంతకంటే చిన్నదిగాయున్న వింధ్య పర్వతము విపరీతముగా పెరిగెను. అట్లు వింధ్య పర్వతము పెరుగుటవలన భారతదేశమున సూర్యకిరణ ప్రసారము ఉత్తర దక్షణభాగములయందు చక్కగా ప్రసరించుటకు వీలుకాలేదు. అందువలన అనేక ఇబ్బందులు కలుగు చుండెను. అంత దేవతలు అగస్త్య మహాముని వద్దకు వచ్చి వింధ్య పర్వతము యొక్క పెరుగుదల నిలుపుటకై ప్రార్థించిరి. పిమ్మట అగస్త్య మహర్షి తన శిష్యబృందముతో వింధ్యగిరి సూర్యగతిని నిరోధిం చుట మాన్పించదలచి వింధ్యపర్వతరాజు వద్దకు వచ్చెను అంతట పర్వతరాజు బహు ఋషి గణసమేత ముగ అరుదెంచిన అగస్త్య భగవానునికి అతిథి సత్కారములచే సంతుష్టునిచేసి ఆగమనకారణ మడిగెను అంత అగస్త్య మహర్షి తాను మహాజ్ఞానులగు మహర్షులతోగూడ, దక్షిణదిక్కునకు తీర్థయాత్రకై బయలుదేరితిననియు తనకు మార్గమిమ్మనియు తిరిగి ఉత్తరదిక్కునకువచ్చు పర్యంతము (వింధ్య) పెరగ కుండా అట్లే యుండవలెనని కోరెను పర్వతశ్రేష్ఠ డందు లకంగీరించెను.

ఆ ఋషిసమూహములతో అగస్త్యమహాముని దక్షిణదిశకు వెడలెను. పిమ్మట క్రమక్రమంగా సత్రయాగము చేయుటకై గౌతమీనదీ తీరమునకు

వచ్చి ఒక సంవత్సర పర్యంతము సత్రయాగము చేయనారంభించెను. దీక్షబూనియుండెను.

అంతట కైటభదనుజుని పుత్రులు లోక కంటకులు, మహాపాపులు అశ్వత్థుడు, పిప్పలుడు అను యిరువురు అశ్వత్థ అనగా రావిచెట్టు రూపములోను పిప్పలుడు బ్రాహ్మణునిరూపములోను యుండి సమయమును జూసి యజ్ఞము నాశనము చేయుటకై పాపబుద్ధికలవార్రై రావిచెట్టు రూపములో నున్న అశ్వత్థుడు రావిచెట్టు నీడలోకి వచ్చినవారిని తిను చెండెను. పిప్పలుడు సామవేదము నేర్చుకొనుటకు వచ్చిన శిష్యులను భక్షించుచుండెను. అంతట దిన దినము బ్రాహ్మణులు, శిష్యులు క్షీణించుటచూసి మహర్షులు గౌతమీ దక్షణ తీరమున నియమవ్రతుడై తపస్సు చేయుచున్న సూర్యతనయుడైన శనీశ్వరుని జూచి ఈ ఘోరమగు రాక్షస కృత్యములను ఛేదించి, ఈ రాక్షసులను వధించమనికోరిరి. అంతట శనీశ్వరుడు తన తపస్సు పూర్తికాగానే రాక్షసులిద్దరిని సంహరింతునని చెప్పెను. అంతట మహర్షులు మా తపస్సులను నీ కిచ్చెదమని వెంటనే ఆ రాక్షసులను తుదముట్టించ మని, కోరిరి. శనీశ్వరుడు అట్లేయని ఋషులతో చెప్పి శని బ్రాహ్మణరూపములో వృక్షరూపముననున్న అశ్వత్థుని దగ్గరకుపోయి ప్రదక్షిణములు చేయ నారంభించెను. అంత అశ్వత్థుడు ఈ శనిదేవుని మామూలు బ్రాహ్మణుడేయనుకొని అలవాటు చొప్పున మ్రింగి వేసెను. అపుడు శని ఆ రాక్షసుని దేహమున ప్రవేశించి ఆ రాక్షసుని చంపివేసెను. తదుపరి రెండవ రాక్షసుడైన పిప్పలునివద్దకు వటు వేషమునబోయి, పిప్పలుని కూడ భస్మముచేసెను.

ఆ యిరువురి రాక్షసులను సంహరించిన, శనీ శ్వరుని చూచి మహర్షులందరు సంతుష్టులైరి. శనీ శ్వరుడు కూడా ఋషులతో నిట్లు చెప్పెను.

"శనివారమున ఏ జనులైతే నియమ వ్రతులై అశ్వత్థ (రావి) వృక్షమునకు ప్రదక్షణ చేయుదురో వారి కోరికలన్నియు తీరును. వారికి నా పీడ కలుగదు. ఈ అశ్వత్థ తీర్థములోను, ఈ శనైశ్చర తీర్థములోను స్నానము ఎవరు చేసెదరో వారికి సమస్త కార్యములు నిర్విఘ్నముగా కొనసాగును. శనివారము రోజున అశ్వత్థ ప్రదక్షణములు చేసినవారికి గ్రహపీడ కలుగదు" అని చెప్పెను.

అప్పటి నుండి ఈ ప్రదేశమునందు అశ్వత్థ తీర్థము, పిప్పలి తీర్థము; సానుగ తీర్థము, అగస్త్య తీర్థము, సాత్రిక తీర్థము, యగ్నిక తీర్థము, సామగ తీర్థము మొదలుగాగల పదునాలుగు వేలనూట ఎనిమిది తీర్థములు అనేకమంది ఋషులచేతను, దేవతలచేతను కల్పించబడి ప్రసిద్ధిచెంది స్నాన, జప, పూజాదులు సల్పిన భక్తజనులకు సమస్త కార్యసిద్ధి, సమకూర్చి సత్ర యాగఫలము లభింపజేయుచున్నది.

ఇచ్చట శని, సామగాన కోవిదులగు రాక్షసులను సంహరించి బ్రహ్మహత్యాదోష పరిహారమునకై లోక సంరక్షణకై, సర్వలోకేశ్వరుడగు కరుణామయుడగు శివుని ప్రతిష్ఠించెను. తనచే ప్రతిష్ఠింపబడిన పరమ శివునికి నూనె అభిషేకము జరిపించిన వారికి సమస్త కోరికలు ఈడేరునట్లుగను, తన బాధ, ఇతర గ్రహముల పీడ మొదలగునవి లేకుండునట్లును, శని వరము నిచ్చెను.

శనిచే ప్రతిష్ఠింపబడిన ఈశ్వరునికి, శనీశ్వరు డనియు శనికి మందుడని పేరుండుటచే ఈశ్వరునికి మందేశ్వరుడనియు కూడ ప్రసిద్ధి నామము కలిగెను.

పిమ్మట ఈ మందేశ్వరునికి, మందేశ్వరుని ప్రక్కనే సప్తమాతృకలు వచ్చి శ్రీ పార్వతీదేవిని ప్రతిష్ఠించిరి. ఈ ఈశ్వరునికి బ్రహ్మేశ్వరుడని పేరు

వచ్చినది. దీనికి ప్రక్కనే అష్టమహా నాగులలో ఒకటగు కర్కోటకుడను నాగుచే ప్రతిష్ఠింపబడిన ఈశ్వరునికి నాగేశ్వరుడని పేరు. సమీపమున గౌతమ మహర్షిచే ప్రతిష్ఠింపబడిన శ్రీ వేణుగోపాలస్వామి కలదు. ఒకే పెద్ద ప్రాకారమునందు వరసగా ఐదు దేవాలయములు కలిగి భక్తజనాహ్లాదకరముగనుండును.

శ్రీ మందేశ్వరస్వామివారి పూజాకార్యక్రమములు విరివిగా జరుగుచున్నవి. అనగా లఘున్యాస తైలాభిషేకము, మహాన్యాస తైలాభిషేకము, రుద్రాభిషేకము వైభవముగా జరుగుచున్నవి.. పైకము మనియార్డరు చేసిన వారికికూడ పూజలు చేయు సౌకర్యము దేవస్థానమువారు ఏర్పాటు చేసియున్నారు.

[గమనిక : ఈ రచయితకు ఈ దేవాలయమును దర్శించు మహద్భాగ్యము కలిగినది. ఈ దేవాలయము మందపల్లి గ్రామమున శుచి, శుభ్రతలతో చక్కగా నున్నది. అలా శుచి శుభ్రతలు కాపాడుచున్న దేవాలయ సిబ్బందికి గ్రామ, ప్రజలకు కృతజ్ఞతాభివందనములు చేయుచున్నాను. - రచయిత]





# పశ్చిమ గోదావరి జిల్లా

పశ్చిమగోదావరి ప్రాంతము ఒకప్పుడు కృష్ణా జిల్లాలోని భాగము. గోదావరినదికి పశ్చిమమున నున్న ప్రాంతము కనుక ఆ పేరు వచ్చి నది. అనేక ప్రాచీన మహిమాన్వితమైన ఆలయములు ఉన్న జిల్లా ఇది. గోదావరి పరిసర ప్రాంతములలో కొన్ని, గోస్తనీనదికి యిరువైపుల మరికొన్ని పురాతన దేవాలయములు ఇచ్చట ఉన్నవి.

పంచారామములలో రెండు ఈ జిల్లాలోనే ఉన్నవి. (గునుపూడి) భీమవరం (సోమేశ్వరుడు) పాలకొల్లు క్షీరా రామేశ్వరుని ఆలయములు యివి. ఈ జిల్లాలోని ద్వారకా తిరుమలలో అనగా ఆంధ్రప్రదేశ్ మధ్యమున అందుబాటులో శ్రీ వెంకటేశ్వర స్వామి వున్నారు. పట్టిస క్షేత్రములో దక్షయజ్ఞమును ధ్వంసము చేసిన వీరభద్రుడు ఈ జిల్లాలోనే ఉన్నాడు. శ్రీ సీతారామచంద్రులచే స్వయముగ ప్రతిష్ఠింపబడిన ఈశ్వర లింగములు ఈ ప్రాంతముననున్నవి. ఈ ఆలయముల చరిత్ర క్లుప్తముగా విశదీకరించుటకు ప్రయత్నము జరిగినది.

## ద్వారకా తిరుమల

ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ధ క్షేత్రములలో ద్వారకా తిరుమల చాలా పేరు పొందినది. పశ్చిమ గోదావరి జిల్లాలో ఇది అత్యంత ప్రముఖ క్షేత్రం ప్రాచీనమైనది కూడా ప్రథమ శ్రేణి దేవాలయముగ గుర్తింపబడినది. భీమడోలు రైల్వేస్టేషనుకు సుమారు పదిహేను కి.మీ. దూరములో నున్నది. ఏలూరు తాడేపల్లి గూడెం నుంచి బస్సు సౌకర్యము కలదు.

శేషా కారముననున్న చిన్న కొండపై ఈ ఆలయము ఉన్నది.

కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు తమ ద్వారకాతిరుమల మహాత్మ్యము అనుగ్రంథములో ఈ క్షేత్ర మహాత్మ్యమును వివరించి యున్నారు. ఈ క్షేత్రప్రత్యేకత తెలిసికొనవలసిన అవసరమున్నది. అపూర్వ రీతిలో ఈ క్షేత్రముండుట చేత ఈ అవసరమున్నది.

ద్వారకయను ఒక పురము పూర్వముండెడిది. దానికి సమీపమున తిరుమల గిరియను కొండ కూడ యుండెడిది. రెంటినీ కలిపి ద్వారకా తిరుమల అను పేరు ఈ పట్టణమునకు వచ్చినది.

కలియుగమున "ద్వారకుడు" అను ఒక భక్త శిఖామణిచే యీ క్షేత్రము ప్రకటితమగుటచే ద్వారకా తిరుమలయను సార్థక నామము కలిగినట్లు తెలియు చున్నది. త్రేతాయుగములో శ్రీరామచంద్రుని పితా మహుడైన అజమహారాజు, తర్వాత దశరథ మహారాజు, శ్రీరామచంద్రుడు కూడ ఈ క్షేత్రమును దర్శించి సేవించిరి.

ఇచ్చట ధృవ మూర్తులు అనగా మూల విరాట్టులు రెండున్నవి.

ఇచ్చట శ్రీ వెంకటేశ్వరస్వామి స్వయంవక్త శ్రీనివాసుడు, ఆయన పాదములు పాతాళ లోకమున బలిచక్రవర్తిచే పూజింపబడును. ఆ కారణముచే పూర్వము తిరుమల తిరుపతి నుండి సర్వాంగ పూర్ణ మగు శిలావిగ్రహమును యిచటకు తీసికొని వచ్చి ఆగమ శాస్త్ర ప్రకారము ధృవమూర్తికి వెనుక పీఠము పై ప్రతిష్ఠ చేసిరి. పీఠముపైన ముందున్న మూర్తికి పాదములు కనిపించవు. ఇది ఈ క్షేత్రమందలి ప్రత్యేకత.

బ్రహ్మోత్సవములు ఏడాదికి రెండు ఈ క్షేత్రములో జరుపబడు చున్నవి. శ్రీ వెంకటేశ్వర స్వామి సన్నిధిని అలమేలుమంగ తాయారు - బీబీ నాంచారు అమ్మవార్లు పూజింపబడుచుందురు. శుక్ర వారము విశేషకుంకుమ పూజలు జరుపబడుచున్నవి. ముఖ్యాలయమున, తూర్పున, అమ్మవార్లును, ధ్వజ స్థంభమువద్ద స్వామికి ఎదురుగా 'భక్తాంజనేయ, గరుడా ళ్వార్ల' ఆలయంలు కలవు. వీనికి వాయవ్యమున ఒక కుంకుడు చెట్టుకలదు. అది మహిమకలది. స్వామివారు ద్వారకునిచే బహిర్గతము చేయబడినప్పటి నుండి యీ కుంకుడు చెట్టు జీవించి యున్నదని ప్రతీతి. ముఖద్వారము వైపుగల, గోపురము పెద్దది ఐదంతస్తులు. ఆలయమున కెదురుగా దిగువన, కళ్యాణ మంటపమున్నది.

కుంకుళ్ళమ్మ ఇచ్చటి గ్రామ దేవత. ఆమె గుడి భీమడోలు నుంచి ద్వారకాతిరుమలకు వెళ్ళు రోడ్డు ప్రక్కన నున్నది. ఈ క్షేత్రమున సుదర్శన పుష్కరిణి లో యాత్రికులు స్నానము చేయుదురు.

ద్వారకా తిరుమల క్షేత్ర మహాత్మ్యములో వ్రాయబడిన కథ క్లుప్తముగా ఇది.

ఆంధ్రదేశమున, ద్వారకా తిరుమలయను పట్టణము ప్రసిద్ధమైనది. సర్వసంపదలతో తుల తూగుతూ ఈ పట్టణము అమరావతి వలె యుండెను. కలియుగ ప్రత్యక్ష దైవమగు శ్రీవేంకటేశ్వరుడు శేషా చలము నుండి సతి అయిన అలమేలుమంగతో ఇచట వెలసి భక్తులను రక్షించు చుండెను. అర్ధరాత్రి యందు కూడా ఆ పురములో వేదపఠనము, శాస్త్రచర్చ జరుగు చుండెడివి.

ఆ పురమున ద్వారకుడను భక్తుడుండెడివాడు. ఈ తడు కడు బీదవాడు. సర్వకర్మానుష్ఠానము వదలక నిర్వర్తించువాడు. సాధువై, శాంతుడై వుండెడివాడు. అతని భార్య అతనికి సరియైన సతి సాధ్వి. పరమ పతివ్రత. సతీ సమేతముగ ఈతడెన్నో తీర్థములను సందర్శించెను. ఒకానొక దినమున ఒక తైర్థికుడు వచ్చెను. ఆయనకు ద్వారకుడు ఆతిథ్యమిచ్చి శేషా చలమును నేను దర్శించ లేనైతిని. అద్దాని గురించి చెప్పమనెను. ఆ తైర్థికుడిట్లు చెప్పెను.

పూర్వము నాగేంద్రుడు, హరిహరులను గూర్చి ఘోర తప మొనరించెను. "నేనొక పర్వత రూపమున

ఉండెదను. మీరిరువురు నా శిరస్సునఒకరు, పుచ్ఛమున వేరొకరు సదా నివసింపుడు. నాకు పరమపదము ప్రసాదింపుడు" అని వేడుకొనెను. హరిహరులిరువురు అతని ప్రార్థన నాలకించి, అంగీకరించిరి. శేషుడు ఒక పర్వత రూపమునుదాల్చెను. అదియే వేంకటాచలము. ఆ పర్వత శిరోభాగము శ్రీశైలము చివరిభాగము వేంకటాచలము. ఆ పర్వతముపైననే శ్రీమన్నారాయణుడు శ్రీ వేంకటేశ్వరుడై వెలసెను. ఆ ప్రాంతమున నారాయణ పట్టణములో ఆకాశరాజు రాజ్యమేలుచుండెను. సంతానము కొరకై ఆయన యజ్ఞము చేయవలెనని ఆ ప్రదేశము దున్నుచుండగా శ్రీరాముని వలన వరము పొందిన సీతాదేవి నాగేటికర్రునకు తగిలెను. ఆమెను ఆకాశరాజు పెంచి అలమేలు మంగ యని పేరుపెట్టెను. ఒకరోజు అలమేలుమంగ వెంకటాచల ప్రాంతమున అడవిలో విహరించుచూ వీణా గానము చేయుచుండగా, ఆ గానము వేంకటేశ్వరుడు ఎరుకల వేషములో విని ఆమె వద్దకు వచ్చి తనను పెండ్లాడమని కోరెను. ఆమె చెలికత్తెలు ఎరుకల వానిని చూచి హేళన చేసిరి. కొంతసేపటికి ఎరుకల వానిగా నున్న వేంకటేశ్వరుడు తన నిజరూపమును చూపెను. ఆ విషయమును తెలిసికొని ఆకాశరాజు అలమేలు మంగను వేంకటేశ్వరునికిచ్చి వివాహము గావించెను. ఈ కథ వినిన ద్వారకుడు వెంకటాచలము అనేక పర్యాయములు పోయి, స్వామిని దర్శించివచ్చెను.

పిదప, ఒకనాటి మండువేసవిలో సతీసమేతుడై ద్వారకుడు తిరుపతి యాత్రకై పోవుచూ దాహముతో ఎండవేడిమికి తాళలేక పడిపోయెను. నీటికై వెదకుచుండగా అచటికొక భక్తుడు రాగి పాత్రలో నీటిని తెచ్చి యిచ్చెను.

"ఈ ఆపద సమయములో మమ్ములను రక్షించుటకు దేవునివలె వచ్చిన మీరెవ్వరని" అడుగగా వారి యెదుట శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై తానే వేంకటేశ్వరుడనని వారి భక్తికి మెచ్చి దర్శన మిచ్చితినని తెలిపెను. అంత వరమడుగ మన ద్వారకుడు "మా జన్మభూమి విడవకుండా మీ దర్శనము మాకు కలుగునట్లు అనుగ్రహించమని" వేడుకొనెను. తిరుపతి కొండకు వచ్చెదను నన్ను సేవించుచుండుడని వేంకటేశ్వరుడు సెలవిచ్చెను.

"మీ పొలమున గరుడుడు ఏ వృక్షంబున మీకు కనబడునో ఆ వృక్ష మూలమున శిలారూపమున నేను అవతరించెదను" అని చెప్పి మాయమయ్యెను

ఈ విషయము ద్వారకుడు తన గ్రామ వాసులకు తెల్పిన వారందరు వేంకటేశ్వరున కొరకై వెదకిరి. కాని స్వామి కనిపించలేదు. ద్వారకుడు మోసకారి యని గ్రామస్థుల దూషించగా, ద్వారకుడు దీనుడై వేంకటేశ్వరుని ప్రార్థించెను. గరుత్మంతుడు రివ్వున వచ్చి ఒక చెట్టుపై ప్రత్యక్షమయ్యెను. ఆ చెట్టుక్రింద త్రవ్వగా వేంకటేశ్వరుని విగ్రహము కన్పించెను. కాని ఆ విగ్రహము పాదములు ఎంత త్రవ్వినను కన్పించలేదు. స్వామిపాదముల దర్శనమునకై ద్వారకుడు ఎంతయో ప్రార్థించెను. "నా పాదపూజా భాగ్యము బలికి ఇచ్చితిని. నీవు వృథాశ్రమపడవద్దని" స్వామిచెప్పెను. ద్వారకుడు ఆ ప్రాంతమును త్రవ్వించగా శ్రీ మల్లిఖార్జునుడు కూడా ప్రత్యక్షమయ్యెను. ద్వారకకు దగ్గరలో వేంకటేశ్వరుడు ప్రత్యక్షమైనందున ద్వారకా తిరుమల అని పేరు వచ్చినది. ఆంధ్రదేశములో తిరుపతి, ద్వారకా తిరుపతి, వాడపల్లి, ఉపమాకలలో నేను వెలసెదనని శ్రీ వేంకటేశ్వరస్వామి సెలవిచ్చెను. ఆ ప్రకారముగా ఆ చోట్ల స్వామి అవతరించెను.

ఔరంగజేబు, హిందూదేశమును పరిపాలించెను. ఆయనకు బీబీ నాంచారి అను కుమార్తె యుండెడిది. ఆమెకు ఒకనాడు ఒక విగ్రహం దొరికెను. సుందరమైన ఆ విగ్రహమును ఆమె అలంకరించి, లాలించి దానితో ఆడుకొను చుండెడిది. ఆ విగ్రహమే తన ప్రాణనాధు

డనుకొనెడిది. ఒకనాడు ఆ విగ్రహము ఆమెకు పురుష రూపమున సాక్షాత్కరించి "నీవు కమలాంశమందు జన్మించినదానవు. నిన్ను నేను పరిగ్రహించెదనని ఆమెతో చెప్పెను". కొంత కాలమునకు యాదవా చలములో శ్రీమన్నారాయణుని విగ్రహము కనిపించ లేదు. శ్రీ రామానుజునకు శ్రీమన్నారాయణుడు కలలో కనిపించి నేను అడవిలో పూజలు లేక పడి యున్నాను, నాకు పూజలు చేయవలెనని చెప్పగా శ్రీరామానుజులు విష్ణువర్ధన మహారాజా వద్దకు పోయి ఈ వృత్తాంతము చెప్పి యదుగిరి స్వామికి గుడి గోపురములు కట్టించెను. ఆలయమునందు ఉత్సవము నకు తగిన విగ్రహము దొరకక రామానుజులు విచా రించుచుండగా ఆయనకు స్వామి కనిపించి "నేను ఢిల్లీ పురమున సుల్తాను అంతఃపురములో ఉన్నాను" అని చెప్పెను. వెంటనే రామానుజులు విష్ణువర్ధన రాజుతో కలసి సుల్తానువద్దకు వెడలెను. సుల్తాను తన వద్దనున్న విగ్రహములలో మీకు కావలసిన విగ్రహము ఉన్నదేమో చూసి తీసికొని పొండు అని వారికి చెప్పెను. ఆ విగ్రహ ములలో వెదుకగా యాదవపుర ఆలయములోని విగ్రహము కనిపించలేదు. రామానుజులు విచారగ్రస్తులై ఉండగా ఆ రాత్రి ఆయన స్వప్నములో ఆ విగ్రహము కనిపించి, సుల్తాను కుమార్తె అంతఃపురములో హంస తూలికా తల్పమున నున్నానని తెలిపెను.

వెంటనే రామానుజులు ఔరంగజేబు వద్దకు వెళ్ళి ఈ విషయము వినిపింపగా సుల్తాను తన కుమార్తెను పిలిచి విగ్రహము మనకు వద్దు వారికి ఇచ్చి వేయుమని చెప్పెను. కాని సుల్తాను కుమార్తె విగ్రహము ఇచ్చుటకు సమ్మతించలేదు. ఈ సంగతి రామానుజులుకు చెప్పగా ఆయన పరమభక్తితో ఈశ్వరుని ప్రార్థించెను. వెంటనే విగ్రహము ఐదు ఏండ్ల బాలుని రూపములో రామానుజునికి కన్పించెను. రామానుజులు ఆ బాలుని "సంపత్కుమారుడు" అని పేరు పెట్టి తనతో తీసుకొని పోయిరి. ఈ విషయము బీబీ నాంచారి తెలిసికొని విరహ బాధ పొందెను. ఈ సంగతి సుల్తాను తెలిసికొనెను. ఆ రాత్రి సుల్తానుకు శ్రీమన్నారాయణుడు కలలో కన్పించి 'నేను నారాయణుడను. నీవు క్షీర సముద్రుడువు. నీ పుత్రిక శ్రీ మహాలక్ష్మి మా యిరువురికి వివాహము చేయుము' అని చెప్పెను. సుల్తాను సంతసించి రామానుజులను రప్పించి వారితో కూడా తన కుమార్తెను తీసికొని వెళ్ళి శ్రీ వేంకటేశ్వరునిచ్చి కళ్యాణము గావించెను. వెంటనే పెండ్లి కుమార్తె శిలగా మారిపోయినది. రామానుజులు ఆమెను స్వామి సన్నిధిని ప్రతిష్ఠ చేసి "బీబీ నాంచారి" అనియు "యదుగిరి లక్ష్మి" అనియు పేర్లు పెట్టెను.

ద్వారకా తిరుమల మహాత్మ్యము గురించి ఇంకొక ఇతిహాసము కలదు.

తిరుమలగిరి అనుచోట మాధవుడు అను ఒక బ్రాహ్మణుడు ఉండెడివాడు. అతనికి కాళ్ళు లేవు. చేతులు కూడా లేవు. వికృత రూపి. చూచువారలకు అసహ్యము కలిగించు శరీరము కలిగి యున్నాడు.

ద్వారకా తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుని గురించి విని ఆ దేవుని దర్శించాలని ఎంతో కుతూహల పడుచుండెను. ఇరుగు పొరుగువారు ద్వారకకు పోవు చున్నారని తెలిసికొని, మాధవుడు తనను ద్వారకకు తీసికొని పొమ్మని బ్రతిమాలెను. వారు అందులకు అంగీకరించి అతనిని ఒక బండి మీద పడిపోకుండా తాళ్ళతో కట్టిరి. మార్గమధ్యమున అడవి మార్గమున బండ్లు వచ్చు సరికి పెద్ద పులులు, చిరుత పులుల అరుపులు వినవచ్చినవి. మాధవుడు ఉన్నబండి ఎడ్లు భయపడి తాళ్ళు త్రెంపుకొని పారిపోయినవి. బండి బోర్లాపడినది. మాధవుని ఆర్తనాదము విని మిగిలిన బండ్ల వారు వచ్చి అతని గాయములకు చికిత్స చేసిరి. యాత్రికులందరూ ద్వారకా తిరుమలకు సాయంత్ర మగు సరికి చేరిరి. వేంకటేశ్వరుని గూర్చి మాధవుడు నీ

ధర్శనమునకు రాగలిగితిని అని ఉద్రేకపడి ప్రాణములు విడిచెను. పవిత్ర క్షేత్రములో పరమేశ్వరుని ప్రార్థించుచూ ప్రాణములు విడిచిన మాధవుడు కొంత కాలము స్వర్గమున నుండి తరువాత ఆంధ్రదేశాధీశుడైన ప్రతాప సింహమహారాజుకు కుమారుడై జన్మించెను.

అతడు హేలాపురము రాజధానిగా, విక్రమ సింహుడను పేరుతో రాజ్యము పాలించుచుండెను.

ఒకరోజు ఆ రాజువద్దకు ఒక స్త్రీ రోదించుచూ వచ్చెను. తన భర్తను ఒక రాక్షసుడు ఎత్తుకొని పోయెననియు, రక్షింపమనియు రాజుని వేడుకొనెను. విక్రమ సింహుడు సేనాసమేతుడై, అడవిలో ఒకచోటరాక్షసుడు ఆమె భర్తను బాధించుచుండగా చూచి తన దివ్యాస్త్రముచే రాక్షసుని చంపి, అతనిని విడిపించి ఆ యువతికి అప్పగించెను. తిరిగివచ్చునపుడు దారిలో ఒక పెద్దపులి నోటిలో ఒక పిల్లవానిని చూచి రాజు పులిని వెంబడించగా అది పిల్లవానిని నోట కరచుకొని ద్వారకాతిరుమల వద్ద మహారణ్యములో పడవైచి మాయమయ్యెను. బాలుని వెదుకుచూ, విక్రమసింహుడు అడవిలో తిరుగుచుండగా అతనికి ఒక దేవాలయము కనిపించగా, విక్రమ సింహుడు దేవాలయమునకు పోయిచూచిన శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమయ్యెను. వెంటనే అతనికి పూర్వజన్మ జ్ఞాపకము కలిగి తను మాధవునిగా ద్వారకకు చేరుట గుర్తు వచ్చినది. గతజన్మలో సాధ్యం కానిది ఈ జన్మలో జరుగుట తెలిసికొని, స్వామిని పలు విధముల ప్రార్థించెను.

వేంకటేశ్వరుడు అతని భక్తికి మెచ్చి వరము కోరుకొమ్మనగా పెద్దపులినోటిలో శిశువును రక్షించి కాపాడమని వేంకటేశ్వరుని విక్రమసింహుడు కోరెను. అంత వేంకటేశ్వరుడు "నీవు ద్వారకా తిరుమలకు వచ్చుటకు, నేను పన్నిన మాయయే ఇది" అని చెప్పి అంతర్ధాన మయ్యెను. శ్రీ వేంకటేశ్వరునకు విక్రమ సింహుడు గోపురము, మండపము కట్టించి, నిత్యోత్సవ ములు, ఏర్పాటు చేసెను.

ఈ క్షేత్రమును గురించి మరికొన్ని స్థల పురాణ ములు కూడ ఉన్నవి.

బ్రహ్మాది దేవతలు పూర్వము ఒకప్పుడు శ్రీ మన్నారాయణుని సందర్శించి, మానవులను పాప విముక్తులుగా చేయమని ప్రార్థించిరి. వారి ప్రార్థనలను ఆ దేవుడు విని ఇట్లనెను.

ఆదిశేషుడు, ఒక సమయమున నన్ను తనపైన సదా నివసించి ఉండవలెనని కోరుకొనెను. అతడు పర్వత రూపముననున్నాడు. అచ్చటనే నా భక్తుడు ద్వారకుడు కూడా నాకొరకై తపస్సు చేయుచున్నాడు. అతనికి ముక్తి నిచ్చుటకు భూలోకమున అవతరించెదను. మీ కోర్కెలు ఆనాడు నెరవేరును. ద్వారకా తిరుమలలో నేను వేంకటేశ్వరుడనై అవతరించెదను' అని చెప్పెను. కొంతకాలమునకు ద్వారకుడు ఆ కొండపై ఘోరతపస్సు చేయగా శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మన "నీ పాదపద్మములు నిరంతరము సేవించుభాగ్యము నాకుదయచేయుము" అని ద్వారకుడు కోరుకొనెను. భక్తుని కోరిక మన్నించి శ్రీ వేంకటేశ్వరుడు తన పాదముల నతనికొసగెను. స్వామి పాదములు ఈనాటికిని కని పించవు.

అజమహారాజు స్వయంవరములో ఇందుమతిని పెళ్ళి చేసికొని తన రాజధానికి తిరిగి వచ్చుచుండెను. స్వయంవరములో అపజయము పొందిన రాజులు అజమహారాజుతో పోరాటమునకుసిద్ధపడిరి. అజమహారాజు తన గురువైన వశిష్ఠుని ప్రార్థింప, ఆయన ప్రత్యక్షమై, ఆ సమీపముననే యున్న అరణ్యమున గల శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించకయే పోవుచున్నందున ఈ యుద్ధవిపత్తు సంభవించినదని చెప్పిన పిదప మహారాజు వెంటనే శ్రీ వేంకటేశ్వరుని దర్శించి, పూజించి, పిదప యుద్ధము చేసి, విజయుడయ్యెను.

రఘుమహారాజు, దశరథమహారాజు కూడా యీ వేంకటేశ్వరస్వామిని సేవించిరి.

సుమారు 500 సం॥లకు పూర్వము ఒక మహా పురుషుడు తన తపస్సులో శ్రీ వేంకటేశ్వరుడిచ్చట ఉన్నట్లు తెలిసికొని ద్వారకా తిరుమలకు కొలది దూరములో నున్న గొల్లగూడెంలో ఆ గొల్లవారు మట్టితో ఒక చిన్న ఆలయంను స్వామికి కట్టించిరట. ఆ ప్రాంతమంతయు ఆకాలములో మహారణ్యముగా నుండెడిది.

కొంతకాలమునకు శ్రీ ధర్మ అప్పారావు వేటకై అచటకువచ్చి అచ్చటనున్నవారిచే శ్రీ వేంకటేశ్వరుని వృత్తాంతమును విని, ఆలయము కట్టించెను. తరువాత శ్రీ పెరంబుదూరు నుండి వైష్ణవులను రప్పించి ఆలయములో ఆళ్వారులను కూడా ప్రతిష్ఠించిరట.

కొంతకాలము క్రిందటివరకు యీ ఆలయ ములోనికి రాత్రులందు మానవులు వెళ్ళుటకు వీలు లేక ఉండెడిదనియు రాత్రులందు స్వామిని దేవతలే స్వయముగ పూజించెడివారనియు ప్రతీతి. అందుచే ఆలయములో రాత్రులు, ఇటీవల, సుమారు ఏబది సంవత్సరముల వరకు ఏ కార్యక్రమము జరుగుచుండె డిది కాదని తెలియుచున్నది.

భక్తులు మొక్కుబడులు చెల్లించుట మరచి పోయినచో యీ స్వామియూ సహించడు. తనకు రావలసిన సొమ్మును వడ్డీతో సహా వసూలు చేయ గలడు. గ్రామీణ భక్తులు కొందరు, శ్రీ వేంకటేశ్వరు నకు చెప్పులు కుట్టించి తెచ్చి కానుకగా ఇచ్చు ఆచారముడెండిది.

## పట్టిసాచల క్షేత్రము

పవిత్ర గోదావరీనదీ మధ్యమున పవిత్ర పట్టిసాచల క్షేత్రమున్నది. పోలవరమునకు రెండు మైళ్ళదూరము, రాజమహేంద్రవరమునకు సుమారు పదిహేను మైళ్ళు. భారతదేశములోని పంచ కాశీ క్షేత్రములలో ఇది ఒకటి.

పూర్వము రాజమహేంద్రవరమునకు పంచగిరి దుర్గమని పేరు. ఆ పంచదుర్గములలో ఇది ఒకటి. భద్రగిరి వీరభద్రేశ్వరుని కొండ.

పట్టిసమునకు సుమారు నాలుగు మైళ్ళ దూరమున మహేశ్వరుని వాహనమగు నందీశ్వరుడి చ్చట నున్నాడు.

శివ కేశవుల ఆలయములు రెండునూ పట్టిసములో ఉన్నందున ఇది శైవ క్షేత్రము. వైష్ణవ క్షేత్రము కూడా స్కాంద పురాణములో యిది కైలాసము, వైకుంఠము అని కీర్తింపబడినది.

పాపికొండల సమీపమున ప్రకృతి సౌందర్య ముతో పట్టిసాచలమున్నది. దేవకూటాద్రి, దైవకూట పర్వతము, దేవకూట శిఖరము, నీలాద్రి, నీలా చలము, వీరభద్రశిఖరి, పట్టసాది అని కూడా యీ పర్వతము నకు నామాంతరములు.

కరవీరుని పుత్రుడు దేవకూటుడు ఒకానొక పుడు ఈ పర్వత ప్రభువు. కైలాసములో జరుగు పర్వతముల మహాసభకు ఆయన వెళ్ళెను. కైలాస నాథుడు ఆయనను సత్కరించలేదు. దేవకూటుడు కోపించి తపస్సు చేయుటకై అరణ్యమునకు వెడలెను. ఘోరతపస్సు చెసెను. శివుడు ప్రత్యక్షమై వరము కోరు కొనమన నా పర్వతము మీదనే నీవు సదా నివశించు చుండ వలెను – అని దేవకూటుడు కోరగా శివుడా వరమును ప్రసాదించెను. ఆనాటి నుంచి ఇది దేవ కూటాద్రి అయ్యెను. నీలుడు ఈ పర్వతముపై తపస్సు చేసెను. కావున ఈ కొండకు నీలాద్రి, నీలాచలము అను పేరు వచ్చినది. వీరభద్రేశ్వరుని ఆలయమున్నం దున వీరభద్ర శిఖరి అయినది.

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణంలో పట్టి సమును పేర్కొన్నాడు. "అదె పట్టిసస్థాన మందుండు వీరభద్రస్వామి యర్ధేందు మౌళి"యని, గౌతమీ నది త్ర్యంబకమువద్ద జన్మించి దండకానన మధ్య భాగమున ప్రవహించి – పట్టిస శ్రీ వీరభద్రేశుని సేవించినదట.

పట్టిసము అనగా యుద్ధములో ఉపయోగించు ఒకానొక ఆయుధ విశేషము. వెడల్పయిన కత్తివలె నుండును. ద్రాక్షారామమున దక్షుని యజ్ఞమును వీర భద్రుడు ధ్వంసము చేసెను. పట్టిసము ధరించి దక్షుని తల నరికెను. గోదావరీమధ్యమున వీరభద్రేశ్వర ఆలయమున్న చోట గౌతమీ ప్రవాహములో పట్టిసమును కడిగెను. కావున ఈ ప్రదేశమునకు పట్టిసమను పేరు వచ్చినది.

"దక్షిణానంద విపిన మధ్యంబునందు క్రతు వి ద్వంసవేళ దేవతల నటికి వీరభద్రేశుడీ యద్రి వెన్ను ద్రన్ని గౌతమీ వారి దరవారిరగడిగినాడు"

[భీమ ఖండము]

యజ్ఞమును ఒకదానినిసంకల్పించి దక్షుడు తన కూతురైన సతీదేవిని, అల్లుడైన పరమశివుని ఆహ్వానిం చ లేదు. కాని, తండ్రి చేయు యాగమునుచూచుటకై సతీదేవి, పరమశివుడు ఎంత వారించినను వినక యాగము చూడ బోయెను. దక్షుడు పరమశివుని అవమానించిన పిదప, ఆ అవమానమును సహించలేక సతీదేవి యాగాగ్నిలో బడి, ఆత్మార్పణ చేసికొనెను. ఈ వార్తవిని శివుడు వీరభద్రుడయ్యెను. పట్టిసము ధరించి దక్షుని శిరముఖండించెను. దక్షునిభార్య ప్రార్థన విని శివుడు దక్షునితిరిగి బ్రతికించెను. దక్షునికి పొట్టేలు తలప్రసాదించెను. దేవకూటునికిచ్చిన వరమున నుసరించి ఆ పర్వతము మీద వీరభద్రుడై వెలసెను.

దేవకూట పర్వతముపై అపుడు మంచి నీరు లేదు. ఆ శూలముతో శివుడు పర్వతమును గ్రుచ్చిన వెంటనే భద్రకాళి ఆవిర్భవించెను. ఆమెతో గూడ గంగ ప్రత్యక్షమయ్యెను.

వీరభద్రుని క్రోధాగ్నికి తాళలేక ముక్కోటి దేవతలు పట్టిసాద్రి పైనున్న భావనారాయణుని శరణు వేడిరి. భావనారాయణుడు చక్రము ప్రయోగించగా వీర భద్రుడది మ్రింగెను. అయినను శాంతునిచేయుట కెవరికీ వశము కాలేదు.

అపుడు, శ్రీ మహావిష్ణువు వీరభద్రునికి సహస్ర ఘటముల జలముతో అభిషేకము చేసి ఆయన పాదములకు సహస్ర కమలములతో పూజ చేసెను. పూజకు సహస్ర కమలములలో ఒకటి తక్కువ అయ్యెను. శ్రీ మహావిష్ణువు తన కుడి కంటిని తీసి శివునకు అర్పించెను. అపుడు పరమశివుడు సంతో షించి సుదర్శన చక్రము ఆయనకు తిరిగి ఇచ్చెను.

అగస్త్యమహాముని ఏతెంచి 'ఈశ్వరా! నీవు లింగ రూపుడవై ఈ పర్వతములోనే యుండుమని వేడెను. ఈశ్వరుడు మహర్షికోరికను మన్నించెను. ఆనందంతో అగస్త్యుడు శివలింగమును ఆలింగనము చేసికొనెను. [ఇప్పటికిని వీరభద్రేశుని మీద ఆ గుర్తులు కనబడును.]

పట్టిసాచలములో వీరభద్రుడు, భద్రకాళియే కాక శ్రీ భావనారాయణస్వామి, శ్రీ సీతారాములు ఆలయములు కూడా ఉన్నవి. మన్యం మహాలక్ష్మి జమీందారిణి చేత శ్రీ సీతారామాలయ నిర్మాణము పూర్తి చేయబడినట్లు శాసనము కలదు.

రామాయణ కాలమున సహితము పట్టి సాచలము ప్రసిద్ధి అయి ఉన్నట్లు పురాణములు తెలుపుచున్నవి.

జాంబవంతుడు ఈ పర్వతముపై చాలాకాలము తపస్సు చేసెను. ఆయన ప్రార్థనను అంగీకరించి శ్రీ మహావిష్ణువు ఈ పర్వతము మీద భూ, నీలా సమేతుడై వెలసెను. భావనారాయణ స్వామి పాదములవద్ద జాంబవంతుడు ఇప్పుడు కూడా పట్టిసాచలమున

ఉన్నాడు. రామభక్తుడు జాంబవంతుడే భావనారాయ ణుని ఇచ్చట ప్రతిష్ఠించెను.

వీరభద్రేశునికంటే భావనారాయణుడు పూర్వుడు.

ఆంధ్రదేశమున అయిదు క్షేత్రములలో భావ నారాయణ స్వామి ఆలయములున్నవి. అవి పొన్నూరు, బావట్ల, భావదేవరపల్లి, సర్పవరం, పట్టిసము. ఈ పట్టిసాచలము పంచకాశీక్షేత్రములలో ఒకటి. శ్రీశైలము, వారణాశి, కేదారము, కాళహస్తి మిగిలిన నాలుగు క్షేత్రములు.

శ్రీరాముడు, పరశురాముడు, ఎందరో మహ ర్షులు యీ క్షేత్రమును సందర్శించిరి. ప్రహ్లాదుడు భావ నారాయణుని పూజించి, వీరభద్రుని స్తుతించెను. గజేంద్రుడు ముక్తి పొందినది యీ క్షేత్రమున నేయని పురాణములు తెలుపుచున్నవి.

"అనిస్త్రే, పనిస్త్రే" అను ఇద్దరు దేవతలు కూడా యీ కొండపై ఉన్నవి. పిల్లలు లేనివారు యీ దేవతలను దర్శించి సంతానవంతులైరట.

బెండివూడి అన్నయమంత్రి వీరభద్రేశ్వర ఆలయమును కట్టించెను.

ఒకప్పుడు, భద్రాచలములో శ్రీ సీతారామాల యములు దోచుకొనుటకు ఇబ్రహీంఖాన్ దండ యాత్రచేసెను. అపుడు భక్తులుకొందరు సీతారాముల విగ్రహములను భద్రాచలము నుండి తీసికొని వచ్చి పట్టిసమునందుంచిరట! కొంత కాలమునకు విగ్రహ ములు తిరిగి భద్రాచలము తీసికొని వెళ్ళిరి.

వీరభద్రేశ్వరునకు అరవై ఎకరముల పల్లపు భూమి, ఏభై ఎకరముల మెరక భూమి భావనారాయణు నకు అరవై అయిదు ఎకరముల భూమి సీతారామ స్వామికి ముప్పై అయిదు ఎకరముల భూవలి కలదు.

రాజమహేంద్రవరమునగల ఒకశిలాశాసనములో (శ.సం. 1071లో) ప్రెగ్గడసోమన పట్టిసమున వీరభద్ర మహాదేవరకు నకండ దీపమునకు దానమిచ్చినట్లు న్నది. ఈ శాసనములో పంచారామములు కూడ వివరింపబడి యున్నవి.

## మల్లేశ్వరము

పశ్చిమగోదావరి జిల్లా తణుకుకు దాదాపు పన్నెండు కి.మీ. దూరములో వశిష్ఠ గోదావరి తీరమున మల్లేశ్వరమున్నది. ఇచ్చట కపిల మల్లేశ్వర స్వామి ఆలయము కలదు.

శ్రీకపిల మల్లేశ్వరస్వామి వారి ప్రతిష్ఠ బహు పురాతనమైనది. పూర్వము ఈ ప్రదేశము మహారణ్య ముగా ఉండెడిది. పశువులను మేతకు తోలుకొని వచ్చెడివారచటకు. అనవేమారెడ్డి అను ఒక రెడ్డిరాజు ఆవులు కూడా ప్రతిరోజూ ఈ అరణ్యమునకు మేతకు వచ్చెడివి. ఆ ఆవుల మందలో ఒక కపిల ఆవు నిత్యము పాలు ఇచ్చుట మానెను. ఎవరో పాలు పిండినట్లుగా ఆవు కనిపించుచుండెడిది. అనవేమారెడ్డి మందలించగా దీనికి కారణము తెలిసికొనుటకు ఒక రోజు పశుల కాపరి ఆ కపిల గోవును వెంబడించెను. ఆవు ఒక పొదలో వున్న పుట్టను సమీపించి ఆ పుట్టపై నిలుండినది. కొంతసేపటికి మందలో కలసి పోయినది. పుట్టపై నుండి లేచి వచ్చునప్పటికి దాని పొదుగు పాలు పితికినట్లుగా కనపడినది. పశుల కాపరి ఈ సంగతి వేమారెడ్డికి విన్నవించెను. ఆయన పరి వారముతో పుట్ట దగ్గరకు వచ్చి, పుట్టను త్రవ్వించి నాడు. ఒక కలుగు కన్నముతప్ప ఏమియు కనిపించ లేదు మరి కొంత త్రవ్వగా గునపము చివర మెత్తగా గ్రుచ్చుకొనినట్లు తోచినది. గడ్డపలుగు బయటకు తీసి చూడగా, పలుగు మొన రక్తముతో నున్నది. పనివారు మూర్ఛపోయినారు. ఈ విషయము చూచు చున్న పెద్దలు అపరాధము మన్నింపుమని భగవంతుని

ప్రార్థించిరి. ఏ ఆపద వచ్చునో యని భయపడిరి. నెమ్మదిగా మట్టి తొలగించి చూడగా మహాలింగము కనిపించినది. పైభాగమున గునపపు దెబ్బలకు గాయ పడి రక్తము కనిపించింది. పుట్టలో నుండి కపిల గోవు పాలు ఆరగించిన ఈ స్వామికి కపిల మల్లేశ్వర స్వామి అని పేరు పెట్టిరి. ఆలయము కట్టించిరి. నేటికి స్వామి తగిలిన దెబ్బ కనిపించును. ఈ స్వామికి నేడున్న భూవసతి అనవేమారెడ్డి కల్పించినట్లు ఇక్కడ దొరికిన శాసనముల వలన తెలియుచున్నది.

మహాశివరాత్రికి, ఈ స్వామి కళ్యాణ మహోత్స వము జరుగును. గోదావరి పొంగినపుడు శ్రీ స్వామి వారి గర్భాలయములో పాతాళగంగ పైకి వచ్చునట్లు నీరు వచ్చును. గోదావరి ఎక్కువ వచ్చినచో ఈ స్వామి సుమారు తొమ్మిది అడుగుల లోతు నీటిలో ఉండును. ఆ సమయమున అర్చన నైవేద్యములు బయటి నుండి జరుపుదురు. గోదావరి తగ్గినంతనే ఆయలములో నీరు ఏమియూ తోడ నవసరము లేకుండానే గర్భాలయములో శ్రీ స్వామి సన్నిధినే, అంతరించిపోవును.

ఈ దేవస్థానమున ఒక విచిత్ర పూజా పద్ధతి యున్నది. భక్తులు పరిసర గ్రామముల నుండి వర్ష కాలములో పుష్పములు విసిరి స్వామిని సేవించెదరు. శ్రీ స్వామ వారికి నల్భై అయిదు ఎకరముల భూవసతి కలదు.

ఉత్సవములు కార్తీక మాసములోను, నవరాత్రు లలోను జరుగును.

గోదావరి గట్టున, గ్రామమునకు వెలుపల, శ్రీ మహాలక్ష్మి అమ్మవారి ఆలయము కలదు. ఇది నిర్మించి సుమారు వంద సంవత్సరములయినది. పది ఎకరముల భూవతి కలదు. ఈ దేవాలయమున ముఖ్యోత్సవము అమ్మవారి జాతర.

## లక్ష్మణేశ్వరము

ఈ క్షేత్రము నరసాపురమునకు ఆరు కి.మీ., దూరములో నున్నది. బస్సు సౌకర్యము కలదు. శ్రీ రాముని సహోదరుడైన లక్ష్మణునిచే ప్రతిష్ఠించబడిన శ్రీ దుర్గా లక్ష్మణేశ్వరస్వామి వారి ఆలయము ఇచ్చట నున్నది. ఈ ఆలయమునకు 102 ఎకరముల భూవతి యున్నది. వశిష్ఠనదికి నాలుగు ఫర్లాంగుల దూరములో ఈ ఆలయము నిర్మింపబడినది. ఇచటికి సముద్రము సుమారు నాలుగు కి.మీ. దూరమున నున్నది. పశ్చిమగోదావరి జిల్లాలో ప్రాచీన క్షేత్రము లలో ఇది ఒకటి. లక్ష్మణుడిచ్చట ఈశ్వర ప్రతిష్ఠ చేసినారు కనుక యీ స్థలమునకు లక్ష్మణేశ్వరము అని పేరు వచ్చినది. ఇచ్చట స్వామి వారికి కొప్పు ఉన్నది. కనుకఆయననుకొప్పులింగేశ్వరుడని కూడా అంటారు. శ్రీ స్వామివారికి రోకలి పోటు, కోడికూత వినబడ కూడదని అందురు. అందుచేత ఈ దేవాలయ సమీపమున ఇళ్ళు లేవు.

త్రేతాయుగములో రావణాసురుని సంహరిం చిన తరువాత బ్రహ్మహత్యాదోష నివృత్తికై కోటిలింగ ములను దేశములో అనేక చోట్ల శ్రీరామ లక్ష్మణులు ప్రతిష్ఠించిరి. ఈ ప్రాంతములో వశిష్ఠానదికి తూర్పున ఈశ్వరుడు ప్రతిష్ఠింపబడెను. రామేశ్వరుడీయన, పడమట తీరమున లక్ష్మణుడు ఇంకొక శివలింగమును, శ్రీరాముని ఆజ్ఞచే ప్రతిష్ఠించెను. లక్ష్మణేశ్వరుడు ఆయన. లక్ష్మణునిచే ప్రతిష్ఠించబడిన శివలింగమిది ఒకటియే. ఈ దేవాలయము గోడపై ఒక శాసనమున్నది. ఈ ఆలయము తిరిగి కట్టబడినది.

## పాలకొల్లు : శ్రీ క్షీరా రామలింగము

కవి సార్వభౌముడు శ్రీనాథుడు రచించిన భీమేశ్వరపురాణమున పంచారామములు ఉత్పత్తి వివరింపబడెను.

శ్రీరామచంద్రునిచే ప్రతిష్ఠింపబడిన లింగము కనుక పాలకొల్లులోని ఈశ్వరలింగము క్షీరా రామ లింగము. తారకాసురుని కంఠముననున్న దివ్య లింగము అయిదు ముక్కలై అయిదు చోట్ల పడెను. అందులో ఒకటి పాలకొల్లులోనిది.

పూర్వము ఈ ప్రాంతములో మఱ్ఱి, రావి, మేడి మొదలగు క్షీర వృక్షములు చాలా ఉండుటచే క్షీరా రామము అని పేరు వచ్చినదని కొందరభిప్రాయ పడుచున్నారు.

మహాభక్తుడు ఉపమన్యుడు యీ ప్రదేశమున క్షీరము పడయుటచే దీనికి పాలకొల్లుయని పేరు వచ్చినదని మరికొందరి ఉద్దేశము. ఆలయములోని పెక్కు శిలాశాసనములలో ఈ స్వామి క్షీరా రామేశ్వరు నిగా వర్ణింపబడినాడు.

ఆలయ ప్రాంగణములో అనేక దేవతల విగ్రహములు కలవు. శ్రీ జగన్నాథస్వామి, పార్వతీ దేవి, విఘ్నేశ్వరుడు, వీరభద్రుడు కుమారస్వామి, కాలభైరవుడు, దత్తాత్రేయుడు మొదలగునవి కలవు.

ఆలయ రాజగోపురము 150 అడుగుల ఎత్తుగా నుండి, శిల్ప కళతో శోభించు చున్నది. శివలీలలు, నృత్య భంగిమలు ఎన్నో విగ్రహములు దీనిపైన నున్నవి. క్రీ.శ. 1415లో (శా.శ : 1337) శ్రీ అల్లాడురెడ్డి భూపాలుడు యీ ఆలయ గోపురము నిర్మించెను. ఆలయములోనున్న శిలా శాసనములను బట్టి పూర్వము ఎందరో రాజులు యీ స్వామికి దానములు ఇచ్చి ఆలయమును అభివృద్ధి చేసిరి. వెలనాటి చోళ రాజు భార్య గుడాంబిక, కోనగణపతి దేవ మహారాజు, చెళ్ళపిన్నమనేని, నరహరినేని, బచ్చు అచ్చమ్మ, సర్వ లోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు వీరిలో ముఖ్యులు. ఈ స్వామికి 85.00 ఎకరముల భూవసతి కలదు.

పాలకొల్లులో ఇంకనూ కొన్ని దేవాలయ ములు కలవు. అవి అష్టభుజ లక్ష్మీనారాయణ స్వామి ఆలయము శ్రీ సీతారామ స్వామి వారి ఆలయము, శ్రీ మామిళ్ళమ్మగుడి చూడదగ్గవి.

## పెనుగొండ

తణుకు రైల్వేస్టేషనుకు సుమారు 15 కి.మీ. దూరమున పెనుగొండఉన్నది. బస్సు సౌకర్యమున్నది. ఇచ్చట వైశ్యులకు ఆరాధ్యదేవత, శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయమున్నది. శ్రీ నగరేశ్వరస్వామి ఆలయము, ఈ ఆలయ ఆవరణలోనే ఉన్నది.

రాజరాజనరేంద్రుని కాలములో ఈ పట్టణం నగరిపెనుకొండ అని పిలువబడెడిది. దేవశిల్పి విశ్వ కర్మయే యీ పట్టణమును నిర్మించెనని పురాణాలు చెప్పుచున్నవి. శ్రీనగరేశ్వర స్వామి దక్షణమున శ్రీ కన్యకా పరమేశ్వరి, ఉత్తరమున శ్రీ పార్వతీదేవి ఉన్నారు.

శంభుశ్రేష్ఠి దేవీభక్తుడు, వైశ్యుడు, తెలివిగల వాడు. మణిదీవిలో ఒకనాడు అతడు దేవిని పూజించు చుండగా ఇంద్రుని సతి శచీ దేవి వచ్చెను. ఆమెను తన కుమార్తెగా జన్మించునట్లు వరమిమ్మని శంభుశ్రేష్ఠి దేవిని ప్రార్థించెను. దేవి అనుగ్రహముతో శచీ దేవి శ్రేష్ఠి కుమార్తెగా జన్మించెను. వాసవి ఆమె పేరు. ఆమె అతి సౌందర్యవతి.

శంభుశ్రేష్ఠి ఒకనాడు తనకుమార్తెతో గోదావరీ నదీ తీరమున జరుగుచున్న యాగము చూచుటకు వెళ్ళెను. మణిపురమును చిత్రకంతుడు అను గంధర్వుడు పాలించుచుండెను. ఆ గంధర్వుడు వాసవిని చూచి ఆమెను తనకిచ్చి వివాహము చేయమని శంభుశ్రేష్ఠిని కోరెను. అందుకు శ్రేష్ఠి అతని బంధువులు అంగీకరించలేదు.

అపుడు చిత్రకంఠుడు కోపించి "మీరందరూ ఈ కన్యతో భూలోకమున జన్మించి అగ్నిలోపడి నశింతురు గాక" అని శపించెను. వైశ్యులు తిరిగిచిత్ర కంఠుని శపించిరి. "నీవును భూలోకమున పుట్టి ఈ కన్యపై వ్యామోహముచేత తలపగిలి చచ్చెదవు" అని.

చిత్రకంఠుడు విష్ణువర్ధనరాజుగా భూమిపై జన్మించెను. అర్జునుని కుమారుడగు అభిమన్యుని మనుమడు జనమేజయుడు. అతని మనుమడు విజయార్కుడు, విష్ణువర్ధనుడు విజయార్కుని కుమారుడు.

విష్ణువర్ధనుడే వైశ్యుల శాపమున పుట్టిన చిత్ర కంఠుడు. చాళుక్య వంశపు మహారాజు.

పెనుగొండ పూర్వము ఒక మహా పట్టణము. ఒకానొకప్పుడు కుసుమశ్రేష్ఠి అను వైశ్యుడు ఆ పట్టణమును పాలించెను.

ఆయన భార్య కుసుమాంబ. చాలా కాలము వరకు వారికి సంతానము కలుగలేదు. గురువగు భాస్కరాచార్యుని సలహాపైన వారు పుత్రకామేష్ఠి యాగము చేసిరి. తరువాత వారికి ఒక బాలుడు బాలికయు కలిగిరి. వారే విరూపాక్షుడు, వాసవి.

విష్ణువర్ధనుడు దేశములను జయించి పెను గొండకు వచ్చెను. పెనుగొండలోని వైశ్యులందరు విష్ణువర్ధనునకు ఘన స్వాగత మొసగిరి. పరమేశ్వరి ఆలయమును దర్శింప రమ్మని విష్ణు వర్ధనుని కుసుమ శ్రేష్ఠి కోరెను. రాజు అంగీకరించి ఆలయమునకు వచ్చెను.

ఈశ్వరసేవకు వచ్చిన వాసవి సౌందర్యమును చూచి రాజు ఆమెను వివాహమాడగోరెను. వాసవి జన్మించినపుడే ఆమెను పరమేశ్వరునికి అర్పించితిమి. ఇంకొకరికియజాలను అని చెప్పెను.

వైశ్యులలో 714 గోత్రముల వారు కలరు. 612 గోత్రముల వారు వాసవిని విష్ణువర్ధనున కిచ్చి వివాహముచేయ సమ్మతించిరి. మిగిలిన వారు వ్యతిరే కించిరి. రాజు పెట్టిన బాధలు భరించలేక కుసుమశ్రేష్ఠి మంటలలో పడి, మరణించదలచెను. 102గోత్రముల వారు వాసవి కన్యతో సహా అగ్నికి ఆహుతి అగుటకు సిద్ధపడిరి. 103 అగ్ని గుండములు సిద్ధము చేసిరి. రాజునకు మాత్రము ఈ విషయము తెలుపక పెండ్లికి సిద్ధముగా రావచ్చును అని కబురంపిరి. కుసుమశ్రేష్ఠి నగరేశ్వర దేవస్థానమునకు చేరెను. ఇతరులును చేరిరి.

వాసవీకన్య ఆజ్ఞచే వైశ్యదంపతులు అగ్ని ప్రవేశము చేసిరి. 102 గోత్రముల వారు వాసవాంబతో మణి ద్వీపమునకు కైలాసమునకు వెళ్ళిరి. విష్ణువర్ధ నుడు పెనుగొండకు వచ్చి, వాసవి మరణ వార్త తెలిసి కొన్న అతనికి పూర్వ జన్మ స్మృతి కలిగెను. తల పగిలి మరణించెను.

తర్వాత వైశ్యులు కాశికి పోయి అచటి నుండి 101 శివలింగములు తెచ్చి ప్రతిష్ఠించిరి. భూమిని త్రవ్వుతుండగా అనేక శివలింగములు ఈ పట్టణములో దొరికినవి. శ్రీనగరేశ్వరాలయము ఎదుట ఇటీవల రాజగోపురము నిర్మింపబడినది. ఇది గంభీరముగా నున్నది. అతి సుందరమైనది. మహాశివ రాత్రికి ఉత్సవము వైభవముగా జరుగును. శ్రీ నగరేశ్వరుని లలాటమున ఉంచు గంధాలంకరణము మరునాటి వరకు తడిగానే ఉండును. ఇది ఇక్కడి విశేషము. ఈ దేవాలయమునకు భూవసతి కలదు. వసతి సౌకర్యము కలదు.



# కృష్ణా జిల్లా

## శ్రీ కనకదుర్గా క్షేత్రము, విజయవాడ

ధర్మ,కర్మ క్షేత్రమగుట వలన మన భారతావని పరమ పవిత్ర పుణ్యభూమి. ఇందనేక పుణ్య క్షేత్ర ములు, పవిత్ర తీర్థరాజములు విరాజిల్లు చుండుటచే, ఎన్నో జీవరాసులకు ఆహ్లాదము, శరీర శుద్ధి, నైతికోన్నతి సమకూర్చుచు, ప్రఖ్యాతి గాంచినది మన పుణ్య భూమి-భరత భూమి? ఇందు దక్షిణ భారతావని ఎన్నో దేవాల యములతో సర్వాంగ శోభిత శిల్పకళా విన్యాస ములతో, సుందర బృందావన ములతో విలసిల్లుచున్నది. మనదేశము నగల అష్ట దేవతా మూర్తుల ఆలయములలో, శ్రీ కనక దుర్గాదేవి ఆలయమొకటి.

విజయవాడ తలపునకు వచ్చిన వెంటనే భారతీయులెవరికైనను శ్రీ కనకదుర్గాదేవి, పవిత్ర కృష్ణా నది స్ఫురణకు వచ్చును. తీర్థ యాత్రలం దాసక్తి కలవారు, వినోదపర్యాటకులు, ఈ పట్టణ మును సందర్శించి, శ్రీ కనకదుర్గను దర్శించి, అపరిమిత ఆనందము నొందుచున్నారు. కనుక స్కాంద, బ్రహ్మాండ, పద్మ పురాణాంతర్గతమైన కథనుసరించి శ్రీ కనకదుర్గాదేవి మహాత్మ్యమును తెలిసికొనుట అత్యావశ్యకమై యున్నది.

ఈ క్షేత్ర పురాణ ప్రశస్తి, చారిత్రక వైభవము సాటిలేనివి. అత్యంత పుణ్య ప్రదమైనవి.

శ్రీ కనకదుర్గాదేవి ఇచ్చట తృతీయ కల్పమున, స్వయం వ్యక్తమైనట్లు కాళికా పురాణము, దుర్గా సప్తశతి మొదలగు ప్రామాణిక గ్రంథముల నాధారముగ నిరూపణ జరిగినది. పవిత్ర కృష్ణా నదీ జననము పద్మపురాణము ఆధారముగా ఇప్పటికి సుమారు నాలుగు లక్షల ముప్పైవేల సంవత్సరములు అయినట్లు సోదాహరణముగ వివరించిరి. ఎన్నో పౌరాణిక సంబంధమైన గాధలు వ్యక్తము చేసిరి. ఈ నది ప్రవహించిన ఇరు పార్శ్వములలోగల అర్హవై తీర్థ రాజములను పేర్కొని, వర్తమాన ప్రాంతములను స్థిరీకరించిరి. అంతేకాక శ్రీ దుర్గాక్షేత్ర మహాత్మ్యము దాని పుణ్య విశేషమును, పవిత్రతను, ప్రాశస్త్యమును స్పష్టము చేసిరి. ఈ దుర్గాలయ ప్రాంగణములో గల ఆలయ సముదాయమునకు, వెనుకగల దుర్గాంబ కుండమహాత్మ్యమును, శాస నములు ఆధారముగ ఈ క్షేత్ర ప్రాచీనతను, దుర్గాదేవి ప్రాశస్త్యమును, ఇచ్చట కల శాసనపాఠముల ననుసరించి, వివరించి మనకెరుక పరచుట గొప్ప విశేషమై యున్నది.

ఇచ్చటి కనక దుర్గ, జగన్మోహనముగ, ప్రేమానురాగ భావ గాంభీర్య రూపమున వెలసిన స్వయంభువమూర్తి. ఈమె జగన్మాత, శ్రీ మహారాజ్ఞి అనునటుల అత్యద్భుతముగ వెలుగొందుచు,చూపరు లకు భయము, భక్తి, ప్రేమ కలుగునట్లు, భక్త జనుల కోర్కెలనీడేర్చుచు, కన్నతల్లివలె సాకు పరమ కరుణా మూర్తి శ్రీ కనకదుర్గ మహాదేవి. ఈ మహాతల్లిని పూజించి ఎందరో తరించారు. ఇంద్రకీలుడు, అగస్త్య మహాముని, పరశురాముడు, శ్రీరామచంద్రుడు, భరద్వాజుడు, కృష్ణభగవానుడు, పంచపాండవులు, ఆదిశంకరులు, శ్రీకృష్ణదేవరాయలు గోల్కొండ ప్రభువులు, అక్కన్నమాదన్నలు, మరెందరో ఈమెను పూజించి, సేవించి ధన్యులైనారు. ఈమె ఇక్కడ నిలచుటకు ఇంద్రకీలుడను శాక్తేయ మహా భక్తుడు కారణము.

ఇంద్రకీలుడు అమ్మవారిని గూర్చి తపమాచ రింప, అతని తపస్సుకు మెచ్చి శ్రీ అమ్మవారు ప్రత్య క్షమై ఏమి వరము కావలయునో కోరుకొమ్మనగా అతడు, ఈ జగజ్జననిని అనేక విధముల స్తుతించి, "నీవు నా గర్భమున వసింపుము-నదుర్గాంబ"నాయనా! నీవు శైల రూపమును పొందుము. సమయమరసి నీ గర్భమున వసింతును. ఈ పర్వతము నీ పేరుతో పవిత్రమై విలసిల్లగలదు. నేనిచట నుండి సర్వజగము లను రక్షింతునని" వరమిచ్చి అంతర్ధానమయ్యెను. తదుపరి, ఇంద్రకీలుడు శైల రూపమునంది, ఆ తల్లి రాకకై ఎదురు చూచుచుండ మహిషాసుర వధానంత రము శ్రీకనకదుర్గమహాదేవి ఇందు వసించెను. ఇదియే ఇంద్రకీలాద్రి. ఇది నృసింహ క్షేత్రమైన మంగళగిరి వరకు వ్యాపించి దర్శన మాత్రమున, పునీతులను చేయు దివ్య పర్వతము.

శ్రీ దుర్గాదేవి ఇచ్చట ఎప్పుడు ఆవిర్భవించి నది తెలియకున్నను, శ్రీ కాళికా పురాణము, దుర్గా సప్తశతి మొ॥ వాటి వలన తృతీయ కల్ప ప్రారంభ మున ఆమె స్వయం వ్యక్తమైనట్లు తెలియుచున్నది.

యుగ యుగములుగా శ్రీకనకదుర్గమ్మ బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, శ్రీరామచంద్ర, శ్రీ కృష్ణాది సర్వదేవతల చేతను ఆగస్త్య, వశిష్ఠ, గౌతమ, విశ్వామిత్ర, ఆదిశంకరాది మహాత్ముల చేతను ఆరా ధింపబడి, నేటి వరకు తన్నారాధించు వారలకు ఇష్టార్థముల నిచ్చు కరుణామయి శ్రీ కనకదుర్గమ్మ. ఈ సందర్భమున శ్రీ కృష్ణవేణి నదీ మహాత్మ్యము తెలిసికొనుట అవసరమగును.

శ్లో॥ గోదావరీ, భీమరదీ కృష్ణ వేణ్యాదికస్తదా
సహ్య పాదోద్భవానద్యః స్మృతాః
పాపభయావహాః।

ఈ విధముగా విష్ణు పురాణమునందు సహ్యా ద్రియందు పుట్టిన నదులను శ్రీ వ్యాసభగవానుడు వర్ణించెను.

ప్రపంచమందలి మహానదులన్నియు బ్రహ్మచే సృజింపబడి, విశ్వజీవ కళ్యాణార్థమై భూమి యందు ప్రవహించుచు, సర్వపాపములను, తాపములను పోగొ ట్టుచు, సర్వజీవులకు స్నాన,పానములచే శాంతి, సౌఖ్యములను, ఆనందమును గూర్చుచు, సర్వసస్యాభి వృద్ధికి కారణములై ఉన్నవి. అందువలన కొన్ని మహా నదులు కొన్ని కొన్ని మహాకార్యములచే మనలను తరింప జేయుచున్నవి.

శ్లో॥ రేవతీ రేతపః కుర్యాస్మరణం జాహ్నవీతటే।
దానందద్యాత్కురుక్షేత్ర గౌతమ్యాంత్రి
విధోపిచ॥

అనగా నర్మదానదియందు తపము వలనను,గంగానది యందు మరణము వలనను, కురుక్షేత్రమున దానము వలనను, గోదావరి యందు తప, దాన మరణముల

వలనను తరింతురు. కావున దర్శన,స్పర్శన, కీర్తనాదుల మాత్రముననే తరింపజేయు నదులు ఉత్తర భారతాన గంగా, దక్షణ భారతమున కృష్ణవేణీ నదులు మాత్రమేనని పెద్దలు చెప్పు చున్నారు.

ఈ రెంటిలోనొక విశేషమున్నది. గంగా నది ఇతరుల పాపములను పోగొట్టునే కానీ తన పాపము లను పోగొట్టుకొనే శక్తి లేదు. కాని కృష్ణవేణి నది ఇతరుల పాపములను నశింపజేయుటయే కాక, తన పాపములను సైతము బాపుకొను సామర్థ్యము కలది. అందువలన కృష్ణవేణినది మహాపవిత్రమైనదని చెప్ప వచ్చును.

ఇందులకుదాహరణముగనొక ఇతిహాసము కలదు. ఒకప్పుడు గంగా తీరముననొక బ్రాహ్మణి రాత్రులయందు పరపురుషుల గూడి ఉదయమున గంగా స్నానము చేయుచుండెను. అద్దాని ఫలితమున గంగానది తన పాపమును పోగొట్టుకొనజాలక వ్యభిచార దోష పాపమువలన వాయస (కాకి) రూపమునంది తన పాపక్షయార్థము ప్రతిదినము కృష్ణవేణినది నందు స్నానము చేసి, పరిశుద్ధురాలై హంసరూపమున తిరిగి స్వస్థానము చేరుచుండెడది. "కృష్ణమహాత్మ్యము" అనునీ కథనముచే కృష్ణవేణి నది అతి ప్రాచీనమైనదనియు, మహా పవిత్రమైనదనియు, మరియు మహా నదులన్నిటి మిన్నగా శ్రీ మహా విష్ణువు శరీరాంశవతార మై యుత్పన్న మైన దనియు,పెద్దలుచెప్పుచున్నారు.

ఈ కృష్ణవేణి నది ఉద్భవించినది పరిశీలింపగ 9,81,980 సంIIలైనట్లు పద్మ పురాణములో ఉత్తర ఖండములో, నూట పదమూడవ అధ్యాయములో నున్నది.

నారద మహాముని వలన, పృథు చక్రవర్తి కృష్ణ వేణీ నది ప్రాదుర్భావమును తెలిసికొనెను. "చాక్షుష మన్వంతర ప్రారంభకాలమున" పుట్టినదీ నదీమతల్లి. పకృతము, వైవస్వత మన్వంతరము జరుగుచున్నందు న ఈ కాలము సౌర సంవత్సరములోనికి గణన చేయగా ఈ విషయము స్పష్టమగుచున్నది.

స్కాందపురాణ, సహ్యాద్రి ఖండమున అష్టాద శోధ్యాయమున, కృష్ణామహాత్మ్యమును గూర్చి నారద మహర్షి వలన ఋష్యాదులు తెలిసికొనినట్లు కలదు.

"స్నానం, దానం, జపోహోమ, స్వాధ్యాయః పితృతర్పణం యవమాత్రంతు యొకుర్యాదనంతద ఫలమస్నుతే" అని నారద మహర్షి చెప్పినట్లు కలదు. మరియు కొన్ని నదులు తమ శక్తి ప్రభావములను కొంత కాలమునకు కోల్పోవుననియు, ఈ కృష్ణానది హరి హరాత్మకమగుటవలన, అన్ని నదుల వలే కాక, తన ప్రభావమును విడువక పోగా, ఇతర నదుల శక్తిని కూడా తానే గ్రహించి ప్రవర్థమానమగు చుండు ననియు "కృదాకృష్ణే వామ విశిష్యతే" అను పురాణోక్తి వలన తెలియుచున్నది.

ఇట్టి పరమ పవిత్ర కృష్ణానదీ తీరమున ఇరు పార్శ్వములందును, మహా మహిమాన్వితమైన అనేక తీర్థములు, క్షేత్రములు కలవు. ఇందు గోకర్ణము, నరహరి పురము (గాణుగాపురం) శ్రీదత్తాత్రేయ అవతార స్థలము, శ్రీశైలం, ముక్త్యాల, వేదాద్రి, యోగ నరసింహ క్షేత్రం, సాలగ్రామశిల, అమరావతి మరియు ఇంద్ర కీలాద్రిపై నెలకొని యున్న శ్రీ కనకదుర్గ మహా క్షేత్రం, సీతానగరం హనుమంత క్షేత్రం, ఉండవల్లి అనంతపద్మనాభ క్షేత్రం, మంగళగిరి శ్రీ లక్ష్మీనృసింహక్షేత్రం శ్రీరామచంద్రునిచే ప్రతిష్ఠింప బడిన క్షేత్రములు.

ఇట్టి పరమ పవిత్ర కృష్ణానదీ తీరమునగల శ్రీకనకదుర్గ క్షేత్రము బహు పుణ్య ప్రదమైనది.

శక్తితో కూడినప్పుడే శివుడు స్వయం శక్తి

సంపన్నుడై చరాచర జగత్ సృష్టి చేయుట, పెంచుట లయము చేయుటకు సమర్థుడగుచున్నాడు. అటుల కానిచో ఏమియు చేయనేరడు. సత్త్వ, రజః స్తమో గుణ ప్రధానులైన త్రిమూర్తులు సైతము, శ్రీ శక్తి యొక్క కరుణా కటాక్షము పొందినప్పుడే, తమ తమ నిర్దేశ కార్య నిర్వహణాదక్షులగుచున్నారని జగద్గురు వులు ఆది శంకరులు సెలవిచ్చి యున్నారు. సర్వమూ శక్తి మయము, తన ఇచ్ఛానుసారము అనగా ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞాన శక్తితో, సృష్టి, స్థితి, లయము లొనర్చుచు, తనంత తానుగా వెల్గొందుచు, సర్వ దేవతా స్వరూపిణియైన మహాతల్లి శ్రీ కనకదుర్గా మహా దేవి. యుగయుగములుగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, శ్రీ రామచంద్ర, శ్రీ కృష్ణాది సర్వ దేవతల చేతను ఆరాధింపబడి, నేటివరకు తన్నర్చించు వారలకు అభీష్టము లీడేర్చు కరుణా స్వరూపిణి, భక్త చింతా మణి, శ్రీ కనకదుర్గమహాదేవి.

పరమ పవిత్ర కృష్ణవేణీనదీ తీరమున ఇంద్ర కీలాద్రి పర్వత గర్భమున, సర్వదేవతా స్వరూపిణియై వెలసిన పరాశక్తియే శ్రీ కనకదుర్గ మహాదేవి. లోక కంటకుడైన మహిషాసురుని రోష భీషణ రూపముతో మర్ధించి, మహాభక్తుడైన ఇంద్రకీలుని అనుగ్రహించి స్వయం వ్యక్తముగా నావిర్భవించినదీ జగన్మాత శ్రీ కనకదుర్గ.

అగస్త్యాది మహర్షులు, పరశురామ, శ్రీ రామ, శ్రీ కృష్ణాది అవతార పురుషులు, పంచపాండవులే కాక, శ్రీ కృష్ణ దేవరాయలాది మహారాజులు ఈమెను అర్చించి అభీష్ట సిద్ధులు పొంది ధన్యతనొందిరి.

శ్రీ మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి, బాలా త్రిపుర సుందరి, లలితా త్రిపుర సుందరి, రాజ రాజేశ్వరి చిచ్ఛక్తిరూపమైన కుండలినీ మహాశక్తియే శ్రీ కనక దుర్గ మహాదేవి.

లోక కంటకుడైన దుర్గమాసురుని దేవతల ప్రార్థనచే దేవి సంహరించినట్లును అపుడామె తేజస్సు బంగారమువలె వ్యాప్తముకాగా దేవతలందరు ఉపనిషత్తులలో కనకదుర్గాయని స్తుతించినట్లు తెలియుచున్నది. ఈ దుర్గాదేవిని గూర్చి సహ్యాద్రి ఖండములోని వర్ణన కలదు.

నీలాద్రి స్వర్ణమయయంగా, దాని నధిష్ఠించి యుండుటచే నీ దుర్గ కూడా స్వర్ణమయమైనట్లును ఈ ఇంద్రకీలాద్రి స్వర్ణనగమనియు తెలియుచున్నది. ఈమెకు నివాస మగుటచే యీ పట్టణమునకు "కనకపురి "కనకవాడ" అను పేర్లు కలిగినట్లొక శాసనము వలన తెలియుచున్నది. ఇంద్రకీలుడు కోరిన వరమును సఫలము చేయుటకు దేవ, ఋషి, సిద్ధ, గంధర్వాది బృందముల యొక్క ప్రార్థనల నంగీకరించి పరదేవతయైన దుర్గాంబిక మహిషాసురుని సంహరించుటకు ధరించిన రూపముతో యీ ఇంద్రకీల పర్వత హృదయ పీఠమందధివశించెను.

ఇచ్చట వెలసిన మల్లేశ్వరుని గూర్చి స్కాంద పురాణమున చెప్పబడినది.

చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఈశ్వరునకు ప్రీతిగా తపమొనర్చుటయే కాక, శతాశ్వమేథములను చేసినట్లును, అందుకు పరమశివుడు మెచ్చి జ్యోతిర్లింగ రూపమున బ్రహ్మదేవునకు దర్శన మిచ్చి బ్రహ్మ లోకము నొసంగెననియు ఆ విధాత ఈ లింగమునకు మల్లి, కదంబక పుష్పములచే పూజించుట వలన మల్లికేశుడని చెప్పబడుచున్నాడని కలదు. అందువలన ఇక్కడ అనాదిగనే బ్రహ్మచే ప్రతిష్ఠితమగు లింగమున్నట్లును, ఆ దేవుని పేరు మల్లికేశ శివలింగ మేననియు తెలియుచున్నది. ఇది కాల వశమున అంతర్హితమై యున్నది. ఈ విషయమును, శ్రీ శంకర భగవత్పా దుల వారు గ్రహించి అమ్మ వారొంటరిగ ఉండుట ఈ దేశమునకు క్షేమము కాదని నిరూపించి, ఈ అమ్మవారి దేవాలయమునకు ఉత్తర దిశగా శ్రీ మల్లికేశుని ప్రతి ష్ఠించిరి. అప్పుడు

అమ్మవారి ఉత్సవ విగ్రహము తెచ్చి ఇచ్చటనే ప్రతిష్ఠించి, కళ్యాణ మొనర్చి, అప్పటి నుండి ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పౌర్ణమికి ఇక్కడ శ్రీ దుర్గా మల్లేశులకు వసంత కళ్యాణము, పంచాహ్నికా దీక్షలో జరుపబడుచున్నది. ఇదియే అమ్మవారికి బ్రహ్మోత్సవము, వసంత ఋతువున జరిపించుటచే దీనికి వసంత కళ్యాణమని పేరు.అప్పటినుండి కేతుకబేరము తప్ప అమ్మవారి కోవెలలో ఉత్సవ బేరములుంచు యాచా రము లేదు.ఈ మల్లికేశ్వరుడీ క్షేత్రపాలకుడు. ఇచ్చట దేవీ ఆలయము దక్షిణభాగము నందును ఈశ్వరాల యము వామ భాగమునందును ఉండుటచేనిది, శక్తి ప్రధానమైన క్షేత్రమనిచెప్పుదురు.

ద్వాపరయుగమున అర్జునుడు పాశుపతాస్త్రము కొఱకు ఈశ్వరుని గూర్చి తపమొనర్చినట్లును అతని తపః శక్తికి, మెచ్చి ఈశ్వరుడు వరమును ప్రసాదించుటకై కిరాత వేషమున రాగా శివునితో అర్జునుడుపోరి, ఈశ్వరుని మెప్పించి పాశుపతాస్త్రము సంపా దించెను. అంతేకాక, పరమేశ్వరుడు మెచ్చి "నీకు నన్ను పోరున జయించితివి గాన నీవు విజయుడవని నీ విజయ సంకేతముగా నీ నగరము నకు "విజయపురి" అను పేరు వెలయు గాక" అని వరమిచ్చెనని అట్లు అర్జునుడు విజయమును సాధించుటచే "విజయుడ" ను పేరు సార్థక మొనర్చుకొనుటయే కాక, పరమేశ్వ రుని భక్తి వాత్సల్యమునకు కృతజ్ఞతతో అమ్మవారి గుడికి దక్షిణ భాగమున ఇప్పటి ఇంద్రకీలాద్రికి దక్షిణ వైపునవొక శివాలమయును కట్టించి ప్రతిష్ఠించెను. విజయునిచే ప్రతిష్ఠింపబడుట వలన "విజయే శ్వరుడు" అని పేరు పొందెను. మరియు తనకు కనక దుర్గ కరుణా కటాక్షముల వలననే "పాశుపతము" లభ్య మైనదని తలంచి అర్జునుడీ అమ్మవారికి "బ్రహ్మ స్త్రేశ్వరి" అని పేరు పెట్టెను. ఈ ఆలయము జీర్ణో ద్ధరణ గావింప బడినది. ఇచ్చట అమ్మవారి కబిముఖ ముగ శ్రీ ఆంజనేయ ఆలయము కలదు. ఇచ్చట గల కుండ మునందు "వరుణ యంత్రము" కలదనియు, అందు వలన ఈ కుండము ఎప్పుడూ ఎండదనియు తెలియుచున్నది. ఇచ్చట సమీపమున గలవొక గుహలో "తూర్కరాజా" వేయించిన శాసనము కలదు.

పూర్వము నైజాము ప్రభువు వద్దగల మంత్రులు అక్కన్న మాదన్నలు ఇచ్చటకు వచ్చి పూజాదులొ వర్చినట్లు, చారిత్రకాదారములు కలవు.

ఇచ్చట పాండవులు కొంతకాలము తపస్సు చేసిరి. ఇది "ఫల్గుణీ క్షేత్రము" అని కూడ చెప్పబడు చున్నది. ఈ క్షేత్రమహాత్మ్యము స్కాంద పురాణము నందు విపులముగా చెప్పబడినది. దుర్గాదేవి మహాత్మ్యము గూడ కలదు.

ఇంద్రకీలాద్రి శిఖర మధ్య భాగమున సంస్కృత భాషలో వ్రాయించబడిన వొక శాసనమువ్నది. దీనికి "కిరాతార్జున స్తంభ శాసనము" అని అందురు.

త్రిలోకాశ్రయుడు శ్రీ విష్ణువర్ధన మహారాజు వేయించిన శాసనములు, తూర్కరాజా వేయించిన శాసనము శ్రీ కనక దుర్గాంబకు చెందిన శాసనము "సౌత్ ఇండియన్ ఇన్క్రిప్షన్స్" నాల్గవ వాల్యూమ్‌లో (789 నెంబరు) 1892లో ప్రకటింపబడినది. శ్రీ కృష్ణ దేవరాయల వారి శాసనము కూడా కలదు. (మొగలితుర్రు) కేతకి వరపు ప్రభువగు పూసపాటి రాచిరాజా రచించిన తేటగీతి వలనను, సీసమాలిక వలనను వీరు శ్రీకనకదుర్గాదేవి కటాక్షమునకు పాత్రులై, ఎంతో వైభవముగా వర్ధిల్లినట్లు తెలియు చున్నది. వీరు క్రీ.శ. 1668 ప్రాంతములో నున్నట్లు తెలియు చున్నది. అంతే గాక చాగి పోతరాజా గారు, కపిలేశ్వర ప్రభువులైన గజపతి రాజా గారు ఎన్నో దానములు చేసినట్లు (1387) శాసనాధారములు కలవు.

ఇంతేకాక, ఈక్షేత్రమునకు సంబంధించి ఎన్నో

శాసనములు కలవు. ఈ శాసనములను వివరముగా పరిశోధించి ఈ క్షేత్ర చరిత్రను వ్రాయవలసిన అవసరము ఎంతైనా కలదు. శ్రీ సింహాచలమును గూర్చి పరిశోధించిన రీతిలో ఈ క్షేత్ర చరిత్రను కూడ వెంటనే వ్రాయవలసి యున్నది. పండితారాధ్యుల వారి అగ్ని స్థంభన యుదంతము, ఇంకను అనేక ఉదంతములు వెలికి తీయవలసి ఉండును. దాస మహంతి చొక్కాలి పాత్రుని శాసనము పేర్కొనదగినది.

శ్రీ కనకదుర్గమ్మ శాశ్వత అన్నదాన పథకం ఇక్కడ ప్రవేశ పెట్టబడినది. ఈ క్షేత్ర దర్శనమునకు కొండ దిగువ నుండి బస్సు సౌకర్యము కలదు.

బహు ప్రేమ స్వరూపిణి, భక్తజన వరప్రదాయిని శ్రీ కనక దుర్గ మహాదేవిని దర్శించి పూజించి భక్త జనులు తరించెదరు గాక!





# గుంటూరు జిల్లా

త్రిలింగ దేశముగ ప్రసిద్ధి చెందిన మన తెలుగు గడ్డ బహు పుణ్య క్షేత్రములకు నెలవైయున్నది. పవిత్ర నాగావళి, గోదావరి, కృష్ణ, పెన్న మొదలగు పుణ్య నదుల ప్రవాహములచే సస్యశ్యామలమై వెలుగొందు చున్నది.

అమరావతి యందలి అమరేశ్వరాలయము, కేతవరమునందలి శ్రీ లక్ష్మినరసింహస్వామి ఆల యము, సీతానగరమందలి శ్రీ ఆంజనేయస్వామి దేవాలయము, సత్రశాలయందలి శ్రీ మల్లేశ్వరస్వామి వారి దేవాలయము, గుంటూరు జిల్లా యందు పవిత్ర కృష్ణానదీ తీరమున, ప్రసిద్ధిగాంచిన ఈ పుణ్య క్షేత్రములు విరాజిల్లుచున్నవి.

చరిత్రాత్మకముగా, ప్రసిద్ధిచెందిన శ్రీ చెన్న కేశవస్వామి వారి దేవాలయము మాచెర్ల పట్టణమున, చంద్రవంక నదీ తీరమున విరాజిల్లుచున్నది. పల్నాటి ప్రభువులు ఆరాధ్యదైవము శ్రీ చెన్నకేశవస్వామి. రాష్ట్రము నలుమూలలనుండి భక్తులు ఈ స్వామిని దర్శించుచున్నారు.

ఎన్నో యేండ్ల ముందుగానే, అస్పృశ్యతకు వ్యతిరేకముగ, వర్ణ వివక్షత పాటింపక, సహపంక్తి భోజనములు చేపట్టిన ప్రదేశమే ఈ దివ్యస్థలము.

శ్రీ దత్తాత్రేయ స్వామివారు మాచెర్ల తాలూకా యందలి ఎత్తిపోతలయందు వెలసి యున్నారు. ఈ స్వామి బంజారా జాతివారి ఆరాధ్యదైవము. ఇచ్చటి ప్రకృతి శోభ సహజమైన జలపాతముతో, ఆహ్లాద భరితముగా నుండును.

ఈ జిల్లాయందు 1364 దేవాయలములు కలవని తెలియుచున్నది. సుమారు నలభైవేల ఎకర ముల భూవసతి ఈ దేవాలయములకు గలదు.

ప్రతి సంవత్సరము ఈ దేవాలయములకు సుమారు కోటిరూపాయల ఆదాయము వచ్చుచున్న దని తెలియుచున్నది. సుమారు నాలుగువేల అర్చక కుటుంబములవారు శ్రీ స్వాములవారి సేవలో నిమగ్నమై యున్నారు.

గుంటూరు జిల్లా క్రీస్తు పూర్వమునుండి, బౌద్ధ మత ప్రాబల్యమును సంతరించుకొని యున్నది.

అమరావతి, నదికొండ (నాగార్జునసాగర్ ప్రదేశము) బౌద్ధ కేంద్రములుగా విరాజిల్లినవి.

## అమరావతి

అమరావతి దేవాలయమును శ్రీ ఆదిశంకరాచార్యులు దర్శించి శ్రీచక్ర ప్రతిష్ఠ చేసినట్లు చరిత్ర ఆధారము కలదు. క్షేత్ర పాలకునిగా శ్రీ వేణు గోపాల స్వామినిప్రతిష్ఠించి అద్వైత సిద్ధాంతమును ప్రబోధించి, శివకేశవులకు బేధములేదని ప్రవచించిన దివ్య స్థలము ఈ అమరావతి.

శ్రీ అమరేశ్వరస్వామి వెలసిన భాగం అమరావతి. మహదేవ భిక్షువు అశోక ప్రేషితుడు. ఇతని బోధనల ఫలితమే కృష్ణానదీతీరాన ఆనాటి ఆంధ్ర రాజధానీ నగరమైన ధాన్యకటకంలో వెలసిన మహాస్తూపం. కాలక్రమేణా అమరావతీ స్తూపం అయినది. ఈ ప్రదాన స్తూపం బుద్ధదేవుని శారీరక ధాతువు పెట్టికట్టినారట. ఇక్కడ గొప్ప బౌద్ధ విశ్వ విద్యాలయం కూడా ఆనాడు ప్రసిద్ధి గాంచినది.

శ్రీమన్నె సుల్తాన్, రాజావాసిరెడ్డి, వేంకటాద్రి నాయుడు వారి హయాంలో ఈ దేవాలయము పునర్నిర్మాణము కావింపబడినదిని తెలియుచున్నది. వారు స్వామివారికి నిత్య దీప, ధూప నైవేద్యములకు ఇనాములిచ్చి ధన్యులైనారు. ఈ దేవాలయము 1980లో పునరుద్ధరణ గావింపబడినది. అనేక మంది భక్తులకు పర్యాటకులకు ఈ దేవాలయము దర్శనీయమైనందున, ఎంతో ప్రసిద్ధిగాంచుచున్నది.

## మంగళగిరి క్షేత్రము

శ్రీ బ్రహ్మవైవర్త పురాణమునసరించి ఈ క్షేత్ర మహాత్మ్యమును శంకరుడు పార్వతీదేవికి చెప్పినట్లు తెలియుచున్నది. ఈ భాగమునకు "భవానీ శంకరగీతొ" అవి అందురు. మొదట శివాలయములో శ్రీ మల్లేశ్వరస్వామిని దర్శించి పునీతులై, పిదప, పర్వతారోహణము చేయవలయును.

మన భారతదేశమున ఈ క్షేత్రము గొప్ప విజ్ఞాన కేంద్రమై విలసిల్లినది. శాతవాహన, ఇక్ష్వాక. వాకాటక, కాకతీయ, పల్లవ, తూర్పుచాళుక్య చక్రవర్తుల పరిపాలనలో ఎంతో ప్రాముఖ్యముజెందినది. వైదిక, పౌరాణిక యుగములలో ఈ స్వామి ఈ స్థలమునకు ప్రసాదించిన మహాత్మ్యము, చారిత్రక యుగమునందును ప్రకాశించినది.

శ్రీమన్నారాయణుడు, జగన్నాధములో భోజనము, సింహాచలములో చందనము, మంగళగిరిలో పానకము, తిరుపతిలో ప్రభుత్వము, శ్రీరంగంలో శయనం చేన్తూ, జగత్కల్యాణమూర్తి విరాజిల్లుచున్నాడు. శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వర క్షేత్రాలవలన ఆంధ్రదేశము త్రిలింగదేశముగా ఎట్లు పేరొందెనో, అదే విధముగా సింహాద్రి, వేదాద్రి, తోతాద్రి అనే వైష్ణవ క్షేత్రములు కూడా వైభవము, ప్రాభవములను నంతరించుకొన్నవి. శ్రీశైల శిఖర దర్శనము, మంగళాద్రి శ్రీలక్ష్మీనృసింహస్వామిని దర్శించినను పునర్జన్మయుండదని, ప్రజల నమ్మిక. శ్రీ లక్ష్మీ నృసింహ స్వామి స్వయం వ్యక్తుడై ఆవిర్భవించిన పర్వతము తోతాద్రి. మంగళగిరికి హస్తగిరి, స్తోత్రాద్రి, ముక్త్యాద్రి అనుపేర్లు కలవు.

మంగళాద్రి నృసింహుడు ప్రత్యక్ష దైవము. ఈ దేవునకు శ్రీ పానకాల లక్ష్మీ నృసింహుడను వ్యవహార నామము కలదు. ఆంధ్రదేశమున కృష్ణా, కావేరి నదుల నడుమ, శ్రీ శైలమునకు ఈశాన్యమున, శ్రీరంగమునకు ఉత్తరమున, ఇంద్రకీలాద్రికి దక్షణా గ్రమున మంగళగిరి కలదు. గుంటూరు జిల్లాలోని ఈ క్షేత్ర రాజము, విజయవాడకు సుమారు 15 కి.మీ.

దూరమునకలదు. మన, భరతఖండమున గల సప్తకుల పర్వతములలో పారియాత్ర పర్వతము మొదటిది. అదియే మంగళగిరియని బ్రహ్మ వైవర్త పురాణము తెలుపుచున్నది. విజయవాడలో కృష్ణా తీరమునందు గల ఇంద్రకీలాద్రి విజయవాడలో ప్రారంభమై, మంగళగిరి క్షేత్రమువరకు వ్యాపించియున్నది. కనుక ఈ పర్వతమునకు ఉత్తరాగ్రమున శ్రీ కనకదుర్గమ్మ క్షేత్రము, దక్షిణాగ్రమున శ్రీ లక్ష్మీనృసింహ క్షేత్రములు విరాజిల్లుచున్నవి. ఒకపుడు కృష్ణానది మహావేగముగా ప్రవహించుచూ కీలాద్రిని ఢీకొన్నది. కృష్ణకు దారి దొరకలేదు. దేవతల ప్రార్థనపై కీలాద్రి, కొద్ది సొరంగ మేర్పాటు చేసినది. నదీవేగము ఈకొండ సొరంగము ద్వారా పర్వతఖండమును పెళ్ళగించి నాలుగుమైళ్ళ దూరము నెట్టివేసినది. అదియే నేటి "యనమదల కుదురు" అని పెద్దలు చెబుతారు.

మహేంద్రోమలయస్సహ్య శుక్తిమాన్వృక్ష పర్వతః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతేకుల పర్వతాః

(విష్ణుపురాణము)

క్రీ.శ. 14వ శతాబ్దినాటి శాసనముననుసరించి, విజయనగర చక్రవర్తులలో అగ్రగణ్యుడైన శ్రీకృష్ణ దేవరాయలు, మంత్రి తిమ్మరుసు సహాయంతో కొండ వీటిని జయించిన గాధ ఇక్కడగల శిలాశాసనమున చెక్కబడినది. ఇచ్చటయున్న శ్రీపానకాల లక్ష్మీ నృసింహస్వామిని దర్శించి. భూరి భూదానములు చేసినట్లు ఈ శాసనమువలన తెలియుచున్నది.

క్రీ.శ. 1558 నాటి శాసనముల ననుసరించి ఒరిస్సాదేశపు రాజైన సిద్ధరాజు రాజయ్యదేవరవారు ఈ స్వామివారికి మంగళగిరి నుండి 28 గ్రామములలో 200 కుచ్చెళ్ళపొలము (256 కుంటలు, ఒకకుచ్చెల) ధర్మమిచ్చినట్లు వ్రాయబడినది.

ఎందరో మహానుభావులు, మంగళాద్రిని దర్శించి పునీతులైరి. క్రీ.శ. 8వ శతాబ్దిలో పూజ్య పాదులు శ్రీ శంకరాచార్యులవారు మంగళగిరికి అనేక పర్యాయములు విచ్చేసిరి. శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రము ఇచ్చటనే చెప్పినట్లు ప్రతీతి.

క్రీ.శ. 1250 సంIIలో శ్రీ చైతన్య మహాప్రభువు మంగళగిరికి విచ్చేసి, శ్రీస్వామివారిని దర్శించి సంకీర్తనము గావించి తన్నుతాను మరచి, తన్మయుడై నృత్యము చేసినట్లు తెలియుచున్నది.

ప్రసిద్ధ ప్రవక్త శ్రీవల్లభాచార్యులవారు. మంగళాద్రికి నైఋతి దిశయందున్న వటతీర్థము నందు తపమొనరించి శ్రీ నృసింహదేవుని ఆజ్ఞానుసారము, హిందూ మత సిద్ధాంతములను ఇచ్చటనుండియే విశ్వ వ్యాప్త మొనరించిరి. శ్రీ రామానుజులు, శ్రీ మధ్వాచార్యులు ఈ క్షేత్రమునకు విచ్చేసి, శ్రీస్వామివారిని సేవించిరి. శ్రీ స్వామివారి సన్నిధియందు శ్రీ నృసింహోపాసన చేసి తన్మంత్రసిద్ధిని పొందిరి.

1778 సంIIన పరిపాలన చేపట్టిన వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తను పరిపాలించిన 999 గ్రామముల యందు, దేవాలయములను కట్టించి, వాని పోషణకు అగ్రహారములనిచ్చిరి ఈ ధర్మమూర్తి సుమారు 900 అడుగుల ఎత్తునగల మంగళాద్రిని, గోపురము, ప్రాకార మంటపాదులను కట్టించవలెనని తలచెను. రాష్ట్రములోగల శిల్పులను రావించి వాటిని తయారుచేయుడని ఆజ్ఞాపించెను. శిల్పులు రెండేళ్ళలో గోపురము కట్టిరి. తరువాత ప్రాకార మండపాదులు కట్టిరి. శ్రీనాయుడుతో పాటు భక్తులును వానిని చూచి, పరమానందభరితులై అమరావతి వొక కైలాసముగ, మంగళగిరి వొక వైకుంఠముగా చూడ సాగిరి. మంగళాద్రిని నిత్యోత్సవ, పక్షోత్సవాదులు జరుపుటకు తగు ఏర్పాట్లు చేసిరి. పనులు పూర్తి

అయిన పిమ్మట గోపురము ఉత్తర భాగమున కొరిగెను. దీనిని నిర్మించిన శిల్పి ఎంతో వ్యధచెందెను. ఈ శిల్పి ఎంతో శ్రమించి తూర్పుభాగమున అగాధమైన కోనేరు త్రవ్వించెను. ఉత్తరమున కొరిగిన గోపురము క్రమ క్రమముగా దక్షిణమునకు వంగి తిన్నగా నిలువబడెను.

మంగళగిరిస్వామి పానకము త్రాగుట నిజమేనా యని సందేహించి, పరీక్షించుటకు నాయుడు, తన బావమరిదితో కలిసి, పానకాల స్వామి వద్దకు వెళ్ళిరట. తమ కుడిచేతిని స్వామి నోటియందుంచి రట. కొంతవరకు చేయి పోవుసరికి చెయ్యినమిలిన ట్లు విపరీతమైన బాధ కలిగినదట. అనేక తేళ్ళు, పాములు కరచినట్లైనదట. ఈ ఉదంతమునకు చారిత్రకాధార ములు దొరకలేదు. తూర్పు రాజగోపురము ఎత్తున కవసరమైన వెడల్పు క్రింది భాగానలేదు. తక్కువ వెడల్పులో ఇంత ఎత్తు గోపురము నిర్మించుట విశేషము కంచిలోని ఏకామ్రనాధ దేవాలయ గోపురము, మంగళగిరి గోపురము ఒక దానికొకొటి పోటీపడుచున్నట్లు యుండుట గమనించవచ్చును.

బ్రిటిష్ పాలనకు పూర్వము ఈ ఆలయము నకు ధర్మకర్తలుగా శ్రీ వేంకటాద్రి నాయుడు గారు వ్యవహరించిరి. వీరి పాలనలో యీ క్షేత్రరాజము తేజోవంతముగా వర్ధిల్లినది.

శ్రీమంగళగిరికి హస్తగిరి, స్తోత్రాద్రి, ముక్త్యాద్రి మొదలైన నామములు కలవు. శ్రీలక్ష్మీనృసింహ స్వామి స్వయంవ్యక్తుడై ఆవిర్భవించిన పర్వతము తోతాద్రి. ఈ పర్వతము జనియించిన నాటికి హిమవత్పర్వత ముత్పన్నముకాలేదని భూతత్వ శాస్త్రజ్ఞులు పరిశోధ నల వలన తెలియుచున్నది.

పూర్వము కామరూపియగు 'పారియాత్ర' యను పర్వత క్షేత్ర శ్రేష్టమొకటి కలదు. ఆ పారి యాత్ర భార్య సుశీల చక్కనిది. వారికి మహా తేజశ్శాలియు, సాత్వికుడును, ఆకారముచే వికృతుడు, హ్రస్వశృంగియను కొడుకు పుట్టెను. ఇట్టి బిడ్డను చూచి వగచుచున్న తల్లిదండ్రులను వదలి దేశమంతా తిరుగుచూ క్రిష్ణవేణి నదికి దక్షిణమున ఉన్న మంగళ గిరి చేరి, మూడేళ్ళు తపస్సుచేయగా, విష్ణ్వాజ్ఞ ననుస రించి వైకుంఠ వాసులచ్చటికేతెంచి హ్రస్వశృంగిని స్తుతించిరి. ఆ సమయమున తన్ను వెదకుచూ అచ్చటికి వచ్చిన తండ్రిని చూచి హ్రస్వశృంగి శ్రీ నృసింహుని సన్నిధినుండగనెంచి గజాకృతిని పొందెను. పారియాత్ర గజాకృతినున్న పుత్రునిగాంచి, ఇంటకి రమ్మని బ్రతిమాలినను అతడంగీకరించక తండ్రి నోదార్చి పంపెను. అందుచేతనే మంగళగిరి గజాకృతిగా నున్నదని చెబుతారు.

మంగళగిరి పర్వతమునకు తోతాద్రి అను నామమేర్పడుటకు ఒక పురాణగాధ కలదు.

నముచియను రాక్షసుడు బ్రహ్మను గూర్చి ఘోర తపస్సుచేసి, వరములు పొంది, తన తపోబల గర్వముచే లోకులను బాధించుచుండగా, మానవులు, దేవతలు శ్రీమహావిష్ణువును శరణుజొచ్చిరి. అంతట విష్ణువు వారితో నముచిని సంహరింతునని మీరునన్ను పూజించుచుండుడని చెప్పివారిని పంపెను. దేవత లందరూ విష్ణుదేవుని ప్రార్థించుచుండగా, దేవేంద్రుడు మిగిలిన రాక్షసులను సంహరించెను.

విష్ణువు తన్ను జంపుటకు వచ్చుట తెలిసికొని, నముచి కనిపించకుండా మూలరూపమును దాల్చెను. అపుడు శ్రీమహావిష్ణువు సుదర్శన చక్రమును, సముద్ర నురుగులో ముంచి నముచి మీద ప్రయోగించెను. నముచి పారిపోయి మంగళగిరి చీకటి గుహలో దాగు కొనెను. నురుగుతో నిండిన సుదర్శనాయుధముతో స్వామి నృసింహాకృతిని పొంది, తన విశ్వాగ్నిచే నముచి

రాక్షసుని సంహరించెను. వాడు నెత్తురు గ్రక్కుకొని చచ్చెను. ఆ నెత్తురు కాల్వగట్టి రక్తకుల్య కాలువగా నేర్పడెను. ఇప్పటికీ యీ కాలువ కలదని పెద్దలు చెప్పుచున్నారు.

ఈ సుదర్శన చక్రమునుండి మూడు కన్నులు కలిగి భీకర రూపముతో, నృసింహాకృతిలోనున్న దేవుని చూచి, దేవతలు ప్రార్థించుచుండగా స్వామి శాంతాకారుడై అమృతముదెమ్మనియు, భక్తులతో తానారగించెదనని చెప్పి, దేవతలు తెచ్చిన అమృతమును తాను సగముత్రాగి, మిగిలిన సగము భక్తుల కిచ్చెను. "కృతయుగమున అమృతము, త్రేతా యుగమున నేతిని, ద్వాపరయుగమున కామధేనువు పాలను, కలియుగమున పానకమును నేను త్రావుదును. నేనీ కొండమీదనే యుందును" అని స్వామి దేవతలతో చెప్పెను. అప్పటినండి ప్రతి యుగము నిట్లే జరుగుచున్నది. ఆ స్వామియొక్క విశ్వాసదూమముచే తగులబడుట చేత మంగళగిరి తోతాద్రి అయినది.

ఈ కారణము వలన, ప్రసిద్ధమైన వైష్ణవ క్షేత్రములలో మంగళగిరి క్షేత్రము ప్రముఖ స్థానము వహించుచున్నది. ఎగువ సన్నిధి, దిగువ సన్నిధి ఆలయములలో వైఖానసాగమానుసారము అర్చనలు జరుపబడుచున్నవి. ఈ సిద్ధాంతము బ్రహ్మ వైవర్త పురాణమునందు గలదు. ఇచ్చటనున్న నృసింహుడు ప్రత్యక్షదైవము. ఎగువ సన్నిదిని శ్రీ స్వామివారిని పానకము ఆరగింపు చేయుచున్నప్పుడు శ్రీ నృసింహ శక్తి తమ నావహించి తమ శరీరములు పులకరించుచుండునని, స్వామికి అర్చనలు చేయునపుడు, బ్రహ్మోత్సవ సమయములందు నవాహ్నిక దీక్షావిధిని నిర్వర్తించునపుడు, వారు పొందెడి ఆనందము వర్ణనాతీతమని అర్చక స్వాములు చెప్పుచున్నారు. వారు కడు ధన్యులు కదా!

మంగళగిరి కొండమీద స్వామిని సేవించుటకు ఉదయమున మాత్రమే అవకాశమున్నది. శ్రీస్వామి వారికి సాయంకాలము, రాత్రులందు దేవతలు అర్చనలు జరుపుదురు. ఆ సమయమున మానవార్చనలేదచట. అచ్చట స్వామివార్కి నివేదనలో ప్రధానమైనది పానకము. దీనిని అచ్చటి అర్చక స్వాములు సిద్ధముచేయుదురు. పిదప స్వామికి నివేదన చేయుదరు. ఈకొండపై దేవాలయ గర్భగుడిలో భక్త ప్రహ్లాదుడు, లీలావతీదేవి విగ్రహాలున్నవి. ఎదురుగా శ్రీ ఆంజనేయస్వామివారి విగ్రహమున్నది. ప్రక్కనున్న గుడి అంతర్భాగం, గదిలో శ్రీరామానుజులవారి విగ్రహమున్నది.

ఈ క్షేత్రమును పాలించువాడు శ్రీ ఆంజనేయ స్వామి. ఆంజనేయ స్వామివారి ఆలయములు ఈ క్షేత్రమునకు నాలుగు వైపులా ఉన్నవి.

## వైకుంఠపురము

కొన్ని ప్రాచీన ధార్మిక కేంద్రాలు కాల గర్భంలో కలిసి, ఈ నాటికి శిధిలాలుగా మిగిలి పోతుంటే, కొన్ని ప్రాంతాలలో, ధార్మిక కేంద్రాలు నవీనములైనా, నూతనోత్తేజంతో మొలకెత్తి విస్తరిస్తున్నాయి. అందుకు కారణం ఏదైనా ఉండవచ్చు ననుకుంటే, అలాటి కారణం ఆ దేవాలయాలు రూపొందించి, వాటిని ప్రతిష్ఠించిన మహనీయుల ఆత్మశక్తియే నని తోచకమానదు. అలాంటి వానిలో వైకుంఠపురం, శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం మిన్నగానున్నది.

వైకుంఠపురం గుంటూరు జిల్లాలో తెనాలి పట్టణమునకు దక్షిణాన కలదు. ప్రశాంత ప్రకృతి మధ్య ఆహ్లాదకరమైన పరిసరాల వాతావరణంలో వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వరుని దర్శించి సేవించుకున్న భక్తులు "ఏడుకొండలస్వామి యిక్కడకు తరలి వచ్చాడా!" అని భావించటం సహజం. స్వామి వారికి

కుడివైపున పద్మావతి అమ్మవారు, ఎడమవైపున శ్రీ లక్ష్మీదేవి వేంచేసియున్నారు.

మందిర కుడ్యములపై శ్రీ వేంకటేశ్వర అవతార విశేష వైశిష్ట్యమును వివరించు అపురూప శిల్పములు కూర్చబడియుండి, ఈ పుణ్య స్థలము చిన్న తిరుపతిగ ప్రసిద్ధి చెందుచున్నది. చాలా మంది ఆర్థికంగా, లేక మరియే ఇతర కారణాలవలన తిరుపతి వెళ్ళలేనివారు, ఈ స్వామిని సేవించి తరిస్తున్నారు. తిరుపతి దర్శించినంతగ పులకితులౌతున్నారు.

సుమారు ఐదు ఎకరముల ప్రాంగణములో అత్యంత శిల్పకళా వైభవముతో వెలుగొందుచున్న ఈ గొప్ప దేవాలయాన్ని చూడగనే ఇది ప్రాచీన మందిర మేమోయని అనిపిస్తుంది.

శ్రీ బాలనరసింహారావు గౌడ అనే భక్తునికి శ్రీ వేంకటేశ్వరస్వామి ఫణిరాజ రూపమున స్వప్నమున సాక్షాత్కరించి తనకొక దేవాలయము నిర్మించవలసి నదిగా కోరాడు. క్రీ.శ. 1961లో దేవాలయమునకు పునాదివేసారు. 2.6.1972న శ్రీ స్వామివారి ప్రతిష్ఠ జరిగింది, మందిర పూర్వ దిశలోని పుట్టలో నాగేంద్రుడు సంచరిస్తూ అనేక మహత్తులు ప్రదర్శిస్తుండగ 29.8.1976న నాగ ప్రతిష్ఠ, గరుడ ప్రతిష్ఠ జరిగినవి.

స్వామి వారి కళ్యాణ మండపము, ప్రజల కళ్యాణమండపము, యాగశాల, కేశఖండనశాల, వసతి గదుల నిర్మాణము తక్కువ వ్యవధిలో జరిగినవి. ఇందుకు ఈ దేవాలయ పాలకవర్గమును అభినందించక తప్పదు. పొంగలి షెడ్డు కూడా నిర్మాణము జరిగినది.

ఇక్కడ స్వామివారిని సేవించి, నాగేంద్రుని పుట్టకు ప్రదక్షిణలు చేసిన యెడల సర్వదోషములు తొలగుత వని భక్తుల నమ్మిక. సంతానము కలుగుట, మూగ పిల్లలకు మాటలు వచ్చుట జరుగుచున్నవని తెలియుచున్నది. పొంగలి పొంగించి పుట్టవద్ద నైవేద్యం చేయుట యిక్కడి విశేషం. చాలా దూర ప్రాంతాల నుంచి ఎందెందరో ఇక్కడకు వచ్చి, ఇక్కడనే వివాహాది శుభకార్యాలు జరుపుకుంటారు. ఒకొక్కరోజు శతాధికంగా వివాహాలు జరుగుచున్నవి. పిల్లలకు అన్నప్రాసన చేసుకుంటారు. నిత్యం ఎందరో భక్తులు వచ్చు చున్నారు. శనివారం ఇరవై వేలమందికి పైగా భక్తులు వస్తారు.

ఇచ్చట వైకుంఠ ఏకాదశి విశేషంగా జరుగుతుంది. శ్రీవారి బ్రహ్మోత్సవాలు వైభవోపేతంగా వైశాఖ మాసంలో తదియనుంచి నవమివరకు జరుపుతారు. ప్రతిరోజూ అనేక ధార్మిక, తాత్త్విక,సాంస్కృతిక కార్యక్రమాలు .రుపుతారు. లక్షకుపైగా భక్తులు వస్తారు. వైశాఖ మాసం ఉత్తర భాగాన ఎండలు ముదురుతున్నా ఇచ్చట ప్రకృతి రమణీయంగాను, కమనీయంగాను, ఆహ్లాదకరంగాను, సహజశీతలంగాను ఉండి యాత్రికులను విశేషంగా ఆకర్షించుచున్నది.

మందిరమునకు పశ్చిమంగా క్రిష్ణానది పంట కాలువ ప్రవహిస్తుంటుంది. సంక్రాంతి పర్వదినాన ఇచ్చట జరిగే తెప్ప ఉత్సవం విశేష ఆనందాలను అందజేస్తుంది. పడవలో స్వామిని ఊరేగింపుతో పాటు మరి రెండు పడవలు ఏర్పరచి వానిలో నృత్య, సంగీత, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తారు.

భక్తులద్వారా వచ్చే కానుకలే యీ స్వామికి ఆస్తి. తెనాలి, గుంటూరు, విజయవాడ పొన్నూరుల నుంచి బస్సు సౌకర్యము కలదు.

తెనాలి బస్సుస్టాండు నుండి నిజాం పట్నం వెళ్ళే దారిలో రెండు కి.మీ. దూరంలో ఈ వైకుంఠ పురం వున్నది. ఇచ్చట అన్ని బస్సులు ఆగుతవి. రైలులో రాదలచుకున్నవారు వైకుంఠపురము ప్రక్కనే

తెనాలి రేపల్లి మార్గములో చిన్న రావూరు స్టేషను ఉన్నది. అక్కడ దిగి మందిరము దగ్గరకు రావచ్చును. లేక తెనాలినుండి రావచ్చును.

నిశ్చింతగా స్వామివారిని సేవించి తృప్తిపొంద వచ్చును. యాత్రికులు కొంతకాలము వరకు ఈ క్షేత్రమున విడిది చేయదలచుకుంటే ఆధునిక సౌకర్యములుగల వసతి సౌకర్యము కలదు. ప్రశాంతంగా ఉండవచ్చును. వైకుంఠపురమున నిష్ఠతో దేవుని పూజించి, ప్రశాంత చిత్తముతో మరలవచ్చును.

పెదకాకాని

శ్రీ మల్లేశ్వరస్వామి క్షేత్రము గుంటూరు జిల్లాయందలి మంగళగిరికి సమీపాన పెదకాకాని యందు విలసిల్లుచున్నది. ఇచ్చటి శ్రీ మల్లేశ్వర స్వామి శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వరుని ప్రధానాంశ మేయని మరియొకటి కాదని పెద్దలు చెబుతారు. ఈ క్షేత్ర ప్రాశస్త్యమును గూర్చి పురాణములయందు పేర్కొనబడియుండుటచే నీయది అతి ప్రాచీన క్షేత్రమని వేరే చెప్పనక్కరలేదు.

ఈ స్వామి శ్రీశైల లింగాంశము కలిగి యుండుటచే, ద్వాదశ జోతిర్లింగముల యందలి మహిమ ఇందు నెలకొని, దర్శనీయమగుచున్నది. ఈ క్షేత్రరాజమును గూర్చి యొక ప్రాచీన గాథ కలదు. క్లుప్తముగ ప్రాచీన గాథ ఈ విధమున నున్నది.

మహర్షులలో అత్యంత ప్రసిద్ధుడు భరద్వాజ మహర్షి. ఒకానొక సమయమున ఈ మహర్షి భూ ప్రదక్షణ గావించుచూ ఈ కాకాని మహాక్షేత్రమునకు వచ్చెను. ఇచ్చట ఈశ్వరునారాధించుచుండ, ఆ మహర్షికి ఒక యజ్ఞము చేయ సంకల్పము కలిగినది. అంతనామహాముని యాగమునకు కావలసిన సంభారములను సమకూర్చుకొని, అనేక మహర్షి పుంగవుల నాహ్వానించి, యొక శుభ ముహూర్తమున యజ్ఞసంకల్పము చేసి, యజ్ఞవాటికయందు దేవత లకు హవిర్భాగముల నొసగుచుండ, నచటికొక వాయసమేతెంచి, దేవతలకు భరద్వాజ మహర్షి యిచ్చు చున్న హవిస్సులను తినుచుండెను. జరుగుచున్న యిట్టి అపవిత్ర కార్యమును తిలకించిన ఋషి పుంగవుడా కాకిని వారించబోవునంతలో నయ్యది మహర్షితో, మనుజ భాషణమున యిట్లనెను. "ఋషి సత్తమా! నేను కాకుండను దానవుడను, జగత్సృష్టి కర్తయగు బ్రహ్మదేవుని గూర్చి మహా తపమాచరించి యాతనిచే యజ్ఞముల యందు దేవతలకిచ్చు హవిర్భా గములను భక్షించునటుల వరము పొందితిని. నన్ను వారించవద్దు. నీవు నీయజ్ఞమును పూర్తిచేసుకొన దలచితివేని, నా మాటలు విని నే చెప్పినటుల చేయుము. పంచామృతములతోనుక్ష్ణ, గంగోదకము తోను, నవరత్న సువర్ణోదకముతోను పవమానాఘ మర్షణ సూక్తములను చదువుచూ, నన్నభిషేకింపుము నీనిపుడొక మహర్షివలన శాప గ్రస్తుడనై యున్నాను. ఈ శాపము అభిషేక జలముచే తొలగిపోవును. అందు వలన నాకు శాపవిముక్తి కలిగి మోక్షప్రాప్తి కలుగును. తమ యజ్ఞమునూ సురక్షితమగును" అని చెప్పెను. అందులకా మహర్షి అటులనేయని ఆ కాకమునకు అభిషేకమొనర్చెను. వెంటనే ఆకాకము నల్లనిరూపు వీడి, తెల్లని వర్ణమువలదై భరద్వాజ మహర్షిని పూజించి, మల్లేశ్వరుని మల్లెపూలతో పూజించి, తన యథా స్థానమైన మానస సరోవరము నొడ్డునగల మహా వృక్షవృక్షపు తొఱ్ఱలోనికి జేరినది. తదాది ప్రతి దినమున నీ పక్షి రాజము మానస సరోవరము నుండి, ఆకాశమార్గమున దక్షిణ భారత దేశమునగల పక్షి తీర్థములకేగి అచటగల పరమేశ్వరుని సేవించి, అచటి వైభవమును దర్శించి, తిరిగి [illegible] మరలి వెళ్ళు చుండెను. ఆ విధముగ వచ్చునపుడూ, వెళ్ళునపుడూ ఈ కాకానీశ్వరుని కూడా దర్శించుచుండెను.

ఈ కారణమువలన, ఈ మహా క్షేత్రమునకు "కాకాని క్షేత్రమని నామము" కలిగినది. ఈ దేవాలయ ప్రాగ్భాగమున భరద్వాజునిచే నిర్మింపబడిన కూప మొకటి కలదు. ఇందు ఆ ఋషిసత్తముడు సమస్త తీర్థములను నిక్షిప్తముచేసెను. ఈ తీర్థములు, పునీతము లగుటయే కాక, పసిపాపలు, బాలింతలు, వ్యాధి పీడితులు మొదలగు వారు సేవించిన యెడల ఆరోగ్యము నొసగుచున్నది.

కాలక్రమమున ఈ దేవాలయము శిథిల మయినది. శ్రీ కృష్ణదేవరాయల మంత్రివర్యుడగు తిమ్మరుసు మంత్రి జీర్ణోద్ధరణ గావించెను. తదుపరి ఆదియును జీర్ణావస్థనొందినందున 1911లో కాకాని గ్రామవాస్తవ్యులగు శ్రీ కొల్లిపర వేంకటరత్నం తిరిగి ఆలయమును నిర్మించి పునఃప్రతిష్ఠలు చేసిరి. ఇప్పుడీ ఆలయం నందు భ్రమరాంబ మల్లేశ్వరులు, గణపతి, వీరభద్రమూర్తులు ధ్వజ స్తంభము కలవు. ఆలయ దక్షణ భాగమున శివతాండవము, ఉత్తర భాగమున మహిషాసురమర్దని ద్వారమున ఉభయ పార్శ్వముల యందు జయవిజయులు, వినూత్న శిల్ప సౌభాగ్యము లతో ప్రకాశించుచున్నారు. స్వామి ఎదుట నున్న నందీశ్వరుడు చూడదగ్గది.

ఈ స్వామి వారి మహిమవలన ప్రాంత ప్రజలే కాక సుదూరముల నుండి కూడా భక్తులు వచ్చి స్వామి వారిని సేవించి మ్రొక్కుబడులను చెల్లించుచున్నారు. ఆంధ్రదేశమునందు మరే దేవాలయముల యందును కానరాని పొంగలి నివేదనలు ఇచ్చుటి ప్రత్యేకత. ఈ దేవాలయము శైవ క్షేత్రమైనను శ్రీ సత్యనారాయణ వ్రతములు ఇచ్చట జరుపుచుండుట విశేషము.

## మాచర్ల శ్రీ చెన్నకేశవాలయము

గుంటూరు జిల్లాలోని చంద్రవంక నదీతీరమున మాచర్ల నగరానగల శ్రీ చెన్నకేశవాలయము ఈ నాటికి భక్తులచే ఆకర్షించబడుతూ సేవింపబడు చున్నది. ఈ నగర సందర్శనం ఆనాటి కారెంపూడి వీరుల సాహస గాథలను గుర్తుకు తెస్తుంది. పన్నెండవ శతాబ్ది మధ్యభాగాన మాచెర్ల మహోన్నత దశయందు కొన్నది. ఈనాటికీ మాచెర్ల, ఆంధ్రుల అభిమాన ప్రాంతంగా పరిగణింపబడుచున్నది. ఇతర రాష్ట్ర వాసులు కూడా మాచెర్ల పట్టణము సందర్శించుట కువ్విళ్ళూరుచున్నారు.

ఐదు తలల నాగప్రతిమ తెల్ల పాలరాతితో చేయబడి బాగా శిథిలమవుతున్న వేంకటేశ్వరాలయ ములో ధ్వజస్థంభమునానుకొనియున్నది. చూచుట కెంతో ముచ్చట గొలుపుచున్నది. ఈ దేవాలయ గోడలలో గల పల్లపు ప్రాంతములలో వీరులు తప్పించుకొనుటకు వీలు కలిగినది. ఈ విషయములో కొంత పరిశోధన చేయవలసియున్నది.

మూడడుగుల చెన్నకేశవస్వామి, లేక శ్రీకృష్ణుని విగ్రహ ప్రతిష్ఠ బ్రహ్మనాయునిచే గావింపబడినది. ఈయన పెదమల్లి దేవునకు మాచర్ల ముఖ్య పట్టణముగాజేసి పల్నాటిసీమ పరిపాలించెను. నలగామ రాజు గురజాలలోను, బ్రహ్మనాయుడు మాచెర్లలోను ఉండి, పల్నాటి సీమను ప్రసిద్ధిగావించిరి.

శ్రీ చెన్నకేశవస్వామికి చైత్ర శుద్ధ త్రయోదశి నాడు కళ్యాణ మహోత్సవము జరిపించుట ఇచ్చటి ప్రత్యేకత. జైనుల ప్రభావమిందు కలదనుటకొక ఉదాహరణమిది. ఇక్కడ శివాలయములలో సాధార ణంగా కనపడే పానుగొట్టం వైష్ణవాలయమైన ఈ దేవాలయములో కనబడుచుండుట వలన ఒకప్పుడిది శైవాలయమని చరిత్రకారుల అభిప్రాయమైయున్నది. బ్రహ్మనాయుడు వైష్ణవ మతాభిమాని. ఇచ్చట ఇంకొక విశేషమేమన చక్రము శ్రీకృష్ణుని ఎడమ చేతిలో నుండుట. గజేంద్ర మోక్షకథనాన్ని సూచించుచున్న ట్లున్న ఈ విగ్రహం ఎంతో విలక్షణమైనది. ప్రకాశం జిల్లా మార్కాపూర్‌లోను చెన్నకేశవస్వామి విగ్రహం

కలదు. ఇచ్చటి వేంకటేశ్వరాలయము ప్రకృతి వైపరీత్యముల వలన శిథిలముకాగా ఉత్సవమూర్తిని ఈ ఆలయములో భద్రపరచినట్లు తెలియుచున్నది.

చెన్నకేశవాలయ గర్భగుడికి దగ్గరలోగల నాలుగు స్తంభాల మండపం శిల్పచాతుర్యమునకు మచ్చుతునక. భారత, భాగవత రామాయణాది పురాణ ఘట్టములిందు చెక్కబడియున్నవి. 1112 సం॥ శాసనములననుసరించి కొంత భూవసతి కల్పించినట్లు తెలియుచున్నది.

నాగ స్థంబంలో ఈ శాసనములు చెక్కించి గురజాలలోను మాచెర్లలోను ఉంచడం వలన, వీటి పరిశీలన వలన ఇచ్చట కన్నడిగుల ప్రభావం కూడా ఆనాడున్నట్లు తెలుస్తున్నది.

చెన్నకేశవస్వామి దేవాలయం ప్రతిష్ఠించిన ప్రదేశం చంద్రవంకనది ప్రవాహ మార్గము ఉత్తర వాహినిగానున్నది. అందువలన బ్రహ్మనాయుడు ఈ పవిత్ర ప్రదేశాన్ని ఎంచుకున్నట్లు తెలియుచున్నది.

చెన్నకేశవ స్వామి దేశాలయానికి ఎడమ వైపుగ శ్రీ వీరభద్ర స్వామి దేవాలయం ఉన్నది. ఆరడుగుల భద్రకాళి విగ్రహం, శనీశ్వర విగ్రహం, ప్రక్కగా శ్రీ కామేశ్వరి దేవాలయం చూడదగ్గది.

## శ్రీ భావనారాయణ స్వామివారి దేవస్థానం పొన్నూరు (గుంటూరు జిల్లా)

గుంటూరు జిల్లాలో శ్రీ భావనారాయణ స్వామి దేవాలయము పేర్కొనదగినవి. గుంటూరుకు సుమారు ఇరువది ఐదు కి॥మీ॥ దూరమునగల పొన్నూరు పట్టణమున కల ప్రసిద్ధ దేవాలయమిది. ఈ స్వామిని శ్రీ సాక్షి భావనారాయణ స్వామియని కూడా అందురు.

సృష్ట్యాదియందు చతుర్ముఖ బ్రహ్మ, శ్రీహరిని గూర్చి తపస్సుచేసి, ఆయన అనుగ్రహము పొంది, సృష్టి రహస్యమును గ్రహించెను. ఆలాగున తపస్సు చేయు సమయమునందు స్నానపానములకు బ్రహ్మ ఉపయోగించిన సరోవరము బ్రహ్మ సరోవరమను నామమున శ్రీహరి కోనేరుగా రూపొందినది. ఇచ్చట, సేవాగణపతికి రమాపతికి గోష్ఠి జరిగినందున ఈ క్షేత్రమును "గోష్ఠీవనము" అని అందురు. ఈ క్షేత్రము చక్రాకారముగనుండి స్వామి మధ్యలో ఉన్నందువలన "సుదర్శన క్షేత్రము" అని కూడా పిలువబడుచున్నది. మరియు "స్వర్ణపురి" అని కూడా అందురు.

కృతయుగమున, అత్రి మహాముని కాశిలో తన మనోభావనా మూలమున శ్రీమన్నారాయణుని సాక్షాత్కరించుకొని వారి అనుగ్రహము పొందినందున భావనారాయణ స్వామిగ దేవతలు, మునులు స్తుతించి సేవించుచుండిరి.

కేశవవర్మయను విప్రోత్తముడు, సంతానము లేని కారణమున భార్యతో, మేనల్లుడు గూని గోవింద ముతో కాశికి పోయి, మేనల్లుని కోరికపై ఆడ పిల్ల కలిగినచో గోవిందునకిచ్చి వివాహము చేయుదునని మాట ఇచ్చుటయేకాక, నజలముగ శ్రీ భావ నారాయణ సాక్షిగా ప్రమాణము చేసెను. దైవాను గ్రహమువలన కేశవునకు ఆడపిల్ల పుట్టెను. ఆమెను "అక్కలక్ష్మి" అను పేరున పెంచి, యుక్తవయస్సు వచ్చిన పిదప, అల్లునికిచ్చిన మాట తప్పి శ్రీ భావనారాయణుడు సాక్ష్యమున్నాడని చెప్పిన అల్లునితో ఆ దేవుని తీసికొని రమ్మని హేళన చేసెను. భగవంతుని నమ్మిన భక్తుడగు గోవిందుడు అత్రిమహాముని యోగ ప్రభావముతో కాశికిపోయి, హరిహరులను అత్రి మహాముని భావనాశక్తితో మెప్పించి, వారు వెంటరాగా, ఈ క్షేత్రమునకు వచ్చి నిలిచిరి. గోవిందుడు కన్యాదాతను పిలవగా శ్రీ స్వామివారి ఆదేశానుసారము అక్కలక్ష్మిని గోవిందునకిచ్చి దివ్య వైభవముగా వివాహము జరిపించిరి. ఆనాటి నుండి శ్రీ స్వామి "సాక్షి భావ నారాయణస్వామి"యని భక్తులచే పిలువబడు చున్నాడు.

క్రీ॥శ॥ 8వ శతాబ్దంలో రాయలసీమలోని 'జౌకుసీమ" జమిందారు అందెల నారపరాజు పొన్నూరుకు విచ్చేయగా స్వామి స్వప్నమున ఆయనకు సాక్షాత్కరించి తాను వల్మీకమున నున్నా నని చెప్పగా ఆయన శ్రీవరదుని వెలుపలకు తీసి, పూజించి తన రాచపుండు పోగొట్టుకొని తరువాత శ్రీవారికి దేవాలయ నిర్మాణము గావించి, భరద్వాజ గోత్రుడైన వేఖానసుని అర్చకస్వామిగా నియమించి వైఖానస శాస్త్రరీత్యా ప్రతిష్ఠించి, శాశ్వత అర్చనాది కముల కేర్పాటుచేసెను.

క్రీ॥శ॥ 12వ శతాబ్దమునందు కళోత్తుంగ చంద్ర దేవుడు, స్వామివారికి అంగరంగ వైభోగములకు, వైశాఖ తిరునాళ్ళకు, పొన్నూరు మున్నగు ఐదు గ్రామముల నిచ్చెను. "జౌకు సీమాధిపతి" నంద్యాల నారపరాజు, గర్భాలయము కట్టించెను. క్రీ.శ. 804 సంవత్సరము నందు రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు బహుద్దరు మన్నె సుల్తాన్ దొరవారు (రాచూరు జమీందార్లు) నుంచి ఈ దేవాలయమున యావదాస్తులను పొందిరి. నాటినుండి నేటివరకు హరిమర భేదములేని వారుగ వాసికెక్కిన శ్రీ వాసిరెడ్డి వారి అనువంశిక ధర్మకర్తృత్వ మునందు, ఈ క్షేత్రము నిత్యనూతన వైభవములతో విరాజిల్లుచున్నది.

శ్రీవారి బ్రహ్మోత్సవములు వైశాఖ పౌర్ణమికి, మహా వైభవముగా జరుపబడుచున్నవి.

ఈ దేవాలయ ప్రాంగణమును, నిడుబ్రోలు వాస్తవ్యులు చింతక్రింద వంశీలయులు, ధాన్యపు పాత్రలో, సుప్రసన్నమైన శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారి దేవాలయము, శ్రీ కాశీవిశ్వేశ్వరాలయము, శ్రీ కాశీ విశాలాక్షి దేవాలయము, శ్రీ చెన్నకేశవస్వామి, శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయము శ్రీహరి సన్నిధి లోని వైఖానస ఆగమపు వ్యక్తులైన శ్రీ విఖసన స్వామి వార్ల శ్రీ గరుడాళ్వారు, శ్రీ దాసాంజనేయ స్వామి దేవాలయములు వెలసినవి. ఇవన్నియు దర్శించ దగ్గవి.

ఎందరో భక్తులు ఈ దేవాలయము:ప్ప దర్శించి, భక్త సులభుడైన శ్రీ భావనారాయణ స్వామిని సేవించి, తృప్తులై, తరిస్తున్నారు. గుంటూరు జిల్లా లోని ప్రసిద్ధ దేవాలయములలో ఈ క్షేత్రము పరమ పవిత్రమై వెలుగొందుచున్నది.

## శ్రీ సహస్రలింగేశ్వర స్వామి దేవస్థానం

పొన్నూరు నందు నెలకొనియున్న శ్రీ సహస్ర లింగేశ్వరస్వామి దేవస్థానము 1939వ సంవత్సరములో శ్రీ కోట జగన్నాధం అను భక్తునిచే, విరాళముల సేకరణ ద్వారా నిర్మాణము గావించుటకు సంకల్పించ బడి ప్రారంభించబడినది. ఈ దేవస్థానము సుమారు ఏడు ఎకరముల విశాల స్థలములో నెలకొల్పబడినది. శ్రీ సహస్రలింగేశ్వరస్వామి శ్రీ పెద గరుత్మంతస్వామి, శ్రీ దశావతారముల శ్రీ కాలభైరవస్వామి దేవాలయ సముదాయముగ అత్యంత వైభోపేతముగా ఈ క్షేత్రము నిర్మింపబడినది.

1961 సం॥న శ్రీ వీరాంజనేయస్వామి మరియు శ్రీ పెదగరుత్మంతస్వామి విగ్రహ ప్రతిష్ఠ గావింపబడినది. దేవాలయ నిర్మాణముకూడ జరిగినది. ఈ విగ్రహములు ఏకశిలా విగ్రహములై 24 అడుగుల ఎత్తు వీరాంజనేయ స్వామి మరియు 30 అడుగుల ఎత్తు శ్రీ పెదగరుత్మంత స్వామి భక్తజనులకు విశేషాకర్షణ కలిగియున్నవి. శ్రీ వీరాంజనేయస్వామిని దర్శించుటకు దేశము నలుమూలలనుండి భక్తులు అధికసంఖ్యలో వచ్చుటవలన ఈ పొన్నూరు పట్టమునకు ఈ దేవాలయములు విశేష పేరు ప్రఖ్యాతులు కలిగించుచున్నవి.

ఈ విగ్రహములను (దేవతామూర్తులను) దర్శించవలసినదే కాని వ్రాయుట కలవి కాదనుట అతిశయోక్తి కాదు. ఎంతో పవిత్రమైన దర్శనీయమైన క్షేత్రమిది.



# ప్రకాశం జిల్లా

మొదటి తెలుగు శాసనం ఈ జిల్లాలో లభించినది. రెడ్డిరాజుల కాలంలో ప్రఖ్యాతి గాంచిన పట్టణం అద్దంకి ఈ జిల్లాలోనిదే. క్రీ.శ. 1324 నుండి అద్దంకి రాజధానిగా చేసికొని ప్రోలయ వేమారెడ్డి వరి పాలించాడు. ఎఱ్ఱాప్రగడ ఈతని ఆస్థాన కవి. ఇచ్చట గల అద్దంకి నాంచారమ్మ ప్రముఖ శక్తి శిధిలమైన కోట అనేక శిధిల దేవాలయాలు ఇచ్చట కలవు. ఇచ్చటకల నూరుస్తంభముల మంటపము కొన్ని దేవాలయములు చూడతగ్గవి.

**మాలకొండ**

శ్రీ మాల్యాద్రి లక్ష్మినరసింహస్వామి దేవస్థానం ప్రకాశం జిల్లా కందుకూరుకు నైఋతి దిశలో సుమారు ఇరవై కిమీ॥ దూరములో నున్న మాల్యాద్రిపై ప్రఖ్యాతి గాంచిన నరసింహులలో ఈయన భక్తుల పాలిటి కల్పతరువుగా నున్నారు.

శ్రీహరి, శ్రీమహాలక్ష్మి భూమండలమున నివసించదలచి తన వనమాలను పర్వతాకారం దాల్చమని కోరగా ఆవనమాల మాల్యాద్రిగా వెలసినదని పురాణ గాధ కలదు. అగస్త్య మహర్షి ఈ మాల్యాద్రిపై తపస్సు చేయగా ఆతపస్సుకు శ్రీహరి మెచ్చి ఎఱ్ఱని కాంతితో జ్వాలారూపమున ప్రత్యక్షమైనాడని అందువలన ఈ స్వామి శ్రీ జ్వాలా నరసింహునిగా ప్రసిద్ధిగాంచినాడని స్థలపురాణము వలన తెలియుచున్నది.

పూర్వం శచీదేవి, తనకు అతిలోక సుందరుడు గొప్ప పరాక్రమవంతుడు మహా జ్ఞాని అయిన పుత్రుని ప్రసాదించమని కోరగా మాల్యాద్రిపై జ్యేష్టమాసములో మూడు శనివారములు ఆవునేతితో పిండి దీపారాధన చేసి శ్రీలక్ష్మి నృసింహుని భక్తిశ్రద్ధలతో నియమ నిష్ఠలతో అర్చించగా ఆ తరువాత ఆమె గర్భవతియై సకల సద్గుణవంతుడైన కుమారుని ప్రసవించినది. అప్పటి నుండి ఇప్పటికీ జ్యేష్ట మాసము నందు వరుసగా మూడు శనివారములు భక్తితో దీపారాధన చేసి మాల్యాద్రి లక్ష్మినరసింహస్వామిని అర్చించిన స్త్రీలు చక్కని సంతానమునుబడయుట ఈ స్వామి మహత్మ్యములలో ముఖ్యమైనదిగా బహు ప్రసిద్ధి చెందినది. చైత్ర మాసమునందును, వసంత ఋతువునందును, శని వారముతో కూడిన మాస పూర్ణిమలయందును మాఘ మాసమునందును శ్రీలక్ష్మి నరసింహుని భక్తి శ్రద్ధలతో సేవించిన వారికి స్వామి అనుగ్రహమువలన సర్వవ్యాధి బాధలు తొలగుటయే కాక సమస్త ఈప్సితములు నెరవేరునని

ప్రగాఢ విశ్వాసమై యున్నది.

ఇచ్చట ప్రకృతిరమణీయకత పేర్కొనదగినది. ఇచ్చట"పూలమాల"ఆకారంలో ఉన్న పర్వత పంక్తు లతో నానావిధ పరిమళ పుష్ప, ఫల వృక్షములతో లతానికుంజములతో చూపరులకు నయనా నంద కరముగనుండి భక్తులకు మానసికొల్లాసము కలిగించు మాల్యాద్రి కడు దర్శనీయమగుచున్నది. మాల్యాద్రికి చుట్టుప్రక్కలనేక గ్రామములుండెడివి.

ఇచ్చట మరో ముఖ్య విశేషమేమన ఒకే రాతి క్రింద నేర్పడిన అతి విశాలమైన గుహలు లెక్కకు మించియున్నవి. ఇదియొక ప్రకృతి వింతలలో వింత. మండు వేసవిలో కూడా సమశీతలముగా నుండు ఈ గుహలు మానవ నిర్మితములు కావని కేవలం దైవ నిర్మితములని భక్తులకు సులువుగా అవగాహన అగు చున్నది. ఈ గుహలు వందలాది భక్తులకు ఆశ్రయ మును, విశ్రాంతిని ఇచ్చుచున్నవి.

శ్రీ మహాలక్ష్మి స్వామివారిపై ప్రణయకోపము తో అలిగి కొండను పగులగొట్టుకొని కొండ శిఖరము పైకి వెళ్ళి కూర్చున్నదని పురాణ గాథ. అందుకు నిదర్శనముగా బ్రహ్మాండమైన కొండలనడుమ చీలికతో ఇరుకైన మెట్లదారి. ఆదారిలో ఎంతటి స్థూలకాయుల యినను నడచి వెళ్లగలిగే విధముగా నుండుట వింతల లో వింతగా నుండి భక్తులకిదియొక అద్భుతమైన భగవంతుని లీలగా తోచక మానదు. ఇచ్చటనే ఒకరాతి క్రిందఏర్పడిన విశాలమైనగుహలో శివలింగము ప్రతిష్ఠిం చబడి శివ కేశవులకు బేధములేదనెడి ఆధ్యాత్మిక ఉన్నత భావము కలిగించుచున్నది. శివాలయము నకు దిగువగా పార్వతీదేవి ఆలయమున్నది. మన భరత ఖండమందలి అసంఖ్యాకముగనున్న దివ్యక్షేత్రములలో మాల్యాద్రికూడా ఎన్నదగినదని అందువలన మాల్యా ద్రిని జీవితమున . ఒక్కసారైనను దర్శించి శ్రీ జ్వాలా నరసింహుని సేవించి శరణు వేడినవారు ధన్యులని భక్తుల నమ్మిక ప్రబలముగ నున్నది.

ప్రతి సం॥ వైశాఖ శుద్ధ చతుర్దశినాడు "నృసింహ జయంతి ఉత్సవం (ఆవారంలో శనివారం నాడు) ఎంతో వైభవముగా దేవస్థానంవారిచే జరుపబడుచున్నది.

## వల్లూరు శ్రీ వల్లూరమ్మ దేవస్థానం

ప్రకాశం జిల్లాలో ఒంగోలు పట్టణమునకు దక్షిణముగా వల్లూరు గ్రామము ఆంధ్రకేసరి శ్రీ టంగు టూరి ప్రకాశం పంతులుగారి జన్మస్థలము.

సుమారు 275 సం॥ల క్రిందట ఈ గ్రామ ములో జరిగిన ఒకానొక మహాయజ్ఞములో హోమ గుండమునుండి శ్రీ అమ్మవారు ఆవిర్భవించినట్లు ఇచ్చటి స్థల పురాణము వలన తెలియుచున్నది. గ్రామనామముతో శ్రీ అమ్మవారికి జాతీయ రహదారికి పడమటివైపున ఆలయము నిర్మింపబడియున్నది.

ఈ అమ్మవారు భక్తులను విశేషముగా ఆకర్షిం చుచూ. నిత్య విశేష పూజలందుకొనుచు. భక్తుల మనోభీష్టమును నెరవేర్చుచున్న చల్లని తల్లిగా పేరు ప్రఖ్యాతులను పొందుచున్నది. ఎంతో అభివృద్ధిని సాధించుచున్న దేవస్థానమది.

## ఉలవపాడు

శ్రీ వేణా గోపాలస్వామి వారి దేవస్థానం.

ప్రకాశం జిల్లా ఉలవపాడు మండలం ఉలవపాడు గ్రామములోని శ్రీ వేణుగోపాల స్వామివారి దేవా లయము, మద్రాస్, కలకత్తా రైలు మరియు రోడ్డు మార్గమునకు అర కి॥మీ॥ దూరమున నున్నది.

ఈ దేవస్థానమునందు స్వామివారికి వైష్ణవ పాంచరాత్ర ఆగమ ప్రకారము అర్చకత్వము నిత్య పూజలు, పండుగలు ఉత్సవములు జరుపబడుచున్నవి. వైశాఖమాసములో వార్షిక బ్రహ్మోత్సవములు జరుగు చున్నవి.

శ్రీ ఆలయ ఆవరణలో శ్రీ ఆంజనేయ స్వామి వారు శ్రీ లక్ష్మీ అమ్మవారు మరియు ఆండాళ్ళమ్మ తాయార్లు ఉపదేవాలయములున్నవి శ్రీ స్వామివారి ఆలయములో ఆళ్వార్లు ప్రతిష్ఠించబడి యున్నారు.అందువలన ఈ క్షేత్రము ప్రసిద్ధమైన క్షేత్రంగా వెలుగొందుచున్నది. ఈ క్షేత్రమును దర్శించి భక్తులు ఎంతో తృప్తి చెందుచున్నారు.



# నెల్లూరు జిల్లా

## శ్రీ తల్పగిరి రంగనాధస్వామి వారి దేవస్థానం, రంగనాయకులు పేట నెల్లూరు

ఇక్కడ శ్రీ తల్పగిరి రంగనాధ స్వామి వెలసి యున్నారు. నెల్లూరు రైల్వే స్టేషనుకు సుమారు అర కి॥మీ దురములో నున్నది. మద్రాసు విజయవాడ పోవు రైలు మార్గమున కలదు.

ఈ దేవస్థానము సుమారు 800 సం॥ల క్రిందట నిర్మింపబడినదని ప్రతీతి. శ్రీ తల్పగిరి క్షేత్ర మహాత్మ్యము శ్రీ స్కాంద పురాణమునందు ప్రస్థుతింపబడినది. పెన్నానదీతీరమున కశ్యపమహర్షి "పౌండరీకమ"నే గొప్ప యజ్ఞము చేసెను. యాగాంతమున ఏకాదశ దినమున "వప" హెూమము చేసిన పిదప వైకుంఠవాసుడు స్వయముగావచ్చి "వప"ను స్వీకరించి ఏదైనా వరము కోరుకొనమన కశ్యపమహర్షి ఈ క్షేత్రమందు శేషశాయిగా వెలసి శ్రీరంగాది స్వయం వ్యక్త క్షేత్రములపై ఏ ప్రీతియున్నదో ఈ క్షేత్రముపై నను అట్టి ప్రీతి అనుగ్రహింపుమని, యెల్ల వేళల భక్తులకు వైకుంఠవాసుని సాన్నిధ్యము లభించులాగున పినాకినీ తీరమున యజ్ఞవాటికకు అభిముఖముగా దర్శనమొసంగ వలసినదని ప్రార్ధించెను.పిమ్మట క్షీరసాగర శయనుడైన నారాయణుడు శ్రీరంగ నాథునిగ వెలసెను. ఈ క్షేత్రము ఉత్తర శ్రీరంగ క్షేత్రమని ప్రసిద్ధి గాంచినది. ఇచ్చట పాంచరాత్ర ఆగమము మేరకు పూజాదులు జరుగుచున్నవి. పురాణ ప్రసిద్ధిగాంచిన శ్రీరంగ మందలి శ్రీరంగనాథుల వారికి జరుగు కైంకర్యములు, వైభవములు అన్నియు ఇక్కడ పాటింపబడుచున్నవి.

ప్రతి సంవత్సరము మార్చి నెలలో బ్రహ్మోత్సవములు అతి వైభవముగా జరుగును. నెల్లూరు నగరమున మూలపేటలోని శ్రీ మూల స్థానేశ్వరస్వామి. శ్రీకృష్ణధర్మరాజస్వామి శ్రీ వేణుగోపాలస్వామి వార్ల దేవ స్థానములు కూడ ప్రసిద్ధిగాంచినవి.

## జన్నవాడ శ్రీ మల్లిఖార్జున స్వామి కామాక్షితాయి దేవస్థానం.

ఆది దంపతులై, జగన్మాతాపితరులై భక్తుల భావానుగుణ అర్చామూర్తులై, ఆగమశాస్త్రానుగుణముగ పార్వతీ పరమేశ్వరులు వెలసి భక్తులనను గ్రహించుచున్న దివ్య క్షేత్రములలో నెల్లూరుకు సమీపమున

గల "యజ్ఞ వాటిక" జన్నవాడ ప్రసిద్ధ మైనది. బహు పురాతన మైనది. ఈ క్షేత్రము నెల్లూరు రైల్వే స్టేషను నుంచి సుమారు ఆరు కి।మీ దూరములో నున్నది.

శ్రీ మల్లిఖార్జున, కామాక్షీ దేవులు పావన పినాకినీ తీరస్థమగు జన్నవాడ క్షేత్రమున వెలసి యున్నారు. భక్తుల కామితములను అతి సులభముగ దీర్చు కారుణ్య కల్పవల్లి కామాక్షీ దేవి. ఈ క్షేత్రము అతి సుకరముగా దర్శింప వీలైనది.

పావన పినాకినీ నదీ తీరస్థముగా నున్న ఈ మహా తల్లిని సేవించి, భక్తితో తన యెదుట సాష్టాంగ పడిన వారికి ఆపద గడిపి ఆ రాత్రి స్వప్నమున వారి కామ్యసిద్ధిని సూచించు వరప్రదాయిని శ్రీకామాక్షీ దేవి. ఇట్టి మహిమోపేతమగు ఆచారమిక్కడ ప్రసిద్ధి చెంది యున్నది.

19వ శతాబ్ద పుర్వార్థమందు పొందూరు అచ్యుతామాత్యుడు "కామాక్షీ లీలా విలాసము" అను మూడ శ్వాసముల ప్రబంధమును రచించియుండెను. ఈ గ్రంధమున ఈ క్షేత్రమహాత్మ్యము విపులీకరంప బడినది. లోక కళ్యాణార్థమై భూమి నవతరించిన ఆది దంపతులు ఒక సామాన్యుని మూలముగా పునర్వి భవమందుట వారి లీలా విశేషలేశమే కదా!

పూర్వము, ఈశ్వరుడు త్రిపురములను, అందలి రాక్షసులను నిర్మూలించి, దేవ దేవర్షుల కపరిమితానందము కలిగించెను. ఈశ్వరుడు కైలాసము నకు తిరిగి వచ్చు మార్గ మధ్యమున తన పినాకమును మోపెట్టి భూమిపై కొట్టెను. ఈ దెబ్బకు పర్వతము లు అదరగా, ఆబాణము పాతాళము జొచ్చెను. ఆగం టువెంట 'పాతాళగంగ'పై కుబికి ఈశ్వరునకు నమస్క రించి, కొంచెముత్తరముగా సాగి ఆపై మహా వేగముగా తూర్పు దిశగా పయనించి 'ఉత్తర పినాకిని'యని ప్రసిద్ధి పొందెను. ఈ నది ఉత్పత్తి స్థానము నంది సరస్సు. పినాకినీ నది గండికోట కొండలను తొలచుకొని పడమటి కొండలందలి సోమశిల కనుమగుండా ప్రవ హించుచు రాగా, వేదాద్రి (నిగమనగము) ఆనదీ ప్రవాహము నడ్డగించెను. పినాకిని వేదాద్రిని చీల్చుకొని, తూర్పుగా సాగిపోయెను. అట్లా నదిచే వేరు చేయ బడిన నిగమనగము యొక్క ఉత్తర భాగము స్వాదుజల పరిపూర్ణమై ఫల వృక్ష భరితమై, ఎన్నో నరనస్సులు, చిత్ర విచిత్రములైన వృక్షరాజములతో ఎంతో కోలా హలము కలిగి, వసంత శోభలతో, దేవజన విహార ప్రదేశమై ఎంతో రమణీయకతతో అత్యుత్తమ ప్రదేశ ముగానుండెను.

త్రేతాయుగమున కశ్యప ప్రజాపతి లోక కళ్యా ణార్థము యజ్ఞమొకటి చేయ సంకల్పించి స్థల నిర్ణయమునకై కొన్ని ప్రదేశములు తిరిగి కడపట పవిత్ర పినాకినీ తీర్థస్థమగు ఈనిగమోత్తర భాగమును ఇందుకు తగిన ప్రదేశముగా నిర్ణయించుకొనెను.

దేవర్షులు ఋత్విక్కులు కాగా, శాస్త్రోక్తముగా మూడు యజ్ఞవేదికలమర్చెను. దక్షిణాగ్ని, గర్హపత్యము అహవనీయుడు- వీటిని ప్రజ్వరిల్ల చేసి యజ్ఞము చేయనారంభించెను. ఈ యజ్ఞ సంరంభవేడుకలు చూచుటకు, దేవతలు, ముని శ్రేష్ఠులు గంధర్వ కిన్నె రాదులు వేంచేసిరి. యజ్ఞము సాంగోపాంగముగా పరి సమాప్తి గావింపబడినది. దేవతలు తమ హవిర్భాగ ములను గొనిపోయిరి. దేవర్షులు కశ్యపునెంతో అభినం దించి యధేశ్చంజనిరి.

అప్పుడు యజ్ఞవేదిక యందలి ఉత్తర భాగమున నున్న గర్హపత్యాగ్నియందు, అత్యంత తేజస్వియు, లోకమున అత్యంత స్తుతి పాత్రుడును మహా మహి మాన్వితుడునగు శ్రీ మల్లిఖార్జునుడు ద్భవించెను. దక్షిణ వేదియందలి దక్షిణాగ్నియందు, దట్టమగు కేసరములు, తెల్లని దంష్ట్రాంకురములు కలిగి ప్రళయ కాలాగ్నివలె ఎఱ్ఱని నాలుక బింబోష్ఠమున ఇమిడ్చి, శంఖ చక్రాద్యాయుధములు కలిగి, మెడలో లలిత

వనమాలికాది దివ్య భూషణములు వెలయ, దివ్య ముఖ కాంతులొలయ శ్రీనరసింహ దేవుడుద్భ వించెను. అహవనీ యాగ్నియందు బంగారు వస్త్ర ములు ధరించి, నవరత్న కిరీటకాంతులు వెలుగొందు నాల్గు భుజముల శంఖు, చక్రాద్యాయుధములు కలిగి, వనమాలిక కౌస్తుభమణి ప్రకాశింప, శేషశయనుడైన శ్రీరంగనాధుడుద్భవించెను. అంత ఆకాశమున పుష్ప వర్షము కురిసెను. గంధర్వ కిన్నెరాదులు సంగీతోత్స వములు నెరపిరి. మహర్షులు వేద మంత్రములతో స్తుతియించిరి.

ఇట్లు అత్యంత వైభవోపేతముగ, వేదఘోష లనడుమ యజ్ఞము నిర్వహింపబడిన ప్రదేశమే, యజ్ఞ వాటికయయ్యెను. దీనినే 'జన్నవాడ'యని వ్యవ హింతురు.

నిర్విఘ్నముగా యజ్ఞసమాప్తిచే కశ్యపుడు తృప్తి చెంది, పిదప బ్రహ్మ లోకమునకేగి, ఆ వృత్తాంతము బ్రహ్మదేవున కెరింగించెను. బ్రహ్మయు ఎంతయో సంతసించి, సపరివారముగ నిగమనగమునకు వచ్చి శ్రీ మల్లిఖార్జునుని దర్శించి చేతులు జోడించి, భక్తి పురస్సరముగా ప్రార్థించెను. పిదప నాదివ్యావతారునకు పాదాభివందనము చేసెను. దక్షి ణాగ్నియందుద్భ వించిన శ్రీ నృసింహుని, ప్రాద్వేదిక యందుద్భ వించిన శ్రీరంగనాథుని సేవించి భక్తితో స్తుతియించె ను.

చతుర్ముఖుడిట్లా దివ్యావతారులనుస్తుతియిం చి తదాజ్ఞ బడసి సపరి వారముగా తనలోకమున కేగెను.

కైలాసమునమున్న పార్వతి తన భర్త తిరిగి రానందున చింతించి సఖీ జనము వెంటరాగా మేరు పర్వత సానువులు, గుహలు, అడవులు, నదులు, వెదకి వెదకి యెందునూ గానకపోయెను. ఒంటరియై నదీనదములు వనములు వెదకుచు వచ్చి యజ్ఞవాటి కభ్యంతర వనములో ప్రవేశించెను.

శ్రీ మల్లిఖార్జునుడు పార్వతీ దేవిరాక తెలిసికొని తనకు తెలియనట్లుగానే సుమంత్రుని బిల్చి యామె ను తనకు కూర్చుమని పంపెను. పార్వతీ దేవియూ స్వామి యిటనుండుట తెలిసికొని హర్షాతిరేకము నొందెను.

పిదప, దేవతల జయజయధ్వానముల నడుమ, సహస్ర సఖీజన సేవితయై చనుదెంచిన దేవేరిని అల్లంత దూరమున చూచి తన పీఠము దిగి యెదురుగా జని చంద్ర కళాభిరాముడైన శ్రీ మల్లిఖార్జునుడు పార్వతి కేలూని ఆత్మ మందిరమునకు తోడ్కొని వచ్చెను.

దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. ఈ పుణ్య లగ్నమునకే ఇప్పటికి ప్రతి వర్షము జన్నవాడయందు ఆది దంపతుల కళ్యాణోత్సవము అత్యంత వైభవోపే తముగ జరుగుచున్నది.

అపుడు మల్లిఖార్జునుడు ప్రేమతో "దేవీ! బ్రహ్మణ్యుడగు కశ్యపుని యజ్ఞమును జూచుటకు వచ్చి నేను నరసింహ దేవుడును సర్వదా ఇచ్చట వసించి యున్నాము. నిన్ను విడచి వచ్చుట తప్పుగా తలచకుము. వంటరిగా నుండుట నాకును బాధా కరముగ నుండెడిది. ఇప్పటికిట్లు నీ సంయోగవశమున కృతార్థుడనైతిని శాంతమును, సంతోషమునగు సుఖము కలిగెను." అని ప్రియ వచనములు పలికి ఆమెను ప్రశాంత చిత్తని గావించెను. మరియు నిట్లనెను " నేను పూర్వ దేశ పరిత్యాగమును కోరుకొనుటలేదు.కావున నీవు నా అర్థాంగిగా నిచ్చటనివసింపుము" అని కోరెను.

తదనంతరము పార్వతీ దేవి. కామాక్షి దేవిగ, మణి విరాజితమగు విమాన రాజమున ప్రవేశించి, కామ దాయనియగుచు, మహా మహిమాన్వితముగా వెలయు చున్నది.

ఈ కామాక్షి దేవి భక్త పరాధీనతను ప్రభావ మును తెలసికొనుట గొప్ప ఆధ్యాత్మిక లాభము నవచ్చును.

దేవేంద్రుడు ఒకప్పుడు, వృషపర్వుడను రాక్షసుని చేతిలో ఓడిపోయి మరుద్గణము సిద్ధగంధర్వాదులతో సకుటుంబముగా రాజ్యమును వీడి, హిమవత్పర్వత ప్రాంతమున కాందిశీకుడై తిరుగుచుండెను. ఆ మార్గమున వెళ్ళుచున్న మహాత్ములు యజ్ఞవాటిక యందు వెలసిన కామాక్షీదేవి భక్తుల కామితము తీడేర్చుచున్నదని, ఆదేవీ సందర్శనమే మహాఫల ప్రదమనుచు చెప్పుకొనుచు పోవుచుండుట విని ఇంద్రుడు వారిని ఆపి, అమృతోపమానములగు ఆదేవీ విశేషములు సవిస్తరముగా తెలిసికొని, కామితార్థ ప్రదాయిని అగు కామాక్షిని దర్శింపవెడలెను. అట్లు వెళ్ళి, పినాకిని నదియందు స్నానమాచరించి విశ్వకర్మ నిర్మితమగు మల్లిఖార్జునుని విమాన రాజమును చూచి, ప్రకారగోపురములను దాటి, మహా సంతోషమున నందీశ్వరుని జూచి తన పరిస్థితి సవిస్తరముగ తెలిపెను. పిదప ముకిళిత హస్తుడై శ్రీ మల్లిఖార్జున దేవునకు సాష్టాంగపడి లేవకుండెను. అప్పుడు ఈశ్వరుడు దేవేంద్రునితో 'దివిజాధిపా ! నా ప్రాణ నాయిక కామదాయిని కామాక్షి నీ అభీష్టమును దీర్చును. తిరిగి నీ పదవిని పొందగలవు" అని చెప్పెను. పిమ్మట ఇంద్రుడు కామాక్షి దేవిని దర్శించి, అనల్ప భక్తి సంభ్రమముల స్తుతియించెను. శ్రీ కామాక్షీదేవి సురపతి దీనాలాపములు అవలోకించి "నీ ఆపద అంతమొదు సమయ మాసన్నమైనది. తిరిగి నీవు యుద్ధము చేయుము. ఆ యుద్ధమున నన్ను నీ మది స్మరింపుము శత్రునాశనమగునని నీకు సంతోషము కలుగును" అని ఇంద్రుని ఓదార్చెను, ఇంద్రుడు శ్రీ కామాక్షీ దేవిని ప్రస్తుతించుచు తన లోకమును జనెను.

పిదప వృషపర్వుని యుద్ధమునకు ఆహ్వానించి వానితో యుద్ధము చేసి విజయుడయ్యెను. శ్రీ కామాక్షి కటాక్షమున తిరిగి తన లోకమును పొందెను. మహర్షులందరూ ఆమె నిరవధిక కరుణాళుత్వమున కబ్బురపడి ఆమెను పలు విధముల ప్రస్తుతించిరి. చండకోపనుడగు దుర్వాస మహర్షి భూమండలమున గల సకల పుణ్య క్షేత్రములు దర్శించుచూ ఈ యజ్ఞవాటిక కరుదెంచి శ్రీ మల్లిఖార్జునుని దర్శించి కామాక్షీ దేవిని చూచి, భూ స్థలిని దాజనిన దేవాయితనముల దేవులు తననెదుర్కొని భక్తింప్రశంసించిరి. కానీ ఈ కామాక్షి దేవి యట్లు చేయనందుకు కోపించి "ఇకనిటువలె నీకు సమర్చనములు, సదుత్సవములు నుండకపోవుగాక" యని శపించెను.

అపుడు కామాక్షిదేవి "మునీంద్రోత్తమా! సకల దేవతాసమితి యందు నీ మహిమ గొప్పది. కాని నిన్ను నేను ఎదుర్కొనందుకు కారణము చర్చింపక శపించితివి ప్రతిశాపమియ్య గలిగియు పెద్దల యందలి భక్తి పెంపున నట్లు జేయతలపెట్టలేదు. కలియుగము ప్రారంభమగుచున్నది. అంతదనుక కించిత్కాలము ఓపికతో నీ శాపమునకు బద్ధురాలునగుదును" అని చెప్పి మిన్నకుండెను. దుర్వాసుడు మునిపుంగవులతో వెడలిపోయెను. కామాక్షీ దేవియు ఆశాపము గుర్తించి వేయి సంవత్సరములు భూమి యందవతరించలేదు.

కలియుగారంభమాదిగా ఇయ్యాది శక్తికి, మేదిని యందు తమ ఇచ్చకు వచ్చినట్లు పూజా మహోత్సవములు క్రమముగ జరుగుచున్నవి.

దేవర్షులు ప్రతిష్ఠించిన కళ్యాణమూర్తికే నేటికిని అర్చనలు జరుగుచున్నవి. పగటివేళల సేవించువారి సౌకర్యమునకై, మహర్షులు రాత్రివేళల యోగ మార్గమున ఈ దేవిని పూజించి వెడలుచుండిరి.

నియమముగ తన్ను ప్రతి శుక్రవారము పూజించు నాజ్ఞ పెట్టి, ఆ దినమున ప్రత్యక్షమగుదునని పెనుబల్లి వాసియగు ఒక భక్త వరునను గ్రహించెను. అతని భక్తి ప్రబలమై, నిస్పృహతో తన ఇంటనే దేవిని పూజించి, జన్నవాడయందు వలే దేవీ సాక్షాత్కారము పొందుచుండెను. కాలవశమున ఒక నాడట్లు జరుగలేదు. అతడు జగన్మాత దర్శనము కానందుకు

చితించి, అకారణముగా దర్శనమీయ తప్పితివని ఐదువందల సంవత్సరములు పూజాపునస్కారములు లేక యుండుమని శపించెను. ఆ మహాత్ముని వాక్కు తప్పిపోలేదు. ఆ శాప వశమున నిస్తేజముగానుండు కాలమున యొకప్పుడు పినాకినీ నది పొంగిపొరలి యజ్ఞవాటికా ప్రదేశమున, దేవాయతనముతో పాటు ఇసుకమేట పెట్టిపోయెను. కొంత కాలమునకు ఆ పరిసర ప్రాంతయాదవులు ఆ ఇసుక తిన్నెలపై ఒక చోట త్రవ్వగా, నీరూరుటయు, అదియే తమకుల దేవత గంగమ్మగా భావించి, శిలనొకదానిని నెలకొల్పి పూజించుచుండిరి.

మరి కొంత కాలము గడవగా శ్రీ కామాక్షీదేవి, పరశు రామాశ్రమ వాసియు నిరతోపాసకుడగు రామచంద్రునావహించి తన క్షేత్రముద్ధరింప ప్రోత్సహించెను. ఆయన ఆ ప్రదేశమును విచారించి పెద్దల వలన తెలిసికొని, యజ్ఞ వాటికకు వచ్చి కొంత కాలమిచ్చటనే దేవినుపాసించుచు గడిపెను.

తదుపరి, ఇచ్చటి పెద్దలతో సంప్రదించి, చూచాయగా దేవాయతన ప్రదేశమును గుర్తించి, వెలికి తీయుటకు ప్రయత్నింపగా యాదవులు తన దేవతను త్రవ్వి తీయరాదనియు తమ కాపదలు కలుగునని ఆటంకపరచిరి. వారిని తగురీతిని సమాధాన పరచి, ప్రయత్నము విడువక, ఆ ఇసుక దిబ్బలను త్రవ్వింపగా ముందు గోపురము, ఆపై న్కొటొక్కటిగా దేవాయుతనమంతయు బయులు పడెను. శ్రీ కామాక్షీ మల్లికార్జునులుతో పాటు దేవాయతనమున గంగమ్మనుకూడా ప్రతిష్ఠింపజేసి యాదవులను తృప్తిపరచిరి.

పునరుద్ధారణకై పంపబడిన శ్రీ రామచంద్ర యోగి ఇచ్చటనే నిల్చిపోయి స్వాముల కైంకర్యాదుల కంకితమయ్యెను. అర్చకులను, మరికొందరు భూస్వాములను చేరదీసి శ్రీ దేవీ మహిమాతిశయములను సన్యసించి, వారిచే కొంత భూదానమిప్పించెను.

పల్లవరాజులు ఈ క్షేత్ర దర్శనమునకు రాగా వారికి దేవీ తత్త్వోపదేశము చేసి వారిని మెప్పించి వారివలన ఈ దేవులకు సర్వపూజా కైంకర్యములకు కావలసినంత విస్తార భూ ఖండములనిప్పించెను.

అప్పటినుండియు శ్రీ కామాక్షి దేవి భక్తితో తనను సేవించువారికి అభీష్ట సంసిద్ధియు నిరుపద్రవ ఆయురారోగ్య అఖండైశ్వర్యముల నిచ్చుచున్నది. సంతానాసక్తులు, ద్రవ్యాసక్తులు, విద్యాకాములు, తత్వ జ్ఞానాసక్తులు ఈ యజ్ఞ పురమునకు వచ్చుచు పవిత్ర పినాకిని నదియందు గల వేద్రాద్రి ఘట్టమున స్నానమాచరించి శ్రీ కామాక్షి దేవిని పూజించి ఇష్ట కార్యములు పొందుచున్నారు.

పినాకిని వ్రణవినాశనిగా పేరొందుచున్నది. పినాకిని జలములు, శ్రీ కామాక్షి సేవనములు వ్యాధి గ్రస్తులను స్వస్థత పరచుచున్నవి.

ఒకప్పుడు అశ్వత్థామ కుష్ఠురోగ పీడితుడై పావన పినాకినీ స్నానమును శ్రీకామాక్షి సంసేవనమును నిర్విఘ్నముగా జరిపి రోగవిముక్తుడయ్యెను. ఆ స్నాన ఘట్టమునేటికిని 'అశ్వత్థామ ఘట్టము'గా కీర్తించబడుచున్నది. శ్రీఆదిశంకరుల వారు ఈ క్షేత్రమును సందర్శించి, శ్రీచక్రమును పునరుద్ధానముగావించి, శాంత మూర్తియు మహా ప్రభావ సంపన్నముగా ప్రతిష్ఠాపన గావించిరి. కాంచీపుర పండితులనురప్పించి ఆగమ శాస్త్రానుగుణంగా పూజాదికములు నిర్వర్తింప జేసిరి. వారి వంశీయులే నేటికినీ పరంపరగా, దేవీ పూజాదికములు నిర్వర్తించుచున్నారు.

పశ్చిమ చాళుక్య 'బజ్జన ప్రభువు', కోశాధికారి బండారు బసవేశ్వరుడు వీర శైవ మతమును క్రీ.శ. 1150లో స్థాపించెను. ఆంధ్రలో పండితత్రయము మల్లిఖార్జున, శ్రీపతి, శిలవెంకముల వలన శైవ మతము పుంజుకొనిన పిదప జన్నవాడ మై లూరు వీర భటులకు రంగ స్థలముగా యున్నట్లు సాక్షిగా ఇచ్చట "గండ

కత్తిర స్వామి" గుడియున్నది. పదమూడవ శతాబ్దమున కవిబ్రహ్మ తిక్కన ఈ క్షేత్రమునందు విధి విధానముగా యజ్ఞము చేసి భారత రచన దీక్షా విధిన సాగించిరి.

బ్రహ్మండ, వాయు, కూర్మ పురాణములు, భారతాది ఇతిహాసము యందు వర్ణించిన "సుప్ర యోగ" నదిని ప్రస్తుతము పినాకిని, పెన్నయని చెప్పు చున్నారు బ్రహ్మండ పురాణంతర్గతమందు పినాకినీ మహాత్మ్యమును గూర్చి విపులముగా వర్ణింపబడి యున్నది. పినాకినిని సర్వపాపహరిణి సర్వవ్రణ నాశని, సర్వరోగ నివారిణిగా చెప్పియున్నది.

సూర్యుడు మకర రాశిని పొందునపుడు "గంగ" ఈ నదియందు అయిదు దినములు నివశించును. కాన అప్పుడు ఈ నది యందు స్నానము చేసినవారికి గంగా స్నాన ఫలితము కలుగును.

ఈ నాడు శ్రీ కామాక్షీ తాయి అనుగ్రహమున ఈ తీర్థ క్షేత్ర ప్రభావము వలన సంతాన ప్రాప్తి, దీర్ఘ రోగ నివారణ గ్రహ బాధ నివృత్తి పొందుట ప్రత్యక్ష నిదర్శనములుగా నున్నవి.

## శ్రీ పెనుశిల లక్ష్మీ నరసింహ స్వామి వారి దేవస్థానము పెంచెలకోన – నెల్లూరు జిల్లా.

నెల్లూరు సుమారు 50 కి.మీ. దూరములో శ్రీ పెనుశిల లక్ష్మీనరసింహ స్వామి వేంచేసియున్న పెంచలకోన క్షేత్రము కలదు. గూడూరు రైల్వే స్టేషనుకు సుమారు 40 కి.మీ. దూరమున నున్నది.

ఈ క్షేత్రము గోనుపల్లి అను గ్రామమునకు సుమారు 6 కి.మీ.దూరమున దక్షిణాన కలదు. చుట్టూ కొండలు, అడవితో ప్రకృతి రమణీయకతతో ఈ క్షేత్రము అత్యంత దర్శనీయముగ నున్నది.

ఈ క్షేత్రమున శ్రీ పెనుశిల లక్ష్మీ నృసింహ స్వామి వారు వెలసియున్నారు. ఈ స్వామి వారు "స్వయంభు" పెనుశిలయనగా పెద్దశిల (కొండ) అనియు పెనవేసుకొన్నందున పెనుశిల అనియు అందురు. వీరు, నవనారసింహులలో ఒకరై ఉన్నారు. శ్రీ స్వామి వారి క్షేత్రమునందు జనులు, మృగములు, పక్షులు సహితము సోదర భావముతో నుండునని ప్రతీతి. అట్లు సంచరించని వారికి కష్ట నష్టములు జరుగుట ఈ నాటికి అచ్చట కలదు. ఇది సాదృశ్యము.

ఈ ప్రాంతమున శ్రీ కణ్వ మహర్షి నివశించు టచే కణ్వ మహర్షి ఆశ్రమమనియు, ఇచ్చట ప్రవ హించుటచే కణ్వనదియనియు, క్రమేణా కండ్లేరుగా మారినదనియు జనశృతి గలదు.

ఈ స్వామి వారి కోనలో భక్తులకు ఏలాటి భయములు లేవు. ఇప్పుడు స్వామి వారికి వైభవముగా నిత్య పూజలు జరుగుచున్నవి. ఈయన భక్తుల పాలిటి పెన్నిధి అనియు సంతానహీనులకు సంతాన మును, ఐశ్వర్యము, ఆరోగ్యము ప్రసాదించు ఆప ద్బాంధవునిగా ప్రజలనమ్మిక.

స్వామి వారికి వైశాఖ మాసములో బ్రహ్మోత్స వములు జరుగును. లక్షలాది ప్రజలు వచ్చి బ్రహ్మో త్సవము ఐదు రోజులు దైవ దర్శనము చేసికొని ఆనందోత్సాహములతో తిరిగి వెళ్ళుచున్నారు.

ఈ క్షేత్రమిపుడెంతో అభివృద్ధిని సాధిస్తూ ప్రథమ శ్రేణి దేవాలయముగ ఈ జిల్లాలో ప్రసిద్ధి చెందుచున్నది.

శ్రీ స్వామి వారికి మాగాణి భూవసతి కలదు.



# చిత్తూరు జిల్లా

మన పుణ్యభూమిపై ఎన్నోకోట్ల పాదాలు నడయాడినవి. ఎందరో మహానుభావుల పాదధూళి మన తెలుగు గడ్డను పునీతం చేసినది. ఎందరో భక్తులు, ఎందరో మహర్షులు, ఎందరో చక్రవర్తులు, ఎందరో కవులు, ఎన్నో శాసనాలు, ఎన్నో పురాణాలు ఎన్నో ఇతిహాసాలు, ఇన్నో కీర్తనలు, ఎన్నో చరిత్రలు, ఎన్నో కావ్యాలు, ఎన్నో నివేదనలు ఎన్నో ఆలయాలు, ఎన్నో చరిత్రలు.

చిత్తూరు జిల్లాకు ఎంతో చరిత్ర ఉన్నది. చిత్తూరు జిల్లాలో సువర్ణముఖినది పరమ పవిత్ర మైనది. ఈ నదిని స్వర్ణముఖి అని కూడా పిలుస్తారు.

సువర్ణముఖినది పుట్టుక పురాణ ప్రసిద్ధి చెందినది.

వ్యాసోక్త పురాణములని ప్రసిద్ధిగాంచిన, వేద వ్యాస మహర్షులచే రచింపబడినవని భావింపబడు తున్న అష్టాదశ పురాణములలో అనేకము సువర్ణ ముఖీ నది పాశస్త్యాన్ని వివరిస్తున్నవి.

వరాహ పురాణం, స్కాంద పురాణం, భవిష్యోత్తర పురాణం ఈ నదీమ తల్లిని గూర్చి ముచ్చటించినవి. ప్రాచీన తమిళ వాఙ్మయమునందలి భాషా లక్షణ గ్రంథమైన "తొల్కాప్పియమ్" నందు ఈ జిల్లాలోని ప్రసిద్ధి చెందిన "వేంకటాచల" ప్రస్తావన కలదు. అంతే కాక ఈ ప్రాంత ప్రస్తావన "శిలప్పాధి కారం" అను తమిళ కావ్యంలో నున్నది.

పన్నిద్దరు ఆళ్వారులు ఈ క్షేత్రములయందు నడయాడి, పాడిన దివ్య కీర్తనలన్నీ "నాలాయిర ప్రభంధ" మందున్నవి.

ధర్మకీర్తియను బౌద్ధ వేదాంతి, వ్యాకరణ కర్త యీ ప్రాంతంలో పుట్టడం వలన ఇది బౌద్ధులకు కూడా, యాత్రా స్థలముగ ప్రసిద్ధికెక్కినది.

108 పవిత్ర విష్ణుక్షేత్రాలు - 108 దివ్యతిరుపతులన్న పేరుతో ఈ జిల్లాలోని తిరుపతి పేరు మీదుగానే చలామణి అవుతున్నవి.

ప్రసిద్ధ తెలుగు పూర్వకవులు ఎఱ్ఱాప్రగ్గడ, జక్కన, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి మొదలగువారు తమ కావ్యాలలో ఈ పుణ్య భూమిని కొనియాడిరి.

ఆంధ్ర వాగ్గేయకారులు శ్రీ తాళ్ళపాక అన్న మాచార్య, శ్రీ క్షేత్రయ్య, శ్రీకాకర్లచే యీ పుణ్య ధామం కీర్తించబడినది.

కన్నడ వాగ్గేయకారుడు శ్రీ పురందరదాసుచే కూడా ఇచ్చటి దివ్య రూపుడు కీర్తింపబడినాడు.

ఈ దివ్య ప్రదేశాన్ని గూర్చి ప్రసిద్ధ యోగిని, రచయిత్రి తరిగొండ వెంకమాంబ అనేక గ్రంథాలు వ్రాసి ప్రసిద్ధ భక్తురాలు అయినది.

గుడి మల్లంలోని శ్రీ పరశురామేశ్వరుని, తిరుచానూరు సమీపాన ఉన్న యోగి మల్లవరంలోని శ్రీ తిప్పలాధీశ్వరుడు మహాదేవుని, శ్రీ కాళహస్తిలోని శ్రీ కాళహస్తీశ్వర స్వామిని, తొండవాడలోని శ్రీ అగస్త్యేశ్వర స్వామిని, ఇంకను ఎన్నో శైవ క్షేత్రాలను సందర్శించి వాసికెక్కిన అరవైమొగ్గురు నాయనార్లలో అప్పరర్, సుందరర్, మాణిక్యవాచకర్, తిరుజ్ఞాన సంబందరర్, తిరునావుక్కరసు, భక్తకన్నప్ప ముఖ్యులు. వీరి చరిత్రలు పెరియ పురాణమునందున్నవి.

తిరువయ్యూరులో జన్మించిన గురు శిష్య పరంపర - వాగ్గేయ కారుల త్రయము శ్రీ త్యాగ రాజస్వామి, శ్రీ ముత్తు స్వామి దీక్షితర్, శ్రీ శ్యామ శాస్త్రి తిరుమలేశుని తమ కీర్తనలలో స్తుతించారు. ఇది ఆంధ్ర శాతవాహన చక్రవర్తుల మెట్టినిల్లు, పల్లవరాజుల పుట్టినిల్లు. చోళ చక్రవర్తుల ఆత్మగృహము. పాండ్య రాజుల పుణ్యధామము, విజయనగర చక్రవర్తుల విశాల హృదయము.

మహమ్మదీయ మంత్రి లాలాముఖరాం, తల్లి మోహనదీతో, భార్య పీతాబీబీతో తిరుమల రాయని మండపం నుంచి శ్రీ వేంకటేశ్వరుని మ్రొక్కు తుండే వారు. లాలాముఖరాం అంటే 'తోడర మల్లు'.

రాయచోటి ప్రభువు మల్లకుమార అనంత రాజు, శ్రీ గోవించరాజ స్వామి రాజ గోపురము, అలిపిరికెగువనున్న గాలిగోపురము, తిరుమల సోపాన మార్గము కట్టించిన దైవ ప్రేరితుడీయన. ఈతని జీవితమెంతో ధన్యమైనది. శ్రీ కృష్ణ దేవరాయలను చరిత్ర ప్రసిద్ధుని చేసిన తిమ్మరుసు మహామంత్రి పుట్టినది ఈ జిల్లాలోని చంద్రగిరిలో. తెనాలి రామ కృష్ణ కవి తన చివరి రోజులను ఇచ్చటనే గడిపినాడు. శ్రీకాళహస్తి వాసుడైన ధూర్జటి శ్రీకాళహస్తిమహా త్మ్యము వ్రాసి వాసికెక్కినాడు.

హిందూ ధర్మ రక్షణకు పాటుపడిన విజయ నగర సామ్రాజ్య చక్రవర్తులు పేరుగాంచినది స్వర్ణ ముఖీ సీమలోనే.

శ్రీ రాఘవేంద్ర స్వామి జననీ జనకులు, శ్రీ సొరకాయ స్వామి, శ్రీ మళయాళ స్వామి సువర్ణ ముఖీ నది వల్ల పునీతులై, ఎందరినో పునీతులను చేసారు.

శ్రీ రామానుజాచార్యులు విశిష్టాద్వైత మతాన్ని పదిమందికి కరతలా మలకం చేసిన మహనీయుడు. ఆ మహనీయుడే తిరుపతి పట్టణ స్థాపకుడు. శ్రీ గోవిందరాజస్వామిని తిరుపతిలో ప్రతిష్ఠ చేసిన పుణ్య పురుషుడు.

ఆళ్వారు చెరువును త్రవ్వించిన అనంతా చార్యులు, హత్తీరాంజీ మహంత్ ఆయన శిష్యపరంపర మహంతులు, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి. వీరంతా తిరుమల చరిత్రకు దోహదం చేసిన మహ నీయులే.

ఈ జిల్లాలో గొప్ప శైవ క్షేత్రము, విశ్వ విఖ్యాత వైష్ణవ క్షేత్రము ఉండుట దైవ నిర్ణయముగా కన్పట్టు చున్నది.

## శ్రీ కాళహస్తి క్షేత్రము

శ్రీ కాళహస్తి క్షేత్రము చిత్తూరు జిల్లాలోనున్న గొప్ప శైవ క్షేత్రము. ఈ క్షేత్రము ఎంతో పురాతన మైనది. భారతదేశ పుణ్య క్షేత్రములలో పేరెన్నికగన్న పవిత్ర క్షేత్రములలో నొకటి. స్కాంద పురాణ ప్రసిద్ధమైన ఈ క్షేత్రము, మహర్షుల కాలవాలమై

పవిత్ర స్వర్ణముఖీ నదీతీరమునగల గొప్ప జనప్రియమైన క్షేత్రము. కలియుగ వైకుంఠముగ ప్రసిద్ధి చెందిన తిరుపతి క్షేత్రమునకు సుమారు 40 కి.మీ. దూరమునన్నది. ఇచ్చటకు యాత్రికులు వచ్చుటకు బస్సు మార్గము, రైలు మార్గములు కలవు. రేణిగుంట నుండి గూడూరునకు పోవుదారిలో నున్నది.

స్కాంద పురాణములో శ్రీ కాళహస్తి క్షేత్రమును గూర్చి విశదీకరించబడినది. శ్రీ (సాలెపురుగు) కాళ (సర్పము) హస్తి (ఏనుగు) అను మూడును తమ తమ శక్తి ననుసరించి ఎంతో భక్తి ప్రపత్తులతో పరమ శివుని పూజించి పరమ పదము సాధించినదిక్కడనే. అందువలన ఈ క్షేత్రమును శ్రీ కాళహస్తియను ప్రసిద్ధ నామమేర్పడినదని ప్రతీతి.

శ్రీ కాళహస్తి క్షేత్రము పెక్కు తీర్థములకు కూడలిగా నున్నది. ఈ క్షేత్రము దక్షిణ కైలాసమను పేర ప్రసిద్ధి చెంది, పశ్చాత్తప్తులై భక్తులైన, ఎందరినో పాప విముక్తులను చేసి (వారి పాపములను పోగొట్టి) సద్గతి ప్రసాదించిన, మహాశైవ సిద్ధ క్షేత్రము. ఈ క్షేత్ర ప్రభావము, శివ రహస్య ఖండమను (స్కాంద పురాణాంతర్గతమైనది) భాగమునుండి గ్రహింప బడినది.

భక్త సులభుడు పరమశివుడు అని సహేతుకముగ ప్రత్యక్ష నిదర్శనములతో నిరూపించు మహా శైవక్షేత్రమే శ్రీకాళహస్తి.

శ్రీకాళహస్తి యందలి శివలింగము వాయు లింగముగా ఖ్యాతి చెందినది. పరమేశ్వరుడు పంచ భూతమయమైన తన దివ్య తేజమును శివకంచిలో పృథ్వీలింగముగను, జంబుకేశ్వరమున జలలింగముగను, అరుణాచలమున జ్యోతిర్లింగముగను, శ్రీ కాళ హస్తియందు వాయులింగముగను, చిదంబరమున ఆకాశలింగముగను వెలయించినట్లు ఈ పంచ మహా క్షేత్రముల యందు నిదర్శనములున్నవి.

మహా మహిమాన్వితమైన శైవ క్షేత్రములలో దక్షిణ కైలాసముగ ప్రసిద్ధిగన్న శ్రీ కాళహస్తి క్షేత్ర స్మరణ మాత్రముననే పాపములన్నియు నశించుననియు ఈ క్షేత్రములో నెల్లప్పుడు గరుడుడు, మునులు, సాధ్యులు, విశ్వదేవులు, మరుద్గణములు మున్నగువారు పరమ శివుని సేవించు చుందురనియు, అందువలన ఈ క్షేత్రమున తపస్సు చేసినవారికి శ్రీఘ్రముగ సిద్ధి కులుగునని "రోమస మహర్షి" ఈ క్షేత్రమహాత్మ్యమిట్టిదని భరద్వాజ మహర్షికి చెప్పెనని ఈ క్షేత్రమహాత్మ్యమున కలదు.

శ్రీ కాళహస్తి క్షేత్రము అనేక పుణ్య తీర్థములకు నిలయమై వాంచితార్థ ప్రదాయకమై వెలుగొందుచున్నది. ఇచ్చట శివుడు భక్తులననుగ్రహించుటకై చిద్రూపిణియగు శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా సమేతుడై శ్రీ కాళ హస్తీశ్వరుడను పేర ప్రసిద్ధికెక్కియున్నాడు.

ఈ క్షేత్రము కృతయుగమున బ్రహ్మపురమనియు త్రేతాయుగమున విష్ణుపురమనియు, కలియుగమున వరగునాపురమనియు పేరొందుచున్నది.

అన్ని యుగముల యందు ఈ క్షేత్రము శ్రీ కాళహస్తియని వ్యవహరింపబడుచున్నది. కృత యుగమున బంగారు వర్ణముగను త్రేతాయుగమున వెండి వర్ణముగను ద్వాపర యుగమున లోహ వర్ణముగను కలియుగమున శిలారూపముగను పేరొందుచున్నది. ఇట్లు ప్రతీయుగమున ఈ లింగము యొక్క రంగు మారుచున్నది. ఇచ్చటి కొన్ని లింగములు, తీర్థములు, కలియుగమున పుణ్యాత్ములకే అగుపడునని పెద్దలు చెప్పుచున్నారు.

ఈ మహా క్షేత్రము భాస్కర క్షేత్రమని పెద్దలు కొనియాడుటకు కారణమున్నది.

అత్యున్నతమై, ప్రసిద్ధమై, అకృత్రిమమైన శివలింగముతో నొప్పి యున్న క్షేత్రమున పరమ

శివుడు పాదమాత్ర సాన్నిధ్యము చేయును. ముందు చెప్పిన లక్షణములతో నొప్పి హరి, బ్రహ్మేంద్రాదులచే పూజింపబడిన శివలింగముగల క్షేత్రమున సదాశివుడర్థ సాన్నిధ్యముచేయును. పుణ్య శైలోత్పన్నమై, పుణ్యనదులతో నొప్పి ఉభయ తీరముల యందు శివ, కేశవ క్షేత్రములతో విరాజిల్లుచూ, ఉత్పత్తి స్థలము మొదలుకొని సముద్ర పర్యంతము ఒక్క పేరుతో నొప్పి అవిఛ్ఛిన్నమగు ప్రవాహముతో నొప్పారి సముద్రగామినియై అచ్చటచ్చట పుణ్య తీర్థములతో పెంపెసలాడు నదీమతల్లికయున్న క్షేత్రమున శివుడు త్రిపాద సాన్నిధ్యము చేయును. లోక ప్రసిద్ధమై, సమస్త దేవ, ఋష్యాదివందితమై అనేక పుణ్య తీర్థములతో నొప్పి నానావిధములగు గైరికాది దాతువులతో విచిత్రమగు చిద్గుహచే ప్రకాశించుచూ, దర్శన, స్మరణాదులచే పాపసంహారకమగు పర్వతము, పరమశివునకు సమిష్ఠిదేహము. అచ్చట పరమేశ్వరుడు సంపూర్ణ సాన్నిధ్యమును చేయును. ఇట్టి లక్షణములు గల క్షేత్రమునకు భాస్కర క్షేత్ర మని పెద్దలు చెప్పుచున్నారు. ఇది మన దేశములోని మహా క్షేత్రముల న్నిటికంటే మహిమాన్వితమైనదీ కారణమువలననే. అందువలన సర్వలోక ప్రసిద్ధమైనది. బహు అరుదైన క్షేత్రము, శ్రీ కాళహస్తి. భక్తులు ఉత్తర వాహినియై స్వర్ణముఖీ నది తూర్పుతీరమున గల శ్రీమద్దక్షిణ కైలాసమను ఈ పుణ్య క్షేత్రమునగల పరమ శివుని, సేవించి ధన్యులైనారు.

శ్రీ కాళహస్తీశ్వరాలయమున లింగమునకు కుడి భాగమునందలి జ్యోతిర్ద్వయము వాయు సంచాలనమును నేటికినీ సూచించుచునేయున్నది, ఇచ్చటి లింగము వాయులింగమని, ఈ దివ్య జ్యోతులు చలించుటకు ఏ శాస్త్రవేత్త యే కారణము ఊహించుచున్నను హైందవ సంస్కృతికాధారమైన భక్తి మానవ హృదయముల నాటుకొనుటకే యీ నిదర్శనములని చెప్పక తప్పదు.

సహస్ర శిరములు గల, ప్రసిద్ధి చెందిన కైలాసమునుండి శివానందైక నిలయమనునొక శిఖరమును చతుర్ముఖ బ్రహ్మ తెచ్చి యిచ్చట పరమేశ్వరుడు నివసించుటకై ఉంచెనని ఇది లోకానుగ్రహార్థము జరిపెనని ఆర్యులు చెప్పుచున్నారు.

"భూమౌదక్షిణ కైలాసే ప్రవేశాన్ముక్త యే వశః" అను ప్రమాణము ననుసరించి ఈ స్థలమున నివసించే ప్రాణులకు ముక్తి కరతలామలకమనియు "కాశ్యాస్తు మరణాన్ముక్తిః" అను ప్రమాణము ననుసరించి కాశ్యాది పుణ్య క్షేత్రముల యందు ప్రాణులు మృతి నొందిననే గాని ముక్తి లభింపదనియు తెలియజేయుచున్నది. అదియును గాక

శ్లో॥ స్వర్ణ వర్ణం కృతే, త్రేతాయుగే కాంత్యసమప్రభం।
ద్వాపరే లోహ సదృశం। కలౌ ప్రస్తర సన్నిభం।

అని కృతాది చతుర్యుగములయందు ఇచ్చటి వాయులింగము హేమ, కాంశ్య లోహ ప్రస్తర రూపమున భక్తులకు దర్శన మిచ్చి వారిని కృతార్థులను చేయుచున్నదని స్థల పురాణము వలన తెలియుచున్నది.

ఈ క్షేత్రము శివ క్షేత్రములలో నత్యుత్తమమైనది. ఇందుకు తార్కాణముగ ఈ కైలాస పర్వతమునందు సదాశివయను పేరుగల చిద్గుహ యొకటి ఉన్నది. అందు చిచ్ఛక్తి సహితుడగు పరమశివుడు సహస్రి దేవ శక్తి పరీక్షార్థమై నిలచి, ప్రతి సంవత్సరము బ్రహ్మ విష్ణ్వాదిగాగల బృందారక సందోహ మునకు దర్శన మిచ్చుచున్నట్లు స్థల పురాణము చెప్పుచున్నది.

ఈ క్షేత్రమహాత్మ్యము ఇంతింతయని చెప్పనలవికానిది. సత్యాది సప్త సాధనముల కంటె శివ క్షేత్ర వాసము ఆత్మ సాక్షాత్కారమునకు నిరపాయమైన ఉపాయమని పెద్దల స్వానుభవమున తెలిసికొనియున్నారు.

మన పవిత్ర భరత ఖండమున అనేక దేశము లున్నవి. అందు ఉత్తర దక్షిణ పినాకినీ నదులు మధ్య స్థమగు ద్రవిడ దేశములయందు హరి బ్రహ్మ మొద లగు దేవతలను శివుని ఆరాధించి వరములు పొందె దరు.

పవిత్ర స్వర్ణముఖి యందు గల తీర్థములు సకల పుణ్యప్రదములు, తొలుత బ్రహ్మ విశ్వ సృష్టిని గావించి గర్వించిన వాడై యిట తపమాచరించి తాను కోల్పోయిన సృష్టి సామర్థ్యమును తిరిగి పొందెను. ఇచ్చట కృత యుగమున బ్రహ్మచే నిర్మింపబడిన లింగము, సరస్వతీ తీర్థమునూ కలవు. అదే యుగ మున అగస్త్య మహర్షి ఇట తపము చేసి శివునారాధించి శివ సాయుజ్యము పొందిన వాడయ్యెను. జ్ఞాన ప్రకాశకమను తీర్థమును నిర్మించెను. ఇది స్వర్గ శ్రేష్ఠమగు తీర్థము.

పూర్వము కైలాస గిరియందు, శివాజ్ఞచే పార్వతి తన శరీరమును త్యజించెను. ఆదివ్య శరీరము అఖండ బిల్వ వృక్షమై ఇచట వెలసెను. ఆమె మానవ కాంతగా జన్మించి ఈ బిల్వ దళముచే శివునర్చించి ఈశ్వరానుగ్రహముచే, సఫల మనోరథయై శ్రీ జ్ఞానాంబిక అనియు విజ్ఞాన ప్రసూనాంబికయనియు విఖ్యాతి గాంచెను. ఆమె నిర్మించిన జ్ఞాన ప్రకాశక తీర్థము, ఆమె ప్రతిష్ఠించిన పుష్టి గణపతియు ఇందే యున్నవి.

ఇంకను అనేక పురాణ ప్రసిద్ధి చెందిన తీర్థ ములు ఇందు కలవు. శ్రీ దుర్గాదేవి తీర్థము, మణి కర్ణికా తీర్థము హరిహర తీర్థము, మయూర తీర్థము మూక తీర్థము, చంద్ర పుష్కరిణి, సూర్య పుష్కరిణి మరియు వజ్రతీర్థము ముఖ్యమైనవి. ఇంతే కాక ఎందరో భక్తులు ఇచట శివలింగములు ప్రతిష్ఠించిరి.

శక్తి పుత్రుడగు వశిష్ఠుడు, శుకమహర్షి, సనత్కు మారులు, శంభునారాధించిరి. ఇట శ్రీ దక్షిణా మూర్తి రూపముగ వారికి సర్వానంసార కారణమగు భయమును జ్ఞానముతో మౌన ముద్ర వలన పోగొ ట్టెను. వేదోక్త, ఆగమోక్త పాఠములను యిందు స్థాపించబడుట చేత ఇది మహా శక్తివంతమైన దివ్య స్థలమైనది. బ్రహ్మ, విష్ణు మొదలుగాగల సకల దేవతలు సహస్రలింగేశ్వరునికి షోడసోపచారములు సమర్పించిరి.

క్రీ.పూ. ఒకటి రెండు శతాబ్దములలో వ్రాయ బడిన తమిళ గ్రంథములలో శ్రీ కాళహస్తి దక్షణ కైలాసముగ చెప్పబడినది. రెండు మూడవ శతాబ్దము లలో అర్వై ముగ్గురు శైవ నాయనార్లు శివభక్తులలో ప్రముఖులైన అప్పర్, సుందర్, సంబందర్, మాణిక్య వాసగర్ అనువారు ఈ క్షేత్రమును సందర్శించి పరమ శివుని కీర్తించిరి. మూడవ శతాబ్దములో నత్కీరుడను ప్రసిద్ధ తమిళ కవీశ్వరుడు రత్నముల వంటి నూరు "ఆరవ అందాది"లో శ్రీ కాళహస్తీశ్వరుని స్తోత్ర రూపముగ కీర్తించి ధన్యుడయినాడు.

ఆదిశంకరుల వారు ఈ క్షేత్రమును సంద ర్శించి అమ్మవారి ఎదుట శ్రీచక్ర ప్రతిష్ఠాపన గావించి యున్నారు వారే స్పటిక లింగమునొక దాని నిచట నెలకొల్పినారు.

పల్లవ, చోళ, విజయనగర రాజుల కాలపు శిల్పకళా నైపుణ్యము ఈ క్షేత్రమున కాననగును. 1516లో శ్రీ కృష్ణదేవరాయలు పెద్దగాలిగోపుర మును కట్టించెను. ఇది రాయల మండపముగా ప్రసిద్ధి చెందినది.

శ్రీ కాళిదాసు మహాకవి తన రఘువంశ కావ్యములో పరమ శివుని పురుషోత్తమునిగా సూచించి యున్నాడు.

శివ రహస్య ఖండమునననుసరించి సాలెపురుగు (కువింద) దక్షణ కైలాసము నందు ఈశ్వరానుగ్రహ

మెట్లు పొందెనోయను వృత్తాంతము వివరముగా తెలియ చెప్పినది. అంతేకాక కాళము, హస్తి ఈ క్షేత్రమునందెట్లు ముక్తిపొందెనో వివరించినది.

పూర్వము తామ్రపర్ణి నదీతీరమున సత్యసఖుడను సదాచార సంపన్నుడు ఉండెను. ఆయన తన బ్రాహ్మణకుల దుష్కర్మలు విసర్జించి దష్కర్మలు చేయుచు కొంకణ దేశమునందుండిన యొక రోగిష్ఠి ధనవంతుడు పుత్రవిహీనుడైన "పాటలుడు" అను సాలెవానికి అభిమాన పుత్రుడై మెలుగుచు 'కరంబుడు'గా నట పిలువబడుచు, నేతపనులు నేర్చుకునివారి కన్యనే వివాహమాడి వస్త్ర వ్యాపారము చేయు చుండెను. కొంత కాలమునకాపాలక తండ్రి మరణించెను.

ఇట్లుండ, వీనికొక చెడు స్నేహము కలిగి వానివలన మతముచెడి మద్యపానాదులకు బానిస యయ్యెను. కుల ధర్మములను విడిచిపెట్టెను. కాల క్రమమున కరంబునికి వృద్ధాప్యమావరించి మరణ సమయమాసన్నమయ్యెను. అట్టి సమయమున శివభక్తు డొకడు లింగమునకు వస్త్రమును కోరి వానినర్థించెను. కరంబుడు ప్రీతి పూర్వకముగ వస్త్ర దానము చేసెను. పిదప ప్రాణములువిడిచెను. ఈ పుణ్యకర్మచే జాతి స్మరణత్వమును పొంది, పూర్వ జన్మార్జిత పాప వశమున క్రిమిగా జన్మించి దక్షణ కైలాసమున నొక మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో నివశించుచు, ప్రతి దినము స్వర్ణముఖి యందు స్నానము చేసి, పరమ శివునారాధించుచుండెను. తన దేహమునుండి వచ్చు తంతు జాలముతో గుడి గోపురములను నిర్మించి స్వర్ణముఖి జలపానము చేయుచు శివుని పూజించుచుండెను. అప్పటి నుండియు అది "శ్రీ" యని ప్రసిద్ధి నొంది బహు కాలము పరమ శివునారాధించెను.

శివుడా సాలెపురుగ భక్తిని పరీక్షించుటకై అది నిర్మించిన గుడి గోపురములను దీపశిఖచే భస్మము గావించెను. అది చూచి "శ్రీ" వ్యాకుల పడి శివున కిష్టములేని ఈ దేహము సహితమా అగ్నియందే ఆహుతి చేసెదనని తలచి, ఆత్మాహుతి గావించుకొనెను. అంత పరమ శివుడు దాని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై పూర్వదేహమీయగా ఆ క్రిమి పలు విధముల వేద గర్భితముగ శివుని స్తుతించెను. ఈ స్తోత్రమునకు ఈశ్వరుడు సంతసించి సాలెపురుగునకు సాయుజ్య ముక్తిని ప్రసాదించి ఈ క్షేత్రమునకు దాని పేరుండునట్లు వరమిచ్చెను.

పూర్వము మలయాచల ప్రాంతమునందు వేద విదుడైన దరిద్రుడగు ఒక బ్రాహ్మణుడుండెను. అతడితరుల కొరకు ప్రతి మాసమునందు శివరాత్రి నాడు పగటిపూట ఉపవాసముండి సాయంత్రమున శివ పూజచేసి, రాత్రి జాగరణ చేయుచు తన ధర్మమును విక్రయించుటచే యాతడు ఏనుగుగాజన్మించి పూర్వజన్మ సంస్కారముచే శివపూజా దురంధరత్వము వీడకుండెను. అట్టి ఏనుగును గాంచి దేవతలు కూడ యచ్చెరువందుచుండిరి.

ఆ కాలముయందే పర్వత గుహయందు వేద శాస్త్ర పారంగతుడైన శివపూజా దురంధరుడగు బ్రాహ్మణుడొకడు నివసించుచుండెను. అప్పుడను గంధర్వుని గాంచి నమస్కరించి భక్తితో "రత్నములతో శివుని పూజించిన కలుగు ఫలమేమి? ఆదివ్య రత్నములెచట లభించును"? అని ప్రశ్నించెను.

అందులకా గందర్వుడు శివుని రత్నములచే పూజించిన యీ లోకమునందే యీ జన్మమునందే మోక్షము కలుగునని బ్రహ్మాద్యమరులకు దుర్లభమగు శివసాయుజ్యము పొందెదరనియు అట్టి గొప్పవైన రత్నములు నాగలోకమున లభ్యమగునని చెప్పి యాతనిని కూడ నాగజన్మమెత్తి పాతాళమునకేగి,

మణులను తెచ్చి శివుని పూజింపుమని చెప్పెను.

అతడు తన శరీరమును వదలి నాగజన్మ మెత్తినను జాతి స్మరణను కలవాడయ్యెను. అది మొదలా సర్పము ప్రతి దినము దివ్య మణులచే వాయు లింగమును భక్తితో పూజించుచుండెను.

ఈ విధముగ ఏనుగు, సర్పము దక్షిణ కైలాస మునకు వచ్చి పూర్వజన్మస్మృతులు కలిగి శివార్చనా తత్పరతతో యున్నవి. సర్పము, 'కాళు'డను పేరున, ఉషః కాలమున విలువగల రత్నములు, మణులచే శివుని పూజించుచుండెను. ఏనుగు మధ్యాహ్నమున ఆ రత్నములను తొండముతో పారజిమ్మి, జలముతో నభిషేకించి కమలముతో శివుని అలంకరించుచుండెను. ఇట్లు ప్రతిదినము కాళ, హస్తులు పరమ శివుని పూజించుచుండెడివి.

ఇట్లు కొంతకాలము గడచిన పిదప, యీరెంటికి ఈర్ష్య కలిగెను. తానుంచిన అనర్ఘ్యమణులను ఎవరో దూరముగా పారజిమ్మి విలువలేని పూలను పెట్టుచున్నారని పామునకును, సుగంధ పుష్పముల నావల త్రోసి, పనికిమాలిన రాళ్లను ఎవరో పెట్టుచున్నారని ఏనుగుకు ఈర్ష్య, రోషము కలిగెను. ఇట్లు రోషగ్రస్తులై కాళ, హస్తులు తమ పూజలు చెరచుచున్న దుర్మార్గుని కనిపెట్టి శిక్షింపదలచి సమయమునకై నిరీక్షించుచుండెడివి. పామొకనాడు తన పగ తీర్చుకొనుటకై శివలింగము వెనుక పొంచియుండి ఏనుగు వచ్చి రత్నముల నావల త్రోసి తాను తెచ్చిన పుష్పములతో స్వామిని అలంకరించుచుండుట చూచి సూక్ష్మాకారమున పామా ఏనుగును చంపదలచి, దాని తొండమునందలి రంధ్రముగుండా ప్రవేశించి, శిరో భాగమున జేరి, ఏనుగును వేధింపసాగెను.

అంతకు పూర్వముగూడా గజరాజు తన శత్రువును సంహరింపదలచియే యుండెను. పాము పెట్టు బాధకు తాళలేక ఘోరముగ ఘీంకరించుచూ తన తల ఈశ్వరుని వెనుక భాగమున నున్న పర్వత శిలకు బాదుకొని, ప్రాణము విడిచెను. ఆ క్షణముననే దాని శిరమందున్న సర్పము కూడ మరణించెను. శివుని సన్నిధిలో అవి మరణించినందుకు సారూప్య ధారులై ప్రకాసించినవి. వారిరువురికి శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేతముగ పరమ శివుడు, సర్వ దేవతా పరివేష్టితుడై సాక్షాత్కరించెను. వారిరువురును పరమ శివుని స్తుతించుచూ "దేవా మాపేర్లతో యీలింగమును పర్వతమును, క్షేత్రమును ప్రసిద్ధికెక్కు నట్లు వరమిమ్ము. ఈ క్షేత్రమున మృతినొందిన వారందరూ ముక్తులు కావలెననియు రత్నములతో గాని, పద్మములతో గాని, లేక బిల్వదళములతో గాని పూజించిన వారికి ముక్తినొసంగ వలయునని ప్రార్థించుచున్నా" మనిరి.

దయాసముద్రుడైన శంకరుడటులే యగునుగాక! యని యనుగ్రహించెను. మునుపు "శ్రీ"యను సాలెపురుగు పూజించి తన నామము క్షేత్ర పర్వత లింగములకు ముందుండునట్లు వరమును పొందినట్లే, కాళ, హస్తుల పేర్లను కూడా జోడించి ఈ క్షేత్రమును శ్రీ కాళహస్తిగను, శ్రీ కాళహస్తీశ్వరుడనియు, శ్రీ కాళహస్తి శిఖరమనియు ప్రసిద్ధి నొందగలదని వరమిచ్చి శివుడు వాయులింగము నందంతర్ధానమయ్యెను.

పార్వతీ దేవికి పరమశివుడు పంచాక్షరీ మంత్రమును బోధించి నిశ్చల చిత్తముతో జపింపవలయునని చెప్పెను. జపము చేయునపుడు ఆమెకు మంద బుద్ధి ఆవరించి నియమము విస్మరించెను. అపుడు పరమశివుడు కోపించి ఆమెను భూమిపై మానవ స్త్రీయై పుట్టి, పడియుండుమని శపించెను. అపుడామె శాపవిమోచనమునకై పరమశివుని ప్రార్థింపగా, భూలోకమున కైలాసగిరికి ప్రాంతమున ఈశ్వరుని లింగమును పూజింపుమని ఆనతిచ్చెను. పార్వతీ దేవి నారదుని సహాయముతో భూమికి వచ్చి ఘోర

తపమాచరించెను. శివుడు ప్రత్యక్షమయ్యెను. ఆమెను తన అర్ధాంగమున అర్ధనారీశ్వరముగ నిలుపు కొనెను. అప్పటినుండియు ఆమె జ్ఞాన ప్రసూనాంబిక అను పేరుతో శ్రీకాళహస్తీశ్వర స్వామివారి సాన్నిధ్యమున వెలసినది. ప్రణవ పంచాక్షరీ జపసిద్ధిని పొంది జ్ఞాన ప్రదీప్తిని భక్తజన లోకమునకు ప్రసాదించుటచే ఆమెకు జ్ఞాన ప్రసూనాంబిక యను పేరు సార్థక నామమై యొప్పెను.

ఇచ్చట భక్తకన్నప్పశివసాయుద్యమునొందుట ప్రాముఖ్యము చెంది,ఎంతో ప్రాచుర్యముచెందినది.

పాండవ మధ్యముడు అర్జునుడు పరమేశ్వరుని చెందుటకు తిన్నడుగా కలియుగమున జన్మించెను. 'పొంత్తపినాడు' అని తెలుగుదేశములోగల ప్రాంతము నందు "ఉడుమూరు" అను బోయపల్లెలో నాధ నాథుడు - తండె అను బోయ దంపతులకు శివాను గ్రహముచే మగ శిశువుగ జన్మించెను. ఆ బాలునకు తిన్నడు అని పేరు పెట్టిరి. అతడు విలువిద్యలో దిట్ట అయ్యెను. ఒకనాడు వేటాడి, వేటాడి అలసి చెట్టు క్రింద నిద్రించుచున్నపుడు పరమశివుడు సాక్షాత్క రించి ఇట్లనెను " ఇక్కడ కొండ దగ్గర యోగలేటి యొడ్డున శివుడున్నాడు పోయి అతనిని కొలువుము" వెంటనే మేల్కొని చూడగా ఒక అడవి పంది కనిపిం చెను. ఆ పందిని వేటాడుచూ దాని వెంటపడగా అది తిరిగి తిరిగి శివుడున్నచోటికి వానినితెచ్చెను. అపుడు తిన్నడు? శివుని సాన్నిధ్యమున నిలచిపోయి తన్మయుడై శివుని కొలిచి పరిపరి విధముల తన నివాసగృహమునకు రమ్మని ప్రార్థించెను కానీ తన వేడుకోలు ఫలింపకపోగా అతడచ్చటనే శివుని వద్ద నిలచిపోయెను. ప్రతిదినము నిద్రనుండి మేల్కొని ఈశ్వరునకు నైవేద్యము చేయుటకు దగ్గర అరణ్యము నకు పోయి పందిని వేటాడి, చంపి, కాల్చిన మాంస ఖండములను రుచిచూచి, పక్వమైన వానిని యేరి, ఆకుదొప్పలలో పెట్టుకొని, ఫల, పుష్ప, బిల్వ దళ ములు శిరముపై మోపి చంకయందు వింటిని వీపున అమ్ముల పొదయు పుక్కిట సువర్ణముఖీ నదీజలము లతో తన ఆరాధ్య దైవము కడకరుదెంచెను. నోటితో తెచ్చిన గంగతో శివునభిషేకించి, ఆకు దొప్పలలో తెచ్చిన మాంసఖండములను మహా నైవేద్యముగా పెట్టి, శివుడు ప్రీతి చెందుచుండగా తిన్నడానందించు చుండెను.

అట్టి సమయమున శివగోచరుడను సదాచార సంపన్నుడైన నొక బ్రాహ్మణుడు కూడ వచ్చి ప్రతి దినము స్వామిని అర్చించి పోవుచుండెను. చాలా కాలమునుండీ పూజించుచున్న ఆ బ్రాహ్మణునికి కొత్తగా చేయుచుండిన తిన్నని పూజలు ఎంగిలి మంగళముగా కనపడెను. దానికతడు విచారించి "స్వామీ! మీ ఆలయము ఇటీవల కొన్నినాళ్ళుగా ఈ రీతిగా అగుటకు కారణమేమి?" అని ఎంతో దీనుడై ప్రార్థించినను తెలుపకున్న ప్రాణత్యాగము చేసెదనని శపథము చేసెను. అప్పుడు స్వామి వాక్కుగా ఇట్లు వినపడెను. "ఒక చెంచు నన్నిట్లు పూజచేయు చున్నాడు అతడు గొప్ప భక్తుడు వాని భక్తికి ఎంత మహిమ కలదో నీవు కూడా చూతువు గాక !" అని యాతనిని తన వెనుక దాగియుండి, అంతయు చూడమని చెప్పెను.

కొంత సేపటికి యధా ప్రకారముగ వచ్చి స్వామికి అభిషేకమాచరించి తాను తెచ్చిన మాంసపు ముక్కలను తినమనెను. స్వామి తినలేదు. ఇంతలో స్వామికి ఒక కన్ను వెంట నీరు కారనారంభించెను. క్రమముగానది అధికమయ్యెను. తిన్నడది చూచి స్వామికి కంటి జబ్బు వచ్చినది అని చాలా బాధపడి వైద్యము చేసి నయము చేయుటకు ప్రత్నించినాడు. తంగేడాకు మెత్తినాడు. నిమ్మరసముతో నూరి వేసి నాడు. గుడ్డను చుట్టగా చుట్టి నోటియావిరి పట్టి కంటికద్దినాడు. కలువపూవు తెచ్చి కంటికి రుద్దినాడు. అడవి అంతా వెదకి వెదకి ఎన్నో పసరులు తెచ్చి

వేసినాడు. నయము కాలేదు. ఇంతలో కంటి నుండి నెత్తురు కార నారంభించెను. చివరకు కంటికి కన్నే మందని తలచి, బాణముతో తన కంటిని పెక లించి స్వామి కంటిపై నంటి పెట్టెను. స్వామి కన్ను నెమ్మదించెను ఈ కొత్త కన్ను తొలుతటి కన్నుకంటే మిక్కిలి అందముగా కనపడెను. కానీ వెంటనే రెండవ కంటికి రక్తముకార నారంభించెను. తిన్నడపుడు నవ్వి " ఓ స్వామీ ! నీదయచే కంటికి మందున్నది". అని తన కాలితో నెత్తురు కారుచున్న స్వామివారి రెండవ కంటికి గుర్తుకై అదిమిపట్టి తన రెండవ కంటిని పెకలించబోయెను. వెంటనే పరమశివుడు తిన్నని భక్తి పారవశ్యమునకు మెచ్చి సతీసమేతముగ ప్రత్యక్షమై తిన్ననికి, ఆ బ్రాహ్మణునకు శివ సాయుజ్యము నొసగెను. ఆనాటినుంచి తిన్నడు శివునకు కన్నిచ్చి సార్ధకముగా కన్నప్ప అను పేరునొంది లోకులకు భక్తి మార్గ ప్రదీపకుడను ఖ్యాతి బడసి శ్రీకాళహస్తి క్షేత్రములో భక్తజన ప్రియుడై వెలుగొందుచున్నాడు. దేవాలయమునకు దక్షణ శ్రేణిలోనున్న కొండపై కన్నప్ప గుడియున్నది. ఈ నాటికి భక్తులు ఆ కొండనెక్కి భక్తుడైన కన్నప్పను దర్శించి ధన్యులవుతున్నారు.

పుత్రశోకమునకు గురియైన వశిష్ఠ మహర్షికి ఆయన తపః ఫలితముగా పరమశివుడు పంచముఖ నాగలింగేశ్వరుడుగా దర్శనమిచ్చి ఆయన దుఃఖమును పోగొట్టెను. ఈ నాగలింగమును బ్రహ్మదేవుడు కూడ పూజించి సృష్టి కార్యము విఘ్నములేక చేయసాగెను. ఈ లింగరూప విశేషముచే నీ క్షేత్రమునకు "రాహు కేతు క్షేత్రమని" పేను వచ్చినది. సర్ప దోషమే కాక సర్వ దోషములు, రాహుకేతు గ్రహములు చాలనివారు ఈ స్వామిని పూజించి దోష నివారుణులగుట కాన వచ్చును. ఈ పూజలు ఈ క్షేత్రముననే కలవు. స్వామి కవచము నవగ్రహ రూపము. ఇది గ్రహ దోషములను బాపును. నవగ్రహ ప్రతిష్ఠ ఇచట వేరుగాలేదు. ఈ నవగ్రహకవచముననకే అలంకారము వగైరాలు చేయుదురు.

ఆలయ ప్రవేశమునకు ద్వారము దక్షిణమున కలదు. అందు ఉత్తర ముఖముగా ప్రవేశించిన పిదప చిన్ముద్రతో నుండు దక్షణామూర్తి చాందోగ్యములో ఈ మూర్తి స్వరూప వర్ణనకు మారు రూపముగ కన్పట్టును. ఇట్టి మూర్తి ఇచటుండుటచేనీ క్షేత్రము జ్ఞాన ప్రధాన క్షేత్రమైనది. ఇట్టి దక్షణామూర్తి విగ్రహము మరియే క్షేత్రమునందు లేదని తెలియుచున్నది.

ఇచ్చటి స్థలపురాణముననుసరించి ఇచ్చట ఎన్నియో తీర్థములు కలవు. ఇచ్చటి వేయిలింగాల కోన ప్రకృతి రమణీయమైన స్థల రాజము. ఇందలి యక్షేశ్వర లింగము చూడదగ్గది. ఇచ్చటనే పరమేశ్వరుడు యక్ష రూపమున దేవతలకు దర్శనమిచ్చెను. ఉమాదేవి శ్రీ జ్ఞాన ప్రసూనాంబాదేవిగా దేవేంద్రునకు జ్ఞానోపదేశము చేసినదిచ్చోటనే. అనేక మంది మహర్షులు తమ శిష్యులకు తత్త్వోపదేశము చేసిరి.

ఈ దేవాలయములోని మూక తీర్థము ఎంతో ప్రాముఖ్యము చెందినది. నత్తి , మూగలకు వాక్ప్రసాదము చేయునని ప్రతీతి. ఇచ్చట నటరాజ రంగ స్థలము, పంచముఖేశ్వర స్వామి సుందర విగ్రహము అపురూపమైనవి.

ఈ దేవాలయమునకు పరిపాలనా వ్యవస్థగా నొక ధర్మకర్తల బోర్డుకలదు. ఈ దేవాలయమెంతో అభివృద్ధిని సాధిస్తున్నది. వసతి గృహముల నిర్మాణము ఇచ్చట అత్యవసరములలో నొకటి.

ఈ దేవాలయమునకు వాస్తు దోషము కలదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. వాటి పరిశీలన తద్దోష నివారణకు ప్రయత్నములు చేయుట అవసరమేమో పరిశీలనచేయుట ఉచితమేమో చూడవలసియున్నది.

ఇట్లు "ప్రవేశాన్ముక్త ఏవశః" అని ప్రవేశించి నంతనే ముక్తి నిచ్చుక్షేత్రరాజమై దక్షిణ కైలాసముగా ఖ్యాతి వహించిన శ్రీ కాళహస్తి క్షేత్రమును దర్శించి భక్తులు సర్వ శ్రేయములు బడయుదురు గాక !

**తిరుమల–తిరుపతి**

(తిరుమల క్షేత్ర వైభవము, 45 పుటనుంచి 48 పుట వరకు చెప్పడం జరిగినది. మిగతా వివరములు.)

విశ్వ విఖ్యాతమై, కలియుగ వైకుంఠముగా పేరు గడించిన తిరుమల తిరుపతి చిత్తూరు జిల్లాలో నున్నది. భక్తజనుల కోరికలను దీర్చు అపద్బాంధ వునిగా, ఎన్నో నిదర్శనములతో, నిత్యనూతనముగా వెలుగొందుచున్న త్రిభువన మోహనరూపునిగా తిరు మలేశుడు బహు దర్శనీయుడు.

ఎందరో తమ కోర్కెలు తీర్చుకొని, ఈ తిరుమలేశుని దర్శించడం ఒకానొక పవిత్ర నిత్య కృత్యంగా చేసికొంటున్నారంటే అందుకు ముఖ్యంగా ఈ దేవుని భక్త వాత్సల్యము, ఆర్తత్రాణ పరాయ ణత్వము కారణములు.

భక్త జనుల సందర్శన తిరుమలకు దిన దినము అధికమవుతున్నదంటే ఆ దేవుని మహిమ చెప్పనలవి కానిది.

"శ్రీ వేంకటాచల ఇతిహాసమాల" శ్రీ వేంకటా చలమునకు చెందిన చారిత్రక కథల సంపుటి క్రీ.శ. 1050 నుంచి 1150కు చెందినది అని చారిత్రకుల నిర్ణయము. శ్రీ తిరుపతి శ్రీ వేంకటేశ్వర – బాలాజీ అనే పుస్తకంలో శ్రీ వి.యన్. శ్రీనివాసరావు గారు (1949) ఈ క్షేత్రమును గూర్చి ఎన్నో ఆసక్తికర మైన విషయాలు వ్రాసారు.

ఈ తిరుపతి చరిత్ర క్రీ.శ. 1800 నుంచి ఆంగ్లేయుల రికార్డులలో పదిలపరచబడినది.

శ్రీవారి ఆలయ పవిత్రత, ఆలయ ఆదాయం అందరికీ నిధిలాగ ఉపయోగపడి ఆలయాన్ని ఎన్నో శతాబ్దాలుగా అలాగే నిలబడగలిగేలా చేయగలిగాయి. దారిదోపిడీలు విరివిగా ఆరోజులలో జరుగుతున్నా యాత్రికులు లెక్క చేయకుండా శ్రీ వారి దర్శనానికి వచ్చేవారంటే ఈ స్వామి ఆకర్షణ అంతటిది. అట్టి మహత్తు కలిగిన ఈ దేవాలయాన్ని ఎవ్వరూ పాడు చేయకుండా నిలబెట్టినవి శ్రీవారి పవిత్రత, మహిమ మరియు ఆలయ ఆదాయం. శ్రీకృష్ణ దేవరాయలు ప్రతీ పని ప్రారంభంలోను, సమాప్తిలోను, సాఫల్యం లోను తన ఇలవేల్పయిన వేంకటాచలపతిని సేవిం చడం అలవాటు. శ్రీ వేంకటేశ్వరుని తిరువేంగడము డైయాన్ తిరువేంగళనాథ, తిరుపతి దేవర తిమ్మప్ప అని కూడా పిలిచే వారు.

తిరుమల శ్రీవారి ఆలయపు శాసనాలు దాదాపు 800 అందు మొదట శాసనం క్రీ.శ. 830 నాటిది చిట్టచివరిది క్రీ.శ. 1909 నాటిది. విజయ నగర చక్రవర్తులు ఎన్నో శాసనాలు వేయించారు. ఈ శాసనాలు తమిళం, తెలుగు, కన్నడం, సంస్కృత భాషలలో ఉన్నాయి. శ్రీ రమణమహర్షి వారి ఇల వేలుపు శ్రీ వెంకటేశ్వరస్వామి వారి పేరు శ్రీ వేంకటరామన్. అంతేకాక ఆయన ఇలవేలుపు శ్రీ రాఘవేంద్రస్వామికి, శ్రీ పురందర దాసు వారికి కూడా.

శ్రీ తిరుమల కొండను పూర్వీకులు శ్రీ తిరుమల శ్రీవారుగానే భావించేవారు. అందువలనే కొండ పాదాన్ని శ్రీవారిపాదంగా పిలిచేవారు. "శ్రీ వారి మెట్టు" అని అంటారు. స్వామి వారి పాదాలకు చెప్పులు కుట్టి కొండ పాదం దగ్గర పెట్టి శ్రీ వారి మెట్టు (పాదం) అని పిలిచేవారు. అలిపిరిలో ఈ సాంప్రదాయం ఇప్పటికి ఉన్నది. మ్రొక్కుబడులు వారు శ్రీ వారికి అనేక రకాల పాదరక్షలు వివిధ

సైజులలో ఇప్పుడు కూడ సమర్పిస్తున్నారు. సరిగా సంవత్సరానికి అవి అరిగిపోతున్నాయి. శ్రీ స్వామి అమ్మవారి దగ్గర నుంచి వచ్చి చెప్పులు అక్కడే వదలి, అవతల కొండ ఎక్కుతారు.

తిరుమల శ్రీవారిమీద అనేక పురాణాలు, శతకాలు, కావ్యాలు, కథలు, కవితలు కీర్తనలు వెలసినవి వీటి అధ్యయనమువలన తిరుమలేశుని మహాత్మ్యం తెలుస్తుంది. పురాణాల ఆధారంగా శ్రీ వెంకటాచల మహాత్మ్యం సంస్కృతంలోను తెలుగులోను ప్రచురింపబడినది.

తిరుపతి అనగా తిరూప్పత్తి-త్రిపతి దీనికి ఆలంబనగా శ్రీ వేంకటేశ్వర గాయత్రి వుంది. ఇంకా వివరములు 1952లో డాక్టరు పి.టి. జగన్నాధరావు గారు వ్రాసిన "ఎసింపోజియం ఆన్ తిరుపతి వేంకటేశ్వర"లో ఉన్నవి. తిరుపతికి గోవిందరాజు పట్టణము అనే పేరుండేదట. తిరుమల ఆలయంలో తెలుగువారి సంప్రదాయమైన చంద్ర పంచాంగం వాడబడుతోంది. తిరుమల శ్రీవారిని శివుడనడానికి కూడా కారణాలు పెద్దలు చెబుతారు. శ్రీ వేంకటేశ్వర పేరు నాగాభరణములు, బిల్వ పత్రపూజ, జడలు గుండు చేయించుకొను యాత్రకులు. మూలమూర్తి వెనుక ఖాళీ స్థలం శివరాత్రినాడు క్షేత్రపాలకపూజ మొదలగు ఎన్నో కారణాల వలన హరిహరుడని కీర్తించినారు. తిరుమల శ్రీవారు శ్రీపతి, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సమగ్రరూపం.

శ్రీ వేంకటేశ్వరునికి జరిగిన, జరుగుచున్న సాహితీ సమారాధనము మరియే దేవునికి జరగలేదు. తాళ్ళపాక వంశ కవులు శ్రీవారి మీద ఎన్నో కీర్తనలు రచించి కడు ధన్యులైనారు. పురాణాలననుసరించి వ్రాయబడిన "తిరువేంకట మహాత్మ్యం" శ్రీవారి ముందు పఠించుటకు ఏర్పాట్లు జరిగినట్లు తెలియుచున్నది. శ్రీ తరిగొండ వెంకమాంబ వ్రాసిన శ్రీ వేంకటాచల మహాత్మ్యం ప్రసిద్ధిగాంచినది. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు, వేంకటేశ్వర శతకమును కూడా వ్రాసినట్లు తెలియుచున్నది.

అన్నమయ్య అంటే శ్రీవారికి ఎంతో ఇష్టం. అలనాటి పోతన వలే అన్నమయ్య "హరి ముకుందుని గొనియాడు నాజిహ్వ నినుగొనియాడంగ నేర"దని చెప్పి విజయనగర చక్రవర్తి వీరనరసింహరాయల ఆగ్రహానికి గురి అయినట్లును, శ్రీవారు కాపాడినట్లును తెలియుచున్నది.

శ్రీవారికి పూజలు వైఖానస సంప్రదాయంలో జరుగుచున్నవి. వైఖానస ఆశ్రమం తిరుపతిలో పడమటిమాడ వీధిలోనున్నది. వేంకటాద్రి పరమాత్మ నిలయం. ఇక్కడ శ్రీమహా విష్ణువు స్వయం వ్యక్తుడయినాడు. తొల్కాప్పియమ్ అనే ప్రాచీన తమిళ గ్రంథములో శ్రీ వేంకటేశ్వరుని ప్రస్తావించడం జరిగినది. శ్రీ వేంకటాచల ఇతిహాస మాల వైష్ణవ సిద్ధాంతములతోను, శ్రీ రామానుజునిచే విధింపబడిన పూజా పద్ధతులతో నిండియున్నది.

తిరుమల చక్రతీర్థ సమీపానగల శిలా తోరణం చూడదగ్గది. వందకోట్ల సంవత్సరాలనాటిదట, ఈ తిరుమల శిలాతోరణం! స్వయంభువైన శ్రీ వేంకటేశ్వరస్వామి తొలుత ఇక్కడే వ్యక్తమయినట్లు కొందరు విశ్వసిస్తున్నారు. శ్రీ వేంకటాచలం నూరు కోట్ల ఏళ్ళనాటిది. వేదాలలో శ్రీ వేంకటాచల ప్రస్తావన ఉన్నదంటే ఈ కొండ ప్రత్యేకత తెలుస్తుంది.

శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి నాలుగు మూలలో నలుగురు శివులు అనగా శివాలయాలు దాదాపు సమాన దూరంలో ఉన్నాయి. ఆగ్నేయాన శ్రీ అగస్త్యేశ్వర స్వామి, నైఋతిన స్వర్ణముఖి జన్మస్థానమయిన అదినేపల్లిలో శివాలయం, వాయువ్యాన తలకోనలోని శ్రీ సిద్దేశ్వరాలయం (భాకరాపేట నెరబైలు సమీపాన ) ఈశాన్యం శ్రీ కాళహస్తిలోని శ్రీ కాళహస్తీశ్వరాలయం.

క్రీ॥శ 1801లో స్ట్రాటన్ అనే ఆంగ్లేయుడు పశ్చిమ పాళెమునకు కలెక్టరు. ఈయన తిరుమల తిరుపతి ఆలయ చరిత్రను దానికి సంబంధించిన పురాణాలను, ప్రశస్తిని, ఐతిహ్యాలను, పరంపరాగతమైన సంప్రదాయాలను స్థానికులు ( శ్రీ వారి ఆలయ నిర్వాహకులు) నుండి రాబట్టడానికి ఒక ప్రశ్నావళిని తయారుచేసి వాటికి స్థానికుల నండి జవాబులు రాబట్టి వానిని ప్రచురించాడు. ఈ ప్రశ్నలు సమాధానముల పత్రమే "సవాల్-ఇ-జవాబ్"గా ప్రసిద్ధిగాంచినది. మొత్తం నలభై ప్రశ్నలివి.

తిరుమల శ్రీవారి పాదపీఠమునందు, ఆది శంకరాచార్యుల వారు ఆకర్షణ యంత్రం నెలకొల్పారట. అందువలననే అనేకమంది యాత్రికులు రావటం అంత డబ్బు రావడం.

క్రీ॥శ 1482లో తిరుమల-తిరుపతి పుణ్యక్షేత్రాలలో గోపురాలు మంటపాలు కట్టడానికి సువర్ణముఖీ నదీ తీరంలోనున్న దుర్గ సముద్రం అనే గ్రామాన్ని దేవాదాయ గ్రామంగా శ్రీవారికి సమర్పించి, ఆ పైకముతో తిరుమల మీద అనేక మంటపాలు కట్టించారు. శ్రీ సాళువనరసింహరాయలు. శ్రీవారి ఆలయ సంపంగి ప్రదక్షణములో నాలుగు మూలలా నాలుగు మంటపాలు, స్వామి పుష్కరిణి చుట్టూ మంటపాలు, వేయికాళ్ల మంటపంలో దక్షణాన ఉన్న పాతాళ మంటపం మొదలైనవి ఆ పైకముతో కట్టినవే.

"ఉంజలి సేవ", రామానుజ కూటములో అన్నదానం ఈయన కాలం నాటివే. ఇందులో ఉంజలి సేవప్రవేశపెట్టి అన్నదాన సమారాధనను సంస్కరించిన మొదటి "డోలోత్సవం" 17-12-1561గా లెక్కిస్తున్నారు. తిరుమల సోపాన మార్గములో శ్రీ నృసింహస్వామిని ప్రతిష్ఠ చేసినట్లు తెలుస్తున్నది.

శ్రీ కృష్ణ దేవరాయలు (క్రీ॥శ 1509-1530) ఎనిమిది పర్యాయములు విజయనగర చక్రవర్తిగా తిరుమలను సందర్శించినాడు. అతని దేవేరులు, తిరుమలదేవి, చిన్నమదేవి ఆయనతో పాటు శ్రీ వారిని దర్శించినట్లు శాసనాధారములు కలవు. ఆయన దర్శన సమయములో శ్రీవారికి సమర్పించినధనము, కనకాభరణములు అమూల్యములు. దానము చేయుటలోఆయన దేవేరులు ఆయన హోదాకు తగినట్లు ఆయనకేమాత్రం తీసిపోకుండా, ఎన్నోదానాలు చేసినట్లు తెలుస్తున్నది. అందు ముఖ్యమైనవి బంగారు కిరీటం. ముప్పేట కంఠహారం, ముత్యాలహారం రాయలవారివ్వగా, ఆయన దేవేరులు శ్రీవారి పాలఆరగింపునకు రెండు బంగారుపాత్రలు పళ్ళెరాలు సమర్పించి యున్నారు. అంతేకాక ఎన్నో బంగారు నాణెములు వరహాలు ఆలయ విమానమునకు బంగారు పూత వేయించుటకు, ఆలయ ఖర్చులకు సమర్పించారు. శ్రీవారి ఆనంద నిలయ విమానమునకు బంగారు పూతపని 9-9-1518నాడు పూర్తి అయినట్లు తెలుస్తోంది. దీనితో శ్రీవారి ఆలయమునకు బంగారు పూత పని నాల్గుసార్లు జరిగినది. దీని తరువాత కూడ మూడు పర్యాయములు శ్రీ వారి ఆలయానికి బంగారు పూత పని జరిగింది.

రాయలు అనంతరము పాలనకు వచ్చిన అచ్యుతరాయలు బందీ నుంచి విడుదల కాగానే తిరుమలకు వచ్చి, శ్రీవారి చేతిలోని శంఖుతో,ధారగా నెత్తిన నీరుపోయించుకొని పట్టాభిషక్తుడై విజయనగర సామ్రాట్టుగా మారినాడు. అంతటితో ఆగక శ్రీ కాళహస్తిలో ఒకసారి, హంపీ విజయనగరంలో ఒకసారి పట్టాభిషిక్తుడైనాడు. ఈ మూడు పట్టాభిషేకాలు క్రీ॥శ 1529 అక్టోబరు, నవంబరు మాసాలలో జరిగినవి.

శ్రావణ శనివారాలు ఉపవాస ముండి తళిగలు వేసి ఉంచిన పిండి మీద, శ్రీ వేంకటేశ్వరస్వామి పాదముద్ర వేస్తారు. తొండమండలములో ఉత్తరపు

కోన శ్రీ కాళహస్తి అగ్రహార ప్రాంతములో ఒక హరి జనుని ఇంట ఉత్తరంగా కుడిపాదం, దక్షణంగా ఎడమ పాదం ముద్రలు పడతాయి. ఆ పాద ముద్రలు కొలతలువేసి శ్రీవారికి చర్మంతో చెప్పులు కుట్టు తారు. దానికి కుచ్చులు, కుళ్ళాయిలు అన్నీ అమర్చి అందంగా తయారుచేస్తారు. శ్రీకాళహస్తి నుంచి ఒకడు కంచి వైపునుండి ఒకడు, కుడి ఎడమ కాలి శ్రీవారి చెప్పులను నెత్తిన పెట్టుకుని, ఊరూరా బిక్ష మెత్తుకుంటు వచ్చి అలిపిరిలో పూజలు చేసి ఆ పాద రక్షలను పూజామందిరంలో పెడతారు. ఒక్కొక్క చెప్పు ఒకడికి తెలియకుండా మరొకడు కుట్టినా, కొలతలలో ఒకడే కుట్టినట్లు సరిగ్గా జోడు సరి పోతాయి. ఇది సంవత్సరమునకు ఒక్క పర్యాయము జరుగుతుంది. ఈలోగా ఇక్కడ పెట్టిన పాత చెప్పులు రోజూ వేసుకుంటునట్లుగా అరిగిపోతాయి. ఇప్పుడా ఆచారం జరుపుతున్నట్లు లేదు.

తిరుమల శ్రీవారి ఆలయపు శాసనాలు దాదా పు ఎనిమిది వందలు, శ్రీ గోవిందరాజు ఆలయపు శాసనాలు మూడువందలకు పైగా ఉన్నవి. ఇవిగాక పరిసర ఆలయపు శాసనాలు, తాళ్ళపాక కవుల కీర్త నలు కలిగిన మూడు వేల రాగిరేకులు దొరికినవి. వీటిననుసరించి ఈ ప్రాంత విశేషములు మనము తెలిసికొనుటకు వీలు కలుగుచున్నది.

వీటిని కాలాన్ననుసరించి విడదీసి, వర్గీకరించి ఏ భాషకాభాషకు ఇంగ్లీషు అనువాదం చేసి ఆరుభాగా లుగా తిరుపతి దేవస్థానం వారు ప్రచురించారు. వీటి ఆధారంగా శ్రీ సాధు సుబ్రహ్మణ్యంగారు, తాను సేకరించిన శాసనాల సారాంశం చారిత్రిక, భౌగోళిక కావ్య కధనాల ఆధారంతో సమగ్రమైన "ఎపిగ్రాఫికల్ రిపోర్టు" తయారు చేసి 1930లో ప్రచురించారు. కొన్ని శాసనములననుసరించి శ్రీవారికి పుష్ప కిరీ టం, పుష్పయాగం పూలంగిసేవ, పల్లవోత్సవం మొదలగు పుష్ప సేవలు జరిగినట్లు తెలుస్తున్నది. ప్రథమంగా 18-1-1464లో పవిత్రోత్సవం జరిగి నట్లు తెలుస్తున్నది.

శ్రీ వేంకటాచలమునకు సంబంధించిన చారి త్రక విషయములిందు కలవు. వీటికాలమునుసుమారు క్రీశ 1050 నుంచి 1150 వరకు అని నిర్ణయించి నారు. వీటి ఆధారముగా మనకి క్షేత్రము గూర్చి సమగ్ర అవగాహన కలుగుటకు వీలుకలిగినది.

తొండమాను చక్రవర్తి, రంగదాసులను గూర్చి ఎన్నో ఆసక్తిదాయకములయిన విశేషములిందు న్నవి. ఆలయములలోని అన్ని సేవలకు, పాప నాశనం, ఆకాశగంగ రంగదాసుబావి, బంగారు బావి, జలాలు పవిత్రమైనవని శ్రీరామనుజులు ప్రకటించి వాటిని వాడవచ్చునని నిర్దేశించినట్లు తెలుస్తున్నది. శ్రీ రామానుజులు శ్రీవారి ఆలయంలో శ్రీయోగ నర సింహస్వామిని ప్రతిష్ఠించి పూజా పునస్కారములు ఏర్పాటు చేసియున్నారు.

అగస్త్యమహాముని భక్తులలో "సుధ"యను భక్తుడు మార్కండేయ మహామునితో కలిసి తిరుమల వస్తుండగా దారిలో మార్కండేయునికి నరసింహస్వామి రూపము కనిపించినది. అట్టి చోటును తెలిసి కొని శ్రీరామానుజాచార్యులు అక్కడొక నరసింహ స్వామిని ప్రతిష్ఠించారు.

శ్రీ రామానుజాచార్యుల వారు శ్రీవారికి బ్రహ్మోత్సవం ఏర్పాటు చేసిన సందర్భం బహు విచిత్రమైనది.

అనంతాచార్యుల తోటలో పూలు చాలా అందముగా పూసాయట! శ్రీవారు చిలిపిగా శ్రీ పద్మావతీ దేవితో కూడి, రోజూ రాజకుమారుని వేషంలో పూలు దొంగతనం చేస్తూ వుండేవారట! వారం రోజులు కావలికాచి ఈ దొంగలను పట్టు

కొంటాడాయన. శ్రీవారు తప్పించుకొంటారు కానీ పద్మావతీ దేవి దొరికిపోయిందట. తనను వదలి భర్త ను పట్టుకోమని ప్రార్థించి ఆ రాత్రి అనంతుని ఇంట్లో గడిపింది. ఆమరునాడు అసలు విషయం తెలిసికొన్న అనంతుడు, ఆ తల్లిని, పూలబుట్టను తలపై పెట్టు కొని పోయి ఆలయంలో శ్రీవారికప్పగించి వచ్చా డట! ఈ సందర్భమును పురస్కరించుకొనే బ్రహ్మో త్సవం ఏర్పాటు శ్రీ రామానుజులువారు చేసారు. శ్రీ పద్మావతీ దేవి ఊరేగింపు సెప్టెంబరు అక్టోబరు (పెరటాసి) మాసంలో జరిగినవట. ఈ ఉదంతం గుర్తుగా ఉత్సవం ఎనిమిదవ రోజునాడు, తేరునాడే, అనంతుని కొక హారము సమర్పించాలని ఏర్పాటు చేసారట శ్రీరామానుజులు.

స్వామి పుష్కరిణీ తీరంలోని శ్రీ వరాహ స్వామి వారికి మొదటి హారతి, గంట, నైవేద్యము జరగాలని కట్టడి చేసారు శ్రీ రామానుజులవారు. ఇందుకు కారణం శ్రీ వరాహస్వామి తిరుమలలో మొట్టమొదటగా నివశించడం.తిరుమల నుంచి ఆనం దాళ్వారు శ్రీవారిసేవ నిమిత్తము ఏవిధంగా తిరుమల చేరినారో వివరింపబడినది.

తిరుమలనంబి పరమపదించిన తరువాత శ్రీ రామానుజులు ఆయన జ్ఞాపకార్థము అధ్యయనోత్స వము ప్రవేశపెట్టినారు. ఆనాడు తిరుమంగైయాళ్వారు రచించిన ప్రబంధ పఠనం చేస్తూ శ్రీ వైష్ణవులు ఆకాశ గంగ జలాలతో నిండిన బిందెలు నెత్తిమీద పెట్టుకొని శ్రీవారి పాదుకలు శిరస్సున ఉంచుకొని, తిరుమలలో నున్న నాలుగు మాడు వీధులు ప్రదక్షణం చేస్తారు. ఇది తిరుమలనంబి జ్ఞాపకార్థము, శ్రీ రామానుజుల వారు చేసిన ఏర్పాటు.

తిరుమల మీద పాదరక్షలు తొడగరాదు,పూలు ముడువరాదు, పనిలేకుండా నివసించరాదు.

తిరుమల ఆలయంలోని ప్రతీ సేవ పటిష్ఠంగా నిమయబద్ధంగా జరగడానికి పునాదులు వేసినవారు శ్రీ రామానుజుల వారు. ఆయనకు మనమెంతో ఋణ పడియున్నాము.

శ్రీ రామానుజుల వారి అనుమతితో పుష్ప కైంకర్యము చేయడానికి వచ్చినారు అనంతాచార్యు లవారు. ఈ మహా పురుషుడు చివరిదశలో, తిరుమల నంబితో కలిసి ఆలయ నిర్వహణ చేపట్టి అరువది సంవత్సరములు నిర్విఘ్నంగా కొనసాగించి నాడు. ఈ మహాపురుషుని స్మరించడం మన విధి.

నేడు శ్రీవారి దర్శనానికి బౌద్ధ భిక్షువులు, జైనమునులు, పార్శీలు, సిక్కులు మహమ్మదీయులు కొందరు క్రైస్తవులు వస్తున్నారు. ఆ స్వామి అందరకు దర్శనమిస్తున్నారు.

స్వామివారు ఈశ్వరుడా? విష్ణువా? బ్రహ్మ దేవుడా? అని సంశయించకుండా అందరూ స్వామిని సేవించి తరిస్తున్నారు.

"తిరుపతి శ్రీ వేంకటేశ్వర-బాలాజీ" అను పేరున శ్రీ వి.ఎన్. శ్రీనివాసరావుగారు ఒక పుస్తకం వ్రాసి 1949మద్రాసులో ప్రచురించినారు. అందెన్నో అసక్తికర విషయములు వ్రాసారు ఆయన. స్థల విస్త రణ భీతితో వాటిని ఇందు చేర్చలేదు.

తిరుపతిలో శ్రీ హత్తీరాంజీ మఠము పేర్కొన తగినది.

శ్రీ వేంకటేశ్వర స్వామితో పాచికలాడిన శ్రీ హత్తీరాంజీ మహంతు మొట్టమొదటి మహంతుగా గుర్తింపబడినారు.

ఈ మఠశాఖలు బొంబాయి,నాసిక,నూగూరు, తంజావూరు, వేటూరు, అదోనిలలో ఉన్నట్లు తెలు స్తున్నది. ఈయన సమాధి ఆళ్వారు చెరువునకు ఎగువున కొత్త చెరువునకు దిగువన, మఠంలో తోటలో ఉన్నది.



# కడప జిల్లా

కడప జిల్లా పుణ్యక్షేత్రములకు కాణాచియైన రాయలసీమలోనిది. ఈ ప్రాంతమునకు ప్రాచీనమగు చరిత్రకలదు. ఆధునిక చరిత్రకారుల ఊహలకందని గొప్పవిశేషములను ఉజ్వల పురాతన వైభవములు, పుణ్య క్షేత్రములు, అందలి శిల్పములు వివరించగలవు. కడప ప్రాచీన చరిత్ర ముద్ర విప్పని పుస్తకమైనదని కల్నల్‌విల్స్ చెప్పియున్నారు.

ఈ ప్రాంతమును పల్లవులు, చోళులు, రాష్ట్ర కూటులు,వైదుంబులు, కాకతీయులుపరిపాలించారు. వారి కీర్తి వైభవములకు సాక్ష్యములుగా ఎన్నో శాసనములు, దేవాలయములు, చెరువులు నేటికినీ నిలిచియున్నవి. నైజాం ప్రభుత్వాధి కారము, పాలెగాండ్ర పెత్తనమును; మల్లురాజుల పరిపాలనను చవిచూచినదీ ప్రాంతము.

ఎన్నో దేవాలయములు జీర్ణోద్ధరణ గావింపబడినవి. శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ జిల్లాలోని దేవాలయముల జీర్ణోద్ధరణ కార్యక్రమమును నెరవేర్చినారు. వాటి వైభవమును నిలిపినారు.

## శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దేవాలయము

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దేవాలయము కడప పట్టణములో కలదు. దీనిని దేవుని కడప యని యందురు. కడప పట్టణమునకు రెండు కి|మీ| దూరములో నున్నది. 5 కి.మీ.దూరమున కడప రైలుస్టేషను కలదు.

తిరుపతి వెళ్ళే యాత్రికులకు మార్గమిదే. ఒకప్పుడు ఇక్కడ వెలసియున్న శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర దర్శనానంతరము, తిరుమలేశుని దర్శించడం సంప్రదాయంగా పాటింపబడుచుండెడిది. ఈ ఆచారం నేటికినీ కొనసాగుతున్నట్లు తెలియుచున్నది.

కడపమండల దివ్య క్షేత్రములలోయీ క్షేత్రము అతి ప్రాచీనమైనది. బహు ప్రసిద్ధి చెందినది.

కృపాచార్యులు, ఇచ్చటనే శ్రీవేంకటేశ్వరుని ప్రతిష్ఠించినట్లు ప్రతీతి. తిరుమల వరాహ క్షేత్రమైతే కడప హనుమత్ క్షేత్రము. శ్రీ వేంకటేశ్వరస్వామి వెనుక భాగమున ఆంజనేయ విగ్రహమున్నది. ప్రసన్న వేంకటేశ్వరస్వామిగా ప్రసిద్ధుడైన స్వామివెలసిన ప్రాంతమీ దేవుని కడప.

శ్రీ వైష్ణవాచార్యులగు వేదాంతదేశికులు (పదనాల్గవ శతాబ్దము) ఈ స్వామిని ప్రస్తుతించారు. విజయనగర సామ్రాజ్య స్థాపకులు హరిహరరాయలు, బుక్కరాయలు, సాళువ నరశింహుడు, ఆంధ్ర భోజుడు

శ్రీ కృష్ణదేవరాయలు ఈ స్వామికి అమూల్యాభరణాలు. మడిమాన్యాలు సమర్పించారు.

నంధ్యాల అవుభళేశ్వర దేవమహారాజు, తిమ్మయదేవ మహామండలేశ్వరుడు ఓబులరాజు, సదాశివ రాయలు భూదానాలు చేసారని, ఆలయ కుడ్యముల పైనున్న శాసనములనుండి తెలియుచున్నది. అమూల్యాభరణములను కూడా సమర్పించారు.

శ్రీ వేంకటేశ్వరుని ప్రసాదలబ్ద, మహాభక్తుడు తాళ్లపాక అన్నమాచార్యులు (క్రీ.శ. 1146-1547) సంకీర్తనాచార్యుడుగా కడుప్రసిద్ధుడాయెను. ఈయన, కడప మండలమందలి అనేక క్షేత్రములను దర్శించి, కడపరాయని సేవించినట్లు తెలుస్తున్నది. వేంకటాద్రి కడపరాయుడని పేర్కొన్నాడీయన. కడపరాయని రథోత్సవ వైభవమును వర్ణించినాడీయన. మధుర భక్తిపరుడు, అబినయాచార్యుడు శ్రీ క్షేత్రయ్య కడప వేంకటేశ్వరుని కీర్తించినాడు.

కడప మండలమునకు కలెక్టర్‌గా పనిచేసిన సర్ థామస్‌మన్రోదొర కడవరాయని సేవించినట్లు, ఆలయ మరమ్మత్తులకు సహాయ సహకారములు అందించిపట్లు తెలియుచున్నది.

ఈ ఆలయ శిల్పము కడు రమణీయము. స్వామి సన్నిధిలోని మండపము విజయనగరరాజుల కాల మున నిర్మింపబడినది.

స్వామివారి గర్భగుడి వెనుకవైపు, గోడకి చేరువగా ఎత్తైన ఆంజనేయవిగ్రహమున్నది. ఆంజనేయ మూర్తికి ముందు వైపున స్వామివారు (మూలవిరాట్) పడమటి ముఖముగా నున్నారు. స్వామి వక్షస్థలాన కుడివైపున శ్రీవత్సచిహ్నముతో శ్రీ మహా లక్ష్మీమూర్తి చెక్కబడియుండుట చూడవలెను. అమ్మవారి ఆలయ కప్పులో రాతిబల్లులున్నవి. కంచిలోవలె ఈ బల్లులను తాకిన దోషనివారణఅగునని భక్తులు నమ్ముచున్నారు. ఈ క్షేత్రమున పాంచరాత్రఆగమము ననుసరించి పూజలు, ఉత్సవాదులు జరుపబడుచున్నవి. పాంచరాత్ర ఆగమము ప్రకారము మిక్కిలి అరుదైన, విశేషమైన షడ్‌బేరములు ఇచట కలవు. (బేరమనగా మూర్తి)

**తాళ్లపాక**

పదకవితా పితామహుడు అన్నమాచార్యుడు. క్రీ.శ.1408-1424 మధ్యకాలమున ఆంధ్రదేశమధ్యష్ట మోయన మధురగీతములతో తెలుగునేలను పరమ పవిత్రము చేసిన మహానీయుడిక్కడివాడే ఈ మహనీయుని గూర్చి తెలిసికొనడం మనందరి అవసరమై యున్నది.

అన్నమయ్య తాతగారు నారాయణసూరి. ఈయన మహాపండితుడు. అన్నమయ్య తల్లిలక్కమ్మ. తిరుపతి వేంకటేశ్వరుని వరప్రసాదమున పుట్టిన కుమారునికి జోలపాటలు, శ్రీ వేంకటేశ్వర స్వామిపై పద్యములు పాడుచుండేదీమె. అందువలన చిన్నతనము నుండియే అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని భక్తుడయ్యాడు.

వేదాధ్యయనమును మాని, శ్రీవేంకటేశ్వరుని పై పాటలు పాడుకొను అన్నమయ్యను ఇంటిలోని వారు చులకనగా చూచుచుండిరి. ప్రతి దినము అన్నమయ్యను ఈతని వదిన, పశువులకు గడ్డితెచ్చుటకు అడవులకు పంపుచుండెడిది. అన్నమయ్య ఆ బాధను భరించలేక తిరుపతి పారిపోయెను. కొండ మెట్లెక్కుచూ అలసిపోయిన అన్నమయ్యకు ఒకపుణ్యమూర్తి అన్నం పెట్టి ఆదరించెను. ఈమె అన్నమయ్యకు అలిమేలుమంగవలే కనిపించినదట. భక్త్యావేశములో అన్నమయ్య ఆశువుగా శ్రీవేంకటేశ్వర శతకము చెప్పెను.

తదుపరి స్వప్నమున దైవ మాజ్ఞాపించుటవలన అన్నమయ్య తాళ్లపాక జేరెను.

అన్నమయ్యకు సాళువ నరసింహరాయలుతో పరిచయమేర్పడెను. ఒకనాడు దేవునిపైపాడిన శృంగార

గీతములు విని నరసింహరాయలు తనపై అట్టి శృంగార పదములు రచింపుమని కోరెను. అందులకన్నమయ్య అంగీకరించనందున అధికారదర్పముతో అన్నమయ్యను బంధించెనట. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై భక్తి రసమయముగా పదములుపాడ సంకెళ్ళు విడిపోయినవట. పిదపరాయలు పశ్చాత్తాపపడి అన్నమయ్యను క్షమాపణ వేడుకోనెను.

అన్నమయ్య ఇరువది రెండువేల కీర్తనలు రచించెను. భక్తి రస బంధురమై, అనితరసాధ్యమైన పదరచన చేసిన పుణ్యపురుషుడు. అన్నమయ్య నివశించిన పుణ్యప్రదేశము తాళ్ళపాక. ప్రతి ఆంధ్రుడు దర్శించదగ్గ గ్రామమిది.

తాళ్లపాక చెన్నకేశవస్వామి గొప్ప మహిమగల వేలుపని ప్రజల ప్రగాఢ విశ్వాసము.

పురాణ ప్రసిద్ధిగల క్షేత్రమిది. జనమేజయునికి స్వామి ప్రసన్నుడైనట్లు పురాణ ప్రసిద్ధికలదు. చెన్నకేశవుడు ఆశ్రిత జన క్లేశనివారకుడుగా ప్రసిద్ధి చెందుచున్నాడు. తాళ్ళపాక శివకేశవాద్వైతానికి ప్రతీక.

**ఒంటిమిట్ట**

ఒంటిమిట్ట కడప జిల్లాలో కడప మండలంలో ప్రసిద్ధిచెందిన పుణ్య క్షేత్రము. ఏకశిలానగరమని ఈ క్షేత్రమునకు ప్రసిద్ధనామము కలదు. ఈ క్షేత్రమున వెలసిన శ్రీకోదండరామస్వామి, జాంబవంతుని ప్రతిష్ఠగా చెబుతారు. ఒకే రాయియందు శ్రీరాముడు, లక్ష్మణుడు, సీత, ముగ్గురు చెక్కబడి యున్నారు.

తండ్రియాజ్ఞ ననుసరించి శ్రీరామచంద్రుడు దండకారణ్యమునకు వచ్చినపుడు, ఒకానొక సమయమున సీతమ్మ శ్రీరామునితో "ఇక్కడి జంతువులకు నీటికొరత యెట్లుతీరును ? అని అన్నది. అపుడు శ్రీరామచంద్రుడు బాణ ప్రయోగముతో పాతాళగంగను రప్పించెను. శ్రీరామబాణ ప్రయోగమున ప్రభవించిన పాతాళ గంగయే నేడు "శ్రీరామతీర్థ" మనబడుచున్నది.అని జనశ్రుతి. ఎంతటి కరువు కాటకములు వచ్చినను ఈ రామ తీర్థమునందలి జలము కొంచెము కూడా తగ్గక ప్రవహించుచునే యున్నది. అదియే శ్రీరామతీర్థ ప్రత్యేకత.

సీతాన్వేషణము చేయుచు ఆంజనేయ, జాంబవంతాదులు ఈ ప్రాంతమునకు వచ్చిరి. వారికి స్వప్నమున శ్రీ సీతా లక్ష్మణ సమేతుడై శ్రీ కోదండ రామస్వామి దర్శనమిచ్చెను. ఉదయమే మేల్కొని చూడగా ఏకశిలపై శ్రీ సీతారామ లక్ష్మణులు ముువ్వురూ కనిపించిరి. యుద్ధకాలమున శ్రీరామచంద్రుని ప్రతాపమునుగాంచిన జాంబవంతుడు, తనతో మల్లయుద్ధము చేయమని కోరగా, వచ్చే అవతార సమయమున ఆ కోరిక తీర్చెదనని శ్రీరామచంద్రుడు చెప్పెను. అట్లే కృష్ణావతార సమయమున శమంతక మణి కొరకై జాంబవంతునితో యుద్ధముచేసి అతనిని ఓడించెను. శ్రీరాముడే శ్రీకృష్ణునిగా జన్మించెనని జాంబవంతుడు గ్రహించి శ్రీ కృష్ణునకు పాదాభివందనము చేసెను.

ఈ విధముగా రెండు యుగములకు చెందిన జాంబవంతునిచే ప్రతిష్ఠింపబడిన ఈ క్షేత్రము పరమ పవిత్రమైనదని భక్తులు నమ్ముచున్నారు.

గోపుర నిర్మాణము చోళ శిల్ప సంప్రదాయము తెలుపుచున్నది. గర్భాలయము విద్యానగర శిల్పవిజ్ఞానము కలిగినది. ముఖమండప వైఖరి, శిల్ప నిర్మాణ చాతుర్యము వర్ణనాతీతములు. ఈ క్షేత్రముకు వాయువ్యమున శ్రీమృకండ మహర్షి ఆలయము కలదు.

ప్రౌఢదేవరాయని ఆస్థానమందుండిన కవిపుంగవుడు అయ్యలరాజు తిప్పరాజు ఒంటిమిట్టనివాసి. రఘువీర శతక కర్త ఈయన.

వ్యాసరచిత ఆంధ్ర మహాభాగవతమును తెనిగించిన మహాకవి పోతనామాత్యుడు. ఒంటిమిట్ట నివాసము చేసినట్లు పండితులు నమ్ముచున్నారు.

ఆంధ్ర వాల్మీకిగా లబ్ధప్రతిష్ఠులైన శ్రీవావిల కొలను సుబ్బారావుగారు. శ్రీవాల్మీకిరామాయణమును తెనుగున వ్రాసి తరించిన మహనీయు-డిక్కడివాడే.

## శ్రీ కృష్ణగీతాశ్రమము

కడపజిల్లాలోని ప్రొద్దుటూరు నగరమున 1946వ సం।న శ్రీమహర్షి, సద్గురు మళయాళస్వామి వారిచే శ్రీకృష్ణగీతాశ్రమము స్థాపించబడినది. ఈ ఆశ్రమము దినదిన ప్రవర్ధమానమగుచున్నది.

ఈ ఆశ్రమ స్థాపకులు శ్రీ నామాల ఎరక లయ్యగారి వితరణతో గొప్ప సంస్కృత పాఠశాల ఆశ్రమమున నడపబడుచున్నది.

ఇందు నిత్యము ఉదయము భగవద్గీత పారాయణము గీతా ప్రవచనములు.సాయంకాలం పురాణ కాలక్షేపము, భజనలు, గోష్ఠులు జరుగుచున్నవి.

ఈ పుణ్యాశ్రమములో అనేకమంది సద్గురువులు, తత్త్వవేత్తలు, యోగులు, అవధూతలు వచ్చి ఎన్నో ధార్మిక కార్యక్రమములు, చాతుర్మాస్య వ్రతములు జరిపించిరి.

ఈ విధముగ ఈ ఆశ్రమము, గత నలభై సం।ల నుంచి సనాతన ధర్మోద్ధరణ, భారతీయ సంస్కృతి పరిరక్షణ, ఆర్ష సిద్ధాంతముల ప్రచారము, నిరంతరము శ్రీ మళయాళస్వామి వారి దివ్యానుగ్రహముతో జరుపుకొనుచున్నది. ఈ సంస్థ అభివృద్ధి స్వయముగ చూచి ఆనందించవలసినదే.

## శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వాముల వారు.కందిమల్లయపల్లె .

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారి మఠము కడపజిల్లా బద్వేలు తాలూకా కందిమల్లయపల్లి గ్రామములోనున్నది. కడప,ప్రొద్దుటూరు, బద్వేలుల నుండి బస్సు సౌకర్యమున్నది. గిద్దలూరు మారమునుండి వచ్చువారు మల్లేపల్లి వద్ద దిగి సుమారు ఏడుకి.మీ. నడచి మఠముచేరు కోవచ్చును.

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి క్రీ.శ. 1718 సం।న సజీవ సమాధినొందిరి. వీరు మహా యోగులు. మహిమాన్వితులు, దివ్య జ్ఞాన సంపన్నులు. వీరు జ్ఞాన దృష్టి ప్రభావముతో భూత, భవిష్యత్, వర్తమానములను విశదముగ తెలిపియుండిరి. వారు చెప్పినట్లే చాలా విషయములు ఈనాడు ప్రత్యక్షముగ జరుగుచున్నవి. వారి త్రికాల జ్ఞాన మనంతమని రూఢియైనది. వీరు యుగపురుషులు. వీరి మఠము మహిమాన్వితమైనది. సంతాన హీనులు సంతానమును, వ్యాపారులు లాభమును, సామాన్యులు వారి కోర్కెలను ఈ స్వామిని సేవించి పొందుచున్నారు. 1935 సం॥న శ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి, శ్రీ శ్రీనివాస స్వామి వారు గొప్ప భాస్కర యాగము జరిపించిరి. అపుడే ఇచట గణపతి, అశ్వత్థ నారాయణ, నవగ్రహములు, ప్రతిష్ఠలు జరిపించిరి.

శ్రీ బ్రహ్మంగారి జీవసమాధి ముందు భాగమున వారి కుమారులు వీరధర్మపత్ని మరియు స్వామి వారి ధర్మపత్ని గార్ల సమాధులున్నవి. స్వామి వారు తపస్సు చేసికొన్న వేపచెట్టు కలదు. ఆ చెట్టు వద్ద నాగ ప్రతిష్ఠలు జరిగినవి. ఈ మఠమునకు తూర్పున స్వామివారి మనుమరాలు, కాలజ్ఞాన చక్రవర్తి ఈశ్వరీ దేవి వారి సమాధియున్నది. సమీపమున సిద్ధయ్యగారి మఠము కూడా యున్నది.

శ్రీ స్వామివారి ఆరాధనా మహోత్సవములు వైశాఖ శుద్ధ దశమి రోజున జరుగును. ఆనాడు భక్తులు విశేషముగా పాల్గొని స్వామివారి కరుణా కటాక్షములను పొందుచున్నారు. ఈ జిల్లాలోని దర్శనీయ క్షేత్రములలో ముఖ్యమైనదీ మఠము.

## సంగమేశ్వర దేవాలయము. అనిమెల

ఈ దేవాలయము కడపజిల్లా కమాలాపురం తాలూకాలోనిది. ఈ దేవాలయము అనిమెల గ్రామ

మునకు తూర్పున పెద్దకొండ దిగువన, చిన్న గుట్ట పైనున్నది. గుట్ట దిగువ పారుచున్న పాపఘ్ని-మొగనూరు నదులు కలియుచోటున కలదు.

ఈ ఆలయము అతిప్రాచీనమైనది. ఆంధ్ర దేశమును పాలించిన విజయనగరప్రభువులనాటి శిల్పకళకును ఇచ్చటి శిల్పమునకును చాలా పోలికలు కలిగి ఆనాటి చరిత్రకు తగ్గ చరిత్ర కలిగియున్నది. ఇచటి స్వామి సంగమేశ్వరుడు ఈ (స్వామి) లింగము రెండున్నర అడుగుల యెత్తు కలిగి, నల్లని రాతి నిర్మాణమై యున్నది. అగస్త్య మహర్షి ప్రతిష్ఠగా చెబుతారు.

ఈ గుడిలోని ఈశ్వరునకెదురుగా నల్లని రాతితో మలచబడిన పొడవైన నంది విగ్రహము కలదు. గర్భగుడికి తరువాత మండపము కలదు. చాల పెద్దది. ధ్వజ స్తంభము ఇత్తడి తాపడముతోనున్నది. పార్వతీ దేవి విగ్రహము ప్రతిష్ఠింపబడినది. ఈమె పేరు సంగమేశ్వరి. ముందున, ప్రక్కలను సగము సగము కట్టిన చిన్న చిన్న ఆలయములు కలవు.

చౌడేశ్వరి పేరున తూర్పున ప్రాకారమునకు క్రిందనొక చోట నల్లని విగ్రహము కలదు. కన్నడ లిపిలో చెక్కబడిన శిలాశాసనములు కలవు. ఈ శాసనముల ననుసరించి ఈ క్రింది విషయములు తెలియుచున్నవి.

చాలా కాలము క్రిందట ఇచటికి రెండు మైళ్ళ దూరమునందు రాజుపాళెంలోనొక రైతువద్ద సాధువైన ఆవుండెడిది. ఆగోవు పాలిచ్చుదినములలో ప్రతి దినము సంగమేశ్వరుడున్న దిబ్బపై పుట్టలో తన పాలను విడిచి ఇంటికి వచ్చెడిది. రైతు ఆవు పాలివ్వనందున దాని చర్య కనిపెట్టదలచి ఒకనాడు ఆ ఆవు వెనకనే వెళ్ళెను. పోయి పోయి ఆగోవు పుట్టపై నిలచి పాలిచ్చు చుండెను. వెంటనే కోపముతో ఆ రైతు కర్రతో ఆ ఆవున కొట్టగా అది తప్పి పుట్టకు తగిలెను. ఆ దెబ్బకు పుట్టలో గల పెచ్చు ఊడిపడెను. ఆ స్థలమున త్రవ్వి చూడగా అందు శివలింగ మగుపడెను. రైతు అపరాధ క్షమాపణ చెప్పుకొని, ఆ స్థలమును బాగు చేయించి శివలింగము యధాస్థితిగా నుంచి, ప్రతిష్ఠ చేయించెను. పాపఘ్ని, మొగనూరు నదుల సంగమ స్థలమందు కలది గనుక యీ క్షేత్రము సంగమేశ్వర మయ్యెను. ఈ స్వామి సంగమేశ్వరుడుగా స్థిరనామ మున ప్రసిద్ధుడాయెను. వైశాఖ శుద్ధ పౌర్ణమి నాడు ఈ క్షేత్రమున గొప్ప తిరునాళ్లు జరుగును. కార్తీకము, శివ రాత్రులలో విశేష పూజలతో స్వామికి ఉత్సవములు జరుగును.

ఈ దేవాలయము చుట్టూ ప్రదేశము మనోహర ముగ ఉండుట చేత యాత్రికులకు విహార స్థలముగ కూడ ఎంతో అభివృద్ధి పొందగల చక్కని ప్రదేశము. చూడ దగ్గ క్షేత్రమిది.

## శ్రీ ప్రసన్న విశ్వేశ్వరస్వామి దేవస్థానము. కడప.

ఈ క్షేత్రము అతి ప్రాచీనమైనది. అప్పుడు జిల్లా మునసబుగా ఉన్న అనువర్తి వంశీయుడైన శ్రీ సుబ్రహ్మణ్యంకు కాశీ విశ్వేశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి తన పేరిట దేవాలయము నిర్మింపుమని కోరగా, ఆ కోరికననుసరించి అచిరకాలములో ఈ దేవాలయ నిర్మాణము చేయించెను. 1912-13 సం॥ నందు ఈ దేవాలయము రిజిష్టరు చేయబడినది. ఇప్పటికి అనగా (1912-13), 90 సం॥లకు పూర్వము ఈ దేవాలయ ప్రతిష్ఠ జరిగినది.

కడప పట్టణములోని ప్రముఖ భక్త బృందము ఆలయ అభివృద్ధి కార్యక్రమములు నిర్వహించి అప్పటి కడప జిల్లా కలెక్టరు గారి వద్ద నుంచి కూడా ధన సహాయము పొందిరి. ఎందరో భక్తుల సహాయ సహకారములతో ఈ క్షేత్రము దినదినాభివృద్ధి నొందుచున్నది.

1964వ సం॥లో శ్రీ శృంగేరీ పీఠాధిపతి స్వామి వారు కళా ప్రతిష్ఠ గావించిరి.

చైత్ర, ఆశ్వీయుజ, కార్తీక, మార్గశిర, మాఘ మాసములలో ఇచ్చట అనేక విశేష పూజా కార్యక్రమములు, అభిషేకములు విరివిగా జరుగుచున్నవి.

శ్రీ ప్రసన్న విశ్వేశ్వర స్వామి, అన్నపూర్ణాంబ సహితముగ నిచ్చట నెలకొని భక్తులకు వరప్రసాదమగుటచే ప్రసన్నవిశ్వేశ్వర స్వామిగ భక్తుల సేవ అందు కొనుచున్నారు. అప్పటి చైర్మన్ శ్రీ జి.నారాయణ రావు, న్యాయవాది శ్రీ ఆర్. రంగనాధం గార్లు ఎంతో కృషి సలిపి ఈ క్షేత్రాభివృద్ధికి పాటు పడిన ధన్యులు.

## ముక్తి రామేశ్వరము

ముక్తి రామేశ్వరము కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకాలో యున్నది. ఆ గ్రామము ప్రొద్దుటూరునకు సుమారు మూడు కి॥మీ॥ దూరమున నున్నది. ఇచ్చటి దేవుని పేరు శ్రీ రామలింగేశ్వరుడు.

ప్రొద్దుటూరు మద్రాను-బొంబాయి రైలు మార్గమున గల యర్రగుంట్లకు పదకొండు కి॥మీ॥ దూరములోనున్నది. ప్రొద్దుటూరుకి, హైదరాబాద్, కర్నూలు చిత్తూరు, అనంతపురం, బెజవాడ, తిరుపతి పట్టణములకు ప్రయాణము చేయుటకు (రోడ్డు రవాణా సౌకర్యములు) బస్సు సౌకర్యములు కలవు.

ఇచట ఈ శ్వరలింగము సైకతలింగము. దీని కొక ప్రాచీన ఇతిహాసము కలదు.

త్రేతాయుగములో రామావతార సమయమున శ్రీ రామచంద్రుడు, రావణ వధానంతరము పుష్పక విమానమున అయోధ్యకు తిరిగి వచ్చుచుండగా సాయం సమయమయ్యెను. లంకనుండి అయోధ్యకు పోవు మార్గము దండ కారణ్యముగా నుండెడిది. బ్రహ్మహత్యా మహా పాతకము, రావణుని సంహరించుట వలన శ్రీ రామునకు చుట్టుకొన్నది. ఆ పాతకము పిల్లి రూపమున వారికి కనబడుచుండెడిది. బ్రహ్మహత్య మహా పాతకము పోగొట్టుకొనుటకు శ్రీరామచంద్రుడు శివలింగ ప్రతిష్ఠ చేయదలచెను. శుభముహూర్తము నిర్ణయించి హనుమంతుని శివలింగము తెచ్చుటకై కాశికి పంపెను. కాని ముహూర్త సమయము అతిక్రమించుచున్నను మారుతి రాకపోవుటచే, సీతారాములు సైకత లింగమును చేసి ప్రతిష్ఠించిరి. మరలి వచ్చిన మారుతి జరిగిన దానికివగచెను. హనుమంతుని మన శ్శాంతికై ఈ సైకత లింగమునకు కొంత దూరములో, కాశీలింగమును ప్రతిష్ఠింపజేసి, దానికి, తొలుతపూజలు జరిగిన పిదప శ్రీరామలింగేశ్వరునకు పూజలు జరుగునని మాట యిచ్చిరి. శ్రీ రామునిచే ప్రతిష్ఠింపబడిన లింగము కావున ఇచటి స్వామికి శ్రీరామలింగేశ్వరుడని నామ మేర్పడినదని పెద్దలు చెప్పెదరు. లింగ ప్రతిష్ఠ జరిగిన తరువాత కొద్ది దూరము వరకూ పిల్లి నదీ తీరమున నడచి అదృశ్యమయ్యెను. ఈ గుండము పిల్లి గుండముగా ప్రసిద్ధి చెందినది. ఈ గుండమున అస్థికలు గయలో కలిపిన రీతిగా కలుపుదురు. అక్కడ భక్తి శ్రద్ధలతో యెవ్వరైనను ఈ స్వామిని ఆరాధించిన ముక్తి తప్పక కలుగునని, అందువలన ఈ గ్రామమునకు ముక్తిరామేశ్వరమని సార్థక నామము కలిగినది. పొద్దు పొడవక మునుపే శివలింగమును ప్రతిష్ఠించినందున యీ గ్రామమునకు ప్రొద్దుటూరుగా పేరు వచ్చినది. ముక్తి రామేశ్వరమున శివలింగము నేల మట్టమునకు ఐదారు అంగుళముల యెత్తుండును, లింగముపై యిసుక నదిమి పెట్టిన వేలిముద్రలు ఇప్పటికిని అగుపించును.

ఇక్కడ దేవాలయమునకు సంబంధించిన కొన్ని శాసనములు కలవు.

ఇచ్చట చైత్ర శుద్ధ పౌర్ణమినుండి పది రోజులు బ్రహ్మోత్సవములు వైభవముగా జరుగును. వివిధ స్థలములనుండి భక్తులు అధిక సంఖ్యలో ఉత్సవము అందు పాల్గొనుచు ఆనందించుచున్నారు.

కార్తీక సోమవారములలో కూడ బ్రహ్మాండమైన ఉత్సవములతో నయనానందకరముగ స్వామిని చూడ వచ్చును.

ఈ దేవాలయము చాలా పెద్దది. పెద్ద పెద్ద మండపములు కలిగి యాత్రికులకు చాలా సౌకర్యముగ నున్నది. దేవ స్థానమునకు భూవసతి కలిగియుండి స్వామికి నిత్య నైవేద్యాధికమునకు లోటు లేకుండా జరుపుచున్నారు. తప్పక దర్శించదగిన క్షేత్రమిది.

## శ్రీ అగస్త్యేశ్వర దేవస్థానము – ప్రొద్దుటూరు

ఈ క్షేత్రము కడపజిల్లా ప్రొద్దుటూరు పట్టణములో మద్రాస్-బొంబాయి రైలు మార్గమునకు 13 కి।మీ। దూరములో వెలసియున్నది. ఈ దేవస్థానము జిల్లాలో అతి పురాతనమైనది.

అగస్త్య మహర్షి ఈ స్వామి వారిని ప్రతిష్ఠించినట్లు ప్రసిద్ధి. చోళరాజు నందవర్మ గర్భాలయమును కట్టించెను. సైన్యాధిపతులు ఇమ్మడి నరశింహవర్మ, నరసన్న నాయక్ గార్లు దేవాలయమును అభివృద్ధి పరచిరన్నట్లు శాసనములు వలన తెలియుచున్నది.

1964వ సం। నందు జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు, అగస్త్యేశ్వర స్వామికి కళాప్రతిష్ఠగావించిరి. 1966 సం। నందు కుంభాభిషేకము శ్రీ పుష్పగిరి పీఠాధిపతులు గావించిరి.

ఈ క్షేత్రమున బ్రహ్మోత్సవము ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధ మందు జరుగుచున్నది.

ఈ జిల్లాలో అతి ముఖ్యమైన దేవస్థానమిది.

## శ్రీ ఆంజనేయస్వామి వారి దేవస్థానము. ప్రొద్దుటూరు.

పూర్వము త్రేతాయుగమున శ్రీ రామచంద్రుడు రావణ సంహారము చేసిన తరువాత అయోధ్యకు ప్రయాణమయ్యెను. రావణ బ్రహ్మను చంపిన పాపము పిల్లి రూపమున శ్రీ రామచంద్రుని వెంటపడెను. సేతు రామేశ్వరము నందు లింగ ప్రతిష్ఠ చేసి ఎన్నియో పుణ్యతీర్థములయందు స్నానమాచరించెను. అయినను పాతకముపోలేదు. ఈ దారి గుండా అయోధ్యకు పోవుచు ఇచ్చటికి సమీపమున నున్న ముక్తి రామేశ్వరము దగ్గరనున్న పిల్లి గుండము అను పుణ్య తీర్థమున శ్రీ రామచంద్రుడు స్నానము చేసి తర్పణాదుల నిచ్చెను. అపుడు పిల్లి రూపమున న్న బ్రహ్మహత్యాపాతకము మాయమయ్యెను. అందువలన ఆ గ్రామమునకు ముక్తి రామేశ్వరమను పేరున్నూ. ఆ గుండమునకు పిల్లి గుండమను పేరు సార్థకమైనది. అచ్చట లింగ ప్రతిష్ఠ చేయదలచి హనుమంతుని కాశీకి పోయి శివలింగము తీసికొని రమ్మని పంపెను. హనుమంతుడు తిరిగి లింగముతో వచ్చులోపల, నిశ్చయించిన ముహూర్తము దాటిపోవునని తలంచి స్వామి సైకత లింగము ప్రతిష్ఠించెను. పిదప లింగమును చూచి కోపోద్దీపితుడై పెకళించుటకు ప్రయత్నము చేసెను. ఆ ప్రయత్నము ఫలించలేదు. అపుడు శ్రీ రామ చంద్రుడు పరిస్థితి గ్రహించి హనుమంతుడు తెచ్చిన లింగమును మూల స్వామి దేవాలయమునందు ప్రతిష్ఠించి ముందుగా హనుమంతుడు తెచ్చిన లింగమునకు పూజలు జరుపునట్లు, పిదప సైకత లింగమునకు పూజలు చేయునట్లు చెప్పి హనుమంతుని మనసు తృప్తి పడునట్లు చేసి, అయోధ్యకు పోయెను. కాశికిపోయి తెచ్చిన లింగమును తెచ్చిన ఆకారమును అచ్చటనే పిల్లి గుండ సమీపమున హనుమంతుడు స్థిరపరచెను.

ప్రొద్దుటూరు పురమున ఐదు వందల సం।లకు పూర్వము శ్రీ। అనంసంజీవరెడ్డి అను మహాభక్తుడు పాలించుచుండగా, అతనికి స్వప్నమున స్వామి సాక్షాత్కరించి నేను మీ గ్రామమునకు సమీపమున ఫలానా చోటనున్నాను. నన్ను తీసుకొనిపోయి మీ పూరి గవునియందు నిలుపుము. మీ వంశమును మీ గ్రామమును నేను కాపాడెదను అని సెలవిచ్చెను. ఆ ప్రకారము ఆ రెడ్డిగారు స్వామి వారిని రథముపై

కొలువు దీర్చి, తమ ఇంట పెరుగుతున్న రామలక్ష్మణు అనే పేరుగల కోడెగిత్తలను రథమునకు కట్టి స్వామి వారిని తీసుకొని వచ్చెను. ఇచ్చటికి వచ్చిన తరువాత రథము నిలబడిపోయెను. రథము ఒక అంగుళము కూడ ముందుకు కదలలేదు. అపుడు కోడెగిత్తలను, అదిలించగా అవి రెండును బ్రహ్మైక్యము చెందినట్లు తెలిసినది. అచటనే వాటిని సమాధిచేసిరి. ఆ రాత్రి స్వామి ఆ భక్తునకు కలలో కనిపించి నేను నిలబడి యున్న చోటనే నన్నుంచి, దేవాలయము కట్టించుము. అచటనే నేనుండి భక్తులను కరుణించెదను. నీ యెద్దులు నా సేవలో ముక్తి పొందినవి. అవి కారణ జన్మలు వాటికొరకు దుఃఖింపకుము అని చెప్పి మాయమయ్యెను. అందువలన స్వామివారు చెప్పి నటులే ఆ రెడ్డిగారు అచటనే దేవాలయము కట్టించి పూజాదుల నొనరించుచూ స్వామిని సేవించి ముక్తి నొందెను. ఈ స్వామి వారి మహాత్మ్యము సేవించు వారికే తెలియును. ఎందరో భక్తులు స్వామి వారిని ఆరాధించి తమకోర్కెలను తీర్చుకొని తృప్తులవుతున్నారు. ఎంతో మహిమగల క్షేత్రమిది.

## హత్యరాల : శ్రీ త్రేతేశ్వరస్వామి

పరశురాముడు పిత్రాజ్ఞాను సారము మాతృ శిరస్సును ఛేదింపగా ఆ స్త్రీ హత్యాపాతకము హస్తము నంటు కొనగా, తండ్రియగు జమదగ్ని యాదేశాను సారము అనేక పుణ్య నదులయందు స్నానము చేసినను పాతకము పోలేదు. కడపటికి క్షేత్రములోని నదిలో స్నానము చేయగనే హత్యాపాతకము నశించి నది అప్పటినుండి ఈ క్షేత్రమునకు 'హత్యారాల' అను సార్థక నామధేయమేర్పడినదని పెద్దలు చెప్పెదరు.

ఈ క్షేత్రమందలి త్రేతేశ్వర స్వామి స్వయంభు లింగము.

త్రేతాయుగమున మహర్షులందరు చంద్ర శేఖరుని స్వయంభు లింగమును చూడదలచి యజ్ఞము చేయగ శివుడు సంతసించి స్వయంభు లింగాకృతిగ అవతరింపగా మునులు మహదానందముతో త్రేతా యుగమున నుద్భవించిన యీ లింగమునకు త్రేతేశ్వరుడని నామకరణము చేసిరి. పిమ్మట ఆ లింగముపై పుట్ట పెరిగెను. ద్వాపర యుగముగడిచి కలియుగము వచ్చు సమయమున ఒక ధనవంతుని గోవు ప్రతి దినము పుట్టపై పాదుగులోని పాలన్నియు వదలి వచ్చుచుండెను. గోవుపాలనివ్వక పోవుటచేత ఆ ధనికుడు పశులకాపరిని దండింపగా అతడు గోవుల వెంట రహస్యముగ వెళ్ళి అచట జరిగిన విషయమును ధనికునకు చెప్పగా అతడు దైవజ్ఞులను రప్పించి వారి ద్వారా అచట శివలింగమున్నదని తెలిసికొని త్రవ్వింపగా కనబడిన శివలింగమును తీసి శుభ్రపరచి సంప్రోక్షణాది సేవలను జరిపించి, త్రేతేశ్వరుడని నామమిడిరి. తరువాత మట్లి రాజులు, చోళరాజులు, దేవుని పేర కొన్ని గ్రామములిచ్చిరి.

హత్యరాల క్షేత్రమున గధాధర స్వామి యను పేర ఒక వైష్ణవాలయం కలదు. పూర్వము నృగ మహర్షి ఈ ప్రాంతమున తపస్సు చేయుచున్నప్పుడు రాక్షసులాతని తపస్సును భంగముగావించుచూ హింసించుచుండిరి. ఆ ముని విష్ణువును శరణు వేడగా దయాళుడైన శ్రీ మహావిష్ణువు గదను ధరించి ఒక పాదముతో నిలచినట్లు ప్రత్యక్షమై రాక్షసులను చంపి, నీకిష్టమైన వరమడుగమనీ, ఆముని సంతోషమున [illegible]గానే ఈ క్షేత్రముననుండ వలసినదని కోరగా ముని కోరిక ననుసరించి "గదాధరస్వామి" అను పేరుతో నిలచెను. గయ క్షేత్రమున నట్లుండినందున ఈ క్షేత్రము గయతో సమానమని చెప్పుదురు.

ఈ క్షేత్రమున గల నదికి సంబంధించిన నొక ఇతిహాసముకలదు. పూర్వము శంఖలిఖితులనెడి అన్న దమ్ములు చోళరాజులకు సంభంధించిన వనములను కాపలాకాయుచు ఏపనిచేసిన ఇరువురి సమ్మతిని చేయునట్లు ఒప్పందము చేసికొని యుండగా నొక పర్యాయము లిఖితునకు ఆకలికాగా అన్నగారి అనుమతి

పొందకనే రెండు మామిడి పండ్లనుతినెను. పిమ్మట అన్నగారితో తన దోషము చెప్పగా ఆ దోషము రాజదండనతోనే పరిహారమగునని తెలిసికొని ఆ శిక్షను పొందెను. తమ్మును చూచి అన్న దుఃఖించి భైరవాద్రి యందు తపస్సు చేయమని తమ్మునకు పదేశించెను. తమ్ముడటులనే తపస్సు చేసి శివుని మెప్పించి చేతు లిమ్మని వరము కోరుకొనెను. ఈ మడుగులో మునుగుము చేతులొచ్చునని చెప్పగా అతడట్లు చేయగా చేతులొచ్చినవి. అప్పటినుండి యీ నదికి "బాహుద" అని పేరు వచ్చెను.

ఇచ్చట దక్ష యజ్ఞము జరిగినట్లు నిదర్శన ములు కలవు. దక్షుని శిరస్సు వీరభద్రుని కాలికింద యున్నట్లొక శిల్పముకలదు.

ఇంకొక విశేషమేమన పూర్వమీ క్షేత్రము చోళ రాజులచే నిర్మింపబడినది. నిర్మించిన వారిలో ఏకా తాతయ్య అను భక్తుడు దేవాలయమునకై వెచ్చించిన ఖర్చులను స్మరించుచు పద్మాసనాసీనుడై స్వామి సన్నిధిని కూర్చున్నవాడట్లే శిలా విగ్రహమై పోయినా డట. ఈ విగ్రహము మానవ నిర్మితంగా లేకపోవుట మానవుడే శిలయైనట్లు కనబడుట ఇచ్చట ప్రత్యేకత. త్రేతేశ్వరునిపై పాలుపిండిన ఆవు పాదముద్రలు, మోకాటి గుర్తులు ఆవున్న స్థలము నేడును కలవు.

బహుదానదిలో స్నానముచేసిన పాపహరమగు నని పురాణ ప్రసిద్ధి కలదు. కొండపై నృగమహర్షి తపమొనరించిన గుహ ఇప్పటికిని కలదు.

కొండపై "జగజ్జ్యోతి" యను పేరనొక జ్యోతి కలదు. ఈ జ్యోతిని వైశాఖ, కార్తీక మాసములలో వెలిగింతురు. మాఘమాసములోను మహాశివరాత్రి వైభవముగా జరుగును.

మన ఆంధ్రదేశములో చాలా ప్రశస్తమైన క్షేత్రమిది.

## శ్రీ వీరభద్రస్వామి, అల్లాడ పల్లె.

ప్రొద్దుటూరు తాలూకా అల్లాడ పల్లెలో వెల సిన శ్రీ వీరభద్రుల స్వామి దేవస్థానం, కడప, ప్రొద్దు టూరు ప్రధాన రహదారి మధ్య జీవనది. "కుముద్వతీ" తీరమున రమణీయ సుందర ప్రదేశమున వెలసిన ఈ పుణ్య క్షేత్రమునకు ఎంతో ప్రాశస్త్యమున్నది.

సుమారు మూడు శతాబ్దముల క్రిందట కర్నూలు జిల్లా బనగానపల్లెలో శ్రీమతి గరివిరెడ్డి అచ్చమ్మ గారింట్లో వీరయ్య అనే పశుల కాపరి ఒక రోజు మేతకై ఆవులనుగుట్టలపైకి తోలుకొని వెళ్ళి అచ్చట గిరిగీచి ఆవులను అందుంచి ఒక గుహలో శ్రీ స్వామి వారి శిల్పమును తయారు చేయడం, అది కొంత కాలమునకు కుముద్వతీనది వరదలలో కొట్టు కొనివచ్చి ప్రస్తుతం స్వామివారు వెలసియున్న స్థలము నకు మూడు కి।మీ। దూరములో "కేతవరం" అనే గ్రామ తీరమడుగున చేరినది. ఆ గ్రామములోని పిల్లలు పశువుల మేపుకోనుటకు నది ఒడ్డునకు వెళ్ళుచుండెడి వారు. నదిలో నుండి స్వామి ఒకబాలునిగా వచ్చి ఆ పిల్లలతో పాటు ఆటలాడుచు వారిచ్చిన అన్నం తినుచు తర్వాత నదిలోకి అదృశ్యమగు చుండెడివాడు. ప్రతిరోజూ ఈ విధముగ జరుగుతుండెడిది. ఈ సంగతి ఆ గ్రామపెద్దలకు తెలిసెడిది కాదు. పిల్లలు రాత్రు లందు కలవరించుచు అదిగో నల్లనివాడు వచ్చి కొట్టి, దూకె అని కలవరిస్తూ యుండడం గమనించి కలవ రింపుల విషయం వాకబు చేయగా పిల్లలు రోజూ నది ఒడ్డున జరుగుచున్న ఆటల కార్యక్రమమును జెప్పిరి.

పిమ్మట, మరునాడు పెద్దలు పొంచియుండి చూచుచుండ యధారీతిగా నదిలోనుంచి బాలుడు వచ్చి ఆటలాడునపుడు చూచి పెద్దలు వచ్చి చుట్టు కొని, బాలుని పట్టుకున్నారు. ఆ బాలుడు నేను వీరభద్రస్వామిని ఇచటికి దగ్గరలో నన్ను ప్రతిష్ఠించండి అని చెప్పి, ఆ స్థలమున కోడి కూత, రోకటిపోటు లేని

గ్రామముగ యుండునట్లు తెలియజెప్పి పలానా రోజు నన్ను ప్రతిష్ఠించమని చెప్పి అదృశ్యమయ్యెను.

స్వామివారు చెప్పినట్లుగా పూజా ద్రవ్యములు తీసికొని ఆ గ్రామ మునసబు కొడుకు, కోడలు వారి ఆధ్వర్యమున నది వడ్డుకు చేరారు.

శ్రీస్వామి వారిని బనగానపల్లెలో తయారు చేసిన వీరయ్యగారు పిచ్చి వీరయ్యగా వడ్రంగము చేస్తూ కేతవరం చేరియుండెను.

అందరూ స్వామి వారి రాకకై ఎదురుచూస్తూ యుండినారు. రెడ్డి దంపతులు స్వామిరాక ఆలస్యముగుటచే ఇరువురు బ్రహ్మముడి వేసుకొని ఆత్మాహుతికి సిద్ధమైన సమయములో స్వామివారు నీటబుడగలతోపాటు సాక్షాత్కరించినారు. అందరూ సంతోషముతో మేళతాళములతో స్వామిని ప్రతిష్ఠించుటకు బండిపైయుంచి వీరయ్య శ్రీ శ్రీ శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారు) సారధ్యముతో ప్రతిష్ఠ స్థలమునకు తీసుకొనివచ్చి అకాలమైనందున సకాలంలో ప్రతిష్ఠించ వచ్చునని వచ్చినవారు భోజనం చేసి విశ్రాంతి తీసుకొన్నారు.

అట్టి విశ్రాంతి సమయములో స్వామివారు తనకు తానుగా వచ్చి వీరయ్యకు తెలిపి ప్రతిష్ఠ అయినారు. వీరయ్యగారు స్వామిని పూజించి మా "ఇల వేల్పు" అనిచెప్పి విశ్రాంతి తీసుకొనియున్న వారితోపాటు తెలియనట్లుగా కలసియుండెను. శ్రీ వీర బ్రహ్మేంద్ర స్వాములవారి ప్రతిష్ఠగా ప్రాముఖ్యత చెందియున్న పుణ్య క్షేత్రమిది. వారికి ఇది గురు పీఠము. విశ్రాంతినుండి లేచిన వారు బండిపై లేక, నిలిచియున్న స్వామిని పూజించి, స్తుతించి వెళ్ళి పోయిరి. శ్రీస్వామి వారు ఆరు అడుగుల యెత్తుగాను, నిండైన విగ్రహము. రౌద్ర మూర్తిగను, గంభీరముగను కనిపించెదరు.

శ్రీస్వామివారు భక్తాదుల కల్మషము పోగొట్టుట యందును, సంతానహీనులకు సంతాన మొసగుటయందును, కోరిన కోరికలిచ్చుటయందును ప్రత్యక్షదైవమని పేరెన్నికగన్న శ్రీ వీరభద్రస్వామి వారి కరుణా కటాక్షములు ఎల్లప్పుడు భక్తులయందు కనబరచుచున్నారు.

శ్రీస్వామివారిని సేవించి తరించెదరు గాక.

## శ్రీ హరి, హరాదుల ఆలయము: వీరబల్లె.

కడప జిల్లాలో రాయచోటి తాలూకాలోని వీరబల్లెగ్రామమున శ్రీహరి హరుల ఆలయముకలదు. ఈ దేవాలయము మాండవ్య నదికి దక్షణదిశలో గట్టు మీద నున్నది. సుమారు ఐదువందల సం॥లకు పూర్వము హరిహర బుక్కరాయలు. రాజ్యపాలన మొనర్చు రోజులలో ఈ ఆలయములు నిర్మాణమైనట్లు శాసనముల వలన తెలియుచున్నది. ఈ ఆలయముల నిర్మాణమునకు కారకుడు శ్రీయల్లప్పు రెడ్డి వంశీయుడైన యల్లమాచిరెడ్డియను భక్త శిఖామణి, అతనికి హరిహరులపై విశేషమైన భక్తి కలదు.కావున దేవాలయ నిర్మాణమేకాక నిత్యకైంకర్యమునకును, ఉత్సవాదులు జరుగుటకును, స్వామి పేరుతో తన యావదాస్తిలో కొంతమేర పట్టా చేయించి యిచ్చినట్లు ఈనాడున్న రికార్డు ద్వారా తెలియుచున్నది.

అతని అనంతరము అతని వంశీయులే ధర్మకర్తలై కార్యకలాపాలను జరిపించుచూవచ్చిరి.

ఇపుడు సౌకర్యములులేక ఈ దేవాలయములు అంతగా అభివృద్ధిలోనికి వచ్చుట లేదు. ఇచటికి వచ్చు యాత్రికులకు ఏ విధమైన సౌకర్యములు లేవు.

దాదాపు ఏబది సంవత్సరముల క్రిందిటి వరకును ఉత్సవాదులను, అన్నదానాదులను కండ్లారా చూచిన శతవృద్ధులు చెప్పుచుండెడివారు. ప్రస్తుతము ఈ దేవాలయము చాలా వెనుకబడియున్నది.

ఎంతో అభివృద్ధి చేయదగిన క్షేత్రమిది.

## గండి క్షేత్రము

కడప జిల్లాలో గండి క్షేత్రము శ్రీ ఆంజనేయ స్వామి వెలకొనియున్న పురాణ ప్రసిద్ధి కలిగిన దివ్య క్షేత్రము.

రెండు కొండల నడుమ బంగారు తోరణము నిర్మించి శ్రీ రామచంద్రుని ఆహ్వానించెను. శ్రీ రామ చంద్రుడు ఇచట బసచేసి శుభగడియలు నిర్ణయించు కుని, ఒక గుండును తన బాణముతో శ్రీ వీరాంజ నేయ స్వామిని పాదము నుండి శిరస్సువరకు లిఖిం చెను. శుభ గడియలు దాటినందున శ్రీ స్వామివారి మూర్తి అసంపూర్తిగా నిలచిపోయినది. ఆ తరువాత అర్చకులు అసంపూర్తిగా నిలచిపోయిన చిటికెన వేలును పూర్తి చేయదలచి గొప్ప శిల్పిని రప్పించి శ్రీస్వామి చిటికెన వేలును ఉలితో చెక్కగా రక్తము ధారాపాతముగ ప్రవహించగ శిల్పి మూర్ఛిల్లెను. నాటి నుండి నేటి వరకు శ్రీస్వామివారు లుప్తహస్తముతోనే విలసిల్లు చున్నారు.

రెండు కొండల మధ్యనున్న బంగారు తోర ణము అప్పటి జిల్లా కలెక్టరు సర్ థామస్ మన్రోదొరకు 1914వ సం॥ అక్టోబరు 10వ తేదిన దర్శనమయినట్లు కడప జిల్లా గెజిట్ నందు ప్రచురించబడినది. ఈ తోరణము కనపడిన పుణ్య పురుషులు, ఆరు మాసము లలో దివంగతులగుదురని ప్రతీతి.

దూర ప్రాంతములనుండి కష్ట నివారణ కోసం, ఇష్ట సిద్ధి కోసం భక్తులీ క్షేత్రానికి వచ్చుచుందురు. ఆంజనేయస్వామి వారి పాదాల క్రింద వుండే మూర్తి అక్షయ కుమారుడు. ఉద్గాలి ఆచార్యులు (గండి) అనువారు విగ్రహానికి గర్భ గుడి నిర్మించి మొదట ఈ క్షేత్రాన్ని ప్రచారంలోనికి తెచ్చారు. వీరి వంశమువారే ఇప్పటికిని పూజలు చేయుచున్నారు.

ఈ క్షేత్రానికి దర్శనార్థం వచ్చు యాత్రికులే కాక నెలల తరబడి స్వామిని సేవించే సేవార్థులు కూడ ఉందురు.

ఈ క్షేత్రానికి విశేషముగ గ్రహసంబంధమైన జబ్బులు, మానసికమైన వ్యాధులు, సంతాన ప్రాప్తి కొరకు అనేకుల వచ్చి శ్రీ స్వామి వారిని సేవించి నలభయి దినములు (మండలము) పూజలు చేసి స్వామివారి అనుగ్రహము పొంది తరించుచున్నారు.

ప్రతిశ్రావణ మాసాన ఈ క్షేత్రంలో స్వామి వారి ఉత్సవాలు జరుగుతున్నవి. ముఖ్యంగా శనివారములు అత్యంత ప్రాముఖ్యంగా పూజలు జరుగుచున్నవి.

ఇచట దర్శనీయ స్థలాలు : పాపాఘ్ని నది, శేషా చల పర్వత శిఖరాగ్రము, నామాలగుండు, మాతంగ గుహ, దాసరయ్యకోన, పావురాళ్ల గుట్ట, ఏకదంతపు నాయుని కోన, భూమానందాశ్రమం, ఉమామహేశ్వర స్వామి దేవాలయం.

శ్రావణ మాసం మొత్తం యీ క్షేత్రంలో తిరణాల దినాలు. ఆ రోజులలో భక్తులు తండోప తండాలుగా వచ్చి, పాపాఘ్ని నదిలో స్నానమాడి స్వామిని దర్శించి, పవిత్రులై సంతోష, సంరంభాలలో తిరిగి వెళ్ళుతుంటారు.

వేంపల్లె సమీపమున పాలకొండల కనుమ గుండా పోవు పాపాఘ్ని లోవ (గండి) మిక్కిలి ప్రసిద్ధి గాంచినది.

ఇట్టి పరమ పవిత్ర క్షేత్రమును దర్శించి శ్రీ ఆంజనేయ స్వామి కృపకు పాత్రులు కాగలరని నమ్ము చున్నాము.

## శ్రీ పుష్పగిరి క్షేత్రము

శ్రీ కృష్ణదేవరాయల పరిపాలనలో రాయల సీమలో కడప మండలము నందు ఎన్నో పుణ్య క్షేత్రములు వైభవోపేతముగ విలసిల్లు చుండెడివి. వాని లో పుష్ప గిరి క్షేత్రము ముఖ్యమైనది. పినాకినీ నదీ తీరమున ఈ క్షేత్రము దక్షిణ కాశీగ ప్రసిద్ధి చెందినది. పినాకినీ నది కాశీ క్షేత్రము వలె ఉత్తర దక్షిణముగా ప్రవ హించుచున్నది. కడపనుండి కర్నూలు వెళ్ళే దారిలో కడపకు ఏడు కి॥మీ॥ దూరమున దిగి అక్కడ నుండి 6 కి॥మీ॥ దూరముననున్న పుష్పగిరిని చేరవచ్చును.

ఇచట నెలకొనియున్న శ్రీ చెన్నకేశవస్వామి సన్నిధి ముఖ ద్వారము ఎత్తైన గాలి గోపురముతో ఎంతో వైభవముగ నుండును.

సంతానార్థులు ఈ గిరి ప్రదక్షణము చేసినచో కృతార్థులగుదురని ప్రతీతి కలదు. శ్రీ చెన్నకేశవ స్వామిని జనమేజయ రాజు ప్రతిష్ఠించెనని జన వాక్యం కలదు. కొండకు తూర్పున మునిపాక అనుగ్రామమున విష్ణు పాదమున్నది. ఇచట మునులు తపస్సు చేసుకునే **వారని అందుం**కే గ్రామము మునిపాక అని పేరు వచ్చిన దని ప్రతీతి. రుద్రపాదమువద్ద యాత్రికులు పితరు లకు పిండ ప్రదానములొ నరింతురు. గయ శ్రాద్ధ మహాత్మ్యమిచట కలదని విశ్వాసము.

గరుత్మంతుడు మాతృదాస్య విముక్తికై అమరా వతినుండి అమృతము తెచ్చు సందర్భమున కలశము నుండి తొణకిన అమృతపు బిందువులిచటి కాసార మున పడుటచేత ఆ చెరువులో స్నానము చేసిన వృద్ధులు యౌవ్వనవంతులగుదురని, రోగులు ఆరోగ్య వంతులగుదురని, దీర్ఘాయుష్కులగుదురని జనులు నమ్ముచున్నారు.

దేవతలు దిగులు చెంది, ఆపదను తొలగించు టకై హనుమంతుని ప్రార్థించ, అపుడు హనుమంతుడు చిన్నకొండనుసరోవరమున వేయగా అది పుష్పమువలే తేలియాడుట చేత ఈ గిరికి పుష్పగిరియని పేరు వచ్చినదని పెద్దలు చెబుతారు. అపుడు గిరికిరువైపులా రుద్రుడు, విష్ణువులు నిలుచుని త్రొక్కగానిలచినది. ఆ కొండపై విష్ణు, రుద్రపాదములు కలవు. ఈ పాదము లకు ఆలయములను నిర్మించిరి.

పుష్పగిరి క్షేత్రమహిమ, ప్రసిద్ధి చెందిన సమ యము ఆదిశంకరులు పుష్పగిరిగ్రామమున శృంగేరీ పీఠమున కొక శాఖగా శారదాంబ పీఠమును స్థాపించిన తదుపిరి అని తెలియుచున్నది.

పుష్పగిరి క్షేత్రముగూర్చి స్కాంద పురాణము శ్రీశైలఖండమున చక్కగా వివరించబడియున్నది. అందువలన ఈ క్షేత్రము ఆంధ్రులకు ప్రముఖ యాత్రా స్థలముగా ప్రసిద్ధి చెందియున్నది.

ప్రస్తుతము శ్రీశ్రీశ్రీ విద్యానృశింహ భారతీ స్వాములు వారు పీఠాధిపతులుగా ఉన్నారు.

## శ్రీ పుష్పగిరి పీఠము

శ్రీ విద్యానగర మహాసామ్రాజ్య సంస్థాపకులు, చతుర్వేదభాష్యాది త్రిశత గ్రంథకర్తలు, మహా తప స్సంపన్నులు, శ్రీహరి హరరాయ సన్మానితులు, శ్రీ మద్రాజగురు పదవీ విరాజమానులునగు మాధవా చార్యులువారు శృంగేరీ క్షేత్రములో విద్యారణ్యనామక దీక్షితులై రాచకార్యములందు ధర్మ ప్రబోధమందు నిమగ్నులై ఆంధ్రదేశమున ధర్మబోధలు చేయుచు అచ్చటచ్చట దేవాలయములు నిర్మించుచు పర్య టనలు చేయుచుండిరి.

కడప మండలమున ప్రసిద్ధిచెందిన పుష్పగిరి క్షేత్రము ఆది శంకరులు శృంగేరీ పీఠమునకు అనుబంధ ముగ శారదా పీఠమునొకదానిని నెలకొల్పిరి. అందు శ్రీ శారదా విగ్రహమే కాక సాలగ్రామమేరు ప్రస్తర శ్రీ చక్రమును కూడ స్థాపించియుండిరి. అచట వెలసి యున్న కామాక్షి దేవి, వైద్య నాథేశ్వరుడు చెన్నకేశవ స్వామి మున్నగు శక్తి భరిత ప్రాంతములను చూచి శ్రీ విద్యారణ్యులు కొంత కాలమిచట తపమాచరించి పినాకినీ నదీ తీరమంతయు శైవ క్షేత్రములనెలవై, సన్యాసులకు, యోగులకు తపో యోగ్యమైన ప్రాంత ముగ పుష్పగిరిని రెండవ శృంగేరిగా ప్రభావితమైనదిగా యెనర్చిరి. శ్రీ విద్యారణ్యులు సంతసించి శ్రీ పుష్ప గిరియందు అర్చకునిగానున్న నొక బ్రహ్మచారికి పరివ్రాజకదీక్షనొసగి, ధర్మప్రచారమున కనువగువసతు లొసగి పరివ్రాజక దీక్షగొన్న యాతనికి శ్రీశ్రీశ్రీ విద్యానృసింహభారతి స్వామియని నామకరణ మొన ర్చిరి. తరువాత కైలాసమునుండి కొనరాబడి, ఆది శంకరులచేత అర్చనలగొనెడి శ్రీ చంద్రమౌళీస్వర స్ఫటికమును, శ్రీ చక్రమును ఇచ్చి, ఈ పీఠమును భారతీయసాంప్రదాయ పీఠముగ తీర్చిదిద్దిరి. తామచట కొంత కాలముండి ఈ పీఠమునకు సకల సౌకర్యములు ఏర్పాటు చేసి విద్యానగరమునకు వెళ్ళి పోయిరి.

అందువలన పినాకిని నదీ తీరమున యున్న ఈ క్షేత్రమతి ప్రాచీనమైదని తెలియుచున్నది.

శ్రీరామ చంద్రుడు రావణ వధార్థమై లంక కేగుచు నీ క్షేత్రమును దర్శించెను. అచట శ్రీ వైద్య నాధ స్వామిని కొన్ని రోజులు పుష్ప గుచ్ఛములతో పూజించెను. అలా పూజించిన యా పుష్పగుచ్ఛ ములు అచటనున్న కొలనులో పడగా అవన్నియు కొండవలె తెలియున్నందున పుష్పగిరియని పిలువ బడినదని పెద్దలు చెప్పుచున్నారు. ఇచట పినాకిని నది ఉత్తర దక్షణములుగా కాశీవలె ప్రవహించుటచే ఈ క్షేత్రము దక్షిణ కాశిగా ప్రఖ్యాతి గాంచినది.

ఇచట స్నానమాచరించినను, నీరు తాగినను ఆరోగ్యవంతులు అగుదురని భక్త జనులు చెప్పుకొను చుందురు. స్థల పురాణమున గూడ ఈ విషయము స్పష్టముగా వ్రాయబడినది.

విజయ నగర ప్రభువులు ఈ మఠమునకు భూములను దాన పూర్వకముగ వ్రాసియిచ్చిరి.

అహోబలమునుండి శ్రీరంగ పట్టణమునకు శ్రీరంగ పట్టణము నుండి అహోబలక్షేత్రమునకు వచ్చి పోవుచుండెడి యాత్రికులు పుష్పగిరిని తప్పక దర్శించి పోవు సాంప్రదాయమున్నదని పెద్దలు చెప్పెదరు.

శ్రీ విద్యారణ్యా స్వామి చేత స్థాపింపబడిన మఠాదిపతుల పరంపర నేటికిని ధర్మ ప్రచార మొన ర్చుచూ, సంచారము చేయుచునే యున్నారు.

గుంటూరు, కృష్ణ, గోదావరి, నల్గొండ వాస్త వ్యులు పీఠ మందలి గౌరవ ప్రపత్తులతో అనేక భూములు దాన మొనర్చిరి.

ఈ పీఠమున ఇప్పటికి నలభై ఎనిమిది మంది పీఠాధిపతులు గడచినారు. ప్రస్తుత పీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ మదభినవోద్దండ విద్యానృసింహ భారతీ స్వామివారు 1957 సం॥ ఫిబ్రవరి 4వవ తేదీన పీఠాధిపతియై ధర్మబోధ లొనర్చుచున్నారు. పీఠ మార్యాద నిర్వహణ యందు ప్రమత్తులైయున్నారు.

పినాకిని నదిలో పాపఘ్ని, కుందు, వల్కల, మాండవ్య నదులు కలియుచున్నందున ఈ క్షేత్ర మును పంచనదీ సంగమముగ కూడ ప్రసిద్ధి చెందు చున్నది.

పుష్పగిరియందు 101 ప్రసిద్ధ దేవాలయా లుండెడివట. కానీ ఈనాడు చోళుల కాలమునాటి వైద్యనాధేశ్వర స్వామి ఆలయము, చాళుక్యుల కాలము నాటి శివకేశవుల ఆలయము చక్కగా కన్పించు చున్నవి.

బ్రహ్మాండ పురాణమునందు పుష్ప గిరి క్షేత్ర మును గూర్చి వర్ణింపబడినది. అందువలన ఈ క్షేత్ర ప్రాచీనత తెలియుచున్నది.

హైదరాబాదు బేగం పేట నందు పుష్పగిరి పీఠమున కనుబంధముగ నొక ధర్మ ప్రచార మంది రము కలదు. ఇచట అనేక ధార్మిక కార్యక్రమాలు జరిపించుచూ భక్తుల నాశీర్వదించుచున్నారు. కావున పుష్పగిరి పురాతనము మరియు పరమ పవిత్రమైనది. ఆంధ్ర దేశమునగల పీఠములలో ప్రసిద్ధిగన్న పీఠమిది. ఇట్టి బహు పురాతన పుష్ప గిరి క్షేత్రము శిధిలావస్థ చెందుచున్నది.

భక్త వరులెల్లరు ఈ పరిస్థితిని గుర్తించి యితో ధిక ప్రయత్నములతో ఈ క్షేత్ర పూర్వవైభవమును పొందుటకు కృషి చేయుదురు గాక.

ఇంకనూ కడప జిల్లాలో పేర్కొనదగిన దేవాలములు.

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి దేవాలయము. రాయచోటి.

శ్రీ మల్లేశ్వర స్వామి దేవస్థానము. పాలతల.

శ్రీ నిత్యపూజస్వామి దేవస్థానము. నిత్యపూజ కోన.



# కర్నూలు జిల్లా

## శ్రీశైలము

శ్రీ శైలము బహు పురాతనమైన పుణ్య క్షేత్రము. కర్నూలు జిల్లా యందలి శైవ క్షేత్రములందే కాక యావత్ భారతదేశమందలి శైవక్షేత్రములలో పేరెన్నికగన్నది.

ఈ క్షేత్ర పురాణ దృక్పథము, చారిత్రక వైశిష్ట్యము, ఇచ్చటి తీర్థరాజముల మహాత్మ్యము, ఈ క్షేత్ర ప్రత్యేకతను చాటుచున్నవి.

సంధ్యావందనము మొ. పూజా సంకల్పము లందు "శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే" అను రీతిని కన్యా కుమారి నుండి కాశ్మీరము వరకు పేర్కొనుచున్న దేనాటి నుండియో తెలియకున్నది. ఇంతేకాదు, శ్రీ శైలము అనాది క్షేత్రమనుటకు పురాణేతిహాసాదుల యందు, మహోత్తమ క్షేత్రముగా పేర్కొనబడుట ప్రబల ప్రమాణము.

శ్రీ వ్యాసమహర్షి ప్రోక్తమగు స్కాంద పురాణ మందలి సనత్కుమార సంహితయందలి శ్రీశైల ఖండము నందీ దివ్య క్షేత్రప్రశస్తి ప్రధానముగా వర్ణింప బడినది.

ఇచ్చట కృతయుగమున బహుకాలము పర్వ తుడను పరమ నిష్ఠాగరిష్ఠుడైన బ్రహ్మచారి తపమొ నర్చినాడు. ఇతడు లోకమునుద్ధరింప సంకల్పించి, బహు కాలము తపముచేసి పరమేశ్వరుని మెప్పించి నాడు. ఇతడు తన పరార్థహితమున పరమేశ్వరుని విస్మయ పడ జేసినాడు. ఇట్టి ఘోరతపోమహిమా తిశయమున , సర్వ తీర్థములతో, సర్వదేవతలతో, ఎన్నో పర్వతములతో, స్వర్గ, మర్త్య పాతాళ స్థితము లగు దివ్య పదార్థములతో, దివ్యౌషధములతో, సదా శివుని పరాశక్తి యగు పార్వతితో, నిత్యము తనయం దుండునట్లు తానేనాడో చేయగలిగినాడు.

శ్రీ స్కాంద పురాణ శ్రీ శైలఖండమునను సరించి శ్రీశైల క్షేత్ర మహిమలను వివరముగా పార్వతికి, పరమేశ్వరుడిచటనే వివరించినట్లు తెలియుచున్నది. ఈ శ్రీశైలఖండము రసవంతమైన మహా గ్రంథముగా వ్యాసభగవానుడు శ్రీ మల్లిఖార్జున దేవునకు సమర్పించి కృతార్థుడైనట్లు కూడా తెలియుచున్నది.

అవతార పురుషుడైన శ్రీ రామచంద్రుడు సీతాసమేతముగా నిచటకు వచ్చి ఈ గిరి ప్రదక్షిణ

మొనర్చి తన బ్రహ్మ హత్యా పాతకమును తొలగించుకొనుటజరిగినది. శ్రీరాముడు రావణ వధానంతరము తనకు కలిగిన బ్రహ్మ హత్యా దోషమును బాపుకొనుటకై సేతువు కడ శ్రీరామలింగేశ్వర ప్రతిష్ఠ యొనర్చినను నిశ్శేషముగా ఆ పాపమునండి విముక్తుడు కాలేదు. వశిష్ఠాదుల నియోగముననిచటకు వచ్చి ఈ గిరి ప్రదక్షిణ మొనర్చి అట్టి దోషమును తొలగించుకొనినాడు. ఈ విషయము శ్రీశైలఖండము స్పష్టముగా చెప్పుచున్నది. ఈతని గిరి ప్రదక్షిణ ఉత్తర ద్వారమునసున్న మహేశ్వరమునుండి ఆరంభమయినది. ఆ సమయమున శ్రీరామచంద్రుడు సీతాసమేతుడై యొనర్చిన అనేక ప్రతిష్ఠలు కలవు. స్కాంద పురాణమున ఈ తీర్థములు వర్ణింపబడినవి. హరి వంశము నందు, శ్రీ రాముడు సీతాన్వేషణార్థము దండ కారణ్యమున సంచరించుచూ నిచటకు వచ్చినట్లు విశదముగా తెలియ చెప్పబడినది.

అంతేకాక దక్షుడిచటి సంగమేశ్వర తీర్థమున దక్షయజ్ఞమొనర్చినాడు. సతీదేవి యీ సంగమేశ్వరముననే తాను తండ్రిపై కోపించి, శివాపరాధియగు యాతని వలన తన శరీరమునొల్లక నివృత్తి జేసుకొనినది. కనుకనే ఇది నివృత్తి సంగమేశ్వరమైనది. దక్ష యాగ విధ్వంసమిచటనే జరిగినది. బ్రహ్మచే ప్రార్థితుడై పరమ శివుడిచటి తీర్థమున సర్వకలా సంపూర్ణుడై సంగమేశ్వరుడుగా అవతరించినాడు. ఇది యునుగాక, పరమేశ్వరుడు ప్రళయానంతరము కొన్నినాళ్ళిచట విశ్రాంతిగా నుండి ఇచ్చట నుండియే దేవతలను సృష్టించినాడు. ఇదియే "దేవ హ్రదము" కనుక ఈ కల్పమునందలి సృష్టి ప్రారంభమగు నాటికే ఈక్షేత్రము వెలసియున్నదనవచ్చును.

త్రిపుర సంహారము నాటికి కూడ శ్రీశైలమున్నట్లు శ్రీశైలఖండము ననుసరించి తెలియుచున్నది. లింగాగమ సమయమందు మహాలింగము పరమేశ్వర బాణా ఘాతమున కోటానుకోట్ల లింగములుగా నిచటకు వచ్చిపడినదని శ్రీశైలఖండమువచించుచున్నది.

శ్రీశైల ఉత్తర ద్వారము "ఉమామహేశ్వరము" గా వెలసినది. సతీదేవి సంగమేశ్వర తీర్థమున దేహ త్యాగమొనరించి హైమవతిగా జన్మించి, ఇచట తపము చేసి మహేశ్వరుని అర్థ శరీరమును పొందినది. ఇందుకు నిదర్శనముగా ఉత్తర ద్వారమున ఉమాదేవి ద్విభుజగా కానవచ్చుచున్నది. ఉమామహేశ్వర తీర్థ మిచట వెలసియున్నది. అర్థ నారీశ్వరి అనా దిగా మహాశక్తిగా ప్రసిద్ధి గాంచినది. భ్రమరాంబ ఇచటకు వలసవచ్చిన మహాదేవి. ఈ వృత్తాంతము శ్రీశైల ఖండమునుబట్టి మనము తెలుసుకొన వచ్చును.

అరుణాసురుడు మహిషాసురాదుల కంటె బలవంతుడు. ఘోర రాక్షసుడు. ఈతడు హిమవంతమున దేవి భ్రమరాంబచే చంపబడినాడు. అంత, దేవతలు శ్రీ భ్రమరాంబాదేవిని భూలోకముననుండ ప్రార్థించిరి. తనకు నివాసయోగ్యమైన స్థలము శ్రీశైలముగా భావించి యిచటకు తానుగావచ్చి వెలసినది. మార్కండేయ పురాణమీ భ్రమరీ శక్తి వృత్తాంతమును విశద పరిచినది.

దీనిననుసరించి యరుణాసురవధ ఇరువదవ వైవస్వత మన్వంతరమున జరిగినదిగా నిర్ణయింపవచ్చును. అందువలన ఈ క్షేత్రము ఇంతకు ముందే నాడో వెలసినదనవచ్చును. అర్థనారీశ్వరీ దేవియే ఇచటి మహాశక్తియై యీ మహాక్షేత్రదేవతగా శ్రీమల్లిఖార్జునినితో కూడా తాను వెలసియున్నదనుట కెట్టి సందేహము లేదు. ఈమె దేవాలయము మల్లిఖార్జున స్వామి పార్శ్వముననేయున్నది. ఈ అర్థ నారీశ్వరీ దేవి మహాశక్తి యైనట్లు ఈ క్షేత్ర దేవతగా యున్నట్లు శ్రీశైలమహా సంకల్పము కూడా చెప్పుచున్నది.

శివ పురాణము, పార్వతి ఇచ్చటి అనాది దేవతయని తెలుపుచున్నది. ఇచ్చట ఉమాదేవి ఆల యము కలదు.

నందీశ్వరుడు, శిలాద తనయుడై యిచటనే నందిమండలమున ఎన్నో యుగముల కాలము మహా తపమొనర్చి, గణాధిపత్యముతో శివవాహనత్వము కూడా పొందినాడు. శిలాదుడు కూడ ఇట తపమొన రించి ప్రమధ గణాధిపత్యమును వరముగా శ్రీమల్లి ఖార్జునుని వలన పొందినాడు.

శ్రీశైలఖండము, శివపురాణాదులు కూడ నందికేశ్వర వృత్తాంతమును వర్ణించినవి. నందీశ్వరుడు శివుని వాహనమగుట ఏనాటిదో. అయితే అంతకు ముందే శ్రీశైలము వెలసి శివుని కావాసమై యున్నది. అందువలన శ్రీశైలము నందీశ్వరుడు శివుని వాహన మగుటకు ముందే యున్నదని తెలియుచున్నది.

శ్రీ శైలఖండమునననుసరించి శ్రీపర్వతము మొదట మందరపర్వతముగా నుండెడిది. తరువాత వసుమతి అనునామె యిట తపస్సొనరించి బ్రహ్మ వలన వరము పొంది శ్రీదేవతగాయైనది. శ్రీదేవతగా నిచ్చటనామెయైనందున "శ్రీ పర్వత" మను పేర ప్రసిద్ధి చెందినది.

ఇట "గరుడేశ్వర" తీర్థముకలదు. గరుడుడిట శివానుగ్రహమువలన విష్ణు వాహనత్వమును పొంది నాడు. ఇచట విష్ణువు కూడా శ్రీమల్లిఖార్జునుని ప్రసా దమున శంఖు, చక్రములు పొందినట్లు తెలియవచ్చు చున్నది. అందువలన సృష్ట్యాదినుండియేకాక అంతకు ముందును నున్న మహాక్షేత్రమిది.

శ్రీ మల్లిఖార్జుననకైపుడాశ్రయమైనది యను నది పర్వతునినాడని నిర్ణయింప వచ్చును. పర్వతుడు కృతయుగమునాటి వాడు. శిలాదుడును అప్పటివాడే. నందికేశ్వరుడు కూడ. శిలాదునకు, పర్వతునకును ఎట్టి సంబంధము లేదనవచ్చును. శ్రీశైలఖండమిట్లు చెప్పుచున్నది.

పాల్కురికి సోమనాధుని పండితారాధ్య చరిత్ర యందు పెక్కు యుగముల క్రింద శ్రీపర్వతమున్న దనియు, పురాణమహిమ పార్వతికి పరమేశ్వరుడు చెప్పునప్పుడున్నది. అనగా పరమేశ్వరుడు పార్వతికి తన మల్లిఖార్జున నామవృత్తాంతమును గూర్చి చెప్పు చూ చంద్రావతి వృత్తాంతముగూడ చెప్పియున్నాడు. ఈ చెప్పుట జరిగినది కృతయుగములో ఇప్పటి కృతయుగమే ఇది అనుకొన్నను చాలకాలము నాటిదే యిది కాని ఈ నాటిది కాదు. పరమేశ్వరుడు చెప్పిన నాటికి జరిగియున్నది.

ఇచ్చటనున్న భ్రమరాంబ మూల విరాట్టు మహిషాసుర వాహన. అష్టభుజ దుర్గాదేవి. ఈమె అరుణాసురుని, హిమవంతమున నుగ్రరూపమగు భ్రామరీ రూపమున, చంపినది. దేవతలా యుగ్రరూప మును చూడ జాలక, యుపసంహరించి తమకు ముందు సాక్షాత్కరించిన దివ్య రూపమును (దుర్గా రూపమును) ధరింపవలసిందిగా ప్రార్థింప దేవి యట్లే వారు కోరిన రూపమున మహిషాసుర వాహ నయై, శ్రీశైలమునకు వచ్చి శ్రీ దుర్గగా వెలసినది.

ఈ భ్రమరాంబాదేవిని గూర్చి తన గ్రంథము నందు "మెకంజీ" వ్రాసియున్నాడు. అమ్మవారు వారణాసి యందు మహిషాసురుని భ్రమర రూపముతో వధించి "భ్రమరి" యైనదని "శ్రీశైలఖండము" చెప్పుచున్నది. మహిషాసురుని వధను గూర్చి చెప్పిన ఏ పురాణములును భ్రమర రూపమున దుర్గ మహి షుని వధించినట్లు చెప్పలేదు. శ్రీ శైలము నివాస యోగ్యమని ఆమెయే నిర్ణయించుకొని కోరి ఇచటకు వచ్చినది. కన్నడములో కూడ ఈ భ్రమరాంబ వృత్తాంతము కలదు.

ఇచ్చట వెలసిన వృద్ధ మల్లిఖార్జునుని భక్తులు సేవించుచుందురు. భ్రమరాంబ పూర్వమొక మహా రాజు కుమార్తె. గొప్ప శివభక్తురాలు ఒకప్పుడు,

పరమశివుడు ఈమెకు స్వప్నమున నవయౌవ్వన వంతునిగా జగన్మోహనమగు ఆకారముతో దర్శన మిచ్చెను. ఈమె పరమశివుని రూపమున కానందపడి తన్ను వరింపమని గోరెను. అపుడు పరమశివుడొక భ్రమరమునుజూపి ఆ భ్రమరమెచట వాలునో చూచి అచ్చటకు వచ్చిన తాను వరింతునని చెప్పెను. ఆమె యా భ్రమరము వెంట వచ్చి వచ్చి యది శ్రీశైలము నొక మల్లెపొదలో చేరుట చూచి అచట నిలచి, పరమశివుని రాకకై వేచియుండెను.

కొన్నాళ్ళచ్చటనే యుండి ఆకలిదప్పులకు అలమటించుచుండ ఆచటి చెంచులామెను తమ మాంసాహారమునకు మరపి పుత్రికా వాత్సల్యముతో రక్షించుచుండిరి.

ఇట్లు కొన్నాళ్ళు గడవగ, శివుడు పార్వతితో శ్రీశైలమునకు వచ్చి యీ రాజకన్య భక్తి నామెకు చెప్పి యామెను వరింప వలసియున్నదని చెప్పెను. పార్వతి అందులకు "కన్యలు కనబడిన నీవిట్లే చేయు చుందువని" పలుక, భ్రమరాంబ భక్తినామెకు చూప దలచి మహారణ్యములో ఆమె తన కొరకు పడుతున్న దురవస్థ చూపి, తానప్పుడు శరీరమంతయు ముడు తలుతో కూడిన వృద్ధునిగానయి, యారాజ కన్యకు ప్రత్యక్షమై "ఇదివరకు నన్ను వరించెదనంటివి వరింపు" మనెను ఆమె నేను వరింతునన్నది నిన్ను కాదనెను. ఆమెకు నమ్మకము కలుగునట్లు "నన్నే వరింతునంటివి" అని, దానిని నిరూపించెను. భ్రమ రాంబయు తానన్నమాట తప్పకయట్లే వరింతున నెను. ఇలా ప్రత్యక్షమైన వృద్ధ మల్లిఖార్జునుడే యీ గుడికి ప్రక్కనే యున్న మల్లిఖార్జునుడు. ఈ రాతి యందు అంతటను నెగుడుదిగుడుగానున్నట్లుండి, బీటలు వారినట్లున్నవియే శరీరమునందలి ముడుత లుగా నుండి, యీతనే వృద్ధ మల్లిఖార్జునుడగుటను తెలుపుచున్నది.

తరువాత, నాతడా మల్లికాగుల్మమువనుండ భ్రమరాంబయాతనిని మల్లీపుష్పములతో పూజించి నది. మల్లిఖార్జునుడు ఆమెను గ్రహించి మల్లికా పుష్పములతో నన్ను నీవిచట పూజించితివి గాన మల్లిఖార్జునుడను పేరునాకుండునని పరమశివుడనెను. అంత నారాజకుమారియు భ్రమరము వాలిన చోట నీకై ప్రతీక్షించి నిన్ను నేను చెపట్టితినిగాన భ్రమ రాంబ నేనగుదుననెను. వారిద్దరికి వివాహమైన పిదప ఆమెను పరమశివుడు తన వెంట గొనిపోవ సిద్ధపడగా పుత్రికగా చూచుకొనుచున్న యామెను తీసికొని పోవుచున్న పరమశివునిపై చెంచువారు కలియబడిరి. అప్పుడు పరమశివుడు ఈమెయేనన్ను వరించినది అని చెప్ప" తమ కల్లుడైనందున తమ యింట విందారగించి, ఆమెను తీసికొని పొమ్మన, అట్లే చేయవలయునని లేనిచో తన పుట్టింటి వారిని అవమాన పరచినట్లు అగునని భర్తకు చెప్పెను. పరమ శివుడు అందులకు అంగీకరించ లేదు. మాంసాదుల ముట్ట నిచ్చగించలేదు. అట్లయిన నేను నీతో రాలేనని భ్రమరాంబ చెప్పిన పిమ్మట ఆమెను వదలి వెళ్ళు టకు సిద్ధమైనాడు. మల్లిఖార్జు నుడు కొంతదూరము వెళ్ళినాడు కూడ అప్పుడామెయాతని ఎడబాటు సహించలేక "మల్లిఖార్జునా"యని పిలిచెను. అయినను వినిపించుకొనక ముందుకు సాగుచున్న మల్లిఖార్జు నుని ఆమె "మల్లయ్యా!" అనిపిలిచెనట. అప్పుడును మరలక పోవుచుండ "చెవిటిమల్లయ్యా!" అని పిలిచె నట. అప్పుడా పరమశివుడు పార్వతితో చూడుమని ముచ్చటించుచుండ నారద మహర్షి భ్రమరాంబతో "చూడు! పరమశివుడు నీ సపత్నితో నాలోచన చేయుచూ నిన్ను విడిచిపోవ సిద్ధపడుచున్నాడు" అని చెప్పగ ఆమె కోపించి లింగరూపమున అటనే యుండునట్లు శాపమిచ్చెను. అంత మల్లిఖార్జునుడు లింగ రూపముననట వెలసెను. పార్వతికూడ ప్రక్కనే వెలసెను. మల్లిఖార్జునుడు భర్తను శపించితివి కావున

"నీవును ఇచ్చట శిలా రూపమున నుండి మత్స్య, మాంసాదుల భక్షించుచూ వామాచార పద్ధతితో సర్వ వర్ణములవారును పూజించుచు నిన్ను స్పృశించు చుందురు గాక. మరియు శిఖా, యజ్ఞోపవీతములు లేని పాషండులు నీకర్చకులగుదురు గాక!" అని ప్రతి శాప మొసగెను. భ్రమరాంబను పాణిగ్రహణమొనర్చు నపుడు అర్ధాంగమామెకు సంక్రమించినందున అర్థ నారీశ్వరుడుగా మల్లి ఖార్జునుడాయెను.

ఇచట, మల్లిఖార్జునుని "చెవిటి మల్లయ్యా!" అని పిలుచు వాడుక కలదు. పూర్వమిచ్చట భ్రమ రాంబా దేవికి, జంతు బలులు ఇచ్చెడి వారని, ఇచ్చటి వారు చెప్పుదురు.

ఇచట మల్లిఖార్జున దేవాలయము, దానినాను కొని అర్థ నారీశ్వర, పార్వతీ దేవాలయములు, మల్లి ఖార్జున దేవాలయమునకు దగ్గరగా భ్రమరాంబ దేవాల యమును నున్నవి. ఇచట జంగమువారే పూజారు లగుట జరిగినది. అందరు ఇచట మల్లిఖార్జునుని తాకి పూజించుచున్నదిందులకే. భ్రమరాంబ దుర్గాశక్తి కావున బలి, పూజాదుల పరిగ్రహించుట కూడ నిట్లే జరుగుచున్న దనుచున్నారు. ఇచ్చట సంక్రాంతి యందు పార్వతికి కళ్యాణము శివరాత్రియందు భ్రమరాంబకు కళ్యాణము జరుగుచున్నవి. ఈ సమ యమున కొంకణము, మైసూర్ వారు పుట్టింటి వారమనుచు "క్రంత" తీసికొని వచ్చుట ఇప్పటికిని ఆచారముగ పాటించుచున్నారు.

చంద్రావతి చరిత్ర కూడ ఇచ్చట ప్రాముఖ్యత నందినది. చంద్రగుప్తుడు దండయాత్రకు వెడలి ఇచ టకు వచ్చునప్పటికి చంద్రావతి యౌవ్వనవతియై యుండ ఆమెను తండ్రి మోహించిన ఆమె కోపగించి తన తండ్రి రాజ్యము జన శూన్యమై విజన ప్రదేశ మగునట్లు శపించి, శ్రీశైలక్షేత్రమున శివుని సేవిం చుచూ కాలము గడుపుచుండెడిది. ఆమె ఆవుల మందలో నొక యావు ప్రతిదిన మెటకో పోయి పట్టి పొదుగుతో వచ్చుచుండెడిది. అది తెలిసికొని ఒక దినమున చంద్రావతి ఆ యావును వెంబడించినది. ఒక చోట నాయావు లింగరూపమున నున్న పరమ శివునిపై పాలు వర్షించుచుండెను. చంద్రావతి యిది చూచి, చాల ఆశ్చర్యపడినది. ఆరాత్రి స్వప్నమున శ్రీశైలపతియామెకు దర్శన మొసగి గుడి కట్టించమని చెప్పెను. అటులనే చంద్రావతి ఆలయము కట్టించి పరమశివుని సేవతో కాలము గడుపుచుండెను. పిదప యామె మల్లిఖార్జునుని అర్చించి శివునితో ఐక్యము చెందినది. మెకంజి (వాల్యూమ్ 27) చంద్రావతి గాథను వ్రాసెను.

శ్రీశైలఖండము శ్రీశైలమునకు, ద్వారము లను పేర్కొనినది. అందు ప్రధాన ద్వారము లేవన త్రిపురాంతకము, శిద్దేశ్వరము లేక సిద్ధవటము బ్రహ్మేశము లేక ఆలంపురము, ఉమామహేశ్వరము ఈ ద్వారము లందంతట ప్రత్యేకము నాలుగు కొండ లున్నట్లు పేర్కొనినది.

శ్రీశైల చరిత్ర, వాఙ్మయ పరిశోధననుసరించి ఇది ఎంతో ప్రాచీనమైన క్షేత్రరాజమని తెలియు చున్నది. పద్మ పురాణము ఈ క్షేత్రమహాత్మ్యమును వర్ణించినది. మహా భారతమున ధర్మరాజు తీర్థ యాత్రా సందర్భమున శ్రీపర్వతమును గూర్చి చెప్ప బడినది. భాగవతమునందు బలరాముని తీర్థయాత్రా సందర్భమున శ్రీశైలమును పేర్కొనినది. శివపురా ణము శ్రీ మల్లిఖార్జునుని శ్వేతకల్పములోనిదిగా పేర్కొనినది. స్కాందపురాణము నందలి కాశీఖండము కూడ శ్రీ శైలము గూర్చి చెప్పినది. శ్రీరాముడు సీతనువెదుకుచు ఇచ్చటకువచ్చినట్లు "శేషధర్మము" అనగా భారత భాగాంతర్గతమగు హరివంశమున "ఆశ్చర్య పర్వము"నందు చెప్పబడినది. ఆదిత్య పురాణము నందు శ్రీపర్వత మహిమ వర్ణింపబడినది.

అంతేకాక సూతసంహిత యందలి జ్ఞానయోగ ఖండమున శ్రీ పర్వతము పేర్కొన బడినది. శ్రీ మాధవాచార్య కృత శంకర విజయమునందు శ్రీశైల వర్ణన కలదు. ఆదిశంకరులిచటకు వచ్చినట్లు తెలియుచున్నది. వీరిచ్చట తపమొనర్చిన స్థలము గుర్తింపబడినది. శంకారాచార్య విగ్రహ ప్రతిష్ఠ కూడా జరిగినది. శివానందలహరి భ్రమరాంబా స్తోత్రము, అర్థనాదీశ్వర స్తోత్రము అనునవి. శ్రీ శంకర పూజ్య పాదులచే రచింపబడి, వీరికి క్షేత్ర పరిచయమును విశదపరచుచున్నది.

ఇంకను సోమేశ్వర కవి రచయితమైన "కథా సరిత్సాగరము" శ్రీశైలమును స్మరించినది. భవభూతి విరచితమగు "మాలతీ మాధవము"న శ్రీశైల ప్రసక్తి కలదు. బాణబట్టు రచించిన "కాదంబరి" యందును శ్రీ హర్షుని "రత్నావళి" యందును శ్రీశైల ప్రసంగము కలదు. నిత్యనాథుని "రసరత్నాకరము"న " శ్రీ పర్వత సాధన" యను పేర రసాయన ఖండము కలదు.

సంస్కృత వాఙ్మయమందేకాక తెలుగు వాఙ్మయమున కూడ నన్నయభట్టు అర్జునుని తీర్థయాత్రా సందర్భమున శ్రీశైలమును వర్ణించినాడు జక్కనకవి వ్రాసిన విక్రమార్కచరిత్ర యందు శ్రీశైల ప్రసక్తి వివరముగానున్నది. శైవ కవి పాల్కురికి సోమన రచించిన "పండితారాధ్య చరిత్ర" యందలి పర్వత ప్రకరణమున శ్రీశైలమహిమ వర్ణింపబడినది. గౌరన రచించిన "నవనాథ చరిత్రము"న కూడ యీకొండ ప్రసక్తి కలదు. నాగార్జునుడీ కొండనుబంగారు కొండ చేయ ప్రయత్నించినట్లు వ్రాసియున్నాడు. శ్రీనాథుని "కాశీ ఖండము"న (శివరాత్రి మహాత్మ్యమును శ్రీశైల మఠాధిపతికి కృతి యిచ్చి యున్నాడు.) ఈ క్షేత్ర ప్రాభవమును వర్ణించినాడు పింగళి సూరన కళా పూర్ణోదయమున, రఘునాద రాయలు వ్రాసిన "వాల్మీకి చరిత్ర" యందు కూడా శ్రీ శైల వర్ణన కలదు.

ఇట్లు ఉభయ వాఙ్మయముల యందు శ్రీశైలము గూర్చి విపులముగా వర్ణింప బడుటచేనీ క్షేత్ర రాజము ప్రాచీన మైనట్టిదని తమిళ, కార్ణాటకాది వాఙ్మయములలో కూడ దీనిని వర్ణించుటచే నిది సుప్రసిద్ధ దివ్య క్షేత్రమని తెలియుచున్నది.

శ్రీశైల చారిత్రక దృక్పథమును పరిశీలించి నచో అనేక విశేషములు తెలియును. శ్రీ శైల ఖండము చంద్ర గుప్తుని గురించి చెప్పినది. ఈతని కుమార్తెయే చంద్రావతి. ఈమెయే మల్లెపూవులతో స్వామిని పూజించి మల్లి ఖార్జునుని చేసినది.

ఈతడు మగదేశ్వరుడని భవిష్య పురాణమున కలదు. ఈ వర్ణనల వలన చంద్రగుప్తుడు గుప్తవంశపు మహారాజని తెలియుచున్నది. శ్రీశైలఖండము ఈ మహారాజును విక్రమాదిత్య బిరుదాంకితుడని తెలిపినది. ఈతడు గుప్త వంశమునకు చెందిన రెండవ చంద్రగుప్తుడు మౌర్య సామ్రాజ్య మంతరించిన తరువాత ఆంధ్ర సామ్రాజ్యమవతరించినది. అదియే శాతవాహన సామ్రాజ్యము. మల్లిఖార్జున నామము చాలా ప్రాచీనమైనది. మగధరాజవంశీయులు శ్రీ పర్వతీయులు మగధ సింహాసన మధిష్ఠించి ఏక ఛత్రాధిపతులై భూమినేలిన "నవనందులు" అని పేరెన్నిక గన్నవారు. శ్రీశైలమున "నంది మండలము" వీరు పాలించిన స్థలమే. మగధ రాజులకు శ్రీశైల దేవుడే ఆరాధ్య దైవమై యున్నట్లు తెలియుచున్నది. అందువలన చారిత్రక దృష్టితో చూచినను ఈ క్షేత్రమెంతో ప్రాచీనమై నంద రాజ్యమునకు చాలా పూర్వమే యున్నదనుటకు సందేహము లేదు.

గుప్తవంశము తరువాత ప్రమరవంశము. ఈ వంశములోని ప్రభువే శకస్థాపకుడగు విక్రమార్కుడు. ఈ విక్రమార్కుడే శ్రీహర్ష విక్రమార్కుడు. శ్రీహర్ష శకస్థాపకుడు. విక్రమార్క శకమిదియే క్రీ.పూ. 82వ సం॥నకు చెందినవాడీయన. ఈయన ఆంధ్ర శాతవాహనులలో యొక శాఖకు చెందిన వాడు. వీరు

శ్రీశైలమును రాజధానిగా చేసికొని యాంధ్ర దేశమును, మహారాష్ట్రదేశమును పరిపాలించిరి. శాలివాహనుడు విక్రమార్కుని మనుమడు. జక్కన తెలుగులో విక్రమార్క చరిత్ర వ్రాసియున్నాడు. ఈతడు శ్రీశైల పర్వతమును వర్ణించి యున్నాడు. ఈతని కాలము నాటికే శ్రీశైలఖండము బహుళ వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది. విక్రమార్కుని తండ్రి ఈ శ్రీశైల ప్రాంతమున తపమొనర్చినట్లు విక్రమార్కచరిత్ర చెప్పుచున్నది. రామభద్రుడు రచించిన పతంజలి చరిత్రమున చంద్రగుప్తుని కుమారుడు విక్రమార్కుడైనట్లు కలదు. విక్రమార్కుడు బేతాళుడు చెప్పిన కథలను కొన్నిటిని భవిష్య పురాణము పేర్కొనినది. అందు చంద్రావతి గాథ కూడ కలదు.

నాగార్జునుడు లేక సిద్ధనాగార్జునుడు యోగౌషధీ ప్రచారము కొరకై ఆంధ్ర దేశమునకు వచ్చి శ్రీశైలమును బంగారుకొండగా చేయగడగి తన రసవాదమును జగద్విదితముగా చేయ సంకల్పించెను. ఈ చరిత్ర యంతయూ నవనాథ చరిత్ర యందు కలదు. అతడు శ్రీశైలమునకేగి కృష్ణవేణిని సందర్శించినాడు. ఈతడు బసవేశ్వరుని కాలమున నున్నవాడని తెలియవచ్చుచున్నది. నారద పురాణమున మీననాథుని గాథ కలదు. లోహమును బంగారమొనర్చు దివ్యమూలికలు, దివ్యౌషధులు శ్రీశైలమున విరాజిల్లుచున్నవనుట తేటతెల్లమొనర్చినది.

క్రీ.శ. 1వ శతాబ్దములోనే శ్రీశైలము ప్రసిద్ధి చెందినది. ఉత్తర మహారాష్ట్రమునందలి "నాసిక" గుహలో గల శిలా శాసనమునను సరించి శ్రీశైల మా కాలముననే యున్నట్లు తెలియుచున్నది. శాత వాహనుల పరిపాలన బహుకాలము నడచినది. వీరికి శ్రీశైలము పరిచితము. ఇక్ష్వాకులనువారును కొంతరాజ్యమును పరిపాలించిరి. ఈ శ్రీశైల ప్రాంతమువారి రాజ్యములో అంతర్భాగముగనున్నది. స్కంద భక్తుడను రాజా శివభక్తుడగుటవలన శ్రీశైలము బాగుగా నభివృద్ధి పరిచినాడు. తరువాత పల్లవులు పరిపాలనకు వచ్చిరి. వీరి రాజ్యములో శ్రీశైలము ఒక భాగముగనున్నది. నాల్గవ శతాబ్ద చివరికాలములో గోదావరి కృష్ణల మధ్య భాగము, విష్ణుకుండినుల యధికారములోనికి వచ్చినది. వీరి శాసనముల వలన వీరు శ్రీశైలమల్లికార్జునుని పూజించుచుండెడి వారని తెలియుచున్నది. తూర్పు కనుమల కావలనున్న వాకాటకులతో స్నేహము చేయుట వలన ఈ రెండు రాజ్యముల యధీనమున నుండి శ్రీశైలము అభివృద్ధి చెందినది. కదంబుల ఏలుబడిలో కొన్ని సంవత్సరములు శ్రీశైలమున్నది. తెలుగుచోళులు శ్రీశైల ప్రాంతమును, ఆరవ శతాబ్ది నడుమ పాలించిరి. పిదప పదియవ శతాబ్ది వరకు శ్రీశైలము రాష్ట్ర కూటుల పరిపాలనలోనున్నది.

దక్కను పాలించిన వారలో ముఖ్యులు కాకతీయులు. 1116టికి శ్రీశైలము కాకతీయ సామ్రాజ్యమునకు దక్షిణ సరిహద్దుగా నుండెడిది. ప్రతాపరుద్రుడు అతని భార్య శ్రీశైలమునకు వచ్చి తులాభారము తూగినట్లు తెలియుచున్నది. వీరు కొంత భూమిని శ్రీమల్లికార్జున స్వామికి మధ్యాహ్ననివేదన నిమిత్తం దానము చేసినట్లు తెలియుచున్నది. కాకతీయ సామ్రాజ్యము పడిపోయిన పిదప ప్రోలయ వేముడు శ్రీశైల ప్రాంతము నాక్రమించెను. ఈతడు శ్రీశైలమునకు మెట్లు కట్టించి పాతాళ గంగకు పోవు మార్గమును బాగు చేయించెను. మల్లికార్జున దేవాలయ విమానమునకు బంగారు శిఖరములేర్పరచెను. రెడ్డిరాజులలో మూడవవాడైన "అనవేమారెడ్డి" 1378 లో శ్రీశైలము వచ్చి మల్లికార్జునునికి మండపము కట్టించెను.

పిదప, విజయనగర రాజుల వశమయినదీ శ్రీశైలప్రాంతము. రెండవ హరిహరుడు శ్రీశైలమల్లికార్జున భక్తుడు ఈ గుడికి ముఖ మండపము కట్టించెను. దక్షిణ గోపురపు మండప వైశాల్యము పెంచెను.

ఈతని భార్య విఠలాంబ పాతాళగంగకు మెట్లు కట్టించి విఠలేశ్వర ప్రతిష్ఠ నొనర్చెను. కొండవీటి రెడ్డి రాజుల తరువాత విజయనగరములో శ్రీ కృష్ణ దేవరాయల కాలమున వీరి రాజ్యములీనమైనది. సాళువ తిరుమ లయ్య శ్రీశైలగుడికి చాలా దానములు చేసినాడు. సాళువ వంశమునకు చెందిన వారీ మల్లి ఖార్జున దేవాలయమును అభిమానముతో జూచిరి. వీర నరశింహరాయలు ఈ దేవుని దర్శించి పూజించి వెళ్ళినాడు. సాళువ పెదమల్లప్పరాజు 1485లో ఒక చెరువును త్రవ్వించి ఇచ్చినాడు. తదుపరి శ్రీ కృష్ణ దేవరాయలు శ్రీశైలమొక ప్రత్యేక రాష్ట్రముగ విభ జించినాడు. చిన్నమదేవితో, తిరుమల దేవితో శ్రీ శైలము వచ్చి మల్లిఖార్జున స్వామికి చాలా బహుమాన ములు ఇచ్చినాడు. శ్రీ కృష్ణ దేవరాయల పరిచారికలు కూడా చాలా దానములు చేసిరి. 1520 చంద్రశేఖ రామాత్యుడు కళ్యాణమండపం, చిన్నగుడి కట్టించెను. రామరాజు కూడా శ్రీశైలస్వామి వార్కి విలువ గల కానుకలిచ్చెను. శాసనముల ననుసరించి చాలామంది భక్తులు చాలా దానములు చేసినట్లు కానవచ్చుచు న్నది. 1565 రక్కసగడి యుద్ధములో రామరాజోడి పోవుటతో దాని ప్రభావము శ్రీ శైలముపై పడినది. గోల్కొండ బీజాపూర్ సుల్తానులు ఈ ప్రాంతమును ఆక్రమించిరి. శ్రీశైలమీ కాలమున చాల బలహీనదశకు వచ్చినది.

మరాటారాజు శివాజీ 1674లో శ్రీశైలమునకు వచ్చి మల్లిఖార్జునునకు అమ్మవారికి పూజలు చేసి వెళ్ళెను. ఉత్తరపు గోపురము కట్టించెనని స్థానిక ప్రతీతి కలదు. మరాటీ సైనికులు శ్రీ శైలమును రక్షించిరి. తదుపరి ఇబ్రహింఖాన్‌కు రాజ్యము సంక్ర మించెను. ఈయన కాలమున శ్రీ శైలము తిరిగి వృద్ధి చెందెను. పిదప కొంలది కాలము 18వ శతాబ్దిలో టిప్పుసుల్తాను ప్రభావములోనికి వచ్చినదీప్రాంతము. నైజాంనవాబు 8.4.1782 తేIగల "ఫర్మానా" పునరు ద్ధరింపబడి [illegible]న దేవస్థాన పరిపాలనా భారము శ్రీ శృంగేరి జగద్గురువుల వారికి అప్పగింప బడినది. కాని 1840లో ప్రస్తుతము కడప జిల్లాలో నున్న పుష్పగిరి పీఠాధిపతులకు ఇంగ్లీషువారు అప్పగించిరి. శ్రీశైలము పూర్తిగా చెడిపోయి పాడుబడి పోయినది. దేవాలయ నిర్వహణ సరిగాలేనందువలన 1949 వరకు శ్రీశైల దేవస్థాన మేనేజిమెంటు బోర్డు వారు నిర్వహించిరి 1964 వరకు కార్యనిర్వాహణాధికారి అధికారములో నుండిన పిదప ట్రస్టు బోర్డు ఆధీనము లోనికి వచ్చినదీ దేవస్థానము.

ఇచ్చట ఎన్నో శైవ మఠములు వెలసినవి. ఇందు భిక్షావృత్తిమఠము చాలా ప్రసిద్ధి చెందినది. "శ్రీశైలముకైపీయతు"లో భిక్షావృత్తి శాంతయ్య కుమారుడు శిద్ధ భిక్షావృత్తి శ్రీశైల మఠాధిపత్యం చేసినట్లు తెలియుచున్నది. ఈ మఠము చాలా కాలము శైవ గురువుల పరిపాలనలో నున్నది.

క్రీ.శ. 12, 13వ శతాబ్దములలో శ్రీశైల క్షేత్రాభివృద్ధికి సంబంధించిన శాసనములు పెక్కు కలవు. 12వ శతాబ్దిలో హొయసల రాజు సామం తుని శాసనము ననుసరించి పాతాళగంగనుండి లింగములు తెప్పించి, ఎనిమిది దిక్కులయందు ఎనిమిది లింగములు ప్రతిష్ఠించినట్లు చెప్పుచున్నది.

శ్రీశైలమల్లిఖార్జునుని ముందు నందిని ప్రతిష్ఠిం చినట్లు క్రీ.శ. పదమూడవ శతాబ్దిలోని సాగి పోతరాజు శాసనముననుసరించి తెలియుచున్నది.

అనుమకొండ శాసనమొకటి కాకతీయ ప్రభువు ప్రతాపరుద్రుడు. శ్రీశైలము వరకు రాజ్య మేలినట్లు తెలియుచున్నది. 13 వ శతాబ్దమునందు గణపతి దేవుని గురువైన విశ్వేశ్వర శివాచార్యుల వారు శ్రీశైలమున ఎన్నియో మఠములు, శివాలయములు కట్టించినట్లు శాసనములు కలవు. రాణీరుద్రమదేవి చోళ, పాండ్య రాజులను జయించి శ్రీశైలమునకు వచ్చి ఒక కళ్యాణమండపము కట్టించెనని చరిత్ర

చెప్పుచున్నది. శ్రీశైల "కైఫీయతు" ననుసరించి డెబ్బది గ్రామములను ప్రతాపరుద్రుడు స్వామి వారికి చ్చెనని తెలియుచున్నది. అందువలన కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున శ్రీశైలమెంతో ప్రాముఖ్యత నందినది.

రెడ్డి రాజుల పరిపాలనలో కూడనీ దేవా లయము ఎంతో అభివృద్ధి చెందినది.

15వ శతాబ్దమున ప్రౌఢ దేవరాయలిచ్చటకు వచ్చినట్లు ఎన్నో దాన ధర్మముల చేసినట్లు "కైఫీ యతు" వలన తెలియుచున్నది. శ్రీకృష్ణదేవ రాయల శాసనమొకటి కలదు. 1428లో శ్రావణ శుద్ధ పౌర్ణమీ బుధవారం నాడు చంద్రగ్రహణ సమయమున భార్యతో శ్రీకృష్ణ దేవరాయలు వచ్చినట్లు తెలియు చున్నది.

మెకంజి వాల్యూంలో ఈ శైల ప్రతిభకు నిద ర్శనములుగా అనేక శాసనముల గూర్చి తెలియ జేసినది. క్రీ.శ. 1677లో శ్రీశైలమునకు శివాజీ వచ్చియుండెను. ఇచ్చట ఒక మందిరము నందుం డెను. ఇపుడది శిధిలముగా నున్నది. దేవియాతనికి కనబడి జీవితావస్యకతను బోధించినది. శివాజీ ఒక గోపురము నిర్మించినట్లు, ఆయన పేరుతో గోపుర మొకటికలదు.

ఇచ్చటనెన్నో పరమ పవిత్రములైన తీర్థము లన్నవి. శ్రీశైలక్షేత్రము పద్మాకారముగ నున్నది. ఈ క్షేత్ర ప్రదక్షిణము 'పద్మ ప్రదక్షణ" మందురు. ఈ ప్రదక్షణ చేయగోరు వారు శుచియై మల్లిఖార్జుని దేవుని యెదుట సంకల్పించి ప్రదక్షణ చేయవలెను. మరియు రామ ప్రదక్షిణ కూడ కలదు. శ్రీ రాము డిచట ప్రదక్షిణ చేసినట్లు, బ్రహ్మహత్యా పాపవిముక్తు డైనట్లు శ్రీశైల స్థల పురాణము చెప్పుచున్నది.

శ్రీశైలమున దివ్య మహిమలు గల ప్రదేశము లెన్నియో కలవు. ఎన్నో సిద్ధులు మల్లిఖార్జునుని కృప కలిగిన వానికి సుసాధ్యములగును. రసరత్నాకరమున విపులముగా ఎన్నో విశేషములు కలవు.

ఈ మహా క్షేత్రమత్యంత పవిత్రమనుట కెట్టి సందేహము లేదు.

ఎల్లరు శ్రీశైల మహాదేవుని సందర్శించి, పూజించి ధన్యులయ్యెదరు గాక.

## అహోబిల నృసింహక్షేత్రము

కర్నూలు జిల్లాలోని నంధ్యాల రైలుస్టేషనుకు సుమారు 40 కి.మీ. దూరంలో అహోబిలక్షేత్రం ఉన్నది. ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరమైన హైద రాబాద్ నుండి, కొన్ని జిల్లా కేంద్రాలనుండి, ద్రోణా చలం నుండి వచ్చు యాత్రికులు ఆళ్ళగడ్డకు వచ్చి అక్కడనుండి అహోబిల క్షేత్రానికి రావచ్చును.

ఈ క్షేత్రము దిగువఅహోబిలము, ఎగువ అహోబిలముగ ఖ్యాతి నొందినది. కొండ క్రింది భాగము దిగువఅహోబిలమని, కొండపై భాగము ఎగువ అహోబిలమని చెప్పెదరు. (తమిళ నాడులో ఉత్తర ఆర్కాడు జిల్లాలోని షోలింగర్‌లో గల యోగ నరసింహస్వామి కూడ ఇట్లే కొండపైన కొండ దిగువన ఉన్నారు.)

పై రెండు అహోబిలముల యందును శ్రీ నరశింహ స్వామి తొమ్మిది రూపములలో దర్శన మిచ్చుచున్నారు.

జ్వాలాహోబిలం మాలోలకారంజ భార్గవాః
యోగానందచ్ఛత్రవట పావనా నవమూర్తయః

అనగా జ్వాలా నరసింహుడు, అహోబిల నర సింహుడు, మాలోల నరసింహుడు, వరాహ నర సింహుడు, కారంజ నరసింహుడు, భార్గవనరసింహుడు, యోగానంద నరసింహుడు ఛత్రవట నరసింహుడు పావన నరసింహుడు ఈ. కారణము చేతనే ఈ స్థలమునకు "నవనరసింహ క్షేత్రము" అని ప్రసిద్ధి

కలిగినది. ఇటువంటి నరసింహమూర్తులు గల క్షేత్రము భూమండలమున మరెక్కడనూ లేదు. ఈ తొమ్మిది మూర్తులలో కొన్ని దిగువ అహోబిలమునందును కొన్ని ఎగువ అహోబిలమునందును వెలసియున్నవి.

భార్గవ నరసింహ, యోగానంద నరసింహ, ఛత్రవట నరసింహ మూర్తులుదిగువ అహోబిలమున, కారంజ నరసింహ, అహోబిల నరసింహ మాలోల నరసింహ, వరాహ నరసింహ జ్వాలా నరసింహ, పావన నరసింహ మూర్తులు ఎగువ అహోబిలమున ఆరును ఉన్నవి.

అహోబిలములో వేంచేసి యున్న శ్రీ నరసింహమూర్తులలో అహోబిల నరసింహమూర్తియే ప్రధాన మూర్తిగా పురాణ ప్రసిద్ధి కెక్కి యున్నాడు. (కొండ ఎగువనున్నాడు). ఈ నరసింహమూర్తి పది చేతులు కలిగి ఎంతో దర్శనీయముగనున్నాడు. ఇచ్చట భవనాశనీ తీర్థము కుండరూపమున నున్నది. ఈ కుండమునకు గజ తీర్థము అని పేరు. ఇచ్చట ఒక గుహలో చక్రాకారముగా ఒక కొండ నీటి ధార అడుగు భాగమున నున్న ఒక అరుగు మీద దశ భుజములతో హిరణ్యకశిపుని సంహరించెడు సంహార మూర్తిగా శ్రీ నరసింహస్వామి దర్శనము ఇచ్చు చున్నాడు.

బ్రహ్మాండాది మహా పురాణములలో ప్రశం సింపబడినదీ క్షేత్రము.

ఈ అహోబిల క్షేత్రమున శ్రీలక్ష్మీ నరసింహ స్వామిదేవస్థానము దిగువకొండ ఆడివారమున కలదు.

కవిత్రయములో ఒకరైన ఎఱ్ఱాప్రగడ కవీంద్రు ని రచనలలో ఎంతో ప్రసిద్ధి చెందిన 'నృసింహ పురాణము" నుండి ఈ శ్రీ క్షేత్ర ప్రశస్తి తెలిసికొన వీలగుచున్నది.

నృసింహ స్వామి వారు అహోబిల క్షేత్రమున భక్తుడైన ప్రహ్లాదుని రక్షించుట కొరకు ఆవిర్భవించిరి.

శ్రీ సీతాదేవిని వెదకు సమయములో శ్రీ రామచంద్రుల వారు అహోబిలమును దర్శించినట్లు తెలియుచున్నది.

"అహోబిలం వేంకటాద్రిం శ్రీశైల మచలేశ్వరమ్
కాఞ్చీంచకామదాం రాజంశ్చచార రఘుపత్తమం॥"

ఆదిశేషుడు తల పైకెత్తి పడుకొన్నపుడు శిరస్సు మీద తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి వారు, మధ్య భాగంలో అహోబిలం నరసింహ స్వామి వారు, తోక వద్ద శ్రీశైలమల్లిఖార్జున స్వామి వారు ఆవిర్భవించిరని చెప్పుదురు.

ఈ క్షేత్రమునకు "అహోబిలం", "అహో బలం" అను రెండు విధములైన నామములు, మన ఆర్య గ్రంథములయందు మరియు శాసనముల యందు చెప్పబడినవి.

ఈ స్వామి మహాత్మ్యమును గురించి తెలి యనివారు అరుదు. శ్రీ స్వామి వారిని భక్తి శ్రద్ధలతో దర్శించి, పూజించిన వారందరు అభీష్ట సిద్ధిని పొందు చున్నారు.

దిగువ అహోబిలమునకు సుమారు 3 కి.మీ. దూరములో భార్గవ తీర్థము, సమీపమున గల ఒక పర్వతముననున్న దేవాలయములో నరసింహమూర్తికి భార్గవ నరసింహ స్వామి అను దివ్య నామము కలదు. ఈ కొండపై నున్న అక్షయ తీర్థ ప్రదేశము ప్రకృతి రమణీయకతతో కన్నుల పండువుగనుండును.

దిగువ అహోబిలమున ఆగ్నేయముగా సుమారు 2 కి.మీ. దూరమున శ్రీ యోగానంద నరసింహస్వామి కలరు. ప్రహ్లాదునకు యోగాభ్యాసము నేర్పిన మూర్తి కావున యోగానంద నరసింహస్వామిగ యోగ పట్టముతో దర్శన మిచ్చుచున్నారు.

దిగువ అహోబిలమునకు సుమారు 3 కి.మీ. దూరమున ఛత్రవట నరసింహ స్వామి సన్నిధికలదు. ఈ మూర్తి పద్మాసన స్థితముగనున్నది. దక్షిణ

హస్తము అభయ ముద్రతో ఒక వట వృక్షచ్ఛాయలో చుట్టూ ముళ్ళ పొదల మధ్య నున్నది.

దిగువ అహోబిలమునుండి ఎగువ అహో బిలమునకు వెళ్ళు మార్గమున శ్రీ కారంజ నరసింహ స్వామి సన్నిధి కలదు. ఈ సన్నిధి భవనాశిని పుణ్య తీర్థమునన్నుది. ఇచ్చట స్వామివారు "శార్ఙ్గ" మనే దనస్సుతోను చక్రముతోను కూర్చుని యున్నట్లుగ దర్శన మిచ్చుచున్నారు. కరంజమనే చెట్టు క్రింద శ్రీనరసింహస్వామివారు వేంచేసి యుండుటచే ఈయనను కారంజ నరసింహస్వామి అనే నామధేయ ముతో ప్రసిద్ధి చెందియున్నారు.

గోబిలుడను మహర్షి, దూర్వాస మహర్షికి అప చారము చేసి ఆయనచే శపింపబడి, జ్ఞాన హీనుడై ఈ క్షేత్రమునకు వచ్చి నృసింహుని పూజించి స్వామి అనుగ్రహ విశేషమున తిరిగి జ్ఞానము పొందెను. అందు చేత ఈ సన్నిధిని నరసింహుని సేవించువారికి జ్ఞాన సిద్ధి తథ్యము.

శ్రీ అహోబిల నరసింహ స్వామి ఉన్న ప్రదేశ మునే ఎగువ అహోబిలం అందురు. ఇచ్చట భవానా శనీ కుండము తీర్థముగానున్నది.

ఇచ్చట ఒక గుహలో చక్రాకారముగ కొండ నీటి ధార అడుగు భాగమునున్న ఒక అరుగు మీద దశ భుజములతో హిరణ్యకశిపుని సంహరించెడు సంహార మూర్తిగా శ్రీనరసింహస్వామి దర్శన మిచ్చుచున్నారు. ఈ క్షేత్రమున ఈ స్వామియే ప్రధాన మూర్తిగా పురాణ ప్రసిద్ధి కెక్కియున్నాడు. ఈయన పది హస్త ములతో సంహార మూర్తిగ, అత్యద్భుత రీతిలో దర్శనమిచ్చుచున్నారు.

ఈ సన్నిధికి కొంచెము దూరముననున్న దేవాలయములలో పరమశివ లింగమును, ఉగ్ర నరసింహమూర్తియు దర్శన మిచ్చుచున్నారు. శ్రీ రుద్రమూర్తికి శ్రీనృసింహస్వామి వరప్రదానము చేసిన స్థలమని చెప్పుచుందురు.

అహోబిల నరసింహస్వామిని తిరుమంగై ఆళ్వార్లు స్తోత్రముచేసియున్నారు. వైష్ణవ సంప్రదాయ స్థాపనా చార్యులైన శ్రీ భగవద్రామానుజాచార్యులవారు ఈ నరసింహ మూర్తిని దర్శించినట్లు గురు పరంపర చెప్పుచున్నది.

శ్రీ మన్నిగమాంతదేశికులవారు. ఉత్తర దేశ యాత్ర చేసినప్పుడు ఈ స్వామిని సేవించి స్తోత్రము చేసినట్లు సంప్రదాయ చరిత్ర కలదు.

శ్రీ చైతన్య దేవుడనే గౌరాంగ స్వామి శ్రీ నృసింహమూర్తిని క్రీ.శ. 1513 సం॥లో దర్శించి పరమానంద భరితుడయ్యెనని తెలియుచున్నది.

క్రీ.శ. 1498-1512 మధ్య శ్రీ అహో బిలమునందు ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగి నది. అదేమన అప్పుడు శ్రీ అహోబిల ప్రాంతమును పరిపాలించుచుండిన ఆరవ పుట్ట పుజీయ్యరైన శ్రీ షష్ఠ పారంకుశ యతీంద్ర మహాదేశిక జీయరు వారు శ్రీ నరసింహస్వామిని సాక్షాత్కరింపజేసికొని ఇచ్చట నున్న గుహలో ప్రవేశించి స్వామి వారితో ఐక్యమై నారట. ఈ సంఘటన ఈ మత పరంపరలో ప్రసిద్ధి చెందిన చరిత్రము. అతి భయంకరమైన ఆగుహలో ఎవ్వరును ప్రవేశింప వీలు కాకుండా ఆగుహద్వారము భద్రముగా మూయబడియున్నది. ఈ దేవాలయము పెద్దది. అనేక మండపములతో విరాజిల్లుచున్నది. దేవాలయము నంటియున్న వంటశాలకు భవనాశనీ తీర్థమునుండి నీరు పారుటకై పూర్వ కాలమున రాళ్ళను కొళాయిలా ఉపయోగించుట ఎంతో ఆశ్చ ర్యము కలిగించుచున్నది.

భవనాశనీ తీర్థ తటముపై నూరుకాళ్ళ, మంట పము చక్కని రాళ్ళతో అతి సందరముగా నిర్మింప బడియున్నది. ఇందున్న రాళ్ళు ఈ కొండలలోనివి కానట్లు కనిపించుచున్నవి.

ఎగువ అహోబిలముననే శ్రీలక్ష్మి నరసింహ స్వామి దేవాలయమునకు వెళ్ళేదారిలో భవనాశినీ తీర్థముఒడ్డున శ్రీక్రోడాకార (వరాహ) నరసింహస్వామి వారి ఆలయమున్నది. ఇచ్చట స్వామి వరాహరూపిగ శ్రీలక్ష్మి నరసింహ స్వామితో పాటు దర్శన మిచ్చు చున్నారు. ఇచ్చటనుండి ఎగువ అహోబిలమునకు సుమారు ఒక కి.మీ. దూరములో శ్రీ మాలోల (లక్ష్మి) నరసింహస్వామి సన్నిధి యున్నది. వేదాద్రి యనే పర్వత ప్రదేశమున గల ఈ క్షేత్రమునకు శ్రీ లక్ష్మి క్షేత్రమనే మరియొక పేరుకలదు. ఇచ్చట శ్రీ లక్ష్మి నరసింహస్వామి శ్రీ వరాహలక్ష్మితో దర్శన మిచ్చుచున్నందున (మా=లక్ష్మికి, లోలుడు= ప్రియుడు) మాలోలుడు-లక్ష్మి నరసింహుడు అనే దివ్య నామములతో పిలువబడుచున్నాడు. ఈ లక్ష్మి క్షేత్రమున అష్టాక్షర యుక్తమైన శ్రీలక్ష్మి నరసింహ స్వామిని జపించువారికి ఇహ పర సుఖ, సంతోష ములు చేకూరునని పురాణ ప్రసిద్ధి కలదు.

ఇచ్చట అహోబిల మఠము కలదు. శ్రీ మాలోల నృసింహ స్వామి సన్నిధి యందుండిన ఉత్సవ మూర్తి శ్రీవత్ అదివణ్ శఠగోప జీయరు వారికి ప్రత్యక్షమై వారి కాలము మొదలు నేటి శ్రీమత్ అహోబిల మఠంలో 44వ పీఠాధిపతులుగ వేంచేసి యున్న శ్రీ ఆళయసింగర్ వారి వరకు మఠాధి పతులచే ఆరాధింపబడుచు దేశ సంచారము చేయు చు భక్తులకు దర్శన మిచ్చుచు శిష్యులకు ఆనందము కలిగించుచున్నారు. కొందరి పీఠాధిపతుల కాలంలో శ్రీ అహోబిల మఠము అప్పుడప్పుడు ఈ క్షేత్ర మందే ఉండి తరువాత ఈ పీఠాధిపతులు అరణ్య ప్రదేశము వాసయోగ్యముగా లేక పోవుటచే శ్రీ రంగము, తిరువళ్ళూరు మొదలైన క్షేత్రములను తమ ప్రధాన స్థానములుగా పెట్టుకొని యుండిరి. తద్వారా శ్రీ స్వామిని ఆంధ్రులకును తమిళులకును ఇల వేల్పుగ ప్రసిద్ధి చెందినట్లును, వారు పరస్పర సహో దర భావముతో సయోధ్యతో నుండు నట్లును కృషి సలుపుటకు తోడ్పడినారు.

ఎగువ అహోబిలముననే ఉన్నత ప్రదేశమున సుమారు నాలుగు కి.మీ. దూరములో శ్రీ జ్వాలా నరసింహ సన్నిధి యున్నది. గరుడాచలము, వేదా చలముల మధ్య అచలచ్ఛాయ మేరు అనెడి కొండ ప్రదేశమున ఈ క్షేత్రమున్నది. ఈ క్షేత్రమునకు వెళ్ళుట అతి కఠినమనియు, అట్లువెళ్ళినను, జ్వాలా రూపిగా, కోటి సూర్య ప్రకాశముతోనున్న శ్రీ జ్వాలా నరసింహమూర్తిని దర్శించుట కష్టమనియు దర్శించిన పిదప తిరిగి వచ్చుట అంతకన్నా కష్ట మనియు పెద్దలు చెప్పుచున్నారు.

ఎగువ అహోబిలమునకు సుమారు 5 కి.మీ. దూరమున గరుడాచలమునకు పావన నదీతీరమున శ్రీ పావన నరసింహస్వామి సన్నిధి కలదు. భక్తుల పాపములను హరించి వారి కోర్కెలు తీర్చుచున్న దివ్యమూర్తి ఇది. భక్తులు మ్రొక్కుబడులు ఇచ్చటనే చెల్లించుచున్నారు.

దిగువ అహోబిలమున ప్రహ్లాదవరదునిగా పదియవ నరసింహమూర్తిని భక్తులు దర్శించవచ్చును.

ఇంకను ఈ క్షేత్రమున అనేక విశేష దర్శనీయ స్థలములు కలవు.

ఈ క్షేత్రము పౌరాణికముగను, చారిత్రకము గను ఎంతో ప్రసిద్ధి చెందినది. క్రీ॥శ॥ 1328 మొదలు 1350వరకు ప్రోలయ వేమారెడ్డి ఆంధ్ర ప్రాంత మును పాలించిన రెడ్డి ప్రభువు. ఇతడు ప్రతాప రుద్రుని కడ సేనానిగ నుండి కాకతీయ ప్రతాప రుద్రుని పతనానంతరము ఆంధ్రప్రాంతమును ఆక్ర మించుకుని పాలించిన రెడ్డి రాజు ప్రోలయ వేమారెడ్డి కడ ఆస్థాన కవిగ నున్న ఎఱ్ఱాప్రగడ ఈ క్షేత్రమునకు వచ్చి నరసింహుని దర్శించి బ్రహ్మాండ పురాణాంతర్గత

అహోబిలక్షేత్ర మహాత్మ్యమును 'నృసింహపురాణము' అను పేరున ప్రబంధము రచించెను.

హిరణ్యకశిపుని వధించిన పిదప ప్రహ్లాదున కాహ్లాదము నందించి కృపామధురవచనములు పలుకు సమయమున అమ్మహాదేవుని దేవతలు ఋషులు అభినందించిరి. శ్రీ నృసింహమూర్తి అందుకు సంత సించి "మీరు మదీయ బలంబు, అహోబిల శబ్ద పూర్వకంబుగా ప్రశంసించిరి. కనుక యీ తీర్థంబు అహోబిల నామధేయంబున త్రిభువన పావనంబై వెలయుంగాత" యని భగవానుడు శ్రీ నృసింహ మూర్తి ఆదేశించెను. ఆనాటి నుండి "అహోబిలము" అను పేర ఈ క్షేత్రము ప్రసిద్ధి కెక్కి యున్నది.

శ్రీ ఉగ్రనరసింహమూర్తిని దేవతలు, ఋషులు చూచి "సత్యమహోబిల రుద్రరూప మాధవ భవతే నమో" అనికొనియాడిరి. "అహోబల"యని ఆశ్చర్య కరముగా స్వామి బలమును కొనియాడిరి. కనుక ఆశ్చర్యకరమైన బలవంతుడనే ప్రశంసా పూర్వకము -గనే "అహోబల నారసింహ" యని వ్యాప్తికి వచ్చినది.

విష్ణువర్ద్దివశములలోను, రవిగ్రహ, సోమగ్రహణ ములు, పౌర్ణమి, అమావాస్య జయంతి రోజులలోను పుణ్యాయుక్తతిధులలోను ఈ క్షేత్రమును దర్శించి స్వామిని పూజించి భక్తులు తృప్తులవుతున్నారు. తెలుగు సాహిత్యమున ఈ స్వామి చరిత్రలు కడు రమ్యముగ మహాకవులు రచించి ధన్యులైనారు.

"రేనాటి చోళులు, బాణ రాజులు, వైదుం బులు" అహోబిలమునకు పరిచర్య లొనర్చిరి. కాక తీయప్రతాపరుద్రుడు కంచికి వెళ్ళునప్పుడు ఈ క్షేత్రమును దర్శించినాడు అతడు ప్రతిదినము స్వర్ణ లింగమును తయారు చేసుకొని-పూజలు సలిపెడు పరమ శైవుడు. శ్రీనరసింహ క్షేత్ర ప్రాంతములకు వచ్చినప్పుడు బంగారమెన్ని సార్లు కరిగించినను నృసింహుని రూపముగానే ప్రత్యక్ష మగుచుండెడిది. అతడీ సన్నివేశమున కాశ్చర్య పడుచుండగా నచటి పూజారులు "ఇది నరసింహక్షేత్రము అన్యదేవతాపూజ చెల్లదని" చెప్పినారట కాకతీయ ప్రతాపరుద్రుడు ఆ ప్రాంతమున చెట్లు నరికించి గ్రామాదులేర్పరచెను. దిగువ అహోబిలముననున్న యొక చెరువు ప్రతాప రుద్రుడు కట్టించినదని జన శృతి కలదు. పాలకురికి సోమనాధుని కాలములో చక్రపాణి రంగనాధుడను విద్వాంసుడుండెను. అతను వైష్ణవుడు. సోమనాధు నితో అతనికి వివాదము వచ్చెను. భవునిచూడనన్న ప్రతిన యున్న సోమనాధుడు తెరచాటునుండి రంగ నాధునితో వాదించెనట. రంగనాధుడోడిపోయి నాడు. పరాజయ పరాభవముతో ఇంటి దారి పట్టెను. త్రోవలో శ్రీశైలమునున్న స్వామిని దర్శించలేదు. అహోబిలము చేరునరికి రంగనాధుని కన్నులు పోయినవి అతడు నేత్రదానమునకై నృసింహుని ప్రార్థించెను. స్వామి కలలో కనబడి శ్రీ శైలేసుని మహిమను వర్ణించెను. రంగనాధుడు వెనుకకు వచ్చి మల్లిఖార్జునుని సేవించినాడు ఒక కన్ను వచ్చినది అటునుండి బయలుదేరి యాతడు పాలకురికి సోమ -నాధుని పాదములపై పడెను. రెండవ కన్ను వచ్చిన దట. తరువాత రంగనాధుడు సోమనాధుని శిష్యుడై శైవమును స్వీకరించెను. ఈ కథ కన్నడములో కలదు. తోంటిదార్యుడు చెప్పెను. సిద్దనంజేసకవి కూడ తన గురురాజ చరిత్రములో చక్రపాణి రంగ నాధుని కథను వివరించెను.

ఏక శిలానగర వృత్తాంతమును కపీయతు తెలుగులో నున్నది. అందు రంగనాధుడు శ్రీరంగము -నకు బోయినట్లున్నది.

ప్రోలయ వేమారెడ్డి శ్రీశైలమునకు సోపాన ములు నిర్మించెను. అహోబిలమునకు కూడ సోపాన ములు కట్టించెను ఈ విషయమాతని "చీమకుర్తి" శాసనములో నున్నది. తరువాత వరుసగా కొండవీటి రెడ్లు అహోబిలమును అభిమానించుచు వచ్చిరి.

కొండవీటి కోమటి వేమారెడ్డి ఈ క్షేత్రమునకు తరచుగా వచ్చేడివాడు. అతని ప్రియ గణిక లకుమా దేవి. అచ్చట నాట్య సేవ నల్పిన విషయము శాసనములవలన తెలియుచున్నది. శేషాచలమునకు అహెూబిలమునకు విజయనగర సామ్రాజ్య కాలము నందు గొప్ప అదృష్టము పట్టినది. సాళువ నరశింహ రాయలు, షష్ఠ పరాంకుశులు సమకాలికులు వీరి "నృసింహస్తవము" ప్రసిద్ధి చెందినది. పరమశివుని వలెనే నరసింహునకు కూడ ఫాలలోచనము కలదు. తెనాలిరామకృష్ణుడు తన పాండురంగమహాత్మ్యములో "మిగులకన్నొదిలిన బిగువు యెక్కుడు గాని కరుణా కటాక్ష వీక్షణమువాడు" అని ప్రశంసించెను. అహెూ బిలపు కొండ భాగమున ఒకప్పుడు గరుడుడు తప మొనర్చినట్లు పెద్దలు చెపుతారు.

తంజావూరు మధుర సాహిత్యముల యందు అహెూబిల ప్రశంస సమృద్ధిగ నున్నది. శ్రీ వేంకటే శ్వరుని ఆంతరంగిక భక్త శిఖామణి పదకవితా పితామ హుడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యుడు తన సంకీర్తనలలో శ్రీ అహెూబిలేశుని దివ్య స్వరూపాన్ని అవతార కథాంశాలను నిండుగా మెండుగా వర్ణించాడు.

అనిశము దలచరో అహెూబలం
అనంత ఫలదం బహెూబలం.

అని అహెూబిల క్షేత్ర ప్రశస్తిని, మహిమను కమ్మని కమనీయమైన తేటతెనుగు పాటల్లో వర్ణిం చాడు. అంతేకాక "అదివో చూడరో ఆదిమపురుషుని" అంటూ "పెదజాబళము మీది పెను సింహము" అని కొనియాడుతూ బ్రహ్మాదులు, వేదాంత పండితు లందరు కానగలేని ఆ ఘన సింహమును ప్రత్యక్షంగా దర్శించి కీర్తించాడు. అన్నమయ్య. ఈయన అహెూ బిలంలో కొంతకాలము నివశించినట్లు తెలియు చున్నది. ఇచట ఈయన రచనలు కొన్ని రాగి రేకులపై లభ్యమైనవి. అహెూబిలంలో ఉన్న నరసింహుడే తిరుమలకొనేటి దండనునున్న వేంకటేశుడుగామారి వరాలిస్తున్నాడనడంలో అన్నమా చార్యుల యొక్క అభేద దృక్పథం మన కవగతమ గుచున్నది. శ్రీ తిరుమల వేంకటేశ్వర స్వామిని శాంత నరసింహస్వామిగా వర్ణించాడు అన్నమయ్య.

జాత్యంధునకు కన్నులిస్తానన్నాడు, కన్ని యకు ప్రియతమమైన భర్తని ఇస్తానన్నాడు. సంతా నవతికి పుత్ర సంతతి నిస్తానన్నాడు. విద్యార్థికున్నత విద్య నొసంగెదనన్నాడు. అయితే నిజముగ నమ్మి "త్వమేవ శరణం మమ" యని దృఢ తర భక్తి యుక్తులై కొలుచుట ముఖ్యమనిరి.

ప్రకృతి సుందర దృశ్యముల నడుమనున్న ఈ మహత్తర క్షేత్రమును దర్శించి భక్త జనులు తరించె దరని ఆకాంక్ష.

## మహానంది క్షేత్రము

మహా నందీశ్వరుడు లోకబాంధవుడు. ప్రకృతి శోభతో, అద్భుత రీతిలో అలరారే శ్రీమహానంది క్షేత్రము కర్నూలు జిల్లాలో మహానంది మండల ములో నంధ్యాల పట్టణమునకు తూర్పు దిశను గల నల్లమల అడవుల ప్రారంభమున, నంద్యాలకు సుమా రు 15 కి॥మీ॥ దూరమున కలదు.

బహు పురాతనమైన ఈ క్షేత్రము ఎంతో పురాణ ప్రసిద్ధి కలిగియున్నది.

ఒకప్పుడు శిలాదుడనే ఋషి సత్తముడు తనకు చాలా కాలము వరకు సంతానము కలుగక పోవుటచే దృఢ నిశ్చయముతో సంతాన ప్రాప్తికై మహేశ్వరుని గూర్చి తపస్సు చేయసాగెను. కొంత కాలమునకు మహర్షి తపమునకు మెచ్చి పరమ శివుడు ప్రత్యక్షమై, త్వరలో నీ కోరిక నెరవేరుతుందని చెప్పి అదృశ్యు డయ్యాడు. పరమ శివుని వరప్రసాదము వలన శిలాదునికి ఒక పుట్టవద్ద పసిబాలుడు కని పించాడు.

శంకరుని వర ప్రభావమని సంబరపడి శిలాదుడు, ఆ బాలుని తీసుకువెళ్ళి భార్యకు ఇచ్చాడు. ఆమె మహదా నంద పడినది. ఆ బాలునకు తమ ఇంట ఆనందాన్ని కురిపించి నందులకు "మహా నందుడు" అని పేరు పెట్టారు.

మహానందుడు పెరిగి పెద్దవాడయ్యాడు. చిన్న నాటినుండి మహానందునికి ఈశ్వరుని పట్ల ఆరాధన అధికముగా ఉండెడిది. వయసుతో పాటు ఆ బాలు నకు భక్తి భావన కూడా పెరుగుతూ వచ్చింది.

మహానందుడు తండ్రివలన ఈశ్వర సాక్షా త్కార విధానము తెలిసికొని పరమ శివునిపై మనసు నిలిపి శివనామస్మరణలో లీనమై పోయాడు.

కొంతకాలానికి పార్వతీ పరమేశ్వరులు మహా నందునకు ప్రత్యక్షమై వరము కోరుకోమనిరి. అపుడు మహానందుడు అమితానందముతో "స్వామీ! నాకు ఏ కోరికలూ లేవు. సదా మీ సేవ చేయు భాగ్యాన్ని ప్రసాదించండి". అదే నాకోరిక అన్నాడు.

ఈశ్వరుడు అతను కోరినట్టే వరమిచ్చాడు. "మహానందా! నీ పేరున నందిమండలం" అను పుణ్య క్షేత్రాలలో నవనందులు వెలుస్తారు. అందు లింగ రూపుడవై ఉండెదవు అని ఆశీర్వదించారు పార్వతీ పరమేశ్వరులు.

ఈ విధంగా శివుని ఆజ్ఞానుసారము నవ నందులు వెలిసారు. ఆ నవనందులలో మహానంది అతి ప్రాముఖ్యము వహించినది. అదియే ఈనాటి మహానంది క్షేత్రరాజము.

ఇప్పటి మహానంది క్షేత్రము కొన్ని సంవత్స రములకు పూర్వము మహారణ్యముగా నుండెడిది. అపుడు నంధ్యాల పట్టణమును నందన చక్రవర్తి పరి పాలించేవాడు. నంధ్యాల పురమునందుగల శ్రీ బ్రహ్మ నందీశ్వర స్వామి వారికి నందన రాజు ప్రతి దినము గోక్షీరముతో అభిషేకము చేసేవాడు. అందుకు ప్రత్యేకముగా ఓ కపిల గోవును, మరికొన్ని గోవు లను పెంచసాగాడు. వాటిని మేపుటకు సంరక్షించు టకు గోపాలుడను పశుల కాపరిని నియమించాడు.

గోపాలుడు ప్రతిరోజూ ఉదయముననే ఆవు లను అడవికి తోలుకొనిపోయి తిరిగి సాయంత్రము వేళకు ఇంటికి తెచ్చేవాడు. మందలో కపిల ధేనువు బాగా పాలిస్తుండెడిది.

ఒక రోజు గోపాలుడు మామూలుగా ఆవు లను అడవికి తోలుకొని వెళ్ళాడు. చీకటి పడగానే మళ్ళించుకుని వచ్చాడు. గోవులను కట్టేసి పాలు పితక సాగాడు. అన్ని గోవులు పాలిచ్చినవి కాని కపిల ధేనువు పాలివ్వలేదు. చిక్కి పలుచగా వున్న కపిల ధేనువు పొదుగు చూచి నివ్వెరపోయాడు. కపిల ధేనువు పాలుపితకనివ్వలేదు. మరు దినము కూడ అట్లే జరిగినది. గోపాలునకేమి చేయుటకును తోచక జరిగిన దానిని నందరాజునకు విన్నవించుకున్నాడు.

శివాభిషేకమునకు భంగము వాటిల్లినదని రాజు చింతించి, కపిల గోవును జాగ్రత్తగా మేపుకుని రమ్మని ఆజ్ఞాపించెను. ఆ దినము గోపాలుడు కపిలగోవును వేయికళ్ళతో గమనించసాగాడు. కపిల పగలంతా అన్ని ఆవులతో కలిసి మేయుచుండెడిది. (సాయంత్రం) ప్రొద్దువాలగానే మందనుండి కనుమరుగయ్యేడిది. గోపాలుని కన్నుగప్పి ఎచ్చటికో వెళ్ళి వచ్చేది.

గోపాలునకు ఏమిటో ఈ మాయ అంతు చిక్కలేదు. మరిరెండు రోజులు కపిల పాలు పితక నివ్వలేదు. నందనరాజు గోపాలుని కోపంతో మంద లించాడు. గోపాలుడు ఎల్లాగైన ఈ సమస్యకు పరి ష్కారం తెలిసికోవాలనుకున్నాడు.

పగలంతా గోపాలుడు గోవును కనిపెట్ట సాగాడు. సాయం సమయమైనది. పశువులను ఇంటికి మళ్లించుకొనవలసి వచ్చి దూరంగా వెళ్ళిన మరియొక ఆవును మళ్ళించుటకు గోపాలుడు కనుమరుగు కావలసి వచ్చినది. ఇంతలో కపిల కనిపించలేదు.

గోపాలుడు ఎంతో వ్యధచెంది దాదాపు అర గంట తరువాత కపిల దూరంగా వున్న చెట్ల పొదల నుంచి రావడం చూచాడు. వెంటనే వెళ్ళి కపిల పొదుగుచూచాడు. చిక్కియున్నది! గోపాలుడు చెట్ల పొదలలోనికి వెళ్ళి ఆ చుట్ట ప్రక్కల నిదానంగా చూసాడు. అతనికేమియు కనిపించలేదు. ఆవుల న్నింటిని ఇంటికి తోలుకొని వచ్చాడు.

ఆ రాత్రి గోపాలునికి నిద్ర పట్టలేదు. కపిల గురించే ఆలోచిస్తున్నాడు. ఇది ఏమి ఎంత? అంత వరకు ఉండి కపిల ఎలా తప్పించుకుని వెళ్ళింది? పాలు ఏమవుతున్నవి? ఎవరూ కనబడలేదు ఏమిటీ విచిత్రము? ఇటులా గోపాలుడు ఆలోచిస్తూ రాత్రంతా గడిపాడు.

మరునాడు గోపాలుడు కపిలనొక్కదానినే కని పెట్టుకుని ఉన్నాడు. సాయంత్ర సమయం అయినది. కపిల మందనుంచి తప్పించుకుని తిన్నగా పొదల వైపు బయలుదేరినది. గోపాలుడిది గమనించి ఆవును వెంబడించాడు.

కపిల పొదలో దూరి మారేడు చెట్టుక్రిందగల పుట్టమీద నిలుచున్నది. గోపాలుడు చాటున నక్కి ఆసక్తితో గమనిస్తున్నాడు.

కపిలధేనువు మారేడు చెట్టుకు పొదుగఆనించి రుద్దుకొనుచున్నది. పాల ధారలు పుట్టమీద పడుచు న్నవి. పుట్టలో నుంచి పరమ శివుడు పసిబాలుని రూపమున వెలుపలకు వచ్చి ఆపాలను త్రాగు చున్నాడు.

గోపాలునకు జరుగుచున్నదంతయు కనిపి స్తోంది. పిదప గోపాలుడు ఆవులనన్నింటిని ఇంటికి మళ్ళించుకుని వచ్చాడు. జరిగినదంతయు నంద మహారాజుకు విన్నవించాడు.

నందుడు ఆ సంగతి విని పరమానంద భరితు డయ్యాడు. మరునాడు గోపాలుని వెంట తాను కూడా వెళ్ళాడు. కపిల యధావిధిగా సాయంత్రం పొదలో పాలను పుట్టమీద వదలుచున్నది. మహేశ్వ రుడు పసిబాలుని రూపమున పాలను త్రాగడం గమ నించిన నందరాజు ఆశ్చర్యాన్ని ఆనందాన్ని ఆపుకోలేక భగవంతుని స్మరిస్తూ ఒక అడుగు ముం దుకు వేసాడు. ఆ సవ్వడికి కపిల బెదిరి పరుగెత్త బోయినది. ఆ తొందరలో కపిల (పాదము) గిట్ట గుర్తు పుట్టపై పడింది.

వారు చూస్తుండగానే ఆ పసి బాలుడు, కపిల మాయమయ్యారు. నందను రాజు తన తొందర పాటుకు నొచ్చుకుంటూ పురమునకు వచ్చాడు.

ఆ రాత్రి నందరాజునకు స్వప్నంలో పరమ శివుడు కనిపించి "కపిలపాలు గ్రోలినది నేనే, ఇత రులు కాదు. ఆ పుట్టవద్ద గుడి కట్టించుము అక్కడనే గంగా భవానీ వెలసి నన్ను అను నిత్యము సేవించును. ఈ పరిసరములకు కొలది దూరములోనే నవనం దుల పేరిట లింగ రూపుడనై వెలసెదను. ఈ స్థలము పుణ్య క్షేత్రముగా ప్రసిద్ధి చెంది, నీ కీర్తి ప్రతిష్ఠలు శాశ్వతముగా నిలుస్తాయి" అని సెలవిచ్చెను. నందన రాజు అమిత ఆనందముతో మరునాడే శివుని ఆజ్ఞ మేరకు అక్కడ ఆలయాన్ని నిర్మించేందుకు పని వాళ్ళతో పుట్టకడకు వెళ్ళాడు. అచ్చట ఒక లింగము వెలసియున్నది. అచ్చటనే ఆలయాన్ని నందరాజు నిర్మించాడు. అచ్చటనే ఒక కొలను త్రవ్వించాడు. స్వచ్ఛమైన గంగాభవానీ ఉద్భవించింది! అదియే ఇప్పటి మహా నందీ క్షేత్రరాజము.

నందరాజు పాలన తరువాత ఈ దేవాలయం చాలా శిధిలావస్థలో యున్నది. అప్పుడు గొప్ప శివభక్తుడు శ్రీ. భైరవ జోస్యుల రామచంద్రయ్య, ఆయన తమ్ముడు శ్రీ మహానందయ్య ధర్మకర్తలుగా ఈ క్షేత్రమునకు కొన్ని సంవత్సరములు ఉండి ఈ దేవాలయము ఎంతో అభివృద్ధిలోకి తెచ్చారు.

ఈ దేవాలయ గాలి గోపురము (పడమటి) 1907 సం॥ నవంబరు 19వ తారీఖున జీర్ణోద్ధరణ గావింపబడినది. గాలిగోపురము (ఉత్తరమున) శక సం.1939లో జీర్ణోద్ధరణ గావింపబడినది. దక్షణదిశ గోపురము కూడా అపుడే జీర్ణోద్ధరణ గావింపబడినది.

జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరయతీంద్రుల వారిచే నవగ్రహ ప్రతిష్ఠ గావింపబడినది. (23-2-1967)

ఈ దేవాలయము పడమటి గోపురమునకు లోపల భాగమున జ్యోతిస్తంభము కలదు. ఈ స్తంభము దేవాలయము కట్టించిన నాటిదని ప్రతీతి ఈ స్తంభము ఇప్పటికీ ఉన్నది.

ఇచ్చట కామేశ్వరీ దేవాలయమున్నది. శ్రీ కోదండరామాలయము రెండును చూడదగ్గవి. ఇచ్చట వెలసిన నవనందుల గురించి తెలుసుకొన వలసి యున్నది.

**ప్రథమ నంది :-** నంద్యాలకు నైరుతి భాగమున చామ కాలువ ఒడ్డున రైల్వే స్టేషన్‌కు కొలది దూర ములో నున్నది.

**నాగనంది :-** నంద్యాల పట్టణమందలి ఆంజనేయ స్వామి దేవాలయమునందు వెలసియున్నది.

**వినాయక నంది :-** మహానందిలో ఆగ్నేయముగా నున్నది. ఇచ్చట నిత్యపూజలు జరుగుచున్నవి.

**గరుడ నంది :-** మహా నందికి పడమర దిక్కున ఉన్నది. ఇచ్చట వెలసియున్న శివ లింగమునకు ఈ గరుడ లింగమునకు పూజలు చేసిన తరువాతనే మహా నందీశ్వరునకు పూజలు చేసేవారు. ఇప్పటికీ నిత్య పూజలు జరుగుచున్నవి.

**శివ నంది :-** నంద్యాల పట్టణమునకు సుమారు 15 కి||మీ|| దూరములో కడమ కాల్వయను గ్రామ మున వెలసి యున్నది.

**విష్ణు నంది (కృష్ణ నంది):-** మహా నందికి సుమారు 3 కి||మీ|| దూరములో తూర్పున ఉన్నది. ఇచ్చటి నంది విగ్రహము పాలరాతితో మలచబడి యున్నది. ఇచ్చట కూడా స్నానము చేయుటకు స్వచ్ఛమైన కొలను కలదు. నిత్య పూజలు అర్చనలు జరగుచున్నవి.

**మహా నంది :-** నవనందులలో ముఖ్యమైనది. శ్రేష్ఠ మైనది. ఇచ్చటకు అన్ని కాలముల యందు వేలాది మంది భక్తులు వచ్చుచున్నారు. శ్రీ మహానందీశ్వ రుడు వెలసి యున్న పరమ పవిత్రమైన క్షేత్రమిది.

**సూర్య నంది :-** నంద్యాల పట్టణమునకు సుమారు ఐదు కి||మీ|| దూరమున తూర్పుననున్నది. సూర్యుడు ఉదయించునపుడు అరుణ కిరణములు ఈ లింగము పై పడును. అందువలన దీనిని "సూర్య నంది" అందురు.

**సోమ నంది :-** నంద్యాల పట్టణమునకు తూర్పున నున్నది.

ఈ నవనందులను నంది మండలం అంటారు. ఈ మహా నందిక్షేత్రం నందు మహా శివరాత్రికి ఉత్సవములు జరుగును. ఎన్నో ఉత్సవములు, శివ నామ సంకీర్తన, సప్తాహములు జరుగును. దసరా ఉత్స వములు జరుగును.

ఇచ్చట భక్తులు నిరంతరకృషితో ఇటీవల శైవాగమ, ఆది శైవాగమ పాఠశాలను స్థాపించి యున్నారు.

ఎన్నో వసతి గృహములతో నిత్యమూ భక్తజన సందోహముతో ఈ క్షేత్రము ఎంతో వైభవముగ విరాజిల్లుచున్నది.

ఇచ్చటనే ప్రకృతి శోభతో పురాతనమైన ఓంకార క్షేత్రము కలదు. మహానందికి సుమారు 10 కి||మీ|| దూరమున, విష్ణునందికి సుమారు 7 కి||మీ||

దూరముననున్నది. ఈ క్షేత్రమును దర్శించుటకు, కాలి బాటనే వెళ్ళ వలసి యుండును. నట్టడవిలో చుట్టూ కొండల మధ్య వెలసి యున్నాడీ ఓంకారేశ్వ రుడు. దేవాలయము పురాతనమైనది. మధ్యలో రాతితో కట్టిన కోనేరు కలదు. అందులో స్వచ్ఛమైన నీరు భక్తుల హృదయాలను ముగ్ధులను చేస్తుంది. ఈ కోనేటిలో మునిగినపుడు అడుగు భాగమునుంచి నీళ్ళ లో "ఓం" అని ఓంకార శబ్దము అస్పష్టంగా వినిపిస్తు న్నదట! ఎందరో ఋషి పుంగవులు తపస్సు చేసు కొనిన పవిత్ర స్థలమిది. దర్శించవలసిన క్షేత్రము. ప్రతిరోజూ స్వామి వారికి నిత్య పూజలు జరుగు తుంటాయిక్కడ.

ఈ క్షేత్రమున మూడు నీటి ధారలు ప్రవ హించుచున్నవి.

**బ్రహ్మ కుండముః—** ఈ నీటి ధారకల గుండము ఆలయమునకు ఉత్తరాన కలదు. ఈ గుండము నీటి నే క్షేత్రమునకు పంపుల ద్వారా సరఫరా చేయుట జరుగుచున్నది.

**విష్ణు గుండముః—** ఈ గుండము నీటి ధార ఆలయమునకు దక్షిణమున కలదు. ఇందలి నీరు పరిసరముల సాగుకై ఉపయోగపడుచున్నది.

**రుద్ర గుండముః–** ఈ గుండములోని నీరు గర్భాలయమునందు గల శివలింగము మీద నుండి వచ్చుచున్నది. సుమారు వేయి ఎకరముల భూమిని సస్యశ్యామలముగా చేయుచున్నది.నీటి ధార ఆలయ ప్రాకారము లోపలనే నిర్మించిన పుష్కరిణిలో ప్రవే శించి రెండు తూముల ద్వారా బయటకు ప్రవ హించుచున్నది. ఈ పుష్కరిణి ఐదు అడుగుల లోతు నీరు కలిగియుండినట్లు నిర్మింపబడి యుండినందున స్త్రీ, పురుషులెల్లరు ప్రమాదములు లేకుండా స్నానము చేయవచ్చును. ఈ పుష్కరణిలో నీరు అతి స్వచ్ఛ ముగా వెచ్చగా ఉండుటయే గాక ఇందు స్నానమాచ రించిన ఉల్లాసమును, ఆరోగ్యమును మనశ్శాంతిని కలిగించుననుట అనుభవైకవేద్యమే మరియు పాప ములు తొలగి పుణ్యము సిద్ధించునని భక్తుల ప్రగాఢ విశ్వాసమై యున్నది. ఇందలి నీటి ప్రవాహము అతి వృష్టి అనావృష్టి పరిస్థితులకు హెచ్చుట గానీ తగ్గుట కానీ జరగక ఒకే రీతిలో నుండుట ఆశ్చర్యమును కలిగించును. ఇది యొక గొప్ప సృష్టి వైచిత్ర్యము.

ఇచ్చట తిరుపతి దేవస్థానమువారి 28 గదుల సత్రము 10 గదుల శ్రీ కామేశ్వరీ సత్రము, శ్రీ మహానందీశ్వర స్వామి సత్రము కాటేజీలు కలవు. మరియు దేవస్థానము వారు సత్రములు కట్టించు చున్నారు. ప్రతి సంవత్సరము మాఘ బహుళ ఏకాదశి నుండి పాల్గుణ బహుళ పాడ్యమివరకు మహాశివరాత్రి పర్వదిన సందర్భమున బ్రహ్మోత్సవములు జరుగును. భక్త జన సులభుడైన పరమ శివుని సేవించి తరించెదరు గాక!

## శ్రీ రాఘవేంద్ర స్వామి మఠము – మంత్రాలయము

కర్నూలు జిల్లాలో శ్రీ రాఘవేంద్రస్వామివారి మఠము ఎంతో ప్రాముఖ్యము చెందినది. ఈ స్వామి వేంచేసియున్న మంత్రాలయమునకు రాష్ట్ర నలు మూలలనుంచే కాక ఇతర రాష్ట్రములనుంచి కూడ బస్సు సౌకర్యము కలదు.

మంత్రాలయము, పవిత్రమైన బృందావనమై శ్రీ రాఘవేంద్ర స్వామి ప్రసిద్ధి చెందిన మధ్వ పీఠా ధిపతిగా భక్తుల పాలిట కల్పతరువుగా వేంచేసియున్న పవిత్ర క్షేత్రము. దేశము నలుమూలల నుంచి భక్త జనులు మంత్రాలయమునకు వచ్చి స్వామివారి సమాధిని దర్శించి పునీతులగుచున్నారు.

ఈయన సమాధి చెంది సుమారు మూడు వందల సంవత్సరములకు పైగా గడచినది. ఈయన పుట్టుకయే ఒక అత్యద్భుత సంఘటన. ఈయన వైష్ణవాంశ సంభూతుడు. అతని తల్లితండ్రులు ఈయన

శ్రీ వేంకటేశ్వర వరప్రసాదమని నమ్ముటకు కారణ మున్నది. శ్రీ రాఘవేంద్రుని తండ్రి తిమ్మన్నభట్టు గొప్ప సంగీతవిద్వాంసుడు. శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థాన సంగీత విద్వాంసునిగా వుండెడివాడు. ఆయ నకు రాఘవేంద్రుడు కాక పెద్ద కుమారుడు కూడా ఉండెడివాడు. ఒక్క కొడుకుతో సంతృప్తి పడక తిమ్మనభట్టు, తిరుమలేశుని ఆశ్రయించి, జగద్విఖ్యాతి నొందిన రాఘవేంద్రుని తిరుమలేశుని వర ప్రసాద ముగా పొందెను. వేంకటనాథుడని పేరిడిరి. అసాధా రణ ప్రజ్ఞా పాటవాలతో వేంకటనాథుడు తల్లి తండ్రు లనేకాక పలువురికి ఆశ్చర్యానందములు కలిగించెడి వాడు. భగవదాంశ సంభూతలకిట్టి ప్రజ్ఞా పాటవములు సహజ లక్షణములే కదా!

బాలునిగా నున్నను మానసికంగా సునిసిత మేధాసంపత్తితో ఎంతో ఉన్నత శిఖరాల కెదిగిన వేంకటనాథునకు పితృ వియోగము సంభవించినది. తన అన్నగారైన గురురాజు, మధురలోనున్నను, మాన్య పండితుడు తన బావగారైన లక్ష్మీనరశింహా చార్యుల వద్దకు ఉన్నత విద్యాభ్యాసమునకై వేంకట నాథుని పంపించెను. వేంకటనాథుడు శ్రద్ధాశక్తులతో వేదములు, అష్టాదశ పురాణములు ఆర్షధర్మ సూత్ర ముల మర్మమెరగి అచిర కాలములోనే ప్రఖ్యాతుడ య్యెను. మరియు ఇంకను ఉన్నత విద్యార్జనకై వేంకటనాథుడు, ఆనాటి ప్రఖ్యాత మధ్వ సంప్రదాయ పీఠాధిపతి శ్రీ సుధీంద్రతీర్థుల వారి (కుంభకోణము) నాశ్రయించి, తన సునిశిత మేధా సంపత్తితో ఆచా ర్యులవారి నాకర్షించి "శ్రీ సుధ" అనే వ్యాఖ్యాన గ్రంథము రచించి ఆచార్యుల అనుగ్రహాన్ని సంపా దించడమేకాక "పరిమళాచార్య" అనే బిరుదాన్ని పొందాడు. తన పాండిత్యముతో గురుదేవుల అను గ్రహము అపారముగా పొందిన వేంకటనాథుని ఆధ్యాత్మిక ప్రగతికి ఈర్ష్య చెంది యాతని సహాధ్యా యులు ఆయన మీద అనేక ఆరోపణలు చేయుచూ గురుదేవులకు విన్నవించిరి. వేంకటనాథుడు పని పాటలు లేక తిని నిద్ర పోవుచున్నాడని కొండెములు చెప్పిరి. గురుదేవులు వీరి విన్నపములు విని ఆరోపణ లపై నిజానిజములు స్వయముగా తెలిసికొన దలచి వేంకటనాథుని గదిని ఆరాత్రే ఆకస్మికముగా సందర్శిం చెను. ఆ సమయ మున వేంకటనాథుడు తాళ పత్ర గ్రంథము ప్రక్కనే పెట్టుకొని నిద్రించుచుండెను. గురుదేవులు చూచి ఆ తాళపత్రముపై వ్రాసిన భాష్యము తాము దినదినము చెప్పుచున్న శాస్త్రముల యందలి భాగములుగ గ్రహించి ఆయన శేముషీ వైభవములకు ఆనందపడి తన గదికి తీసుకొని పోయి తన అంగవస్త్రము ఆయనపై కప్పి తన శిష్య వాత్సల్యము చూపెను.

తన శిష్యుని ప్రతిభకు గురువుగారు ఆనందించి తనతో దక్షిణదేశ పర్యటనలకు తీసుకుని వెళ్ళెడి వారు. గురుదేవులతో పర్యటనల సందర్భమున వేంకటనాథునకు మధురలో తన శేముషీ వైభవము ప్రకటించుటకు అవకాశము కలిగినది. వేంకటనాథుని వాదనా పటిమకు గురుదేవులు ఎంతో అభినందించి "మహా భాష్యాచార్య" అనే బిరుదును ప్రసాదించిరి.

తదుపరి, గురుదేవునితో ఆనాటి తంజావూరు పాలకుడైన రఘునాధ రాయని ఆస్థానమునకు వెళ్ళిరి. ఎంతో ప్రతిభావంతుడు, సంగీత కళానిధి అయిన రఘునాధరాయని ఆస్థానమున ఆతని అభ్యర్ధనపై కొన్నాళ్ళు అచ్చట గురుదేవునితో వేంకటనాథుడు విడిది చేసెను. ఇచ్చట వేంకటనాథునకు తన పాండిత్య ప్రకర్షకు ఎంతో అవకాశము కలిగెను. పద్దెని మిది రోజులపాటు జరిగిన పాండిత్య ప్రకర్షణా ప్రతి భతో ఆనాటి రాజాస్థాన మహాపండితుడైన యజ్ఞ నారాయణ దీక్షితుని ఓడించెను. అట్టి సమయమున, వేంకట నాధునకు జరిగిన విశేష రాజ సన్మానము నందు తన గురుదేవుని సమక్షమున, ఎందరో దక్షి ణాత్య పండితుల సమక్షమున "వేంకటభట్టు"ను

బిరుదు నామముతో సత్కరించెను. "తత్వమసి", "అహంబ్రహ్మాస్మి" అను ముఖ్య వేదాంత రహస్య ములలోని మర్మములను విపులముగా విశదీకరించి తన పాండిత్య వాదనా పటిమలతో పండితులను మెప్పించెను. మహారాజు సంతసించి వేంకటనాధుని తన ఆస్థాన విద్వాంసునిగా నుండ ప్రార్థించెను. తమ పరి వేంకటానాధుడు గృహమునకరుదెంచి తన ఆత్మీ యులు కలిసెను.

తమ్ముని పాండిత్య విశేషమునకు అన్నగా రెంతో ఆనందించి వేంకటనాధునకు వివాహ ప్రయత్నములు చేసెను. తమ్మునకు తగిన కన్యకై వెదకి తుదకు నారీలోకమునకే వన్నెచేకుర్చెడు "సరస్వతి" యను కన్యాలలామను వేంకటనాధున కిచ్చి పెండ్లిగావించెను. ఆమె యెంతో అణుకువతో వేంకటనాధుని సేవించుచూ, ఆదర్శ గృహిణిగా వెలు గొందుచుండెను. వారిద్దరి అన్యోన్య దాంపత్యమునకు గురుతుగా ఒక కుమారుడు కలిగెను. ఆ బాలునకు లక్ష్మీనారాయణుడని నామమిడిరి.

వేంకటనాధుని పాండిత్యము, ఆ కుటుంబ లౌకిక వ్యవహారములు సక్రమముగా నడుపుటకుప యోగ పడలేదు. ఎంతో దారిద్ర్యము ననుభవింప వలసి వచ్చెను. తన వద్ద విద్యాభ్యాసము సలుపుటకు వచ్చిన శిష్య బృందము వారి పోషణ ఎంతో భార ముగ నుండెడిది. ఒకవైపు కుటుంబ పోషణ మరి యొక వైపు శిష్యుల భుక్తి గడుపుట వేంకటనాధునికి కష్టమయ్యెడిది. దక్షిణ సంభావనలకై వేంకటనాధుడు ధనవంతుల నాశ్రయించక తప్పెడిది కాదు ఆయనకు సమ్మతము కాకున్నను యాచక వృత్తి నవలం బించుట అవసర మయ్యెడిది.

పరిస్థితుల ప్రభావమునకు వేంకట నాధుడు తల ఒగ్గినను, తన పాండిత్య ప్రకర్షణలతో భక్త జనుల నాకర్షించువాడు. ఆయన ఉపన్యాసములతో శ్రోత లను మంత్ర ముగ్ధుల గావించుచుండెడివాడు. ఒక నాడు వేంకటనాధుడొక వివాహ శుభకార్యమునకు ఒక ధనవంతుని ఇంటికి వెళ్ళెను. అచట పురోహితుడు పొరపాటున వేంకటనాధునికి గంధము తీయుపని అప్పగించెను వేంకటనాధుడు కాదనక గంధము తీసి ఇచ్చెను. ఆనాటి సాంప్రదాయమునననుసరించి ఆహు తులకు గంధము పూయుట ఒకానొక గౌరవ ప్రద మైన ఆచారముగ నుండెడిది. వేంకటనాధుడు తీసిన గంగము ఆహుతులకు పూసిరి. వారి శరీర భాగములు గంధము పూసిన వెంటనే మండజొచ్చెను. పురోహి తుని ఈ ఉపద్రవమున కతడే కాకుడని తూలనాడిరి. అపుడు వేంకటనాధుడు తాను వేదమందలి అగ్ని సూక్తమును పఠించుచూ గంధము తీసితిననియు ఆ గంధము పూసుకొనుట వలన ఇట్లు అయ్యెననియు. మరల వేదమందలి కరుణ సూక్తమును పఠించుచు గంధము తీసి వారికిచ్చెను. ఆ గంధమును మరల పూసుకొనిన పిదప వారి మంటల బాధ తగ్గిపోయెను. ఇట్టి అద్భుత కార్యమునకా ధనవంతుడు సంతసించి వేంకటనాధుని తగు విధమున సత్కరించెను.

వేంకటనాధుని కష్టనష్టములకు తోడొకనాడు అతని ఇంట చోరులు చొరపడి ఇంటిలోనున్న బట్టలు పాత్రలు దొంగిలించుకుని పోయిరి. వేంకట నాధుని పరిస్థితి కడు దీనమును, కష్టతరములయ్యెను. చేయునది లేక వేంకటనాధుడు సకుటుంబముగ కుంభకోణమునకు పోయి తన గురువైన సుదీంద్ర యతీంద్రుల వద్దకు జని పరిస్థితిని వివరించెను. అతని దీనగాథ విని యతీంద్రులు వేంకటనాధుని భార్య, బిడ్డలతో తన మఠమునందుండుటకు అంగీక రించెను.

ఈ చర్య వేంకటనాధునకెంతో వెసులుబాటు కలిగించినది. తన పాండిత్య వైభవాభివృద్ధి కెంతో దోహదకారి అయ్యెను. ఇంకను ఎన్నో గ్రంథములు చదివి వేంకటనాధుడు అఖండ విద్యా వైభవముతో వెలిగిపోయెను. అట్టి సందర్భమున తనకారోగ్యము

సరిగా లేనందున తనకు మారుగా పీఠబాధ్యతలను స్వీకరింప వలసినదని గురుదేవులు కోరగా వేంకట నాధుడందుల కంగీకరించలేదు. తన కుటుంబముతో తాను విడు-వడనవసరముండునని తలచి తాను పీఠ మలంకరించ వయస్సులేదని తాను గృహస్థుడనని తనకు బాధ్యతలున్నవని పీఠ యాజమాన్యము వహించలేనని నిరాకరించెను. తదుపరి ఆచార్యులు తమ ఆచార్యులు తమ అల్లుని యాదవేంద్ర తీర్థ నామమున పీఠాధిపతిగ ప్రతిష్ఠించిరి. అయితే దేశ పర్యటన సందర్భమున తనకారోగ్యము చిక్కినను వేంకటనాధుని అవసరము మిక్కుటమయ్యెను. వేంకటనాథుని విషయ సంగ్రహము, వాదనా పటిమ, ఉపన్యాసధోరణి, సర్వ జనాకర్షణగయున్న విషయము ఆచార్యుని మరల వేంకటనాధుని పీఠాధ్వర్యము స్వీకరింప కోరక తప్పలేదు.

ఆ తరువాత ఆచార్యుని ఆరోగ్యము క్రమ-క్రముగా క్షీణింపజొచ్చెను. అంతేకాక ఒకనాటి రాత్రి స్వప్నములో వేంకటభట్టును. పీఠాధిపతిగా ప్రతిష్ఠించ మని తన ఇలవేలుపయిన మూల రాముడు సెల విచ్చెను. అంతేకాక అదే సమయమున శారదాదేవి వేంకటభట్టు కలలో కనిపించి, వేంటనే పీఠాధిపత్యము స్వీకరింపుమని ఆనతిచ్చెను. శారదాదేవి ఆనతిని వేంకటభట్టుకు స్వీకరింపక తప్పలేదు. పిదప వేంకటభట్టు శ్రీ రాఘవేంద్ర తీర్థ నామమున పీఠాధిపత్యము స్వీకరించెను. మఠాధిపత్య స్వీకారము పెద్ద ఎత్తున తంజావూరు ఆస్థానమున జరుపుటకు నిశ్చయింపబడెను. ఆ కార్యక్రమముతో బాటు వేంకట భట్టు కుమారుని ఉపనయనము కూడ నిర్ణయించిరి. కానీ తన పీఠాధిపత్య స్వీకరణ వార్త వేంకటభట్టు గోప్యముగ నుంచెను. భార్యాబిడ్డలకు చెప్పలేదు. గురుదేవులను కలుసుకొనెడు మిషతో కుంభకోణము వెళ్ళెను. పిదప తంజావూరు వెళ్లెను. తంజావూరు నందు వేంకటభట్టుకు స్వాగత సత్కారములు విశేషముగా ఏర్పాటు చేయబడెను. రాజ దర్బారు అలంకరించిరి. వేంకటభట్టు శ్రీ స్వామి రాఘవేంద్ర తీర్థులుగా సకల లాంఛనములతో ప్రణవ మంత్రో పదేశంతో ప్రపంచమునకెంతో మహోపకారముగ పీఠాధిపత్యము వహించుట జరిగినది కాని విధి లీలలు విచిత్రము కదా!

తన భర్త పీఠాధిపతిగా సన్యాసము స్వీకరించె నని తెలిసిన సరస్వతి, తీవ్ర దుఃఖముతో మనో వేదనతో ఉన్మాదియయ్యెను. ఎంతో వ్యధ చెందిన ఆమె దుఃఖమున కంతములేదయ్యెను. తీరని మనో వ్యధతో బలవన్మరణముగా ఆమె పరమపదించెను అందుకు కారణముగ ఆమె పిశాచి రూపమున అల్లాడు చుండ తన పవిత్ర కమండలోదకములను ఆమెపై జల్లి ఆమెకు సద్గతులు కలిగించిరి, శ్రీరాఘవేంద్రులు ఆనాటి నుండి ఆమె మధ్వుల ఆరాధ్య దేవతయై వారినుండి తొలి పూజలందు కొనుచున్నది.

మత ప్రవక్త కవసరమైన దేశాటన శ్రీ రాఘ-వేంద్రులు కూడ ప్రారంభించిరి. శ్రీ రాఘవేంద్రుల అద్భుత వాక్పటిమ, శేముషీ వైభవము ఎందరోజనుల పూజలందుకొనునట్లు చేసినవి. స్వామి ఎన్నో మహి మలు చూపి అందరి మన్ననలను పొందిన గొప్ప మత ప్రవక్తగా పేరుపొందిరి. సామాన్యులనుండి కూడ బిక్ష స్వీకరించి తానందరి వాడినని తన కందరూ సమానమని ఆచరణ పూర్వకముగ నిర్వహించిన మహా గొప్ప మహిమాన్వితుడైన స్వాములుగా ప్రజల మన్ననలను పొందిరి.

ఒకప్పుడు స్వామి తన పర్యటన కార్యక్రమ ములలో కండతిన గ్రామం సందర్శించెను. ఆ గ్రామమున అనాధ యువకుడైన వెంకన్న తన పోష కుడైన స్వార్థ పరుడైన బంధువు పశువులను మేపుచూ ఎట్టి విద్యాభ్యాసము లేక, సజ్జన సాంగత్యమును లేక పశులకాపరిగ నుండెడివాడు. కాని విద్యాసముపార్జన యందు విశేష మక్కువకలవాడు వెంకన్న. స్వామివారి

దర్శనముతో ప్రభావితుడై ఎంతో శ్రద్ధా భక్తులతో స్వామిని సేవించి, వారి కృపకు పాత్రు డయ్యెను. ఈయన సేవలకు స్వామి సంతుష్టుడై ఏదైనా అవసరము కలిగినపుడు తనను స్మరింపుమని అపాయములేవయినా తొలగునని చెప్పెను. వెంకన్న జరిగినది మరచిపోయెను.

మామూలుగ వెంకన్న అడవికి పశువులను మేపుటకు పోయెను. అదే దినమున అప్పటి ఆదోనీ నవాబు "సిద్ద మసూద్ ఖాన్" కూడ వేటకై అదే అడవికి వచ్చుట జరిగెను. ఆ సమయమునొక వార్తా హరుడు వచ్చి నవాబుకు ఒక లేఖనందించెను. తాను చదువు రానివాడు కావున ఆ ఉత్తరం వెంకన్నకిచ్చి చదవమని చెప్పెను. కానీ వెంకన్న తనకు విద్యా భ్యాసము లేదని చదవలేనని చెప్పెను. అయినను నవాబు ఉత్తరం చదివి చెప్పని యెడల చంపెదనని చెప్ప వెంకన్న ఒళ్ళంతా చెమటతో తడవ, గడ గడ వణకుచూ దైవవశమున స్వామి అనుగ్రహమున వెంటనే శ్రీ రాఘవేంద్రుల మాట జ్ఞప్తికి వచ్చి స్వామిని ఆపదను గడప ప్రార్థించెను. స్వామి కరుణతో, నిరక్షరాస్యుడయిన వెంకన్న ఆ ఉత్తరమును గడ గడ స్వరయుక్తముగా చదివి వినిపించెను. నవాబు సైన్యము శత్రు రాజులను జయించినట్లు వర్తమాన మది. అందులకు నవాబు సంతోషించి వెంకన్నను తనతో రాజధానికి తీసుకునివెళ్ళి ఉద్యోగము ఇచ్చెను. అతని విద్యాభ్యాసము కొనసాగుటకు దోహ దము చేసి తదుపరి వెంకన్నను దివానుగా నియ మించెను వెంకన్న ఇది యంతయు శ్రీరాఘవేంద్రుల కరుణాకటాక్ష ఫలమని యెంచి, స్వామికి తన గురుభక్తి ప్రకటించు సమయమునకై వేచియుండెను.

శ్రీ రాఘవేంద్రులు ఎందరో దుఃఖార్తులకు దుఃఖోపశమనమును, మూర్ఖులను దుర్మార్గులను సన్మార్గులుగా చేయుచు ఎంతో విస్తృత పర్యటన జరిపెను. దక్షణదేశ యాత్రలు అనగా తమిళనాడు, కర్ణాటక, కేరళ, ఆంధ్రప్రదేశ్ పర్యటించి అనేక మంది శిష్య గణములను ప్రోగుచేసెను. స్వామి ఎక్కడకు వెళ్ళినను ఎంతో వైభవముగా భజనలు సమారాధన లతో స్వామి సమక్షము వైకుంఠధామమయ్యెడిది. తనను దర్శించిన ప్రతి భక్తుని ఆశీర్వదించి తన శిష్యునిగ చేసికొని ఎంతో వైభవముతో రాజాధిరాజుగా వెలుగొందు చుండెను. ఎన్నో మహిమలు భక్తులకు దర్శింపజేయుచు, వారి బాధలనుపశమింపజేయుచు వారికి ప్రత్యక్ష దైవముగ కీర్తి నొందెను.

ఒకప్పుడు గడగ్ ప్రాంతమున గల క్రితగిరి వెళ్లినపుడు శ్రీ రాఘవేంద్రులు రఘునాధ దేశాయి అను ప్రముఖుని ఇంట భిక్ష స్వీకరించిరి. అట్టి సమయమున ఒక ప్రమాదము జరిగెను. రఘునాధుని మూడేండ్ల కుమారుడు. మామిడి పండ్ల రసముగల తొట్టెలో పడి చనిపోయెను. ఆ దంపతులు ఇట్టి తీవ్ర దుఃఖమును దిగమ్రింగుకుని స్వామివారి పూజా కార్యక్రమమున కంతరాయము కలుగకుండా జాగ్రత్త పడిరి. స్వామివారు పూజానంతరము తీర్థము తీసి కొనుటకు రమ్మని రఘునాధునికి కబురు పంపిరి. వారు దుఃఖపూరితమైన తమ వైఖరి స్వామికి చూపుట కిష్టములేక స్వామి వారు ఫలహారము చేసిన పిదప వచ్చెదమనిరి. మహిమాన్వితులైన స్వామి వెంటనే రఘునాధ దేశాయిని తన సమక్షమునకు పిలిపించి జరిగిన విపత్తు తెలిసికొని ఆ బాలుని శరీరము తన వద్దకు తీసుకుని రమ్మనిరి. వారట్లు తీసికొనిరాగా, స్వామి తమ కమండల మంత్రజలము బాలకుని శవముపై ప్రోక్షించిరి. చిత్రము! బాలుడు సజీవుడై లేచివచ్చెను! అప్పుడచ్చట భక్త జన సందోహము సంభ్రమాశ్చర్యములు ఊహింపనలవి కానివి. భగవదాంశ సంభూతులకిట్టి లీలా విలాసములు సులభ సాధ్యములే!

స్వామి కరుణా కటాక్షములతో కనకదాసను చండాలుని ఉద్ధరించెను. ఇతడు స్వామివారి పూర్వ జన్మములో సన్నిహితుడని స్వామివారు గుర్తించుటయే ఇందుకు కారణమట!

శ్రీ రాఘవేంద్రులు తిరుపతి సందర్శన సంద

ర్భమున ఒక గ్రామమున ఆంజనేయుని దేవాల యమునందు బసచేసిరి. వారు పీఠమందలి మూల రాముని పూజించునపుడే కనకదాసు ఎంతో భక్తి శ్రద్ధ లతో పూజాదికములు నిర్వహించు స్వామిని, తదేక నిష్ఠతో గమనించుట స్వామి గ్రహించిరి. కనకదాసు స్వామి పాదములపైబడి తనసుద్ధరించమని ప్రార్థిం చెను. పూజాదికములైన తరువాత సహకరించెదనని చెప్పి నైవేద్యమునకేదయినా తెమ్మని చెప్పెను. కనక దాసు తన ఇంటలో ఆ సమయమున కేదియు లేక పోవుటచే వెదకగా పిడికెడు ఆవాలు దొరికినవి. అవే స్వామికి నైవేద్యమునకై ఇచ్చెను. చతుర్మాస్య వ్రత సమయమున ఆవాలు వంటలలో ఉపయో గించుట నిషిద్ధమైనను, స్వామి, వాటినుపయోగించమని ఆనతిచ్చెను అందువలన ఈ నాటికీ ఆవాలు ఉపయోగపడుచున్నవి. కనకదాసు స్వామివారి కృప వలన సాయుజ్య మోక్షము లభించినది. ఈ విధము శ్రీ రాఘవేంద్రులు జాతి విచక్షణ చూపక ప్రభువు, ధనవంతుడు, బీదవాడనే బేధము చూపక, చదువు కున్నవాడు చదువు లేనివాడు అను అంతరము పాటించక అందరిని సమానముగా చూచుచు, అందరి క్షేమము కోరుచు, తన మహిమలు చూపుచు, తనను ఆశ్రయించినవారి కష్టములను బాపుచు, ప్రత్యక్ష దైవ ముగా భక్తుల మనసులలో ఈ స్వామి ఈనాటికి స్థిర స్థాయిగా ఉన్నారు.

ఈ స్వామి మహిమలు, సాగించిన అద్భుత కార్యములు ఈయనను మహామహునిగ, గొప్ప మత ప్రవక్తగా, కరుణామయునిగ భక్తులచే కొనియాడ బడునట్లు చేసినవి. ఈయన చూపిన మహిమలు కోకొల్లలు. తనను పూజించిన వారికి శ్రీరాఘవేంద్ర స్వామి విపత్తులనుండి కాపాడుటయే కాక వారెంతో ఉన్నతిని సాధించుటకు దోహదము చేసెను.

ఆయనకు ప్రకృతి శక్తులపై గల అధికారము అమోఘమయినది. వరుణయజ్ఞము చేసి పీఠమున గల మూలరాముని పూజానంతరము కురిసిన కుంభ వృష్టి కరువు కాటకములతో అలమటిస్తున్న తంజా వూరు ప్రాంత ప్రజలు పాడి పంటలతో ఎంతో అభివృద్ధిని సాధించిరి. తన గురుదేవుని ఈనాటికి భక్తి ప్రపత్తులతో పూజలు జరుపుచున్నారు.

శ్రీ రాఘవేంద్రులకు జ్యోతిషమునందు కూడ విశేషాధికారము కలదు. తన సమాధి ఏడు వందల యేండ్లు అవిశ్చిన్నముగా పూజింపబడునని చెప్పెను. అతీంద్రియ శక్తులపై విజయమునకు ఆయన శక్తి సామర్థ్యములు విశేషముగా కలవు. ఆయన మహా పండితుడుగా ఎంతో కీర్తి గడించారు. నలభై ఏడు దైవిక గ్రంథాలు, వివిధ వేదాంత విషయాలు, భార తీయ సంస్కృతీ వైభవమును చాటు తత్వ గ్రంథాలు వ్రాసారు. ఇందెన్నో గ్రంథాలు వివిధ భాషలలో అను వదింపబడ్డాయి. ఇంకను ఎన్నో గ్రంథాలు వెలుగు చూడనివి ఉన్నాయి. ఇందు పరిమళ, చంద్రిక ప్రకాశ, న్యాయముక్తావళి, తత్త్వ మంజరి, దశోపనిషత్, భావ దీపిక అను భాష్యము, పురుష సూక్త, మంత్రార్థ సంగ్రహము మొదలగునవి కలవు. తాత్త్వికులకుకూడా కొన్ని విషయాలు అత్యద్భుతముగా తోచెడివి. శ్రీ రాఘవేంద్రుని రచనా కౌశలము, భావనా పటిమ విషయ సంగ్రహము వివిధ మతములయందలి మూల సూత్ర అవగాహన, అద్వితీయ విషయ పరిజ్ఞానము స్వామిని ప్రపంచ మహా ప్రవక్తలలో ముఖ్యునిగ చేసినవి. ఆనాటి ప్రముఖ పండిత ప్రకండులలో శ్రీనివాసాచార్యులు పేర్కొనదగినవారు. శ్రీరాఘ వేంద్రులు అతని పాండిత్య ప్రకర్షను గ్రహించి వారిని ఉచిత రీతిని సత్కరించిరి. "తీర్థుల" బిరుదము ప్రసాదించిరి.

స్వామి పర్యటనలలో క్రిష్ణాపురమున జరిగిన యుదంతము పేర్కొనదగినది. స్వామివారు క్రిష్ణా పురమునగల వనములో విశ్రాంతి గైకొనుచుండ ఆ ప్రాంత నావాబు స్వామి వారి కీర్తి ప్రతిష్ఠలు విని వారి

దర్శనమునకు వచ్చెను. తన ఏకైక పుత్రుడు, పాము కాటు వలన మరణించుటచే తన కుటుంబము ఎంతో వ్యధ చెంది యున్నదని తన బిడ్డ సమాధి అయ్యెనని చెప్పెను. శ్రీ రాఘవేంద్రలు సమాధి త్రవ్వి శవమును బయటకు తీయుడని ఆజ్ఞాపించగా నవాబు మారు పలుకక అట్లే చేసెను. అపుడు స్వామి గరుడ మంత్రము పఠించి తన కమండలోదకమును ఆ శవముపై చల్లెను. ఆహా! ఏమి వింత! ఆ బాలుడు నిద్ర నుంచి లేచినవానివలే తన తండ్రి యొద్దకు పరిగిడెను. నవాబు ఆనందమునకు అంతులేదు. గట్టిగా అరచుచూ గంతులు వేసెను. చుట్ట ప్రక్కల గల జన సమూహముతో ఆ వనము కిక్కిరిసెను. అప్పుడు నవాబు మఠమునకు రెండు గ్రామములు దానము చేసెను. 1857 వరకు ఈ మఠమునకు ఆగ్రామములు ఉండెడివి. తరువాత ఆంగ్లేయుల వశమైనవి. కాని ఆనాటి ఈ అత్యద్భుతోదంతము చిరస్థాయిగా నిలిచినది. స్వామి ప్రత్యక్ష దైవమని రూఢీ అయినది.

శ్రీ రాఘవేంద్ర స్వామి తన దక్షిణా పథ పర్యటనలో ఆంధ్రప్రదేశ్‌కు వచ్చుచు ప్రస్తుత అదోని ప్రాంతమునకు వచ్చిరి. స్వామి వారి రాక అప్పటి దివాన్‌గానున్న వెంకన్నకు తెలిసింది. స్వామి వారికి ఆహ్వాన మహోత్సవములు ఎంతో ఆడంబర ముగా జరిపెను. పట్టణమంతయు అలంకరింపబడెను. నవాబు కూడ ఆహ్వానింపబడెను. ఆ నవాబు స్వామి వారి శక్తి సామర్థ్యములు పరీక్షించదలచెను. స్వామి పీఠమున గల మూలరాముని పూజానంతరము నైవేద్యము చేయుటకు సిద్ధముగా నున్నపుడు నవాబు పంపిన పళ్ళెమును ఇచ్చిరి. స్వామి పరిస్థితిని గ్రహించి ఆ పళ్ళెముపై కప్పిన బట్ట తొలగించమని చెప్పెను. ఆహా! ఏమాశ్చర్యము! నవాబు పంపిన మాంసాహారము సువాసనలతో కూడిన పుష్పములుగ, మధుర ఫలములుగ మారిపోయెను. మహాత్ముల కలవిగాని కార్యములేదని బుజువైనది. నవాబు సిగ్గుతో తలవంచుకొనెను. తన మూర్ఖత్వము పటాపంచ లయ్యెను. నవాబు ఎంతో పశ్చాత్తాపపడి వెంటనే తన పాప పరిహారార్థము ఒక గ్రామము మఠమునకు ఇచ్చెను. ఈ వార్త దివానుకు చెప్పి స్వామి వారికి తెలియజేయమనెను. స్వామివారు కోరిన మాంచాల గ్రామము మఠమునకిచ్చెను. శ్రీ రాఘవేంద్రులు తమ అమృత హస్తములతో ఏమిచ్చినను అది బాధ నివారణ చేసే గొప్ప ఔషధముగా పనిచేసెడిది. మల్లప్పసింధే అను ధనవంతుడు రాయచూరు నివాసి కడుపు నొప్పితో బాధపడుతూ ఎందరో బిషగ్వరుల వలన నివారణకాక స్వామిపూజ చేయుచూ కాలము గడుపు చుండ స్వామి కరుణించి కలలో దర్శనమిచ్చి శస్త్ర చికిత్సకై బొంబాయి వెళ్ళమని ఆనతిచ్చెను. శస్త్ర చికిత్సా సమయమున ఒక అగంతకుడు కాషాయాంబరధారిగా వచ్చి శస్త్ర చికిత్స పూర్తిచేసెను. ముఖ్య వైద్యులు చూచుచుండగనే ఈ యుదంతము జరిగినది. తన చిరకాల కడుపునొప్పి బాధ తప్పి నందున సింధే ఎంతో ఆనందించి స్వామి కరుణా కటాక్షమునకు ఉప్పొంగి పోయెను. మరల స్వామి కలలో సాక్షాత్కరించి ఒక దేవాలయము కట్టమని ఆదేశించెను. అతడు దేవాలయము నిర్మించెను.

ఇంకను మరియొక అద్భుత ఉదంతము ప్రభుత్వ పత్రముల ద్వారా తెలియుచున్నది. 1916 సం॥ న మద్రాస్ ప్రాంత రాజపత్రమునందీ వార్త తెలుపబడినది.

ఆంగ్లేయుల పరిపాలనా కాలమున పాశ్చాత్యులు మన భారతీయ సిద్ధాంతములు, నమ్మకములు నచ్చక దేవాదాయములుగా ఇచ్చిన భూవసతి గ్రామములను ఆక్రమించపూనుకొనిరి. శ్రీ రాఘవేంద్రులకు ఆదోని నవాబు ఇచ్చిన గ్రామములను కూడ ఈ ఆక్రమణలోనికి వచ్చినవి. శ్రీ రాఘవేంద్ర మఠాధికారులు ఎంతో ప్రాధేయపడిరి. ఈ దేవాదాయములు ధర్మాదాయములు సందర్శకులకు భక్తులకు

ఎంతో ఉపయోగపడుచున్నవని ఇచ్చట పూజా పునస్కారములకు వీటివలన వచ్చే ఆదాయమే ఆధారమని చెప్పిరి. నిజానిజములు తెలిసికొనమని ఆనాటి ప్రాంతీయ అధికారి థామస్ మన్రోను ఈస్టిండియా కంపెనీ వారు పంపిరి. అయన శ్రీ రాఘవేంద్రాలయమును ఎంతో భక్తి ప్రపత్తులతో దర్శించెను. బృందావనము ( శ్రీస్వామి వారి సమాధి) నుండి సాధుపుంగవుడు మన్రోకు దర్శనమిచ్చి ధర్మాదాయ అవసరమును నొక్కి వక్కాణించెను. ఆ గ్రామమును ఆక్రమించుట అక్రమమని అట్లొనరించిన ఇచ్చట పూజా కార్యక్రమములు భక్త జనుల సదుపాయములు జరగునేరవని సవివరముగ తెలియ చెప్పి థామస్ మన్రోకు అక్షతల నిచ్చెను. మన్రో ఆ యతి చెప్పిన విషయములు సహేతుకములని నమ్మి గ్రామమును ఆక్రమించుటకు విరమించుకొనెను, ఆ సంఘటన తన నిర్ణయము అప్పుడచట నున్న భక్త జన సందోహమునకు తెలియజెప్పి, స్వామి అనుగ్రహించిన అక్షతలను చూపెను. వారందరూ ఆ ఆంగ్లేయుని అదృష్టమునకు, స్వామి దర్శనమయినందుకు శ్లాఘించిరి. థామస్ మన్రో దొర ఆనాటి ఉదంతమున మద్రాస్ ప్రాంత రాజ పత్రమునందు పొందుపరచెను.

ఇటువంటి వెన్నో అత్యద్భుతోదంతములు జరిగినవి. అందువలన శ్రీ రాఘవేంద్రుల భక్తుల పాలిట కల్పతరువుగా నేటికిని నిలచియున్నారు.

శ్రీ రాఘవేంద్రులు తన నిర్యాణ సమయమాసన్నమైనదని తెలిసికొని దివాను వెంకన్నను (తన సమాధి) బృందావనము నిర్మించుటకు కావలసిన రాళ్ళు దగ్గరలోగల మాధవవరమునుంచి తెమ్మనెను. అందులకు గల కారణమేమన ఆ ప్రాంతమున గల రాతిబండలపై శ్రీ రామచంద్రుడు ఏడు ఘడియలు విశ్రమించెనట. అందువలన అట్టి పవిత్ర పాషాణములతో తన సమాధి భక్తులకు తీర్థరాజముగా కొన్ని వందల సంవత్సరముల పర్యంతము వర్ధిల్లునని స్వామి తెలియజేసిరి. దివాన్ వెంకన్న అటులే చేసెను. సమాధి సిద్ధము అయినది.

సర్వ జనులకును రాజు, పేద తారతమ్యము లేక ఉద్యోగి, నిరుద్యోగి అను బేధము చూపక సర్వ మతముల వారిని ఆదరించి తన కృపాకటాక్షములతో అనుగ్రహించి, ఆర్తుల పాలిట కల్పవృక్షముగ మహా మహిమాన్వితులైన శ్రీ రాఘవేంద్రుల నిర్యాణ సమయమాసన్నమైనది. విరోధి నామ సంవత్సర శ్రావణ బహుళ తదియనాడు శ్రీ రాఘవేంద్రలు సజీవ సమాధినొందిరి. దుఃఖపూరిత హృదయులైన అసంఖ్యాక భక్త జనులు ఆహాకారములు సలుపుచుండ, స్వామివారి ఆజ్ఞానుసారము వేద ఘోషల నడుమ శ్రీ స్వామివారు సజీవ సమాధినొందిరి. వారి ఆజ్ఞానుసారము సమాధిలో ఏడు వందల సాలగ్రామములు పేర్చి ఆపై సిద్ధము చేసిన పవిత్ర పాషాణముల నుంచిరి.

ఆనాటితో గత నలుబది ఏడు సంవత్సరముల ఐదు మాసముల ప్రఖ్యాత మధ్వ పీఠ మహా మహిమాన్విత మహొన్నత చరిత్ర ముగిసినది.

ఈ నాటికిని జగద్గురువులు మంత్రాలయమున వెలసి భక్తుల కోర్కెలు తీర్చుచున్నారు. వారు భక్తులకు దర్శనమిచ్చుచూ భక్తుల కోర్కెలనీడేర్చుట ఈనాటికినిజరగుచున్నందున మంత్రాలయ క్షేత్రము బృందావనము ఎంతో అభివృద్ధి సాధించుచున్నవి.

పవిత్ర తుంగభద్రానదీ తీరాన ఈ క్షేత్రము భక్తజన సందోహముతో నిత్యము వైభవోపేతముగ అలరారుచున్నది. దగ్గరలో ఆంజనేయ విగ్రహము ప్రతిష్ఠించిరి. శ్రీ స్వామి వారు తమ పర్యటనలలో సుమారు ఏడు వందల ముప్పై రెండు ఆంజనేయ స్వామి విగ్రహాలను దేశము నల్గడల ప్రతిష్ఠించిరి. ద్వైత మత ప్రచారమునకు జగద్గురువులు శ్రీ రాఘవేంద్రులు జరిపిన కృషి మన భరతఖండమున ఆచందతారార్కమగునని నమ్ముటలో అనౌచిత్యము లేదు.



# అనంతపూర్ జిల్లా

## లేపాక్షి

అనంతపూర్ జిల్లాలో లేపాక్షి దేవాలయము ఎంతో ప్రసిద్ధి చెందినది. లేపాక్షి చిన్న గ్రామము.

హిందూపూర్ నుంచి సుమారు పది కి॥మీ॥ దూరముననున్నది. లేపాక్షి హైదరాబాద్ బెంగుళూర్ మీటర్ గేజ్ రైలు మార్గమున హిందుపూర్ స్టేషను కలదు. ఇచ్చటనుండి లేపాక్షికి బస్సు సౌకర్యము కలదు.

ప్రసిద్ధి చెందిన శ్రీవీరభద్రేశ్వరాలయము లేపాక్షిలో నున్నది. విజయనగర ప్రభువుల కాలము లోని కుడ్య చిత్రములకు కాణాచి లేపాక్షి ఎంతో దర్శనీయములుగా నున్న ఈ చిత్రములు ఎంతో భావుకతతో నుండి ఈనాటికీ ఎంతో ప్రఖ్యాతివహిస్తూ యున్నవి.

విజయనగర ప్రభువుల కాలమున విజయనగర శైలిగా పేరొందిన శిల్పకళలకు లేపాక్షి పేరెన్నిక కలిగినది. కూర్మ శైలముగా ప్రసిద్ధి చెందిన కొండ ప్రదేశమున ఈ క్షేత్ర నిర్మాణము జరిగినది. ఈ కొండ ఆకారమున తాబేలువలె యున్నది. అందువలన ఈ కొండకు కూర్మ శైలమని పేరు వచ్చినది.

పదహారవ శతాబ్దమున విరూపన్నచే ఈ దేవాలయము నిర్మాణము జరిగినట్లు శాసనాధారము కలదిచ్చట. ఇచ్చట శ్రీ పాపనాశేశ్వరుడు, శ్రీ రాముడు శ్రీ వీరభద్రుడు శ్రీ దుర్గాదేవి ఇచ్చట పూజలందు కొనుచున్నారు. లేపాక్షి క్షేత్రమును గూర్చి స్కాంద పురాణమున పేర్కొనబడినది. 108 ప్రసిద్ధ శైవ క్షేత్రములలో లేపాక్షి ఒకటిగా పేర్కొనబడినది.

ఈ క్షేత్రము అగస్త్య మహాముని ప్రతిష్ఠితమని పెద్దలు చెబుతారు. కాలక్రమమున విజయనగర ప్రభువుల కోశాధికారిగా నున్న పరమ పవిత్రుడు విరూపన్నచే నిర్మింపబడి జగత్ప్రసిద్ధి చెందినదీ క్షేత్రము పరమశివుని మందిరము శ్రీహరి మందిరమున కెదురుగానున్నది. మధ్యలో వీరభద్రుడు నెలకొల్పబడెను. ఒకే మండపములో నిర్మింపబడినది.

నాట్య మండపము, అర్ధ మండపము శిల్ప విజ్ఞానముతో ఎంతో అర్థవంతముగా నిర్మింపబడి యున్నది. సంగీత విద్వాంసులు, నృత్యశేఖరులు ప్రతిమలుగా స్థంభములపై మలచిన తీరు విజయ నగర శిల్పకళా వైభవమును చాటి చెప్పుచున్నది. కళాకారుల లోని ప్రతిభ నైపుణ్యము శిల్పములలో మలచి ఆనాటి

శిల్పులు కారణ జన్మములుగా ఈనాటికి లబ్ద ప్రతిష్ఠులై నారు. అసంపూర్తిగా నున్నప్పటికీ ఇచ్చటగల కళ్యాణ మండపమున గల శిల్ప కళా వైభవము చూచి తీర వలసినదే.

శ్రీ పాపనాశేస్వర శ్రీ రామేశ్వరస్వామి, శ్రీ గోపాలస్వామి,నాగలింగము ఇచ్చట దర్శనీయమూర్తులు.

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన పెద్ద నంది ఈ క్షేత్రమునకు దగ్గరలో నున్నది. మన దేశమున గల నంది విగ్రహములలో ఇదయే పెద్దది. ఏక శిలతో మల చిన ఈ నంది విగ్రహము 20 అడుగుల ఎత్తు 30 అడుగుల పొడవుతో నుండి ఆనాటి శిల్ప కళా వైభ వము ప్రపంచ వ్యాప్తమగుటకు దోహదపడినది. ఎంతో శ్రద్ధతో నైపుణ్యముతో నేర్పుతో శిల్పులు ఈ విగ్రహ మును మనకందించి మనలను ఋణగ్రస్తులను చేసినారు.

ప్రసిద్ధి చెందిన ఈ క్షేత్ర వృత్తాంతము ఈ విధముగ నున్నది.

శ్రీ కృష్ణదేవరాయునికి విరూపన్న కోశాధి కారిగా నుండెడివాడు. ఆనాటి వర్తక ప్రముఖులలో ముఖ్యుడీయన విరూపన్నకు ఇచ్చట దేవాలయము కట్టవలెననెడి కోరిక కలిగినది. వీరభద్రుని విగ్రహము లభించిన దిచ్చటనే ఆయనకు విజయనగర ప్రభువుల అండ తనకున్నదని భావించి ఈ క్షేత్ర నిర్మాణమునకు పూనుకొనెను. గర్భగుడి నిర్మాణము పూర్తిచేసి కళ్యాణ మండపము నిర్మాణము ప్రారంభించెను. విజయనగర ప్రభువు శ్రీ కృష్ణ దేవరాయలు కోశాగారము ఆలయ నిర్మాణ సమయమున పూర్తిగా వినియోగింపబడినది.

ఈ కార్యము దురాగతముగ నెంచి విజయ నగర ప్రభువులు విరూపన్నను శిక్షించ దలచి, ఆతని కన్నులుతీసి అంధుని చేయనాజ్ఞాపించెను.

పరమ పవిత్రుడు నిష్ఠాగరిష్ఠుడైన విరూపన్న ప్రభువాజ్ఞ తానే అమలు పరచుకొని అంధుడయ్యెను. కళ్యాణ మండపమునకు దగ్గరగల గోడపై నేటికిని ఆతని కండ్లనుంచి కారిన రక్తము మరకలుగా అచ్చట నున్న నల్లని మచ్చలను మనము చూడవచ్చును. తరువాత అతనెన్నాళ్ళో బ్రతకలేదు. అందువలన కళ్యాణమండపము అసంపూర్తిగా మిగిలిపోయినది. ఆనాటినుంచి ఈ గ్రామము లేపాక్షిగా ప్రసిద్ధి చెందినది.

ప్రఖ్యాతి గాంచిన నంది విగ్రహమే కాక, ఇచ్చట నాట్యమండపము కళ్యాణ మండపములలోని శిల్పాలు కుడ్య చిత్రములు ఎంతో పరిణితి చెందిన కళాకారుల అపూర్వ సృష్టి – కళలకుగల సాంఘిక ప్రయోజనాన్ని, ప్రదేశిక విశిష్ఠతను, తమ ప్రత్యేక చిత్రలేఖన శిల్పకళల ద్వారా ప్రదర్శించి ఈ కళా కారులు చరితార్థులైనారు.

ఆనాటి కట్టుబొట్టు సంప్రదాయబద్ధమైన ఆనాటి ఆచార వ్యవహారములు భావితరము వారికి ఆదర్శ ప్రాయముగ మనకందించిన కళాకారులకు మనం ఎంతో ఋణపడి ఉన్నాం. ప్రత్యేకముగా ఇచ్చట అన్నపూర్ణ మృత్యుంజయ, పద్మాక్షి శిల్ప ములు పేర్కొనదగినవి.

భక్త సిరియాళుని చరిత్రలోని ఘట్టములు, కిరాతార్జునీయములోని కొన్ని ఘట్టములు ఎంతో మనోజ్ఞముగ భావ యుక్తముగ తమ ప్రత్యేక శైలిలో శిల్పులు మనకందించినారు.

వీరభద్ర దేవాలయములోని రంగ మండపము ముఖ మండపములపై కప్పులపై చిత్రించిన చిత్ర ములు చూడదగ్గవి. ఎన్నో పురాణ ప్రసిద్ధి వడసిన ఘట్టములు కుడ్యములపై చెక్కబడియున్నవి. "మాను చోళ" కథా చిత్రములు ఎంతో వైభవముగను భావ యుక్తముగ నుండి చిత్రకళకు పరమార్థమును మనకవ గతము చేసిన కళాకారులు అమరులైనారు.

ఎంతో దర్శనీయమైనదీ క్షేత్రము.

## శ్రీ రామలింగేశ్వర స్వామి దేవస్థానము : తాడిపత్రి.

అనంతపూర్ జిల్లాలో పేరెన్నికగన్న శ్రీ రామ లింగేశ్వర స్వామి దేవాలయము చూడదగ్గది. రాయచూర్ మద్రాస్ రైలు మార్గమధ్యమున గుంతకల్లుకు సుమారు 40 కి|మీ| దూరమున గల తాడిపత్రిలో ప్రసిద్ధి చెందిన రెండు దేవాలయములున్నవి. శ్రీ బుగ్గ రామలింగేశ్వర స్వామి మరియు చింతల వెంకటరమణ దేవాలమయులు శిల్పకళలోను, పవిత్రతలోను ఎంతో ప్రాముఖ్యము చెందియున్నవి.

పవిత్ర పినాకినీ నది ఉత్తర వాహినిగా నున్న తీరము పరమ పవిత్ర స్థలము. అందువలన ఇచ్చటి శివాలయము భాస్కర క్షేత్రముగా ప్రసిద్ధి చెందినది. విశాల తాటివనము దట్టమైన అడవిగల ఈ క్షేమునకు తామ్రపల్లి అనెడి వాడుక నామము కలదు. ప్రౌఢ దేవరాయలు కాలమున పెమ్మసాని రామలింగనాయుడు ప్రాంతీయ ముఖ్యునిగానున్న సమయమున ఈ ప్రాంతమునకు తాడిపత్రియన పేరు స్థిరపరచిరి. అదియే ఈనాటికి వాడుకలోనున్నది.

ఇచ్చటి స్థల పురాణమునను సరించి ఈ క్షేత్రము నందు పూర్వము పరశురాముడు తపస్సు చేసి శివుని ఈ లింగాకారములో సేవించియుండెను. ఆ స్థలముననే పరమ శివుడు వెలసి శ్రీ రామలింగేశ్వరునిగా ప్రసిద్ధుడాయెను. ఇచ్చటి భూగర్భమునుండి గర్భగుడి లోనికి శివలింగము ప్రతిష్ఠించిన చోట, సంతత జలధార ఎంతో వేగమున బహిర్గతమై పరమ శివుని అభిషేకించినట్లుండును. ఇచ్చటి లింగము నునుపుగా లేక ఎగుడుదిగుడులుగా నున్న స్వయం భూలింగముగా ప్రసిద్ధి చెందినది. కర్నల్. మెకంజీ కైఫీయతు, మరియు చారిత్రక విశిష్టత ననుసరించి ఈ క్షేత్ర చరిత్ర తెలియుచున్నది. ఈ అంశముల ననుసరించి ఇచ్చటి స్వయంభు లింగము కాలక్రమమున కప్పబడి పుట్టలకిరవై మరుగున పడెను. ఒక గోవు ప్రతిదినము ఇచ్చటకు వచ్చి పాలను లింగముపై విడుచుట గమనించిన పిదప ఈ లింగము కనుగొనబడినది. కైఫీయతు ననుసరించి ఈ ప్రాంత ముఖ్యుడైన శ్రీ రామలింగనాయుడు పశ్చిమ, ఉత్తర, దక్షిణ గోపురములను మహాద్వారమును కట్టించినట్లు తెలియుచున్నది. ఈ క్షేత్రమునకు తూర్పుగ పరశు రాముడు తపమాచరించిన చోట శ్రీరామ ప్రతిష్ఠ జరిగినది. ఇదయే రామపాదముగా ప్రసిద్ధి చెందినది.

ఎంతో శ్రద్ధా భక్తులతో గోపుర నిర్మాణము జరిగినది. ఎంతో వైభవముగాను, దర్పముగను గల ఈ గోపుర నిర్మాణము జరిగినదని, ఈ శిల్పి "యెలంచారి" ఇతను కాశీనుంచి వచ్చి గోపుర నిర్మాణము గావించెనని కైఫీయతులో పేర్కొనబడినది.

శ్రీ చింతల వేంకటరమణమూర్తి దేవాలయము శ్రీ తిమ్మనాయుడుచే నిర్మించబడినది. ఇతడు రామలింగనాయుడు పుత్రుడు ఈ ఆలయమునకు విజయ నగర ప్రభువుల ఆదరణతో నిర్మించబడినది. ఒకే చోట హరి హరులను భక్తులు సేవించుకొనుటకు వీలు కలుగజేయబడినది. వాస్తు శాస్త్ర పరిమితులను అనుసరించి ఈ దేవాలయము నిర్మంపబడినది. ప్రథమముగా ఈ క్షేత్రము శ్రీ చింతల తిరువేంగడనాద స్వామి దేవాలయముగా పిలువబడుచుండెడిది. ధృవ మూర్తి ఇచ్చటగల చింతచెట్టు మొదటనందు కనగొనబడినదట!

ఇచ్చటి రంగమండపము నల్లభై స్థంభములతో విజయనగర వాస్తు శైలిలో నిర్మింపబడినది. ఇచ్చటి ముఖ మంటపమునగల శిల్పములలో రామాయణ ఘట్టములు, భాగవత ఘట్టములు ఎంతో నైపుణ్యముతో చెక్కబడియున్నవి. ఇచ్చట శ్రీనరసింహ స్వామి హిరణ్యకశిపునితో పోరు ఘట్టము ప్రత్యేకతను కలిగియున్నది. ఈ దేవాలయ నిర్మాణమునందు విజయనగర ప్రభువుఅలియ రామరాజా తిమ్మ నాయుడుకు జరిపిన సన్మానములు ప్రాముఖ్యము వహించినవి.

ఇచ్చట నరక చతుర్ధశి మరియు బ్రహ్మోత్సవము అక్టోబరు నెలలోను శివునకు విజయ దశమి మరియు బ్రహ్మోత్సవము సెప్టెంబరు ఫిబ్రవరి నెలలో ఎంతో వైభవముగ జరుగును.

మన భారతీయ సంస్కృతిని పవిత్రతను కళా వైభవములను ఈ క్షేత్రములు ఎంతో వివరముగా తెలియజేయుచున్నవనుటలో అతిశయోక్తిలేదు.

**శ్రీ నెట్టికంటి ఆంజనేయస్వామి దేవస్థానం : కంసాపురం.**

అనంతపురం జిల్లా గంతకల్లునకు 5 కి॥మీ॥ దూరమునగల కంసాపురము గ్రామము వద్ద(పూర్వము నెట్టికల్లు గ్రామము) శ్రీ ఆంజనేయ స్వామి వారి ఆలయము చూడదగ్గది.

ఆ ఆలయము పురాతనము మరియు పవిత్రమైన పుణ్య క్షేత్రము. ఇచ్చట వేంచేసియున్న శ్రీ ఆంజనేయస్వామిని పదహారవ శతాబ్దములో శ్రీవ్యాస రాయలువారు ప్రతిష్ఠించిరని ప్రతీతి.

గ్రహపిచ్చి, అనారోగ్యము సంతానాపేక్ష గల వారు ప్రతిదినము ఉదయ, సాయంకాలములయందు ఇచ్చటగల పుష్కరిణిలో స్నానము చేసి శ్రీ ఆంజనేయునికి ప్రదక్షణలు గావించి నిష్ఠతో సేవించెదరు. వారికి శ్రీ స్వామి వారు స్వప్నమున సాక్షాత్కరించి కోరికలను తీర్చుచున్నారు. ప్రతి శనివారం, పర్వ దినములయందు వేల సంఖ్యలో భక్తులు ఈ క్షేత్రమును దర్శించి తమ బాధలనుండి విముక్తులగుచున్నారు. వసతి సౌకర్యము కలదు.

ఎంతో అభివృద్ధి సాధిస్తున్నదీ దేవస్థానము.

**శ్రీ లక్ష్మీ నరసింహ దేవస్థానము : కదిరి.**

కదిరి పట్టణము ధర్మవరమునకు దక్షిణమున తిరుపతి పోవు మార్గమునందు దాదాపు 60 కి॥మీ॥ దూరమున కలదు. శ్రీప్రహ్లాద సమేత శ్రీలక్ష్మీ నరసింహస్వామి ఇచ్చట ధర్మ సంస్థాపనార్థం అర్చా బింబముగ వెలసియున్నారు.

"ఖ" అనగా విష్ణుపాదము. "అద్రి" అనగా కొండ. కొండపై విష్ణుమూర్తి కృత యుగమున తన పవిత్రపాదము మోపినందున "ఖాద్రి" అను నామము సిద్ధించినది. కదిరి పట్టణమునకు తూర్పునయున్న ఖాద్రి కొండపైగల బండపై పెద్ద పాదము గుర్తు ఇప్పటికిని కలదు. ఈ పాదమే విష్ణుపాదమని ప్రతీతి.

శ్రీ తాళ్ళపాక అన్నమయ్య కీర్తనలననుసరించి శ్రీమహావిష్ణువు నృసింహావతారమును కదిరికి సమీపమున యున్న కంబాలరాయుని దుర్గమున గల కంభమందావిర్భవించి విష్ణుద్వేషియైన హిరణ్యకశిపుని సంహరించి పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుని కాపాడినాడు.

ఇచ్చట శ్రీనృసింహుడు అష్టబాహుడై వెలసి యున్నాడు.

బృగు మహర్షి శ్రీమహావిష్ణువున కొనరించిన మహాపరాధ శమనార్థమై తపము చేసి భగవానుని ప్రత్యక్షము చేసికొని వరమడుగ శ్రీనృసింహస్వామి తన ప్రతినిధిగా శ్రీ దేవి, భూదేవి సహిత వసంత, వల్లభ పంచలోహ విగ్రహములను ఒక పేటికయందుంచి భృగునకనుగ్రహించెను. ఇవియే నేటి ఆలయ ఉత్సవ మూర్తులుగా చెప్పుచున్నారు.

ఈ దివ్య క్షేత్రమునందు శ్రీనృసింహస్వామి హిరణ్య కశిపుని తన తొడలపై పరుండబెట్టికొని రెండు హస్తములను వజ్రశీర్షములుగల వాడి గోళ్ళతో ఉదరమును చేదించుచున్నట్లును మిగిలిన నాల్గు హస్తములతో ఖేటము, ఖడ్గము, శంఖము చక్రములను ధరించి అష్టబాహుడై మాణిక్యఖచితమగు కిరీటాది వివిధ భూషితాలంకృతుడై నోటిలో భయంకరమైన వజ్ర సారములగు కోరలను కల్గి ప్రసన్న వదనుడై కన్పట్టు ఈ స్వామి భక్త వరదుడై యున్నాడు. స్వామివారి పార్శ్వమున అంజలి ఘటించి నిలచియున్న భక్త శిఖామణి ప్రహ్లాదుడు కలడు. ఈ భక్త ప్రహ్లాదుని దర్శనము సర్వపాప విమోచనమట.

ప్రాచీనమైన ఈ పుణ్య క్షేత్రము కళలకు కాణాచి శ్రీలక్ష్మీదేవి ఆలయమందలి శయ్యా మండపములో విలాసినులగు నర్తకీ మణుల నృత్య భంగిమలు అత్యంత మనోహరములై వెలుగొందుచు ఆంధ్రుల శిల్పకళా వైభవమును వేనోళ్ళ చాటు చున్నవి.

దర్శనీయ క్షేత్రములలో నిదియొకటి.



# మహబూబ్‌నగర్ జిల్లా

## అలంపూర్ శ్రీ సంగమేశ్వర నవబ్రహ్మ దేవాలయము

పరమ పవిత్ర శ్రీ కృష్ణా తుంగభద్రా నదీ సంగమ స్థల సమీపమున కర్నూలు మహబూబ్ నగర్ జిల్లాల సరిహద్దు ప్రాంతమున గల అలంపూర్ దేవాలయాలు బహు ప్రసిద్ధి గాంచిన దేవాలయాలు ఇచ్చట ఎన్నో చరిత్ర ప్రసిద్ధి చెందిన ఆలయాలున్నవి అందు శ్రీ సంగమేశ్వర నవబ్రహ్మాలయాలు ప్రసిద్ధి గాంచినవి.

తుంగభద్రకు పశ్చిమ తీరమునగల ఈ అలంపూర్ ఆలయములను హైదరాబాద్ నుంచి బెంగుళూరు వెళ్ళే రైలు మార్గమున చేరవచ్చు. రాయచూరుకు హైదరాబాద్ నుంచి చేరి తుంగ భద్రపై గల వంతెనను దాటి బస్సు మార్గమున ఆలంపూర్ చేరవచ్చును. ఆలంపూర్ రైల్వే స్టేషను నుంచి సుమారు 5 కి|మీ దూరమున కల ఈ క్షేత్రమును సందర్శించుట గొప్ప అనుభవము ఈ దేవాలయములు నన్నిటిని నీట మునుగ కుండ (జలాశయమున) సురక్షితముగా తరలించి యధావిధిని నిలుపుట మన పురాతత్వ శాస్త్రజ్ఞుల అభిజ్ఞతను చాటుచున్నది.

ఈ క్షేత్రమెంతో పురాణ ప్రసిద్ధి చెందిన శైవ క్షేత్రము ఇచ్చట తుంగభద్రానది ఉత్తర వాహినిగా ప్రవహిస్తున్నది. ఈ క్షేత్రమును బ్రహ్మేశ్వర క్షేత్రము పరశురామ క్షేత్రము, దక్షిణ కాశి అని కూడా పిలుస్తూ ఉంటారు.

ఈ మహా క్షేత్రములో ప్రధానముగా నవ లింగములు ప్రతిష్ఠితములైయున్నవి. ఇవి నవ బ్రహ్మ లచే ప్రతిష్ఠితాలైనందువలన ఆ బ్రహ్మ పేర్లనే ప్రసిద్ధములైనవని పండితాభిప్రాయమై యున్నది. బాల బ్రహ్మ, కుమారబ్రహ్మ, అర్కబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వ బ్రహ్మ, తారకబ్రహ్మ, గరుడబ్రహ్మ, స్వర్గబ్రహ్మ మరియు పద్మబ్రహ్మ-అనెడివారు. కానీ ఈ విషయమున ఇంకను ఎంతో పరిశోధించ వలసియున్నది.

అలంపురక్షేత్ర మహిమను వివరించెడి స్థల పురాణాన్ననుసరించి పూర్వమెప్పుడో ఇక్కడ బ్రహ్మ దేవుడు తపస్సు చేసి లింగమును ప్రతిష్ఠించినందువలన ఆ లింగానికి బ్రహ్మేశ్వరుడని పేరు వచ్చినదని తెలియుచున్నది. మహా నందీ క్షేత్రమున గూడ నవ నందీశ్వరులున్నట్లే ఇచ్చట గూడ నవ బ్రహ్మలున్నట్లు మరియొక వాదన కలదు. ఇచ్చట విశ్వలింగము కూడ

ఉన్నందువలన ప్రత్యేకములైన కొన్ని చారిత్రక ఆధ్యాత్మికాది విశేషములకు ఈ క్షేత్రము పేరుగన్నదని చెప్పుటకు వీలు కలుగుచున్నది.

రససిద్ధి పొందిన ఒక మహా సిద్ధుడు కాశీపురం నుండి విశ్వేశ్వర దేవుని ప్రేరణతో ఆలంపురానికి వచ్చి ఇచ్చటి క్షేత్రపాలకులను గూర్చి గొప్ప తపస్సు చేసినాడు. అతని తపస్సునకు మెచ్చుకొని బ్రహ్మేశ్వర స్వామి తలమీదనుండి జోగులాంబ నోటినుండి గణపతి నాభినుండి సిద్ధ రసమును తీసి ఇచ్చినారట! ఆ రస సహాయమున సిద్ధుడు పరుసవేదిని చేసికొని ఆలయ నిర్మాణమునకు పూనుకున్నాడు. అతని వద్ద నున్న పరసవేదిని అపహరించుటకై సైనసమేతముగ విలసద్రాజనే పాలకుడొకడు దండెత్తి వచ్చినాడు. ఆ సంగతి తెలిసికొనిన సిద్ధుడు గర్భాలయములో ప్రవేశించి బ్రహ్మేశ్వరునిలో లీనమై పోయినాడు సిద్ధ నకు ఇలా అపచారము చేసిన విలసద్రాజు. తన దుష్కర్మ ఫలితముగ రాజ్యమును కోల్పోయి పెక్కు బాధలకు గురి అయి తదుపరి ఒక జింక వలన జ్ఞానో దయము పొంది శివసాయుజ్యమును పొందినాడు. ఈ అపూర్వగాథ ప్రవేశ ద్వార తోరణ స్థంభము మీద చెక్కబడియున్నది. మనోహరమైన ఈ శిల్పచాతు ర్యము చూడ వలయునే కాని వర్ణింప వీలుపడదు. ఇంకనూ ఆయా క్షేత్రములలోని దేవతల ప్రాదుర్భా వానికి సంభంధించిన గాధలు ఆలయములు మీద చెక్కబడియుండే సంప్రదాయమునకి శిల్పము గొప్ప ఉదాహరణ. శ్రీముఖలింగ క్షేత్రములో ప్రవేశ ద్వార తోరణముమీద అట్టి ప్రాదుర్భావ గాథ చెక్కబడి యుండుట గమనించవచ్చును.

పై విషయముననుసరించి రససిద్ధులైన మహా శిల్పాచార్యుల చేత మహౌషదీ సంస్కార దివ్య లాభ మును పొందిన శిల్పములు, లింగములు అలంపుర క్షేత్రమున నున్నవని విజ్ఞుల అభిప్రాయమై యున్నది. ఈ ఆలంపుర ప్రాంతము మహౌషదములకు నిలయమని దివ్య క్షేత్రమని రసరత్నాకరాది గ్రంథములు చెప్పు చున్నవి. కొన్ని లింగములు దైవ విగ్రహములను పరిశీలించి ఇంకను ఎన్నో పరిశోధనలు చేయవలసి యున్నది.

చాళుక్య ప్రభువులు, తత్కాల కాంతలు మహా శిల్పాచార్యులను సత్కరించి ఎన్నో ఘన శిల్పాలను చేయించినట్లు శాసనాదుల వలన తెలుస్తున్నది. ఈ దేవాలయములను నిర్మించిన శిల్పాచార్యుల నామ ధేయములు కొన్ని ఈ దేవాలయముల మీద చెక్క బడియున్నవి. వారు రసాది తంత్రసిద్ధులను పొందిన గొప్ప శైవ మహా పురుషులని సూచన ఉన్నది. ఇట్టి శిల్పాచార్యులలో ఈశానాచార్యుడు క్రీ॥శ॥ 702 చాళుక్య విజయాదిత్యునిచే సన్మానింపబడినాడని తెలియు చున్నది. ఆనాడు ఈ ప్రాంతములో "కాలాముఖ" శైవము ప్రచారములో ఉండేది. ఇచ్చట గల లకులీశ శిల్పమూర్తులు పరిశీలించిన ఇచ్చట పాశుపలకులీశ దర్శనానుసారులైన శైవులు ఇక్కడ ఉండేవారనడానికి ఆధారమున్నట్లు గోచరింపక మానదు. అట్టి సంప్ర దాయము ననుసరించి ప్రతి దేవాలయము ప్రతి శైవ మఠము నాడు విద్యాపీఠములై అలరారుచు వైద్య సహాయముగూడ ఇక్కడ లభిస్తుండేదని తెలుస్తున్నది. దేవాలయములో అభినవ త్రిలోచన మునినాథ పండిత మూర్తి వ్యాళ సింహపండిత మూర్తుల శిల్పములున్నవి. వీరి శిష్యుల మూర్తులు కూడనున్నవి.

ఇచ్చట నవబ్రహ్మాలయములలో తారక బ్రహ్మాలయము పూర్తిగా నాశనమయినది. ఈనాడి చ్చట ఎనిమిది బ్రహ్మేశ్వరాలయములు మాత్రమే ఉన్నది. క్రీ॥శ॥ 6,7 శతాబ్దములలో బాదామీ చాళు క్యులు ఈ నవ బ్రహ్మాలయములు కట్టించినారు. వీరు ఈ ఆలయములకు ఉపయోగించిన ఎఱ్ఱఇసుకరాయి శాతనకోట నుండి తెచ్చినారు. దక్షిణాత్య–జేత్తరాహ శిల్పరీతుల అద్భుత సమ్మేళనమే చాళుక్య శిల్పమని పెద్దలు అభిప్రాయ పడుతున్నారు. పల్లవ శైలిలో కట్టబడిన దేవాలయమొకటి శిథిలమై యున్నదిచట.

ఆలంపుర క్షేత్ర పాలకుడు బాలబ్రహ్మేశ్వర స్వామి. ఇతడే ఇక్కడి ప్రధాన దైవము. ఈ ఆలయానికి పడమటి దిక్కున మహా ద్వారమున్నది. 8వ శతాబ్దిలో రాష్ట్రకూటధరావర్షుని సేనానాయకుడైన బలవర్మ కట్టించినాడు. ద్వారము మూడు గదులుగా విభక్తమై యున్నది. ఇందు పద్మ స్థిత విష్ణుమూర్తి, రెండవగదిలో శివమూర్తి. మూడవగదిలో చతుర్ముఖ బ్రహ్మ ఉన్నారు. ఈ మూడు మూర్తుల శిల్పాలు చెప్పుకోతగినవి. ఈ మహా ద్వారానికి దిగువ రెండు వైపులా ఉన్న చిన్న గుడులలో అయితరాజు ప్రతిష్ఠించిన కామాక్షి, ఏకామ్రేశ్వరులు వున్నారు. (1353) ఈ కామాక్షి పాదపీఠంపై మూడు మానవ శిరస్సులు చెక్కబడియున్నవి. రుద్రసేన, భద్రసేన, ఇంద్రసేన అనెడివారి తలలే ఈ కామాక్షి పాద పీఠముమీద చెక్కబడినవని పండితాభిప్రాయమై యున్నది. చోళ రాజు వీరితలలు ఏకారణం చూపకుండా ఉత్తరించడం అవి కామాక్షి పాద పీఠ స్థలం పైనుండి పూజలందుకోవడం జరుగుతున్నదని తెలుస్తున్నది. ఇలాంటి కామాక్షి మూర్తి కంచిలో (కాళీ కోష్ఠము) కూడనున్నది.

మహాద్వారము తరువాతనున్న ద్వితీయ ద్వారమే బాలబ్రహ్మల ప్రధాన ద్వారమై యున్నది. దీనికి రెండు వైపుల, బ్రహ్మ, అర్ధనారీశ్వర మూర్తులు ఉన్నవి. దక్షిణాన గల రెండు గుళ్ళలో ఈ క్షేత్రాధిదేవత జోగులాంబ వీరభద్రుడు ప్రతిష్ఠితులైనారు. మన భారత ఖండమున గల అష్టాదశ పీఠశక్తులలో ఈ జోగులాంబ ఒకటి. ఈమెకు యోగాంబ అని యోగీశ్వరి అని నామాంతరములు ఉన్నవి. ఇచ్చటి శిల్ప సౌందర్యం అద్భుతంగా ఉన్నది.

ఇచ్చటి స్థలపురాణంననుసరించి బాల బ్రహ్మేశ్వరుడు "జ్యోతి ర్జ్వాలామయుడు"గా కీర్తింప బడినాడు. తన్నర్చించువారి కోర్కెలను తీరుస్తూ మహా మహిమాన్వితుడుగా ఈ స్వామి వెలుగొందుచున్నాడు. ఇచ్చట కన్యాకుమారి మూర్తి గమనించదగ్గది. ఉగ్ర నరశింహమూర్తి హరిహర పంచాయతన మూర్తి అరుదుగా ఉంటుంది. ఈ మూర్తి దక్షిణ హస్తంలో సుదర్శనము. వామహస్తమున త్రిశూలము, ఫాలనేత్రము చెవికి మకర కుండలము, ఎడమ చెవికి నాగాభరణము జ్ఞాన ముద్ర, బిల్వదళము చెక్కి ఎన్నో భావాలను శిల్పి చెక్కి చరితార్థుడైనాడు. రెండోమూర్తి హిరణ్యకశిపుని చీల్చిన ఉగ్ర నరసింహమూర్తి. పదహారు చేతులతో ఒప్పుచున్న ఈ మూర్తి ఎంతో దర్శనీయముగనున్నది. ఇవి రెండూ ఎఱ్ఱ ఇసుక రాతి శిల్పాలే. ఒకే శిల్పాచార్యుడు చెక్కినట్లున్నవి.

గర్భాలయము మీది నాగరశైలిలో చతురశ్రముగా, ఎత్తుగా కట్టబడిన విమానము, దానిపై అమలకము తరువాత శిఖరము ఉన్నది. ఇక్కడి నవ బ్రహ్మలయముల విమానములన్నీ ఔత్తరాహ శిల్ప చిహ్నములతో నున్నవి. చాళుక్యులు నాటి శిల్పులు సాధించిన అభివృద్ధి ఈ విమాన నిర్మాణములు నిదర్శనములుగా నున్నవి.

ఎన్నో శిల్పాలు ఆలయాల వెలుపలి గోడమీద మనోహరముగా గోచరిస్తున్నవి.

ఇచ్చట గల విశ్వ బ్రహ్మలయము శిల్ప కళా వైభవముతో తులతూగుతున్నది. ఈ ఆలయము లోపలా బయటా ఉన్న శిల్పవైభవము ఇంతింత అనరాదు. ఇందలి పురాణ గాథా మూర్తులు అత్యద్భుత శిల్పసౌందర్య నిధులు. ఎంతో శ్రద్ధగా చూడవలసిన దేవాలయము. సూక్ష్మ పరిశీలన అవసరమని తోస్తున్నది. విశ్వ బ్రహ్మలయము వెనుక గోడమీద గంగావతరణము దాని దిగువ భాగాన గల వరూధినీ ప్రవరుల గాథ చిత్రితమై ఉన్నది. అయితే ఆరవ శతాబ్దములో నున్న ఈ శిల్పము పదహారవ శతాబ్ద ములో వ్రాయబడిన మనుచరిత్ర ప్రేరకమయ్యెనేమో అని అనిపించక మానదు.

ప్రాచీనములైన కొన్ని మహా శిల్పాలు ఎన్నో కథలకు, కావ్యాలకు మూలభూతములైనట్లూహింప

వచ్చును. ఇచ్చటి మూల విరాట్టును దీపకాంతిలోనే చూడగలుగుతాము. మన మనో దృష్టులు కేంద్రీకృత మగునట్లు ఈ క్షేత్ర నిర్మాతలు అభిలషించినట్లు తోస్తున్నది. ఈ దేవాలయములన్నీ తూర్పు ముఖ ద్వారముగా నుండడమొక విశేషము.

మన ఆంధ్ర దేశములోని అనేక ప్రాచీన దేవాలయాలను గూర్చి సర్వ విశేషాలతో కూడిన పరిశోధనాత్మక గ్రంథాలు రావాలి. వాటి వల్ల మన మత, చారిత్రక, శైల్పిక, వైజ్ఞానకాది బహు విశేషాలు తేటతెల్లమయ్యే అవకాశం ఎంతైనా కలదు కదా! ఇచ్చటి మ్యూజియంలో అతి ప్రముఖమైనది.

ఇచ్చటి చతుర్భుజ, అష్ట భుజ నటరాజ మూర్తులు, భవన మోహనములై విలసిల్లుచూ శాస్త్రీయ లక్షణములతో సౌందర్యలావణ్య సర్వస్వములై అతి సుందరములై విలసిల్లుచున్నవి. ఆ శిల్పుల హస్తకౌశలం వర్ణింప నలవి కానిది. ఆ నటరాజశిల్పం వలెనే మరియొక దివ్య శిల్పము మహిషాసురమర్దనీదేవి ఈమెకు ఎనిమిది చేతులు వీరరసం మూర్తీభవించిన ఈ మూర్తి సర్వాలంకార భూషితమై అతి సుందరముగ నున్నది.

ఇక్కడనున్న వీరగల్లులు ఎంతో చరిత్ర ప్రాధాన్యముకలవి. గౌరీశంకరులను మూపున దాల్చినట్లున్న నందీశ్వర విగ్రహము (ఏకశిలలో) చూడదగ్గది. ఇంకనూ గొప్ప శిల్పములకు కాణాచియైన ఆలంపుర దేవాలయమలు దర్శించి మన ప్రాచీన శిల్పకళా వైభవమును తిలకించి మన మహా శిల్పులను స్మరించడం ఎంతో ఆనందదాయకముగా నుండుననుటకు సందేహము లేదు.

## శ్రీ ఆంజనేయస్వామి : బీచుపల్లి క్షేత్రము.

సుప్రసిద్ధమైన కృష్ణ, తుంగభద్రల అంతర్వేది సీమయందు "బీచుపల్లి" క్షేత్రము ఎంతో దర్శనీయమైనది. ఇచ్చటి స్వామి ఆంజనేయుడు బహు ప్రసిద్ధుడు మహబూబ్ నగర మండలమున ఆలంపూర్ తాలూకాలో కొండపేటకు సుమారు పది కి।మీ। దూరమున పవిత్ర కృష్ణా నదీ తీరమున ఈ క్షేత్రము విరాజిల్లు చున్నది.

కృష్ణానదిపై వంతెన నిర్మించుట వలన హైదరాబాద్ నుండి బెంగుళూర్ పోవు జాతీయ రహదారి మార్గము దగ్గరనుండి పోవుచున్నది.

ఈ క్షేత్రమనకు బీచుపల్లి క్షేత్రమని పేరెట్లు వచ్చెనో తెలియుటలేదు. ఎందువలననంటే ఈ పేరుతో దగ్గరలో గ్రామమేదీ లేదు. పరిసర గ్రామములలో దేనికిని బీచుపల్లి అను పేరులేదు. ఇచ్చట గల ప్రాచీన శిలా శాసనములో కూడా ఈ పేరు లేదు. కానీ ఈ క్షేత్ర ప్రాధాన్యత వలన పరిసర గ్రామములవారు బీచమ్మ, బీచన్న, బీచుమల్లయు అనెడి పేర్లను పెట్టుకొనుచున్నారు. ఈ స్వామిని ఇలవేల్పుగా ఆరాధించుచున్నవారు కర్నూలు, రాయచూరు, మహబూబ్ నగర ప్రాంతములు, మరియు ఇతర దూరదేశములలోనూ ఉన్నారు.

ఇచ్చటకు సమీపములో కృష్ణా నదీ మధ్యమున చిన్ని కొండపై ఒక శిధిల దుర్గము కలదు. ఈ దుర్గమును గద్వాల ప్రభువులు కట్టించిరని ప్రతీతి. సైనిక దృష్టిలో ఈ దుర్గము చాలా విశిష్టమైనది.

ఈ క్షేత్రము గద్వాల సంస్థానమునకు చెంది యుండెడిది. ఈ సంస్థానాధిపతులు ఈ స్వామివారికి రథోత్సవాదులు జరిపించుచుండెడివారు. సంస్థానము క్షీణించుట వలన ఈ క్షేత్రము శిధిలావస్థకు వచ్చెను.

ఈ ప్రాంతమునకు చారిత్రకముగా ఎంతో ప్రాముఖ్యము కలదు. కృష్ణా తుంగభద్రలు నడిగడ్డ సీమ మౌర్యులకు, శాతవాహనులకు, ఇక్ష్వాకులకు బాదామీ చాళుక్యులకు, రాష్ట్ర కూటులకు,కళ్యాణీ చాళుక్యులకే కాక విజయనగర సార్వభౌములకు, తరువాత సుల్తానులకు కాకతీయులకు లోబడి యుండునట్లు ఇచ్చట

గల శాసనముల వలనను ప్రాచీన విశేషముల వలన తెలియుచున్నది. ఇచ్చట వీరెందరో మహా సంగ్రామములు చేసి యుండిరి. ఆ కారణమువలన దక్షిణ దేశము నేలిన ప్రాచీన రాజవంశీయులు, వారి సామంత మండలేశ్వరులు, దండనాథులు, ప్రెగ్గడలు ఈ ప్రాంతమును పర్యటించి అక్కడక్కడ శాసనము లను వేయించిరి. ఈ క్షేత్రమందిప్పుడు దేవాలయావరణలో భద్రపరచబడుచున్న ఒక శిలాశాసనము ఎంతో ప్రాముఖ్యమునకు వచ్చినది. ఈ శాసనము 1914లో వెలుగులోనికి వచ్చింది.

శక వర్షము 996 ఆనంద సంవత్సరమున పుష్యశుక్ల నవమినాడి శాసనము వేయించినట్లు ఈ శాసనముననుసరించి తెలియుచున్నది. ఈ శాసనము సిద్ధచోళుడు - చోళ సామంతులలో సుప్రసిద్ధుడు వేయించిన శాసనముగా తెలియుచున్నది.

ఈ క్షేత్రమందలి ఆంజనేయస్వామి విగ్రహమందు ఇరువైపులా శంఖు, చక్రములుండుటచే ఇది వ్యాస ప్రతిష్ఠయని ప్రతీతి. శ్రీవ్యాసరాయలువారు శ్రీకృష్ణదేవరాయలకు గురువులు వారి కాలమున ఆంధ్ర, కర్నాటక దేశములో విశేషముగ హనుమ ప్రతిష్ఠ జరిగినవి. దక్షిణదేశము నందు హనుమదాలయములన్నియు విజయనగర కాలముననే ప్రతిష్ఠించబడినవని తెలియుచున్నది. ఇంతకు మునుపటి హనుమదాలయములు కాన వచ్చుట లేదు. ఈ క్షేత్రమందలి హనుమంతుని మూర్తి 16వ శతాబ్దారంభమున ప్రతిష్ఠించబడియుండు నని తెలియుచున్నది.

ఈ క్షేత్ర సంస్థాపకులైన శ్రీ వ్యాసరాయలువారు. కావేరీ తీరమునందలి బన్నూరులో క్రీ॥శ॥ 1457వ సం॥న జన్మించిరి. వీరు సకలశాస్త్రపారంగతులు రాజగురువులు.వీరు తమతపశ్శక్తిచే విజయనగర సామ్రాజ్యమును కాపాడి అపూర్వ గౌరవము నంది. శిష్య సమేతముగ దేశసంచారము చేసి ద్వైత ప్రచారమునందు విరళ కృషి జరుపుటయే కాక ఎన్నో గ్రంథములు రచించిరి. వీరి గ్రంథములలో తర్కతాండవము, న్యాయామృత చంద్రిక సుప్రసిద్ధములైనవి. వీరు వ్యాస కూటములను వెలయించిరి. ప్రతి దినమొక హనుమ ప్రతిష్ఠ చేసిన గాని భుజింపరాదనెడి నిర్ణయమున్నదట! వ్యాసరాయల శిష్యులలో వంగదేశ వైష్ణవ శిఖామణి శ్రీ కృష్ణచైతన్యస్వామి ఎంతో పేరు సంపాదించినవారు. సుప్రసిద్ధులయిన పురుంధర దాసు, కనకదాసు విజయేంద్రస్వామి, వాదిరాజు, వైకుంతదాసులు వారి శిష్యచూడామణులు. ఈ మహా పురుషుడు క్రీ॥శ॥ 1539లో పరమపదించెను.

ఇచ్చటి దేవాలయము సుమారు రెండు వందల యేండ్ల క్రిందట గద్వాల మహారాజుచే నిర్మించబడినదని తెలియుచున్నది. ఆలయమున గర్భాలయము, విశాలమండపములు కలవు. ఆలయము నుండి కృష్ణా నదికి పోవు మార్గమున గల సోపానములు, ఒడ్డున ఉన్న శివాలయము ఆకాలముననే కట్టబడి యుండవచ్చును. ఆలయమునకు దక్షిణాభిముఖముగను శ్రీ ఆంజనేయమూర్తి పూర్వాభిముఖముగను నున్నవి. హనుమ ప్రతిష్ఠలిట్లేయుండుట పరిపాటి.

శ్రీ బీచుపల్లి ఆంజనేయస్వామి ఎంతో మహిమకల స్వామిగ ఈ ప్రాంతమున విశేషముగ చెప్పుకొనెదరు. ఇచ్చట కృష్ణానది దక్షిణ వాహినియై యున్నది. ఇచ్చటనే కణ్వమహర్షి తపస్సు చేసెనందురు. ఇచ్చటికి సమీపమున గల కృష్ణా తీరమున చింతలరేవులో కూడా వ్యాసరాయలవారు హనుమంతుని ప్రతిష్ఠించినారట.

ఇందు స్వామిని ప్రతిష్ఠించిన తరువాత పూజాదికములకై తగిన వారిని ఏర్పాటు చేయవలెనని తలచి వ్యాసరాయలు నిద్రపోయిరి. స్వప్నములో ఆంజనేయస్వామి దర్శనమిచ్చి "రేపు ప్రాతః కాలమున మొదట నన్ను దర్శించుట కెవరు వత్తురో వారినే అర్చకునిగ నియమింపుమని ఆదేశించెనట! మరు

నాడు సమీప గ్రామమునుండి ఒక బోయ పిల్లవాడు పశువులను తోలుకొని ఉదయమునే స్వామిని దర్శింప వచ్చెను. స్వాముల వారాపిల్ల వానిని కులము ఊరు పేరులు అడిగి తెలుసుకొనిరి. వానిపేరు "బీచుపల్లి" హనుమదాదేశానుసారమని ఆబాలునే పూజారిగా నియమించినారట. నాటినుండి నేటివరకు అతని వంశీయులే అర్చకులుగా ఉన్నారట. ఆ పిల్లవాని పేరును బట్టి స్వామి బీచుపల్లిరాయడని ప్రసిద్ధి చెందెను. ఇచ్చట అనువంశికంగా వాల్మీకులే (బోయవారు) అర్చకులే నేటికీ ఉన్నను ఈ ఆలయము గద్వాల సంస్థానము ఆధీనమయినప్పటినుండి వేదోక్త పూజార్చనలకు మాధ్వ బ్రాహ్మణులను అర్చకులుగా నియమించినారు. ఇనాములిచ్చినారు ఈ నాటికి అర్చకులుగా వాల్మీకులు, మాధ్వబ్రాహ్మణులు అర్చకులుగా ఉభయులు పూజాధికములు నిర్వహించుచున్నారు.

ఈ దేవాలయమునకు సమీపమున ఒక కడిమి చెట్టు ఉన్నది. ఈ చెట్టు ఒక పుట్టపై మొలచి పెరిగినది. ఎల్లప్పుడు ఈ చెట్టుకు పూవో, చిగురో, కాయో ఉండియే తీరును. దీని చుట్టూ వేదిక యున్నది. ఇది యొక జీవ సమాధియని (ఎవరి సమాధి అన్నది తెలియుట లేదు) ఈ క్షేత్రమహాత్మ్యమునకు ఇది కీలక స్థానమని చెప్పుచున్నారు. ఇందుకు తార్కాణముగా వైశాఖ శుక్ల పౌర్ణమికి జరుగు స్వామి ఉత్సవ సమయమున దేవుని రథము ఈ పుట్ట వరకు వచ్చుచుండుట కనబడుచున్నది.

ఈ క్షేత్రము ఎందరో భక్తులకు, సిద్ధులకు కాణాచిగ నున్నది. సుదూర ప్రాంతములనుండి భక్తులు ఈ క్షేత్రమును దర్శించి తృప్తులగుచున్నారు. ఆవులు గేదెలు, పాలివ్వని ఆవులు, దూడలు పాలు గుడువక పోయిన బీచుపల్లి రాయుని పేరున ముడుపు కట్టి వెన్న ముద్దలు, నెయ్యి దుత్తలు పంపు కొనుచున్నారు. గాంధర్వ వివాహములకు ఈ బీచుపల్లి రాయుడు యజ్ఞ కర్త. ఈయన కుల పక్ష పాతి కాక భక్తజన పక్షపాతి యనుటకు ప్రబల నిదర్శనము లున్నవి.

సమస్త వైద్యోపచారములకు బాగుపడని దీర్ఘ రోగులు కుష్ఠు, ఉన్మాదము, క్షయ మున్నగు వ్యాధి గ్రస్తులు భూత, ప్రేత, పిశాచ, గ్రహాది పీడిత రోగులు ఇచ్చటికి వచ్చి మండలమో రెండు మండలములో నియమ నిష్ఠలతో నదీ స్నానము చేసి ప్రదక్షణలు చేసి ఆరోగ్యము పొందుచున్నారు. ఇది అపరమంత్రాలయముగా పేరు పొందినది. ఎందరో తపోధనులు ఈ క్షేత్రమున తపోసిద్ధులను బడసి అదృశ్య మహిమలను ప్రదర్శించి, వేణిసోంపురమును జాగీరుగా పొందిరి. ఈ అగ్రహారము ఈ క్షేత్రమునకు చాలా దగ్గరలో నున్నది. ఇపుడీ అగ్రహారం శిధిలావశేషంగా ఉన్నది. గోకర్ణ వాస్తవ్యులు శ్రీ రామబొట్లు, వేణి సొంపురము జనార్థనాచార్యుల వారు ఇచ్చట శిద్ధి పొందిన భక్త శిఖామణులు.

వైశాఖ శుద్ధ పౌర్ణమికి స్వామి ఉత్సవము జరుగును. ఇదియే ప్రధానమైన ఉత్సవము మార్గ శిర మాసమున వచ్చు హనుమజ్జయంతి వైశాఖమాసమున వచ్చు నృశింహ జయంతి ఇచ్చటి ప్రత్యేక కార్యక్రమములు నిత్య పూజలు, ప్రత్యేక పూజలు విధి విధానముగా ఇచ్చట జరిపించుచున్నారు.

ఇచ్చటి స్వామి వారి రూపము భక్తాదులకు పరదు ప్రీతి దాయకముగ , వర ప్రసాదముగ నున్నది. ఎంతో దర్శనీయమైన క్షేత్రమిది.

## మన్యం కొండ : శ్రీ వేంకటేశ్వర స్వామి

మన్యం కొండ శ్రీ వేంకటేశ్వర స్వామి వారి క్షేత్రము. మహబూబ్ నగర్‌కు సుమారు 20 కి॥మీ॥ దూరమున దక్షిణాన కలదు. దేవస్థానము వారి బస్సు సౌకర్యము కూడ నున్నది.

సుమారు వంద సంవత్సరముల క్రిందట ఈ క్షేత్రము ప్రసిద్ధి లోనికి వచ్చినది. శ్రీ హనుమద్దాసుల వారు ఇచ్చట సుమారు నూట యాబది సం॥ల

క్రిందట ఇచ్చట తపస్సు చేసి సిద్ధిని పొందిన మహా నీయులు తరువాత శ్రీ అలహరి అనంతయ్య, శ్రీ అలహరి రామయ్యగార్ల కృషి ఫలితముగ, ఈ క్షేత్ర మెంతో అభివృద్ధిని సాధించినది. శ్రీ అలహరి నారా యణ స్వామి వారు వంశ పారంపర్య ధర్మకర్తలుగా నున్నారు.

ఇచ్చట ప్రకృతి రమణీయకత కడు మనోజ్ఞమై ఆహ్లాదకరముగ నున్నది. చుట్టును కొండలనడుమ ఈ క్షేత్రమున్నది. భక్తులకు యాత్రికులకు మరియు పర్యాటకులకు అనువుగ ఇచ్చటి సహజ సిద్ధ ప్రకృతి పరిసరములను తీర్చిదిద్ది గొప్ప వైష్ణవ క్షేత్రముగ ఇంకను అభివృద్ధి చేయవచ్చును.

ఇచ్చట పూజలు, సేవాదులు పాంచరాత్ర ఆగమ విధానమున జరుపబడుచున్నవి. శ్రావణ మాసమున చైత్రమాసమున, ఆషాఢ ఏకాదశికి ఇచ్చట విశేష పూజలు జరుగుచున్నవి.

ఇచ్చట పూజారులు ఎంతో శ్రద్ధతో పూజాది కములు జరుపుచుండుట గమనించవచ్చును. నిత్యము వేద పారాయణ, స్తోత్ర రత్నావళి, స్త్రీ సూక్తము, పురుష సూక్తము ఇచ్చట పఠించబడుచు ఈక్షేత్రమను పునీతము చేయబడుచున్నది. ఈ దేవాలయమునకు భూవసతి కూడ యున్నది.

ఈ క్షేత్రమున మాఘ శుద్ధ పౌర్ణమినాడు జరుగు రథోత్సవము ప్రత్యేకతను కలిగియున్నది. ఇచ్చట గల అలివేలు మంగమ్మ దేవాలయమెంతో దర్శనీయముగ నున్నది. వేద పాఠశాలకూడా ఇచ్చట నడుపబడుచున్నట్లు తెలియుచున్నది.

వసతి గృహ సముదాయమిచ్చట నిర్మించబడు చున్నది. కళ్యాణ మండపము దేవాలయమునకు దగ్గరలోనే కలదు.

ప్రకృతి రమణీయకతతో ఆహ్లాదకర వాతావరణ ములోనున్న ఈ క్షేత్రమెంతో దర్శనీయముగా నున్నది.



# ఖమ్మం జిల్లా

## శ్రీ భద్రాచల క్షేత్రము

ఖమ్మం వరంగల్లు జిల్లాలో కలసి ఉండేది. 1953లో ఖమ్మం ప్రత్యేక జిల్లాగా చేయబడ్డది.

మహాయాన (బౌద్ధమత) సంప్రదాయాన్నను సరించి చెక్కబడిన త్రవ్వకాలున్న విచట.

భద్రాచలం గోదావరి గట్టున ఖమ్మంకి సుమారు 70 కి॥మీ॥ దూరంలో ఉన్నది.

ఆంధ్రదేశమున ఈ క్షేత్రరాజము తెలియని వారుండరు.

భద్రాచలము పరమ పవిత్రమైన క్షేత్రము మానవకోటి నుద్ధరించు మహత్తర పుణ్య క్షేత్రము. పరమపావని, అఖండ గోదావరీ తీరమున దండక వనములో వెలసియున్న పుణ్య క్షేత్రమిది. లోకోద్ధ రణకై పితృ వాక్య పరిపాలన, ఏక పత్నీవ్రతము తెలియజెప్పి, వానర సహాయమున, దుష్ట శిక్షణను శిష్టరక్షణను సాధించిన శ్రీరామచంద్రుని దివ్యక్షేత్ర మిది. ఎందరో, సుప్రసిద్ధ రామభక్తులు, భక్తి ప్రపత్తులతో అలరారే భువిని విలచిన, అపూర్వ దైవక్షేత్రము.

కీర్తివంతుడైన పర్వత శ్రేష్ఠుడైన మేరువు సిరి సంపదలతో విరాజిల్లుచున్నను, తనయుడు లేని కార ణముతో తపించుచు తపస్సానరించుటకు నిర్ణయించు కొని, సతీ సమేతుడై అడవులకేగి బ్రహ్మ దేవుని గూర్చి ఘోర తపస్సానరించెను. కొలదికాలమునకు ఒకానొక శుభ దినాన వారికి కుమారుడు కలిగెను. వానికి భద్రుడని నామకరణము చేసిరి.

వానిని బ్రహ్మ మానసపుత్రుడైన వశిష్ఠ మహర్షికి అప్పగించిరి. వినయము, వివేకము, అపార గ్రహణ శక్తి కల భద్రుడు అనతి కాలములో సమస్త శాస్త్రములను అధ్యయనము చేసెను. అన్ని విద్యలయందును ఆరి తేరుటయే కాక, భగవంతుని యందపరిమిత భక్తి కలవాడై నిరంతరము రామ కథా శ్రవణానంద సంతు ష్టుడై, గురుకులమునకే వన్నె తెచ్చినవాడాయెను.

విద్యాభ్యాసమును ముగించుకుని వశిష్ఠుని యాజ్ఞను గ్రహించి గృహమునకు వచ్చి, భద్రుడు తల్లి దండ్రులతో నుండగా, ఒక సమయమున త్రిలోక సంచారి, బ్రహ్మ మానస పుత్రుడు, పరమ భక్త శిఖామణి యగు నారద మహర్షి వచ్చినపుడు మేరువు

తన పుత్రుడైన భద్రుని చూపించెను. అపుడు నారదుడు భద్రుడు సామాన్యుడు కాడని, భాగవతోత్త ముడని, శ్రీరామభక్తుడని తన వంశముద్ధరింపబడు టయే గాక, మానవులందరికి గొప్ప మేలు చేయునని తెలిపెను. భద్రునకు రామభక్తి విశిష్టతను, ఔచిత్య మును ప్రబోధించెను. నిరంతర భక్తి తత్పరతతో తరించుమని ఆశీర్వదించెను. భద్రుడు నారదుని తరుణోపాయము తెలుపుమని ప్రార్థించెను. రామ తారక మంత్రమునుపదేశించి కృతార్థుని చేయుమని వేడుకొనెను.

నారదుడు భద్రుని పూర్వ జన్మ వృత్తాంతము వినిపించెను.

## భద్రుని పూర్వ జన్మ వృత్తాంతము

శ్రీహరి త్రేతా యుగమున దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేయుటకు శ్రీరామునిగా భూతలమునంద వతరించెను. పితృవాక్య పరిపాలనా దురంధరుడైన శ్రీరాముడు అరణ్యవాసమునకు జనెను. వెంట శ్రీ మహాలక్ష్మియైన సీతా మహాసాధ్వి, భాతృ భక్తి తత్పరు డైన లక్ష్మణుడు బయలుదేరిరి. వారు నారగుడ్డలు ధరించి, కందమూలాలు తింటూ అరణ్యాల వెంబడి తిరుగుతూ దండకారణ్యమునకు వచ్చిరి. భద్రుడు పాషాణమై దండకారణ్యమునందొక చోట పడి యుండెను.

శ్రీరాముడు సతీ సోదరసమేతుడై దండకారణ్య మున తిరుగుచూ పంచవటీ ప్రాంతము నందొక పర్ణశాలను నిర్మించుకొని యుండెను, అగస్త్యుని ఆదే శానుసారము, పావన గౌతమీనదీ ప్రవాహ తీరమున శ్రీరామచంద్రుడు, సీతాసమేతముగా సుఖుడై వర్ధిల్లుచు, పంచవటికి పవిత్రత చేకూర్చెను. శ్రీరామ చంద్రుడు అడవిలో తిరుగుచున్న సమయమున అక్కడగల రాతిబండపై కూర్చుని విశ్రాంతి తీసు కుంటుండేవాడు. ఆ శిల భద్రుడే. ఆ శిలపై శ్రీరాముడు అలసట తీర్చుకుని మహదానందపడు చుండెను. అపుడు సీతాదేవి యీ రాతిపై నిత్యము కూర్చుని విశ్రాంతి నొంది, మరి యీ రాతి కేమి వరమిత్తురని యడిగెను. శ్రీ రాముడందులకు నా భక్తుడే యీనాడు నాకీరీతిగా సేవలందించి ఫలితముగా ఉత్తమ జన్మ పొందనున్నాడని నన్ను సేవించి నాకు నిలయమై వెలయనున్నాడని చెప్పెను.

నారదుడీ విధముగ చెప్పి, శ్రీరామ మంత్రము పదేశించెదను, తల్లిదండ్రుల అనుజ్ఞ పొందిరమ్మని పంపెను.

తల్లిదండ్రుల ఆమోదముతో భద్రుడు రాగా నారదుడు శ్రీరామ మంత్రమునుపదేశించెను. గౌతమీ తీరమున తపమొనరించుమని, గంగానది వలే గోదా వరియు పరమ పవిత్రమైనదని, ఇది దేవతీర్థమని చెప్పి గౌతముని గోహత్యా పాతకమును రూపుమాపిన పుణ్యనదియని చెప్పెను. ఇచట తపస్సు చేసిన ఫలితము కలుగునని నుడివెను.

నారదోపదేశితుడైన భద్రుడు,గౌతమీతీరములో అనువైన స్థలమున నిష్ఠాగరిష్ఠుడై నిరంతర రామనామ స్మరణతో ఏకాగ్ర చిత్తముతో తపస్సుచేసెను. కొంత కాలమునకు శ్రీరామచంద్రుని యనుగ్రహము కలిగినది. సీతా సమేతముగ శ్రీరామచంద్రుడు భద్రునకు సాక్షాత్కరించెను.

భద్రుని కోర్కె తీర్చెదనని, సూర్య చంద్రాదు లున్నంతవరకు నీవు మాకు నెలవై మమ్ములను శిరమున దాల్చి, అశేష భక్త కోటికి ఆకర్షణీయుడవై మమ్ములను సేవించువారల నుద్ధరింపచేసే క్షేత్రమై విరాజిల్లుదువని వరములిచ్చెను.

త్రేతాయుగమున శ్రీరామచంద్రుని విశ్రాంతి పీఠమై ఆయన ప్రేమానురాగాభిమానములను పొంది మరు జన్మమున మేరువునకు, పుత్రుడై జన్మించి వశిష్టుని వద్ద సమస్త శాస్త్రముల నభ్యసించి, నారదుని వలన రామనామతారక మంత్రముపదేశింపబడిన వాడై, తపస్సొనరించి శ్రీరాముని సాక్షాత్కారమును,వరమును పొందిన భద్రుడు ద్వాపరయుగ సమాప్తి వరకు బ్రహ్మానందము ననుభవించుచు, కలియుగారంభమున గోదావరీనదీ తీరమున పాపికొండల కావల తానొక కొండపై వెలసెను. ఆ కొండ భద్రగిరి అను పేరును కలిగినదై అదియే భద్రాచలమని ఆ నగరము నాను -కొనిన గ్రామమును సైతము భద్రాచలమని పిలచుటచే, జనులయందు వ్యాప్తికి వచ్చినది.

శ్రీరాముని మనసారా సేవించువారెంతటి పాపులైనను వారికి ముక్తి కలుగును. అందుకు ప్రధాన మైన కారణమేమన, శ్రీమన్నారాయణుడు, తాను శ్రీరాముడై వనవాస సమయమున తిరిగిన ప్రదే శములందు మిక్కలి ప్రీతి కలిగినవాడై, భద్రునకు ఇచ్చిన వరమును సకల జనోపయోగ మొనర్ప గోరినట్టివాడై, ముల్లోకములందలి సుప్రసిద్ధ పుణ్య తీర్థములు ఈ ప్రాంతముల యందు సన్నిహితములై యుండునట్లొనర్చెను.

ఈ ప్రాంతముననే, శేషతీర్థము శబరినది ఉండుట వలన శబరి సందర్శనము, ఈ నదీ తోయముల యందు, స్నాన సంధ్యాదులు, అక్కడ వెలసిన స్వామి ఆరాధన భక్తులకు ఈప్సితముల నొసగుచున్నవి. ఇంతే కాక పంచవటి వద్ద పర్ణశాల అచ్చటికి సమీపములోని కొలను, దీనినే సీతవాగు అని కూడ అంటారు, రామాయణమునందు పేర్కొన బడిన పద్మసరస్సన బడినదీకొలనే ఈ ప్రదేశము లన్నిటినీ ఈనాడు భక్తులు దర్శించి తమ కష్టములను తొలగించుకొనుచున్నారు.

పూర్వము భద్రాచలమునకు సమీపమున తమ్మలదమ్మక్క యనునామె ఉండెడిది. ఈమె త్రికరణశుద్ధిగా శ్రీరామచంద్రుని సేవించుచున్న భక్తురాలు. మహాసాధ్వి, శ్రీరామచంద్రుడామెకు కల యందు సాక్షాత్కరించి తాను భద్రగిరి యందున్నా నని, ఎండ వానలకు తడియుచున్నానని, నైవేద్య నీరాజనము లేకుండా పడియున్నానని, గ్రామస్తులకు నా ఉనికి నెరిగించి నిత్య పూజలు జరిపించుచు నన్ను సేవించు కొనుచుండమని, కొలది కాలములో నా భక్తు డొకడు నీకండగా నిలచి ఇచట గోపుర ప్రాకారములు కట్టించి నామూర్తి కెనలేని కీర్తి నార్జించునని చెప్పి ఆమెను మేల్కొలిపెను.

దమ్మక్క ఆ వార్తను గ్రామస్తులకు కొందరికి చెప్పి వారిని తీసికొని భద్రాచలమునకు వెళ్ళి కొండ శిఖరమున గల చెట్లలో వెదకగా సీతా రామలక్ష్మణుల విగ్రహాలు కనిపించాయి. దమ్మక్క భక్తి విశేషాలకు వాళ్ళందరకూ ఎంతో ఆనందము, ఆమెపై గౌరవము కలిగాయి. దమ్మక్క, విగ్రహాలకు గ్రామస్తుల సహకార ముతో నిత్యము పూజలు, నైవేద్యములు, చేస్తూ యెంతో భక్తి, ఆ స్వామి యందు శ్రద్ధ వహిస్తూ జీవిస్తుండేది. సీతారాములకొక చిన్న మండపాన్ని కట్టించింది. నిత్యము గ్రామస్తుల సహాయంతో రామ భజనలు చేస్తుండేది. క్రమక్రమంగా శ్రీసీతారాములు వెలసిన వార్త, దమ్మక్క భక్తి ప్రచారము పొంది భక్తుల రాక పోకలు పూజలు, దీపారాధనలు, నిత్య నైవేద్యాలు జరుగుతుండేవి.

ఒకనాడు, దమ్మక్క, తప్పనిసరియై గ్రామాంత రము వెళ్తూ తన కుమార్తెకు శ్రీ రామపూజా కార్యక్రమము అప్పజెప్పి వెళ్ళింది. తన తల్లి పూజిస్తున్న శ్రీ రాముణ్ణి పూజించే అవకాశము తనకు కలిగిందన్న, ఆనందంతో ఆమె ఏలోపం రాకుండా

పూజచేసి ప్రసాదం శ్రీరాముని కర్పించింది. తల్లి నైవేద్యము దేవునికి పెట్టమన్నది. స్వామి తినలేదని, తన తల్లికి తెలిస్తే తనను దండిస్తుందని ఎంత సేపటికీ శ్రీరాముడు వచ్చి ప్రసాదముగా ఉంచిన పాయసము తినలేదని తన తల పగలకొట్టుకుంటానని తలను రాతికి బాదుకొనసాగినది. ఆ బిడ్డ అమాయకపు భక్తి పూజావిధానమునకు సంతసించి, ఆమెకు గల భయాన్ని పోగొట్టడానికి శ్రీరాముడు వచ్చి ఆపాయసాన్నంతా ఆరగించి వెళ్ళిపోయాడు. ఆ బిడ్డ ఎంతగానో ఆనందించి యింటికి వెళ్ళిపోయింది.

ఊరు వెళ్ళిన దమ్మక్క తిరిగి వచ్చి స్వామి ప్రసాదం అంతా తిన్నాడని తెలిసికొని భగవత్ సాక్షాత్కారము పొందిన కూతురి అదృష్టానికి ఉప్పొంగిపోయింది. తన దురదృష్టానికి విచారించింది.

ఆనాటి రాత్రి శ్రీరామచంద్రుడు ఆమెకు కలలో సాక్షాత్కరించి తల్లి బిడ్డ యిద్దరు తనకు సమానులని చెప్పి, త్వరలో గొప్ప రామభక్తుడిక్కడకు వస్తున్నాడని ఈ ఆలయ ప్రసిద్ధి పెరుగుతుందని, ఆమె జీవితానికే లోటురాకుండా అనుగ్రహిస్తున్నానని చెప్పినందువలన ఆ భక్తుని రాకకై దమ్మక్క ఎదురుచూడ సాగినది.

నేలకొండపల్లి అనే గ్రామములో కంచర్ల లింగన్న, కామమ్మ లిరువురు భగవద్భక్తులు ఆదర్శ కుటుంబీకులుగా మంచి పేరు సంపాదించుకున్నారు. వారికి చాలా కాలం వరకు సంతానం కలుగలేదు. కొంత కాలానికి భగవదనుగ్రహం వల్ల కుమారుడు కలిగెను. గోపన్న అని నామకరణం చేసారు. ఆ బాలునికి తల్లి తండ్రుల కారణంగా చిన్నతనం నుంచి భగవద్భక్తి అబ్బింది. ఆట పాటలయందు కూడా రామ కీర్తనలు పాడుతూ, రామకథలు చెబుతూ నిరంతరము రామునినే ధ్యాసగా కలిగి ఉంటుండేవాడు. క్రమంగా పెరిగి పెద్దవాడవుతున్న గోపన్నలో రామభక్తి కూడ పెరగసాగింది. రాను రాను గ్రామస్తులలో రామదాసు అను కీర్తి సంపాదించుకున్నాడు. మరి కొంత కాలం గడిచే సరికి, గోపన్న అనెడి పేరుకు మారుగా రామదాసు అనెడి పేరే అతనికి స్థిరపడింది. కుమారునికి యుక్తవయసు రాగానే రామదాసుకు కమల అనెడి కన్యనిచ్చి వివాహం చేసారు. ఆమె మిక్కిలి వినయ విధేయతలు కలిగినదై శ్రీరామపూజాభజనాదుల యందు అమిత శ్రద్ధా భక్తులు కలిగి ఉండెడిది. కాల క్రమమున గోపన్నకు కుటుంబ బాధ్యతలు వహించవలసి వచ్చింది. ఇంటి వ్యవహారములు చక్కబెట్టుకుంటూ శ్రీరామ పూజలు చేస్తూ జీవితాన్ని గడుపుకుంటుండే వాడు. వారికొక కుమారుడు కలిగెను. కొన్నాళ్ళకు ఆ ప్రాంతములో తీవ్రమయిన కరువు సంభవించినది. గోపన్న తన కున్నదానిని యే మాత్రం దాచుకొనకుండా అన్నార్తుల కొరకై ఉపయోగించేవాడు. నిత్యమూ అన్న దానముచేస్తూ ఉండే వాడు. క్షామ పరిస్థితులు మెరుగయ్యాయి కొన్నాళ్ళకు. కాని గోపన్న పరిస్థితులు తారుమారయ్యాయి.

తాను సంపాదించక, పూర్వార్జితం కరువు కాట కాల సంతర్పణలకు ఖర్చుకాగా గోపన్న కుటుంబానికి దినసరి జీవితము గడవడమే కష్టమయ్యేడిది.

గోల్కొండ నవాబు తానీషా వద్ద మంత్రులుగా ఉన్న అక్కన్న మాదన్న సోదరులు గోపన్నకు మేనమామలు. వారు తమ మేనల్లుని దుస్థితి గమనించి అతనికేదో విధంగా సాయం చేయాలనే సంకల్పంతో సమయం కోసమై నిరీక్షించసాగారు.

ఒకనాడు గోపన్న ఉన్న గ్రామానికి కబీరు వచ్చి రామ సంకీర్తనము చేస్తున్నపుడు రామదాసు చూచి, వారిని తన ఇంటికి ఆహ్వానించెను. కబీరు వలన శ్రీ రామచంద్రుని విశేషములను ఎన్నింటినో విన్నాడు.

తనకు తారకమంత్రముపదేశించమని వేడుకున్నాడు గోపన్న.

కబీరు గోపన్నకు శ్రీరామమంత్రమును పఠించుచుండుమని ఉపదేశించాడు. శ్రీరామనామ ప్రభావాన్ని చెప్పి రామదాసును పరవశింపజేసాడు.

ఒక కుటుంబ కార్య క్రమమునకు వచ్చిన, తమ అల్లుని యోగక్షేమాలు విచారించిన అక్కన్న మాదన్నలు గోపన్నను తమ వెంట తానీషా దర్శనానికి తీసుకొని వెళ్ళేరు. ఏదైనా నౌకరి యిచ్చి తన అల్లునికి భృతిని కలిగించమని కోరుకున్నారు.

అప్పుడు రామదాసుకు భద్రాచల పరగణా తహశీల్దారు పదవి ఖాళీగా ఉన్నందున అక్కడ తహ శీల్దారుగా నియమింపజేసారు. రామదాసు ఆ పదవి స్వీకరించి భద్రాచలము చేరుకుని, భద్రగిరిపై శ్రీరాముని దర్శనముచేసికొని తన ఉద్యోగాన్ని జాగ్రత్తగా నిర్వర్తించుకొనుచుండెను.

రామదాసు రాకను విన్న దమ్మక్క ఆయన శ్రీ రామ భక్తుడని తెలిసుకొని కలలో శ్రీరామచంద్ర మూర్తి తనకు చెప్పిన శ్రీ రామభక్తుడాయనే అయి ఉంటాడని గుర్తెరెగి, ఆయనను చూడడానికి వెళ్ళింది. రామదాసు ఆమె గురించి విని ఉన్నందున ఆమెను ఆదరించి ఆమె వలన శ్రీరాముని పరిస్థితులన్నీ వినెను. అతి త్వరలో శ్రీసీతారామ కళ్యాణము వస్తున్నదని, దానిని వైభవంగా జరపడానికి సహకరించ వలసినదని దమ్మక్క గోపన్ననడిగెను. తానందుకు కృషి చేస్తానని ఆమెకు వాగ్దానంచేసాడు.

గ్రామంలోని వారిని పిలచి కళ్యాణోత్సవానికి వారందరూ సహకారాన్ని అందించవలసినదని, అన్న సంతర్పణములు, భజనలు ఘనంగా చేద్దామని వారందరితో రామదాసు చెప్పెను. ప్రజలంతా ఎంతో ఉత్సాహంతో ముందుకు వచ్చేరు. మునుపెన్నడు జరగనంత బ్రహ్మాండంగా స్వామి వారి కళ్యాణము కన్నుల పండుగగా జరిగింది.

శ్రీరామచంద్రుడు సామాన్య మండపంలో ఉండడం రామదాసుకు చాలా బాధ కలిగించింది. ఎలాగయినా స్వామి వారికి ఆలయం కట్టించాలని నిర్ణయించుకున్నాడు. ఊళ్ళోగల పెద్దలందరికి తన అభిప్రాయాన్ని తెలియజేసాడు. వారందరు తమ తమ విరాళాలను వాగ్దానం చేసారు. తమ వంతు సహకారాన్ని, యీ పవిత్ర కార్యానికి మనసా, వాచా, అందజెయ్యడానికి వాగ్దానం చేసారు. ఒకానొక శుభ ముహూర్తాన రామదాసు శ్రీరామ మందిర (ఆలయ) నిర్మాణానికి శంఖుస్థాపన చేసాడు. ఆలయం సముదాయం అత్యంత రమణీయంగా కన్నుల వైకుంఠంలా తయారగుటకు ప్రణాళిక సిద్ధమయినది.

ఈ విధంగా శ్రీరామసేవా తత్పరుడై, భద్రా చలేంద్రుని రమణీయాలయ నిర్మాతయై భక్తుల హృదయాలలో నిలచి, విధినిర్వహణలో ఋజు వర్తనుడు, బాధ్యుడుగా ప్రజలమన్ననలను, సాను భూతిని, అందుకుంటూ, అధికార అనధికారులలోను తానీషా వారి ప్రాపకంలోను అక్కన్న మాదన్నల అభిమానంలోను మరింతగా సుస్థిరుడై, సమస్తమైన వారిచేత ఓహో! అనిపించుకుంటున్నాడు రామదాసు.

రామదాసు ఒకానొక ఏకాదశీ పర్వదినాన సమారాధన చేసాడు. ఆనాడు ఎందరో భక్తులు రామదాసు చేస్తున్న అన్నదానంలో పాల్గొని సంతు ష్టులు అయ్యారు. భోజన సమయంలో రామదాసు కుమారుడు ఆడుకుంటూ వచ్చి గంజిగుంట్లో పడి చనిపోయాడు. తల్లి కమల చూచి ఈ సమయంలో ఈ వార్త భర్తకు చెప్పి సమారాధనకు అంతరాయం కలిగించలేక తీవ్ర దుఃఖాన్ని దిగమ్రింగి, భర్తకు సమా

రాధనలో తోడ్పడుతూ, ఆఖరున ఈ దుర్వార్త వినిపించింది. ఆహా! వీరు కారణ జన్ములు కాక మరేమిటి! ఎంతటి ఆత్మ స్థైర్యం ఈ దంపతులది!

కుమారుని మరణ వార్త విన్న అక్కడి వారంతా శోక సముద్రమున మునిగిపోయేరు. రామదాసు భార్యను ఊరడించి శ్రీరాముని లీలలు ఎపుడెట్లుం డునో తెలియజాలని పామరులమని, ఆయన దయ మనకుండగా ఇట్లు దుఖిఃచుట తగదని భార్యను హెచ్చరించెను. గంజిగుంటలో పడివున్న బాలుని మృతదేహాన్ని తీసికొని భద్రగిరిపైన శ్రీరాముని సన్నిధికి వచ్చి ఆయన పాదముల వద్ద ఆ కళేబరాన్నుంచి అనేక విధముల ప్రార్థించసాగేడు రామదాసు. పరిపరి విధాల వేడుకొని శ్రీరామ సంకీర్తనం చేశాడు.

నిద్ర నుండి లేచినట్లు సజీవుడై లేచి తండ్రితో కలసి ఆ బాలుడు శ్రీరామ సంకీర్తనం చేశాడు. అపుడక్కడివారికి ప్రత్యక్షంగా కనపడిన శ్రీరామమహిమ అనంతమైన ఆనందాన్ని కలిగించింది ఆనాటినుంచి రామదాసు పట్ల ప్రజలకున్న గౌరవం మిన్ను ముట్టింది. భద్రగిరివాసుని ప్రతిభ వాడ వాడలా విస్తరించింది. విశ్వ వ్యాప్తమై మానవ హృదయాలలో పదిలమయ్యింది.

ఎంతో మహిమ కలిగిన భద్రగిరి నిలయాన్ని ప్రత్యక్ష వైకుంఠంగా రూపొందించాలన్న ఆసక్తి పెరిగింది. రామదాసు అభ్యర్థన మేరకు అందరూ ముందుకొచ్చారు.

శంకుస్థాపన చేసిన ఆలయ నిర్మాణ పనులు చురుకుగా సాగాయి. వందలాది మంది పనివారిచే గోపుర, ప్రాకార, మండపాదులు నిర్మాణం, ధ్వజ స్థంభం మొదలుగాగల సమస్తవనరుల నిర్మాణాలు, ఆలయానికి తయారయ్యాయి. ఆలయంలో మూర్తులకు తగిన ఆభరణాలు లేకపోవడం భరించలేక పోయాడు రామదాసు. సమస్తాభరణాలు చేయించేడు. శ్రీరామునకు కలికి తురాయి, సీతమ్మకు చింతాకు పతకము, లక్ష్మణునకు ముత్యాలపతకము, భరతునకు పచ్చలపతకము, శతృఘ్నునకు మొహరీల మొలత్రాడు చేయించాడు. భక్తుల విరాళములు చాలకపోతే ముందు వెనుక ఆలోచించకుండా, సంకోచించకుండా తహశీలు ఆదాయాన్నంతా విచ్చించి వేశాడు. ఆరులక్షలు ఖర్చు చేశాడు. ఆలయమెంతో రమణీయంగాను, మూర్తు లెంతో శోభాయమానంగాను, తయారై భక్తులకు సంతోష పారవశ్యం కలిగించాయి.

ఈ వార్త క్రమక్రమంగా గోల్కొండ తానీషా వారికి తెలిసింది. ఖజానాకు రామదాసునుండి, భద్రా చలం తహసీలు సొమ్ము ఏ మాత్రం జమ రావడం లేదన్నది తెలిసిపోయింది. అక్కన్న, మాదన్నలతో తానీషా యీ విషయం చర్చించాడు. వారిచ్చిన సూచనల మేరకు తానీషావారికి రొక్కం చెల్లించ వలసినదని రామదాసుకు తాఖీదు పంపించారు.

అపుడు రామదాసు దగ్గర చిల్లిగవ్వలేదు. వాగ్దానాలు చేసిన భక్తులు కొందరు విరాళాలు అందించ లేదు. ఏ విధంగా ప్రత్నించినా ఆ రొక్కాన్ని తాను జమకట్టలేడు. శ్రీరామచంద్రులమీద తాను వెచ్చించిన ఆరు లక్షల రూపాయలు చెల్లగట్టగల దారిలేక శ్రీరాముని చిత్తమని మిన్నకున్నాడు రామదాసు. తన ఆజ్ఞను లవలేశమైన లక్ష్యం చేయక అంత రొఖ్ఖానికి ఏమాత్రం సంజాయిషీ చెప్పకుండా ఊరుకున్న రామదాసుపై తానీషాకు తీవ్రమైన కోపం వచ్చింది. వెంటనే భటులను పిలిపించి "రామదాసు వద్దకు వెళ్ళి ఖజానాకు కట్టవలసిన సొమ్ము యావత్తును వసూలు చేసుకురండి అలా వసూలు ఇవ్వని పక్షంలో అతనిని

బంధించి మా వద్దకు తీసుకుని రండి" అని ఆజ్ఞాపించి వాళ్ళను భద్రాచలం పంపించాడు.

రామదాసు పైకం చెల్లించలేకపోయాడు. భటులు తానీషా యాజ్ఞననుసరించి, రామదాసుని బంధించి గోల్కొండ తీసుకొని పోయారు. తానీషా రామదాసును కారాగృహంలో పెట్టించి డబ్బు చెల్లించే వరకు కఠినంగా దండించమని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రకారం భటులు కంచర్లగోపన్నను చిత్రహింసలు పెట్టసాగారు. ఆ భక్తుడా భాదలను ఓర్చుకోలేకపోయాడు. శ్రీరామచంద్రుని యెంత గానో వేడుకున్నాడు. ఎంతగానో కృంగిపోయాడు. కోపమైనా, వేదనైనా శ్రీరామచంద్రునితో మొర పెట్టుకున్నాడు. ప్రార్థించి, ప్రార్థించి విసిగిపోయి ఉక్రోషం తెచ్చుకుని "ఎవడబ్బ సొమ్మని కులుకు తున్నావు శ్రీరామా" అని దెప్పిపొడిచి "నీకు చేత కాకపోతే సీతమ్మకైనా చెప్పవయ్యా కాపాడమని" అని నిష్ఠూరంగా, దీనంగా మొరపెట్టుకున్నాడు.

తన భక్తుడి దీనావస్తను చూచి, శ్రీరామ చంద్రునకు దయకలిగినది. ఒకనాడు అర్థరాత్రి సొదరుడు లక్ష్మణునితో పాటు తానీషా వద్దకు వచ్చి "ఎవరు మీరని" అడిగితే రామదాసు భటులం "రామోజీ, లక్ష్మోజీ"లం అన్నారు. ఎందుకొచ్చారని అడుగగా "రామదాసుగారి అరులక్షలు బాకీ చెల్లించి రశీదు పొందడానికి వచ్చాము" అని చెప్పి పైకము చెల్లించి, రశీదు పుచ్చుకొన్నారు. "మా యజమానిని విడుదల చెయ్యండి" అని చెప్పి అదృశ్యులయ్యారు.

వెంటనే అక్కన్న మాదన్నలను పిలిపించి వారితో కారాగారానికి వెళ్ళి రామదాసును చెరనుండి విడిపించాడు. తన ప్రవర్తనకు మన్నించమని వేడు కొన్నాడు. రామదాసుభక్తి యొక్క గొప్పతనాన్ని ప్రశంసించాడు. యుక్తాయుక్తములు విచారించక, కఠినంగా దండించినందుకు కారాగారంలో బంధించి నందుకు మన్నించవలసిందని ప్రార్థించాడు.

ఎంతగానో గౌరవించి పూజించి శ్రీరాముని కైంకర్యార్థము విశేషంగా ధనాన్ని, చీని చీనాంబరాలను నగలను ఇచ్చేడు. తానూ ఉపదేశం పొందాడు. ప్రతి యేటా పరంపరగా దేవస్థానానికి, స్వామివారి పూజకు కళ్యాణానికి, ఆభరణాలు ఏర్పాటు చేసాడు.

సగౌరవముగా సకల మర్యాదలతో రామదాసు ను భద్రాచలం సాగనంపాడు. రామదాసు సతీ సుతులతో భద్రగిరివాసుని సేవించుయుంటూ జీవ యాత్రను కొనసాగిస్తున్నాడు.

రామదాసుకు శ్రీతారక మంత్రోపదేశము చేసిన మహాభక్తుడు కబీరు. రామదాసును గూర్చి విశేషాలు తెలిసికొని శ్రీరామచంద్రుడే అతని భృత్యుడని చెప్పుకునేటంతటి ఆ పరమ భాగవతోత్త ముని చూడాలన్న సంకల్పంతో భద్రగిరి చేరు కున్నాడు.

పావన గౌతమీ నదిలో స్నానం చేసి శ్రీరాముని దర్శనం చేసుకునేందుకు దేవాలయానికి వెళ్ళేడు. పూజారులు కబీరును ఆలయంలోకి అనుమతించ లేదు. కబీరు అణుమాత్రమైనా కోపగించక, గౌతమీ నదీతీరానికి పోయి అక్కడనుండే స్వామివారికి నమస్కరించుకొని సంకీర్తనం చేసుకొంటున్నాడు.

ఆ సమయంలో ఆలయంలోని విగ్రహాలు మాయమయ్యాయి. పూజారులు కంగారు పడ్డారు. ఏమీ చేయడానికి తోచక రామదాసు వద్దకు వెళ్ళి గుళ్ళో దేముడు కనిపించడం లేదని మొరపెట్టు కున్నారు. పరిస్థితి విచారించి, తన గురుదేవుడయిన కబీరును దర్శనానికి రానివ్వకుండా అడ్డగించినట్లు తెలుసుకొన్నాడు.

తాను శ్రీరామచంద్రుని అనంతమైన దివ్యాభిమానాన్ని పొందడానికి తగిన భక్తిని, రామమంత్రాన్ని ఉపదేశించిన మహానుభావుడు ఆ కబీరేనని రామ నామ జప ప్రభావమెరిగిన ఆ మహా యోగిని అవమానించినందుకు స్వామి అదృశ్యుడయ్యాడని బాధపడ్డాడు రామదాసు. అందరితో కలసి, కబీరును వెదకి, చూచి క్షమించమని ప్రార్థించాడు. వాళ్ళంతా ఆ కబీరుతో విగ్రహాలు ఆలయంలో కనబడంలేదని మనవి చేసుకున్నారు. అందరివాడే దేవుడనే నిర్మల భావంతో వెళ్ళి దేవాలయంలో చూడండి అని చెప్పి వారిని పంపించాడు కబీరు. వారంతాతిరిగి వెళ్ళి చూడగా విగ్రహాలు ఎప్పటిలా తిరిగి యదాస్థానాల్లో కనిపించాయి. కబీరు, రామదాసు గత జన్మలో రామచిలుకను పెంచి దానిని బంధించినందువలన ఈ జన్మలో కారాగార శిక్ష అనుభవించాడని, సమారాధనలో శ్రీరామ కైంకర్యానికి నివేదించిన ప్రసాదాన్ని శ్రీరామచంద్రుడే స్వయంగా వచ్చి ఆరగిస్తే బాగుండునని మనసా, వాచా ఏకాగ్ర చిత్తంతో కోరినందువలన శ్రీరాముడు మనిషి రూపంలో వచ్చి, ఆ ప్రసాదాన్ని తింటుంటే చూచి ఆయనను గుర్తించలేక ఆ మహిషాన్ని దెబ్బలు కొట్టినందువలన రామదాను కారాగారంలో దెబ్బలు తినవలసి వచ్చిందని చెప్పి కబీరు రామదాసుకనేక విధముల వివరించి తన దారిన తాను వెళ్ళి పోయాడు.

ఆనాటినుంచి రామదాసు సమస్తము రామమయమని, చిత్త శుద్ధితో శ్రీరామునారాధిస్తూ, కొన్నాళ్ళకు రామ సంకీర్తనం చేసుకుంటూ, స్వర్గ ధామం చేరుకున్నాడు.

ఆయనను సేవించిన ఆర్తులకాయన యెంతటి సులభతరుడో, యెంతటి కరుణామయుడో, దమ్మక్క, కబీరు, రామదాసుల దివ్య జీవితాలు మనకు వ్యక్తం చేస్తున్నాయి. ఆంధ్రుల ఆరాధ్య దైవమయినాడు శ్రీరామచంద్రుడు.

భద్రాద్రికి రైలుపైన, లాంచీలలోను రావచ్చును. రైలు మార్గమున వచ్చు యాత్రికులు భద్రాచలమురోడ్డు (కొత్త గూడెము) స్టేషనునందు దిగి అచ్చటి నుండి భద్రాచలము చేరవచ్చును. బస్సులోవచ్చు ప్రయాణీకులకు ఆంధ్ర దేశములో అన్ని పట్టణముల నుండి భద్రాచలమునకు ఆర్.టి.సి. బస్సులు చాలా కలవు.

లాంచీలో ప్రయాణము చేయువారికి రాజమండ్రి నుండి భద్రాచలమునకు ప్రతిరోజూ లాంచీ సౌకర్యమున్నది.

నిత్యమూ వచ్చు అసంఖ్యాకమైన యాత్రికుల సౌకర్యార్థమై దేవస్థానం వారు, వదాన్యులు, వ్యవస్థలు, పలు ధర్మశాలలు, సత్రములు నిర్మించినవి చాలా ఉన్నవి.

ఆలయానికి, పశ్చిమాన ధ్వజ స్థంభం, ఆంజనేయస్వామి ఆలయం, దీప స్థంభం. గోదావరి తీరమున సుబ్రహ్మణ్య స్వామి ఆలయం, కులశేఖరాళ్వారు, గుట్టమీద శ్రీలక్ష్మీనరసింహస్వామి భక్తులందరూ దర్శించవలసినవి. తూర్పున రథశాల జమ్మి మండపం, సంతానగోపాలస్వామి మండపం నారాయణ స్వామి, భద్రుని శిరస్సుమీద రాముని పాదాలు, ఊరికి చివర గోవిందరాజస్వామి దేవాలయము చూడవలసినవి. ఉత్తరాన గోపురం, అధ్యయన మండపం, ఏకాదశి మండపం, అద్దాల మహలు, ద్వాదశీ మండపం, శ్రీరంగనాయకులు హయగ్రీవస్వామి. మనవళ మహామునులు, ఉదయవరులు, కురుత్తాళ్వారు, నమ్మాళ్వారు, విశ్వక్సేనులు తిరుమంగయాళ్వారు, తొందరడి ప్పొడయాళ్వారు, తిరుముడిశయాళ్వారు,

కళ్యాణ మండపం, వైకుంఠ ద్వారం, దక్షిణాన గోపురం, శాసన స్థంభాలు, గట్టుమీద రంగనాయక స్వామి, గోపాలస్వామి ఆండాళ్ళు, వేంకటేశ్వర స్వామి, వరాహ స్వామి, నారదమునులు, రాజగోపాలస్వామి, పొయింగ ప్పూదత్తప్పెయాళ్వారు. రాజ్యలక్ష్మి విజయగోపాల స్వామి, లక్ష్మీనారాయణ స్వామి, వరవాసుదేవస్వామి, రామదాసు ధ్యానమండపము, ఇవి మాత్రమే కాక ఆలయంలో యాగశాల, పట్టాభిషేక మండపం, పవిత్రోత్సవ మండపం, కళ్యాణ మండపం, వాహన మండపం, పునర్వసు మండపం అద్దాల మండపం, చిత్రకూట మండపం, ఉట్ల మండపం, విశ్రాంతి మండపం ఉన్నాయి. ఊళ్ళో శివాలయం, కుసుమ హరనాథ దేవాలయం, గోవిందస్వామి మఠం, వేణు గోపాలస్వామి పీఠం, రామదాసు ధ్యానమందిరం, యాత్రికులందరూ తప్పక చూడవలసివి. భక్తుల వ్రాసి ఆలయానికి అర్పించిన రామకోటి గ్రంథాల స్టోర్సు చూడవలసిన వాటిలో అతి ముఖ్యమైనది. బహు పుణ్య ప్రదమైనది.

సుమారు పదిహేను కి॥మీ॥ దూరములో పర్ణశాల చూడదగ్గది. పసుపు, ఎరుపు శిలలు కొలనుగట్టున భూమాత తన బిడ్డయైన సీతాదేవి కొరకు ఏర్పాటు చేసినట్లు భక్తులు నమ్ముతారు. దీనినే సీతవాగని అంటారు.

శ్రీరాముడు మన ఆరాధ్యదైవం ప్రతి ఆంధ్రుడు దర్శించి, పూజించి తరించవలసిన పుణ్య క్షేత్రమిది.

## వాగ్గేయకారోత్సవములు

తిరుపతిలో అన్నమాచార్యకు, కూచిపూడిలో క్షేత్రయ్యకు ప్రతిసంవత్సరమూ నిర్వహించబడుచున్నట్లు, భద్రాద్రి క్షేత్రమున శ్రీరామభక్తుడు అయిన రామదాసు కీర్తనలను రామదాసు ధ్యాన మందిరంలో జయదేవులు, అన్నమాచార్యులు. పురంధరదాసు, నారాయణతీర్థులు, త్యాగరాజాది మహా వాగ్గేయకారుల పేరిట సంగీత సభలు నిర్వహించుచున్నారు. ఇందువలన భక్తి తత్పరత, సంగీత కళల ప్రాచుర్యమును, భద్రాద్రి ప్రాశస్త్యము, యావద్దేశానికి తెలియజేయటానికి వాగ్గేయకారోత్సవాలు మొదటి సారిగా 1973-74 సం॥న ప్రారంభించబడినవి.

ఈ విధముగ ఈ ఉత్సవములు ఎనిమిది సం॥లపాటు జరిగినవి. ఎందరో మహాసంగీత విద్వాంసులు ఈ కార్యక్రమంలో పాల్గొని తమ వైదుష్యమును ప్రదర్శించి తగురీతిని సన్మానింపబడినారు. శ్రీస్వామి వారి దశావతార అలంకారోత్సములతో పాటు, ఈ వాగ్గేయకారోత్సవములు జరుపుట గొప్ప విశేష కార్యక్రమముగా రూపొందినది. ప్రాముఖ్యత సంతరించుకున్న యీ ఉత్సవములు దేవాలయ నిధులతోనే జరిపించెడివారు. 1984వ సం॥లో మన ప్రభుత్వ ప్రోత్సాహంతో ఈ వాగ్గేయ కారోత్సవములు శాశ్వత ప్రాతిపదికపై కొనసాగుటకు నిర్ణయింపబడి అమలు జరుపబడుచున్నవి. రామాయణాన్ని చిత్రాలుగా చిత్రించి, రామదాసు ధ్యానమందిరాన అలంకరిస్తే బాగుండెడిది.

ఇట్టి మహత్తర కార్యక్రమమును చేపట్టుటకు కృషి సలిపిన కార్యకర్తలకు మనమెంతో కృజజ్ఞులము. ఇంకను ఇట్టి కార్యక్రమములు ప్రతి పెద్ద దేవాలయములలోను జరుపవలసియున్నది.



# నల్గొండ జిల్లా

## శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి దేవస్థానం : యాదగిరి గుట్ట

హైదరాబాద్ విజయవాడ రైలు మార్గమున భువనగిరికి సుమారు ఎనిమిది కి।మీ॥ దూరమున రాయగిరి స్టేషను కలదు. అక్కడి నుండి సుమారు నాలుగు కి।మీ॥ దూరమున యాదగిరి గుట్ట కలదు. ఈ యాదగిరి గుట్ట వరంగల్ నుండి హైదరాబాద్‌కు వెళ్ళు మార్గములో ఉన్నది. బస్సు సౌకర్యము కలదు.

భక్తాభీష్ట వరదుడును, సమస్త దుఃఖ నివారకుడును, సర్వ శక్తివంతుడు ప్రత్యక్షదైవమగు శ్రీ యాదగిరి లక్ష్మీనరసింహ స్వామి ఇచ్చట వెలసి జ్వాలా నరసింహరూపముతో, విశాలమైన గుహలో, ఆవిర్భవించియున్నాడు. శ్రీజ్వాలానరసింహస్వామి, శ్రీ యోగానంద నరసింహస్వామి, శ్రీలక్ష్మీనరసింహ స్వామి, శ్రీగండభేరుండ మరియు శ్రీ ఉగ్రనరసింహ స్వామిగా పంచరూపములతో ఆవిర్భవించిన ఈ స్వామి దర్శనము మహానందదాయకమై యున్నది. భక్త జనుల కోరికలు దీర్చు కరుణామయుడీయన.

సహజమైన, ప్రకృతి రమణీయ ప్రదేశములతో, భక్తులచే నిత్యము ఆకర్షణీయమై, మహా వైభవముగ భూతల వైకుంఠముగ అలరారుచున్న ఈ క్షేత్రరాజ విశిష్టత, తెలిసికొనదగినది.

ఈ క్షేత్ర పాలకులు శ్రీ ఆంజనేయస్వామి. ఈ క్షేత్రము మిక్కిలి పవిత్రమైనది.

శ్రీవ్యాస, ప్రణీతమైన శ్రీ నరసింహపురాణమునను సరించి స్కాంద, బ్రహ్మాండ పురాణముల యందు ఈ క్షేత్ర మహాత్మ్యము వివరించబడినది.

హిరణ్యకశిపుడు మహా బలశాలి. దేవేంద్రుని నిర్జించి, దేవతలు స్వర్గమున వదలి నలుదిశలకు పారి పోవుటకు కారణభూతుడయ్యెను. అట్టి అసుర ప్రకృతికి చెందిన వానికి పుత్రుడైన ప్రహ్లాదుడు, దైవాంశ సంభూతుడు, విష్ణుభక్తుడు. ఇతని భక్తికి ఎన్నో పరీక్షలు జరిగినవి తర్కవితర్కము, సామ, దాన బేధ, దండోపాయములు, నానావిధ బాధలు, చిత్ర విచిత్ర పరీక్షలెన్నో జరిగినవి. హిరణ్య కశిపుని తీవ్ర రౌద్ర విద్వేషముచే, ప్రహ్లాదుని భక్తి ఇనుమడించినది. ప్రహ్లాదుని భక్తి విశ్వాసములు, ధైర్య సాహసములు ఆతనిని మహా భక్తులకాదర్శ ప్రాయమగునటుల, పరిగణింప జేసినవి.

తన తండ్రి తనని, మరుగుచున్న నూనెలో పడవేయించెను. క్రూర సర్పములచే కరిపించెను.

బంధించి సముద్రములో తోసి, బండలెత్తించెను. కత్తులతో పొడిపించెను. మదించిన ఏనుగులచే త్రొక్కించెను. ఈ విధముగ, ఎంత నొప్పించినను ప్రహ్లాదుడు చలించలేదు. పైగా, "వారొనరించినదేమో వారెరుగరు. వారిని మన్నింపుము" అని తండ్రిని ప్రార్థించిన శ్రేష్ఠుడు. (ఏసు నందు కూడ ఇట్టి యద్భుత సహన భావము గోచరించెను.)

ప్రహ్లాదుడు పట్టువదలక ధైర్యముతో తండ్రి నెదుర్కొనుచుండెను.

రాజాజ్ఞ శిరసావహించి, ప్రహ్లాదుని తోడ్కొని పోయి ఆచార్యులు వానికి రాక్షసోచిత విద్యలు నేర్పుట ప్రయత్నించిరి. కాని, ఆ విద్యలు ప్రహ్లాదుని మనసున కెక్కలేదు. ఎప్పటి యట్లు ప్రహ్లాదుడు, తోడి బాలుకుతో హరి భజనము నేర్పదొడగెను.

గురువులతని భక్తి మహిమల కబ్బురపడి, తల వంచిరి. మాకు అతనిని హరిభక్తి నుండి మరల్చుటకు వీలుకాలేదని లజ్జాన్వితులై తుది పరీక్షాసమయమున, హిరణ్యకశిపునకు విన్నవించిరి. హిరణ్యకశిపుడాస్థాన మందుండి ప్రహ్లాదుని పిలిపించి "నీ హరి ఎక్కడున్నాడు? అతడెట్టి వాడు? వాని నివాసమెక్కడ? నాకొక మాటు అతనిని చూపగలవా?" యని హూంకరించి, బెదిరించి, గద్దించగా, ప్రహ్లాదుడు అతి ప్రసన్నముగ, జంకులేక భక్తి వాదముతో "జనకా! శ్రీహరి యెల్ల తావులందును గలడు. ఆకాశమున, గాలియందు, భూమియందు, అగ్నియందు, పగటియందు, రాత్రియందు, సూర్య చంద్రాదులయందు, ఓంకారము నందు, వేయేల, ఇచ్చట, అచ్చట అననేల, చక్రి సర్వోపగతుడు" అని మహానందమున నృత్యము చేయుచూ, తండ్రికి సమాధానమిచ్చెను.

ఈ మాటలు వినిన హిరణ్యకశిపుడు "అంతటా ఉన్నచో, నీ స్తంభమున చూపు"మని తీవ్రమైన కోపమున, సభామంటపమందలి స్తంభముపై, బలము కొలది తన గదతో కొట్టెను

తోడనే ఆ స్తంభము ఫెళ, ఫెళ మని విరిగెను. అగ్ని పర్వత బిలమునుండి వెలువడు అగ్నివలె యందుండి ఉగ్రమూర్తియగు శ్రీనరసింహుడు క్రోధాగ్ని కణములు రాల్చుచు వెలువడి ఆ రాక్షసుని ఒడిసి పట్టుకొని తొడపై కూలవేసి (మానవుడును మృగమును గాని నరసింహుడు) పగలును రాత్రియును కాని సంధ్యా కాలమున, భూమియునాకాసము కాని తనయొడియందు, బహిరంగమును అంతరమును కాని సభాద్వారమున, ప్రాణవంతమును ప్రాణహీనము కాని, తన వాడియైన గోళ్ళచే, త్రిలోక కంటకుడగునీ రాక్షసుని చీల్చి చంపెను. శ్రీ నరసింహుని భీకరాకారము గాంచి ముల్లోకములు తల్లడిల్లెను. అంత ప్రహ్లాదుని దేవతలు వేడినంత ప్రహ్లాదుడు, స్వామిని శాంతింపజేసెను.

శ్రీ నృసింహ పురాణ కథనమునసరించి హిరణ్యకశిపుని వధ శ్రీశైల ప్రాంతమునందలి అహోబల క్షేత్రమున జరిగినట్లు తెలియుచున్నది. ఇప్పటికి అచ్చట స్థంభోద్భూత నరసింహుడు కలడనియు, ఐదు మైళ్ళ దూరములో, గదతో చీల్చబడిన స్తంభము కూడ కలదనియు, భయంకర దృశ్యములు కొన్ని కొన్ని అచ్చట కలవని చెప్పుదురు.

బ్రహ్మాది దేవతలు, మహర్షులు స్వామి ప్రసన్నులకై ప్రార్థింపగా స్వామి ఉగ్రరూపము వదలి ప్రసన్నుడయ్యెను. ఆదివ్యశాంతరూపము, మంగళకరమై, ప్రసన్నమై, భక్తజనసంసేవ్యమై ఆరాధ్యమై యుండెను. ప్రహ్లాదుడు స్వామి చరణారవిందములకు సాగిలి మ్రొక్కి అనేక విధముల స్తుతించెను. స్వామి ప్రసన్నుడై వలయు వరములు కోరుకొనమన, ప్రహ్లాదుడు తన తండ్రి కుత్తమగతి, రెండవ వరముచే సర్వకాలములయందు తమను సేవించునట్లు, ఈ రూపముతోనిచట వెంచేసి యుండ ప్రార్థించి తన యభిమతమదేయని చెప్పెను.

శ్రీస్వామి ప్రసన్నుడై తన తండ్రికుత్తమ లోకములిచ్చి తదుపరి "నాయనా! ఇచ్చటి కనతి దూరములో యాదగిరియని వ్యవహరింపబడు చిన్న కొండ యొకటి కలదు. అందు గంభీరమైన గుహలో నేను అర్చా రూపమున వెలసి యుందును. భవిష్యత్తులో ఇది యొక మహాక్షేత్రమై ప్రఖ్యాతి గాంచ గలదు. భక్తులెందరో వచ్చి మమ్ములను సేవించి తరించెదరని చెప్పెను. శ్రీ నరసింహ స్వామి లక్ష్మి సమేతముగ, శ్రీయాదగిరి శిఖరాగ్రముపై వేంచేసెను. బ్రహ్మది దేవతలు స్వామిని స్తుతించుచూ పుష్ప వర్షములు వర్షించుచూ వెంట వచ్చిరి.

ప్రహ్లాదుడు కాలక్రమమున విరక్తుడై నీ యాద గిరి సమీపముననే వేయి దివ్య వర్షముల పర్యంతము ఘోర తపస్సు చేయుచుండెనని చెప్పుదురు. ఇప్పుడా గిరికి ప్రహ్లాద గిరియని పేరు కలదు.

ఇచ్చట యేవిధమైన గుర్తులు, శాసన ములు కనిపించుట లేదు. బ్రహ్మ ప్రక్షాళనము చేసిన శ్రీపాద తీర్థము లోయల ద్వారా జారి మెల్లగానొక కుండములోనికి చేరుకొనెను. ఈ తీర్థమును విష్ణు తీర్థమనియు, ఆ కుండమును విష్ణుకుండమని యను చున్నారు. నేటివరకు దివ్య ప్రభావాన్వితమై, పవిత్రమై భక్తుల రోగనివారకమై అలరారుచున్నది.

నాటి నుండి ఎందరో మహర్షులు, దేవతలు ఈ కుండమున స్నానమాడి స్వామిని సేవించి ఆరాధించు చుండిరి. ఇచ్చటి యారాధనను ఋషియారాధన యని యందురు. ఒకానొకప్పుడు పరాశర మహర్షి ఈ సరోవర తీర్థమున యోగాసనమున కూర్చుండి, స్వామి నారాధించినట్లు స్కాందపురాణ ప్రమాణము కలదు.

ఇచ్చటికి సుమారు ఇరవై కి!మీ! దూరమున వేంకటగిరి యను నొక పర్వతము కలదు. ఆ పర్వత గుహలో ఋషులు నివాస మేర్పరచుకొని రాత్రి సమయములందు వచ్చి ఈ కుండములో మునిగి స్వామిని సేవించు చుండెడివారు. వారలర్పించిన చందనకుసుమాదులు మనమిప్పుడు కనులారాచూచు చున్నాము. వారి యారాధనా దృష్టాంతములు, గంటల నినాదములు, భజనలు, ఆర్ద్రపాద గుర్తులు కనబడు చున్నవి. ఆయా విశేషములనెంతో వింత వింతలుగ చెప్పుకొనువాడుక ఇచ్చట కలదు. ఋషి యారాధనా మహిమయే నేటి ప్రభావమునకు మూలా ధారమని చెప్పవచ్చును.

పిదప కొంత కాలమునకు ఈప్రదేశమంతయు అరణ్య ప్రాంతమై పెద్ద పెద్ద వృక్షముల చేతను. పలు విధముల లతానికుంజముల చేతను అల్లుకొని, క్రూర మృగముల కాలవాలమై గట్టు పుట్టలతో నిండి ఉగ్ర సర్పముల కిరవై మానవ మాత్రులెవ్వరూ చొర శక్యముగాక యుండెను. ఇట్లు చాలా కాలము గడిచి నది. తుదకు, యాదర్షి తపో విశేషముచే స్వామి ప్రకాశమానుడయ్యెను. ఆ ఋషి నామముననే మిగిలి యాదగిరియని వ్యవహార నామముతో ప్రసిద్ధిమయి నది.

యాదఋషి ఋష్యశృంగుని కుమారుడు. ఈతడు శ్రీ నృసింహునియందలి భక్తిచే, తన మంత్రానుష్ఠానమునకనువగు స్థలమునకై తిరిగి, ఎక్కడను కనిపించక, ప్రశాంతత, రమణీయకతగల యాదగిరికి వచ్చి చూచిసంతసించి, ఇచ్చట తపమాచ రించి సిద్ధి పొందెను. ఇచ్చటకు వచ్చినాటి రాత్రి స్వప్నమున హనుమంతుడు సాక్షాత్కరించి ఇచట చేరువగనే యున్న చిన్న గిరిగుహయందు శ్రీలక్ష్మి నరసింహుడు అర్చా రూపముతో వెలసియున్నాడని సామాన్య మానవ మాత్రుల కగపడడని యోగులకు మాత్రమే సుస్పష్టముగ సాక్షాత్కరించునని చెప్పెను. ఇచ్చట పవిత్రమైన విష్ణు కుండమున స్నానమాడి స్వామిని సేవించినచో అభీష్టములు నెరవేరగలవని ప్రబోధింప, యాఋషి యట్లే మహర్షాతిరేకమున యాదగిరి శిఖ రాగ్రమున దీర్ఘకాలము తపమాచ

రించెను. కొంత కాలమునకు స్వామి యుగ్రా కృతిలో వ్యాఘ్ర రూప మున దర్శన మిచ్చి వానికి వలయు వరముల నను గ్రహించెను. మొదటి వరముచే నీ గిరి తన నామముచే వ్యవహరింపబడునట్లు మరియు లోకోపకారమునకై శ్రీస్వామి ఈ గుహయందే వేంచేసి యుండండవలెనని ప్రార్థించెను.

శ్రీ స్వామి యందులకంగీకరించి కనులు మిరుమిట్లు గొలుపునట్టి అఖండ జ్యోతివలె వెలిగి దివ్య స్వరూపముతో నచ్చట యావిర్భవించెను. ఆయన నేటికినీ జ్వాల నరసింహుడై ఊర్ధ్వ రేఖవలే దర్శన మిచ్చుచున్నాడు. నాటినుండి యీ గిరి యాదగిరిగా ఏర్పడినది. తనకుపకరించిన ప్రసన్నాంజనేయు డిచ్చట గిరిగుహముందు క్షేత్రపాలకుడై వెలసి యున్నాడు. ఆయన స్నానమాడిన కుండము నేటికినీ కలదు.

అనేక గ్రంథ పరిశోధనలు గావించి స్కాంద బ్రహ్మ, బ్రహ్మాండ, పద్మ నరసింహ పురాణములలో తరచుగానీ క్షేత్ర మహాత్మ్యమునకు సంబంధించిన విషయములక్కడక్కడ చెదురుగలభించిన వాని నను సరించి సందర్భమునకు తగినట్లొక చోట చేర్చి ఈ క్షేత్ర మహాత్మ్యమును శ్రీవిద్వాన్ గోవర్ధనం నరసింహాచార్యుల వారు రూపొందించిరి. వారు కడు ధన్యత చెందిన మాన్యులు.

శ్రీ నృసింహునిమంత్రం, నృసింహక్షేత్రం, నృసింహుని విగ్రహము నృసింహనామము గొప్ప శక్తి గలవి. సింహాచలము, అహోబిలము, మంగళగిరి, వేదాద్రి, యాదగిరి మొదలగు క్షేత్రముల ప్రభావము మనమందర మెరిగినదే.

యాదర్షితపోబలము, ఋషులయారాధన, హనుమంతుని నిరంతర ధ్యానయోగ ప్రభావము వలననీ క్షేత్రము గొప్ప శక్తి వంతమై యున్నట్లు యిచ్చటకు వచ్చి సేవించిన వారికి తెలియగలదు. ఎన్నియో చిత్ర విచిత్ర మహిమలిచ్చట గాంచ వచ్చును. (ఈ రచయిత శ్రీగోవర్ధనం నరసింహాచార్యుల వారినిదర్శింప వారెన్నియో స్వామిమహిమలను గూర్చి సోదాహరణముగా సెలవిచ్చి యున్నారు. గ్రంథవిస్తరణ భీతితోనవి వ్రాయవీలు కాలేదు.)

ఇచ్చట స్వామి గోపురమందలి చక్రమొక విశిష్టమహిమాన్వితమై యున్నది. ఇది సుదర్శన మహా మంత్ర శక్తి ప్రభావమని మాంత్రికులభిప్రాయపడు చున్నారు. విచిత్రమైన శక్తి కలిగి రాత్రులందు జ్యోతి వలే వెలుగుచుండును. పగలు అప్పుడపుడు స్వయ్యముగ పరిభ్రమించుచుండును. కదిల్చినను కదలక యుండును; దూర దేశస్థులు, ప్రయాణికులు ఆ జ్యోతికి నమస్కరించుచుందురు.

ఈ క్షేత్రము భక్తులకు కల్పతరువు. రోగుల కొక చికిత్సాలయము, వరములకొక పెన్నిధి. మహా శక్తులకు సాంకేతిక స్థలము.

ఒకచోట నూతన చికిత్సా విధానములు, మరొక చోట సూచీ యంత్ర ప్రయోగాలు, శాస్త్రీయ విధులు, పారాయణాది నియమములు, గ్రహాదులు నిర్మూలనములు, భూత, ప్రేత, పిశాచ, శాకినీ, డాకినీ, కామినీ, మారీ గ్రహాదుల ఉచ్చాటన మారణ సంహారణలు, ఉపసంహారణాది ప్రయోగ తంత్ర కర్మలు ఎన్నో జరుగుచుండుట ప్రత్యక్షముగా చూడ వచ్చును. ఇదియే ఇచటి ప్రత్యేకత.

ఆర్తులకు, జిజ్ఞాసవులకు, గృహస్థులకు, సన్యాసులకు, యతులకు, యోగులకు, భక్తులకు, జ్ఞానులకు పవిత్రమై రామణీయకమై ప్రశాంత ప్రదేశమై యొప్పుచున్నది.

క్రీ॥శ॥ 1148 సం॥ త్రిభువన మల్లుడు-తైలపదేవుడు త్రైలోక్యమల్లుడని పేరుగాంచిన త్రిభువన మల్లుడు పశ్చిమచాళుక్యుడు, మహావీరుడు, గొప్ప పరాక్రమశాలి. రాజమహేంద్రవర వాస్తవ్యుడు. ఆంధ్ర దేశమున గల రాజు నోడించి తెలంగాణాలోని భువన గిరివద్దనున్న ఏకశిలా సమీపమునకు వచ్చి, అచ్చటి

వాతావరణమునకు సంతసించి ఆకొండపై నొక గొప్ప కోటను నిర్మించి అందు నివాస మేర్పరచుకొనెను. ఇప్పటికాయన పేరుతోనే ఆ గ్రామము భువనగిరిగా వ్యవహరింపబడుచున్నది. గుజరాతు ప్రభువైన పృధ్వీ వల్లభునితోనీతనికి పదహారు సార్లు గొప్ప పోరాట ములు జరిగెను. అందెంత మాత్రము విజయము సాధించలేకపోయెను. తుదకు తన ప్రయతమ మంత్రి జగద్దేవుని ప్రేరణచే సమీపమునందున్న శ్రీయాదగిరి. శిఖరమునందలి శ్రీలక్ష్మి నరసింహ స్వామిని సేవించి, తులసి దళములచే పూజించి, గుజరాతునాయకుని ఓడించి, ఘన విజయము సాధించెను. ఆయన ప్రతినిధి శ్రీ జగద్దేవుడు ధర్మపురి, వేములవాడను పాలించి, అచ్చటి నరసింహ, శ్రీ రాజరాజేశ్వరుల నారాధించినట్లు కొలను పాకయందలి, శ్రీ జగద్దేవు నారాయణ స్వామియాలయమునగల శాసనములచే విదితమగుచున్నది. శ్రీ స్వామి మహాత్మ్యం నాటి నుండి ప్రసిద్ధమై యున్నదని చెప్పబడుచున్నది.

క్రీశ 16వ శతాబ్దమున విజయనగర ప్రభువైన శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రకై ఆంధ్రదేశము నకు వచ్చి నవాబుల రాజధానియైన గోలుకొండకు వచ్చి చేరువనున్న శ్రీయాదగిరి క్షేత్ర ప్రభావమును విని శ్రీ నృసింహుని యందలి భక్తిచే, కొండపైకి వచ్చి యిచట వేంచేసియున్న స్వామిని సేవించెను. ఆయన భార్య స్వామిని ప్రార్థించగా ఆమెకొక కుమారుడు కలిగెను. ఆతడు ఐదు సంవత్సరముల వయసునాడే చనిపోయెను. దీనికి కారణము తర్కించుచుండగా ఒక నాటి రాత్రి స్వప్నమున స్వామి సాక్షాత్కరించి నీ భార్య కొండపైనున్న విష్ణు పుష్కరిణిలో స్నానమాడక, తిర స్కరించి వెళ్ళినందున ఇట్టి దుస్థితి కలిగినదనిచెప్పెను.

వెంటనే వారియిరువురు మరల వచ్చి, శ్రీ స్వామిని సేవించి విశేషార్చనతో స్వామినారాధించి క్షమాపణలు వేడుకొని సుఖులైనట్లు చరిత్రాంశముల వలన తెలియుచున్నది.

పూర్వము కేవలమిట అటవీ ప్రాంతముగా నుండుగా స్వామి స్వయముగా తన స్వరూపము లోకులకు తెలిపి వారి వలన ఆరాధనోత్సవములను స్వీకరించదలచి యీ కొండకు సమీపముననున్న గ్రామాధికారి స్వప్నమున దర్శనమిచ్చి తానున్న గుహలోని కొన్ని గుర్తులను చెప్పి అంతర్ధానమయ్యెను.

మరునాడుదయమున ఆగ్రామాధికారి తన స్వప్న వృత్తాంతమును గ్రామములో పిన్న పెద్దలంద రికి తెలిపి వారితో గూడ యాదగిరి పైకెక్కి నలు దిశలు వెదకజొచ్చిరి. అచట గల విష్ణు పుష్కరిణి చూచి మహా సంతోషముతో దాని యుందు స్నాన మాడి శ్రీ ఆంజనేయుని సేవించిరి. తరువాత అరణ్య మున వెదకి గుహవద్దకు వచ్చి ఆచట గల స్వామి దివ్య మూర్తిని గాంచి ఆనాటి నుండియు స్వామిసేవలకు పూనుకొనిరి.

ఆరాధనా క్రియలు నిర్వర్తించుటకు గాను సమీపమునందలి పురోహితులను పిలిపించి, స్వామి ఆరాధనా కైంకర్యముల బాధ్యత వారి కప్పగించిరి. ఆనాటి నుండి వైష్ణవ సంప్రదాయములతో, మిక్కిలి శ్రద్ధా భక్తులతో, సంపూర్ణ బాధ్యతతో, స్వామివారి సేవలు జరిపించుచుండిరి.

భాగ్య నగర నివాసులు, ఆగర్భ శ్రీమంతులు, వదాన్యులైన శ్రీ రాజమోతీలాల్ పిత్తిగారు ఈ క్షేత్ర మున వైభవముగ సేవించి కొంత కాలము వరకిచ్చట నుండి స్వామిని సేవించుచూ గోపుర ప్రాకార సింహ ద్వార, ముఖ మండపములు మనోహరముగ నిర్మించి ధన్యులైనారు.

నేడీ క్షేత్రమున యాత్రికులకన్నివిధ సౌకర్య ములు మన రాష్ట్ర దేవాదాయ శాఖవారు కల్పించు చున్నారు. ఈ క్షేత్రమెంతో అభివృద్ధిని గాంచి నేడు ప్రథమ శ్రేణి ఆలయముగ అభివృద్ధి చెందినది.

ఈ దేవాలయ ధర్మకర్తలు నిరతాన్నదాన ప్రణాళికను అమలు పరచుటకు ప్రయత్నించు చున్నారు. అందుకు వదాన్యులు సహకరించు చున్నారు. ఎన్నియో శాశ్వత కైంకర్యములు విరాళ మిచ్చిన దాతల పేరున జరుపుటకు ఏర్పాట్లు చేసి యున్నారు.



# వరంగల్ జిల్లా

కాకతీయుల కాలమున తెలంగాణమున దివ్యములు, రమణీయములైన శిల్పములు వెలసినవి. ఇవి కడు మనోహరములై శిల్ప కళామ తల్లికి దివ్య మణి హరములై వెలసినవి. ఇందుకు పాలంపేటలోని రామప్ప గుడి, వరంగల్లు కోట ద్వారము తదితర శిల్పములు, హనుమ కొండలోని వేయి స్థంభాల గుడి(మంటపము) మొదలగునవి నేటికి కాకతీయ ప్రభువుల పాలనలో ఆంధ్ర శిల్పము ఎట్టి సుందర లాస్యము సల్పినది ఎరుక పరచుచున్నవి. వారి పాలనము తెలుగుగడ్డను జగత్ప్రసిద్ధము చేసినది.

కాకతీయ శిల్పాలు అప్పటికి అందుబాటులో గల శిల్పి యొక్క పరికరాల సున్నితత్వం శిల్పానికి అవసరమైన ముడి పదార్థమైన శిలాస్వభావం శిల్ప నిర్మాణానికి శిల్పికి గల అవకాశాలు అతని శిల్ప కళా నైపుణ్యాన్ని నిర్ణయిస్తున్నవి. ఆనాటి శిల్పాలు తమ కళాసృష్టి అంతటనూ తమదని చూపుకోగల ప్రత్యేకతను ప్రతిభావంతంగా ప్రదర్శించి చరితార్థులైనారు.

ఈ ప్రత్యేకతే కాకతీయ శిల్ప వ్యక్తిత్వాన్ని ప్రతిభనూ చూపుతున్నది. కావున ఆనాటి శిల్పకళకు చిరయసస్సు సంపాదించినది.

కాకతీయుల కాలంలో తెలుగుదేశంలో శైవ మతాధిక్యత నిరూపింపబడినది. వీరు ఆరంభంలో జైన మతావలంబులైనను కాకతీయగణపతిదేవుని కాలమున శైవము ప్రత్యేకించి ప్రోత్సహింపబడడముతో శైవ మత ప్రచారమునకు దోహదము చేసి సాహిత్య సృష్టి కూడా విస్తృతంగా చేయబడినది. పాల్కురికి సోమ నాథుని "బసవ పురాణం", "పండితారాధ్య చరిత్ర" మారన "మార్కండేయపురాణం" వంటి గ్రంథాలు వెలువడ్డాయి.

ఈనాటి కాకతీయులనాటి శిధిలాలను గమనిస్తే ఆనాడు ప్రతి మండలంలోను సర్వాలంకార శోభితమైన ఆలయ నిర్మాణంలో ప్రత్యేకతను చూపేవారని అర్థమవుతుంది.

కాకతీయ ఆలయ నిర్మాణంలో ఉపయోగించినది కఠినమైన నల్లరాయి. ఇది శిల్పికి ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ఇచ్చే ముడిపదార్థము. దానికి తోడు ఆనాటి శిల్పికి పరికరాలు బాగా అభివృద్ధి చెంది ఉన్నాయి. చెక్కిన ప్రతి శిల్పానికి అద్దంలా మెరిసే టట్లు మెరుగు పెట్టేవారు ఆనాటి శిల్పులు. కొందరీనాటికీ చెప్పు

కుంటున్నట్లు రాయి నిద్రించేటప్పుడు చెక్కుతారట శిల్పాలు. ఒక విధమైన ఆకుపసరు రాస్తే రాయి మెత్తగా మారుతుందట! ఏమో ఏమయి ఉంటుందో ఈ శిల్పాలు పనితనం గమనిస్తుంటే ఏదో అనిర్వచ నీయమయిన శిల్ప చాతుర్యం గోచరమవుతుంది

శివాలయాలు కాకతీయుల కాలంలో ప్రత్యేకా దరణకు నోచుకున్నవి. శివ, వాసుదేవ త్రికూటాల యాలు ఒక సంప్రదాయంగా నిర్మింపబడెడివి. విష్ణ్వాల యాలు కూడా నిర్మింపబడటం ఆనాటి విశేషంగా చెప్పుకోవచ్చును. కాకతీయచక్రవర్తులే కాక వారి మంత్రి సామంత దండనాధులు, వారి రాణులు చెరువులు త్రవ్వించి వాటి చెంతనే ఆలయాలు నిర్మించి వాటి నిర్వహణకై వేద విదులైన వారికి అనేక భూములు దానంగా ఇచ్చారు. వాటి వివరాలు శాసనా లలో పొందుపరచారు. రెండవప్రోలరాజు శైవ మతావ లంబియై ఓరుగల్లు స్వయంభూదేవాలయ నిర్మాణా నికి కారకుడైనాడు. రుద్రదేవుడు శిల్పకళా శోభితమైన అనమకొండ వెయ్యి స్తంభాల గుడి నిర్మాత, ఆకాలపు వెల్లంకి గంగాధర మంత్రి. అనుమ కొండ, నగునూరు, నుడికొండ ఆలయాలు నిర్మాత పోలిరెడ్డి మొరిపిరాలి ప్రోలేశ్వరాలయం నిర్మించాడు. ఈ జిల్లాలోని వరంగల్, హనుమకొండ, అయినవోలు, గూడూరు, ఇనుగుర్తి, కొండిపర్తి, పాలంపేట, మాటూరు, పమ్మి, ముప్పవరం, చినకందుకూరు ఘనపూర్‌లలో దేవాల యాలు కాకతీయుల కాలంలో నిర్మింపబడినవే. నాటి కళాపోషకులు, కళాకారులు, అభిరుచులు, నైపుణ్యాలు పూవులతావిలా పలుతావుల గుభాళించినవి. రాలను రత్నాలుగా మలచి నిలిపి నింపి తెలుగు ఉలుల కళా ప్రతిభకు నీరాజనాలిచ్చినవి.

కాకతీయ కాలంలో ఆటపాటలు, దేవతారాధన సందర్భాలలో చక్కగా సాగుతుండేవి. పేరిణి శివ తాండవము ఆనాటి నృత్యవిశేషమే. దేశి నృత్య శిల్పాలతో పాటు భరత నాట్య సంప్రదాయ నృత్య భంగిమలు కాకతీయ శిల్పాలలో కనిపించుచున్నవి. ఆనాటి శిల్పాలు నాట్య ముద్రలేని స్త్రీ రూపాన్ని చూపలేదు. అనేక నృత్య భంగిమలు కోలాటం బృందాలు, వాయిద్య పరికరాలు రామప్ప, ఓరుగల్లు, శిల్పాలలో అమితంగా కనిపించుచున్నవి.

గణపతిదేవుని బావమరిది. జాయపసేనాని నృత్య శాస్త్ర విశారదుడు. కాకతీయ శిల్పానికి లక్షణ గ్రంథం అనదగిన 'నృత్య రత్నావళి' రచించాడు. ఇందు లోని శ్లోకాలకు లక్ష్యాలనదగిన 'రామప్ప' గుడులలో కనిపిస్తున్న నాట్యభంగిమలు ఎంతో రమణీయంగా నిర్మించి ఆనాటి కాకతీయప్రభువుల సంగీత, నృత్య, శిల్పాభిమానాన్ని మనకు తెలియజేసారు.

పాల్కురికి సోమనాథుడు, బమ్మెర పోతన చంద్రగుప్తునికి చాణుక్యని వలె శివదేవయ్యలాంటి గొప్ప కవులు పండితులు వరంగల్లు జిల్లాకు చెందిన వారే. కాకతీయుల కాలంలో సంస్కృతాంధ్ర సాహిత్యం గణనీయంగా రూపుదిద్దుకున్నది. దండి దశకుమార చరిత్ర, మారన మార్కండేయపురాణం, బద్దె భూపాలుని నీతిశాస్త్రముక్తావళి (సుమతీ శతకం) ఎంతో ప్రఖ్యాతి చెందినవి. ఇచ్చటి రంగనాథుడు తన ఎత్తు (తూకం) శివ కృతులు నిర్మించిన వైష్ణవుడు!

## రామప్పగుడి

కాకతీయుల కాలంలో నిర్మితమైన రామప్ప గుడి శిల్పచరిత్రలో ఒకప్రత్యేక అధ్యాయంగా చెప్ప ధగిన విశేషాలు కలిగినట్టిది. శైవులైన ఓరుగంటి ప్రభువుల చల్లని పరిపాలనలో ఈ ఆలయం ఆంధ్రుల కళా వైశిష్ట్యాన్ని, కళా గురుత్వాన్ని చాటుతున్నది.

శాతవాహనుల నాటి అమరావతీ శిల్పాలకు, ఇక్ష్వాకుల నాటి నాగార్జునకొండ శిల్పాలకు పల్లవ

చాళుక్యుల నాటి శిల్పాలకూ పిమ్మట పేర్కొనదగినది కాకతీయుల మనోహర శిల్పాలు.

పాలంపేట లోని రామప్పగుడి జగత్ప్రసిద్ధమైనది. వరంగల్లు జిల్లా ములుగు తాలూకాలోని పాలంపేటకు సమీపాన ఉన్నది. హనుమకొండకు వాయువ్యాన సుమారు 50 కి॥మీ॥ దూరమున ఈ ఆలయం నిర్మితమైనది. ఈ ఆలయానికి చుట్టూ కొండల వరుస కనువిందుచేస్తూ ఉంటుంది. ఈ ఆలయానికి దగ్గరలో రామప్ప చెరువు కూడా ఉన్నది.

ఈ దేవాలయాన్ని నిర్మించిన శిల్పి శ్రీ రామప్ప ఈ శిల్పిలోకోత్తర శిల్ప ప్రతిభ కారణంగానే ఇది రామలింగేశ్వర ఆలయం అయినా ఆ దేవుని పేరున కాకుండా, రామప్ప దేవాలయమనే నాటికీ, నేటికీ పిలువ బడుచున్నది. అనగా ఈ శిల్పి అద్భుత చరిత్ర కలవాడని తోస్తున్నది.

నాగార్జున కొండకు సమీపమునన్ను పెందోట లోని శిల్పాలు, అమరావతీ నాగార్జున కొండల శిల్పాలు నిర్మించినట్లే, ఈ రామప్పార్ శిల్పాచార్యులు కూడా ఈ దేవాలయమును వరంగల్లు, హనుమకొండలలోని శిల్పాలను నిర్మించివారని చెప్పడంలో ఔచిత్యమున్నట్లు పెద్దలు చెబుతారు. అయితే రామప్ప ఉదంతం శాసనాలకు ఎక్కకుండా మరుగున పడటం వలన చారిత్రకులకు ఈతని చరిత్ర తెలసికొనుట కవకాశము కలుగుట లేదు. ఈ విషయమున ఇంకనూ ఎంతో పరిశోధనలు చేయవలసి యున్నది.

కాకతీయ సామ్రాజ్య విస్తరణకు కారణభూతుడైన గణపతిదేవచక్రవర్తి కాలములో ఈ నిర్మాణము జరిగినట్లు తెలియుచున్నది. అయితే సరియగు కాల నిర్ణయమునకు వీలగుటలేదు.

హొయసలుల శిల్పాలకు, కాకతీయుల కాలమునాటి శిల్పాలకు కొన్నింట సాదృశ్యములు గోచరిస్తున్నవి. బేలూరులో వెలసిన చెన్నకేశవుని ఆలయానికి రామప్ప గుడిలోని అనేకాంశములలో సాదృశ్యమున్నది.

రామప్ప ఆలయములోని అదిష్ఠాన స్వరూపము నేల మట్టానికి దాదాపు ఆరు అడుగులు ఎత్తున ఉన్నది. ఎత్తయిన పెద్ద వేదికలమీద ఆలయాలను నిర్మించే సాంప్రదాయం హొయసలుల కాలపు దేవాలయములలో కనబడుచున్నది.

ప్రసిద్ధ కవి శ్రీ దురుసేటి రామాచార్యులుగారు రామప్ప చరిత్రను సంస్కృతంలో మనోహరంగా రచించారు. ఇచ్చటి గర్భాలయములలోని ప్రధాన దైవం శ్రీ రామలింగేశ్వర స్వామి. ఈ లింగం నల్ల ఆకు పచ్చ రాతితో తీర్చబడిన అందమైన శివలింగం. చక్కగానున్న పానవట్టము మీద ఈ లింగమూర్తి భక్తుల పూజలందుకుంటూ ప్రసిద్ధి వహించినది.

దేవకన్యలు, గంధర్వులు, నాగినులు శిల్పాలు, ఆ ఆలయం మీదనున్నవి. చక్కని అష్టదళ పద్మమును శిల్పులు చెక్కినారు. ఇది ఇచ్చటి అత్యద్భుత శిల్ప విశేషము.

ఇచ్చట అమర్చిన శిల్పాలలో అద్భుతముగా చెప్ప దగినవి. నాసికా ప్రతిమలు. ఇవి అలంకారార్థము అమర్చబడినవి. నగ్న నాగినీమూర్తిశిల్పము అతి సుందరముగా యుండి చూపరులను ఆకర్షించుచున్నది.

ఇచ్చటి స్తంభ శిల్పం అద్భుత శిల్పకళా విశేషమై యున్నది. అద్దమంటి నునుపు కలిగిన ఎన్నో శిల్పాలు చిత్రితములైయున్నవి. ఇచ్చట నంది విగ్రహము అందాల నందిగా పేరెన్నికగన్నది. ఈ నంది సర్వాలంకార శోభితము, ఏ అలంకారము శిల్పి విస్మరించలేదు. మెడలో మువ్వలగంటలు కూర్చిన దండలు మూపురము చుట్టూ అలంకరణ వీపుమీద

నాగబంధము ఈ నందికి ఎంతో శోభను కూర్చు చున్నవి.

ఈ దేవాలయ విమానము, ప్రధాన శిఖరము దక్షిణోత్తర శిల్పరీతుల సమ్మేళనమని ఫెర్గుసన్ వ్రాసి యున్నాడు. విశ్వవిఖ్యాతి చెందిన ఈ క్షేత్రము అవశ్యము దర్శనీయమై యున్నది.

## శ్రీ భద్రకాళీ దేవాలయము – వరంగల్లు

క్రీ॥శ 625 సం॥లో చాళుక్య చక్రవర్తి రెండవ పులకేసి వేంగి దేశమును జయించనెంచి, మార్గ మధ్యమమునగల ఈ శక్తి స్వరూపిణిని దర్శించి, పూజించి కొత్త కట్టడాలు నిర్మించినట్లు తెలియు చున్నది.

వరంగల్లులోని ఈ భద్రకాళీదేవి మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి అవతారములలో ఒకా నొకటిగా వర్థిల్లుచున్నది. ఈ దేవి ఆలయము ఎప్పుడు ఎవరు నిర్మించారో తెలిపే ఆధారాలు కనబడుట లేదు ఎందరో రాజులు మంత్రులు, ప్రజలు ఈ దేవతను పూజించి తమ కోరికలు తీర్చుకున్నట్లు తెలిపే ఆధారాలు ఉన్నవి.

ఈ తల్లి మహత్తు, శక్తి గురించి రాష్ట్రములోనే కాక ఇతర రాష్ట్రములలో ప్రచారమగుట చేత దేశ మంతటి నుండి వస్తున్న భక్తుల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. రాష్ట్ర స్థాయిలో ఈ దేవాలయము ప్రాముఖ్యత వహించే స్థాయికి ఎదుగుతున్నది.

శ్రీ భద్రకాళి భద్రత కలిగించు దేవతయని ఆకారణంగానే ఈమెకు భగవతి భద్రతిగా ఇచ్చట పిలిచినందున ఆ పేరుతో ప్రసిద్ధమైట్లుగా చెప్పబడు తున్నది. కాకతీయ రుద్రమదేవి ఏకవీరాదేవిని కొలిచి నట్లు ఆధారలున్నవి. ఏకవీరాదేవితోపాటు శ్రీభద్రకాళీ దేవిని శ్రీపద్మాక్షీదేవిని పూజించి శతృవినాశనము చేసినట్లు తెలిపే ఆధారములు స్థానిక చరిత్రవల్ల తెలుస్తున్నవి.

అంతేకాక, ప్రతాపరుద్రుడు ఈయన మంత్రులు శాఖావల్లి మల్లిఖార్జునభట్టు, హరిమాత్రుడు ఈ అమ్మవారి అనుగ్రహం పొందిరని, ఈ హరి మాత్యుడు ఆలయ నిర్మాణం చేయుటయే కాక భక్తుల సౌకర్యము నకు ధర్మశాలల నిర్మాణము, త్రాగే నీటికై ఆలయము ప్రక్కనే విశాలమైన చెరువును నిర్మించినట్లు తెలిపే ఆధారాలున్నవి. ఆలయములో ఈ మంత్రిని గురించి తెలిపే కొంత శాసన భాగము ఆలయ స్థంభముపైనున్నది.

ఋషులు, సిద్ధులు, దేవత కోరికపై ఆ కొండపై నున్న పద్మ కోశ పీఠముపై ఈమె స్వయం వ్యక్తమై నట్లుగా స్థానిక చరిత్రవలన తెలుస్తున్నది. శ్రీ భద్ర కాళీ దేవిని ఎందరో భక్తులు, ఉపాసకులు, రాజులు మహ రాజులు, మంత్రులు వారి కుటుంబ సభ్యులు భక్తి శ్రద్ధలతో పూజించి తమ కోర్కెలను సాఫల్యము చేసుకున్నారు. ఈ అమ్మవారిని మోక్షకారిణి అని నమ్ముతారు భక్తులు. ఎందరో తమ అనుభవాలు తమకు వచ్చిన కష్టాలను తొలగించి బిడ్డలవలె ఆదరించి కాపాడుతుందని మరి కొందరు భక్తులు నమ్ముతున్నారు.

ఈ దేవి విగ్రహము తొమ్మిది అడుగులు పొడుగు అంతే వెడల్పు ఉన్నది అష్ట భుజములతో, వివిధ ఆయుధములను ధరించి ఉన్నది.

ఈ ఆలయము వరంగల్లునుండి హనుమ కొండకు వెళ్ళే రహదారిలో ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాలకు వెనుకగా అర కి॥మీ॥ దూరములోనున్న కొండ పై నున్నది. రహదారిపై ఆర్చిగేటు అందముగా నిర్మించినారు.

ఈ దేవి ఎప్పుడు స్వయం వ్యక్తమైనదో తెలిసికొనుటకు సరియైన ఆధారములు లభ్యమగుట లేదు. మొదట ఆలయ నిర్మాణం ఎవరు చేసారో కూడా తెలిపెడి ఆధారములేవి లేవు. కొలను పాకకు చెందిన "రేణుక సిద్ధుడ"నెడి ముని సుమారు మూడు వేల సంవత్సరాలకు పూర్వము హనుమకొండలోని శ్రీ సిద్ధేశ్వర ఆలయములో తపస్సు చేసెనని అప్పటికే శ్రీ పద్మాక్షీ దేవి శ్రీ భద్రకాళీదేవి గుడులు ఉన్నట్లుగా శ్రీ సిద్ధేశ్వర చరిత్రవలన తెలుస్తున్నది. చాళుక్య చక్రవర్తి ఈ దేవతను పూజించి అర్ధ సిద్ధిపొందినట్లు తెలియు చున్నది.

కాకతీయ ప్రోలరాజు తన రాజధానిని హన్మకొండ నుండి ఓరుగల్లు కోటకుమార్చు సమయమున రాజ్య భద్రతకై ఈ తల్లి దీవెనలందినటుల, ఆమెను భక్తితో సేవించినట్లు జంతు బలులు జరిపించి నట్లు చెప్పబడుతున్నది.

ఈమె ఆత్మ జ్ఞానమును, శుభములను ప్రసాదించే మహాశక్తి, దేవియని దేవీ ఉపాసకులే కాక ఎందరో భక్తులు నమ్ముచూ సేవిస్తున్నారు.

విజయనగర సామ్రాజ్య స్థాపనకు ముందు వరంగల్లులోని శ్రీభద్రకాళీదేవి ఆలయములో శాస్త్రీయ పద్ధతిలో పూజలు జరిగినవి. తరువాత శ్రీ విద్యారణ్య స్వామి వంటి వారి ఆదేశముతో ప్రదక్షణాచార సంప్రదాయము ననుసరించబడుచున్నది.

మతోన్మాదుల దౌష్ట్యమునకు గురియై కొంత కాలము ఈ దేవాలయము మరుగున పడినది. ఎవరూ పట్టించుకొనలేదు. ఆలయ ప్రాంతమంతయు చెట్లు పెరిగి అడవిగా ఉండెడిది. విషసర్పాలు సంచరించెడివి. పగలు కూడా ఆ వైపు పోయేందుకు సాహసించేవారు కాదు. 1950 సం॥ వరకు ఈ స్థితి ఉండెడిది.

తరువాత ఈ దేవి సేవకు తనను తాను అర్పించుకొని, శ్రీ బి.ఎస్. గణేశ్వర రావు అనే భక్త శిఖామణి కృషి, పట్టుదల కారణంగా వరంగల్లులోని భక్తులు క్రమ క్రమంగా రావడం ప్రారంభించినారు. ఆలయ పునరుద్ధరణ కార్యక్రమంలు 1950 సం॥ జూలై నెలలో నిర్విఘ్నముగా కొనసాగినవి.

తరువాత ఎందరో మహానుభావుల కృషి ఫలితముగా అమ్మవారి పాదము వద్ద తిరిగి శ్రీ చక్రమును ప్రతిష్ఠించిరి. భీకరముగానున్న అమ్మవారి రూపమును సరిచేసి సౌమ్యమూర్తిగా తీర్చిదిద్ది భక్తులకు వర ప్రదానము చేయు మాతృమూర్తిగ మర్చారు. ఈ మహత్తర కార్యక్రమునకు ఎందరో పండితులు, మంత్ర, తంత్ర వేత్తలు తీవ్రకృషి ఫలితముగా అనగా వారు జరిపిన జప, హెూమ, యజ్ఞ, కృతువులును చేయడంచే ఆ దేవతలో పూర్వ శక్తులన్నీ జాగృతమై, కొలిచే భక్తుల కష్టములు తీర్చు తల్లిగా ఈ అమ్మవారి ఖ్యాతి దినదిన ప్రవర్ధమానమగుచున్నది.

ఈ ఆలయమందు పంచకాలములలోను శాస్త్రీయంగా నియమబద్ధంగా పూజలు జరిపించుచున్నారు.

ఈమెను దర్శించుటకై రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా తమిళనాడు, మధ్య ప్రదేశ్, కర్నాటక మొదలగు రాష్ట్రములనుండి భక్తులు రావడం కనిపించుచున్నది.

ఆలయ అభివృద్ధికి ఎంతో కృషి జరిగినది. ఇంకనూ జరుగుచున్నది.

ఈ దేవతకు ప్రతి సంవత్సరము ఆషాడ శుద్ధ పౌర్ణమినుండి తొమ్మిది రోజులు శాకంబరీ ఉత్సవములు, నవరాత్రులు ఎంతో వైభవముగా జరుగుచున్నవి. ఆషాఢ మాసమున కురిసే తొలకరిలో మొలకెత్తిన మొక్కలు పెరిగి అధిక ఫలితమివ్వాలని అందరినీ ఆదేవి కరుణించి సుఖ, శాంతులు ప్రసాదించా

లని తొమ్మిది రోజులలో అమ్మవారిని రోజుకొక కళ వచ్చేటట్లు అలంకరించి, వివిధ రకముల కాయ కూరలు, ఆకుకూరలతో పెద్దదండను ఆమెను అలంక రిస్తారు. ఎన్నో అభివృద్ధి కార్యక్రమములు జరుగు చున్నవి. ఎల్లరూ శ్రీ భద్రకాళి అమ్మవారి దయకు పాత్రులగుదురు గాక.

## శ్రీ సమ్మక్క సారలమ్మ జాతర : మేడారం.

శ్రీ సమ్మక్క , సారలమ్మ జాతర మేడారం (మండలం తాడువాయి) వరంగల్‌కు ఈసాన్య దిక్కున 110 కి।మీ। దూరమున కలదు.

పదవ శతాబ్దంలో కోయ రాజుల నివాస స్థలం మేడారం. దట్టమైన అడవి ప్రాంతమిది. సూర్యుని కిరణాలు కూడా సోకని ప్రదేశమిది. పవిత్ర గోదావరీ నదీ తీరాన కనుల కింపయిన ప్రకృతి శోభతో అల రారుతున్నది. కోయదొరలు ఒకనాడు దట్టమైన అడవి లోపలకు వేటకు వెళ్ళగా, నమ్మలేని దృశ్యంగా పెద్ద పులుల కాపలా మధ్య దేదీప్యమానంగా వెలుగుతూ బహు అందమైన పసిపాప వారికి కనిపించింది.

కోయదొరలు ఆ దృశ్యం చూచి సంభ్రమాశ్చ ర్యాలకు గురి అయి తమ గూడెంలోని పెద్దలను రప్పించి మేళ, తాళాలతో పల్లకిలో ఆ పాపను తమ గ్రామానికి తీసుకుని వెళ్ళారు. గద్దె పందిళ్ళు వేసి కొండ దేవతను కొలవడం ప్రారంభించారు. ఆ పసి పాప వచ్చిన రోజునుంచి గ్రామాల వారికి అన్నీ శుభాలే జరగసాగాయి.

అడవిలోని విష సర్పాలు, క్రూర జంతువులు గుంపులు గుంపులుగా వచ్చి గద్దె చుట్టూ ప్రదక్షణ చేయసాగాయి. వీటిని చూసి కోయదొరలు సాక్షాత్తు కొండ దేవతే పాప రూపంలో అవతరించినదని నమ్మారు.

ఆ మాఘశుద్ధ పౌర్ణమినాడు ఆచిన్నారికి "సమ్మక్క" అని పేరు పెట్టాడు. అడవిలో పూలతో ఆడడం, క్రూర సర్పాలను మెడలో ఆభరణాలుగా వేసుకోవడం, పులులుపై స్వారీ చేయడం మొదలగు ఎన్నో సాహసకృత్యాలు చేయడం. దీర్ఘ రోగాలను బాగు చేయడం, వృద్ధులకు సాయపడడం, మృతులను బ్రతికించడం, సంతానం లేనివారికి సంతాన్నను గ్రహించడం వంటి ఎన్నో అతీత శక్తి, మహిమల వల్ల ఆమె కీర్తి నలుదిశల వ్యాపించింది. ఆమె యుక్త వయసులో కరీంనగర్ రాజ్యాన్ని పరిపాలించే కోయ చక్రవర్తి శ్రీ మేడరాజు మేనల్లుడు పగిడిద్ద రాజుతో వివాహ్మైనది. వారికి సారలమ్మ, నాగులమ్మ, జంపన్నలు జన్మించారు.

ఈ మేడారం పరగణాను పరిపాలించే కోయ రాజులు కాకతీయ సామ్రాట్టులకు సామంతులుగా యుండెడివారు. ప్రతాపరుద్రుని కాలమునాటికి అల నాటి "కరినగరము" నేటి కరీంనగర్ రాజధానిగా చేసికొని కోయచక్రవర్తి మేడరాజు పరిపాలించు చుండగా కాకతీయ సామంతునిగా గిరిజనమేడారం పడిగిద్ద రాజు వశమైనది. ఆయన పరిపాలన సమయమున వరసగా నాలుగు సం।లు ఆ ప్రాంతమున అనావృష్టి ఏర్పడి పంటలు పండక ప్రజలు ఇబ్బందు లలో పన్నులు కట్టలేని స్థితికి వచ్చారు. ఈ పరిస్థితుల ప్రభావము వలన రాజు కాకతీయ ప్రభువులకు కప్పము చెలించ నిరాకరించెను. అప్పుడు ప్రతాపరుద్ర చక్రవర్తి ఈ గిరిజన ప్రభువును అణిచి వేయుటకు ప్రధాన మంత్రి యుగంధర్ సారథ్యంలో సైన్యాన్ని ఈ ప్రాంతమునకు పంపెను. కోయ సేనలకు కాకతీయ సైన్యాలకు సంపంగి వాగు వద్ద భయంకర పోరాటం జరిగెను. యుద్ధము నందు నిపుణులైన కాకతీయ సైన్యాల ధాటికి కోయసేనలు నిలువలేకపోయారు. పగిడిద్ద రాజు, అతని కుమార్తెలు నాగులమ్మ,

సారలమ్మ, అల్లుడు గోవిందరాజు యుద్ధ రంగమున వీర మరణం పొందారు. కాకతీయ సేనలు మేడారంలో ప్రవేశించకుండా అడ్డుకునేందుకు నియమించబడిన కుమారుడు జంపన్న పరాజయానికి సహించలేక సంపెంగ వాగులో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. నాటి నుంచి సంపెంగ వాగు "జంపన్నవాగు" గా ప్రసిద్ధి చెందింది. ఓటమితో వెనుదిరిగిన కోయ సైన్యాల మహిళలకు భృతి కల్పించాలని రాణి సమ్మక్కను వేడుకున్నారు.

అందుకు సమ్మక్క తిరస్కరించి స్వయంగా యుద్ధానికి తలపడింది. పరాశక్తి అవతారమైన సమ్మక్క అపర కాళిలా కాకతీయ సైన్యాలను అంతం చేస్తున్నది. ఎక్కడ చూసిన ఛండిలా వీర విహారం చేసే సమ్మక్కను చూసి ఇక ఓటమి తప్పదని భావించిన కాకతీయ సైనికుడొకడు దొంగచాటుగావెనుకనుంచిసమ్మక్కను బల్లెంతో పొడిచాడు. ఆమె వెంటనే యుద్ధ భూమి నుంచి వైదొలిగి మేడారంకు ఈశాన్యంగా చిలకలగట్టు త్రోవన వెళ్ళింది. కొందరు కోయ సైనికులు ఆమెను అనుసరించారు. కాని సమ్మక్క గట్టు మలుపు తిరిగిన తరువాత కనిపించలేదు. అదృశ్యమైనది. నెమలినార చెట్టువద్ద పుట్ట దగ్గర, ఒక పసుపు కుంకుమ భరిణె వారికి లభించింది. అది సమ్మక్క గుర్తుగా భావించిన కోయదొరలు నిద్ర, ఆహారాలు మాని ఆమె తిరిగి వస్తుందని ఆశగా చూసారు. ఆమె ఎప్పటికీ తిరిగి రానందున అప్పటి నుంచి మాఘ శుద్ధ పౌర్ణమి రోజున ప్రతిరెండు సంవత్సరాల కొకసారి కుంకుమ భరిణె లభించిన చోట ముత్తైదువుల పండుగ జరుపబడు చున్నది.

జాతర మొదటి బయ్యక్కపేట గ్రామంలో శ్రీ చందాపద్మయ్యచే జరుపబడినది. అట్టి జాతరను తిరిగి మేడారం గ్రామంలో పూజలు జరిపించిన తరువాత రెండు సంవత్సరముల కొకసారి. అతి వైభవోపేత ముగా జరుపబడుచున్నది. జాతర సమయములో శివ భక్తుల పూనకాలు ఉత్కంఠను కలిగిస్తాయి. సంతానం లేని వేలాది మంది, స్త్రీలు సమ్మక్క సారలమ్మ గద్దెల చుట్టు వరాలు పడతారు.

కోరికలీడేరిన భక్తులు ఈ ఉత్సవ సమయ ములో అమ్మవారి గద్దెలు దర్శించి ధన రూపేణా మరియు, వెండి బంగారు వస్తురూపేణా మొక్కు బడులు మరియు కోడెదూడలు అమ్మవారికి సమర్పిస్తారు.

ఇచ్చట ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి నిర్వహించుచున్నారు.

ఎంతో వైభవోపేతంగా నిర్వహింపబడుచున్న ఈ జాతర హైందవ సంస్కృతిలో ఒక ప్రత్యేకతకు ప్రతీకగా అత్యంత వైభవోపేతముగా నిలిచిపోవు చున్నది.

ఎంతో అభివృద్ధిని సాధిస్తున్నదీ ప్రాంతము.

**సహస్ర స్థంబ మంటపము : రుద్రేశ్వరాలయము**

హనుమకొండలోని సహస్రస్థంబ దేవాలయము చూడదగ్గది. రుద్ర దేవుడు ఈ ఆలయాన్ని 1163లో కట్టించాడు. నక్షత్రాకారములో నున్న ఈ ఆలయములో శ్రీ సూర్య, విష్ణు, మహేశ్వరులకు గర్భాలయాలు నిర్మింపబడినవి. వాటి మధ్యలోనున్న మంటపం పైకప్పు లోపలి భాగంలో నవగ్రహా లున్నాయి. ఈ దేవాలయ శిల్ప చాతుర్యము చూసి తీరవలసిదే.

ప్రధానాలయమున కెదురుగ నున్న శిథిలమైన మంటపమునకు మధ్యలో నున్న నంది విగ్రహము చూడదగ్గది. నందీశ్వరుని మెడలో మువ్వలదండ గమనించిన ఆ విగ్రహాలను మలచిన శిల్పి దైవాంశ సంభూతుడని గ్రహించ వచ్చును. ఆ శిల్పి చరితార్థుడై నాడు. ఆతని జీవితము కడు ధన్యము కదా! ఆచ్చటి

ఆలయములోని దేవుడు శ్రీ రుద్రేశ్వరుడు. ఈ దేవాలయ ప్రాంతమిప్పుడు పురావస్తు శాఖవారి ఆధీనములోనున్నను ఇచ్చట నిత్య పూజలు, దీప, ధూప నైవేద్యములు విధిగా జరుగుచున్నవి.

ఒక మీటరు ఎత్తైన అధిష్టానముపై ఈ ఆలయము శిల్ప నైపుణ్యము జగత్ప్రసిద్ధమైనది.

ఇచటి రమణీయ కుడ్య స్థంభములు కాకతీయ శిల్పము శోభాయమానముగా నుండి ప్రత్యేక శిల్ప శైలి కలిగియున్నవి. కాకతీయరుద్రుని శాసనమిచట నున్నది.

## శ్రీ మల్లిఖార్జున స్వామి దేవస్థానము : అయినవోలు

శ్రీ మల్లిఖార్జున స్వామి దేవాలయము అయిన వోలు గ్రామమున కాకతీయులు కాలమున నిర్మింప బడినది. నలువైపులా కాకతీయ ద్వారములు అత్యంత సుందరముగ నున్నవి. వరంగల్ పట్టణమునకు సుమారు 20 కి|మీ| దూరమున ఉన్నదీ క్షేత్రము వరంగల్ స్టేషన్ నుండి అయినవోలు దేవాలయము వరకు బస్సు సౌకర్యమున్నది. ఈ జిల్లాలోని ప్రసిద్ధ శైవ క్షేత్రములో పేర్కొనదినదీ క్షేత్రము.

శ్రీ మల్లిఖార్జునుడు మల్లన్నగా, కండెలు రాయునిగా ప్రసిద్ధి కెక్కియున్నాడు. కండెలరాయని కిరువైపులా ఇద్దరకు దేవేరులున్నారు. ఎడమ వైపున మేడలమ్మ కుడివైపున కేతలమ్మల విగ్రహములుకలవు. యాదవులు, బలిజలు, కురుమలు తమ ఇలవేల్పుగా కొలుస్తారీ స్వామిని ఈ విగ్రహములకు ముందున్న లింగమే మూలవిరాట్ ఈ లింగము అర్థపానవట్టముతో యున్నది. ఇది గొప్ప విశేషమిచ్చట.

ఆలయప్రాంగణములో కాకతీయ ప్రభువు అనపోత రాయుడు ఈ దేవుని ఎంతో భక్తి శ్రద్దలతో పూజించేవాడని, ఆకారణంగా ఎన్నో యుద్ధాలలో విజయలక్ష్మిని పొందినట్లుగా ఒక శిలా శాసనమున్నది. కాకతీయ రాజుల కాలమున మంత్రిగా యున్న అయ్యనమంత్రి ఈ పట్టణమును నిర్మించెనని తెలియుచున్నది. ఈ అయ్యనఓలును ప్రజలిపుడు ఐలోనిగా పిలిచున్నారు.

ఈ దేవాలయమునకు పూర్వము నుండి రెండు కోవలకు చెందిన పూజారులున్నారు. వీరు శివార్చకులు తంబళ్ళు. వీరు ప్రతిరోజు అర్చనలు, అభిషేకములు, నైవేద్యము చేయుచు ఈ క్షేత్రమును దర్శించు భక్తులకు తీర్థ ప్రసాదములిస్తూ, దేవుని దర్శనము లభింప జేస్తున్నారు. మరియు ఉత్సవ సమయములలో ఈ దేవునికి పూజలు చేస్తూ భక్తి శ్రద్దలతో స్వామి వారకి అర్చనలు జరుపుచున్నారు. రెండవ వారు ఒగ్గ పూజారులు. వీరు ప్రతిరోజు తెల్ల వారు జామున గర్భగుడియందు ఢమరుకంతో మల్లన్న దేవుని ప్రార్థించుచు భక్తుల ముఖ్యమొక్కుబడులైన పట్నాలు, బోనాలు వేయించుచు స్వామివారి కళ్యాణము చేస్తూ వారి భాషలో మల్లన్న దేవుని ప్రార్థిస్తు పూజలు జరుపు తారు. దేవునిపై అక్షింతలు వేయించి వారికి కంకణము కట్టి ఒగ్గువారు "జగ్గలు" వాయించుచు భక్తుల ఇంటి పేరు వారి పేరుచెప్పి వారిని ఆశీర్వదించుతారు. మరియు భక్తులు బోనములో వండిన అన్నమును స్వామి వారికి నైవేద్యము పెట్టి ఆ తరువాత వారు బోనములో వండిన పరమాణ్ణమును మరియు తీర్థ మును తీసుకొని భక్తులు స్వామివారిని దర్శించి కృతార్థులగుతున్నారు.

ఈ మల్లన్న దేవుని ఉత్సవములకు వచ్చే భక్త జనుల కోరికలు ఫలించి ఈయన అనుగ్రహమునకు పాత్రులై కోరికలు తీరి సంతోషముతో మ్రొక్కులు చెల్లిస్తారు. కోరికలు ఫలిస్తే కోడెలు కడతారు. గండం తొలగితే గండదీపం పెడతారు. కష్టాలు తొలగితే గడప కడిగి కానుకలు పెడతారు. ఆపదలు తొలగితే

అభిషేకములు, అన్నపూజలు చేస్తారు. పుత్ర సంతానము కలిగితే పుట్టువెంట్రుకలు తీయిస్తారు పూజలుచేస్తారు, సేవలు చేస్తారు. ఈయనను అందుకే ప్రత్యక్ష దైవముగా పూజిస్తూ, ప్రతి సంవత్సరము సంక్రాంతి నుండి సంవత్సరాదివరకు గొప్ప ఉత్సవాలు జాతరలు జరుపుతారు. ఎంతో అభివృద్ధిని సాధిస్తున్నదీ క్షేత్రము.

## శ్రీ గట్టా మల్లన్న (మల్లిఖార్జున) స్వామి దేవస్థానము: మల్లికుదుర్ల

వరంగల్ జిల్లా మల్లికుదుర్ల గ్రామమునందు వెలసిన శ్రీ ఘట్టా మల్లన్న క్షేత్రము కాకతీయుల కాలమున ఎంతో వైభవముగ నిర్వహింపబడుచుండె డిది ఈ స్వామి గట్టుపై స్వయంభూ లింగాకారముగా వెలసి ఎందరో మునులచేత పూజింపబడిన దైవముగా ఎన్నో నిదర్శనములో ఇచ్చట విలసిల్లుచున్నాడు. యాదవ సంప్రదాయమునకు చెందిన ఈ దేవాలయ మునకు దగ్గరగానున్న ప్రసిద్ధి చెందిన కోనేటియందు భక్తులు స్నానము చేసి కోరిన కోర్కెలు నెరవేర్చుటకై స్వామిని పూజించుట ఆచారమైనది. ఈ స్వామికి జాతర ప్రతి సంవత్సరము సంక్రాంతి నుండి ఉగాది వరకు ప్రతి ఆది, బుధవారములలో జరుగుచున్నది.

## శ్రీ బుగులు వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానము : చిలుపూరు కొండ(గుట్ట).

ఈ దేవస్థానము చిలుపూరు గ్రామమున వరంగల్ జిల్లా (ఘనాపూర్ మండలము) లోనున్న ప్రసిద్ధ వైష్ణవాలయము ఈ స్వామి శ్రీ బుగులు వేంకటేశ్వర స్వామిగా ప్రసిద్ధులు ఈ దేవాలయము తొమ్మిదవ శతాబ్దమునకు చెందినదని పురాతత్వ పరిశోదనలు వలన తెలియుచున్నది.

శ్రీ వేంంటేశ్వరస్వామి పద్మావతీదేవిని పరిణయమాడిన పిదప కుబేరునివలను ఋణ బాధను తప్పించు కొనుటకు తిరుమల విడిచి పద్మావతి సహితుడై ఈ క్షేత్రమునకు వచ్చి ఇచ్చటి కొండపై గడిపెనట. అందువలననే ఈయనకు శ్రీ బుగులు వేంకటేశ్వర స్వామిగా వేంకటేశ్వరస్వామిగా ప్రసిద్ధి చెంది యున్నారు. ఇచ్చట ఈ స్వామి పద్మావతీ దేవితో కూడా వెలిసియున్నారు. వారి "శ్రీపాదము" ఒక పెద్ద బండపై వెలసినది. దీనినే పెద్దగుండు అంటారు ఇచ్చటివారు. తరువాత ఈ గుండుపై దేవాలయము నిర్మించబడినది. ఈయన స్వయం భూగుహలో ఆవిర్భవించిన శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తూ ఈ గుట్టపై పదునెనిమిది మంది ఆళ్వారు లున్నారు. శ్రీవేంకటేశ్వరస్వామి ఇచ్చట శేష శయనుడుగా నుండుట ఇచ్చటి ప్రత్యేకత.

## శ్రీ సోమేశ్వర లక్ష్మి నరసింహ స్వామి దేవస్థానం : పాలకుర్తి

ఈ క్షేత్రము పాలకుర్తి గ్రామ పొలిమేరలో గల చిన్నగుట్టపైనున్నది. ఈ గుట్టపైనున్న రెండు గుహ లలో శ్రీ సోమేశ్వరుడు మరియు శ్రీనరసింహస్వామి స్వయంభువులుగా వెలసి యున్నారు.

కాకతీయుల కాలములో వెలిసిన గొప్ప హరి హర క్షేత్రమిది. ప్రదక్షణ చేయుటకు ఈ క్షేత్రాన చేసిన ఏర్పాటు అనగా, అద్వైతసిద్ధాంతమును భగవంతుడొక్కడేయని తెలియజేస్తున్నది. ఇచ్చటి పవిత్రతను తేనెటీగలు అన్ని కాలాలలోను కాపాడు తుండుట విశేషము.

ఎంతో చారిత్రక ప్రసిద్ధి కలిగిన ఈ క్షేత్రము ప్రఖ్యాతి కలిగిన కవి పాల్కురికిసోమనాథుని జన్మ స్థలమిది. ఈయనచే రచింపబడిన బసవపురాణము మరియు పండితారాధ్య చరిత్రము ప్రఖ్యాతి పొందినవి. ఇచ్చటనే భక్త శిఖామణి భాగవతమును తెలుగున రచించిన బమ్మెర పోతనామాత్యుడు తన బాల్యమును భక్తి శ్రద్ధలతో ఈ దేవుని సేవిస్తూ గడిపినట్లు ప్రతీతి. భక్త పోతన జన్మ స్థలము ప్రసిద్ధి కెక్కిన "బమ్మెర ఇచ్చటికి సుమారు ఒక కి.మీ. దూరమున నున్నది. అందువలన ఈ క్షేత్రము ఎంతో దర్శనీయమైనది.



# హైదరాబాద్ జిల్లా

**శ్రీ ఉజ్జయిని మహాకాళి దేవస్థానము - సికింద్రాబాదు.**

1813వసంIలో మిలటరీలో పనిచేస్తుండేవారు, శ్రీ సూరటి అప్పయ్యగారు. ఈయనకు మధ్య ప్రదేశ్ లోని ఉజ్జయినికి బదిలీ అయింది అక్కడకు వెళ్ళారా యన. బదిలీయై ఆయన వెళ్ళిన కొన్ని రోజులకు అక్కడ కలరావ్యాధి ప్రబలి చాలామంది మరణించారు. ఆ సమయంలో శ్రీ అప్పయ్యగారు తన అనుచరులతో కలసి ఉజ్జయినిలోని మహాకాళిని దర్శించి ప్రజలను కలరావ్యాధి నుంచి కాపాడమని పరిస్థితి అనుకూలించగానే సికింద్రాబాద్‌లో నీ విగ్రహ ప్రతిష్ఠ చేయించి ఆలయ నిర్మాణము చేసి నిన్ను సేవించుకుంటామని ప్రార్థించగా కలరా వ్యాధినుండి అనేక వేలమంది రక్షింపబడిరి. తదుపరి తాను మాట ఇచ్చిన ప్రకారము శ్రీ సూరటి అప్పయ్యగారు, వారి అనుచరులు సికింద్రాబాద్‌కు తిరిగి వచ్చిన తదుపరి 1815 సంIలో ఇప్పుడు అమ్మవారున్నచోట కట్టెతో అమ్మవారి విగ్రహము చేయించి ప్రతిష్ఠ చేయించిరి. నిత్య పూజలు జరిపించే ఏర్పాట్లు చేసారాయన అమ్మవారికి శ్రీ ఉజ్జయిని మహాకాళి అని నామకరణం చేసిరి. పూర్వము ఈ ప్రాంతమంతము చెట్లు,చేమలు, కొండరాయి మొదలగు వాటితో నిండి యుండెడిదని ప్రతీతి. సమీపమున ఒక పెద్ద బావి ఉండెడిదట. ఆ బావిని మరమ్మత్తు చేస్తున్న సమయమున శ్రీ మాణిక్యాల దేవి విగ్రహము దొరికెను. అదియే ఇప్పుడు గర్భాలయము నందు కుడివైపున కలదు. శ్రీ మాణిక్యాల అమ్మవారి కోరికను అనుసరించి శ్రీ మహాకాళి అమ్మవారి ప్రక్కన ప్రతిష్ఠ చేయుట జరగినది.

శ్రీ అప్పయ్యగారు 1854వ సంIన కట్టెతో నున్న విగ్రహమును తీసివేసి ఇప్పుడున్న మహా కాళి మాణిక్యాల దేవిల అమ్మవార్ల విగ్రహములను శాస్త్రీయముగ ప్రతిష్ఠ చేసి ఆలయాన్ని నిర్మించి నాటి నుండి ఈనాటివరకు శాస్త్రోక్తముగా పూజలు జరిపించుట జరుగుచున్నది. 1953 నుండి దేవాదాయ శాఖ పర్యవేక్షణలో ఈ ఆలయము నిర్వహించబడుచున్నది.

1971వ సంIలో అమ్మవారి ఆలయ జీర్ణోద్ధరణ కార్యక్రమము చేపట్టి గర్భాలయము, మహామండపము, విమాన గోపురము మొI నిర్మాణములు జరిపించి 1980లో పూర్తిచేసి మహాకుంభాభిషేక కార్యక్రమమును పూర్తి చేసిరి. దక్షణాది నుండి అనుభవజ్ఞ లయిన శిల్పులను రప్పించి జీర్ణో ద్ధరణ కార్యక్రమము జరిపించిరి. ఇందుకు తిరుమల తిరుపతి దేవస్థానము,

వేములవాడ, యాదగిరిగుట్ట దేవస్థానములు, సహా యముతోను భక్తుల విరాణముతోను ఈ కార్యక్రమ మును సుమారు తొమ్మిది లక్షల రూపాయల వ్యయముతో పూర్తిచేయుట జరిగినది.

అమ్మవారి గర్భాలయ ద్వారమునకు వెండి తొడిగించి రెండు ద్వారములపై అమ్మవారి అవతార ములను వెండితో తయారు చేయించి మార్చే కార్య క్రమము చేపట్టుట జరిగినవి.

శాశ్వత నిత్య ప్రసాద వినియోగ విధాన ఉభయము శాశ్వత మధ్యహ్న పూజా విధానము. దేవస్థానము వారు అమలు చేయుచున్నారు.

### శ్రీ వేంకటేశ్వర దేవస్థానం : చిక్కడపల్లి.

ఈ జిల్లాలో పేర్కొనదగ్గ దేవాలయము చిక్కడపల్లిలో వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వరుని దివ్యధామము ఎంతో దర్శనీయమై భక్తజన సందోహ విశేషములతో నిత్య నూతన వైభవముగా అలరారు చున్నది.

ఎంతో ప్రసిద్ధి చెందుచున్న ఈ దేవాలయము చేరుటకు కోఠీ నుంచి ఎన్నో బస్సులు చిక్కడపల్లి చేరుకొనుటకు కలవు. నగర నలుమూలలనుంచే కాక జిల్లాల నుంచి హైదరాబాద్ సందర్శించు భక్తులు ఇక్కడకు వచ్చి స్వామిని సేవించి మ్రొక్కుబడులు చెల్లించి తృప్తులగుచున్నారు.

వధాన్యుడు కీ।శే గుడిదేవుని జంగయ్య ఎన్నో సంవత్సరాలక్రిందట నిర్మించినాడు. నేడు ఈ పవిత్ర దేవాలయము మన రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ శాఖవారి ఆధీనములోకి వచ్చినది. ప్రథమ శ్రేణి దేవాల యముగా దిన దిన ప్రవర్థమానమగుచున్నది.

ఇచ్చట మూలవిరాట్ శ్రీ వేంకటేశ్వర స్వామి. వారి దేవేరి పద్మావతీ దేవి కూడా ఇచ్చట వేంచేసి యున్నది. ఈ వేల్పుల దొరలకు ప్రత్యేకముగా గుడులు నిర్మింపబడినవి. పరమ శివుడు కూడా ఇచ్చట నెలకొని యుండుటచే ఈ క్షేత్రము హరిహరులకిరవై భక్త జన సందోహములకు కన్నుపండగవుచున్నది. ముఖ మండపానికి ముందుగా నవగ్రహ స్థాపన జరిగి ఈ దేవాలయము సమగ్రతను సంతరించుకున్నది.

మరియు ఇచ్చట పన్నెండు మంది ఆళ్వార్ల ప్రత్యేక మందిరములో ప్రతిష్ఠంపబడుటచే ఈ క్షేత్ర రాజము దివ్య స్థలమై వెలుగొందుచున్నది.

ఈ క్షేత్రము బ్రహ్మోత్సవ వేడుకలు అత్యంత వైభవముగా జరుపబడచూ దివ్య తిరుపతిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. వైశాఖ శుద్ధ చతుర్థశి నుంచి బహుళ సప్తమి వరకు జరుగు ఈ ఉత్సవముల వైభవము తిలకించుట ఈ ప్రాంత భక్త జనుల కొకానొక దివ్యా నుభూతిగా ఉంటూ ఈ స్వామి ఆ భక్తుల అంతరంగ మున నిత్య నూతనముగా వెలుగొందుచున్నాడు.

ఇచ్చట జరుగు పాలాభిషేకములు ఎంతో ప్రత్యేకతను కలిగి ప్రాముఖ్యము వహిస్తున్నవి. ప్రతి శుక్రవారం ఈ క్షీరాభిషేకాలు జరిపించుకోవడానికి తిలకించడానికి ఎందరో భక్తులు లెక్కకు మిక్కుట ముగా వచ్చుట చూడవలసినదే. దేవాలయ ప్రాంగణము ఈ భక్తజన సందోహములతో కిటకిట లాడుచు ప్రతి ఒక్కరి వదనములయందు భక్తిరస భావము దృగ్గో చరమవుచున్నది.

ఈ దేవాలయము "తనేహల" సాంప్రదాయ మునకు చెందినది. శ్రీ వేంకటేశ్వరుని దర్శించు భక్తజనులు తమ కోర్కెలను తీర్చుకొని తృప్తులగుట గమనించ వచ్చును.

### శ్రీ సీతారామచంద్ర మూర్తి దేవాలయము : సీతారాంబాగ్

హైదరాబాద్ లో సీతారాంబాగ్‌లో వెలసి యున్న శ్రీ సీతారాముల దేవాలయం ఎంతో ప్రాము ఖ్యం చెందినది. సుమారు ఐదు ఎకరముల భూప్రాంగ ణములో సువిశాలముగా నున్న ప్రాకార మండపాదు లతో నెలకొనియున్న ఈ దేవాలయము క్రీ।శే 1850 ప్రాంతమున ప్రతిష్ఠింపబడినట్లు తెలియుచున్నది.

శ్రీ అశోక్ పూర్ణమల్ వంశస్థులు ఈ దేవాలయము నిర్మించినట్లు ఇప్పటికీ వంశపారంపర్య ధర్మకర్త శ్రీ లక్ష్మినివాస్ గనేరివాలా తెలియజేసారు.

పాంచరాత్ర ఆగమ నిర్దేశిత పూజా విధానముతో కంచి శ్రీరంగము నుంచి వచ్చిన పదిమంది పూజారుల పర్యవేక్షణలో నిత్య పూజాదికము నిర్వహిస్తున్నారిక్కడ. పూజలు మూడు పూటలా జరుపుచు తీర్థ ప్రసాదములు నైవేద్యములుగా నాలుగు పర్యాయములిచ్చుట జరుపుచున్నారు.

ఇచ్చట శ్రీ సీతారామ చంద్ర మూర్తులే కాక శ్రీ వరదరాజ సన్నిధికూడ కలదు. శ్రీ లక్ష్మీ గోదాంబ ఆండాల్, మరియు ఆళ్వార్లు శ్రీ రామానుజమూర్తులు కూడ ఉన్నవి. తెంగలై (వైష్ణవ) ప్రత్యేక సంప్రదాయ సిద్ధముగ ఇచ్చట పూజాధికములు నిర్వహిస్తూ దేవాలయ ప్రతిష్ఠ ఇనుమడింపజేస్తున్నారు. వైకుంఠ, ఏకాదశికి బ్రహ్మోత్సవము జరిపిస్తారిచ్చట శ్రీ రామనవమి జన్మాష్టమి మరియు నరసింగ చతుర్థశికిచ్చట విశేష పూజలు జరిపిస్తున్నారు. ప్రతి రోజు వేదపారాయణ నాలాయర ప్రబంధం పఠిస్తు న్నారిచట.

ఎంతో దర్శనీయముగా నున్న ఈ దేవాలయము ప్రత్యేక పద్ధతిలో నిర్వహింపబడుతూ ఎంతో విలక్షణంగా ఉన్నదీ దేవాలయం.

అవశ్య దర్శనీయమయిన ఈ ఆలయాన్ని భక్తులు పర్యాటకుల దర్శించి ఎంతో తృప్తి చెందుచున్నారు.

## శ్రీ గణపతి దేవాలయము : సికింద్రాబాద్

జంట నగరములలో ప్రఖ్యాతి గాంచిన మరియొక దేవాలయము శ్రీ గణేశ్ దేవాలయము సికింద్రాబాద్ రైల్వే స్టేషను కుడివైపున కలదు. రైల్వే స్టేషనుకు ప్రక్కనేగల ఈ దేవాలయమెంతో ప్రఖ్యాతి గాంచి ఎందరో భక్త జనులుకు అమితాకర్షణగా యున్నది. స్టేషనుకు ప్రక్కగానుండి ఎంతో అందుబాటులో వుండుట గూడా ఇట్టి ప్రసిద్ధికొక కారణమై యుండ వచ్చును.

సుమారు రెండు వందల సం॥ల క్రిందట మద్రాస్ రెజిమెంటుకు సంభందించిన సిపాయిలు ఒక నుయ్యి త్రవ్వుతుండగా శ్రీ గణేశుని ప్రతిమ లభించినది. ఇదియే మూలవిరాట్. ఆనాడే ఆ శిపాయిలు ఒక దేవాలయాన్ని ఏర్పాటు చేసి శ్రీ గణేశుణ్ణి అక్కడ నెలకొల్పారు. ఆనాటినుండి పది, పదిహేను మంది భక్తులతో నుండే ఈ దేవాలయము ఈనాడు వేలాది మంది భక్తులకు ఆరాధ్యదైవమైన శ్రీ గణేశుని సేవించి తరించే భాగ్యము లభించినది. ఎందరో ప్రముఖులు ఈస్వామిని దర్శించుచున్నారు. 1969లో దేవాలయ శాఖ ఆధ్వర్యంలోనికి వచ్చిన ఈ దేవాలయ ఆదాయం సంవత్సరానికి నలభై వేల రూపాలుండగా ఈనాడది సంవత్సరానికి పదమూడు లక్షల రూపాయలకు పెరిగినది.

ఐదుమంది సభ్యులు కల పాలక వర్గం ఏర్పాటయినది. ఇచ్చట వినాయకచవితికి మహా శివరాత్రికి విశేష పూజలు జరుగుచున్నవి. మిక్కుటమైన భక్త జన సందోహంతో ఈ ప్రాంతమంతా ఎంతో వైభవంగానుంటూ బహు ప్రసిద్ధిని చెందుచున్నది. ఇచ్చట శ్రీసిద్ది వినాయకుడే కాకుండా శ్రీ ఉమామహేశ్వరి శ్రీ సుబ్రహ్మణ్య స్వామి శ్రీ హనుమాన్ దేవాలయాలు కూడా ఈ ప్రాంగణముయుందున్నవి. అమ్మవారి నవరాత్రులు కృత్తిక ఎంతో వైభవముగా జరుపుచున్నారు.

ఇటీవల ఇచ్చట శ్రీ సత్యనారాయణ వ్రత మండపం, రజిత ద్వారముల తలుపులు ఏర్పాటు చేసారు.

ఎన్నో సౌకర్యములతో భక్తజన సందోహములను ఆకర్షిస్తున్న ఈ దేవాలయం అత్యంత దర్శనీయముగా యున్నది.

## శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం : దేవుని కుంట, విజయనగర్ కాలనీ.

మన రాజధాని నగరంలో విజయనగరకాలనీ సమీపానగల శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయం

ఎంతో దర్శనీయమైనది. కొండ గుహలో ప్రకృతి సిద్ధమైన పెద్ద బండరాయిని తొలచి నిర్మించబడిన ఈ దివ్య మూర్తిని దర్శించడానికి ఎత్తయిన కొండమీద ఇరుకుగా నుండే దారి వెంట వెళ్ళవలసి ఉంటుంది. ఈ స్వామి మూర్తి అత్యంత ఆకర్షణీయంగా ఉంటూ భక్తుల హృదయాలను ఆకర్షిస్తూ ఉన్నది.

ఈ ఆలయం ఎంతో ప్రాచీనమైనదనితెలుస్తూ యున్నది. గోలుకొండతానీషా ప్రభువు కాలంలో నిర్మించినట్లు స్థానికుల కథనం. కానీ ఇదమిద్ధంగా ఎవరు నిర్మించినది ఎవరిచేత ప్రతిష్ఠించబడినది తెలియకున్నది. అందుకు ఎట్టి ఆధారము కాన వచ్చుట లేదు.

ఈ దేవాలయ స్థల మహాత్మ్యము ఎంతో ప్రాముఖ్య మైనదని స్థానికులు నమ్ముచున్నారు. ఇచ్చట ఒక పాము పుట్ట ఉన్నది. దీనికి దగ్గరలో పురాతనమైన చింత చెట్టు ఉన్నది. శేషాచలంలో చింత చెట్టు క్రింద శ్రీనివాసుడున్నట్లే ఇక్కడ కూడా శిఖరంలో పుట్ట, చెట్టు కూడా ఉండుట ఎంతో చోద్యముగా ఉన్నది.

ఈ నాటికీ నాగేంద్రుడు స్వామిని తన పడగతో పర్యవేక్షించడం కొందరికి కనబడడం ఎంతో అదృష్టంగా భావిస్తున్నారు. కార్తీక మాసంలో నాగుల చవితినాడు పరిసర ప్రాంత భక్త జనులు ఇక్కడ పుట్టలో నాగేంద్రుడికి పాలు పోస్తుంటారు. ఇక్కడనే దేవునికుంట అనే జలాశయమున్నది. ఇది పూర్వము ఋషి నిర్మితమని పరమ పవిత్ర స్థలమని ప్రజల నమ్మిక. అందుకు అనేక నిదర్శనాలు చూపుచున్నారు.

నైజాం పరిపాలనకు పూర్వము ఈ దేవాలయము ఎంతో ప్రాముఖ్యములో ఉన్నట్లు మంచి స్థితిలో ఉన్నట్లు తెలుస్తున్నది.

ఆ స్వామి విగ్రహాలను కొందరు దుండగులు భిన్నము చేయ బూనిపుడు ఏదో ఒక అద్భుత శక్తికి భయపడి పారిపోయినట్లు విగ్రహాన్ని పరిశీలిస్తే బోధ పడుతుంది.

గోల్కొండ నవాబు ఒక భక్తుని సత్కరించే నిమిత్తం ఈ దేవాలయాన్నే కాక పరిసర భూభాగాన్ని పారితోషికం రూపంలో దానం చేసినట్లు తెలుస్తున్నది. ఈ మధ్య కాలంలో ఈ దేవాలయం పూజలు, అర్చనలు లేక మరుగున పడిఉండగా 1960 ప్రాంతంలో స్థానిక పెద్దల సహకారంతో తిరిగి ఈ దేవాలయంలో పూజలు చేసే ఏర్పాటు జరిగినది.

ఈ ప్రాంత ప్రజలు శిథిలమైన గోపుర, మండపాదులను పునర్ నిర్మించ సంకల్పించి శిథిలావస్థలో నున్న గోపుర స్థానంలో మండపాని నిర్మించారు. ఈ ప్రాంత భక్తుల, దాతల సహకారంతో తిరుమల తిరుపతీ దేవాలయ రీతిలో విమాన గోపుర నిర్మాణం జరిపించారు. శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య హస్త కమలాలతో విమాన గోపుర కుంభాభిషేకం 1968 సం॥లో జరిగింది. ధ్వజ స్థంభము కూడా జగద్గురువులచే స్థాపించబడినది.

పూర్వం కొండ అడుగు భాగంలో ఉన్న దేవుని కుంటలో స్నానం చేసి భక్తులు స్వామిని దర్శించుకొని ధన్యులయ్యేవారు. ప్రస్తుతము కొండపై నుంచి నీటి కొళాయిలు టాంకులు ఏర్పాటయినవి. పూర్వం దేవాలయ పరిసరాల్లో ఉండే సువిశాల మైదానంలో రాతి రథం మీద స్వామి వారి ఊరేగింపు జరుగు చుండెడిదట.

స్వామి వారి బ్రహ్మోత్సవాలు, కళ్యాణోత్సవాలు కన్ను పండవుగా జరుగుచున్నవి.

ఈ దేవాలయ పరిసరాల్లో నివసించే భక్తులు దేవాలయ ఉద్ధరణకు అభివృద్ధికీ ఎంతో సేవచేస్తున్నారు. ప్రస్తుతం ఈ దేవాలయం దేవాదాయ శాఖవారి ఆధ్వర్యములో ఉన్నది.

ఈ దేవాలయాన్ని సందర్శించి, స్వామివారిని పూజించి తమ మనోభీష్ఠములను నెరవేర్చుకొనుటకు వేలాదిమంది భక్తులు ఉవ్విళ్ళూరుచున్నారు.



# రంగారెడ్డి జిల్లా

## శ్రీ భవానీ రామలింగేశ్వర స్వామి దేవస్థానం : కీసరగుట్ట

మన ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధి గాంచిన శైవ క్షేత్రాలలో హైదరాబాద్ నగరానికి చేరువలో గల కీసర గుట్ట పేర్కొనదగినది. ప్రశాంతమైన ప్రకృతి వాతావరణంలో వెలసియున్న ఈ క్షేత్రము ఎంతో నయనానందకరముగా యున్నది. కీసర మండలములోనున్న ఈ ప్రసిద్ధ శైవక్షేత్రాన్ని ప్రతి దినము దర్శించే యాత్రికులు అధిక సంఖ్యలో ఇచ్చటికి వచ్చి శ్రీ స్వామిని సేవించి పునీతులగుచున్నారు. మహాశివరాత్రి పర్వదినం సందర్భంగా ఇక్కడకు విచ్చేసే లక్షలాది మంది భక్తులు చుట్టు ప్రక్కల గ్రామాల నుండే గాక పొరుగు జిల్లాలనుండి, ఇతర రాష్ట్రాలనుండి కూడా రావడం ఇచ్చటి విశేషం.

ప్రాచీనమైన ఈ దేవాలయానికి సంబంధించిన కథలు ఎన్నో ప్రచారములో ఉన్నాయి. శ్రీరామ చంద్రుడు రావణ సంహారమునకై లంకకు వెళ్ళక ముందు శివలింగ ప్రతిష్ఠ చేయదలచి వారణాసి నుండి జ్యోతిర్లింగాన్ని తెమ్మని తన సోదర సమానుడైన హనుమంతుని ఆజ్ఞాపించెనట! కాశికి వెళ్ళిన హనుమంతుడు అక్కడ జ్యోతిర్లింగాన్ని కనుగొనలేక ఎన్నో మైలైన లింగాలనుండి ఏకోత్తర శత (నూట ఒకటి) తెస్తున్నాడట అయితే సుమూహుర్తం దాటిపోతున్నందువలన శ్రీరామచంద్రుడు ఇసుకలింగం తయారుచేసి పూజించగా ఆ భక్తికి మెచ్చిన పరమ శివుడు ప్రత్యక్షమై ఆ ఇసుక లింగంలో ఐక్యమయ్యాడట. ఇలా భక్తులు చెప్పుకుంటారు. అందువలన ఈ దేముణ్ణి శ్రీరామ లింగేశ్వరునిగా పిలుస్తారు. నూట ఒకటి శివలింగాలను తీసుకుని వచ్చిన హనుమంతడు తాను వచ్చేసరికి శివలింగ ప్రతిష్ఠ జరగడంతో కోపగించి విసిరిన లింగాలే నేటికిని కేసరగుట్టపైన కనిపిస్తాయని భక్తుల నమ్మిక. హనుమంతుని కోపం గ్రహించిన శ్రీరామ చంద్రుడు ఆ లింగాలను దర్శించిన తరువాతనే భక్తులు శ్రీ రామలింగేశ్వరుణ్ణి దర్శిస్తారని ఈ దేవాలయం హనుమ పేరుతోనే "కేసరగిరి"గా ప్రసిద్ధి చెందుతుందని వరమిచ్చినట్లు భక్తులు భావిస్తున్నారు. "కేసరి" అనగా కోతి లేదా హనుమంతుడు. "గిరి" అనగా పర్వతం లేదా గుట్ట. కేసరిగిరి క్రమముగా కీసరగుట్టగా మారినదని పెద్దలు చెబుతారు.

ఇచ్చట శ్రీ రామలింగేశ్వరుడు పశ్చిమాభి. ముఖంగా ఉండటం విశేషం. స్వామివారు అర్ధరాత్రి

సమయంలో అమ్మవారితో తాండవం చేస్తున్నట్లు ఢమరుకధ్వని మరియు ఇతర వాయిద్య ధ్వనులు విని పించడం ఇక్కడి ప్రత్యేకతగా భక్తులు చెబుతుంటారు.

ఈ క్షేత్ర చారిత్రక ప్రాముఖ్యము కూడా గమ నించదగినది. పురావస్తు శాఖవారి త్రవ్వకాలననుసరించి క్రీ।శ నాలుగు, ఐదు శతాబ్దముల నాటికే కీసరగుట్ట విష్ణు కుండినులు రాజధానిగా ఉన్నదని తెలుస్తున్నది. ఇంకను మరికొన్ని త్రవ్వకాలలో కొన్ని రాగి శాసనాలు ఇటుకలు, ప్రాకారాలు, నాణాలు, స్నాన ఘట్టాలు బయలు పడ్డాయి. విష్ణుకుండినులు శైవులుగా మారి నట్లు ఆధారాలున్నాయి.

ఈ ఆలయం ప్రక్కనే అక్కన్న మాదన్నలు నిర్మించిన రెండు దేవాలయాలు ఉన్నాయి. ఈ దేవా లయాలలో విగ్రహ ప్రతిష్ఠ లేదు. ఇచ్చటి ఈ ఆల యాల వెనుక భాగంలో సుదీర్ఘమైన స్థూలమైన ఒక శిలాస్థంభము ప్రతిష్ఠించబడి ఉంది. ఈ స్థంభంపై ఆంజనేయుడు అవతార మూర్తులు చెక్కబడిఉన్నాయి. దీనిని రెడ్డి రాజులు విజయ స్థూపంగా చెబుతారు.

ఈ దేవాలయాల సమీపాన "కాశీబుగ్గ" అనే నీటి బుగ్గ ఉంది. ఇందుగల నీరు స్వచ్ఛంగా తెల్లగా ఉండటం వలన దీనిని "పాలబుగ్గ" అని పిలుస్తారు.

ఇచ్చట సీతమ్మగుడి అని వ్యవహరించబడు చున్న మహిషాసురమర్ధని ఆలయం కూడ ఉన్నది.

ఇచ్చట గల తామర కొలనులో అరుదుగా ఉండే తెల్ల తామర పూలు ఈ క్షేత్ర ప్రత్యేకతను చాటుతున్నవి. అతిథి గృహాలు కూడా కలవు.

ఈ ఆలయంలో శ్రావణ, కార్తీక, ఆశ్వీయుజ భాద్రపద మాసాలలో ఉత్సవాలు జరుగుతాయి. మహా శివరాత్రి పర్వదినం సందర్భంగా ప్రతి సంవత్సరం వైభవంగా నేత్ర పర్వంగా బ్రహ్మోత్సవాలుజరుపుతారు.

హైదరాబాద్ నగరం చుట్టు ప్రక్కల నుండి జిల్లా పరిసర ప్రాంతాలనుండి భక్తులు వచ్చి స్వామిని సేవిస్తార.

ఎంతో దర్శనీయమైన ఈ క్షేత్రం ఎంతో అభి వృద్ధిని సాధిస్తున్నది. అందుకు కారణం ఈ క్షేత్ర మహాత్మ్యమే అనడంలో ఎట్టి సందేహం లేదు.

## శ్రీ బాలాజీ వేంకటేశ్వర ఆలయం : ఆల్వాల.

రంగారెడ్డి జిల్లాలో మరియొక పురాతన దేవాల యం సికిందరాబాద్ నగర సమీపాన గల "అల్వాల"లో ఉన్నది. ఈ దేవాలయము చాలా ప్రసిద్ధి చెందినది. నైజాం ప్రభువుల మహా మంత్రులయిన మహా రాజా చందూలాల్ అతని మనుమడు సర్ కిషన్ ప్రసాద్ బహద్దూర్ గార్ల పోషణలో ఈ దేవాలయమం గొప్ప పుణ్య క్షేత్రంగా అభివృద్ధిచెంది దక్కను తిరుపతిగా పిలవబడతూ భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నది. స్వామివారి ఉత్సవమూర్తులు తిరుపతినుండి కాలినడకన తేబడినవని ప్రతీతి.

ఆ దేవాలయం సుమారు రెండు వందల సంవత్సరముల క్రిందట ఆల్వాల గ్రామమున నెలకొల్పబడినది. ఈ ఆలయ పోషణకు, పూజా పునస్కారములకు, నందదీపమునకు ఆల్వాలగ్రామము జాగీరుగా ఇవ్వబడింది. రాజా చందూలాల్ బహద్దూరు వారి సంతతివారు ఎంతో శ్రద్ధ వహించి ఈ దేవాలయ పురోభివృద్ధికి ఎంతో పాటుపడి భక్తజనుల తృప్తి కొరకు ఎంతో కృషి సలిపిరి. ఈ జాగీరు వలన వచ్చెడి ఆదాయమును పూజారుల ద్వారా వెచ్చించి వైభవముగ పూజలు జరిపి ఈ క్షేత్రప్రశస్తికి ఎంతో పాటు పడిరి.

మహమ్మదీయ ప్రభువులయిన నాల్గవ, ఐదవ నైజాములు ఆల్వాల గ్రామాన్ని దానమిచ్చుటవలన ఈ ఆలయ ప్రతిష్ఠ ఇనుమడించినది.

ఒకప్పుడు, కాశీయాత్రార్థమై తిరుపతి నుండి ఇచ్చటికి వేంచేసిన విష్ణుబాలాజీయను సాధు పుంగవుని ప్రగాఢ భక్తి ప్రపత్తులే ఈ క్షేత్ర వైభవానికి మూల కారణమయ్యేనని తెలియుచున్నది. ఈ సాధు పుంగ

పుడు బాలాజీ విగ్రహాన్ని గైకొని తిరుపతి నుండి కాశీకి పోవు నిమిత్తము పాద యాత్రలో మార్గ మధ్యమున ఇచ్చటికి విచ్చేసి ఇచ్చటి రమణీయమగు ప్రశాంతమైన ప్రదేశంలో అతి ప్రాచీనమైన తింత్రిణి (చింత) వృక్ష పాద ప్రదేశమున చిన్న పుష్కరిణి ప్రక్కన కుటీరమొకదానిని నిర్మించి ఆ విగ్రహానికి పూజలు చేయసాగెను. ఈ విషయము చుట్టుపక్కల వ్యాపించి నది. జనం అశేషంగా ఆ ప్రదేశానికి విచ్చేయ సాగారు. వారు పుష్కరిణిలో స్నానంచేసి స్వామిని దర్శించుకొని పూజలు చేసేవారు. కార్తీక పౌర్ణమి నాడు కూడా చుట్టు పట్ల ప్రజలు ఇచ్చటికి విచ్చేసి తెల్లవారు జాముననే పుష్కరిణిలో స్నానం చేసి స్వామిని దర్శించుచుండిరి. సాయం కాలము రైతులు తమ తమ ఎడ్లబండ్లను అలంకరించి చుట్టూ ప్రదక్షణము చేయించి స్వామి దర్శన భాగ్యాన్ని పొంది వెళ్ళేవారు. నేటికినీ ఈ పద్ధతి కొనసాగుచున్నది.

ఇట్లుండగా, అనుకోకుండా ఆనాటి మంత్రి వర్యులగు రాజా చందూలాల్ బహద్దూర్ వారు మాతృ సమేతముగా ఈ ప్రాంతమునకు విచ్చేసి స్వామిని దర్శించి, అర్చించుకొని మూడు రోజులు ఇచ్చట విశ్రమించినారు. మూడవ రోజు రాత్రి శ్రీ వేంక టేశ్వరస్వామి రాజాగారి స్వప్నములో సాక్షాత్కరించి తాను ఆ ప్రదేశములో ప్రతిష్ఠింపబడుటకు వేంచేసి నట్లు, తిరుపతికి పోలేని భక్తుల కోర్కెలను ఈడేర్చు టకై ఇచ్చట తనకొక దేవాలయము నిర్మించవల సినదిగా తెలిపినారు. రాజావారు దిగ్భ్రాంతులై నిద్ర నుండి మేల్కొనినారు. సాధువు శ్రీ బాలాజీ స్వామి వారు ఒక చక్కని ఆలయాన్ని నిర్మించవలసినదిగా సలహా ఇచ్చినారు. చందూలాల్ గారు స్వామి ఆజ్ఞాను సారము అపారమైన ద్రవ్యమును ఖర్చుచేసి తిరుపతి స్వర్ణదేవాలయము వలే చక్కని దేవాలయము నిర్మింప జేసినారు. నలభై అడుగుల ఎత్తుగల ఈ మందిర గోపురమునకు నేలమట్టమునుండి పైవరకు దేవ నర్త కిలు ఇతర నగిషీలుగల రాగి తొడుగుపై బంగారు పూత పూయించినారు. ఆలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి శిలా విగ్రహాన్ని శ్రీదేవి, భూదేవి వెండి విగ్రహాలను, పాంచరాత్రాగమ రీతిన ప్రతిష్ఠ చేయించినారు. ఉత్సవ విగ్రహములకు అలంకారములు చేకూర్చినారు. వారి కుటుంబీకులను తిరుపతికి పంపించి అచ్చట అర్చ నలో నున్న ఏడుకొండల వాని విగ్రహాన్ని బంగారు పల్లకీపై ఊరేగిస్తూ తీసికొని వచ్చినారు. ఈ వజ్ర కిరీట స్వామిని చూస్తే పెద్ద తిరుపతిలోని ఏడుకొండలవాని ఉత్సవ మూర్తిని చూసినట్టే ఉంటుంది. ఈ ఏకాంత స్వామికి ప్రతి శుక్రవారం తిరుమంజనం (అభిషేకం) గరుఢసేవ, డోలోత్సవం జరుపబడును. ఆనాడే ప్రక్కన ఆలయంలో ఉన్న అలివేలుమంగమ్మ వారిని కూడా స్వామి సన్నిధికి తెస్తారు.

జాగీరు విలీనం దేశంలో అమలులోకి వచ్చిన తరువాత ఆలయ రాబడి తగ్గినది. ప్రభుత్వము నుండి భక్తుల నుండివచ్చు స్వల్ప ఆదాయము ఆలయ నిర్వహణకు సరిపోవుటలేదు. పూర్వ వైభవములు సన్నగిల్లినవి. చాలా కాలమునుండి దేవాలయమునకు మరమ్మత్తులు లేక ఆలయము శిధిలావస్థకు చేరుకున్నది.

ఈ దేవాలయము దర్శించిన వారిలో లక్షలాది రాష్ట్రేతర భక్తులే కాక అహోబిల అండవన్, పరకాల మఠాధిపతులునూ త్రిదండి శ్రీమన్నారాయణ పెద రామానుజ జీయర్‌స్వామి వారునూ, శృంగేరీ పీఠాధి పతులు, భారత రత్న మాజీ రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్. అప్పటి లోక్ సభ అధ్యక్షులు శ్రీ అనంత శయనం అయ్యంగార్ అప్పటి శ్రీ సంజీవరెడ్డి మంత్రి వర్గంలో దేవాదాయశాఖ మంత్రిగా ఉన్న ప్రస్తుత ప్రధానమంత్రి శ్రీ| పి.వి. నరసింహారావులాంటి గొప్ప వ్యక్తులు కూడా ఉన్నారు.

ఇట్టి మహా మహిమాన్వితమైన ఆలయాన్ని జీర్ణోద్ధరణ గావించుటకు ఇటీవల ఆ ప్రాంతపెద్దలు పూనుకొనినారని తెలిసినది.

ఈ క్షేత్ర పూర్వ వైభవమునకు తీసుకొని రాబడుతున్నదని అందుకు ప్రయత్నములు రచయిత గమనించడం జరిగింది. చాలా సంతోషించగ్గ విషయ మిది. ఈ క్షేత్రాన్ని దర్శించి భక్తులు తరించదరు గాక!



# మెదక్ జిల్లా

## శ్రీ కేతకీ సంగమేశ్వర స్వామి దేవస్థానము : ఝరాసంగం

మన భరత ఖండము పుణ్య భూమి. ఎన్నో పుణ్య క్షేత్రములు కలవు. అందు కొన్ని వైష్ణవ క్షేత్రములు కొన్ని శైవ క్షేత్రములు. ప్రసిద్ధ శైవ క్షేత్రములలో శ్రీ కేతకీ సంగమేశ్వర స్వామి ఝరాసంగ క్షేత్రము పేర్కొనదగినది. ఈ క్షేత్రము హైదరాబాద్ నుండి బొంబాయి పోవు జాతీయరహదారిమార్గము నెం. 9 గల జహీరాబాద్ పట్టణము నుండి సుమారు 15 కి॥మీ॥ దూరములో నున్నది. ఈ క్షేత్రము గురించి ఎన్నియో ఇతిహాసములు కలవు.

పూర్వాకాలమున ఈ స్థలమున శౌనకాది మహా మునులు యజ్ఞము చేసినట్లుగా ఆర్యోక్తి కలదు.

కృతయుగమునందు సూర్యవంశపు మహారాజు శ్రీ కృపేంద్ర భూపాలుడు భయంకరమైన చర్మ వ్యాధి పీడితుడై దేశమునందలి సమస్త పుణ్యక్షేత్రములు దర్శించినప్పటికిని ఏ మాత్రము వ్యాధినయము కాలేదు. ఆయన ఎంతో వ్యధ చెంది చివరసారిగా ఒకసారి కేతన వనమునకు వేట మార్గమున వచ్చి ఒక లేడిని చూచి తరుముచూ వచ్చెను. ఇంతలో రాజుగారికి దాహము వేసి మంచినీటికై వెదకుచుండగా ఝరా కుండము కనిపించినది. రాజుగారు అందులోని నీరు త్రాగి దాహము తీర్చుకొని కొంతసేవు సేదతీర్చుకుని తిరిగి ఇంటికి వెళ్ళిపోయినాడు. ఇంటికి వెళ్ళగానే భార్య చంద్రకళాదేవి ఆశ్చర్యము, ఆనందము పొంది భర్తతో మీ చర్మ రోగము ఎలా పోయింది? అని ప్రశ్నించినది. అంత రాజుగారు తన వేట వృత్తాంతమును, ఝరా కుండమునందు నీరు త్రాగిన సంగతి చెప్పి వెంటనే తిరిగి అచ్చటకు వెళ్ళి బాణలింగరూపుడగు పరమ శివునర్చించి ఆలయకుండ నిర్మాణము గావించెను ఈ కుండమునకు అమృత కుండమని పేరు కలిగెను. ఇందు నారాయణ ధర్మ, ఋషి, వరుణ రుద్ర, ఇంద్ర దత్త యను జలధారలతో అష్ట తీర్థములుగా ప్రసిద్ధి చెంది భక్తులను కాపాడుచున్నది. కాశీ నుండి ఒక ఝర ఇందు కలియుచున్నది. స్థానికుల కథనము దేశము నందెచ్చటను లేని ప్రత్యేకత ఈ అమృత కుండమున కున్నది. ఇచ్చట భక్తులు స్నానము చేయుటయే కాక కుండము ఖాళీ చేయించి అందరి ఋషి తీర్థ ధార యందు పంచ భక్ష్యపరమాన్నములతో నైవేద్యమిడిన తిరిగి కొద్ది నిమిషములకే మళ్ళీ కుండము పూర్ణ మగుచుండును.

పూర్వము కృత యుగమున కేతకియను అప్సర కూట సాక్ష్యమొసగి (అబద్ధపు సాక్ష్యము) పరమ శివుని శాపమున ఈ ఆలయ సమీపమున వన రూప మున జన్మించెను. కేతకిచే ప్రార్థింపబడిన తానును భూలోకమున అవతరింతునని అప్పుడు కేతకీ పుష్పములతో పూజలందకొని ఆమెకు మోక్ష మును అనుగ్రహించెను.

విశ్వసృష్టి కార్యమును పూర్తి చేసిన పిదప బ్రహ్మదేవుడు ధ్యానమొనర్చుటకు అనువగు ప్రదేశ మును వెదకుచూ మనోహరమైన ప్రకృతి సౌందర్య ముతో అలరారుచున్న కేతకీవనాన గల పరమశివుని ధ్యానింప ఆయన ప్రత్యక్షమై బ్రహ్మచేనభిషేకించబడి, బ్రహ్మదేవుని కోరికననుసరించి, యావన ప్రాంతము ననే శాస్వతముగ భక్తుల పూజలందుకొనుచూ ఉండ గలనని వరము అనుగ్రహించెను. అప్పటి నుండి పరమ శివుడు బాణలింగాకార రూపమున కేతకిచే నర్చింప బడుచుండెను.

బ్రహ్మచే మనకు దర్శనమిచ్చుట చేతను కేతకి చే పూజింపబడుటచేతను తీర్థ సంగమము చేతను ఇచ్చట శివునకు సంగమేశ్వరుడు, కేతకీ సంగమేశ్వ రుడు అనియు,ప్రసిద్ధ నామమేర్పడినది.

ఇచటకు ఆంధ్ర దేశమందలి భక్తులే కాక, కర్నాటక, మహా రాష్ట్ర ప్రాంతములనుండి ప్రతి నిత్యమును వేల సంఖ్యలో భక్తులు స్వామిని దర్శించి ఐహికాముష్మిక సుఖములనందుచున్నారు.

ఇచట శ్రావణ కార్తీక మాసములలో నెలరోజుల మరియు ప్రతి సోమవారము, ప్రతీ అమావాస్య పర్వ దినములలో భక్తులు అధిక సంఖ్యలో పాల్గొని శ్రీ స్వామివారికి అన్న పూజలు చేయుచుందురు. అంతే కాక భక్తులకు కులదైవమైన స్వామివారు మ్రొక్కు బడులు అనగా కేశఖండన మొదలగునవి జరుపుచూ పార్వతీ దేవి అమ్మవారికి కుంకుమ పూజలు జరుపు చుందురు. ఇచట మూడు రోజులు గాయత్రీ జపము విధివిధానముగ జరిపించినచో మంత్ర సిద్ధియగునని భక్తుల నమ్మిక.

ఇచ్చట మాఘ, పాల్గుణ అనగా మాఘ బహుళ దశమినుండి పాల్గుణ శుద్ధ పాడ్యమివరకు శ్రీస్వామి వారికి నవాహ్నిక బ్రహ్మోత్సవములు జరుగు చుండును. ఈ బ్రహ్మోత్సవములలో స్వామివారి కళ్యాణోత్సవము అన్నగుండములు మరియు విమాన రథోత్సవములు జరుగుచున్నవి. రథోత్సవ వేడుకల యందు సుమారు యాభై వేలమంది భక్తులు పాల్గొ నుట ప్రత్యేక ఆకర్షణగాయున్నది.

మహా శివరాత్రికి జాతరలు అతి వైభవముగా జరుగును. శ్రీ స్వామి వారి కళ్యాణోత్సవము, రుద్ర హోమము, లక్ష బిల్వార్చన మొదలగు కార్యక్రమ ములు నిర్వహించబడుచున్నవి. భక్తులు అధిక సంఖ్యలో పాల్గొనుచున్నారు.

ఈ దేవస్థానమున ఎన్నో అభివృద్ధి కార్య క్రమములు చేపట్టి నిర్వహిస్తున్నట్లు ఈ క్షేత్ర కార్య నిర్వాహణాధికారి ఈ రచయితకు తెలియజేసినారు. ఇందు నేరుగా దేవాలయమునకు వచ్చుటకు నదిపై వంతెన నిర్మాణము, విమానము, రాజగోపురముల నిర్మాణములు, మొదలగు కార్యక్రమములలో భక్తు లను భాగస్వాములు కమ్మని విజ్ఞప్తి చేయుచున్నారు.

ఈ క్షేత్రమున దర్శించుటకు రైలు ద్వారా జహీరాబాద్ రైల్వే స్టేషన్‌లో దిగి ఆలయమువరకు గల బస్సు సౌకర్యము పొంద వచ్చును. భక్తులకు దేవ స్థానము వారు వసతి సౌకర్యము సమకూర్చుచున్నారు.

శాశ్వత పూజా విధానము కూడా ప్రవేశ పెట్టబడినది.

### శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి దేవస్థానం : నాచారం గుట్ట.

నాచగిరి శ్రీలక్ష్మీనరసింహస్వామి క్షేత్రమున



క్ష మూర్తియై శ్రీ లక్ష్మిదేవితో కలసి దీనికి శ్వేతగిరి, నాచగిరి అనెడి

ఒకప్పుడు గార్గేయమహర్షి శ్వేతాద్రిపై నరసింహ స్వామిని గూర్చి తపస్సు చేసి అభీష్ఠ సిద్దినొందెనని ప్రసిద్ధికలదు. అందువలన గార్గేయ తపోవనమని కూడ ఈప్రాంతమును పిలుచువాడుక కలదు. "నాచర్" అను భక్తుడు స్వామివారికి నిత్యం దీప ధూప నైవేద్యములతో సేవచేసి నందున "నాచారం గుట్ట" అనెడి ప్రసిద్ధ నామము కలిగి ప్రస్తుతము అదే వ్యవహార నామముతో ఈ ప్రాంతము వెలుగొందుచున్నది. ఈ శ్వేతాద్రి నానుకొని అర్థచంద్రాకారముగా హరిద్రానది (వసు వేరు) ప్రవహించుచు గరుడ గంగలో కలియుచున్నది. ఇందు భక్తులు ముక్కోటి ఉత్సవాలలో స్నానమాడి ముక్తి నొందుచున్నారు.

ద్వాపర యుగాంతమున కలికాలము ఆసన్న మగుచున్న సమయమున భూదేవి లోకమున కలుగు మానవోపద్రవములు శ్రీ కృష్ణునకు వివరించగా శ్రీ కృష్ణభగవానుడు ఉద్ధవాది మహా భక్తులతో దేశ క్షేమము కల్గనుపాయమాలోచించి కలియుగమునుద్భవించు ఆరాచకములను, ఘోరాపదలను అదుపు చేయుటకై భాగవతములో నుతించిన నవ కవులు భగవద్రూపులు అగు కవి, హరి, అంతరిక్షుడు మున్నగు వారినందరి నాహ్వానించి, పూజించి ఘోర కలికాలము నందలి ఇక్కట్లను రూపుమాపుటకుగాను వీరు వేర్వేరు రూపాలు గ్రహించి భూలోకమున వెలయు వలెనని కోరెను.

ఆ నవ భాగవతులు ధర్మ సంస్థాపనార్థము తత్పూర్వక క్షేమ సంపాదనకు శ్రీ కృష్ణుడు తెల్పిన నిర్ణయమునకు సంతసించి లోకమున ఎప్పుడు, ఎక్కడ, ఏ రూపమున ఏ అవతారముల నెత్తవలెనో సెలవిచ్చిన అట్లే అవతరించి తరింపజేయగలమని ప్రార్థించిరి.

శ్రీకృష్ణుని త్యాగనిరతికి సంతసించి వీరు నవనాధులుగా అవతారములు ధరించి భూలోకమున ధర్మసంస్థాపన గావించుటకై, తత్కార్యము నెరవేర్చుటకై అనువైన చోట వెదకి, వెదకి హరిద్రానదీ తీరమునగల శ్వేతగిరిని సమీపించి గుహ నుండి వెలువడుచున్న నృసింహ గర్జన (శబ్దము) విని ఇదియే తమ తపస్సుకు అనుకూల ప్రదేశమని సంతసించి కొన్ని సంవత్సర ములవరకిక్కడే తపమాచరింప శ్రీ నృసింహస్వామి తొమ్మండుగురు నవనాధులకు తొమ్మిది వేర్వేరు రూపాలతో దర్శనమిచ్చెను వారి అభీష్ట సిద్ధికై ఆశీర్వ దించి వారు కోరిన విధమున భక్తుల కోరికలు తీర్చు టకు ఆ గుహలో వెలయిటకు, ఓంకార శబ్దముతో తాను హర్షము వెలిబుచ్చి అంతార్ధనమయ్యెను తదుపరి వారు స్వామివెలసిన చారలు తమకు కనపడినందు వలన సంతసించి ఆనందముతో కీర్తనలు భజనలు సల్పిరి.

కొన్ని వందల సంవత్సరముల తరువాత కృష్ణావధూతయను మహానుభావుడు ఇచ్చటికి వచ్చి ఈ క్షేత్రమున తపస్సు చేసికొనుచు స్వామి వారి మహిమలను భక్తులకు వివరించసాగిరి. కాలక్రమమున వారికి శ్రీ నృసింహుడు దర్శన మొసగి ఇంకను ఆయనకు శ్రీ నృసింహ దేవునిపై భక్తి మెండుగునట్లు అనుగ్రహించెను. స్వామి దర్శనమయినందున అవ ధూత ఎంతో సంతసించి స్వామికి అనేక పూజా విధానములతో ధూప, దీప, నైవేద్య భోగములతో స్వామిని కొలచి ధన్యుడై తరించెను. ఆయన సేవల ద్వారా క్షేత్రము దర్శించుకున్న భక్తులకు ఆయురా రోగ్య సంపదలు, భూత గ్రహాది బాధలు నశించుట, దీర్ఘ కాల వ్యాధులు నశించుట, నయమగుట సంతానము లేనివారికి సంతతి కలుగుట మొదలగు భక్తుల బాధలు తీర్చు నాధుడని పేరుగాంచెను.

ఈ క్షేత్రమున ఇంకను భైరవాలయము, గరు డాంజనేయ స్వాముల విగ్రహాలు కలవు. ఇచ్చట శివ

కేశవులకు బేధములేదు. ఇచ్చట పంచాయతన యుక్త ముగ శివాలయము భక్తులచే నిర్మించబడి, నిత్యపూజా వైభవముతో విరాజిల్లుచున్నది.

శ్రీ స్వామి వారికి పశ్చిమ దిశలో ప్రకృతి సిద్ధమైన పుష్కరిణి కలదు. ఇందులో స్నానమాడి నచో ఇచ్చట తీర్థ సేవా భాగ్యముండునని భక్తుల నమ్మిక.

ఇచ్చట శ్రీ నరసింహస్వామి పిలచిన పలుకు దైవముగ భక్తులచే పూజలందుకొనుచున్న ఈ స్వామి ని సేవించి, భక్తవరులు తరించెదరు గాక!

## శ్రీ వీరభద్ర క్షేత్రము : బొంత పల్లి

హైదరాబాదు కుత్తరముగా (మెదక్ నర్సాపూర్ పోవు రోడ్డుపై) సుమారు 28 కి॥మీ॥ దూరమున బొం తపల్లి యను గ్రామమున్నది. ప్రస్తుతమిది నర్సాపూర్ మండల్‌లోనున్నది. ఇచ్చటి శ్రీవీర భద్రాలయము సుప్రసిద్ధమైనది.

జంట నగరముల నుండి, దూర ప్రాంతము లనుండియు వచ్చిన భక్త యాత్రికులీ క్షేత్రమున స్వామిని దర్శించి సేవించుచున్నారు. యాత్రికుల నివాసమునకు తగిన ఏర్పాట్లు కలవు. ఆలయమునకు బస్సు సౌకర్యమున్నది. ఆలయమున అర్చకత్వ మొన రించువారు జంగమ, తంబళి కుటుంబములవారు.

కలియుగమున వీరభద్రుడు భక్తులను కరు ణించి వారి కోర్కెలను తీర్చుటకు అనేక స్థలములలో వెలసినాడు. అట్టి స్థలములలో బొంతపల్లి అనున దొకటి.

వీరభద్రుడు శివుని నిందించిన దక్ష ప్రజాపతిని శిక్షించి, ఆ ఉగ్ర రూపమునుగని, సహింపలేనివారై తమ కచటనుండులకు వీలుకాక, దక్ష ప్రజాపతి అనుచరులు కొందరు భూలోకమున దండకారణ్యమున చేరిరి. తీర్థములు క్షేత్రములు దర్శించి మంజీరా నదికి దక్షిణమున, ముచికుందానదికి ఉత్తరమున దట్టమగా అడవి యుండెడిది.ఆ ప్రాంత ప్రజలు శివభక్తి పరా యణులై సమస్త భోగముల ననుభవించుచు సుఖముగా కాలము గడుపుచుండిరి. శివభక్తి వారిని సకల శుభముల నొసగి కాపాడుచుండెను. సకాలమున వర్షములు కురిసి ప్రకృతి అనుకూలముగా నుండి వారెంతో తృప్తులై కాలము గడుపుచుండిరి.

దక్షుని అభిమానులకు వీరి శివ పభక్తి రుచింప లేదు. శివభక్తి వలన వారికి కలిగిన సౌఖ్యము వీరికి కన్నుగుట్టినది. కావున వారు దండకారణ్యములోని రాక్షస గణముతో చేతులు గలిపి, శివుని వలన నిర్వా సితులగుట చేత, వీరభద్రుని సాధింపబూనినవారై వారి మీద కోపముతో శివభక్తులగు ఇచ్చటి ప్రజలను హింసింపసాగిరి. శివ నామస్మరణ కూడదనిరి. పూర్వ జన్మ సంస్కారము చేతను, పుణ్యకార్య సంచిత జనితమైన శివభక్తి వదలలేని ప్రజలు, వీరివలన ఎంతో వ్యధచెంది శివభక్తిని వదలకపోగా మరియు అధికశివ భక్తితో శివునే ఆరాధింపమొదలిడిరి. శివదూత లెట్టై నను తమ్ము కాపాడుదురని నమ్మిరి. వీరభద్రుడు తమను రక్షించునని, శివ దూషకులగా వీరిని దండిం చునని గట్టి విశ్వాసముతో వీరభద్రస్తోత్రములను పఠించిరి. నిశ్చలమనస్కులై వీరభద్రుని ధ్యానించిరి. వీరి ధ్యానము వృధా కాలేదు. కరుణాంతరంగుడైన వీర భద్రుడు తమ భక్తులకు కలిగిన యాపద, దక్షాను చరులొనర్చెడు విపరీతములను తెలిసికొనెను. భక్త రక్షణకై దండకారణ్యములోని మంజీరముచికుందల మధ్య ప్రదేశమున ప్రవేశించెను. వీరభద్రమూర్తి ఆగమనమును తెలిసిన రక్కసులు దక్షానుచరులు తమకు వినాశము తప్పదని భావించిరి. పూర్వమీ వీరభద్రుని వీరత్వమును చవిచూచుటచే లెంపలు వాయించుకొని జీవితాంతము పరమశైవులమై యుందుమని, శివ లీలలను ప్రచారము గావింతు మనియు వీరభద్రునకు విన్నవించుకొని తమతమ ప్రదేశములకు తామేగిరి.

ఇట్లు భక్తరక్షకుడైన ఆ వీరభద్రుడు మైనాక్షి బిల్వ వృక్షములచే విరాజితమై యున్న మంజీరా ముచి కుందుల మధ్య ప్రదేశమున తన విహారమునకు అను కూలమై నదని భావించి బొంతపల్లి దట్టముగా మైసాక్షి, మారెడు వృక్షములుగల యాప్రదేశమును పూజ లొనర్చి నొక పల్లె నేర్పరచిరి. తరువాత కాలక్రమము నదియే బొంతపల్లి యను పేర ప్రసిద్ధి చెందినది.

కాకతీయులు ఆంధ్రదేశమును పాలించినపుడు మన దేశమున అనేక శివాలయములు నిర్మింపబడినవి. ఆకాలమున చాలావరకు బండ్లమీదనే ప్రయాణము సలిపెడివారు. ఒకాకొకప్పుడు కొందరు వ్యాపారస్తులు బండ్లపై సరుకులు నింపుకుని, అడవిమార్గమున వచ్చు చు వారు బొంతపల్లి సమీపించగానే వారి బండ్లు ముం దుకు సాగుటకు నిరాకరించినవి. వారు ఆశ్చర్యముతో దగ్గరలో ఎక్కడైనా క్రూరమృగములున్నవేమోయని పల నలువైపుల వెదకసాగిరి. ఏమియూ కనిపించలేదు. ఆరాతి వారు అచ్చటనే విశ్రాంతి గైకొనినారు.

వారికి స్వప్నమున వీరభద్రస్వామి కనిపించి, ఇక్కడకు సమీపమున ఒక పుట్టయున్నదని, ఆపుట్టను త్రవ్వించిననొక విగ్రహము కనిపించునని దానిని శ్రద్ధా భక్తులతో ప్రతిష్ఠించి పూజింపుడని అట్లు చేసినచో మీ బండ్లు కదులును. అంతేకాక విశేష ధనలాభము కూడా కలుగుననియు చెప్పెను.

మరునాడుదయమున వారు చుట్టు ప్రక్కల వెదకగా ఒకచోట వారికి పుట్టకానవచ్చినది. వారా పుట్టను త్రవ్వించి విగ్రహమును వెలికి తీసి, పెద్దలను పిలచి బొంతపల్లిలో ఒక దేవాలయమును నిర్మించి, అందు ఆ విగ్రహమును ప్రతిష్ఠించినారు. పూజించి తమ దారిన తాము వెళ్ళిపోయినారు.

ఆ గ్రామములో జంగమ కుటుంబములు చాలా కలవు. వారికి ఇలవేలుపు శ్రీవీరభద్రస్వామియే. నాటి నుండి నేటివరకు ఆస్వామికి వారే అర్చకులు. కొంత కాలము తరువాత ఆలయ స్థలము మార్చబడినది.

ఈ స్వామి ఎంతో మహాత్యము కలిగిన దేవుని గాఎందరో పూజించుచున్నారు.

ఈ ఆలయమున గల ప్రసాంత వాతావరణము ప్రకృతి సౌందర్యము, భక్తుల కెంతేని ఆనందదాయ కమగుచున్నది.

ఈ ఆలయము తూర్పు ముఖమై ఇరవైనాలుగు స్థంభములుగల ముఖమండపముతో విరాజిల్లుచున్నది. గర్భాలయమున శ్రీ వీరభద్ర స్వామి విగ్రహము కాశీ విశ్వేశ్వర లింగములు మూలవిగ్రమములు ఉత్సవ విగ్రహములు దర్శనమిచ్చుచున్నవి. ధర్మ సత్రము లున్నవి.

నిత్యోత్సవములు వైశాఖపూజ, బసవ జయంతి, లక్షపత్రపూజ, దీపోత్సవము మహాశివవరాత్రికి పూజలు జాతరలతో నిత్య వైభవముతో ఈ క్షేత్రము ఎంతో దర్శనీయముగనున్నది.



శ్రీ సీతారామచంద్ర స్వామివారి
దేవస్థానం : భద్రాచలం

# భద్రాచలక్షేత్ర వైభవము

భారతదేశము వేదములకు, పురాణములకు, శాస్త్రములకు పుట్టినిల్లు. ధార్మిక, ఆధ్యాత్మిక విషయములకు విశిష్టస్థానము. శైవాగమ, వైష్ణవాగమ, శాక్తేయాగమ, వైఖానసాగమ, స్మార్తాగమాది ఆగమములచే పూజింపబడు దేవాలయములకు నిలయమై దివ్య ధామముగా విరాజిల్లుచున్నది. ఇటువంటి ఈ భారతదేశంలో సేతువు మొదలుకొని శీతాచలము వరకు ఎన్నియో పుణ్య క్షేత్రములు, దివ్యక్షేత్రములు, మహానదులు విరాజిల్లుచున్నాయి. నదీస్నానం, పుణ్య క్షేత్రములలోని దైవదర్శనమున్ను పాపాలన్నిటినీ క్షాళన చేసి ఇహపరలోకంలో శాంతి సౌఖ్యాలను అద్వితీయ స్థానమును ఇచ్చును.

మనకు మోక్షము నొసంగే పుణ్యక్షేత్రములు ఏడు ఉన్నాయి. అయోధ్య, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతి మరియు ద్వారక. గంగ, యమున, కృష్ణ, గోదావరి, సరస్వతి, నర్మద, సింధు, కావేరి ఇత్యాది పుణ్య నదులు ఉన్నాయి. అటువంటి పుణ్యక్షేత్రములలో భద్రాచల క్షేత్రము ఒకటి. ఈ భద్రాచల క్షేత్రములో లక్ష్మణ సమేతుడై, చతుర్భుజుడైన, శంఖుచక్రధనుర్బాణ ధరుడైన, అభయముద్రాంకితుడైన సాక్షాత్తు శ్రీమన్నారాయణ స్వరూపియైన శ్రీ సీతారామచంద్రులవారు భక్త కోటిని తరింపజేయుటకై అవతరించి యున్నారు. ఇది పురాణ క్షేత్రమేగాదు. శ్రీ వైష్ణవులకు ముఖ్యములైన నూట ఎనిమిది దివ్యదేశములలో ఇది దివ్యక్షేత్రముగా కూడా పరిగణింపబడుచున్నది. పన్నిద్దరు ఆళ్వారులలో ఒకరైన తిరుమంగయాళ్వార్ అనునాయన ఇచటకు వచ్చి దండకారణ్యమున విరాజిల్లుచున్న ఈ శ్రీరామచంద్రుని పెరియ తిరుమొత్తి అనువారి దివ్యప్రబంధములో పాడి యున్నారు. దివ్యదేశమనగా ఆళ్వారులచే కీర్తింపబడు పెరుమాళ్లయొక్క సన్నిదియే. అటువంటి సన్నిది భక్తులందరికీ పెన్నిది.

శ్రీరామచంద్రుని వనవాసము చేయుచున్న సమయమున ఈ దండకారణ్యమున సంచరించుచూ ఒక శిలపై విశ్రమించెను. అంతట ఆనందమునొంది శ్రీరామచంద్రుడు ఇది భవిష్యత్తులో ఒక పుణ్య క్షేత్రము అగుగాక యని మంగళాశాసనముచేసెను. ఆ శ్రీరామచంద్రుల వారి దివ్యమంగళ శాసన ఫలమే కాబోలు ఆశిల మేరుదేవికి మేరుపర్వతమునకు తన యుండై జన్మించి భద్రుడు అను పేరుగాంచెను. ఆ భద్రుడు గొప్ప తపమాచరించి అవతారము చాలించి వైకుంఠమున కేగిన శ్రీమహావిష్ణువును, లక్ష్మీదేవిని, ఆదిశేషుని, వారి దివ్యశంఖచక్రములతో గూడా ఈ భూమిపైకి రప్పించి తనకిష్టమగు శ్రీ రామచంద్రుని రూపముగనే ఎల్లపుడు స్వామి తన శిరస్సుపై ఉండునట్లుగా చేసికొని ఆయన తరించి, ఎందరినో నేటికిని తరింప చేయుచున్నాడు.

శిలారూపమునుధరించి భద్రుని శిరస్సుపై నిలచి యున్న స్వామిని ముందుగా సేవించి తరించి నది పోకల దమ్మక్క యను ఒక గిరిజన స్త్రీ. పిమ్మట భక్తరామదాసుగా పేరునొందిన కంచెర్ల గోపన్న గారు శ్రీ స్వామి వారిని ఆలయగోపుర ప్రకారాదుల నేర్పాటు చేయించి శ్రీరంగం నుండి శ్రీ వైష్ణవాచార్యకులను రప్పించి వారిచే ప్రతి నిత్యము శ్రీ స్వామివారికి దివ్యపాంచరాత్రా గమానుసారముగా షోడసోప చారములతో పూజలు చేయించి మరియు బ్రహ్మోత్సవములను, పవిత్రోత్సవములను, అధ్యయనోత్సవములను ఇంకా ఎన్నియో ఉత్సవములను జరిపించి తాను తరించెను. మరియు ఈ దివ్యక్షేత్రమునకు జగద్గురువైన అద్వైతమత స్థాపనాచార్యుడైన శ్రీ శంకరాచార్యుల వారు విచ్చేసి ఈ స్వామిని సేవించి "వామాంకస్థిత" యను శ్లోకముతో నుతించిరి. మరియు

ఒక విశేషమేమనగా ఈ భద్రాచల క్షేత్రమున ఉత్తరము నుండి దక్షిణము వరకు దక్షిణ గంగగా ప్రసిద్ధి చెందిన గోదా వరి మహానది ఈ క్షేత్రమువరకు ప్రవహించి ఈ స్వామికి ప్రదక్షిణము చేయవలెనను తలంపుతో కాబోలు మరల తూర్పునకు ప్రవహించినది. ఈ విషయము అసామాన్య మైనది. దీనిని బట్టియే తెలియుచున్నది భద్రాద్రిలోని శ్రీరామచంద్రుడు దేవదేవుడైన శ్రీమన్నారాయణుడేనని.

ఇట్టి భద్రాద్రిలో ఉత్సవములు అనేకములు. చైత్ర మాసములో శ్రీరామనవమియందు సీతారామ కళ్యా ణము, బ్రహ్మోత్సవములు పాడ్యమినుండి పౌర్ణమి వరకు ఎంతో వైభవముగా ఉండును. వైశాఖమాసంలో శ్రీసీతా రాములకు నూతన పర్యంకోత్సవము. ఈ ఆలయమునకు అనుబంధమైన నృసింహ స్వామి దేవాలయంలో శ్రీ లక్ష్మీ నృసింహస్వామి కళ్యాణంజరుగును. జ్యేష్టమాసంలో పూర్ణిమనాడు సహస్రకలశాభిషేకం వైభవంగా జరుగును. ఆషాడమాసంలో అనుబంధ దేవాలయమైన గోవింద రాజ స్వామి దేవాలయమున శ్రీగోవిందరాజ కళ్యాణం వైభవంగా జరుగును. శ్రావణమాసమున శ్రీ స్వామి వారికి పవిత్రోత్సవములు జరుగును. మరియు శ్రీలక్ష్మీ తాయారు కోవెలలో వరలక్ష్మీపూజలు జరుగును. భాద్ర పద మాసమున అంబాసత్రమందు గణపతి సవ రాత్రోత్స వములు జరుగును. ఆశ్వీయుజ మాసంలో శ్రీ స్వామివారి సన్నిదిలో శ్రీ లక్ష్మీతాయారుకు శరన్నవ రాత్రోత్సవములు జరుగును. మరియు ఈ తొమ్మిది రోజులు శ్రీమద్రామాయణపారాయణ జరుగును. ఈ శ్రీమద్రామాయణ పారాయణలు రుసుము చెల్లించిన భక్తుల గోత్రనామములపై జరుగును. ఈ శ్రీమద్రామా యణ పారాయణము చేయించుకున్న భక్తులకు తాము తలంచుకొన్న శుభకార్యములు నెరవేరుననన్న విశ్వాసము. కార్తీకమాసమున క్షీరాబ్దిద్వాదశి నాడు శ్రీ స్వామివారికి జగన్మోహినీ అలంకారము. భక్తులకు ఆరోజు కన్నుల పండుగ. మరియు శ్రీ స్వామివారికి నివేదించిన ఆవు పాలను అమృతముగా భావించి భక్తులు పుచ్చుకొందురు. మార్గశిర పుష్యమాసములలో ధనుర్మాసములో ధనుర్మా సోత్సవము 30 రోజులు జరుగును. ఈ 30 రోజులు ఆండాళ్‌తల్లి యొక్క సేవ భక్తులకు లభించును. మరియు అధ్యయనోత్సవములు జరుగును. ఈ ఉత్సవములు పగల్ పత్తు 10 రోజులు రాపత్తు 10 రోజులు ఉత్సవములు శ్రీ వైకుంఠ ఏకాదశితో పూర్తియగును. ఈ పగల్ పత్తు ఉత్సవముతోనే తిరుమంగాళ్వారుకు పరమ పదోత్సవ మును చేయుదురు. ఏలననగా వీరు వచ్చి యిచట ఈ స్వామిని గురించి పాడినారు. కనుక ఈ క్షేత్రానికి దివ్య దేశత్వమును కలిగించినారు. కనుక కృతజ్ఞతా ప్రకటన పూర్వకంగా ఇచట వీరికి ఈ పరమపదోత్సవమును చేయుదురు. శ్రీ వైకుంఠేకాదశి నాటి ముందు రోజున సర్వాలంకార శోభితమైన హంస వాహనముపై శ్రీ స్వామివారి యొక్క ప్లవోత్సవము (తెప్పోత్సవము). ఈ ఉత్సవాన్ని సుమారు లక్ష సంఖ్యకు పైగా భక్తులు దర్శిం తురు. మరియు వైకుంఠ ఏకాదశి ముందురోజు వరకు ఒక్కొక్క రోజున ఒక్కొక్క అవతారము అనగా మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, శ్రీకృష్ణ దశావతారములతో శ్రీ స్వామివారికి అలంకారములు జరుగును. శ్రీ వైకుంఠ ఏకాదశినాడు తెల్లవారుఝామున 5 గంటల నుండి 6 గంటలవరకు ఉత్తరద్వారదర్శనము. ఇది యెంతయో కన్నులపండుగగా ఉండును. ఈ ఉత్సవమునకు కూడా ఆంధ్రదేశము నుండి యే గాక ఇతర రాష్ట్రములనుండి మరియు ఇతర దేశముల నుండి లక్షలకు పైగా భక్తులు విచ్చేసి శ్రీ స్వామి వారిని దర్శించి సంతుష్టాంతరంగులు అగుదురు. ఈ శ్రీ వైకుంఠ ఏకాదశి ఉత్సవంలో ఐదురోజుల పాటు ప్రముఖ వాగ్గేయ కారుల ఉత్సవములు జరుగును. రాపత్తు ఉత్సవముల యొక్క 10వ రోజునాడు నమ్మాళ్వారుకు పరమపదో త్సవమును చేయుదురు. ఈ ఉత్సవములలో శ్రీ స్వామి వారు క్షేత్రపాంతములలో ఉండు అనేక మండపములకు, విహార భూములకు వేంచే సెదరు. అపుడు సేవించియే తీరవలయును. ధనుర్మాస ఉత్సవం యొక్క 30వ నాడు శ్రీ ఆండాళ్ తాయారుల కల్యాణం వైభవంగా జరుగును. మాఘమాసమున ఈ క్షేత్రపాలకుడైన శివునకు శివాలయ మున శివపార్వతుల కళ్యాము వైభవముగా జరుగును. మాఘపూర్ణిమనాడు గుట్ట పైన గల శ్రీరంగనాయకస్వామి వారి కల్యాణం జరుగును. ఫాల్గుణమాసమున శ్రీ స్వామి వారి డోలోత్సవము జరుగును.

ఈ ఉత్సవములలో శ్రీరామనవమి (చైత్ర మాసంలో), శ్రీ వైకుంఠ ఏకాదశి (పుష్యమాసంలో) అతి ముఖ్యమైనవి. మరియు శ్రీ స్వామివారికి నిత్యకళ్యాణ పచ్చతోరణముగా ప్రతినిత్యము నిత్యకళ్యాణములు, మరియు భక్తుల కోరిక తో పట్టాభిషేకములు జరుగును. ఇట్టి దివ్య మహా మహిమాన్వితమైన శ్రీ భద్రాచల దివ్య క్షేత్రమందలి పవిత్ర గోదావరీ స్నానము, మరియు శ్రీ సీతారామచంద్రుల సందర్శనమునూ, ధర్మ, అర్ధ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్ధములను యిచ్చును.

కె.వి.కె.ఎస్. చలపతిరావు, బి.ఎ., ఎల్.ఎల్.బి.,
కార్యనిర్వహణాధికారి

శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి వారి అమూల్య ప్రచురణ
మన పవిత్ర వారసత్వ గ్రంథ పాఠక మహాశయులకు

బుగ్గా మఠం

తిరుపతి, చిత్తూరు జిల్లా

వారి

శుభాశీస్సులు



శ్రీ సూర్యమిత్ర ధార్మిక నిధి వారి అమూల్య ప్రచురణ
మన పవిత్ర వారసత్వ గ్రంథ పాఠక మహాశయులకు

శ్రీ జగన్నాథస్వామి రామగోపాల్ ట్రస్టు

సికింద్రాబాద్ వారి

హృదయ పూర్వక శుభాకాంక్షలు.

# శ్రీ స్వామి హథిరాంజీ మఠము - తిరుపతి

శ్రీ స్వామి హథీరాంజీ మఠము ఉత్తర హిందూ స్థానమునకు చెందిన ఒక విరాగి బ్రాహ్మణ చక్రవర్తిచే తిరుమల పవిత్ర పుణ్య క్షేత్రమున ఆరువందల సంవత్సరములకు పూర్వము స్థాపింపబడినది. పరమ భక్తుడైన బైరాగి శ్రీ వెంకటేశ్వరుని సాక్షాత్కరింపకొన దలచి దేశ పరిపాలనలో ఉండిన అప్పటి నవాబు పెట్టిన షరతుకు శ్రీ వేంకటేశ్వరుడు ఏనుగు అవతరణమున చెఱుకుగడలను తినివేసి ఆ నవాబు కన్నుతెరపించుటతో పాటు బైరాగికి దర్శన మిచ్చి అంతర్ధానము అయినట్లు, ఆ బైరాగి అచ్చట ఒక సీతారామాంజనేయ ఆలయమును సుమారు ఐదు వందల సంవత్సరముల క్రిందట నిర్మించినట్లు, నిత్యము భగవంతుని స్మరించినందున కొంలది కాలమునకు శ్రీ వేంకటేశ్వరుడు ఆ బైరాగితో పాచికలాడినట్లు వీటి జ్ఞాపకార్థమై బైరాగి పేరున "శ్రీ స్వామి" సీతారామాంజనేయ ఆలయమునకు "రాంజీ" అను మఠము నామధేయము, ఏనుగు చెరుకు గడలు తిని నందుకు "హథి" అను పేరున నేడు "శ్రీ స్వామిహథిరాంజీ మఠము"గా విరాజిల్లు చున్నది.

ఈ మఠమునకు విలువైన భూములు, గృహములు, వెండి, బంగారు ఆభరణములు కలవు. మఠ సంప్రదాయము ప్రకారము మఠాధిపతి చనిపోతే ఆ మఠాధిపతి శిష్య వర్గములో ఉత్తర దేశ బ్రాహ్మణ విరాగి ప్రప్రధమ శిష్యుడు మఠమునకు మఠాధిపతిగ అర్హుడు.

గత మఠాధిపతులు తమ పదవితో పాటు తిరుమల తిరుపతి దేవస్థానమునకు విచారణ కర్తలుగా ఉండి గతములో విద్యావ్యాప్తికి తీవ్ర కృషి చేసి తిరుమల విచ్చేయు భక్తజన కోటికి ఆశీర్వాదములు యిచ్చినట్లు రికార్డులు చెప్పుచున్నవి.

ఈ మఠము ప్రస్తుతము దేవాదాయ ధర్మాదాయశాఖ అధీనములో ఉంటూ, దిన దిన ప్రవర్థమాన మగుచున్నది.



# కరీంనగర్ జిల్లా

## శ్రీ రాజరాజేశ్వర దేవాలయము : వేములవాడ.

శ్రీ రాజరాజేశ్వర క్షేత్రము, దక్షిణ భారతమున సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము. ఇది కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకాలో నున్నది. ఇదియే వేములవాడ. వేములవాడ యని వ్యవహారనామము కలదు. ఎముడాల అని కూడా కొందరు జానపదులు అంటారు.

ఈ ఆలయం దాదాపు వేయి సంవత్సరముల నాటిదని ఈ ఆలయ ఆవరణలోగల రెండవ అరికేసరి వ్రాయించిన శిలాశాసనమువలన తెలుస్తున్నది. ఇతడు చాళుక్య వంశజుడైన రెండవ నరసింహని కుమారుడు. మూడవ యుద్ధమల్లుని మనుమడు. ఇతడు క్రీ.శ. 930 నుంచి 955 సంవత్సరములందు వేములవాడ ప్రాంతమును పరిపాలించి యుండునని పలుచారిత్రికుల అభిప్రాయము. ఇది దానశాసనము. భువనపతి, ఈ క్షేత్ర యాత్రికులకు భోజన సౌకర్యాలకు, ఆదిత్య గృహమనే సత్రనిర్వాహణకు, తటాకముకొరకు, ఇవ్వబడినట్లు ఈ శాసనము వలన తెలియుచున్నది. శ్రీ రాజేశ్వర, ఆదిత్యేశ్వర, బద్దెగేశ్వర, నగరేశ్వర ఆలయాల స్థానాధిపతులు మరికొందరు స్థానిక ప్రముఖులు సాక్షులుగా పేర్కొనబడ్డారు. అందువలన ఈ దేవాలయము క్రీ॥శ॥ పదమూడవ శతాబ్ది మధ్య కాలమునకు చెందినదని తెలియుచున్నది. అటు తర్వాత మరెన్నో కట్టడాలు శిల్పాలు దీనికి చేర్చబడినవి. ఈ క్షేత్రము అందువలన బహు పురాతనమైనదని అనుటలో సందేహములేదు. ఈ క్షేత్ర పురాతన ప్రాశస్త్యమును, చారిత్రక, రాజకీయ, సాంఘిక, మత, సంస్కృతిక జీవితమును చాటి చెప్పుచున్న సారస్వత శిలా శాసనాది నిదర్శనములు కలవు.

సారస్వత నిదర్శనము ఈ క్షేత్రమును గూర్చి అతి విపులముగా తెలుపుతున్నది. వేములవాడ ప్రాచీన హరిహరక్షేత్రము. శైవ క్షేత్రంగా ప్రసిద్ధి చెందినప్పటికీ హరిహరులకు భేదం లేదిక్కడ. ఒకే ఆవరణలో శివకేశవులకు ఆలయాలుఅన్నయి. అంతేకాక ఇద్దరికి సమానంగా పూజలు జరుపుతున్నారీ క్షేత్రంలో.

శ్రీ రాజరాజేశ్వరస్వామి, శ్రీ అనంత పద్మనాభస్వామి వార్ల ఉత్సవాలన్నీ కళ్యాణ మంటపంలో ప్రక్కప్రక్కనే జరుగుతాయి. వేములవాడ శాక్తేయులకు కూడ అతి పవిత్రమైనది. ఎందువలనసంటే ఇచ్చట

రాజరాజేశ్వరీ, మహిషాసురమర్ధని, బాలాత్రిపురసుందరి, మహాలక్ష్మి, బద్ది పోచమ్మలకు ఆలయాలున్నవి.

అందువలన వేములవాడ క్షేత్రాన్ని దర్శించడం ఇహపర సాధనానికి లాభదాయకం, మహా మహిమాన్వితమైన, మన ప్రాచీన సంస్కృతికి, మత సహనానికి శిల్పకళకు, మన లౌకిక స్వేచ్ఛా సమానతలకు, అట్టి విలువల, సమానత్వ పరిరక్షణకు, ఈ క్షేత్రం గొప్ప సంకేత స్థలం. వివిధ మత సంస్కృతుల కాలవాలమై రాణించుచున్నది. శ్రీ రాజరాజేశ్వరుని మహిమ అను భవైక వైద్యమేకాని చెప్ప నలవికాదని భక్త మహాశయులు చెప్పుచున్నారు.

శ్రీ రాజరాజేశ్వర స్వామి ఆలయానికి ఉత్తరాన ధర్మకుండ మున్నది. ఈ ధర్మకుండ పవిత్రత త్రేతా, ద్వాపర యుగములనుండి గుర్తింపబడినట్లు భారత రామాయణాదుల వలననే కాక, భవిష్యోత్తర పురాణాన్ని పరిశీలించిన వారికి అవగతమవుతుంది. ధర్మకుండం పేరు పలికినంత మాత్రాన ముక్తిని పొందు తారు మానవులని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

ఈ ధర్మకుండం రాజరాజేశ్వర దేవాలయానికి ఉత్తరాన ఉన్నది. పాండవ మధ్యముడు అర్జునుని మనుమడైన నరేంద్రుడు వేటాడుతూ పొదల మధ్య తపస్సు చేసికొనుచున్న మునిని మృగమని భ్రమసి, తన బాణంచే వధించాడు. ఈ బ్రహ్మహత్యాదోషం వల్ల భయంకరమైన కుష్టువ్యాధి పీడితుడైన ఆ రాజు మూడు దోసిళ్ళ ధర్మ కుండ పవిత్ర జలాలతో పాప విముక్తుడై, రోగ విముక్తుడైనాడు. తరువాతపరమశివుని వలన ఆదేశించబడి, ధర్మ కుండలో మునిగియున్న శివలింగాన్ని వెలికి తీసి, సుమూహూర్తంలో శివలింగ ప్రతిష్ఠకు పూనుకున్నాడు. కాని, అంతకు మునుపే ఈ ప్రతిష్ఠకు నిర్ణయించిన స్థలంలో సిద్ధులు ప్రతిష్ఠించడం జరిగిపోయింది. యీ సంఘటనకు మిక్కిలి చింతాక్రాంతుడైన రాజుకు మహేశ్వరుడు కలలో కనిపించి ఓదార్చి, నీటినుంచి వెలికి తీసిన శివలింగాన్ని ప్రతిష్ఠ చేయమని చెప్పగా రాజలా ప్రతిష్ఠ చేయగా, ఆ లింగం శ్రీ బాలరాజేశ్వర స్వామిగా ప్రసిద్ధి చెంది, పూజలందు కుంటున్నదీనాటికిని. ఈ బాలరాజేశ్వరుని దర్శించిన తరువాతే మూలవిరాట్ దర్శనము చేసుకుంటారు భక్తులు. ఇదే ఆచారమయినదిక్కడ. వృత్రాసురుని వధించిన ఇంద్రుడు, దక్ష ప్రజాపతి యజ్ఞవాటికనుండి హవిస్సును దొంగిలించబోయి చేతులు పోగొట్టుకున్న సూర్య భగవానుడు ఈ ధర్మ కుండజలాల పవిత్రత వలననే పునీతులైనట్లు తెలియుచున్నది. సూర్యుడు తన చేతులను తిరిగి యీ క్షేత్రం లోనే పొందిన కారణాన ఈ క్షేత్రాన్ని భాస్కర క్షేత్రం అని కూడా అంటారు.

శ్రీ రాజరజేశ్వర స్వామి ఆలయ ముఖ మంట పంలో గర్భగుడికి ఎడమ వైపున శ్రీ లక్ష్మి గణపతి విగ్రహం ఉన్నది. లక్ష్మీదేవి గణేశుని ఎడమ తొడ మీద ఆశీనురాలై వుంటుంది. మన దేశంలో లక్ష్మి గణపతి ఆరాధన అరుదుగా జరుగుతుంది. ఇక్కడ అట్టి ప్రత్యేకత గమనించతగ్గది. భక్తులు మొదట శ్రీలక్ష్మి గణపతిని పూజించి, శివునికెదురుగా ఉన్న నందీశ్వరుని అనుమతి పొంది, గర్భాలయంలోకి ప్రవేశిస్తారు. విశాలమైన గర్భగుడిలో పానవట్టము మీద శ్రీ రాజరాజేశ్వర స్వామి వారి నీలమాణిక్య సంకాశ లింగము ఎంతో వైభవంగా విరాజిల్లుతూ భక్తుల కన్నుల పండువుగా ఉంటుంది. ఈ స్వామి మహిమ, శాస్త్ర విధిననుసరించి శ్రీ స్వామి వారి లింగం ఉండడం వలన ఎంతో ప్రభావాన్ని కలిగి వున్నది. లింగ పురాణాన్ననుసరించి, ఎంతో శాస్త్ర సమ్మతంగా ఈ లింగ ప్రతిష్ఠ జరగడం వలన, భక్తులకోర్కెలీడేర్చే స్వామిగా ఈ రాజరాజేశ్వరుడు ప్రసిద్ధి చెందుచున్నాడు.

గర్భాలయానికి కుడివైపున శ్రీ రాజరాజేశ్వరి దేవి పూజింపబడుచున్నది. ఈమె వాహనం వరాహం

కావడం వల్ల ఈమె వరాహిగా వెలుగొందుచున్నది. నాలుగు చేతులలో ఢమరుకం, ఖడ్గం, పాశం, కపాలం ధరించి ఉన్నదీమె. యాత్రికులు ఈమెకు కుంకుమ పూజ, శ్రీ లలితా సహస్రనామపూర్వకంగా జరిపించి, తృప్తి పొందుచున్నారు.

ఆలయ ప్రాంగణమున గల వల్లుబండ చూడ దగ్గది. భక్తులు వల్లుపట్టి వల్లుబండ మహిమ వల్ల తమ కోరికలు తీరుతాయా లేదా అని తెలుసు కుంటారు.

తదుపరి ఇచ్చటి కోడె స్థంభాలు కూడా ఎంతో ప్రతిష్టను, ప్రాముఖ్యాన్ని సంపాదించుకొన్నవి. ధ్వజ స్థంబానికిరువైపులా కోడె స్థంబాలున్నవి. స్వామి కృప వలన సంతానం పొందినవారు, రోగములు భూత ప్రేత పిశాచములనుండి విముక్తులైన వారు, ఇక్కడ కోడెలను కట్టి తమ తమ మ్రొక్కుబడులను తీర్చుకుంటారు. మరికొందరు కోడెలను స్వామికి సమర్పిస్తారు. మరి కొందరు అద్దెకోడెలను (అనగా తగు మూల్యము చెల్లించి ఆలయ కోడెలను పూజిస్తారు) స్వామి వారికి సమర్పిస్తారు. కోడెలను పూజించి వృషభరూపంలో వున్న ధర్మ దేవతను పూజించడంగా భావిస్తారు. ఇట్టి సంప్రదాయం వేములవాడ శ్రీ రాజరాజేశ్వరి ఆలయంలో తప్ప మరే క్షేత్రంలో లేదు.

గండా దీపంలో నూనె పోయడం మరియొక పూజా కార్యక్రమమిచ్చట ఎత్తుగాన్ను స్థంభం మీద పెద్ద ప్రమిద వున్నది. కష్టాలు పడుతున్నవారు గండా లను స్వామి కృపవల్ల గట్టెక్కిన వారు ఈ దీపంలో నూనె పోస్తారు.

ఇచ్చటెన్నో విష్ణ్వాలయాలు కలవు. శ్రీ రాజ రాజేశ్వర స్వామి నైఋతి దిక్కున ఇవి వున్నవి. శ్రీ అనంత పద్మనాభ స్వామి ఆలయముఖ ద్వారము పైనున్న నటరాజ స్వామి తాండవ నృత్య దృశ్యం చూడదగ్గది. ఇంకొక అద్భుత దృశ్యం ఏమంటే శ్రీ అనంత పధ్మనాభస్వామి పానవట్టం మీద శయనించి వుంటాడు. ఈయన శేషశాయి కాదు. స్వామి పాదాల దగ్గర లక్ష్మి, క్రింద రామానుజస్వామి ఉన్నారు. ఆళ్వార్ల విగ్రహాలు కూడ ఇచ్చట కలవు. ఈ ఆల యం కూడ ఎంతో ప్రాచీనమైనది. ఇది రాజ రాజేశ్వర స్వామి ఆలయానికి సమకాలీనమని భక్తులు నమ్ముతారు. ఈ ఆలయానికి దక్షిణాన శ్రీ కోదండ రామాలయం ఉన్నది. సుమారు రెండు వంద సంవత్సరాల క్రితం ఈ విగ్రహం ప్రతిష్ఠించబడినదని ఇక్కడి వారు చెబుతారు. శ్రీ అనంత పద్మనాభ స్వామి ఆలయ ముఖ మండపంలోనే, ఎడమ భాగాన శ్రీ వేంకటేశ్వరస్వామి, ఆయన కుడివైపున రుక్మిణీ సత్యభామా సహిత శ్రీ వేణుగోపాల స్వామి మందిరాలు న్నవి. ఈ విగ్రహాలన్నీ ఎంతో అందముగాను, ఎంతో ఆకర్షణీయం గాను, మహిమాన్వితంగాను ఉన్నాయి.

శ్రీ బాల రాజేశ్వరాలయం శ్రీ రాజరాజేశ్వ రాలయానికి ఈశాన్య దిక్కున వున్నది. ఇక్కడ మరియొక గొప్ప విశేషమేమంటే, హజరత్ ఖ్వాజా బాగ్ సవర్ ఖిల్లా శ్రీరాజరాజేశ్వరాలయానికి ఈశాన్య దిక్కున వున్నది. పూర్వం శ్రీ రాజరాజేశ్వరాలయం నాశనం చేసే ప్రయత్నంలో గర్భగుడిలో ప్రవేశించిన ఖ్వాజా భాగ్‌సవర్ రక్తం కక్కుకుని, అక్కడే మరణించాడట. అయినప్పటికీ ఈశ్వరుని కటాక్షం పొందాడట ఇతడు.స్వామి తన భక్తుడికి కలలో కనపడి ఖ్వాజా భాఘ్‌సవర్ సమాధిని తన పాదాలవద్దనే కట్టించమని ఆదేశించాడట. హిందువులు, మహమ్మదీయులు ఈ దర్గాలో మొక్కులు చెల్లించుకుంటారు. ప్రాచీన కాలంనుంచే వేములవాడలో మత సామరస్యం, లౌకిక సిద్ధాంతపరంగా ప్రత్యక్షంగా ఆచరింపబడటూ నేటికి ఈ దర్గా ఆదర్శంగా నిదర్శనంగా ఉన్నది. ఈ ఏర్పాటు చాలా అరుదైన గొప్ప విషయంగా వున్నదిచట.

వేములవాడలో ఇంకను అనేక ప్రసిద్ధ దేవాల యములు కలవు. ఇచట గల శ్రీ భీమేశ్వరాలయము

ఎంతో ప్రాముఖ్యమును పొందినది. ఈ ఆలయము విశాలంగా వున్నది. ఎత్తైన పునాది పీఠం మీద నిర్మింప బడియున్నది. ఆచటి వాతావరణం ప్రశాంతంగావుండి, భగవధ్యానానికి ఎంతో వీలుగ ఉన్నది. ఎన్నో అందమైన శిల్పాలు పునాది పీఠంపై చెక్కబడి వున్నవి. పంచ తంత్ర కథ అందంగా చెక్కబడి ఉన్నది. ధ్యాన బుద్ధుడు, పరశు రాముడు, ఉగ్ర నరసింహమూర్తి ఎన్నో రకాల పక్షులు, జంతువులు ఎంతో అందంగా చెక్కబడి ఉన్నవి. వాయువ్యాన శ్రీ వీరాంజనేయ మందిరం చూడదగ్గది. ఈ ఆలయం ముందు ఎత్తైన అరుగు ఉన్నది. ఇచట పురాణ కాలక్షేపాలు ఆరాధనోత్సవాలు జరిగేవట.

శ్రీ భీమేశ్వరాలయ మహామంటపం అనేక ఎత్తైన నున్నటిస్థంభాలతో, అద్భుతమైన పనితనంతో నున్న పై కప్పు ఎంతో రమణీయంగా ఉన్నది. గర్భ గుడిలో చతురస్రంగా పానవట్టం మీద మూడడుగుల వలయంతో పెద్ద శివలింగము భక్తులను ఆకర్షిస్తూ ఎంతో వైభవంగా ఉన్నది. ఈ ఆలయం వేములవాడ చాళుక్య వంశజుడైన రెండవ యుద్ధ మల్లుని కుమారు డైన బద్దెగ భూపాలునిచే క్రీ॥శ॥ 9వ శతాబ్దంలో నిర్మింప బడినదన్న విషయం ఇచ్చట గల శాసనాలవల్ల తెలుస్తున్నది.

వాక్శుద్ధి కలిగిన మహాకవి వేమువాడ భీమకవి. ఈ భీమేశ్వర వర ప్రసాదమని పెద్దలు అభిప్రాయ పడుచున్నారు.

ఇచ్చటి శ్రీకేదారేశ్వరాలయము, అనేక శిల్పాలతో కడు రమణీయముగ నున్నది. ఈ ఆల యము కళ్యాణి చాళుక్యుల కాలంలో నిర్మింపబడిన దని పండితాభిప్రాయము. ఇచ్చట గల శ్రీ నగరేశ్వ రాలయము కూడ ప్రాచీనమైనదే.

ఈ నగరేశ్వరాలయమునకు సమీపముననే బుద్ధిపోచమ్మ లేక శీతలదేవి ఆలయం వున్నది.ఇదీ ప్రాచీనాలయమే. ఇచ్చట పోచమ్మకు నిత్య పూజలు జరుగుచున్నవి. ప్రతి మాఘమాసంలో బహుళ అమా వాస్యకు గొప్ప జాతర జరుగుతుంది.

శ్రీ రాజరాజేశ్వరీ క్షేత్రము రాజధానిగా చేసికొని చాళుక్య రాజులు వేములవాడచాళుక్య రాజులని ఎంతో కీర్తిని పొందిరి. వీరి రాజ్యవైభవము క్రీ॥శ॥ 750 మొదలు క్రీ॥శ॥ 973 వరకు సాగినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఈ చాళుక్య రాజులలో రెండవ అరికేసరి శాసనములందు ఈ దేవాలయ ప్రాశస్త్యము తెలియుచున్నది. ఈ రాజుల సాహిత్యసేవ చిరస్మరణీ యము. రెండవ అరికేసరి, అతని వంశజులు రసికులు, కళాపోషకులు, సాహిత్య ప్రియులు, కవులను పండితు లను పోషించిరి. కన్నడకవులలో ప్రథముడగు, పంపన మహాకవి రెండవ అరికేసరి ఆస్థానకవిగ వర్ధిల్లెను. ప్రసిద్ధ జైన రచయిత, వేదాంతి సోమదేవ సూరి వీరి కాలముననే యుండెను. ఈ కాలముననే ప్రాచీనాంధ్ర మహాకవి భీమన ఇచటనుండెను.

ఈ ప్రాచీన వేములవాడ పట్టణము క్రీ॥శ॥ 750 నుండి 973వరకు చాళుక్య రాజుల కాలమున ఎంతో వైభవముగ శిల్పాది కళలకు, జైన, శైవ, వైష్ణవ శాక్తే యాది వివిధ మతములకు సంస్కృతాంధ్ర కర్నాటక భాషావాహినుల పవిత్ర త్రివేణీ సంగమ స్థలమై విరాజిల్లి నది. ప్రసిద్ధి చెందిన వేమువాడ కాలక్రమాన చిన్న పల్లెగా మారినను, శ్రీ రాజరాజేశ్వర క్షేత్రము దినదిన ప్రవర్ధమానమై ఆశ్రిత జనమందారమై, భక్తుల పాలిటి కల్పతరువై కోరిన కోర్కెలు దీర్చుచు, ముఖ్య మైన తీర్థ రాజములలోనొకటిగవిరాజిల్లుచూవచ్చినది.

శ్రీ రాజరాజేశ్వర దేవస్థానము ఒక సంస్కృత పాఠశాలను నిర్వహిస్తున్నది. వీని నిర్వహణకు దేవ స్థానము ఎంతో పాటుపడుచున్నది.

హైదరాబాద్ నుంచి 115 మైళ్ళ దూరాన నున్నది. కరీంనగర్ జిల్లాలో కరీంనగర్ కామారెడ్డి

రోడ్డు మీద కరీంనగర్ నుండి 23 మైళ్ళ దూరంలో ఉన్నదీ క్షేత్రం.

అనేక ధర్మశాలలు, యాత్రిక కుటీరాలు ఆధునిక సౌకర్యాలతో వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన యాత్రికులు నివసించడానికి అనుకూలంగా దేవస్థానము నిర్వహిస్తున్నది.

## ధర్మపురి శ్రీ నరసింహస్వామి దేవస్థానము

కరీంనగర్ జిల్లాలో మరియొక ప్రసిద్ద దేవాలయము ధర్మపురి శ్రీనరసింహస్వామి. పవిత్ర గోదావరీ తీరమున వెలసిన పురాతన వైష్ణవ క్షేత్రమిది. అదిలాబాద్ కరీంనగర్ జిల్లాల సరిహద్దుగానున్న ఈ పవిత్ర గోదావరి దక్షణ దిశగా ప్రవహిస్తూ ఈ క్షేత్ర పవిత్రతకు కారణ భూతమైనది.

ఈ క్షేత్రము జగిత్యాలకు సుమారు 40 కి॥మీ॥ దూరముననున్నది. కప్పారావు పేట మీదుగా కరీంనగర్ నుంచి బస్సు సౌకర్యము కలదు. మంచిర్యాల రైల్వే స్టేషను నుంచి వెంకటాపురం మీదుగా ఈ క్షేత్రము చేరవచ్చు.

ఎంతో పవిత్రతను సంతరించుకున్న ఈ క్షేత్రమును చేరుటకు కొంత ఇబ్బంది కలిగినను ఎలాంటి ప్రయాసకు లోనుకాక యాత్రికులు ఈ క్షేత్రమును దర్శించి తృప్తులగుచున్నారు. ఈ క్షేత్రమహాత్మ్యమే అందుకు కారణము.

ధర్మపురి ప్రఖ్యాతి వేదపండిత సముదాయమును కలిగిన పురాతన గ్రామము. ఎంతో పవిత్రతను కలిగి ఎందరో సంస్కృ పండితులనుఅందించిన పుణ్యస్థలి ధర్మపురి.

ఇచ్చట శ్రీ నరసింహస్వామి దేవాలయము ఎంతో పురాతనమై పవిత్రతను సంతరించుకొన్నది. ఈ పుణ్య భూమిని వెలసిన శ్రీ నరసింహుని చరిత్ర బ్రహ్మాండ పురాణాంతర్గతమైనది. సంస్కృతమున గల ప్రాచీన వ్రాతప్రతి 'ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము' నందు ఈ స్వామి మహాత్మ్యము వివరించబడినది.

శ్రీహరి హిరణ్యాకశిపుని సంహరించుటకు నరసింహరూపము దాల్చి వానిని అంతమొందించెను. తన ప్రియభక్తుడైన ప్రహ్లాదుని కాపాడి ప్రహ్లాదవరదునిగా ప్రసిద్ధుడాయెను.

హిరణ్యకసిపుడు గొప్ప శివభక్తుడు. తనకు ముప్పు తప్పదని తలచి తన అవసానదశలో అతడు పరమశివుని రక్షించవలసినదిగా ప్రార్థించెను. పరమశివుని భక్తవాత్సల్యముచే భక్తుని కాపాడదలచి 'శరభ' రూపమున శ్రీహరితో పోరెను. పరమశివుడే శరభ రూపమున తన భక్తుని కాపాడదలచి తనతో కయ్యమునకు తలపడినందున శ్రీహరి తన శక్తియుక్తుల నన్నిటినీ ప్రదర్శించక తప్పలేదు. ఆ కారణమున పరమ ఉగ్రమూర్తియై తీవ్రతరమైనకోపముతోతన వశము కాని ఉగ్రరూపము దాల్చి రాక్షస సంహారము, శరభ సంహారము చేసెను. అట్టి ఉగ్రరూపమున దండకారణ్యమున సంచరించూ నరసింహుడై కార్య సాఫల్యము చేసినను తన ఉగ్రరూపమును ఉప సంహరించక యున్న తరుణమున బ్రహ్మ దేవుడు ఉగ్రమూర్తిని శాంతిప చేయదలచి ఆ దండకారణ్యమున ఘోర తపముచేసెను.

అట్టి సమయమున ధర్మవర్మ అనెడి ఆ ప్రాంత మహారాజు సమస్త పురుషార్థమును తెలియగోరి విష్ణశర్మ అనెడి పరమ పవిత్ర ధార్మిక శ్రేష్ఠుని ప్రోద్బలమున శ్రీహరి సేవయే ముక్తి మార్గమని తెలిసికొని శ్రీహరిని గూర్చి దృఢ చిత్తుడై తాను కూడ తపమాచరించెను. బ్రహ్మ దేవుని కూడ రంజింప చేయనెంచెను. బ్రహ్మదేవుని కటాక్షము బడసి నరసింహుని ప్రసన్నుని గావించుకొని ధన్యుడయ్యెను.

శ్రీహరి బ్రహ్మదేవుని తపమునకు ధర్మవర్మ కఠోర తపదీక్షకు మెచ్చి వారికి ప్రత్యక్షమయ్యెను.

బ్రహ్మదేవుని కోరిక మేరకు ఉగ్రరూపమున వెలసి, బృగు శాపగ్రస్థుడైన బ్రహ్మదేవుని కాపాడెను. తదుపరి సౌమ్య రూపమున అచ్చట వెలసెను. అదియే నేటి ధర్మ పురి ప్రాంతము.

ధ్రువమూర్తిగా పద్మాసనుడై యోగమూర్తిగాఈ క్షేత్రమున వెలసి భక్తుల పాలిటి కరుణామయునిగా కీర్తి గాంచెను. ఇచ్చట బ్రహ్మదేవుని మూర్తి కూడా ప్రతిష్ఠించబడినది.అరుదైన ఇట్టి మూర్తిని సేవించి భక్తులు ఎంతో తృప్తి చెందుచున్నారు. ఆనాటినుండి ధర్మ వర్మ పేరున ధర్మపురిగా ఈ క్షేత్రము ప్రసిద్ధినొందినది.

ఇచ్చట యముడు, మురళీకృష్ణుడు, బల రాముడు, హనుమంతుల విగ్రహములు చూడదగ్గవి. నాల్గుముఖముల బ్రహ్మదేవుని మూర్తి దర్శించదగ్గది.

బ్రహ్మాండ పురాణమునననుసరించి శ్రీ నర సింహమూర్తి గోదావరి నది పుట్టుకకు ముందుగానే ఇచ్చట వెలసియున్నట్లు తెలియుచున్నది. అందు వలన ఈ క్షేత్ర ప్రాచీనత, మహాత్మ్యము వెల్లడి అయినవి.

భద్ర ఉపనది గోదావరిలో కలియు ప్రదేశ మిదియే. ఇచ్చటనే భద్ర అనే పుణ్యచరిత శ్రీహరిని గూర్చి తపమాచరించి భద్రనదిగా రూపొంది శ్రీనర సింహుని సరసన శాశ్వతరూపు దాల్చినట్లు తెలియ చున్నది.

ఈ క్షేత్రమునగల శ్రీరామలింగ క్షేత్రము కూడా బహు ప్రసిద్ధిగాంచినది. ఈ శైవ క్షేత్రము లంకనుంచి తిరిగి వచ్చునపుడు శ్రీరామచంద్రుడు దర్శించినట్లు పురాణకధనము కలదు. ఈ క్షేత్రము కూడా ఎంతో పురాతనమై దర్శనీయమగుచున్నది. ఇచ్చటి నూతన నరసింహస్వామి క్షేత్రము, గోమ తేశ్వర క్షేత్రము. ఎంతో ప్రసిద్ధి చెందియున్నవి.

ఎంతో శ్రమకోర్చి, తపస్సుచేసి గోదావరిని చటకు తెచ్చిన గౌతమమహాముని ప్రతిష్ఠితమైన గోమతేశ్వరుడు. ఇచ్చట వెలసియుండుటవలన ఈ క్షేత్ర పవిత్రత ఇనుమడించినది.

ఇచ్చట గల దత్తాత్రేయుని ఆలయము శ్రీరామాలయము పేర్కొనదగినవి.

ఇట్టి మహిమాన్వితమైన హరిహర క్షేత్రము ఆది దేవుల కిరవై పరమపవిత్రమై దర్శనీయమైనదని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

## కాళేశ్వరము : శ్రీ కాళేశ్వర, ముక్తేశ్వర దేవాస్థానము

కరీంనగరర్ జిల్లాలో ప్రసిద్ధి చెందిన శైవ క్షేత్రము కాళేశ్వరము.

మహాదేవపురం నుండి 20 కి||మీ|| దూరమున శ్రీ కాళేశ్వర క్షేత్రము ।ప్రాణహిత, గోదావరి పవిత్ర సంగమ స్థలమున నిర్మింపబడిన పవిత్ర శైవ క్షేత్రము ఈ క్షేత్రము త్రిలింగములలో నొకటిగా ఖ్యాతి గాంచినది. మన ఆంధ్ర దేశమునకు సరిహద్దుగా నున్నది.

శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వరములు, త్రిలింగ ములుగ ప్రసిద్ధి చెంది యున్నవి. ప్రాచీన ఆలయమీ కాళేశ్వరము. శిథిలాలయంపై పునర్నిర్మింపబడినది. ఇచ్చట జైన, బౌద్ధ నిర్మాణములనేకములున్నవి. ఈ క్షేత్రమెంతో ప్రఖ్యాతి చెందినది.

ఒకే పానవట్టములో శ్రీ కాళేశ్వర లింగము శ్రీముక్తేశ్వర లింగము ఉన్నాయి. ఈ విధమైన శైవ క్షేత్రము ఎక్కడను కానలేము. మొదట శ్రీ కాళేశ్వరుని పిదప శ్రీ ముక్తేశ్వరుని పూజించాలట. ఈ విధమైన పూజలు చేసిన భక్త వర్యులకు యమలోక బాధలు లేక మోక్ష ప్రాప్తికలుగునని భక్తుల నమ్మిక.

శ్రీముక్తేశ్వర లింగము పైభాగమున చిన్నరంధ్రములున్నవి. ఆ రంధ్రములలో ఎంత నీరు పోసినా బయటకు రాదు. ఈ బిలములు గోదావరి లోనికి కలుపబడ్డాయని పెద్దలు చెబుతారు. ఈ ఆలయ శిల్పము పురాతనమైనదే కాక కడు రమణీయమై యుండును.

ఇచ్చట శ్రీవేంకటేశ్వర, శ్రీసరస్వతీ, శ్రీ బిందుమాధవ, శ్రీవీరభద్రేశ్వారాలయములు చూడదగ్గవి.



# నిజామాబాద్ జిల్లా

నిజామాబాద్ జిల్లాకు పన్నెండువందల సంవత్స రముల రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక చరిత్ర కలదు. కళ్యాణి చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు కాకతీయులు, పద్మనాయకులు పరిపాలించిన మండల మిది. అనేక రాజకీయ ప్రభావములకు గురియై ఎందరో సుప్రసిద్ధ పండితులకు కవులకు జన్మ భూమి యై పేరెన్నికగన్నదీ నిజామాబాద్ జిల్లా. క్రీశ పదవ శతాబ్దిలో కన్నడసాహిత్యమున రత్నత్రయమని ఎన్ని కగన్న ముగ్వురిలో పంప మహాకవి మొదటి వాడు. ఈతని సమాధి ఈ జిల్లాలో "బోధన్" నందు కలదు.

క్రీశ పదునాల్గవ శతాబ్దమున కొఱవి సత్య నారన రామాయణము వ్రాసి పేరందెను. క్రీశ 1430లోనున్న శ్రీ కొఱవి గోపరాజు ఈ జిల్లావారే. ఈయన "సింహాసన ద్వాత్రింసికను" మనకు ప్రసా దించిన మహా మహులు. సాహిత్యముననియ్యది విజ్ఞాన సరస్వమని పేరొందినది. ఇంకనూ అనేక మంది ఈ జిల్లాలో ఎంతో సేవ చేయుచున్నారు. ఈ జిల్లాకు చెందినవాడేనటవ సంస్కృత నాటక కర్త భవభూతి !

ఈ జిల్లాలో ఎన్నో ప్రసిద్ధ దేవాలయము లున్నవి. ప్రఖ్యాత మహా రాష్ట్ర స్వామిగా పేర్గాంచిన సమర్థ రామదాసుచే ప్రతిష్ఠించబడిన సుమారు పద కొండు వందల మఠాలలో ముఖ్యమైన రెండు మఠాలు (దేవాలయాలు) ఈ జిల్లాలో నున్నవి.

ఇంకను ఎందరో మహానుభవులు ఈ గడ్డపై వెలుగొందు చున్నారు. భారతఉపగ్రహమును అంత రిక్షములోనికి వదలిన రోజులలో శ్రీ హరి కోట నుండి వెలువడిన వార్తలలో భాస్కరుని ఉదంతమున్నది. ఈ విజ్ఞాన వేత్త భాస్కరుడు ఈ జిల్లాలోని వాడేనట.

ఈ జిల్లాలో ప్రసిద్ధి చెందిన దేవాలయము లెన్నో కలవు.

**శ్రీ నీలకంఠేశ్వర స్వామి దేవాలయము : నిజామాబాద్ పట్టణం.**

ఈ దేవస్థానము నిజామాబాద్ పట్టణమునకు ఉత్తరమున నిజామాబాద్ నుండి కరీంనగర్ పోవు జాతీయ రహదారి ప్రక్కన నెలకొని యున్నది. ఈ దేవాలయము పెద్దది. ఎంతో విశాలమైన ప్రాంగణ

ములో నెలకొనియున్న ఈ దేవాలయము కాక తీయుల కాలమున నిర్మాణము గావించబడినది. శివ కేశవుల వాస స్థానమైన ఈ దేవాలయము ఎంతో దర్శనీయముగ నుండును.

ఇచ్చట ఒక పెద్ద రాతి నంది మండపములో కలదు. స్థానికుల కథనాన్ననుసరించి ఈ దేవాలయము కట్టిన గుప్త భక్తుని తల్లి ప్రతిరోజు దేవాలయము కట్టుచున్న దినములలో తన కుమారునికి ఆహారము తీసుకొని వెళ్ళేడిదట. అతనికి ఒక చెయ్యి ఒక కాలు లేవట. గుడి కట్టడం పూర్తయిన ఒక రోజు తనకు తిండి పెట్టిన తరువాత ఆ భక్త శిఖామణి తన తల్లితో ఈ రోజు నీవు ఇంటికి తిరిగి వెళ్ళేప్పుడు ఇక నా కొరకై వెనక్కు తిరిగి చూడవద్దు అని చెప్పినాడట. ఆ తల్లికి సందేహము కలిగి ఇంటికి తిరిగి వెళ్తూ వెనుకకు తిరిగి చూసినదట. అపుడా భక్తుడు ఎవరికీ కనిపించకుండా పరమేశ్వరునిలో ఐక్యమయినా డట. ఆమె కూడా మరణించినదట! ఆమె సమాధి దేవాలయానికి దగ్గరలోనే యున్నది. ఈనాటికి రథ సప్తమి నాడు స్వామిని ఆమె సమాధి వరకూ ఊరేగింపు గా తీసుకుని వెళ్ళి వెనుకకు తరలించే ఆచారం ఉన్నది.

తంబళ్ళ వాళ్ళు కొంతకాలం ఈ దేవాలయం లో పూజారులుగా ఉండేవారట. తరువాత పూజారులు వచ్చారు.

ఇచ్చటి స్వామి స్వయంభూవుగా పెద్దలు చెబుతారు. ప్రతి సంవత్సరము రథసప్తమికి రెండు రోజులు ఉత్సవము జరుగుతుంది. వేలాది భక్తులు వచ్చి స్వామిని దర్శించి తృప్తులగుచున్నారు.

మాఘ శుద్ధపంచమి మొదలు సప్తమి వరకు సూర్య కిరణములు శివలింగముపై పడుట ఇచ్చటి విశేషముగా చెప్పుచున్నారు. రథ సప్తమికి పెద్ద జాతర జరుగుతుందిచ్చట. శివరాత్రికిచ్చట విశేష పూజలు జరుపుట ప్రత్యేకము. ఈ దేవాలయమునకు భూ వసతి కలదు. ఎంతో అభివృద్ధిని సాధిస్తున్న ఈ దేవాల యము దర్శించతగినది.

## మహావీర రుద్ర హనుమాన్ దేవస్థానము : నిజామాబాద్ పట్టణం.

నిజామాబాద్ పట్టణమునకు సుమారు 5 కి॥మీ॥ దూరమున (రైల్వే స్టేషను నుంచి 8 కి॥మీ॥క దూర మున) గల ఈ దేవస్థానము ఎంతో ప్రసిద్ధి చెందినది.

క్రీ॥శ॥ 1608-1682 వరకు జీవించినట్లు తెలియుచున్న మహాయోగి పుంగవుడు శ్రీ సమర్థ రామదాసుల వారు నెలకొల్పిన బ్రహ్మచారి సంప్ర దాయమునకు చెందిన మఠము మరియు మహా వీర రుద్రహనుమాన్ దేవాలయము ప్రసిద్ధి చెందియున్నవి. ప్రశాంత వాతావరణమున గల కొండ వాలు ప్రదేశమున విశాల ప్రాంగణమున గల ఈ దేవాలయము కడు దర్శనీయముగ నున్నది.

నిజామాబాద్‌నే ఇందూరు అనేవారు. ఇచ్చటి నవాబు ఇప్పటికి సుమారు నాలుగు శతాబ్దముల క్రిందిటివాడు. ఈతని పరిపాలనా కాలంలో ఒకప్పుడు ఈ ప్రాంతము తీవ్ర అనావృష్టికి గురియై ప్రజలు వర్షములు లేక అనేక బాధలు పడుచుండిరి. కరువు కాటకములు రాజ్యమేలు చుండెను. నవాబు ఎందరో భక్తులను పండితులను పిలిపించి పూజలు చేయించు చుండెను. పూజలు చేయకపోతే కఠిన శిక్షలు విధించు చుండెను. ఛత్రపతి శివాజీ ఆనాడు చక్రవర్తిగా విశాల సామ్రాజ్యమును పాలించుచుండెను. అట్టి సమయ మున మహా యోగి పుంగవుడు సమర్థ రామదాసువారు దక్షిణదేశ తీర్థ యాత్రలు చేయుచూ తమ శిష్య మండలితో ఇచ్చటికి వచ్చి అపుడు జరుగుచున్న పూజలు గమనించి చాల సంతృప్తి చెంది తాము కూడ పూజలలో పాల్గొని, తాము చెప్పి, చేసిన ప్రకారము అనుష్ఠానములు చేసిన వర్షములు పడునని చెప్పి,వారిచే

చేయించుచుండెను. సమర్థరామదాసు వారు ఒక పెద్ద రాయి ఎంచుకుని శ్రీ ఆంజనేయ స్వామివారి బొమ్మను బొగ్గుతో గీసి దానిపై గుడ్డను కప్పి అభిషేకము చేయసాగెను. స్వామివారు అనుష్టానము చేయు సమయమున కొంతసేపటకి మెరుపు వచ్చినది. ఆ మెరుపుతో శ్రీ ఆంజనేయ స్వామి స్వయం వ్యక్తమై వీరుగీసిన బొగ్గు బొమ్మరీతిలో వెలిసినారు. సమర్థ రామదాసు చుట్టనూ చూసి ఆకాశము వైపు చూడగా వర్షము కుండపోతగా కురిసెను. స్వామికి వెంటనే స్వాగత సత్కారములు సలిపి బహురీతిని భక్తి పురస్సరముగా ఘన సన్మానము చేసిరి. నవాబు స్వయముగా వచ్చి స్వామిని ఇందూర్ (నిజామాబాద్) తీసికొనిపోయెను. అచ్చట కూడా శ్రీ సమర్థ రామదాసు వారు శ్రీ రామచంద్రుని స్థాపించిరి.

ఆనాటి నుంచి బ్రహ్మచారి సంప్రదాయముతో ఈ ప్రదేశము, మఠమును శ్రీ ఉద్ధవ స్వామిని మఠాధిపతిగా నెలకొల్పిరి. ఈ ప్రాంగణమున ఈ మఠాధిపతుల సమాధులు కలవు.

ప్రస్తుతం శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయము ఎంతో వైభవోపేతముగ నడుపబడుచున్నది. ఇతర దేశములనుంచి కూడా యాత్రికులు వచ్చుచున్నారు.

## శ్రీ రఘునాధ దేవాలయము : నిజామాబాద్.

శ్రీ రఘునాధ దేవాలయము నిజామాబాద్ పట్టణంలో గల మరియొక ప్రసిద్ధ దేవాలయము. ఈ పురాతనమైన ఈ దేవాలయమును హనుమాన్ దేవాలయము ప్రతిష్ఠించిన పిదప అనగా సుమారు నాలుగు శతాబ్దముల క్రిందట శ్రీ ఛత్రపతి శివాజీ కాలమున శ్రీ సమర్థరామదాసు గారు ఈ దేవాలయమును నిర్మించి యున్నారని ప్రసిద్ధి. శ్రీ రామచంద్రుడు సీతాదేవి, లక్షణుడు మరియు హనుమాన్ విగ్రహములు కూడా కలవు. శ్రీ రఘునాద్ అనెడి భక్తుడు ఈ దేవాలయమును కట్టించెనని మరియొక కథనము కూడా కలదు.

ఇచ్చట ప్రతిసంవత్సరము శ్రీ రామనవమికి పదిరోజులు ఉత్సవములు జరుగును. ఈ ఉత్సవ సమయమందు భక్తులకు భోజన సదుపాయములు జరుగును. ఈ దేవాలయము జైలు ఆవరణలోనుండి ఒక ప్రత్యేక గోడకట్టి వేరు చేయుచున్నారు. క్రీశ 1906 సం॥ నుండి ఈ దేవాలయము ప్రచార మందున్నది. సుమారు నూరడుగుల ఎత్తైన మెట్ట పైనున్న ఈ దేవాలయము విశాల ప్రాంగణమున నుండుటచే ఎంతో అభివృద్ధిని సాధించుటకు ఎంతో అవకాశమున్నది.

## శ్రీ రామమందిరము : నిజామాబాద్ పట్టణము

ఈ దేవాలయము నిజామాబాద్ పట్టణములో నున్నది. పురాతనమైన ఈ దేవాలయము ఈ పరిసర ప్రాంతములయందు ప్రసిద్ధి చెందినది. ఈ దేవాలయము బడా రామ మందిరము అని కూడా అంటారు. సుమారు నాలుగు వందల సంవత్సరాల క్రిందట శ్రీ ఛత్రపతి శివాజీ కాలమున శ్రీ సమర్థ రామదాసు గారు నిర్మించిరని జనశ్రుతి. శ్రీ హనుమాను మందిరం ప్రతిష్ఠ తరువాత ఈ దేవాలయము ప్రతిష్ఠించబడినదని పెద్దలు చెబుతారు. శ్రీ రామ చంద్రుడిచట ముఖ్య విగ్రహము. సీతా దేవి లక్ష్మణ స్వామి, శ్రీ హనుమాన్ విగ్రహములు కూడా కలవు.

ప్రతి సంవత్సరం శ్రీ రామనవమికి పదిరోజులు ఉత్సవములు జరుగును. ఈ దేవాలయమునకు భూవసతికలదు. మహా రాష్ట్రంలో కూడా భూవసతి కలదు.

ఈ దేవాలయమును ప్రస్తుతం శ్రీ దినకర స్వామి మహరాజ్ నిర్వహించుచున్నారు. ఎంతో దర్శనీయముగా నున్న ఈ దేవాలయము ప్రసిద్ది గాంచినదీ ప్రాంతములో

## శ్రీ సిద్ధిరామేశ్వర దేవాలయము : బిక్కనూరు.

ఈ క్షేత్రము నిజామాబాద్‌నకు సుమారు డెభై కి॥మీ॥ దూరమున నిజామాబాద్ హైదరాబాద్ జాతీయ రహదారిపై మధ్యలోనున్నది. ఈ గ్రామము చేరుటకు (బిక్కనూరు) రైలు సదుపాయము కూడా కలదు.

శ్రీ సిద్ధగిరి, శ్రీ రామగిరి అను తాపసులు తపః ఫలముగా అపురూపముగా సిద్ధ రామేశ్వర దేవస్థానము రూపు దిద్దుకొనినది. ఈ ఆలయము భక్త జనులకు ఆరాధ్య ప్రదేశముగ, పరమ శివుని క్షేత్ర రాజముగ ప్రసిద్ధి నొందినది.

సర్వ రక్షకుడైన పరమ శివుని లింగరూపము ఇచ్చట విశేషము. అన్ని శివలింగముల వలె ఎత్తుగా ప్రత్యక్షముగ కనపడదిచ్చట. అందమైన పానవట్టము దాని క్రింద శివలింగము ఇచ్చట చూడగలుగుతాము. ఈ విధముగా ఈ ప్రత్యేక శివలింగానికి మంచి గంథము పుష్పములు పసుపు కుంకుమలతోను పూజలు చేస్తుంటారు భక్తులిచ్చట. వీరశైవ శాఖవారు మొదటి నుంచి వారి వారి కుటుంబములలో ఒకరు సన్యాసి గాను మరొకరు పూజారిగాను వ్యవహరించుచు వారి సంప్రదాయము ననుసరించి భక్తులను ఆశీర్వదించి పంపుతూ ఉంటారు. ఈ క్షేత్రమునందలి ధర్మశాలల యందు (మండలము) దినములు ఉండి నిత్యము సంధ్య వేళలయందు ప్రదక్షిణలు చేస్తూ శ్రీ సిద్ధి రామేశ్వరుని సేవించుచూ, సర్వవ్యాధులనుంచి విముక్తి పొందుచున్నారు. వైద్యులకు వశముకాని రోగములు ఇచ్చట సేవల వలన గుణమిచ్చుచున్నవి. ఈ క్షేత్రము నకు అన్ని మతములవారు సకుటుంబముగా వచ్చి స్వామికి మొక్కుబడులు చెల్లించుచున్నారు. మత సామరస్య వైభవము ఇచ్చట గమనించ వచ్చును.

శ్రీ సిద్ధగిరి రామగిరి అను ఇద్దరు సాధు పుంగవులు బిక్కనవోలునందు శివలీలలను ధ్యానించుచు ఇచ్చట గల ఒక వట వృక్షము క్రింద విశ్రమించు చుండిరి. ఒకరోజు ఆ మట్టి చెట్టు దాపునగల పుట్ట వద్దకు వచ్చి ఈ సాధు పుంగవులు చూచుచుండ ఒక నల్లని గోవు వచ్చి పుట్టపై నిలబడి పాలధారలను పుట్టలోనికి వదలి తిరిగి తనదారిని పోవుచుండ వారు చూచి పుట్టలో ఎవరో దివ్య పురుషులున్నారనుకొని పుట్టను పెకళించిరి. వెనువెంటనే పరమశివుని లింగ రూపమున దర్శించి స్వామివారికి పూజలు సలిపి పిదప ఆయలమును నిర్మించి చరితార్థులైనారు. ఈ యోగ పుంగవులు సిద్ధగిరి, రామగిరి అను పేర్లుగల వారై నందున వారి పేర్లయందలి మొదటి రెండక్షరములు అనగా సిద్ధ, రామేశ్వరుడని ఈ క్షేత్రమున వెలసిన పరమ శివునికి ఆనాటినుంచి పేరు వచ్చినది. ఈ క్షేత్రమునకు వాయువ్య దిశలో భూచక్ర వృక్షము న్నది. ఆ వృక్ష ఛాయలో పార్వతీ దేవి సర్వదా వర ప్రదాయినియై వెలుగొందుచున్నది. ఇచ్చట ఈ అమ్మవారు చాలా మహిమ కలదని ప్రసిద్ధి చెందినది. ఈ దేవాలయ అంతరాలయమునందు పెద్దనంది కడు దర్శనీయముగనున్నది. తూర్పున పూలతోట కలదు. ఇచ్చట పూసిన పూలతో అమ్మవారికి స్వామివారికి పూజలు చేయుదురు. ఆగ్నేయముగ ఈ సాధు పుంగవులు త్రవ్వించిన బావి కలదు. ఇందు యంత్ర స్థాపన జరిగినది. ఈ బావినీటితోనే స్వామివారికి అభిషేకము చేయుచున్నారు. ఈ బావిలోని నీరు భక్తులందరకు పుష్కలముగ నుండి సరిపోవుచుండుట గొప్ప మహాత్మ్యమిచట. సమీపమున గల పుష్కరిణి బాగు చేయవలసియున్నది. ఈ క్షేత్రమున వివాహ ములు, శ్రీ సత్యనారాయణ వ్రతములు విరివిగా జరుగుచున్నవి.

శ్రీ సిద్ధమల్లు అను పేరుగల మహంతుల వారు క్రీ॥శ 1894 సం॥లో కొంత భూవసతిని దానమిచ్చిరి. ఆ భూమియే దేవాయలమునకు దఖలు పడినది. భూవసతిపై వచ్చు ఆదాయము ఈ ఆలయ

నిర్వాహణకు ఖర్చు చేయుచున్నారు. ఎంతో దర్శనీయమైనదీ క్షేత్రరాజము.

## శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయము : జానకం పేట.

ఈ దేవాలయము బోధన్ తాలూకా జానకం పేట జంక్షనుకు (దక్షణ మధ్య రైల్వే) సుమారు ఐదు కి॥మీ॥ దూరమున వెలసియున్నది. నిజామాబాద్‌కు సుమారు పది కి॥మీ॥ దూరమున కలదు. దేవాలయమునకు వెళ్ళుటకు రహదారి కలదు.

జానకం పేటలో వెలసిన శ్రీ నరసింహ స్వామి ఆలయము దాదాపు వెయ్యి వసంతాలు చవిచూసినది. అనగా తొమిదవ శతాబ్ది నాటిదీ దేవాలయము. మందిరమున ఎన్నో మార్పులు చేర్పులు జరిగినవి. ప్రస్తుతము బోదన్ పేరుతో నున్న ప్రాంతము ప్రాచీన కాలములో బౌద్ధ, జైన హిందూ సాహిత్యములలో అనేక పేర్లతో నుండెడిది. దీనిని రాజధానిగా చేసికొని పరిపాలించిన బోధన్ చాళుక్యులలో వీరిని వేములవాడ చాళుక్యులని పేర్కొనినారు. ముఖ్యుడైన రెండవ అరికేసిరి చాలా గొప్పవాడు. ఈయన జైన మత దేవాలయాలు, విద్యాలయాలు విస్తరింపజేసాడు. వానిలో ఈ దేవాలయం మొదటిది. జైన శిధిలాలు చిహ్నాలు ఈ ఆలయ ప్రాంగణములో ఎన్నో నేటికీ కనిపిస్తున్నవి. ఈయన నిర్మించిన ప్రతీ ఆలయమ ముఖ ద్వారముపై గజలక్ష్మి విగ్రహము ప్రతిష్ఠితమై ఉంటుంది. ఈ ఆలయముఖ ద్వారముపై గూడ గజలక్ష్మి విగ్రహము స్పష్టముగా కనిపించుచున్నది.

బోదన్ చాళుక్యులను ఓడించిన పశ్చిమ చాళుక్యులు (కళ్యాణీ చాళుక్యులు) జైన మతావలంబులు వీరి కాలమున జైన పద్దతిలో యజ్ఞశాలలు మొదలగునవి నిర్మించబడినవి. పిమ్మట కాకతీయుల పాలనలో మరికొంత అభివృద్ధి చెంది తలమానిక మనగల పుష్కరిణి (కోనేరు) అష్ట భూజములు గలిగి చిన్న గదులతో నిర్మించి వారి అభిరుచిని రానున్న తరములవారికి ఎరుకజేసారు. దీని ప్రక్కగ జైన ఆలయము శివాలయముగా మార్చారు.

క్రీ॥శ॥ పదమూడవ శతాబ్దినుండీ ఈ ప్రాంతము అనేక దాడులకు గురియైనది. అపుడీ ఆలయము కూడా కొంత శిధిలమైనది. ఛత్రపతి శివాజీ గురువైన సమర్థ రామదాసు మహా రాష్ట్రుల కాలములో ఈ ప్రాంతాన్ని పావనమొనర్చినారు. ఈయన ఇందూరు (నిజామాబాద్) సారంగపూర్ మందిరాలకన్న ముందుగా ఈ మందిరాన్ని దర్శించినారు. జీర్ణ దేవాలయోద్ధరణకై యత్నించినారు. ఈ ఆలయాన్ని నివాస యోగ్యముగా చేయుటయే కాక రాజకీయముగా చిన్న రక్షణ విడిదిగా మార్చి అశ్వశాల, పాకశాల మొదలైన వసతులు సమకూర్చినారు. అంతేగాక ఇక్కడనుండి సారంగపూర్ శ్రీ ఆంజనేయ స్వామి ఆలయం వరకూ సారంగ మార్గము నిర్మింపజేసారట. మొగలు సామ్రాజ్య పతనము చేయటకు గోలుకొండ సుల్తానులతో సమాఖ్య జరుపుటకు శివాజీ సారంగ మార్గములోనే వెళ్ళుచూ కొన్ని రోజులిచ్చటనే బస చేసినాడని పరిశోధకులు చెప్పుచున్నారు.

రెడ్డిరాజుల కాలములో శ్రీ నరసింహ స్వామి ఆలయముగా మారిన ఈ దేవాలయము ఎంతో దర్శనీయముగా నున్నది.

ఈ ఆలయమునకు భూ వసతి కలదు.

## శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆలయము : భీంగల్

ఈ క్షేత్రము నిజామాబాద్‌కు సుమారు 50 కి॥మీ॥ దూరములో అనగా నిజామాబాద్ నుండి కరీంనగర్ జాతీయ రహదారిలో మోర్తెడ్ నుండి పదిహేను కి॥మీ॥ దూరమున కలదు.

నింబాచల మహాత్మ్యమన పేరున ఈ గ్రామవాసులు సుమారు వంద సంవత్సరముల క్రిందట ఒక

కరపత్రము వేయించినారు. వ్రాత ప్రతులు కూడా లభ్యమగుచున్నవట. దీనికి సింహాంబ మహాత్మ్యము ఆధారముగ నొక స్థల పురాణ కదనము ప్రచారములో నున్నది. ఇది బ్రహ్మ వైవర్తక పురాణాంతర్గతము.

బ్రహ్మదేవుడు శివుని శాపము తొలగించు కొనుటకై ఇచ్చటనే శ్రీ నరసింహుని గూర్చి తపము చేసెను. అందుకు శ్రీ నరసింహుడు ప్రత్యక్షమైన పిదప కోరిన వరములు పొంది ఈ దివ్య క్షేత్రములోనే వెలసి భక్తుల కోర్కెలు తీర్చమని ప్రార్థించెను. బ్రహ్మ దేవుని కోరిక ననుసరించి అట్లే ఇచ్చట నరసింహుని రూపమున శ్రీహరి వెలసియుండెను.

ప్రాచీనమైన ఈ ప్రాంతమును ఏలుచున్న ధర్మపాలుడను చక్రవర్తి వేట నెపమున ఇచ్చటకు వచ్చి విశ్రాంతి గైకొని ఈ క్షేత్రనాధుని దర్శించి ఇచ్చట గల చింతామణి తటాక జలమహాత్మ్యమునకు ఆశ్చర్య పడి దాని తీరమున వెలసిన పర్వత గుహలోని శ్రీ నరసింహుని దర్శించి అచట తపము గావించి శాంతిని పొంది తృప్తుడై వెడలెను. భగవదాదేశముననుసరించి ఈ భూపతి శ్రీ నరసింహునికి అంగరంగ వైభోగములు కల్పించుటకై ఇచ్చటనే వేముగల్లు అను నగరము నిర్మించి దానిని తన రాజధానిగా మార్చుకొనెను. ఇచ టనే ఉండి రాజ్యపాలన చేయుచు ఈ క్షేత్ర స్వామిని పూజించుచు కళ్యాణోత్సవాదులు నిర్వర్తించుచూ ముక్తిని పొందెను. ఇంకను ఎందరో ఈ క్షేత్ర స్వామిని దర్శించి తృప్తులయినారు.

ఈ దేవాలయమునకు భూవసతి కలదు. ఎన్నియో బంగార ఆభరణములు కలవు. ఎంతో అభివృద్ధి సాధిస్తున్న ఈ క్షేత్రము ఎంతో దర్శనీయంగా నున్నది.

## శ్రీ రామస్వామి దేవాలయము : డిచ్పల్లి.

ఈ దేవాలయము నిజామాబాద్ నుండి హైదరాబాద్ పోవు జాతీయ రహదారి 1కి॥మీ॥ దూరమున న్నది. ఇక్కడ రైల్వే స్టేషను కూడా కలదు.

ఈ దేవాలయము ఒక గుట్టపై శిల్ప కళా వైభవముతో శోభాయమానముగా ఉన్నది. ఇది చాలా పురాతనమైన దేవాలయము. ఇందు శ్రీ రామ, సీత, లక్ష్మణులు పాలరాతి విగ్రహములు కలవు. ఈ దేవాల యము పురావస్తు శాఖ వారి ఆధీనములో ప్రస్తుత మున్నది. నిత్యపూజలు జరుగురున్నవి. ఈ దేవా లయమునకు భూవసతి కలదు.





# అదిలాబాద్ జిల్లా

## శ్రీ జ్ఞాన సరస్వతీ దేవాలయము. బాసర

మనదేశమునందలి బాసరక్షేత్రము మిక్కిలివాసి కెక్కినదనుటకు, మన దేశమునలువైపులనుండి ఇచ్చటికి అరుదెంచు వేలాదిమంది యాత్రికులే నిదర్శనము. ఇది వ్యాస ప్రతిష్ఠమగుటచే "వ్యాసపురి" అయి రానురాను 'బాసర' అను పేరుతో ప్రఖ్యాతి చెందినది. ఇంతేకాక ఇచ్చట వ్యాప కుటీరమును దగ్గరలోనే వ్యాసతీర్థమను ఒక కోనేరు ఉండుటవలన ఈ క్షేత్రమెంతో ప్రసిద్ధిగాంచినది. ఇచ్చట స్థాపింపబడిన శ్రీ మహాలక్ష్మి, మహా సరస్వతి, మహాకాళీలను ముప్పురు శక్తులలో మహాసరస్వతీదేవికే విశేష ప్రాధాన్యము లభించినది.

ఈ క్షేత్రము పవిత్ర గోదావరీ మహానదికి సుమారు అర్థవై మైళ్ళ దూరమున నొక ఋష్యాశ్రమమున నెలకొనియున్నది. ఈ బాసరక్షేత్రమున ఆదిశక్తి శ్రీసరస్వతీదేవిగా ఆవిర్భవించినది. ఇట్టి సరస్వతి దేవాలయము మన దేశమున కాశ్మీరమునందు మాత్రమే కలదు.

ఈ క్షేత్రము హైదరాబాద్‌కు 119 కి॥మీ॥ దూరమున నున్నది. బాసర రైల్వే స్టేషనునుంచి రెండు కి.మీ. దూరమున నున్నది. మహారాష్ట్రలోని ధన్‌బాద్‌కు 10కి॥మీ॥ దూరములో నున్నది. అదిలాబాద్ నుంచి 145 కి॥మీ॥ దూరమున కలదు. గోదావరినదిపై బాసర వద్దగల వంతెన వలన సుమారు నూరు కి॥మీ॥ దూరము తగ్గినది. హైదరాబాద్ నుంచి సుమారు 7గం॥ ప్రయాణము చేయవలెను. (బస్సు)

మన ప్రాచీన సంస్కృతికాధార భూతములగు సమస్త వేదములను నాలుగు భాగములుగా విభజించి సువ్యవస్థితమొనరించిన సాక్షాన్నారాయణాంశ సంభూతుడగు శ్రీ వేదవ్యాసమహర్షి మనకు సర్వదా స్తవనీయుడు. ఉపనిషత్తుల విధి నిషేధములను, అష్టాదశ పురాణములను మహాభారత, భాగవతాది గ్రంధములను రచించి మనకు మహోపకారము చేసెను. మరియు వివిధావస్థలలో కొట్టుమిట్టాడు స్త్రీపురుషులను సన్మార్గమున ప్రవేశపెట్టుటకై ధర్మశాస్త్రము, రాజనీతి, మానవనీతి, అర్థశాస్త్రము మున్నగునవెన్నియో తెలిపెను. అయినను మనశ్శాంతి కలుగక చింతించి సమస్త తీర్థములను సేవించి, సకల ముని గణము వెంటరాగా ఉత్తరభారత తీర్థయాత్రలు పూర్తి చేసి దండకారణ్యము ప్రవేశించి అచ్చట కలిదోషా పహారిణియగు గౌతమీ నదిని సందర్శించి స్నాన సంధ్యానుష్ఠానములను

నిర్వర్తించుకొని దానికుత్తరమునగల కుమారచలమను పర్వతపంక్తిని అనేక వృక్షలతాదులచే విశేష ఫల పుష్ప భరితమై ఉండుటను వివిధ పక్షిగణముల కిలకిలా రావములతో వీనులవిందు గొలుపు ఆప్రదేశమును గాంచి తన మనము హర్షప్రపుల్లమగుటతో కొంత ఊరట చెందెను. మరియు నచ్చట శరణాగత, దీనార్థి జనభవ, భయ హారిణియగు పరమేశ్వరి అవ్యక్తరూప మున ఆవిర్భవించి యున్నదను పరమ రహస్యమును గ్రహించినవాడై అత్యంత ముగ్ధుడైపోయెను. అనంత రము ఆసమీపమునగల శ్రీ సరస్వతీ సరోవరము నందు స్నానము చేసి అనన్య భక్తిభావమున శ్రీ సరస్వతీ మాతను అనేక విధముల ప్రార్థించెను.

"హే! పరమదయామయీ! సచ్చిదానంద మయీ! అవ్యక్తిరూపిణీ! వాగీశ్వరీ! నీకునమస్కారము. నీవే యీ సమస్త స్థావర, జంగమాత్మక సృష్టి నుత్పత్తి చేసి పోషించి, లయము చేయుదానవు. హే! అనంత గుణరూపిణీ స్వప్రకాశరూపిణీ! పరబ్రహ్మమయీ! జననీ అచల, అప్రమేయ నిరాకార తత్త్వరూపిణీ' అని అనేక విధముల శ్రీ సరస్వతీ మాతను ప్రార్థించెను.

మహాపురుషుడు, తపోనిధియగు వ్యాసభగ వానుని ప్రార్థన మన్నించి శ్రీసరస్వతీ మాత అతనికి తనదర్శనము శీఘ్రముగా లభింపజేసెను. అంత వ్యాస మహర్షి ఆ దేవిననేక విధముల హర్షపులకితాంగుడై, స్తుతించి "హే! జననీ! అల్పబుద్ధులు సదాదుఃఖపీడి తులునగు సామాన్యజనులకు నీనిరాకార తత్త్వసాధన అత్యంత కష్టతరమైనది. కావున పరమ దయామయి వయిన నీవు సాకార రూపమును ధరించి సమస్త భక్తకోటికి సగుణోపాసనను గ్రహించమని ప్రార్థించెను.

అందుకు శ్రీసరస్వతీమాత పరిపూర్ణాను గ్రహముతో "వత్సా! నీవు ప్రతిదినము గౌతమీనదిలో స్నానముచేసి, మూడుపిడికిళ్ళ ఇసుకనుతెచ్చి మూడు చోట్ల విధివిధానముగా స్థాపన చేయుము. దానితో నేను సత్వరజ స్తమముల శ్రీమహాసరస్వతీ, శ్రీమహా లక్ష్మి, శ్రీమహాకాళీ రూపములతో వ్యాప్తినొందెదను. ఈ మూడు రూపములు నావే" యనిచెప్పి అంతర్ధాన మయ్యెను. శ్రీవేదవ్యాసులంత శ్రీ శారదామాత ఆదేశానుసారము ప్రతిదినము గౌతమీనదిలోస్నానము చేసి మూడు పిడికిళ్ళ ఇసుకను గొనివచ్చి ఇదే కౌమారాచల ప్రాంతమున మూడు స్థలములయందు యుంచుచువచ్చెను. క్రమేణ మూడు మూర్తులుగా మారి శ్రీమహాసరస్వతి, శ్రీమహాలక్ష్మి, శ్రీమహాకాళి రూపములతో ఆవిర్భ వించినది.

పిదప వ్యాస భగవానుడు ముఖ్యదేవతయగు సరస్వతిని అదిదేవతగాను ప్రత్యధి దేవతా స్వరూప ములుగా శ్రీమహాలక్ష్మి శ్రీమహాకాళీ మూర్తులను విధియుక్తముగా స్థాపన చేసెను. మరియు సమస్త ఋషిమండల సహితముగా ఈ క్షేత్రమున తపశ్చర్య గావించుకొనుచు ఇచ్చట కాలము గడిపెను. ఇట్లు వేదవ్యాసునిచే మూర్తి స్థాపనగావింపబడియున్నందున నీ పవిత్ర క్షేత్రమునకు వ్యాసపురియనియు శ్రీ సరస్వతీదేవీ మాతకు నివాసయోగ్యస్థలమైనందున వాసర యనియు అది కాలక్రమమున బాసరయని నామాంతరము కలిగి ఎంతో మహిమకల ఏకైక క్షేత్రముగ పరిఢవిల్లుచున్నది.

ఈ క్షేత్ర మహాత్మ్యము కూడా స్థలపురాణము వలన తెలియుచున్నది. ఒకప్పుడు, ఇక్ష్వాక మహా రాజు కనిష్ఠపుత్రుడైన దండకుడనెడివాడు శుక్రా చార్యుని జ్యేష్ఠపుత్రికయగు అరజ అనుకన్యను బలాత్కరించెను. ఆమె తన తండ్రియగు శుక్రాచార్యు లకు జరిగిన దంతయు విన్నవించెను. అందులకు శుక్రాచార్యులు క్రోధముతో దండకుని శపించెను. రాజ్యము నష్టమగుటయే కాక పచ్చని పైరు పంటల న్నియు నాశనమయి ఆప్రదేశము మహారణ్యముగా

మారిపోయినది. అప్పటినుండి ఈ స్థలమునకు 'దండకుడు' పరిపాలించి యున్నందున దండకారణ్యమని పేరువచ్చినది. ఇచ్చటికే శ్రీ వేదవ్యాసులవారు సకలముని బృంద సమేతుడై తీర్థయాత్ర నిమిత్తము వచ్చి పరమ శాంతి ప్రదాయిని అవ్యక్త రూపమగు శ్రీ సరస్వతీ మాతను ఆరాధించెను. అంతకు పూర్వము ఇంద్రుడు. సూర్యుడు, గణపతి, విష్ణువు, శంకరుడు మున్నగువారు ఇచ్చట తపస్సు చేయుటవలన ఈ ప్రదేశము పరమ పవిత్రమైనదని చెప్పబడినది. సమీపముననే గల పర్వతగుహయందు కుమారస్వామి తపమాచరించుటచే ఈ పర్వతమునకు కుమారాచల పర్వతమని పేరువచ్చినది. ఇచ్చట శ్రీసరస్వతీమాత ఆవిర్భవించి యుండుట వలన దేవికి కౌమారాచల నివాసి యని పేరువచ్చినది.

ఎంతో పవిత్రమైన ఈ క్షేత్రరాజము ఇచ్చట నెలకొనుట మన భక్తజన పుణ్యవిశేషమనవచ్చును. ఇట్టి మహాక్షేత్రము మన దౌర్భాగ్యవశమున మన సనాతన ధర్మ విధ్వంశకులైన ముష్కరులు ఈపరమ పవిత్రమైన వ్యాసనిర్మిత మందిరమును నష్టము గావించి శ్రీమహాలక్ష్మిమూర్తిని ఖండించిరి. పాపనాశేశ్వరీ మందిరములోని అన్నపూర్ణామూర్తిని భగ్నము గావించిరి. ఇంకనూ ఇచటి దేవాలయములను నాశనము చేసిరి అట్టి విపత్కర సమయమున వీరశైవ కులోత్పన్నుడగు శూరవీర "మక్కాజీ పటేలు" అను పురుషశ్రేష్ఠుడు ధైర్యసాహసములు కల కొందరు యువకులుతో కలిసి మ్లేచ్ఛుల నెదుర్కొనెను. తదుపరి, శ్రీమక్కాజీ పటేలు మరల శ్రీసరస్వతీ మందిరమును కట్టించి పునః ప్రతిష్ఠ శ్రీజగద్గురు శృంగేరీ పీఠాధిపతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ విద్యారణ్య భారతీ స్వాములవారిని ఆహ్వానించి, వారిచే నూతన శ్రీమహాలక్ష్మి విగ్రహము (జైపూరునుండి తెప్పించిరి) ముహూర్త సమయమునకు అందనందున వారు సరస్వతీ యంత్రము మీదనే శ్రీ సరస్వతీ విగ్రహమును స్థాపించి ప్రాకారము వెలుపలగల ఆలయమున మహాకాళీ యంత్రము మీద ఏకశిలా విగ్రహమును స్థాపించిరి. ఇచ్చట మక్కాజీ పటేలు విగ్రహముకూడా కలదు.

ఈ మందిరమునకు ఉత్తర దిశయందుగల గుట్టపై "నరహరిమాలుకా" గారి దేహసమాధి కలదు. ఎచ్చట వారివస్త్రములు పాదుకలు గలవు. వారి నాద సంప్రదాయ ప్రచారక గ్రంధము మరాఠీ భాషలో 'నవనాధ భక్తిసార్' యను పేరుతో ప్రసిద్ధిచెందినది.

మరియు ఇచ్చట చిత్రవిచిత్ర ధ్వనిచేయు ఒక పెద్ద శిల కలదు. వేదవతియని ఈశిలకుపేరు. ఈ శిలను దేనితోనైనా కొట్టినచో నాలుగు విధములైన ధ్వనులు వినబడుచుండును. ఈ శిల బాసరగ్రామము నుండి స్టేషనుకు పోవు మార్గమున ఎడమ ప్రక్కగా నున్నది.

ఇచ్చట ఇంకను దర్శించదగిన దత్తమందిరము, గణేశమందిరము, ఏకవీర మందిరము పాతాళేశ్వర మందిరము, ఆంజనేయ మందిరము గలవు.

ఇచ్చట శ్రీసరస్వతీ దేవాలయమునకు తూర్పున ప్రాకారాంతర్భాగమున ఔదుంబర వృక్షము క్రింద దత్తపాదుకలు కలవు. భక్తులు తమ అదృష్టము తెలిసికొనుటకు 'వల్లులు' పట్టుకొనుచుందురు. సంతాన ప్రాప్తికై ఇచ్చట గురుచరిత్ర పాఠము చేయించుకొనుచుందురు.

ఇంద్రేశ్వరము, సూర్యేశ్వరము, వాల్మీకేశ్వరము, నారాయణేశ్వరము గణేశేశ్వరము మున్నగు ఆలయ సముదాయములతో శ్రీ సరస్వతీదేవి ఆలయమొక కేంద్రముగా నేర్పడి ఇది మహాక్షేత్రముగా పరిఢవిల్లుచున్నది.

అంతేకాక, ఇక్కడ తీర్థమహాత్మ్యము ఎన్నదగినది. ఎనిమిది దిక్కులయందు ఎనిమిది తీర్థములు

కలవు. ఈ కారణముగా ఈ సరోవరమునకు అష్ట తీర్థసరోవరము అని సార్థక నామమేర్పడినది.

ఇంద్ర, సూర్య, వ్యాస, వాల్మీకి, విష్ణు, గణేశ, శివ తీర్థముల మధ్య శ్రీసరస్వతీ తీర్థముకలదు. పావన గంగాజలము అంతర్వాహినిగా వచ్చి ఈ సరోవరమున కలియుచున్నదని ప్రతీతి. బ్రహ్మాండపురాణాంతర్గత సరస్వతీ మహాత్మ్యముననీ విషయము చెప్పబడినది.

ఈ దేవస్థానపు అర్చకులు ఈఆలయ పూజకై అధికారమును పొందినవారు నాలుగు శాఖలవారు. మాధ్యందిన శాఖ, అశ్వలాయన శాఖ, కణ్వాశాఖ, ఆప స్తంభ శాఖ, వీరు తమ వంతుల ప్రకారము ఈ దేవాలయ పూజలను నిర్వహించుచున్నారు. ఈ అర్చకులు దేవికి ప్రతిదినము ఉదయము ఏడుగంటల లోపుగనే అభిషేకము అర్చన, అలంకారము, నైవే ద్యము మున్నగు పూజాకార్యక్రమములు జరిపించె దరు. మరియు సాయంకాలము ఏడుగంటల తరు వాత అర్చకులు మరల దేవిని శోడశోపచారములతో పూజలు చేసి భక్తులకు హారతి, తీర్థప్రసాదములు ఇచ్చెదరు. ఇట్లు ప్రతిదినము జరుగుచుండును. మిగి లిన సమయముల యందు భక్తజనులు దేవికి జరుపు అర్చనాదులను జరిపించెదరు.

ప్రతిసంవత్సరము విజయదశమికి గొప్ప ఉత్స వము జరుగును. నవమిరోజున గొప్పవైభవముతో నవచండీహవనమును, దేవికి అలంకారయుక్తముగా మహాపూజ జరుగును. విజయదశమి రోజున సుము హూర్తమునకు శ్రీజ్ఞాన సరస్వతీ దేవి యొక్క పల్లకి సేవ జరుగును.

మహాశివరాత్రినుండి మూడురోజులు ఇచ్చట గొప్ప జాతర జరుగును. వేలాదిమంది భక్తజనులు ఇచ్చట పవిత్ర గోదావరియందు స్నానమాడి శ్రీజ్ఞాన సరస్వతీ మాతను దర్శించి, సేవించి ధన్యులగు చున్నారు. ఈదేవి తన శరణాగత రక్షణ బిరుదమును సార్థకపరుచుకొనుచున్నది.

భక్తుల అనుభవములు తెలిసికొనుట గొప్ప అనుభవము. ఎందరో శ్రీదేవీకృపకు పాత్రులై భార్యా పుత్రులతో సుఖముగనున్నారు. ఇచట తమ పిల్లలకు అక్షరాభ్యాసములు, కేశఖండనలు, ఉపనయనములు, వివాహ శుభకార్యములు జరిపించుకొనుచున్నారు. విద్యాభివృద్ధికి, వ్యాప్తికి ఇచ్చట పిల్లలచే అక్షరాభ్యా సము జరిపించి దేవికి, పలక, బలపము, కాగితము, కలము సిరాబుడ్డి మున్నగునవి వెండివి లేక బంగార ముతో చేయించి సమర్పించుకొనుచున్నారు.

మరియు కొందరు భక్తులు దేవి అనుగ్రహ మాసించి, వాంచితార్థసిద్ధికై 40-21-11-7 దినములు దీక్షతో ఇచ్చటనే యుండి మధ్యాహ్న సమయమున గ్రామమునుండి భిక్షగైకొని దేవికి నమస్కరించి భుజించుచుందురు. ఇట్లు దేవి ఆజ్ఞకై వేచియుండి తదుపరి తృప్తులై వెడలుచున్నారు. అట్టి భక్త జనులు మనకిచట ఇరువది ముప్పది మందిమైన ఎల్లప్పుడు కనపడుచుందురు. దేవి వారికి సాధ్యమైనంతలో అనుజ్ఞ మొసగి సాగనంపుచున్నది. మరియు దేవి కొందరియెడ దర్శనమాత్రముననే దయతలచి వారి ఇష్టకార్యములను నెరవేర్చుచున్నది. ఇందుకుతార్కాణ ముగా ఎందరో భక్తుల అనుభవములు మనకు తెలియుచున్నవి. దేవిని మనస్సులో నిల్పుకొని విద్యా ర్థులు పరీక్షలలో నెగ్గుచున్నారు. నిరుద్యోగులు ఉద్యో గమును పొందుచున్నారు. ఉద్యోగులు ప్రగతి పథము నొందుచున్నారు. శ్రీజ్ఞాన సరస్వతీ దేవిని సేవించి పాఠకులు ఆమె కృపకు పాత్రులగుదురు గాక!

సర్వేజనా సుఖినోభవంతు



# 5 సం॥ల పోస్టాఫీస్
# రికరింగ్ డిపాజిట్ పథకం
# సుఖ సౌఖ్యాలకు సాధనం

## ము ఖ్యాం శా లు :

- సాలుకు 13.5% ఆకర్షణీయమైన వడ్డీ.
- కనీసం రూ. 10/-తో ఖాతా ప్రారంభించవచ్చును.
- నామినేషన్ సౌకర్యం.
- రక్షిత భీమా సౌకర్యం.
- వడ్డీపై ఆదాయపు పన్ను రాయితి.

## కొద్ది పెట్టుబడిపై అధిక రాబడి

| నెలసరి డిపాజిట్టు | పరిపక్వతకు చెల్లింపు |
|---|---|
| రూ॥ | రూ॥ |
| 100.00 | 8,564.00 |
| 500.00 | 42,820.00 |
| 2,000.00 | 1,71,280.00 |



## మీ భద్రతే మా లక్ష్యం






ఇతర వివరాలకు సంప్రదించండి :

కమీషనర్, చిన్న మొత్తాల పొదుపు సంస్థ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము,
అబిడ్స్, హైదరాబాదు - 500 001. ఫోన్ : 234412.